శ్రీః

(శ్రీ భరద్వాజమునికృతమ్)

# శ్రీశివకర్ణామృతస్తోత్రమ్

ఆస్వాదినీ వ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

**దోర్బల విశ్వనాథ శర్మ**



**ప్రకాశకులు**

**RAVI MOHAN RAO,** M.Sc., M.A. (Sanskrit)
Flat No. 404, Janajanam Complex, Opp. 1 Town Police Station,
CHIRALA - 523155
Cell :**94401 15411**



శ్రీః

**శ్రీశివకర్ణామృతస్తోత్రమ్** (శ్రీ భరద్వాజమునికృతమ్)

ఆస్వాదినీ వ్యాఖ్య

(ఆంధ్ర ప్రతిపదార్థ - తాత్పర్య - విపుల వివరణ)

**దోర్బల విశ్వనాథ శర్మ**

**ప్రథమ ముద్రణ : మహాశివరాత్రి 27-02-2014**

| | | |
|---|---|---|
| **ప్రతులు** | : | **500** |
| **పేజీలు** | : | **444** |
| **వెల రూ.** | : | **300/-** |



D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**

Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.

శ్రీః

శాంతి పాఠః

**ఓమ్ సహ నా వవతు। సహ నౌ భునక్తు। సహ వీర్యం కరవావహై। తేజస్వి నా వధీత మస్తు మా విద్విషావహై।**

**ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః॥**

**అర్థము :-** నౌ – గురు శిష్యులమగు మనలను, సహ అవతు – (అధ్యయన మొనర్పబడుచున్న ఈ మంత్రపాఠము) కలిపి రక్షించు గాక, నౌ – మనలనిద్దఱిని, సహ భునక్తు – కాపాడుగాక, వీర్యమ్ – (ఈ మంత్రములతో ఫలసిద్ధికై) ప్రయత్నమును, సహ కరవావహై – కలిసి కావింతుము, నౌ – మన ఇద్దఱియొక్క, అధీతమ్ – అధ్యయనము, తేజస్వి – ఫలసాధనసమర్థము, అస్తు – అగుకాక, మా విద్విషావహై – మనము పరస్పరము ద్వేషింపకుందుము గాక, ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

**వివరణ :-** మనము అధ్యయనమొనర్చుచున్న ఈ మంత్రములు గురుశిష్యులమైన మనలను రక్షించుగాక, ఈ మంత్రము ద్వారా సిద్ధించు ఫలితమును పొందుటకు మన మిద్దరము కలిసి ప్రయత్నింతుముగాక. మన ఈ మంత్రాధ్యయనము ఫలసాధన సమర్థమగుగాక. మనము పరస్పరము అనురాగముతో నుందుముగాక. ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములను త్రివిధ శాన్తులు మనకు కలుగుగాక. అధ్యయన ప్రారంభముగ గురుశిష్యులిద్దరు పఠింపవలసిన శాన్తి పాఠ మంత్రము ఇది.

**అభవు వలకన్ను రామకర్ణామృతంబు**
**హరుని దాకన్ను కృష్ణకర్ణామృతంబు**
**మృదుని కర్ణామృతం బిది నడిమికన్ను**
**కామజయ మిచ్చుఁగైవల్యసీమఁజేర్చు.**

శ్రీః





శ్రీః

ఓం గం ఓం గణపతయే నమః

**సువర్ణకలశము**

**శ్లో॥ శ్రీకృష్ణ రామ శ్రీకణ్ఠ కర్ణామృత కవిత్రయమ్।**
**లీలాశుకం శఙ్కరార్యమ్ భరద్వాజకవిం స్తుమః॥**

శ్రీ శివకర్ణామృత మాంధ్ర పద్యానువాదముతో ఁబ్రతిపదార్థ తాత్పర్యవిపుల వివరణలతోఁ బాఠకుల కరకమలముల నలంకరించుచున్నది. శ్రీ లీలాశుకమహాకవి రచించిన శ్రీకృష్ణ కర్ణామృతము, శ్రీ శంకరాచార్య విరచితముగాఁ బ్రసిద్ధి గాంచిన శ్రీరామకర్ణామృతము నాంధ్ర పద్యానువాదములతో నర్థతాత్పర్యములతో ననేక సంస్కరణము లొంది యింతకు ముందే ప్రసిద్ధి గాంచినది. శ్రీరామకృష్ణ కర్ణామృతములను గూర్చి సంగ్రహముగా శ్రీశివకర్ణామృతమును గూర్చి విపులముగాఁ దెలిసి కొందుము.

**శ్రీరామకర్ణామృతము**

శ్రీరామకర్ణామృత గ్రంథము శ్రీ శంకర భగవత్పాదాచార్య విరచిత మని చేకూరి సిద్ధయ్య కవి యిట్లు చెప్పినాఁడు.

**మ. శివసామ్యం దగు నాది శంకరులు మున్ శ్రీరామకర్ణామృతం**
**బవనిన్ సంస్కృత మేర్పరించె నది మోక్షాపేక్షఁజేకూరు వం**
**శ వరాబ్ధీందు ప్రసిద్ధ సిద్ధ కవి నే శ్రద్ధన్ దెనింగించి రా**
**ఘవ! పూదండఁగ నిచ్చినాఁడఁగొను మాకల్పంబుగా సత్కృపన్**

ప్రస్థాన త్రయమున కద్దముల వంటి యద్వైత భాష్యములను రచించిన శ్రీమదాది శంకరభగవత్పాదులు వివిధ దేవతలపై ననేక స్తోత్రములను రచించిరి. కాని శ్రీ శంకరాచార్య చరిత్రములను రచించిన పండితులెవ్వరును శ్రీరామకర్ణామృత కావ్యముగా నాది శంకర విరచితముగాఁ బేర్కొనలేదు. దీని కుపోద్బలకముగా నితరకావ్యముల యందలి శ్లోకములు కొన్ని శ్రీరామకర్ణామృతములోఁ గన్పట్టుచున్నవి.

**శ్లో॥ విహాయ కోదణ్డ శరౌ ముహూర్తం**
**గృహాణ పాణౌ మణి చారువేణుమ్।**
**మాయూరబర్హం చ నిజోత్తమాఙ్గే**
**సీతాపతే! త్వామ్ ప్రణమామి పశ్చాత్॥** (శ్రీరామ 1–89; శ్రీకృష్ణ 3–94)

శ్లో॥ రామో నామ బభూవ హుం. (శ్రీరామ 3–107; శ్రీకృష్ణ 2–72)

శ్లో॥ హే గోపాలక! హే కృపాజలనిధే.... (శ్రీరామ 4–32; శ్రీకృష్ణ 2–108)

ఈ శ్లోకములు శ్రీకృష్ణకర్ణామృతములోనివి. రెండవది ప్రతిబింబాత్మకము.

శ్లో॥ కల్యాణానాం నిధానం కలిమల దహనమ్... (శ్రీరామ 3-86)

ఈ శ్లోకము హనుమన్నాటకము లోని మంగళ శ్లోకము.

శ్లో॥ యః పృథ్వీభరవారణాయ...... (శ్రీరామ 3-73)

ఈ శ్లోక మధ్యాత్మరామాయణము లోని ప్రారంభశ్లోకము.

శ్లో॥ నగ్రస్త స్తమసా న చాప్మి మలినో.... (శ్రీరామ 4-99)

ఈ శ్లోకము వారణాసి ధర్మసూరి రచించిన సాహిత్యరత్నాకరము (2-10)లోనిది.

శ్లో॥ వన్దే రామ మనాది పూరుష మజం వన్దే రమానాయకమ్।

(శ్రీరామ 2-61...69) అను నెనిమిది శ్లోకములు 'వన్దే సదా రాఘవమ్' అను మకుటముతో నున్నవి. ఇవి -

శ్లో॥ వన్దే శమ్భుముమాపతిం సురగురుం వన్దే జగత్కారణమ్।

అను శివ శంకరాష్టక శ్లోకములకుఁ బ్రతిధ్వనులు.

శ్లో॥ ప్రాతః స్మరామి రఘునాథ ముఖారవిన్దమ్ (శ్రీరామ 4-68)

ఈ యైదును శ్రీరామ ప్రాతఃస్మరణ పంచరత్నస్తుతి శ్లోకములు.

శ్లో॥ వేదవేద్యే పరే పుంసి జాతే దశరథాత్మజే।

వేదః ప్రాచేతసౌ దాసీత్ సాక్షాద్రామాయణాత్మనా॥

శ్లో॥ రాశబ్దోచ్చార మాత్రేణ ముఖా న్నిర్యాన్తి పాతకాః।

పునః ప్రవేశ భీత్యా చ మకారస్తు కవాటవత్॥ (1-99, 101)

మొదలగు సాంప్రదాయక శ్లోకములు కూడ నిందుఁ జోటు చేసికొన్నవి. సనత్కుమార సంహిత యందలి 'రామస్తవరాజము' నుండియు, శ్రీ బుధ కౌశిక విరచితమయిన 'శ్రీరామ రక్షాస్తోత్రము' నుండియుఁ గొన్ని శ్లోకములు గ్రహింపఁబడినవి. ఇట్లీ గ్రంథకర్త పెక్కు శ్లోకములను స్వయముగా రచించియుఁ గొన్ని శ్లోకముల నితర గ్రంథముల నుండి స్వీకరించి నడుమ నడుమ జొనిపినాఁడు. ఈ హేతువులను బురస్కరించుకొని శ్రీపురాణం సూర్యనారాయణ తీర్థులు 'దీని నాది శంకరులు రచించి యుండలేదన్న సంగతిని గూర్చి యనేక నిదర్శనము లీ గ్రంథములోనే దొరకుచున్నవి. ఎవరేమి చెప్పినను సరియే కాని శ్రీ శంకరుల వారి కవితాశైలి నెఱిఁగినవారు మాత్ర మిది శ్రీవారి కవిత్వము కాదని యనక మాన' రని తీర్మానించినారు.

ఈ శ్రీరామకర్ణామృత కావ్య మాదిశంకరుల రచనము కాకపోయినను, వారి పిమ్మటఁబీఠముల నధిష్ఠించిన మఱియొక శంకరుల రచనము కావచ్చును. గ్రంథకర్త



లెవరైనను శ్రీరామకర్ణామృతము భక్తిరస ప్రబోధకమగు నుత్తమకావ్యము. ఇందు 4 ఆశ్వాసములు (102+111+114+110) మొత్తము 437 శ్లోకములు గలవు. ప్రతి శ్లోకమునందు రామాయణ ఘట్టములు మధుర మంజుల శైలిలో వర్ణింపఁబడినవి. శ్రీరామతత్త్వము, రామనామ మాహాత్మ్యము చక్కగాఁ బ్రతిపాదింపఁబడినవి.

శ్లో॥ శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయరత్నదీపమ్।
ఆజానుబాహు మరవిన్ద దళాయతాక్షం
రామమ్ నిశాచర వినాశకరమ్ నమామి॥ (శ్రీరామ 1-2)

శ్లో॥ మాతా రామో మత్పితా రామచన్ద్రో
భ్రాతా రామో మత్సఖా రాఘవేశః।
సర్వస్వం మే రామచన్ద్రో దయాళుః
నాన్యం దైవం నైవ జానే న జానే॥ (1-40)

శ్లో॥ శ్రీరామచన్ద్రః శ్రిత పారిజాతః
సమస్త కల్యాణ గుణాభిరామః।
సీతాముఖామ్భోరుహ చఞ్చరీకో
నిరన్తరం మఙ్గళ మాతనోతు॥ (3-105)

మొదలగు శ్లోకములు మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి.

శ్లో॥ వామే భూమిసుతా పురస్తు హనుమాన్ పశ్చాత్ సుమిత్రాసుతః
శత్రుఘ్నో భరతశ్చ పార్శ్వదళయో ర్వాయ్వాది కోణేష్వపి।
సుగ్రీవశ్చ విభీషణశ్చ యువరాట్ తారాసుతో జామ్బవాన్
మధ్యే నీల సరోజకోమల రుచిం రామం భజే శ్యామలమ్॥ (1-28)

శ్లో॥ వైదేహీ సహితం సురద్రుమతలే హైమే మహామణ్డపే
మధ్యే పుష్పకమాసనే మణిమయే వీరాసనే సంస్థితమ్।
అగ్రే వాచయతి ప్రభఞ్జనసుతే తత్త్వం మునిభ్యః పరం
వ్యాఖ్యాన్తం భరతాదిభిః పరివృతం రామమ్ భజే శ్యామలమ్॥ (1-29)

ఈ రెండు శ్లోకములు శ్రీరామ పట్టాభిషేక ఘట్టమును గన్నులకుఁ గట్టుటయే కాక శ్రీమద్రామాయణ పారాయణ శ్లోకములలోఁ బ్రధాన స్థానము నలంకరించుచున్నవి.

శ్లో॥ జానక్యాః కమలామలాఞ్జలిపుటే యాః పద్మరాగాయితా
న్యస్తా రాఘవ మస్తకే చ విలసత్కున్ద ప్రసూనాయితాః।

ప్రస్తాః శ్యామల కాయ కాన్తికలితా యా ఇన్ద్రనీలాయితా

ముక్తా స్తా శ్శుభదా భవన్తు భవతాం శ్రీరామవైవాహికాః॥ (1-82)

ఈ శ్లోకము కోటాన కోట్ల పెండ్లిండ్లు చేయించినది. చేయించుచున్నది. చేయింపనున్నది. ఇంతటి యదృష్టమే శ్లోకమునకుఁబట్టును? శ్రీరామ కర్ణామృతకర్త వశ్యవాక్కగు మహాతపస్వి యనుటకీ నిదర్శన మొక్కటి చాలును. ఈ శ్లోకము సాహిత్య కంటకోద్ధారములో నుదాహరింపబడినది. అథ కథం? 'శ్రీరామవైవాహికా' ఇతి ప్రయోగః ? అత్ర వివాహశబ్దాత్ ఠఞి ప్రత్యయే వృద్ధౌ సత్యాం 'టిడ్ఢాణఞ్' (4-1-15) ఇత్యాది సూత్రేణ ఙీపి 'వైవాహికీ' ఇతి స్యాత్। బహువచనే చ 'వైవాహిక్య' ఇతి భవితవ్యమ్। తత్ కథం వైవాహికా ఇతి ప్రయోగ ఇతి చేత్? సత్యమ్; టప్రమాద ఏవాయ మితి బహువః । అథవా వివాహశబ్దాత్ సమ్బన్ధార్థే అణి ఙీపి 'వైవాహీ' ఇతి రూపమ్। తతః స్వార్థే కని 'న సామి వచనే' (5-4-5) ఇతి ప్రతిషేధేన 'కేఽణః' (7-4-13) ఇతి సూత్రేణ ఈ కారస్య హ్రస్వే టాబన్తం రూపమ్, 'పుత్రికాః' 'కుమారికాః' ఇతివద్ 'వైవాహికాః' ఇతి కథఞ్చిత్ సాధనీయ మిత్యేకే।

ఈ శ్లోకమునే శ్రీనారాయణ తీర్థులు శ్రీకృష్ణలీలాతరంగిణిలో నిట్లునుకరించినాడు.

శ్లో॥ భైష్మ్యాః పాణి సరోరుహాఞ్జలిగతా రక్తాస్తు ముక్తాః స్థితా

యా ముక్తా గళితానురాగవిమలాః కృష్ణోత్తమాఙ్గాశ్రయాః।

యాతా స్తస్య యదూద్వహస్య పరమం సామ్యం విశుద్ధాత్మన

స్తాః కుర్వన్త్వభితశ్శుభాని సతతం శ్రీకృష్ణ వైవాహికాః॥ (12-48)

శ్రీరామకర్ణామృతమును శ్రీ చేకూరి సిద్ధకవి సుందరముగా నాంధ్రీకరించి నాఁడు. మచ్చున కొక పద్యము-

శ్లో॥ జానాతి రామ! తవ నామ రుచిం మహేశో

జానాతి గౌతమసతీ చరణ ప్రభావమ్।

జానాతి దోర్బల పరాక్రమ మీశ చాపో

జానాత్యమోఘపటు బాణగతిం పయోధిః॥ (శ్రీరామ 1-36)

ఉ. తావకనామ మంత్ర రుచి దక్షసుతారమణుం డెఱుంగు నీ

పావన పాదపంకజ ప్రభావ మహల్య యెఱుంగు మిక్కిలిన్

దేవర దోర్బలంబు శివదేవుని చాప మెఱుంగు నీదు మే

ధా విభవంబు గల్గు శరధాటి సముద్రుఁడెఱుంగు రాఘవా!

చేకూరి సిద్ధయ్య శ్రీరామకర్ణామృతమునే కాక 1. హరిభక్తామృతసారము



2.శ్రీరంగమాహాత్మ్యమునను కృతులను గూడ రచించినాఁడు. సిద్ధయ్యకవి, సాహిత్య కంటకోద్ధార కర్తకూడ. మిక్కిలి యర్వాచీనులు. 18వ శతాబ్దమునకుఁజెందినవారు. శ్రీ నారాయణతీర్థుల కాలము 17వ శతాబ్దము. కాఁబట్టి శ్రీరామకర్ణామృతము 17వ శతాబ్దమునకు ముందే రచింపఁబడి ప్రచారము గాంచిన ట్లూహింపవచ్చును.

శ్రీరామకర్ణామృతము శ్రీకృష్ణకర్ణామృతము కంటె నర్వాచీనమైనది.

**శ్రీకృష్ణకర్ణామృతము**

శ్రీకృష్ణకర్ణామృతమను కావ్యము శ్రీ లీలాశుకమహాకవిచే రచింపఁబడినది. లీలాశుకుని యసలు పేరు 'బిల్వ మంగళుఁడు'. వీరు స్మార్త బ్రాహ్మణులు. తల్లి నీలీదేవి. తండ్రి దామోదరుఁడు. 'తంత్రపద్ధతి' కర్తయైన యీశాన దేవుఁడు గురుఁడు. బిల్వమంగళుఁడు కృష్ణానదీ తీరమున నున్న 'శ్రీకాకుళ' గ్రామనివాసి యనియు, నది కావలియెద్దున నున్న 'రేపల్లె' లో విద్యావతియగు చింతామణి యను నొకవేశ్య యుండెడి దనియు వారిరువురు పరస్పరానురక్తులై యుండి రనియుఁ జింతామణి యుపదేశము వల్లనే సన్న్యసించి లీలాశుకనామముతోఁ బ్రసిద్ధి గాంచె ననియు నైతిహ్యము. లీలా శుకుఁడు కంచి, ముక్తిస్థలము, బృందావనము, జగన్నాథము మొదలగు పుణ్యక్షేత్రములు సేవించెను. 'మహాభక్తవిజయము' లో బిల్వమంగళుని కథ గలదు. శ్రీ వివేకానందస్వామి బిల్వమంగళుని గూర్చి యొక చక్కని వ్యాసమును రచించెను. లీలాశుక మహాముని సకలశాస్త్ర కోవిదుఁడు. బహుగ్రంథ కర్త, పరమభక్తుఁడు, అద్వైత వేదాంత నిష్ణాతుఁడు.

**లీలాశుకుని కృతులు :** 1. అభినవ కౌస్తుభమాల 2. దక్షిణామూర్తి స్తవము 3. అద్భుత స్తుతి 4. సరస్వతీ నక్షత్రమాల 5. నృసింహ నవరత్నస్తుతి 6. రామచంద్రాష్టకము 7. అనుభవాష్టకము 8. గణపతి స్తోత్రము 9. మహాకాలాష్టకము 10. కర్కోటకేశ్వర స్తోత్రము 11. కృష్ణవరదాష్టకము 12. దుర్గా స్తుతి 13. బాలకృష్ణ స్తోత్రము 14. బాలగోపాల స్తుతియను స్తోత్రములను, 15. బృందావన స్తోత్రము 16. గోవింద దామోదర స్తోత్రము 17. శ్రీకృష్ణ కర్ణామృతము నను స్తోత్రకావ్యములను 18. గోవిందాభిషేకమను ప్రాకృతకావ్యమును 19. కాలవధమను సంస్కృతకావ్యమును 20. పురుషకారము 21. కృష్ణలీలావినోదము 22. సుబంత సామ్రాజ్యము 23. తిఙంత సామ్రాజ్యము నను వ్యాకరణ గ్రంథములను 24. శంకర హృదయంగమ మను వేదాంత గ్రంథమును 25. భావనాముకురము 26. క్రమదీపిక యను భక్తి గ్రంథములను రచించినాఁడు. 'కృష్ణలీలావినోదము' భోజుని సరస్వతీ కంఠా భరణమునకు వ్యాఖ్యానము. 'పురుషకారము'

దేవ పండితకృతమైన 'దైవ' మను ధాతుకారికా గ్రంథమునకు వ్యాఖ్యానము. శంకరహృదయంగమము కేనోపనిషత్తునకు వ్యాఖ్యానము.

పురుషకారము వైయాకరణుల గోష్ఠిలో మిక్కిలి ప్రచారము గాంచిన గ్రంథము. ధాతువ్యాఖ్యాన విషయములోఁ బరమ ప్రామాణికము. పురుషకారములో క్షీరస్వామిని, భోజుని, హేమచంద్రుని లీలాశుకుఁడు పెక్కు మాఱు లుదాహరించినాఁడు. వీరు ముగ్వురు 11వ శతాబ్దమునకుఁ జెందినవారు. దేవరాజయజ్వ వేదనిఘంటు భాష్యములోఁ బురుషకారము నుదాహరించినాఁడు. మాధవాచార్యులు ధాతువృత్తిలోఁ బురుషకారము నుదాహరించినారు. దేవరాజ యజ్వకాలము 13వ శతాబ్దము. మాధవాచార్యుల కాలము 14వ శతాబ్దము. కాఁబట్టి లీలాశుకముని క్రీ॥శ॥ 1050-1150 మధ్యకాలములో జీవించెనని స్థూలముగా నిర్ణయింపవచ్చును.

లీలాశుకుని కృతి రత్నహారములో శ్రీకృష్ణకర్ణామృతము నాయకమణి వంటిది. ఇందు 3 అశ్వాసములు, మొత్తము 331 శ్లోకములు గలవు. శ్రీకృష్ణ లీలలు ముద్దులొలుకు పలుకులలోవర్ణింపఁ బడినవి. ప్రతి శ్లోకము శ్రీకృష్ణ పరమాత్ముని సాక్షాత్కరింపఁజేయును. ఈ కృష్ణకర్ణామృతమునకు 1. పాప యెల్లయసూరి 'సువర్ణ చషకము' 2. ఆవంచ రామచంద్ర బుదేంద్రుని 'భక్తి రసాయనము'. 3. గోపాలభట్టు 'కృష్ణవల్లభ' 4. చైతన్యదాసుని 'సుబోధిని' 5. బాలగోపాలయతి 'బోధామృతవార్తికము 6. కృష్ణదాసకవి 'సారంగరంగద' 7. బ్రహ్మదత్తుని 'సువర్ణపాత్రము 8. కృష్ణపండితుని 'ప్రప' 9. శ్రవణాహ్లాదిని మఱియు నజ్ఞాతకర్తృకములగు రెండు వ్యాఖ్యానములు గలవు.

క్షేమేంద్రుఁడు (క్రీ॥శ॥ 1000-1100) ఔచిత్యవిచార చర్చలో -'కృష్ణేనామ్బగతేన రన్తు మధునా' (శ్రీకృష్ణ 2-65) అను శ్లోకము నుదాహరించినాఁడు. వల్లభదేవుఁడు (15వ శతాబ్గము) సుభాషితావళిలో 'కస్తూరీ తిలకం' (2-109) కించిత్కుంచిత (2-63) కాళిన్దీ పులినోదరేషు (2-61) ఆనన్దేన యశోదయా (2-54) కృష్ణేనామ్బగతేన (2-65) మల్లైః శైలేన్ద్ర కల్పః (2-103) రాధామోహన మన్దిరమ్ (3-106) అఙ్గుళ్యా కః కవాటమ్ (3-105) అను శ్లోకముల నుదాహరించినాడు.

కన్నడ మహాకవి రుద్రభట్టు (12వ శతాబ్దము) 'జగన్నాథ విజయము' లో - శమ్భో స్వాగతమ్ (2-59) వనజజ బన్నిమిత్త (జ.వి.3-59), కృష్ణేనామ్బ గతేన (2-65) హరి నీం మణ్ణెందు తిన్నం (జ.వి.3-63), రామోనామ బభూవ హుం (2-72) కతెయం కేళిలె కంద హుం (జ.వి.3-61) అను కృష్ణ కర్ణామృత శ్లోకములను గన్నడీ కరించి నాఁడు.



పోతన మహాకవి (1370-1450) నారాయణ శతకములో - 'రాధా పునాతు' (శ్రీకృష్ణ 2-25) పెరుఁగుల్ ద్రచ్చుచు (నారాయణ -47), భాగవతములో - 'కాళిన్దీపులినోదరేషు' శ్రీకృష్ణ 2-61) చుం చెదుగుఁబాలు ద్రావుము (భాగ-10స్క-1 -419) అను కృష్ణ కర్ణామృత శ్లోకముల నాంధ్రీకరించినాఁడు.

వెలగపూఁడి వెంగన (16వ శతాబ్దము) శ్రీకృష్ణకర్ణామృతమును బోతనగారి భాగవత శైలిలో సర్వాంగసుందరముగాఁ దెనిఁగించినాఁడు.

శ్రీ నారాయణ తీర్థులు (17వ శతాబ్దము) శ్రీకృష్ణకర్ణామృతము నందలి 'తరుణారుణ కరుణామయ విపులాయత నయనమ్' (1-18) అను శ్లోకము ననుసరించి

**శరణం భవ కరుణాం మయి కురు దీనదయాళో!**
**కరుణారస వరుణాలయ కరిరాజ కృపాళో! (1-14)**

అను తరంగమును రచించినారు.

**శ్లో॥ కస్తూరీతిలకం లలాటఫలకే వక్షః స్థలే కౌస్తుభం**
**నాసాగ్రే నవమౌక్తికం కరతలే వేణుం కరే కఙ్కణమ్।**
**సర్వాఙ్గే హరిచన్దనఞ్చ కలయన్ కణ్ఠే చ ముక్తావళిం**
**గోపస్త్రీపరివేష్టితో విజయతే గోపాలచూడామణిః॥ (2-109)**

అను సుప్రసిద్ధ శ్లోకము శ్రీకృష్ణకర్ణామృతము లోనిది. అధికము నా 'లీలాశుకుని వాఙ్మయ జీవిత' మను వ్యాసములో ననుసంధేయము.

శ్రీకృష్ణకర్ణామృతవిశేషములను శ్రీశివకర్ణామృతముతోపాటు తుల నాత్మకముగాఁ బరిశీలింతుము.

## శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్

భారవి 'కిరాతార్జునీయము' నకు మాఘుని 'శిశుపాలవధము' వలె, మయూరుని 'సూర్యశతకము' నకు శ్రీకూర నారాయణపతి 'సుదర్శన శతకము' వలె, శ్రీకృష్ణ కర్ణామృతమునకుఁ బ్రతిగా రచింపఁబడిన స్తోత్రకావ్యము శ్రీశివకర్ణామృతము. శ్రీకృష్ణ కర్ణామృతములో 3 అశ్వాసములు 331 శ్లోకములు నుండఁగా శ్రీశివకర్ణామృతములో 3 అధ్యాయములు (102+102+164) 368 శ్లోకములు గలవు. మొదటిది కృష్ణ భక్తినిఁ బ్రబోధింపఁగా రెండవది శివభక్తిని బ్రతిపాదించుచున్నది. గ్రంథకర్త లిరువురు నద్వైతులు. భాషాభావములలో ఛందోఽలంకారములలో వర్ణనా కల్పనములలో

గ్రంథములు రెండు నొకదానితో నొకటి పోటీపడుచున్నవి. కృష్ణ - శివ కర్ణామృతములలో మొదటి రెండాశ్వాసములలో బింబ - ప్రతిబింబ శ్లోకములు మిక్కుటముగాఁ గలవు. మచ్చునకుఁ గొన్నింటిని బరికింతము.

**శ్లో॥ అపాఙ్గరేఖాభి రభఙ్గురాభి- రనఙ్గలేఖారసరఞ్జితాభిః॥**
**అనుక్షణం వల్లవ సున్దరీభి - రభ్యర్చ్యమానం విభుమాశ్రయామః॥**
(శ్రీకృష్ణ 1-10)

మన్మథలేఖారసరంజితములై యడ్డు లేని క్రీఁగంటి చూపులచే ననుక్షణము గొల్ల కన్నెలచే నర్చింపఁబడుచున్న విభు నాశ్రయించు చున్నాము.

**శ్లో॥ అనేకరూపాభిరచఞ్చలాభిః - సమాధినిష్ఠా సరసాన్తరాభిః॥**
**ప్రతిక్షణం సత్ప్రమదావళీభిః - ప్రపూజ్యమానం ప్రభుమాశ్రయేఽహమ్॥**
(శ్రీశివ 1-9)

చాంచల్యము లేక సమాధిలో నుండి యనేక రూపములతో నొప్పుచున్న ప్రమదలచేఁ బ్రతిక్షణము పూజింపఁబడుచున్న ప్రభు నాశ్రయించుచున్నాను.

**శ్లో॥ హే దేవ! హే దయిత! హే జగదేక బన్ధో!**
**హే కృష్ణ! హే చపల! హే కరుణైకసిన్ధో!** (శ్రీకృష్ణ 1-40)

**శ్లో॥ హే రుద్ర! హే మహిత! హే పరమేశ! శమ్భో!**
**హే శర్వ! హే గిరీశ! హే శివ! హే స్వయమ్భో!** (శ్రీశివ 1-39)

**శ్లో॥ హే గోపాలక! హే కృపా జలనిధే! హే సిన్ధుకన్యాపతే॥**
**హే కంసాన్తక! హే గజేన్ద్రకరుణాపారీణ! హే మాధవ!** (క.2-108)

**శ్లో॥ హే శమ్భో! శివ! హే మహేశ్వర విభో! వారాణసీశ ప్రభో!**
**హే మృత్యుఞ్జయ! హే హిమాద్రితనయా ప్రాణేశ! హే శఙ్కర!**(శ్రీశివ 1-41)

**శ్లో॥ శైవా వయం న ఖలు తత్ర విచారణీయమ్**
**పఞ్చాక్షరీ జపపరా నితరాం తథాపి॥**
**చేతో మదీయ మతసీ కుసుమావభాసం**
**స్మేరాననం స్మరతి గోపవధూ కిశోరమ్॥** (శ్రీకృష్ణ 2-24)

మేము శైవులము. కొంచెము కూడ సందియపడ నక్కఱలేదు. ఎల్లప్పుడును శివపంచాక్షరిని జపించుచున్నాము. అయినను నామనస్సు బాలగోపాలునే స్మరించుచున్నది.





**శ్లో॥ శైవం మతం మమ తు వైష్ణవమప్యభీష్టం**
**సర్వేషు దైవతపదేషు సమానబుద్ధేః॥**
**సత్యం తథాపి కరుణా మృదు శఙ్కరస్య**
**సర్వేశ్వరస్య పద మేతి సదా మనో మే॥** (శ్రీశివ 2-27)

సకల దేవతల యందు సమాన బుద్ధిగల నాకు శైవమతము వైష్ణవమతము రెండును మిక్కిలి యిష్టములే. అయినను నా మనస్సు సర్వేశ్వరుఁడగు శంకరుని పదముల యొద్ద కేఁగుచున్నది.

**శ్లో॥ రాధా పునాతు జగదచ్యుత దత్త చిత్తా**
**మన్థాన మాకలయతీ దధిరిక్తపాత్రే॥**
**తస్యాః స్తనస్తబక చఞ్చల లోల దృష్టి-**
**ర్దేవోఽపి దోహనధియా వృషభం నిరున్ధన్॥** (శ్రీకృష్ణ 2-25)

శ్రీకృష్ణున కర్పించిన చిత్తముతోఁ బరధ్యానములో నున్న రాధ పెరుగుఁలేని రిత్త కడవలోఁ జిలుకుచున్నది. రాధాదేవి చనుగుత్తులపైఁ జూపులున్న శ్రీకృష్ణుఁడు పాలు పిదుకుటకై యాఁబోతును గట్టుచున్నాఁడు. వారిద్దఱు జగమును గాపాడుదురు గాక!

**శ్లో॥ గౌరీ కరోతు శుభమీశ విలోలదృష్టి**
**మధ్యే దధ త్యతుల కాఞ్చన కణ్ఠమాలామ్॥**
**తద్భ్రగసా ననుభవన్ ప్రణమన్తమిన్ద్రం**
**కిం క్షేమమమ్బుజభవేతి వదన్ శివోఽపి॥** (శ్రీశివ 2-24)

శివునిపైఁ గీలింపఁబడిన చూపులు గల పార్వతి కంఠమాలను నడుముపై ధరించుచున్నది. ఆమె చూపుల యందలి రసము ననుభవించుచున్న శివుఁడు నమస్కరించుచున్న యింద్రుని గాంచి 'బ్రహ్మ!కుశలమా?'యని యడుగుచున్నాఁడు. వారిద్దఱు శుభము గల్గఁజేయుదురు గాక!

**శ్లో॥ మా యాత పాన్థాః! పథి భీమరథ్యా**
**దిగమ్బరః కోఽపి తమాలనీలః॥**
**విన్యస్త హస్తోఽపి నితమ్బబిమ్బే**
**ధూర్తస్సమాకర్షతి చిత్త విత్తమ్॥** (శ్రీకృష్ణ 2-34)

ఓ బాటసారులారా! భీమరథీనది యొద్దున మార్గములోఁ బయనింపకుఁడు. అక్కడ నల్లనివాఁడు దిస్సమొలపైఁజేతుల నుంచుకొన్న యొకానొక ధూర్తుఁడు మనస్సును డబ్బును గొల్లగొట్టుచున్నాఁడు.

**శ్లో॥ న యాత హే తీర్థచరాః కదాచిత్**
**తపోవనం దుర్గమ మర్జునస్య।**
**మాయాకిరాతః ఖలు తత్ర కశ్చిత్**
**దృష్ట స్తనుచ్ఛేదమరం కరోతి॥** (శ్రీశివ 2-33)

ఓ తైర్థికులారా! అర్జునుఁడు తపస్సు చేసిన వనమున కెప్పుడు నేఁగకుఁడు అక్కడ నొకానొక మాయాకిరాతుఁడు కనఁబడినంతనేయంగచ్ఛేదము చేయుచున్నాఁడు.

**శ్లో॥ కరారవిన్దేన పదారవిన్దం**
**ముఖారవిన్దే వినివేశయన్తమ్।**
**వటస్య పత్రస్య పుటే శయానం**
**బాలం ముకున్దం మనసా స్మరామి॥** (శ్రీకృష్ణ 2-58)

పద్మము వంటి చేతితోఁ బద్మము వంటి పాదమును బద్మము వంటి ముఖముపై నుంచుకొని మఱ్ఱియాకుపై నిద్రించుచున్న బాల గోపాలుని స్మరించుచున్నాను.

**శ్లో॥ హస్తద్వయే నాంఘ్రి తల ద్వయం స్వ**
**మూరుద్వయే సమ్పరియోజయన్తమ్।**
**పద్మాసనే రూఢతరం జపన్తం**
**మునిం మహేశం ముహురాశ్రయేఽహమ్॥** (శ్రీశివ 2-98)

రెండు చేతులతో రెండు పాదములను రెండు తొడలపై నుంచుకొని పద్మాసనములో నుండి జపము చేయుచున్న మహేశ్వరు నాశ్రయించుచున్నాను.

**శ్లో॥ సన్ధ్యావన్దన! భద్రమస్తు భవతే భోః స్నాన! తుభ్యం నమో**
**భో దేవాః! పితరశ్చ! తర్పణ విధౌ నాహం క్షమః క్షమ్యతామ్।**
**యత్ర క్వాపి నిషీద్య యాదవకులోత్తంసస్య కంసద్విషః**
**స్మారం స్మార మఘం హరామి తదల మ్మన్యే కి మన్యేన? మే॥** (కృ 2-107)

సంధ్యా వందనమా! నీకు శుభమగుఁగాక! స్నానమా! నీకు నమస్కారము. దేవతలారా! పితృదేవతలారా! మీకుఁ దర్పణములు చేయుట యందు నేను సమర్థుఁడను గాను క్షమింపుఁడు! ఎక్కడనో యొక్కచోటఁ గూర్చుండి శ్రీకృష్ణుని మాటిమాటికి స్మరించుచుఁబాపములను బాపుకొనుచున్నాను. ఆ ధ్యానమే చాలు నని తలంచుచున్నాను. తక్కిన వానితో నాకేమి పని?

**శ్లో॥ ఏకం వన్దన మస్తు తే పర మితో హే నిత్యకర్మాధునా**
**హే నైమిత్తిక కర్మతోఽపి చ తథా తీర్థాన్యయే వో నమః।**



**క్షేమం వో గృహదేవతా భవదభిప్రాయానుసారోఽస్తు మా**
**వారం వార మహం కరోమి చ నుతిం శమ్భో రశమ్భోః కుతః?** (శ్రీశివ 3-2)

ఓ నిత్యకర్మమా! నీ కొక వందనము. నైమిత్తిక కర్మమా! నీకును వందనము. తీర్థములారా! నమస్కారము. గృహదేవతలారా! మీకు క్షేమ మగుఁగాక! మీకు నచ్చినను నచ్చకున్నను మాటిమాటికి నేను శివునే స్తుతించుచున్నాను. శివేతర దేవతలెందులకు?

ఈ రెండు శ్లోకములకు నీ క్రింది భర్తృహరి సుభాషిత శ్లోకము మూలము.

**శ్లో॥ మాత ర్మేదిని! తాత మారుత! సఖే తేజః! సుబన్ధో జల!**
**భ్రాత ర్వ్యోమ! నిబద్ధ ఏష భవతా మన్త్యః ప్రణామాఞ్జలిః।**
**యుష్మత్సఙ్గ వశోపజాత సుకృత స్ఫార స్ఫుర న్నిర్మల**
**జ్ఞానాపాస్త సమస్తమోహ మహిమా లీయే పరబ్రహ్మణి॥** (సు.త్రి. 3-100)

తల్లీ భూమీ! తండ్రీ వాయూ! మిత్రమా తేజమా! చుట్టమా జలమా! సోదరా గగనా! మీకుఁజివరఁగాఁ బ్రణమాంజలి నర్పించుచున్నాను. మీ యొక్క సంగముచేఁ గల్గిన పుణ్యముచే స్ఫురించుచున్న జ్ఞానముచే వీడిన మోహము గలవాఁడనై పరబ్రహ్మములో లీన మగుచున్నాను.

**శ్రీకృష్ణకర్ణామృతములో-**

**శ్లో॥ అఙ్గనా మఙ్గనా మన్తరే మాధవో - మాధవం మాధవం చాన్తరేణాఙ్గనా।**
**ఇత్థమాకల్పితే మణ్డలే మధ్యగః - సఞ్జగౌ వేణునా దేవకీనన్దనః॥**
(శ్రీకృష్ణ 2-35...42)

అని స్రగ్విణీఛందములో 8 శ్లోకములలో శ్రీకృష్ణుని రాసక్రీడ వర్ణింపఁబడినది.
శ్రీ శివకర్ణామృతములో గూడ-

**శ్లో॥ తాపసాం స్తాపసా నన్తరే దేవతా**
**దేవతా దేవతా శ్చాన్తరా తాపసాః।**
**ఏవ మాదృత్య వాగీశ్వరాది స్థితౌ**
**సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥** (శ్రీశివ 2-37...49)

అని స్రగ్విణీ ఛందములోనే 13 శ్లోకములలో శ్రీశివనర్తనము వర్ణింపఁబడినది.

**శ్లో॥ విక్రేతు కామా కిల గోపకన్యా**
**మురారి పాదార్పిత చిత్త వృత్తిః।**
**దధ్యాదికం మోహవశా దవోచద్**
**గోవిన్ద! దామోదర! మాధవేతి॥** (శ్రీకృష్ణ 2-56)

వ్రేపల్లె యందలి గొల్లపడుచు కూడ శ్రీకృష్ణ పాదధ్యాన మోహముతో 'గోవిందా! దామోదరా! మాధవా!' యని కేకలు వేయుచుఁ బాలు పెరుఁగు వెన్న మజ్జిగ మొదలగు వాని నమ్ముచున్న దఁట! బిల్వ మంగళుఁ డిదే మకుటముతో 71 శ్లోకములలో గోవింద దామోదర స్తోత్రమును రచించినాఁడు.

శ్రీ శివకర్ణామృత కర్త కూడ-

**శ్లో॥ ప్రాణ ప్రయాణే పతతాదనన్త**
**సంసార తాపాన్తమహహౌషధం తత్।**
**నామామృతం మద్రసనాగ్రదేశే**
**శమ్భో మహేశ్వర శఙ్కరేతి॥** (శ్రీశివ 2-59...66)

అని 'శంభో మహేశ్వర శంకరేతి' మకుటముతో నష్టకమును రచించినాఁడు.

**ఛందస్సులు**

శ్రీకృష్ణకర్ణామృత కర్త యే భావములో నే ఛందస్సును గైకొనినాఁడో శ్రీశివకర్ణామృత కర్తకూడ నదే భావములో నా ఛందస్సునే గైకొనినాఁడు. కొన్నింటిని బరికింపుఁడు.

**శ్లో॥ పల్లవారుణ పాణి పఙ్కజ సఙ్గి వేణురవాకులమ్** (శ్రీకృష్ణ 1-9)

**శ్లో॥ భవ్య చన్ద్ర కృశాను భాస్కరలోచనం భవమోచనమ్** (శ్రీశివ 1-8)

ఇవి మత్తకోకిలలు ప్రతి పాదమునందు 'ర-స-జ-జ-భ-ర' యను గణము లుండును.

**శ్లో॥ నిఖిల భువన లక్ష్మీ నిత్య లీలాస్పదాభ్యామ్।**

**శ్లో॥ ప్రణయ పరిణతాభ్యాం ప్రాభవాలమ్బనాభ్యామ్** (శ్రీకృష్ణ 1-12,13)

**శ్లో॥ సరసిజభవముఖ్యైః సాదరం పూజితాభ్యామ్।**

**శ్లో॥ విపులతర విభాభ్యాం విశ్రుతప్రాభవాభ్యామ్।** (శ్రీశివ 1-11,12)

ఇవి మాలినీ వృత్తములు, ప్రతి పాదమునందు 'న-న-మ- య-య'యను గణములుండును.

**శ్లో॥ తరుణారుణ కరుణామయ విపులాయత నయనమ్..** (శ్రీకృష్ణ 1-18)

**శ్లో॥ శరణాగత భరణాతర కరుణాకర హృదయమ్** (శ్రీశివః 1-17)

ఇవి సురభి వృత్తములు. ప్రతి పాదము నందు 'స-న-జ-న-భ-స' యను గణములుండును.

**శ్లో॥ కలక్వణితకఙ్కణం కరనిరుద్ధ పీతామ్బరమ్** (శ్రీకృష్ణ 1-20)

**శ్లో॥ పద ప్రచురకిఙ్కిణీ కిణి కిణి ధ్వని భ్రాజితమ్** (శ్రీశివ 1-19)



ఇవి పృథ్వీ వృత్తములు. ప్రతి పాదమునందు 'జ-స-జ-స-య-లగ' యను గణములుండును.

**శ్లో॥ దేవకీ తనయ పూజన పూతః - పూతనారి చరణోదక ధౌతః।**
**యద్యహం స్మృత ధనఞ్జయసూతః - కిం కరిష్యతి? స మే యమదూతః॥**
(శ్రీకృష్ణ 2-29)

**శ్లో॥ మూర్ధ రాజిత తరైన్దవ ఖణ్డో - మర్దితాతత ఘనాహిత షణ్డః।**
**దైవతం హి యమశాసన చణ్డః - శఙ్కరో మమ కుతో యమ దణ్డః॥**
(శ్రీశివ 2-29)

ఇవి స్వాగత వృత్తములు ప్రతి పాదమునందు 'ర-స-భ-గగ' యను గణము లుండును. ఈ రెండు శ్లోకములు నంత్యానుప్రాస విలాస భాసురములు.

**శ్లో॥ కిమివ శృణుమః కస్య బ్రూమః కథం కృత మాశయా** (శ్రీకృష్ణ 1-42)

**శ్లో॥ కిమిద ముదితం వారం వారం త్రిలోక ధురన్దరమ్** (శ్రీశివ 1-40)

ఇవి హరిణీ వృత్తములు ప్రతి పాదమునందు 'న-స-మ-ర-స-లగ' యను గణములుండును.

**శ్లో॥ అహిమకర కర నికర మృదు మృదిత లక్ష్మీ**

**శ్లో॥ కరకమల దరదలిత లలితతర వంశీ**

**శ్లో॥ కుసుమశర శర సమర కుపిత మదగోపీ** (శ్రీకృష్ణ 1-51...53)

**శ్లో॥ శశి మకుట తటి దరుణ జటముఖ కృపీట**

**శ్లో॥ రుచిరకరని చయ మృగమద రచన గౌరీ**

**శ్లో॥ అదర దరకర విసర పురహరణ కేళీ** (శ్రీశివ 1-52...54)

ఇవి పాలాశ దళ వృత్తములు. ప్రతి పాదమునందు 'న-న-న-న-న-గ-గ' యను గణములుండును.

**శ్లో॥ చికురం బహుళం విరళం భ్రమరమ్** (శ్రీకృష్ణ 1-61)

**శ్లో॥ చరణం శరణం భరణం కరణమ్** (శ్రీశివ 1-75)

ఇవి తోటక వృత్తములు. ప్రతి పాదమునందు 'స-స-స-స' యను గణము లుండును.

**శ్లో॥ తేజసేఽస్తు నమో ధేనుపాలినే లోకపాలినే।**
**రాధాపయోధరోత్సఙ్గశాయినే శేషశాయినే॥** (శ్రీకృష్ణ 1-75)

**శ్లో॥ నమః పరమకల్యాణదాయినే హతమాయినే।**
**హిమాచలతనూజాతా రాగిణేఽతివిరాగిణే॥** (శ్రీశివ 1-96)

ఇవి యనుష్టుప్ - శ్లోకములు.

**శ్లో॥ జిహానం జిహానం సుజానేన మౌగ్ధ్యమ్** (శ్రీకృష్ణ 3-68)

**శ్లో॥ నమస్తే నమస్తే మహాదేవ శమ్భో** (శ్రీశివ 1-101)

ఇవి భుజంగ ప్రయాతములు. ప్రతి పాదమునందు 'య-య-య-య' యను గణములుండును.

**శ్లో॥ కేకి కేకా ధృతానేక పఙ్కే రుహా...** (శ్రీకృష్ణ 2-36)

**శ్లో॥ కుమ్భి కుమ్భాహిత స్తమ్భ సమ్భావిత...** (శ్రీశివ 2-38)

ఇవి స్రగ్విణీ వృత్తములు. ప్రతి పాదమునందు 'ర-ర-ర-ర' యను గణము లుండును.

**శ్లో॥ దేవః పాయాత్ పయసి విమలే యామునే మజ్జతీనామ్** (శ్రీకృష్ణ 2-3)

**శ్లో॥ స్వోద్వాహార్థం దృఢ మతిజలే శీతలే కణ్ఠ దఘ్నే** (శ్రీశివ 2-3)

ఇవి మందాక్రాంతములు. ప్రతి పాదమునందు 'మ-భ-న-త-త-గగ' యను గణములుండును.

కృష్ణకర్ణామృత కర్త వలెనే శివకర్ణామృత కర్త కూడఁ గొన్ని శ్లోకములలో యతి - ప్రాసములను వాడినాఁడు. ఇట్లే తక్కిన ఛందో విశేషములు నెఱుఁగవలయును.

**శబ్దాలంకారములు**

**శ్లో॥ అస్తి స్వస్త్యయనం సమస్త జగతా మభ్యస్త లక్ష్మీస్తనం**
**వస్తు ధ్వస్తరజస్తమోభి రనిశం న్యస్తం పురస్తాదివ।**
**హస్తోదస్త గిరీన్ద్రమస్తక తరు ప్రస్తార విస్తారిత**
**స్రస్తస్వస్తరు సూన సంస్తర లసత్ప్రస్తావి రాధాస్తుతమ్॥** (శ్రీకృష్ణ 3-1)

**శ్లో॥ శ్రీమన్తం స్వనితాన్తకాన్త పదకఞ్జస్వాన్త చిన్తామణిం**
**శాన్తం నాన్తర మన్తకాన్తక మతి క్రాన్తప్రియం సన్తతమ్।**
**సన్తం భాన్త మనన్తకున్తల సువిభ్రాన్తం మహాన్తం శివం**
**దాన్తం కన్తురిపుం తమన్తరహితం స్వర్దన్తికాన్తిం స్తుమః॥** (శ్రీశివ3-1)

ఇట్టి వృత్త్యనుప్రాసములు గల శ్లోకములు కృష్ణ - శివ కర్ణామృతములలో సమానముగాఁ గలవు.

**శ్లో॥ మురళి నినదలోలం ముగ్ధ మాయూర చూళమ్** (శ్రీకృష్ణ 2-89)

**శ్లో॥ సరసగుణ నికాయం సచ్చిదానన్ద కాయమ్** (శ్రీకృష్ణ 2-90)

**శ్లో॥ విహితరజత శైలం వేదజాలైకమూలమ్** (శ్రీశివ 2-14)





**శ్లో॥ పురజయ ఘనయోధం పూరితానన్ద బోధమ్** (శ్రీశివ 2-15)

ఇట్టి యంత్యానుప్రాసములు గల శ్లోకములు రెండు కర్ణామృతములందును సమానము. శ్రీకృష్ణ కర్ణామృత శ్లోకములోని 'గోపాలరాయమ్' (2-90) అను శబ్దప్రయోగమే లీలాశుకుని యాంధ్రత్వమును వేనోళ్ల వెల్లడించుచున్నది. కృష్ణకర్ణామృత కర్త మూఁడవ యాశ్వాసములో నాలుగై దర్థాలంకారములను వాడినాఁడు. శివకర్ణామృత కర్త మూఁడవ యధ్యాయమును బూర్తిగా నలంకారములతో నింపినాఁడు. శ్రీకృష్ణ కర్ణామృతముపై స్పర్ధతో శ్రీశివకర్ణామృతమును రచించి యీ గ్రంథకర్త పూర్తిగాఁ గృతకృత్యుఁడైనాడు.

**శ్రీశివకర్ణామృతస్తోత్రమ్ - తృతీయాధ్యాయము**

ఇంక నీ శివకర్ణామృతము నందలి మూఁడవ యధ్యాయము పూర్తిగా విలక్షణమైనది. అలంకారశాస్త్రమునకు లక్ష్యముగా రచింపఁబడినది. అలంకారములు (1) శబ్దాలంకారము (2) అర్థాలంకారము (3) ఉభయాలంకారములు నని మూడు విధములు. వృత్త్యనుప్రాసము, అంత్యానుప్రాసము, యమకము మొదలగునవి శబ్దాలంకారములు. ఉపమ, రూపకము మొదలగునవి యర్థాలంకారములు. రెండును కలిసినచో నుభయాలంకారములు, బంధ - గర్భ - చిత్ర కవిత్వములు శబ్దాలంకారములలో నంతర్భవించును.

**బంధ కవిత్వము**

శ్రీశివకర్ణామృతములో 1. అష్టదళపద్మబంధము 2. షోడశదళపద్మబంధము 3. చక్రబంధము 4. నాగబంధము 5. ఖడ్గబంధము 6. ధనుర్బంధము 7. హలబంధము 8. గుచ్ఛబంధము 9. గోమూత్రికాబంధము 9. ఛురికాబంధము 11. ఛత్రబంధము 12. సర్వతోభద్రబంధము మొదలగు బంధములు గలవు. ఈ బంధముల స్వరూపము తెలిసికొని యర్థము చేసికొనుటయే మిక్కిలి కష్ట మన్నచో వీనిని రచించుట కష్టాతికష్టమని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. ఆ కవిత్వము నందలి సొగసులు చిత్రములు చిత్రములతోఁ గలిపి చూచినఁ గాని సులువుగాఁ దెలియవు. గ్రంథకర్తృత్వ చర్చలోఁ జక్రబంధము నుదాహరించుచున్నాను.

**చిత్ర కవిత్వము**

1. 1.నిష్కంఠ్యము 2. నిస్తాలవ్యము 3. నిరోష్ఠ్యము 4. నిర్మూర్ధన్యము 5. నిర్దంత్యము నిందుఁ గలవు.

నిరోష్ఠ్య శ్లోకమును జూడుఁడు–

**శ్లో॥ ఇన్దు చన్దన కున్ద సున్దర గాత్ర! గోత్రసుతారతే!**
**నన్ద నన్దన నన్దితాధిక జైత్రయాత్ర! హృతక్రతో॥**
**కన్ద నిన్దక కాన్తికన్ధర! కాలకాలదయానిధే!**
**చన్ద్రశేఖర! శఙ్కరాలఘు శం కురు! శ్రిత సన్తతేః॥** (శ్రీశివ 3–24)

"ఉ–ఊ–ఒ–ఓ–ప–ఫ–బ–భ–మ–వ" యను వర్ణము లోష్ఠ్యములు. అనఁగా వీని నుచ్చరించునపుడు పెదవులు కదలును. కాఁబట్టి పై శ్లోకములో నీ యక్షరము లుండవు. కొందఱు కవులిట్టి చిత్రశ్లోకములలో హల్లుల నియమములనే పాటించినారు కాని యచ్చుల నియమమును బాటింపలేదు. అందువల్లనే మల్లినాథ మహోపాధ్యాయుఁడు "ఇచు యశానాం తా ల్వితి ఇవర్ణస్య తాలుత్వేఽపి వ్యంజనాపేక్ష ఏ వాయం నియమ ఇతి న దోషః" (శిశు –19–110) అని మాఘసర్వంకషలోఁజెప్పినాడు. కాఁబట్టి "ఇందు – కుంద – సుందర – గోత్ర" మొదలగు శబ్దములలో ఉ–ఓ లుండుట దోషము గాదని తెలియవలయును.

2. 1. ఏకాక్షరి 2. ఏకాక్షరపాదము 3. ద్వ్యక్షరి యిందుఁగలవు. ఏకాక్షర పాదమనఁగా శ్లోకములోఁ బ్రతి పాదమునందు నొక హల్లుమాత్రమే వాడఁబడును.

**శ్లో॥ గోగ గోగాఙ్గ గోగాఙ్గ మాముమా మీమమా మమా॥**
**హే హం హే హే హహా హాహా విహోవావా వివా వవ॥** (శ్రీశివ 3–34)

3. సగూఢ పాదశ్లోకము లిందు నాల్గు గలవు. గూఢపాదములనఁగా శ్లోకములోని యొక పాదము నందలి యక్షరములు తక్కిన మూఁడు పాదములలో గూఢముగా నుండును.

**శ్లో॥ శశి భాస్కర వహ్న్యక్షం – యాజకామిత సమ్మదమ్॥**
**సహేల మశ్వస న్మారం – భావయామి మహేశ్వరమ్॥** (శ్రీశివ 3–40)

ఈ శ్లోకములో నాల్గవపాదము నందలి 8 అక్షరములు 1,2,3 పాదములలో నిగూఢముగా నున్నవి.

4.1. నామగోపనము 2. కర్తృగోపనము 3. కర్మగోపనము 4. క్రియాగోపనము గల శ్లోకము లిందుఁ గలవు. కృతి కర్త పేరు గాని కృతి భర్త పేరు గాని యిష్టదేవత పేరు గాని గూఢముగా నుండుట నామగోపనము.

**శ్లో॥ సమస్త జగదాధార – దానరక్షా ధురన్ధర**
**శిరః స్థ చన్ద్ర మాం పాహి – వహ్నీందు రవిలోచన॥** (శ్రీశివ 3–4)



ఈ శ్లోకము నందలి నాల్గుపాదములలోని మొదటి యక్షరములు గలిపినచో 'సదాశివ' యను పేరు గోప్యముగాఁ గలదు. చక్రబంధములోఁ బ్రాయికముగా నామగోపన ముండి తీరును.

ఇవి కాక 1. మత్తపదగ్రస్తము 2. పాదావరోహణము (అనులోమ విలోమపాదము) 3. పాదాది యమకము 4. మహాయమకము మొదలగు చిత్ర శ్లోకములిందుఁ గలవు.

కొందఱు చిత్ర కవిత్వము నీరస కవిత్వమని భావించుచున్నారు. అది సరి కాదు. స్తోత్రములు దండకములు మొదలగు వానిలో నర్థాలంకారముల కంటెను శబ్దాలంకారములే శ్రుతిరంజకములై భక్తులను బారకులను నాకర్షించును. కళలకన్నింటికిఁ బరమ ప్రయోజనము, చరమ ప్రయోజనము భగవద్దర్శనమే కదా! అందువల్లనే వేదములు శబ్ద ప్రధానములైనవి.

కావ్యప్రకాశములో మమ్మటాచార్యులు 'సంభావినోఽ ప్యన్యే ప్రభేదాః శక్తిమాత్ర ప్రకాశకా న తు కావ్య రూపతాం దధతీతి న ప్రదర్శ్యంతే' అనియు

రసగంగాధరములో జగన్నాథ పండితరాయలు – 'యద్యపి య త్రార్థ చమత్కృతి సామాన్య శూన్యా శబ్ద చమత్కృతి స్తత్పుఝ్ఛమ మధమాధమ మపి కావ్యవిధాసు గణయితు ముచితం; యథైకాక్షర – పద్యార్థావృత్తి– యమక – పద్మ బన్ధాది తథాపి రమణీయార్థ ప్రతిపాదక శబ్దతా రూప కావ్య సామాన్య లక్షణా క్రాంత తయా వస్తుతః కావ్యత్వాభావేన మహాకవిభిః ప్రాచీన పరమ్పరా మనుసన్దధానై స్తత్ర తత్ర కావ్యేషు నిబద్ధ మపి నాస్మాభి ర్గణితం వస్తు స్థితే రే వానురోద్ధృత్వాత్' అనియును జెప్పుట ప్రౌఢివాదము. చిత్రమీమాంసా రసగంగాధరాది కేవలార్థాలంకార ప్రతిపాదకములగు మూఁడు నాల్గ లంకార గ్రంథములు దక్కఁ దక్కిన యలంకార గ్రంథములన్నియు చిత్రలంకార నిరూపణమునకై ప్రత్యేక ప్రకరణములను గేటాయించినవి. అందును సరస్వతీ కంఠాభరణ కర్తయగు భోజమహారాజునకుఁ జిత్రకవిత్వము పై మక్కువ యెక్కువ. చిత్రకవిత్వము నెక్కువగా రచించిన కుమార దాస – భారవి – మాఘ– వేదాంతదేశిక – వేంకటాధ్వరి ప్రభృతి మహాకవులు రసస్వరూపము తెలియని వారు కారు.

ధ్వని ప్రస్థాన ప్రస్థాపనాచార్యులగు శ్రీమదానందవర్ధనాచార్యులే

**శ్లో॥ యతో యాతి తతోఽత్యేతి యయా తాతాయతాం యతైః॥**
**మాతా మితోత్తమ తమా తమోఽతీతాం మతిం మమ॥** (దేవీ–95)

మొదలగు చిత్ర కవిత్వముతో దేవీ శతకమును నింపినారు. 'చిత్రరత్నాకరము'ను రచించిన చక్రకవి, 55 బంధములతోఁ 'జిత్రకావ్యకౌతుకము'ను నిర్మించిన రామ రూప

పాఠకులు, 70 బంధములతో 'సారస్వత శతకము'ను నిబంధించిన జీవశర్మ న్యాయతీర్థులు, శతాధిక చిత్రములతోఁ బ్రబంధ రాజ వేంకటేశ్వర విజయవిలాసమును రచించిన గణపవరపు వెంకటకవి మొదలగు వారు సామాన్యులు గారు.

చిత్ర కవితా శ్లోక నిర్మాణములో నెంతటి మహాకవి యైనను మిక్కిలి క్లేశపడక తప్పదు. అందువల్లనే మమ్మటాచార్యులు 'కష్టం కావ్యమేత దితి దిఙ్మాత్రమ్ ప్రదర్శ్యతే' యని యంగీకరించినారు. ఏకావళీతరళలో మల్లినాథుఁడు 'అశక్తానా మనాదరో నతు శక్తానా మితిభావః' చిత్రకవితా నిర్మాణములో శక్తిలేని వారే వీనిననాదరించు చున్నారు. శక్తిగలవారు రచించుచునే యున్నారని ప్రతిపాదించినాఁడు. రుద్రటాలంకార వ్యాఖ్యలో నమిసాధువు కూడ-'ప్రయోగస్తు తేషాం ఖణ్డకావ్యేషు దేవతా స్తుతిషు రణవర్ణనేషు చ' చిత్రకవితా ప్రయోగము దేవతాస్తుత్యాదులలో శోభించునని ప్రకరణము ముగించి నాఁడు సమాధి స్థితిలోనున్న యోగివలెనే చిత్తైకాగ్రత నొందిన మహాకవి మాత్రమే చిత్రకావ్యమును నిర్మింపగఁలడు. ఆ కవితా దర్శనము భగవద్దర్శనము వంటిది. ఆ యానందము బ్రహ్మానందము వంటిది. అందువల్లనే నీలకంఠ దీక్షితులు 'సిద్ధః కవీనాం కవితైవ యోగః' అని నొక్కి వక్కాణించినారు. శ్రీశివకర్ణామృతములో శబ్దాలంకారములు చిత్రకవిత్వము పుష్కలముగాఁ గలవు.

**అర్థాలంకారములు**

ఈ శ్రీశివకర్ణామృతస్తోత్రములో 1. ఉపమ 2. అనన్వయము 3. ఉత్ప్రేక్ష 4. ఉల్లేఖము 5. పరిణామము 6. సందేహము 7. స్మరణము 8. భ్రాంతి 9. అపహ్నుతి 10. శ్లేష 11. ప్రతీపము 12. అతిశయోక్తి 13. ఉదాహరణము 14. వ్యతిరేకము 15. సహోక్తి 16. విభావన 17. విశేషోక్తి 18. వినోక్తి 19. విషమము 20. అధికము 21. విచిత్రము 22. అన్యోన్యము 23. అసంగతి 24. వ్యాఘాతము 25. తద్గుణము 26. ఉత్తరము 27. ప్రశ్నోత్తరము 28. పరిసంఖ్య 29. పరివృత్తి 30. సముచ్చయము 31. అనుకల్పము 32. సారము 33. మీలనము 34. సమము 35. తత్కరము 36. ఏకావళి 37. సూక్ష్మము 38. సామాన్యము 39. అర్థాంతరన్యాసము 40. విశేషోక్తి 41. అర్థాపత్తి 42. కావ్యలింగము 43. పర్యాయోక్తి 44. దృష్టాంతము 45. ప్రతివస్తూపము 46. ప్రత్యనీకము 47. భావికము 48. విశేషము 49. వక్రోక్తి 50. పరికరము 51. వికల్పము 52. అప్రస్తుత ప్రశంశ 53. వ్యాజస్తుతి 54. కారణమాల 55. అనుమానము 56. సమాసోక్తి 57. మాలా దీపకము 58. విరోధాభాసము 59. పర్యాయము 60. స్వభావోక్తి మొదలగు నర్థాలంకారములు గలవు.



శ్లేషాలంకార విషయములో 'నిత్యం మానసవాస మీశ్వర మహం రామా కృతిం భావయే' యను మకుటముతో 8 శ్లోకములలో శివరాములకు శ్లేషము గలదు. విశేషాలంకా రోదాహరణ పద్యములలో -

**శ్లో॥ కి ఙ్చిద్ధితం శివాభక్త కథయామి తవ శృణు।**
**మద్విశేషోక్తితః కిం త్వం వేత్సి దుఃఖం భవోద్భవమ్॥** (శ్రీశివ 3-140)

శివునియందు భక్తి లేని వాఁడా! నీకుఁ గొంచెము హితము చెప్పుచున్నాను వినుము. నా విశేషోక్తి వలన సంసారోద్భవమగు దుఃఖము తెలిసినదా?యను శ్లోకములో నలంకార నామము సూచింపఁబడినది. కావున ముద్రాలంకారము కూడఁకలదు. 'సూచ్యార్థ సూచనం ముద్రా' యని కువలయానంద లక్షణము.

ఈవిధముగా శివకర్ణామృతమం దెన్నియో విశేషములు గలవు. ఇందులో తృతీయాధ్యాయమును సాకల్యముగా నధ్యయనించిన వాని కలంకార శాస్త్రమంతయుఁ గరతలామలక మగు ననుటలో నిసుమంతయు నతిశయోక్తి లేదు.

**శివకర్ణామృత కర్తయెవరు?**

శ్రీశివకర్ణామృతాధ్యాయాంతగద్యములో - 'ఇతి శ్రీ భరద్వాజముని కృతే శివకర్ణామృత స్తోత్రే తృతీయాధ్యాయః' అని యుండుటచే నీ గ్రంథము శ్రీ భరద్వాజ మహర్షిచే రచియింపఁబడినట్లు తెలియుచున్నది. గ్రంథస్థ గద్యమును శంకించుట మహా సాహసమే. కాని యీ గ్రంథమును బఠించునపు డిది ప్రాచీన గ్రంథమని తోఁచదు. శ్రీకృష్ణ కర్ణామృతమున కనుకరణ మగుటచే నిది 12 వ శతాబ్దము తరువాత బుట్టిన గ్రంథమని యంగీకరింపక తప్పదు. శ్రీ శివకర్ణామృతమునకే కృష్ణ కర్ణామృతమనుకరణ మేల కాఁగూడదని కొందఱు వాదింపవచ్చును. కాని యిందలి యలంకార యోజనమును బట్టి మిక్కిలి యర్వాచీన గ్రంథమని తోఁచుచున్నది. ప్రాచీన వాఙ్మయములో నిన్ని శబ్దాలంకారములు గాని, యిన్ని యర్థాలంకారములు గాని యింత చిత్ర కవిత్వము గాని లేవు.

ఋగ్వేదమునం దుపమా శబ్దము వాడఁబడినది. వేదములలో నుపమ, యతిశయోక్తి, రూపకము మొదలగు వానికి సుందరోదాహరణములు గలవు. యాస్క నిరుక్తములో నుపమాభేదములు చర్చింపఁబడినవి. పాణిని మహర్షి యష్టాధ్యాయిలో 'నుపమానాని సామాన్యవచనైః' (2-1-55) మొదలగు సూత్రములలో నుపమాశబ్దము గలదు. భరతమహర్షి నాట్యశాస్త్రములో 1. అనుప్రాసము 2. ఉపమ 3. రూపకము 4. దీపకము నను నాల్గలంకారములు మాత్రమే పేర్కొనఁబడినవి. దండి కావ్యాదర్శములో

35 అలంకారములను, ఉద్భటుఁడు కావ్యాలంకార సంగ్రహములో 41 అలంకారములను బేర్కొనినారు. శ్రీ భోజుఁడు సరస్వతీ కంఠాభరణములో 24 శబ్దాలంకారములను 24 అర్థాలంకారములను 24 ఉభయాలంకారములను విపులముగాఁజెప్పినాఁడు. కావ్య ప్రకాశములో మమ్మటుఁడు 61 అలంకారములను, సాహిత్య దర్పణములో విశ్వనాథకవి రాజు 72 అలంకారములను జెప్పినారు. ఇట్లర్థాలంకార సంఖ్య పెరిఁగి పెరిఁగి శ్రీమదప్పయ్య దీక్షితేంద్రులు కువలయానందములో 125 అలంకారములు చెప్పఁబడినవి.

ఇట్లే బంధ చిత్ర కవిత్వములు ప్రాచీనార్షవాఙ్మయములోఁ గన్పట్టవు. పాణిని మహర్షి యష్టాధ్యాయిలో 'సంజ్ఞాయామ్' (3-4-42) 'బన్ధే చ విభాషా' (6-3-13) అను సూత్రములు గలవు. ఇక్కడఁ బాతంజల మహాభాష్యములో - 'హస్తే బన్ధః - హస్త వృత్తిలో - 'క్రౌఞ్చ బన్ధం బధ్నాతి। మయూరికా బన్ధమ్ - అట్టాలికా బన్ధం బద్ధః । బన్ధ విశేషాణాం నామధేయాన్యేతాని। 'హస్తే బన్ధః - హస్త బన్ధః, చక్రే బన్ధః - చక్ర బన్ధః' అను నుదాహరణములు గలవు. ఇవి యుద్ధవ్యూహ నామములా? శ్లోక బంధ నామములా? సందేహము.

కుమారదాసుని 'జానకీహరణము', భారవి 'కిరాతార్జునీయము', మాఘుని 'శిశుపాలవధము', వేదాంత దేశికుల 'యాదవాభ్యుదయము' 'పాదుకాసహస్రము', వేంకటాధ్వరి 'లక్ష్మీసహస్రము' మొదలగు కావ్యములలో బంధ కావ్యమెక్కువఁగాఁగలదు. భారవి కాలము 5వ శతాబ్దము. కుమారదాసు కాళిదాసునకు సమకాలికుఁడని కొందఱు, భారవికిఁ దరువాతి వాఁడని కొందఱును భావించుచున్నారు. అట్లే లక్షణ గ్రంథములలో దండి కావ్యదర్శము, రుద్రటుని కావ్యాలంకారము, భోజుని సరస్వతీకంఠాభరణము మొదలగు వానిలో బంధ కవిత్వము వివరింపఁబడినది. దండి కాలము 6వ శతాబ్దము. బంధ కవితాచరిత్రమును బట్టి చూచినను శ్రీ శివకర్ణామృత మర్వాచీన గ్రంథమని తెలియుచున్నది.

**శివకర్ణామృత కర్త యాంధ్రుఁడు**

శివకర్ణామృతములో 11 ఉత్పలమాలలు 1 చంపకమాల గలవు. ఇవి యాంధ్ర భాషానుగుణముగా యతిప్రాసములతో నున్నవి. రెండు శ్లోకములను జూడుఁడు.

**శ్లో॥ శ్రీ మదనన్త భవ్య గుణసీమ సమాదృత దేవతానతే**
**సోమకలావతంస ఘన సుందర కంధర బంధురాకృతే**
**కామ నికామభీమ నిజకామిత దాన లసన్మహామతే**
**సామజ చర్మచేల శివ శఙ్కర మామవ పార్వతీపతే॥** (శ్రీశివ 1-56)



**శ్లో॥ జయజయ హార హీర శశి చారు శరీర వికాసహాస భృ-**
**జ్జయ జయ శాన్త దాన్త వసుచన్ద్రరవీక్షణ నిత్య నృత్యకృద్।**
**జయజయ చణ్డదణ్డ ధరశాసన సన్తత భక్త సక్తహృ-**
**జ్జయజయ శేషభూష శివ శఙ్కర మామవ పార్వతీపతే॥** (1-67)

చంపకమాల, యుత్పలమాల, శార్దూలము, మత్తేభము నను నాల్గువృత్తములు తెలుఁగు సాహిత్యములో మిక్కిలి ప్రచారము గలవి. అనుష్టుప్పు, ఉపజాతి, వంశస్థము, మందాక్రాంతము మొదలగునవి సంస్కృత సాహిత్యములో మిక్కిలి ప్రచారము గలవి. శార్దూలము, స్రగ్ధర మొదలగు వానికి రెండు భాషలందును సమ ప్రచారము గలదు. మాఘ మహాకవి శిశుపాలవధములోఁ జంపకమాలను వాడినాఁడు-

**శ్లో॥ తురగశతా కులస్య పరితః పర మేకతురఙ్గ జన్మనః**
**ప్రమథిత భూభృతః ప్రతి పథం మథితస్య భృశం మహీ భృతా**
**పరిచలితో బలానుజ బలస్య పురః సతతం ధృత శ్రియ**
**శ్చిర విగతశ్రియో జలనిధేశ్చ తదా భవదన్తరం మహత్॥** (శిశు 3-82)

వేంకటాధ్వరి లక్ష్మీసహస్రములో రెండు మత్తేభములను వాడినాఁడు.

**శ్లో॥ క్షిపతు క్షిప్ర మనల్ప మప్రతిహత స్తాపత్రయం మామకం**
**భవదావాగ్ని భయాపహ స్తవకృపా వీక్షా సుధానిర్ఝరః।**
**వ్యథయన్ సాధు కదమ్బ మమ్బ! విహిత ప్రౌఢాగమవ్యాహృతిః**
**శశినః సోదరి! హా నిదాఘవిభవః శాన్తిం యతో విన్దతి॥** (లక్ష్మీ 15-13)

**శ్లో॥ మయి సర్వాపకృతి క్షమేఽపి కలయ స్వాతీవ శీతాం దయాం**
**హరికాన్తే! భువనోపకారనిరతే ష్వన్యేషు ధన్యేష్వివ।**
**పనసామ్రాది మహీ రుహేషు దదతీ భూరీణి వారీణి సా**
**విషవృక్షేఽపి ముహుః ప్రవర్షతి న కిం? విశ్వామ్బ! కాదమ్బినీ॥**
(లక్ష్మీ 15-15)

కాని వీనిలో యతి ప్రాసములు లేవు. హేమచంద్రుని 'ఛందోఽనుశాసనము' చంద్రశేఖరకవి 'వృత్తమౌక్తికము', శ్రీనివాసకవి 'వృత్తమణికోశము' మొదలగు వానిలోఁ జంపకోత్పలమత్తేభములకు లక్షణములు గలవు. కాని వీనికి సంస్కృత సాహిత్యములోఁ బ్రచారము లేదు. చంపకోత్పల శార్దూల మత్తేభములకుఁ గన్నడ భాషలోఁ గూడ మిక్కిలి ప్రచారము గలదు. కన్నడములోఁ బ్రాసనియమ మున్నది కాని యతి నియమము లేదు. అట్లే తెలుఁగు కవు లుపజాతి, వంశస్థము మొదలగు వానిని విరళముగా వాడినను

యతిప్రాసనియమముండి తీరును. కాఁబట్టి యతిప్రాసములతోఁ జంపకోత్పలములను రచించిన శివకర్ణామృతకర్త యాంధ్రుఁడని స్పష్టమగుచున్నది.

చక్రబంధము సంస్కృతాంధ్ర సాహిత్యములలో సమాన ప్రచారము గలది. 3-6 వలయములలోఁ గవి కావ్యనామములను గూర్చుట పరిపాటి. మాఘుని శిశుపాల వధము నందలి చక్రబంధములో (19-120) మూఁడవ వలయములో 'మాఘకావ్యమిదం' అనియు నాఱవ వలయములో 'శిశుపాలవధః' అనియుఁ గవికావ్యనామములు గలవు. పారిజాతాపహరణము నందలి చక్రబంధములో 3-6 వలయములలోఁ 'గృష్ణరాయకృతి' నందితిమ్మనకవి' యని కృతిపతి – కావ్యనామములు గలవు. సంస్కృతాంధ్రకవులందఱు ప్రాయికముగా నీ నియమమునే పాటించిరి. శ్రీ శివకర్ణామృతము నందలి చక్రబంధమును బరికింతుము.

**అష్ట త్రివలయ కవి పతి నామాఙ్కిత చక్రబన్ధ శార్దూల వృత్తమ్**

**శ్లో॥ సర్వేశం చతురఙ్గవేన్ద్రియవశ శ్శేషాహి తాఖ్యం భవం**
**తత్పాకక్రతు కారక ప్రియ మకధ్వంసి స్వబంత ధ్రువమ్।**
**కర్పూరామితభం జటావయవ చిత్రం సప్రథత్వం వరం**
**రఙ్గద్భాస మనన్త మన్ధకరిపుం వన్దే శివం శఙ్కరమ్॥** (శ్రీశివ 3-9)

ఈ చక్రబంధము నందలి మూఁడవ వలయములో 'శంకరాఖ్యం తత్త్వం' అనియు నాల్గవ వలయములోఁ 'జక్రమితా బంధ' యనియు నెనిమిదవ వలయములో 'వేంకటాశకచి' యనియుఁ గలదు. దీనిని బట్టి కూడ శివకర్ణామృత కర్త భరద్వాజ మహర్షి కాఁడని విదిత మగుచున్నది.

**శివకర్ణామృత మప్పయ దీక్షిత కృతము**

శ్రీ మదప్పయ దీక్షితులు 104 యజ్ఞములు చేసి 104 గ్రంథములను రచించి శివాద్వైతమతమును స్థాపించి పరమ శివావతారముగా వన్నె కెక్కినవారు. వీరు రచించిన 'శివకర్ణామృత' మను గద్య గ్రంథము శివతత్త్వ ప్రతిపాదకమై వెలుగొందుచున్నది. శ్రీభరద్వాజ గోత్రులగు శ్రీమదప్పయ దీక్షితులే యీ శివకర్ణామృతమును రచించి శ్రీ భరద్వాజ మహర్షి పేర వెలయించి యుండు రని నాయాశయము.

**దీక్షితుల యాంధ్రత్వము**

**శ్లో॥ ఆన్ధత్వ మాన్ధ్రభాషాచ, ప్రాభాకర పరిశ్రమః**
**తత్రాపి యాజుషీ శాఖా, నాల్పస్య తపసః ఫలమ్॥**

అను సుప్రసిద్ధశ్లోకమప్పయదీక్షితులు చెప్పినది.



**శ్లో॥ భారద్వాజం యస్య గోత్రం శాఖా యస్య చ కౌథుమీ।**
**ద్రాహ్యాయణం యస్య సూత్రం స జయ తృప్ప దీక్షితః॥**

అను శ్లోకమును బట్టి వీరు భారద్వాజ గోత్రులు ద్రాహ్యాయణ సూత్రులు. సామవేదులు నని తెలియుచున్నది. శ్రీకృష్ణదేవరాయల (1509-1530) వారి యాస్థానము నలంకరించిన యాచార్య దీక్షితులు (అచ్చాన్ దీక్షితులు) వీరి తాత గారు 'వివరణ దర్పణము' మొదలగు నద్వైత వేదాంత గ్రంథములను రచించి కొంతకాలము విజయనగరములో బొమ్మనరేంద్రునకు సచివుఁడుగా నుండి చిదంబరములో స్థిరపడిన రంగరాజాధ్వరి తండ్రి. కాంచీనగర సమీపమునం దున్న 'అడయపాలెము' వీరి నివాసము. రామరాజభూషణుని వసుచరిత్రమును సంస్కృతమున కనువదించిన కాళహస్తి కవి యప్పయ దీక్షితుల శిష్యుఁడు. చిన్న బొమ్మ భూపాలుని యన్నయైన నరసింహభూపతి (1570) యప్పయ్య దీక్షితులు వాజపేయ యాగము చేసి నపుడవభృథ స్నానమును స్వయముగా జరిపించినాఁడు. సదాశివరాయల (1542-1546) సేనాపతియైన చిన తిమ్మభూపాలుని యభ్యర్థనము నంగీకరించి దీక్షితులు శ్రీ వేదాంతదేశికులు రచించిన యాదవాభ్యుదయమునకు వ్యాఖ్యానమును రచించినారు. రాయవెల్లూరు నేలిన చినబొమ్మ భూపాలుని యాస్థానములో నుండి 'శివార్కమణిదీపిక' 'శివార్చన చంద్రిక' మొదలగు గ్రంథములను రచించి దీక్షితులు కనకాభిషేక సత్కారము నొందినారు. తంజావూరి నేలిన సేనప్పనాయకుని (1580) కొలువులో ఉండి 'యుపక్రమ పరాక్రమము' మొదలగు మీమాంసా గ్రంథములను రచించినారు. తిరుమల రాయల కుమారుఁడైన వేంకట పతిరాయల (1585-1614) సభాంగణము నలంకరించి 'కువలయానందము' 'విధిరసాయనము' మొదలగు గ్రంథములను రచించినారు. ఇట్లు దీక్షితుల నాదరించిన రాజులందఱు నాంధ్రులు. దీక్షితులు 'శివాత్మర్పణస్తుతి' ప్రారంభంలో 'శ్రీమద్రాజమహేన్ద్ర దివ్య నిలయమ్' అను శ్లోకములో రాజమండ్రి యందలి మార్కండేయేశ్వరస్వామిని స్తుతించినారు. శ్రీవరద రాజస్తవములో–

**శ్లో॥ విశ్వ ప్రసిద్ధతర విప్రకుల ప్రసూతేః**
**యజ్ఞోపవీత వహనం నహి ఖల్వపేక్ష్యమ్।**

అను శ్లోకములో 'జగమెఱిఁగిన బ్రాహ్మణునకు జందెమేల?' యను సామెతను సంస్కృతీకరించినారు. కువలయానందము నందలి ఛేకోక్త్యలంకార ప్రకరణములో 'య ఏవ గవాం నివర్తనే ప్రభవతి స ఏవ ధనంజయః ఇత్యాంధ్ర జాతి ప్రసిద్ధలోక వాదానుకారః ' అని యాంధ్ర జాతీయమును బేర్కొనినారు. ఈ హేతువుల నెల్లఁ బురస్కరించుకొని

'అప్పయ్య దీక్షితులు తమిళులా? ఆంధ్రులా?'(సమాలోచన 1-4-1986) అను వ్యాసములో నప్పయ్య దీక్షితు లాంధ్రులై యుందు రని సూచించితిని.

మీమాంసాసార్వభౌములు, నద్వైతవేదాంత చక్రవర్తులు, శివాద్వైతమత పునః ప్రతిష్ఠాపనాచార్యులు సర్వతంత్రస్వతంత్రులు చతురధిక శతగ్రంథ నిర్మాణ చాతురీదురీణులు నగు దీక్షితుల కాంధ్రసాహిత్య లక్షణములు కరతలామలకములగుట గగనము కాదు. 'ఇతి శ్రీమద్భరద్వాజ కుల జలధి కౌస్తుభ శ్రీమదద్వైత విద్యాచార్య విశ్వజి ద్యాజి శ్రీరఙ్గరాజాధ్వరి సూనో రప్పయదీక్షితస్య కృతే' అని వీరి గ్రంథాంత గద్యము. శివకర్ణామృతము కూడ శ్రీ భరద్వాజ విరచితమే కదా! వెంకటపతి రాయల నియోగముచేఁ గువలయానందము రచింపఁబడినట్లు-

**శ్లో॥ అముం కువలయానన్ద మకరో దప్ప దీక్షితః॥**
**నియోగా ద్వేఙ్కటపతే ర్నిరుపాధి కృపానిధేః॥**

అని గ్రంథాంతములోఁజెప్పఁబడినది. శివకర్ణామృతము నందలి చక్రబంధములోఁ గూడ 'వేంకటేశ' నామము గలదు. ఇది కవిపతి నామమని కూడ నిందే కలదు. నామగోపన శ్లోకములో 'సదాశివ' యని వెంకటపతి రాయల సోదరుఁడగు 'సదాశివరాయల' నామము కూడ సూచింపబడినది. శివకర్ణామృత మను పేరుతో శివాద్వైతగద్య గ్రంథమును రచించిన దీక్షితులు శివకర్ణామృత స్తోత్ర పద్య కావ్యమును రచించుటలో నాశ్చర్యము లేదు. అప్పయ్య దీక్షితులు శివకర్ణామృతమును రచించుటకు మూఁడు ప్రధాన హేతువులు గలవు.

1. దీక్షితుల నాఁటికే శ్రీకష్ణ - శ్రీరామ కర్ణామృతములు మిక్కిలి ప్రచారములో నున్నవి. ఇవి రెండును విష్ణుభక్తి ప్రతిపాదకములు. అట్లే శివభక్తి ప్రబోధకమగు శివకర్ణామృతము కూడ నుండుట యావశ్యక మని పరమ శివభక్తులగు దీక్షితుల నాశయము.

2. దీక్షితు లలంకార శాస్త్రములో (1) వృత్తి వార్తికము (2) చిత్రమీమాంస (3) కువలయానందము నను మూఁడు గ్రంథములను రచించిరి. చిత్రమీమాంసా కువలయానందములలో నర్థాలంకారముచే వివరింపఁబడినవి. కాని శబ్దాలంకారముల ప్రస్తావన లేదు. ఆ కొఱంతను దీర్చి సంపూర్ణాలంకార శాస్త్రమునకు లక్ష్య గ్రంథమును రచించుటకు కూడ నావశ్యకమని దీక్షితులు భావించి యుందురు.

3. అప్పయ్య దీక్షితుల కాలము నాఁటికి దక్షిణ భారతదేశములో వైష్ణవ మతము విజృంభించినది. రామానుజ - మాధ్వ మతస్థులు శివుని దూషించుట యద్వైత శివాద్వైత



గ్రంథములను ఖండించుట పెచ్చు పెరిఁగినది. దీని నరికట్టుటకై దీక్షితులు జీవితము నంతటిని ధారపోసిరి. దీక్షితులు రచించిన గ్రంథములలో 'శ్రీవరదరాజస్తవ' మొక్కటియే విష్ణుభక్తి ప్రతిపాదక మగు స్తోత్రకావ్యము, అప్పయ్య దీక్షితులు (అద్వైతము) తాతాచార్యులు (విశిష్టాద్వైతము) విజయీంద్ర తీర్థులు (ద్వైతము) తంజావూరి నేలిన సేవప్ప నాయకుని కొలువు నలంకరించిరి. దీక్షితులతో స్పర్ధ వహించి విజయీంద్ర తీర్థులు కూడా 104 గ్రంథములను నిర్మించిరి. దీక్షితులు మీమాంసలో 'ఉపక్రమపరాక్రమము' ను రచింపగాఁ దీర్థులు 'నలంకారమంజరి' ని రచించి 18 బంధములను నిబంధించిరి. కావున నొక వంక శ్రీకృష్ణకర్ణామృతమునకుఁ బ్రతిగా మఱొక వంక విజయీంద్రతీర్థుల చిత్ర కవిత్వమున కుద్దిగా దీక్షితులు శ్రీ శివకర్ణామృతమును రచించి యుందురు.

శ్రీ మాడభూషి కృష్ణమాచార్యులు శ్రీమదప్పయ్య దీక్షితులు రచించిన పద్య కావ్యములలో శ్రీశివకర్ణామృతమును గూడఁబేర్కొనిరి. వారు చూచిన తాళపత్ర ప్రతులలో దీక్షితుల గద్యముండి యుండును.

## కర్ణామృత త్రయము

శ్రీరామ-కృష్ణ-శివ తత్త్వములను బ్రతిపాదించు శ్రీకర్ణామృత త్రయము సంస్కృత స్తోత్రసాహిత్యములో రత్నత్రయము వంటిది. ఈ మూఁడు కర్ణామృతముల నుండి సమానభావములుగల ఒక్కొక్క శ్లోకము నాంధ్ర పద్యములతో నుదాహరించుచున్నాను.

**శ్లో॥ కదావా సాకేతే విమల సరయూతీరపులినే**
**సమాసీనః శ్రీమద్రఘుపతి పదాబ్జే హృది భజన్।**
**అయే రామస్వామిన్! జనక తనయా వల్లభ! విభో!**
**ప్రసీదేతి క్రోశన్ నిమిష మివ నేష్యామి దివసాన్॥** (శ్రీరామ 1-61)

**శ్లో॥ గురు సాకేతపురీ మనోజ్ఞ సరయూ కూలంబునన్ సైకతో-**
**పరిభాగంబునఁ గూరుచుండి రఘురాట్పాదాంబు జాతంబులన్**
**స్థిరవృత్తిన్ భజియింపుచున్ వరద! యో సీతేశ! ప్రత్యక్షమై**
**కరుణింపం దగుదన్న ఘస్రములు నిక్కంబున్ నిమేషం బగున్**

- చేకూరి సిద్ధయ్య

**శ్లో॥ కదావా కాళిన్దీ కువలయ దళ శ్యామలతరాః**
**కటాక్షా లక్ష్యన్తే కిమపి కరుణా వీచి నిచితాః।**
**కదావా కన్దర్ప ప్రతి భటజటా చన్ద్ర శిశిరాః**
**కిమప్యన్త స్తోషం దదతి మురళీ కేళీ నినదాః॥** (శ్రీకృష్ణ 1-26)

ఉ॥ ఎన్నఁడొ! యామునోత్పలసితేతరలోల దయార్ద్ర దృగ్విలా
సోన్నతి నాపయిన్ నిగిడి యుండుట శంభుజటాటవీతటా
సన్న సుధాంశు శీతల లసన్మురళీ నినదామృతంబుచే
వెన్నుఁడు నాదు వీనులకు విం దొనరింపఁదలంచు టెన్నఁడో!

–వెలగపూఁడి వెంగన

శ్లో॥ కదావా శ్రూయన్తే ప్రమథజయ శబ్దద్విగుణితాః
శివోద్వాహ ప్రాఞ్చద్వృషభగళ సత్కిఙ్కిణిరవాః।
కదావా కైలాసాచల నిలయ దివ్యా గురుచయాః
కథం వా దృశ్యన్తే కలిత భసితాఙ్గాభిరుచిరాః॥ – శ్రీశివ 1-26

శ్లో॥ వినఁబడు టెన్నఁడో! ప్రమథ వీరజయాద్భుత కంఠనాదముల్
వనిత వివాహవేళ వృషభ ప్రభు కంధర కింకిణీ ధ్వనుల్
కనఁబడు టెన్నఁడో! గిరిశకాయ విభూతి విలేపన ప్రభల్
ఘనరజతాద్రిసౌధ గత గంధవహాగురు ధూపధూమముల్ – గరిమెళ్ల శర్మ

## ముగింపు

ఈ శివకర్ణామృత మింత వఱకు నాంధ్రీకరింపఁబడలేదు. తెలిసినంత వఱకు సంస్కృత వ్యాఖ్యయు లేదు. 'భగవత్కృప లభించినచో దీనిని దెనిఁగించి సత్వరముగాఁ బాఠకుల కందింతు' నని యాంధ్ర తాత్పర్యముతో 1991లో ప్రకటింపఁడి శ్రీరామకర్ణామృత లఘుపీఠిక యందు విన్నవించితిని. శ్రీ దోర్బల విశ్వనాథశర్మగారిచే ఆస్వాదినీ వ్యాఖ్యపేర నర్థతాత్పర్య విపుల వివరణను రచింపఁజేసిన పుణ్యము శ్రీ మోహనరావుగారిది. కర్ణామృత త్రయ ప్రతిపాద్యులగు శ్రీరామ – శ్రీకృష్ణ – శ్రీమహా శివులను మాటి మాటికీ ధ్యానించుచు నీ పీఠిక నింతటితో ముగించుచున్నాను. స్వస్తి.

తే॥గీ॥ అభవు వలకన్ను రామకర్ణామృతంబు
హరుని డాకన్ను కృష్ణకర్ణామృతంబు
మృదుని కర్ణామృతం బిది నడిమికన్ను
కామజయ మిచ్చుఁ గైవల్య సీమఁజేర్చు.

శ్రీమత్పరమేశ్వరార్పణమస్తు

విజయవాడ, విక్రమ ఇట్లు
వైశాఖ బహుళ సప్తమి, సుకల సుకవి బుధ జన విధేయుఁడు
బుధవారము, 25-5-2000 ***గరిమెళ్ళ సోమయాజులు శర్మ***





हल्, शषसर्, कपय्, खफछठथचटतव्, जबगडदश्, घढधष्, झभञ्, ञमङणनम्, लण्, हयवरट्, ऐऔच्, एओङ्, ऋऌक्, अइउण्



अइउण्, ऋऌक्, एओङ्, ऐऔच्, हयवरट्, लण्, ञमङणनम्, झभञ्, घढधष्, जबगडदश्, खफछठथचटतव्, कपय्, शषसर्, हल्



శ్రీః

ఓం నమ శ్శివాయ

# శ్రీ శివకర్ణామృతస్తోత్రమ్

**(శ్రీ భరద్వాజ మునికృతమ్)**

ఆస్వాదినీ వ్యాఖ్యా

(అర్థ – తాత్పర్య – విపుల వివరణ)

**(దోర్బల విశ్వనాథ శర్మ)**

**ప్రథమోఽధ్యాయః**

**అవతారిక:–** శ్రీ భరద్వాజముని శ్రీ శివకర్ణామృతమను పేర రచింపబోవు స్తోత్రమున కారంభమున మంగళాచరణ మొనరించు చున్నాడు.

**శ్లో॥ శ్రీ పార్వతీసుకుచకుఙ్కుమరాజమాన –**
**వక్షస్థలాఞ్చితమమేయగుణప్రపఞ్చమ్।**
**వన్దారుభక్తజనమఙ్గలదాయకం తం**
**వన్దే సదాశివమహం వరదమ్మహేశమ్॥ 1**

**ప్రతిపదార్థము :–** శ్రీ పార్వతీ సుకుచకుఙ్కుమ రాజమాన వక్షః స్థలాఞ్చితమ్ = శ్రీ పార్వతీదేవియొక్క శోభనములైన స్తనములందలి కుఙ్కుమతో ప్రకాశించుచున్న వక్షః స్థలముతో ప్రకాశించుచున్న, అమేయగుణ ప్రపఞ్చమ్ = లెక్కింపరాని గుణముల సమూహముగల, వన్దారు భక్తజన మఙ్గల దాయకమ్ = నమస్కరించు భక్తజనములకు





శుభముల నొసగు, వరదమ్ = వరముల నొసగు, మహేశమ్ = మహైశ్వర్యముగల, సదాశివమ్ = సదాశివుని గూర్చి, అహమ్ = నేను, వన్దే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :–** శ్రీ పార్వతిని కౌగిలించుకొనినప్పుడామె స్తనములందలి కుంకుమతో విరాజిల్లు ఱొమ్ముగల, అనన్తనములైన గుణములు గల, నమస్కరించు భక్త జనములకు శుభములను వరములను ప్రసాదించు మహైశ్వర్యములుగల సదాశివునకు నమస్కరించెదను.

**వివరణ :–** 1. గ్రన్థమును శ్రీ శబ్దముతో మొదలుపెట్టుట గ్రంథకర్తకు శ్రీ విద్యాదరమును వ్యంజించును. 2. పార్వతీదేవి తన స్తనములను కుంకుమపూవుతో నలంకరించుకొని ఎక్కువసేపు కాలేదు. అది ఇంకను ఆమె స్తనములందు ద్రవమును (పచ్చిదనమును) కోల్పోలేదు. అప్పుడే శివుడామెను గట్టిగా కౌగలించుకొనెను. అప్పుడామె స్తనములందలి కుంకుమపూత భస్మముతో మరింత తెల్లనైన శివుని ఱొమ్మున కంటుకొనుటచే ఆ శివుని ఱొమ్ము ప్రకాశించుచున్నది. పూజార్థకమైన అంచు ధాతువు ప్రయోగించుటచే శివుని వక్షఃస్థలముయొక్క పూజ్యత అమ్మవారి ఆలింగనసౌభాగ్యమున సిద్ధమైనదని వ్యంజితమగును. సదాశివుని ఈ ప్రథమ విశేషణము హేతుగర్భమగుటచే అమేయగుణ ప్రపఞ్చమ్ అను రెండవ విశేషణమందు ప్రతిపాదించబడిన సగుణత్వము మాయా స్వరూపిణియైన పార్వతిచేతనే నిర్గుణ శివుని సిద్ధించుట వ్యంగ్యమగును. 3. వన్దారు భక్తజన మంగలదాయకమ్ అను మూడవ విశేషణము నమస్కరించు భక్తులకు మంగలము అనగా మోక్షము కలుగుటను సూచించును. వరదమ్ అను నాల్గవ విశేషణము ఈ జన్మమున నమస్కరింపని వారికిని పూర్వజన్మ కర్మానుగుణముగ ఆయా వరములను అనగా లౌకిక శుభములను ప్రసాదించునను విశేషార్థము చెప్పికొన్నచో మంగలదాయక వరద శబ్దముల వలన లభించు అర్థపౌనరుక్త్యమును నివారించుకొనవచ్చును. లేక మేము వరులము అని శ్రేష్ఠులము అనుకొను వారిని లయకాలమున ఖండించు వాడని ('ద'అను శబ్దమును దో అవ ఖణ్డనే అను ధాతువునుండి నిష్పన్నమొనర్చి) అర్థాంతరమును స్వీకరించి పై దోషమును వారించుకొనవచ్చును. 4. ఇంద్రాది సాధారణమైన ఈశత్వము సదాశివునిది కాదని మహేశ శబ్దములోని మహాశబ్దము వ్యంజించును. 5. సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము అను పంచకృత్యములలో అనుగ్రహం చివటిది. దాని అర్థము మోక్షము. దానిని ప్రసాదించువాడు శివుడే అని విశేష్యమైన సదాశివ శబ్దము వ్యంజించును. సదాశివానుగ్రహదా అను శ్రీ లలితా సహస్రనామ స్తోత్ర శ్లోకపాదము అనుగ్రహించుట అనగా మోక్షమును ప్రసాదించుట సదాశివుని కృత్యము

అనుటకు ప్రమాణము. 6. ఇట్లు ఈ శ్లోక విశేషణములు విశేష్యమును సాభిప్రాయము లగుటచే ఈ శ్లోకమున పరికర పరికరాంకురములను అలంకారము లేర్పడి యున్నవి. 7. కుచకుఙ్కుమ శబ్దములలో కకారావృత్తి, కుచ, అంచిత, ప్రపంచ శబ్దములలో చకారావృత్తి, ఉత్తరార్ధమున దకారావృత్తి ఈ శ్లోకమునకు వృత్త్యనుప్రాస నామక శబ్దాలంకారమును కూర్చుచున్నది. 8. త-భ-జ-జ-గ-గ- అను గణముల వరుస ఉండుటచే నీ శ్లోకము వసన్తతిలకా వృత్తమున నిబంధింపబడినది అని తెలియును.

---

**అవతారిక :-** పై శ్లోకమున శ్రీ శబ్దారంభ రూప మంగలాచరణ మొనర్పబడినది. ఈ శ్లోకమున ఈ స్తోత్ర రచనలో దురదృష్టవశమున నేర్పడు విఘ్నముల నివారణమునకై వినాయకుడు స్తుతింపబడుచున్నాడు.

**శ్లో॥ నన్దన్నన్దనమిన్దిరాపతిమనోవన్ద్యం సుమన్దాకినీ-**
**స్యన్దత్సున్దరశేఖరం ప్రభునుతమ్మన్దారపుష్పార్చితమ్।**
**భాస్వన్తం సురయామినీచరనుతం భవ్యమ్మహో భావయే**
**హేరమ్బం హిమవత్సుతామతిమహానన్దావహం శ్రీవహమ్॥ 2**

**ప్రతిపదార్థం :-** నన్దన్నన్దనమ్ = సంతోషించుకొడుకు (నన్దనవనము)గల, ఇన్దిరాపతి మనోవన్ద్యమ్ = విష్ణువుచే మనస్సున నమస్కరింపదగిన, సుమన్దాకినీ స్యన్దత్సుందర శేఖరమ్ = శోభనమైన ఆకాశగంగను చిందించు అందమైన శిరోభూషణము (జుట్టుముడి)గల, ప్రభునుతమ్ = ప్రభువులచే స్తుతింపబడు, మన్దారపుష్పార్చితమ్ = మన్దార పుష్పములచే పూజింపబడిన, భాస్వన్తమ్ = ప్రకాశించు, సురయామినీ చరనుతమ్ = దేవదానవులచే స్తుతింపబడిన, భవ్యమ్ = గొప్పనైన, మహః = కాంతియో అనదగిన, హిమవత్సుతామతి మహానన్దావహమ్ = పార్వతియొక్క బుద్ధికి మహానన్దమును కలిగించు, శ్రీవహమ్ = కాంతిని వహించు, హేరమ్బమ్ = వినాయకుని, భావయే = భావించెదను.

**తాత్పర్యము :-** శివునకు నిత్య సంతోషియైన కొడుకు (తన ప్రవేశమున అందఱును సంతోషింపజేయు నన్దనవనమే స్వయముగా సంతోషించునట్లు చేయగల) విష్ణువుచే మనస్సుననే నమస్కరింపదగిన, ఆకాశగంగను స్రవించు సున్దరకేశపాశము (కేశాలంకరణము) గల ప్రభువైన శివునిచేతను, ఇతర ప్రభువులచేతను గొప్పనైన తేజమో యనదగిన, పార్వతి బుద్ధిలో మహానన్దమును కలిగించు, కాంతిని లేక జ్ఞానమును ప్రవహింపజేయు సూర్యుడోయన్నట్లు ప్రకాశించు, వినాయకుని భావించెదను.





**వివరణ :-** 1. పద్మనాభుని సహోదరియైన పార్వతికి ముద్దులపట్టియగుటచే ఆ పద్మనాభునకు మేనల్లుడు సుతనిర్విశేషుడు నయినందున వినాయకు నాతడాశీర్వదించు చున్నను పరబ్రహ్మమగుటచే మనసున వినాయకునకు నమస్కరించుచునే యుండునని ఇందిరాపతి మనోవన్ద్యమ్ అను విశేషణములోని మనశ్శబ్దము వ్యంజించును. 2. వినాయకుడు గజముఖుడు. అవయవములలో ముఖ్యమైనది ముఖమే అయినందున వినాయకునకు సాధారణ దేవతా స్వభావమున కన్న గజస్వభావమే అధికము. దేవతలు తమ సంతోషము కొఱకు స్వర్గోద్యానమైన నందనవనమున విహరించెదరు. ఐరావతమును తన సంతోషము కొఱకే నన్దనవనమున విహరించును. కాని వినాయకుని విహారముచే నన్దనవనమే సంతోషించునని నన్దన్నన్దనమ్ అను విశేషణము వ్యంజించును. 3. శివుని శేఖరము చంద్రుడు. మన్దాకిని ఆయన శిరమునుండి ఆయన శిరమును అలంకరించు చున్నందున అదియు ఆయనకు శేఖరము. చంద్రశేఖర శబ్దమున కున్నంత ప్రాచుర్యము గంగాశేఖర శబ్దమునకు కలుగలేదు. పైగా పార్వతి ఆ గంగను సవతిగా భావించుచున్నందున శివునిపై అలక వహించినప్పుడా గంగనే ఆ పార్వతికి పాద్యముగా సమర్పించి ఆమె కోపము నుపశమింపజేయుట శివునకు పరిపాటి. శివుని కుమారుడై నందున చంద్రమన్దాకినులు వినాయకునకు శేఖరములే. మన్దాకినీ స్యన్దత్సున్దరశేఖరమ్ అను విశేషణము మన్దాకినియే స్రవించు సుందరశేఖరముగా వినాయకున కున్నదని అర్థము చెప్పుటకు వీలున్నది. కాని కేశముల నందముగా నెత్తి నడికొప్పుగా నలంకరించుకొన్నప్పుడు ఆ కేశముల కొప్పే మన్దాకినిని స్రవించుచుండును. కావున ఆ కొప్పే శేఖరము అనుట సహజసుందరముగా లభించు అర్థము. అట్టి కొప్పు బాలుర శిఖరమునకు చక్కని అలంకారముగా నుండుననుటలో ప్రసిద్ధము కూడ. ఈ అర్థము చెప్పుకొనుట చేత సవతి తల్లిని సైతము నెత్తిన పెట్టుకొని పూజించు వినాయకుడు పార్వతిపట్ల ఇంతకంటె అధికమగు గౌరవము కలిగి యుండుననుట మన్దాకినిచే వినాయకుని శిరమునకు పవిత్రత మరియు వినాయకుని శిరోగతమగుటచే మన్దాకినికి పవిత్రత మరియు వినాయకునకు శిరము ద్యులోకమనుట వ్యంగ్యములగును. తన కుంభమున నెప్పుడు నీటితో తడిపికొను గజస్వభావము కూడ ఇట సహజసుందరమైన వ్యంగ్యము. 4. ప్రభునుతమ్, సురయామినీచరనుతమ్ అను విశేషణములలో నుత శబ్దార్థ పౌనరుక్త్యమున్నది. సురాసుర ప్రభువులు సురాసురులు, ఇతర మానవాది జాతులకు చెందిన ప్రభువుల చేతను వినాయకుడు స్తుతింపబడుననుట కవికి వినాయకుని యందు గల ఆదరాతిశయమును వ్యంగ్యమొనరించు చున్నందున ఆ పౌనరుక్త్యదోషము కొంత

మరుగునపడినదని చెప్పవచ్చును. అట్లే హిమవత్సుతామతిమహానన్దావహమ్, శ్రీవహమ్ అను విశేషణములలో వహ శబ్దార్థ పౌనరుక్త్యమున్నది. రెండవ వహ శబ్దమునకు ప్రవహింపజేయు అని అర్థము జెప్పి ఆ పౌనరుక్త్యమును పరిహరింపవచ్చును. 5. భాస్వన్తమ్ అను విశేషణము వినాయకుని యందు సూర్యాభేదాధ్యవసాయమును చెప్పుటచే అతిశయోక్త్యలంకారము ఈ శ్లోకమున ఏర్పఱచుచున్నది. 6. మహాశ్శబ్దమునకు గల భవ్య విశేషణము వినాయకుని తేజము శాశ్వతమగుటచే నశాశ్వతములైన సూర్యాదుల తేజముయొక్క అభవ్యతను వ్యంజింపజేయును మరియు సూర్యాదుల తేజము హృదయగుహలో ప్రవేశింపలేక పోవుటచే అభవ్యము అని, వినాయకుని తేజము భక్తుల హృదయ గుహలలోనికి ప్రవేశించి అన్ధకారమును నశింపజేయుట చేత వినాయకుని తేజము భవ్యమని వ్యంజింపజేయును. 7. నన్దన్నన్దన మిన్దిరాపతి మనోవన్ద్యమ్, సుమన్దాకినీ స్యన్దత్సున్దర మ్మన్దార పుష్పార్చితమ్, మహానన్దావహమ్ అను పదబన్ధము లీ శ్లోకము ననుప్రాసములతో నలంకరించుచున్నవి. 8. పార్వతీమతిమహానన్దమ్ అను విశేషణములో మతి మహాశబ్దములు వ్యత్యస్తములై వినాయకుని మహామతిత్వమును స్ఫురింపజేయును.

ఈ శ్లోకమున మ-స-జ-స-త-త-గ అను గణము లుండుటచేత నేర్పడిన శార్దూల విక్రీడిత వృత్తము శార్దూల చర్మాంబర శివపుత్రత్వము నకు ఒక్కొక్కప్పుడు శార్దూల వాహనయైన పార్వతికి తగిన కుమారు దన్న భావమునకు వ్యంజకమై కవి పాటించిన వృత్తౌచిత్యమును స్ఫురింప జేయుచున్నది.

---

**అవతారిక :-** పై శ్లోకమున వినాయకుడు స్తుతింపబడినాడు. ఈ శ్లోకమున సుతుడైన అతని కౌగలించుకొనినట్లు సుతనిర్విశేషుడైన కవి తనను రక్షించుమని శివుని ప్రార్థించుచున్నాడు.

**శ్లో॥ ఆలోక్య బాలకమచఞ్చలముచ్చలత్సు -**
**కర్ణావిబోధితనిజాననలోకనం సః।**
**సామ్బస్స్వమౌలిసుభగాననపూత్కృతై స్త-**
**మాలిఙ్గయన్నవతు మామలమాదరేణ॥ 3**

**ప్రతిపదార్థము :-** ఉచ్చలత్సుకర్ణ అవిబోధిత నిజానన లోకనమ్ = బాగుగా కదులుచున్న చెవులచే తెలియరాని తన ముఖావలోకనముగల, అచఞ్చలమ్ = కదలని, బాలకమ్ = చిన్నబాలుని, ఆలోక్య = చూచి, తమ్ = అతని (వినాయకు)ని, స్వమౌలి శుభగానన





పూత్కృతైః = తన శిరమునందలి స్త్రీయొక్క ముఖముయొక్క పూత్కారములతో, ఆలిఙ్గయన్ = కౌగలించుకొనుచు, సః = ఆ, సామ్బః = శివుడు, మామ్ = నన్ను, అవతు = రక్షించుగాక, ఆదరేణ = ఆదరముతో, అలమ్ = చాలును.

**తాత్పర్యము :-** వినాయకుడు శివుని ముఖము చూచుటకు యత్నించుచున్నాడు. కాని అతని వెడల్పైన చేటల వంటి చెవులు కదులుచు వినాయకుని ముఖమును కప్పి వేయుచు అడ్డువచ్చుచున్నవి. చపలత లేని ఆ బాలుని శివుడు తన శిరమునందలి స్త్రీయొక్క ముఖము నుండి వెడలు పూత్కారములతో కుమారుని కౌగలించుకొనుచు నన్ను కాపాడుగాక! ఆదరముతో పనిలేదు.

**వివరణ :-** వినాయకుని శరీరము మిక్కిలి స్థూలము. దాని స్థూలతచేత అది కదలుట లేదు. ఆ శరీరము అచంచలతయే వినాయకుని అచంచలత. ఆ స్థౌల్యము బాల్య సహజ చాపల్యము వినాయకుని యందు లేకుండ జేసినది. శివుడు స్థాణువు అనగా కదలిక లేనివాడు. అతని కుమారుడు మాత్రమెట్లు కదలును! వినాయకుని చెవులు చేటలవలె పెద్దవి. ముఖమును కప్పివేయు నంతటి వైశాల్యము గలవి. వినాయకుడు శివుని చూచు తీవ్ర ప్రయత్నమున నిశ్చలుడయియే ఉన్నాడు. ఏమి లాభము? విఘ్నేశ్వరుని ఆ ప్రయత్నమునకు అతని చెవులే విఘ్నమును కలిగించుచున్నవి. విఘ్నమును కలిగించుటచే అవి అంతగా కదలచున్నవి ఉచ్చలించుచ్నువి. ఉన్మార్గమున చలించుచున్నవి. ఉచ్చలత్ అను శబ్దము ఈ అర్థమును వ్యంజించుచున్నది. అయినను ఆ చెవులు సుకర్ణములే. మంచి చెవులే. చెవులకు వినుటయే ముఖ్యమైన కృత్యము. ఆ కృత్యమును నిర్వహించు ఆ కర్ణములు సుకర్ణములే. చాంచల్యమే గజకర్ణ స్వభావము. అది గజముఖముయొక్క సుఖత్వమునే సూచించును. చూచుట కనుల పని. ఎవరి కన్నులకైనను చూచుటయే ముఖ్యకృత్యము. శివుని కన్నులకు ప్రస్తుతము పుత్రుడైన వినాయకుని చూచుటయే పని. ఆ శివుడు చూచుచున్నాడనియు ఆ వినాయకునకు అతని చెవులే తెలియనీకున్నవి. ఈ అవస్థయంతయు శివుడు గమనించుచునే ఉన్నాడు. కాని ఆ చెవుల చాంచల్యమును వారించుటకు పూనుకొనలేదు. సవతి కొడుకు తన పతిని చూచుచున్నాడని అప్పటికే శిరమునందలి గంగ ఆడునాగువలె పూత్కరించుచున్నది. ఆ పూత్కారములే వినాయకుని చెవులంతగా కదలుటకు కారణము లేమో? శివునకు కొడుకైన గజముఖునియందు ప్రేమ లేదా? లేకేమి? బోలెడంత యున్నది. కౌగలించు కొనవలె ననియు నున్నది. (ఆ శివుడు) ఆ పూత్కారములా వినాయకుని శరీరము నంతను తాకినవి. చెవులు తప్ప శరీరములోని ఇతర భాగమేదియు కదలలేదు. ఆ

పూత్కారములలోనే శివుడు తన బాహువులను భావించుకొని వినాయకుని కౌగలించుకొను చున్నాడు. అంతకు మించి బాహాటముగా వినాయకుని కౌగలించుకొను సాహసమును చేయలేదు. శివుడు ఆడునాగు తోడనే తన కపర్దమును చుట్టివేసినాడు. అనగా గంగ ఇంటి గోడలను (జటలను) గట్టి పఱచినాడు. గంగ అను సుభగ (ఆడుది) కు మరొక సుభగ (నాగిని)ను కాపలాపెట్టినాడు. గంగ పూత్కారమును చూచి నాగినియు పూత్కరించినది. ఆ ఇరువురును సుభగలే (ఆడువారే). జూటమున బంధించి యుంచి నాడని గంగకు కోపము. అందుకే ఆమె పూత్కారము. పార్వతి తన అర్ధ శరీరమున శివుని బంధించి యుంచినందుకును, ఆ బన్ధనమును శివుడు వీడజాలకున్నందుకును గంగ పూత్కారములు కొనసాగుచున్నవి. అట్టి కోపనను (భామినిని) గంగమ్మను నెత్తిన కట్టుకొన్నందుకు, నెత్తిన పెట్టుకొన్నందుకు పార్వతికిని శివునిపై కోపమే. ఇద్దఱాడువారిని కట్టుకొన్నందుకు శివుడు ఫలితము ననుభవించుగాక! మధ్యన వినాయకుని శివుని చూచు యత్నము నిష్ఫలమైనది. దానికిని వినాయకుడు బాగుగా కనులు తెఱచి కోపమును ప్రకటించలేదు. పాపము శివునిపై తాను కోపించిన శివుడు మరింత బాధపడునని కాబోలు వినాయకుని కను లఱమోడ్పులయియే ఉన్నవి. వినాయకుని శివుడింత ఆదరము తోడనే కౌగిలించుకొను చున్నాడని చెప్పిన కవి తన యందంత ఆదరము చూపబనిలేదని చెప్పక ఎట్లుండును? ఆదరింపక పోయిననమేమి? తనను కాపాడిన (కవికి) చాలదా? చాలును. వాక్యబహిర్భూతములుగా అలమాదరేణ అనుపదములతో శ్లోకమును ముగించుటలో ఈ శ్లోకముయొక్క సుభగత్వము, సౌందర్యము (రామణీయకము) మిక్కిలి పెరిగినది. శివుడంతటి వానికి పుత్ర వ్యామోహమే తగనిది. తాను మాత్రము వినాయకుని వంటివాడు కాదా. శివుడు తనను కౌగిలించు కొన కూడదా! అది అత్యాశయేమో! తనను రక్షించిన చాలును. ఈ అర్థమంతయు చివఱి పదములు వ్యంజించుచున్నవి. 2. అవన మనగా రక్షణము అది ప్రధానముగా మృత్యువునుండి దుఃఖమునుండి అవసరము. వినాయకునకు మృత్యువు దుఃఖమును లేవు గావున ఆయనకు ఓ శివా! నీ ఆలిఙ్గనము చాలును. నాకును నీ యాలింగనము కావలసినదే. ఆదరమున నీవు నీ కుమారుని కౌగలించుకొనవలె సుమా! ఆదరము నాపై తగ్గించినచో నేను సహింపలేను, ఎంతకాలము నుండి వినాయకుని కౌగలించుకొనుచున్నావో! తనివి తీరలేదా. మరొక కుమారుడు (కవి) అట్టి ఆదరముతో కూడిన కౌగిలింతను కోరుచు నిరీక్షించుచున్నాడని నీ మనస్సునకైన తట్టలేదా! అని ఆలింగ్య అలమ్ మామ్ ఆదరేణ అవతు అని అన్వయించి అర్థము చెప్పవచ్చును. 3. అచఞ్చల ముచ్చలత్సు నిజానన లోకనమ్ ఆలోక్యబాలకమ్



స్వమౌలి సుభగానన అను పద బన్ధములలో చకార, లకార, నకారముల పౌనరుక్త్యము ఈ శ్లోకమును వృత్త్యనుప్రాసముతో నలంకరించుచున్నది. త-భ-జ-జ-గ-గ అను గణములు ప్రతిపాదమునం దుండుటచే నీ శ్లోకము వసంత తిలకా వృత్త నిబంధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుని మౌలిపై నున్న సుభగ శబ్దమున గంగ సూచింపబడినది. ఈ శ్లోకమున శివుడు రూపింపబడు చున్నాడు.

**శ్లో॥ కణ్ఠోత్పలం విమలకాయరుచిప్రవాహ**
**మర్ధేన్దుకైరవమహం ప్రణమామి నిత్యమ్।**
**హస్తామ్బుజం విమలభూతిపరాగరీతి**
**మీశహ్రదం చటులలోచనమీనజాలమ్॥** 4

**ప్రతిపదార్థము :-** కణ్ఠోత్పలమ్ = కణ్ఠమను నల్లకలువగల, విమలకాయ రుచి ప్రవాహమ్ = స్వచ్ఛమైన శరీరకాంతి యను ప్రవాహముగల, అర్ధేన్దుకైరవమ్ = అర్ధచన్ద్రుడు అను తెల్లకలువగల, హస్తామ్బుజమ్ = చేతులు అను కమలములు గల, విమలభూతి పరాగ రీతిమ్ = స్వచ్ఛమైన విభూతి అను పుప్పొడియొక్క రీతిగల, చటుల లోచన మీనజాలమ్ = చంచలములైన కన్నులను చేపల సమూహముగల, ఈశహ్రదమ్ = శివుడను మడుగును, నిత్యమ్ = ఎల్లప్పుడు, అహమ్ = నేను, ప్రణమామి = నమస్కరించెదను.

**తాత్పర్యము :-** శివుని కంఠము నల్ల కలువ. ఆయన దేహకాంతి ప్రవాహము. ఆయన శిరమునందలి అర్ధచన్ద్రుడు తెల్లకలువ. ఆయన చేతులు కమలములు (ఎఱ్ఱనివి). ఆయన శరీరము నందలి బూడిద పూత పుప్పొడి. ఆయన కన్నులు చేపలు. కావున శివుడొక హ్రదమే అయి యున్నాడు. ఆయనకు ప్రతిదినము మ్రొక్కెదను.

**వివరణ :-** 1. అవయవులైన ఈశ హ్రదములకు అవయవములైన కంఠోత్పలాదులకు రూపణముండుటచే నీ శ్లోకమున సావయవ రూపకాలంకార మేర్పడి యున్నది. అర్ధచంద్రుడు విభూతి అవయవములు కాకున్నను అలంకారములే అయినను అవయవ నిష్ఠములై అవయవములుగా భావింపబడుట అనుచితము కాదు. 2. శివుని శరీరమున నలుపు (కణ్ఠమున), తెలుపు (ముఖ బాహ్వాదిక శరీరా వయవములందు), ఎఱుపు (హస్తములందు) చెప్పబడినందున ఆయన శరీరమును త్రిగుణాత్మక (సత్త్వరజస్తమోమయ) ప్రకృతియని వ్యంగ్యమగును. ఆయన కన్నులు మీనములు. అనగా చేపలు అవి అనిమిషములు ఱెప్పపాటు లేనివి. దేవతలు గూడ అనిమిషులు. అనగా ఱెప్పపాటు లేనివారు. ఆ కన్నులు సూర్యచన్ద్రాగ్న్యాత్మకములు. ఆ ముప్పురు దేవతలు ప్రత్యక్ష దేవతలు.

అందుచే ఆ కన్నులు తేజోమయములు. వారును సత్త్వరజస్తమోమయులే. సూర్యుడు సత్త్వము, చన్ద్రుడు తమస్సు, అగ్ని రజస్సు, కన్నుల వర్ణించు చటులలోచనమీన జాలమ్ అను విశేషణము శివుని దేహముయొక్క ప్రకృతిత్వమును ప్రత్యక్షాయమాణ మొనరించును. 3. కాయమునకు భూతికిని విమల శబ్దమునే విశేషణముగా నుండుటచే నేర్పడిన పౌనరుక్త్యము కాయము స్వచ్ఛము, భూతి ధవళమని అర్థములు చెప్పి నివారించు కొనవచ్చును. 4. ప్రథమ చతుర్థ పాదములలో లకారావృత్తి శ్లోకమున వృత్త్యను ప్రాసాలంకారమును కలిగించు చున్నది. వృత్తము వసన్తతిలకా.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కాయముయొక్క కాంతి ప్రవాహముగా రూపింపబడినది. ఈ శ్లోకమున ఆ కాయము భస్మోద్ధూలితమై ప్రవాహముచే ప్రకాశించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ రఙ్గత్తుఙ్గతరఙ్గసఙ్గతలసద్గఙ్గాఝరప్రస్ఫుర–**
**ద్భస్మోద్ధూలితసర్వకాయమమలమ్మత్తేభకృత్త్యావృతమ్।**
**ఆరూఢం వృషమద్భుతాకృతిమహం వీక్షే నితమ్బస్ఫుర–**
**న్నీలాభ్రచ్ఛురితోరుశృఙ్గమహితం తం సన్తతమ్మానసే॥ 5**

**ప్రతిపదార్థం :–** రఙ్గత్తుఙ్గ తరఙ్గ సఙ్గత లసద్గఙ్గా ఝర ప్రస్ఫురద్భస్మో ద్ధూలిత సర్వకాయమ్ = ప్రకాశించు ఎత్తైన తరంగములతో కూడిన ప్రకాశించు గంగా ప్రవాహముచే ప్రకాశించు విభూతితో బూయబడిన సర్వదేహము కల, అమలమ్ = స్వచ్ఛమైన, మత్తేభకృత్త్యావృతమ్ = మదించిన గజముయొక్క చర్మముచే చుట్టబడిన, వృషమద్భుతాకృతిమ్ = అద్భుతాకారముగల ఎద్దును, ఆరూఢమ్ = ఎక్కిన (ఆ శివుని), నితమ్బస్ఫుర న్నీలాభ్రచ్ఛురితోరు శృఙ్గ మహితమ్ = క్రింది ప్రాంతముల ప్రకాశించు నల్లని మేఘములచే ప్రకాశించిన గొప్ప శిఖరముతో కూడిన అతనిని (శివుని), మానసే = మనసునందు, సన్తతమ్ = ఎల్లప్పుడు, అహమ్ = నేను, వీక్షే = చూచెదను.

**తాత్పర్యము :–** శివుడు భస్మోద్ధూలిత విగ్రహుడు. అతని విగ్రహము గంగా ప్రవాహముచే ప్రకాశించుచున్నది. అతని నితమ్బ భాగము గజ చర్మముచే చుట్టబడి క్రింది భాగమున నీలమేఘముచే ప్రకాశించు పర్వతమో యన్నట్లున్న ఆ శివుని ఎల్లప్పుడు నా మనసున దర్శించుచున్నాను.

**వివరణ :–** ఈ శ్లోకమున శివుడు పర్వతముగా సమ్భావింపబడుటచే నుత్ప్రేక్షాలంకార మేర్పడి యున్నది. ప్రథమ పాదమున గకారావృత్తి చేత వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి



యున్నది. 2. శివుని వాహనమైన వృషభము అద్భుతాకృతి యని విశేషణోత్తర పద కర్మధారయ సమాసమున చెప్పుట విశేషము. ఇట్టి ప్రయోగము అరుదుగా చేయబడుచుండును. శార్దూల విక్రీడిత వృత్తము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు గంగా ప్రవాహ స్ఫురితుడుగా చెప్పబడినది. ఈ శ్లోకమున శివుడు గంగా ప్రవాహముగా అమ్మవారు సరస్వతీ ప్రవాహముగా స్ఫురింపజేయబడినారు.

**శ్లో॥ సితమహోజ్జ్వలమేకముపాస్మహే – విమలపాణ్డురుచిం దధదాననే।**
**ఉభయయోగమతీవ సరస్వతీ– త్రిపథగాఝరయోశ్శివయోరివ॥ 6**

**ప్రతిపదార్థం :–** ఆననే = ముఖమందు, విమల పాణ్డు రుచిమ్ = స్వచ్ఛమైన తెల్లని కాంతిని, దధత్ = ధరించుచున్న, సరస్వతీ త్రిపథగా ఝరయోః ఇవ = సరస్వతీ గంగా ప్రవాహములకు వలె, శివయోః = గౌరీ శంకరులయొక్క, సితమహోజ్జ్వలమ్ = తెలుపుతో మిక్కిలి ప్రకాశవంతమైన, ఏకమ్ = ఒక్కటైన, అతీవ = మిక్కిలి, ఉభయయోగమ్ = ఇరువురి యోగమును, ఉపాస్మహే = ఉపాసించెదము.

**తాత్పర్యము :–** ముఖమున స్వచ్ఛమైన తెల్లని కాంతిని ధరించు, ఏకమైన సరస్వతీ గంగా ప్రవాహమువలె గౌరీశంకరుల మిక్కిలి తెల్లనైన కలయికను ఉపాసించెదము.

**వివరణ :–** 1. సరస్వతీ నది తెల్లనిది. గంగయు తెల్లనిది. రెండు తెల్లని ప్రవాహములు కలసికొనునప్పుడు వాని ముందు భాగము మిక్కిలి తెల్లనై ఉండును. ఇది సిత మహోజ్జ్వలమ్ విమలపాణ్డురుచిమ్ ఆననే దధత్ పదములతో చెప్పబడినది. 2. రెండవ పాదమున శివుని శరీరమంతయు భస్మోద్ధూలితమైన పార్వతీ పరమేశ్వరులు ముఖమందలి పాణ్డురుచి ప్రత్యేకముగా చెప్పబడినది. తెల్లని విభూతి తెల్లని ఆ పార్వతీపరమేశ్వరుల ముఖములలో మరింత తెల్లదనము కొట్టవచ్చినట్లు కనబడునట్లు చేయుచున్న దనుట వ్యంగ్యము. 3. ఉత్తరార్ధమున సరస్వతీ ప్రవాహముతో పార్వతి, గంగా ప్రవాహముతో శివుడు ఉపమింపబడుటచే నుపమాలంకారమేర్పడి యున్నది. శబ్దరూపిణియైన గౌరి సరస్వతీ ప్రవాహముతో ఉపమింపబడుటచే నుపమాలంకార మేర్పడి యున్నది. శబ్దరూపిణియైన గౌరి సరస్వతీ ప్రవాహముతో ఉపమింపబడుట మిక్కిలి యుచితముగా నున్నది. గంగాధరుని తెల్లని శరీరము ఆ గంగతో తడిసి యుండును. స్వయముగా శివుని శరీరమే గంగానది కన్న తెల్లనిది. గంగయొక్క తెల్లదనము శివుని దేహముచేత, శివుని దేహము గంగా ప్రవాహముచేత పరస్పర ధావల్యము పెంచుకొన్నవి. గౌరీదేవి

ఆలింగనముచే ఆ రెండు తెలుపులకు మరొక తెలుపు జత చేయబడినది. పార్వతీ పరమేశ్వరులు దేహ ధావల్యము వాచ్యము కాగా, శివుని దేహమున కుపమానమైన గంగా ప్రవాహధావల్యము అర్థాక్షిప్తమైనది. 4. న-భ-భ-ర గణములు ప్రతిపాదమున గల ఈ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్తము. ప్రవాహములలో ద్రుతత్వము (శీఘ్రత్వము), విలమ్బితత్వ (మన్దత్వ)ము ఉండును. అట్టి ప్రవాహముల వంటి వారు పార్వతీ పరమేశ్వరులని చెప్పు నీ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్తమున నిబంధింపబడుటలో వృత్తౌచిత్యము ప్రస్ఫుటమగుచున్నది. మరియు స్త్రీ కావున పార్వతీ గమనము మన్ద (విలమ్బిత) గమనమని పురుషుడైన శివుని గమనము శీఘ్ర (ద్రుత) మని వృత్తౌచిత్యముచే లభించు మరొక విశేషము సహృదయాహ్లాదముగా నున్నది.

---

**అవతారిక :-** పై శ్లోకమున గౌరీశంకరుల ధవలతల యోగము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున ధవలతతో పాటు రక్తపాణ్డు వర్ణములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ లాలాటలోచనపురస్స్ఫురణాతిరక్తం**
**యామ్యే దిశి ప్రధవలావృతభూనభోన్తమ్।**
**చిత్రం ధనేశకకుబన్తవిజృమ్భిపాణ్డు**
**పశ్చాత్స్మరామి ఘనవేణివినీలమోజః॥** 7

**ప్రతిపదార్థము :-** లాలాట లోచన పురస్స్ఫురణాతి రక్తమ్ = ఫాలాక్షియొక్క ముందు (తూర్పు) భాగమున ప్రకాశించుట చేత మిక్కిలి ఎఱ్ఱనైన, యామ్యే = యమునికి సంబంధించిన, దిశి = దిక్కునందు (దక్షిణమున), ప్రధవలావృత భూనభోన్తమ్ = మిక్కిలి తెలుపుతో కప్పబడిన భూమ్యాకాశములయొక్క ప్రాన్తములు గల, ధనేశ కకుబన్త విజృమ్భి పాణ్డు = కుబేర దిక్కు (ఉత్తరము) యొక్క అన్తము వఱకు విజృంభించు తెలుపుగల, పశ్చాత్ = వెనుక (పడమట), ఘనవేణి వినీలమ్ = గొప్పలేక మేఘమువంటి జడచే మిక్కిలి నల్లనైన, ఓజః = తేజమును, స్మరామి = స్మరించెదను.

**తాత్పర్యము :-** గౌరీశంకరులు ప్రాఙ్ముఖులై యున్నారు. ఇరువురు తెల్లవారైనందున దక్షిణోత్తర దిక్కులు రెండును తెల్లబారి యున్నవి. శివునినొసటి కన్ను ఎఱ్ఱని దగుటచే తూర్పు దిక్కు అనగా శివుని ముందు భాగము ఎఱ్ఱబారి యున్నది. గౌరి వెనుక భాగము అనగా పడమటి దిక్కు నల్లబారియున్నది. వర్ణవైవిధ్యముగల ఆ గౌరీ శంకరుల తేజమును స్మరించెదను.



**వివరణ :-** 1. ప్రకృతిలోని రంగులు అనేకములు. వానిలో ఏడు వర్ణములు ఇంద్రధనువులో కనిపించును. అవియే ప్రధానములు. అవి యన్నియు కలిసినచో తెలుపు ఏర్పడును. ఏ రంగు లేకపోవుట నలుపు అని చెప్పబడవలెను. ఈ తెలుపు నలుపులు పగలు రాత్రియందు విజృంభించి యుండును. ఆ రాత్రింబవళ్ళు మధ్య సంధికాలమున ఎఱుపు విజృంభించును. కావున వర్ణములలో నీ మూడే అత్యధిక ప్రాధాన్యము కలవై సర్వకాలములలో ప్రకృతిపై అధికారమును కలిగియున్నవి. అందుచేతనే ఉపనిషత్తులు ప్రకృతిని లోహిత శుక్ల కృష్ణామ్ అని వర్ణించినవి. ఇవి ఆ ప్రకృతిలోని గుణములైన రజస్సత్త్వతమస్సులకు సూచకములై ప్రకృతియొక్క త్రైగుణ్యమును స్పష్టీకరించుచున్నవి. ఈ శ్లోకమున నాలుగు దిక్కులలో దక్షిణోత్తర దిక్కులు రెండింటిని తెలుపే వర్ణింపబడుటకు, నాలుగు దిక్కులలో మూడు రంగులే వర్ణింపబడుటకు, ప్రకృతిలోని ఈ మూడు రంగులు అత్యధిక ప్రాధాన్యమే కారణము. 2. ఈ శ్లోకమున రేఫవర్ణావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి యున్నది. 3. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణము లున్నందున ఈ శ్లోకముయొక్క వృత్తనామము వసంత తిలకా.

---

**అవతారిక :-** పై శ్లోకమున గౌరీశంకరుల ధవళవర్ణము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున వారి నివాసము తెల్లని కైలాసపర్వతముయొక్క గుహయందే అని చెప్పబడుచున్నది.

**శ్లో॥ భవ్యచన్ద్రకృశానుభాస్కరలోచనం భవమోచనం**
**వారిజోద్భవవాసవాదికరక్షణం గజశిక్షణమ్।**
**మన్దిరాయితరాజతాచలకన్దరం ఘనసున్దరం**
**భావయామి దయాభినన్దితకిఙ్కరం హృది శఙ్కరమ్॥** 8

**ప్రతిపదార్థము :-** భవ్యచన్ద్ర కృశాను భాస్కర లోచనమ్ = గొప్పనైన చన్ద్రుడు, అగ్ని, సూర్యుడు కన్నులుగాగల, భవమోచనమ్ = సంసారము నుండి విడిపించునట్టి, వారిజోద్భవ వాసవాదిక రక్షణమ్ = బ్రహ్మ ఇన్ద్రుడు మొదలగు వారిని రక్షించునట్టి, గజశిక్షణమ్ = గజ (రాక్షసు)ని శిక్షించునట్టి, మన్దిరాయిత రాజతాచల కన్దరమ్ = ఇల్లుగా చేసికొనబడిన కైలాస గుహగల, ఘనసున్దరమ్ = గొప్ప సౌందర్యముగల, దయాభినన్దిత కిఙ్కరమ్ = దయచేత ఆనందింపజేయబడిన సేవకులు గల, శఙ్కరమ్ = శివుని, హృది = హృదయమున, భావయామి = భావించెదను.

**తాత్పర్యము :-** చన్ద్రసూర్యాగ్నులు కన్నులుగా గల, సంసార బన్ధమునుండి జీవుల విడిపించునట్టి, బ్రహ్మేంద్రాదుల రక్షించునట్టి, గజాసురుని శిక్షించునట్టి, కైలాస గుహను

మన్దిరముగా చేసికొన్నట్టి, గొప్ప సౌన్దర్యము గలిగినట్టి, దయచే సంతోషింపజేయబడిన సేవకులు గల శఙ్కరుని హృదయమున భావించెదను.

**వివరణ :–** 1. శివుని ఎడమకన్ను చన్ద్రుడు, కుడి కన్ను సూర్యుడు, నొసటి కన్ను అగ్ని, నొసటి కంటిని శివుడెప్పుడు మూసి యుంచునని ప్రలయకాలముననో, లోకమున అకాల ప్రలయము సృష్టించు రాక్షసులు (త్రిపురాదులు) గో భూదేవ దేవతాదుల పీడించు నప్పుడో, శివుడు దానిని తెఱచును. శివుని ముఖము కూడ అగ్నియే, దేవతలందఱు అగ్నిముఖులే, అగ్నిలో ముఖము నందువలె ఆహారమును ఆజ్యాహుత్యాది రూపమైన దానిని యజమానులు వ్రేల్చినప్పుడు అగ్ని ఆ ఆహుతులను సర్వదేవతల కందించును. ఇక శివుడు దేవుడని సామాన్యముగా అనుటయేమి? మహాదేవుడే అనబడునుగదా. ఆయన కూడ అగ్నిముఖుడే. అగ్నిర్ముఖమిత్యాది వాక్యములు విరాట్పురుషు డగ్ని ముఖుడని చెప్పుచున్నవి. శివ పారమ్య వాదమున శివుడే విరాట్పురుషుడు. కావున శివుడగ్ని ముఖుడే. ఆజ్యాహుత్యాదులను స్వీకరించి అగ్ని తత్తద్దేవతోచితమైన ఆహారముగా మార్చి సర్వదేవతల కొసగును. మనము ముఖమున స్వీకరించిన ఆహారమును జఠరాగ్ని పచన మొనర్చి తత్తద్దేవతలకు అనగా చక్షురాది సర్వేంద్రియములకు, సర్వావయములకు తగిన శక్తిని ప్రసాదించును. ఆ జఠరాగ్ని రూపుడు శివుడే. అగ్నిరూపత రుద్రాధ్యయమున స్పష్టముగానే చెప్పబడినది. శివునినొసటి కంటిలోని అగ్నిదీర్ఘవర్తుల దీపాకారమని యోగ గ్రంథములలో సూచింపబడినది. జీవులు యోగాభ్యాసము లొనరించి తద్దీపాగ్నిని దర్శించుట శివుని దర్శించుటయేయని వారి యుద్దేశము. 2.శ్లోకారమ్భ మందలి భవ్య విశేషణమంత భవ్యముగా శ్లోకమునకు సౌన్దర్యము కలిగించునని చెప్పలేక పోయినను భవమోచన శబ్దాది భకారముతో వర్ణమైత్రి నొంది శ్లోకమున వర్ణ రామణీయకమును కలిగించుచున్నదని చెప్పవచ్చును. అట్లే మొదటి పాదమున భకారము వలె రెండవ పాదమున వారిజోద్భవ వాస వాదికేత్యాది సమాసమున వకారము వర్ణమైత్రితోపాటు వృత్త్యనుప్రాసాలంకారమును కల్గించుచున్నది. నాలుగు పాదముల యందును పదాన్తాను ప్రాసము లున్నవి. ర–స–జ–జ–భ–ర గణములు గల మత్తకోకిలా వృత్తమిది.

---

**అవతారిక:–** పై శ్లోకమున వారిజోద్భవ వాసవాదిదేవ ప్రభువుల శివకృత రక్షణము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున శివ ప్రపూజనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనేకరూపాభిరచఞ్చలాభిః – సమాధినిష్ఠా సరసాన్తరాభిః।**
**ప్రతిక్షణం సత్రపమదావలీభిః – ప్రపూజ్యమానం ప్రభుమాశ్రయేఽహమ్॥9**



**ప్రతిపదార్థము :–** అనేక రూపాభిః = అనేక రూపములుగల, అచఞ్చలాభిః = నిశ్చలముగా నున్నట్టి, సమాధినిష్ఠా = ఏకాగ్రతగల, సరసాన్తరాభిః = సరసమైన అన్తరఙ్గముగల, సత్రపమదావలీభిః = ఉత్తమ (దేవతా) స్త్రీ సముహములచేత, ప్రతిక్షణమ్ = ప్రతిక్షణము, ప్రపూజ్యమానమ్ = బాగుగా పూజింపబడుచున్న, ప్రభుమ్ = ఈశ్వరుని, అహమ్ = నేను, ఆశ్రయే = ఆశ్రయించెదను.

**తాత్పర్యము :–** అనేక విధములైన రూపములు గల, నిశ్చలముగా (కూర్చొని) ఉన్నట్టి, ఏకాగ్రతతో కూడిన సరసమైన అన్తరఙ్గముగల ఉత్తమ (దేవతా) స్త్రీలచేత ప్రతిక్షణము బాగుగా పూజింపబడుచున్న ఈశ్వరుని ఆశ్రయించెదను.

**వివరణ :–** 1. సాధారణముగా దేవతల రూపము ధవలమై ఉండును. కాని ఇన్ద్రుడు నల్లనివాడని కొందఱు చెప్పెదరు. నల్లని మణుల నింద్ర నీలములని (ఇంద్రుని వర్ణము నీలము) వ్యవహరించెదరు. దేవతలలో అగ్ని లోహిత (ఎఱుపు) వర్ణము గలవారు 'యదగ్నే లోహితం రూపమ్' అనుశ్రుతి అగ్ని వర్ణము లోహితమనుటకు ప్రమాణము. యముడును నల్లని వర్ణము కలవాడే. వారి భార్యల వర్ణములు మెఱుపుతీగ వన్నెలు కావచ్చును. రూపము అను పదమునకు రంగు అను అర్థముతో పాటు ఆకృతి అను అర్థము కూడ వ్యవహారమున నున్నది. కావున వారి రంగు మాట ఎట్లున్నను వారి ఆకృతులు వారి భర్తల ఆకృతులకు అనురూపములు గానే ఉండి యుండును. కావుననే కవి దేవతా స్త్రీల ననేక రూపులని చెప్పుచున్నాడు. 2. మెఱుపు తీగకు చఞ్చల అని పేరున్నది. మెఱుపు తీగ లొక క్షణము మాత్రమే కనబడి మాయమగు చుండుటచే వానికి చఞ్చలానామము సార్థకము. అచఞ్చలాభిః అను పదము నిశ్చలముగా నున్న మెఱుపు తీగలవంటి వారా దేవతా స్త్రీలని వ్యంజించుచున్నది. 3. సమాధి నిష్ఠలైన ఆ దేవతా స్త్రీలు సరసాన్తరఙ్గలట. సాధారణముగా ప్రణయముగల హృదయము సరసాన్తరఙ్గ మనబడుట లోకసిద్ధము. ఇచట దేవతాస్త్రీలు అవివాహితులై శివుని కామించుచు ప్రణయముగల అన్తరఙ్గము కలిగియున్నారని చెప్పుట కవకాశము కలదు. లేక రసమనగా శృఙ్గరాతిరిక్తమైన ఆత్మయని **'రసో వై సః'** అను ఉపనిషద్వాక్యము ననుసరించి చెప్పవచ్చును. అప్పుడు వారి అన్తరఙ్గముల రసమని చెప్పబడు మహానన్ద రూపమైన ఆత్మయందు లగ్నములై యున్న వనియు చెప్పుట కవకాశము కలదు. అవివాహితులు గాని, వివాహితలు గాని అందఱకును శివుడు ప్రభువే, ఆరాధ్యుడే అనుటలో వివాదము లేదు. సమాధినిష్ఠచే సరసమైన అన్తరఙ్గము కలవారను అర్థమున సమాధినిష్ఠా సరసాన్త రాభిః అను విశేషణము చెప్పును. కామినుల సమాధిలో ప్రియుడు. భక్తులు లేక

యోగులసమాధిలో ఆత్మరూప శివుడే ఉండుననుట నిర్వివాదము. ఇచట ఉపయోగింప బడిన శివశబ్దము పరమాత్మ వాచకమే కాని శివవిష్ణ్వాది రూపభేదమును ప్రతిపాదించు వివక్షలేనిది అని గమనించుట అవసరము. 4. సత్ప్రమదావలీభిః అను సమాసమునందలి సత్ శబ్దము ఆ ప్రమదల దేవతాత్వమును గూడ చెప్పును. ఆ ప్రమదలు ముదితలని సరస శబ్దము వ్యంజించును. ఎప్పుడును సురాపానముచే మిక్కిలి మదముగల స్త్రీలు అను అర్థము నిచ్చు ప్రమదా శబ్దము సత్ శబ్దమున విశేషింపబడుటచే ఇట ప్రమదా శబ్దము సాధారణ స్త్రీ వాచకమని గమనింపవలసి యున్నది. 5. ప్రతిక్షణమ్ ప్రపూజ్యమానమ్ అను పదములు ఆ దేవతా స్త్రీల శివపూజయొక్క నైరంతర్యమును, ఔత్కృష్ట్యమును ప్రతిపాదించుచున్నవి. 6. ప్రథమ పాదమున అకారాది పదములు, ద్వితీయ పాదమున సకారావృత్తిగల సమాసము, మొత్తము పూర్వార్ధమున రేఫ, సకారావృత్తిచే, ఉత్తరార్ధము ప్రశబ్దావృత్తి, మొత్తము శ్లోకమున నక్షరరమ్యతను కలిగించుచున్నది. జ–త–జ–గ–గ అను గణములు ప్రతిపాదమున నున్న ఈ శ్లోకము ఉపేన్ద్రవజ్రా వృత్తమున నిబన్ధింపబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని పూజ్యమానతా గుణము చెప్పబడినది. ఈ శ్లోకమున స్వచ్ఛతా కరుణాదిగుణములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ లలితం శరదభ్రశుభ్రదేహం – కరుణాపాఙ్గతరఙ్గరఙ్గదీక్షమ్।**
**పరిశీలితవేదసౌధమోదం – కలయే(ఽ)కిఞ్చిదవార్యధైర్యమోజః॥ 10**

**ప్రతిపదార్థము :–** లలితమ్ = సున్దరమైనట్టి, శరదభ్రశుభ్రదేహమ్ = శరత్కాలపు మేఘమువలె తెల్లని శరీరముగల, కరుణాపాఙ్గ తరఙ్గ రంగ దీక్షమ్ = కరుణా కటాక్ష తరఙ్గ రఙ్గమున దీక్షగల, పరిశీలిత వేదసౌధ మోదమ్ = పరిశీలింపబడిన వేదమను భవనముయొక్క సంతోషముగల, (అ) కించిత్ = గొప్పనైన (లేక) కిఞ్చిత్ = ఒకానొక, అవార్య ధైర్యమ్ = వారింపరాని ధీరతగల, ఓజః= తేజమును, కలయే = ధ్యానించెదను.

**తాత్పర్యము :–** సుందరమైన శరత్కాల మేఘమువలె తెల్లనైన, దయతో కూడిన క్రీగంటి చూపు తఱగ అను రఙ్గమున దీక్షగల, పరిశీలింపబడిన వేదమను భవనముయొక్క సంతోషముగల, వారింపరాని ధైర్యముగల ఒకానొక తేజమును ధ్యానించెదను.

**వివరణ :–** ప్రథమ పాదము భ్రావృత్తి, ద్వితీయ పాదము ఙ్గావృత్తి, తృతీయ పాదమున దావృత్తి, చతుర్థ పాదమున ర్యావృత్తి ఉండుటచే శ్లోకము వృత్త్యనుప్రాస సున్దరమైనది. దేహము శరత్కాలమేఘమువలె శుభ్రమైన దనుటచే మొదటి పాదమున ఉపమాలంకార



మున్నది. మూడవ పాదమున వేదసౌధముతో రూపింపబడుటచే రూపకాలంకారమేర్పడి యున్నది. నాల్గవ పాదమున తేజము కిఞ్చిత్ అనగా ఒకానొక అని విశేషింపబడినందు వలన ఆ తేజముయొక్క అనిర్వాచ్యత వ్యంగ్యమగును. ఇది అర్ధసమవృత్తములలో చేరిన వృత్తము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివతేజమొకటి వర్ణింపబడినది. ఈ శ్లోకమున శివపాదద్వయము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ సరసిజభవముఖ్యైస్సాదరం పూజితాభ్యాం**
**మణియుతఫణిరూపైర్నూపురైరాజితాభ్యామ్।**
**సతతనతజనాలీసర్వసమ్పత్ప్రదాభ్యాం**
**బహుమతిహృదయమ్మే భావుకం శ్రీపదాభ్యామ్॥ 11**

**ప్రతిపదార్థము :–** సరసిజ భవ ముఖ్యైః = బ్రహ్మాదుల చేత, సాదరమ్ = సాదరముగా, పూజితాభ్యామ్ = పూజింపబడిన, మణియుత ఫణిరూపైః = మణులతో కూడిన సర్పరూపములైన, నూపురైః = అందెల చేత, రాజితాభ్యామ్ = ప్రకాశింపబడిన, సతతనత జనాలీ సర్వ సమ్పత్ప్రదాభ్యామ్ = ఎల్లప్పుడు నమస్కరించు జనసమూహములకు సర్వసంపద నొసగు, శ్రీ పదాభ్యామ్ = పూజ్యపాదముల కొఱకు, మే = నాయొక్క, బహుమతిహృదయమ్ = బహుమానము గల మనస్సు, భావుకమ్ = భావించునదై (అస్తి = ఉన్నది.)

**తాత్పర్యము :–** బ్రహ్మాదులచే పూజింపబడిన, మణియుక్త సర్పములే నూపురములుగా ప్రకాశించు, ఎల్లప్పుడు నమస్కరించువారి సమూహములకు సర్వసంపదల నొసగు శివుని శ్రీపదముల యందు గౌరవముగల నా హృదయము ఆసక్తమైయున్నది.

**వివరణ :–** ప్రథమ చరణ ప్రథమార్ధము జసావృత్తి చేత, ద్వితీయ చరణ ప్రథమార్ధమున సరణావృత్తి చేత, తృతీయచరణ ప్రథమార్ధమున సతావృత్తిచేత, చతుర్థ చరణ ప్రథమార్ధమున హోవృత్తిచేత వృత్త్యనుప్రాసము, ప్రథమ ద్వితీయార్ధము లందు పాదాన్తానుప్రాసము చేతను శ్లోక మలంకరింపబడి యున్నది. దాక్షిణాత్యరీతి 1–9 వర్ణములకు మైత్రి 1,3,4 పాదములలో పాటింపబడినది. న–న–మ–య–య అను గణములు ప్రతిపాదమున నుండుటచే నీ శ్లోకము మాలినీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివపాదములందు కవిగత (రతి) భావము ప్రకటింపబడినది. ఈ శ్లోకమున వానియందు కవియొక్క నతి చెప్పబడుచున్నది.

**శ్లో॥ విపులతరవిభాభ్యాం విశ్రుతప్రాభావాభ్యాం**
**ప్రమథగణనుతాభ్యాం ప్రస్ఫురద్యావకాభ్యామ్।**
**త్రిభువనవిదితాభ్యాం దివ్యపుష్పార్చితాభ్యాం**
**శివవరచరణాభ్యాం సిద్ధిదాభ్యాం నమోఽస్తు॥ 12**

**ప్రతిపదార్థము :–** విపులతర విభాభ్యామ్ = మిక్కిలి విశాలమైన కాంతిగల, విశ్రుత ప్రాభవాభ్యామ్ = ప్రసిద్ధమైన వైభవముకల, ప్రమథగణనుతాభ్యామ్ = ప్రమథగణములచే స్తుతింపబడిన, ప్రస్ఫురద్యావకాభ్యామ్ = ప్రకాశించు లత్తుక గల, త్రిభువన విదితాభ్యామ్ = మూడు లోకములలో తెలియబడిన, దివ్య పుష్పార్చితాభ్యామ్ = దివ్య పుష్పములచే అర్చింపబడిన, సిద్ధిదాభ్యామ్ = సిద్ధినొసగు, శివవర చరణాభ్యామ్ = శివ ప్రభువుయొక్క చరణముల కొఱకు, నమః= నమస్సు, అస్తు = అగుగాక.

**తాత్పర్యము :–** మిక్కిలి విశాలమైన కాంతిగల, ప్రసిద్ధమైన వైభవముగల, ప్రమథ గణములచే స్తుతింపబడిన, ప్రకాశించు లత్తుకగల, త్రిభువనములలో తెలియబడిన దివ్య పుష్పములచే అర్చింపబడిన, సిద్ధిని ప్రసాదించు శివ ప్రభు చరణములకు నమస్సు.

**వివరణ :–** 1. మాలినీ వృత్తమున నిబన్ధింపబడిన ఈ శ్లోకమున నాలుగు పాదములలో దాక్షిణాత్యమై 1–9 వర్ణములకు మైత్రి పాటింపబడి శ్లోకమున కక్షరరమ్యతను కలిగించుచున్నది. 2. శ్లోకమున చివఱి సిద్ధిదాభ్యామ్ అను పదము అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అను అష్టసిద్ధులను, ఆత్మజ్ఞానము అను మహాసిద్ధిని మరియు కైవల్య రూప మోక్షము అను అంతిమసిద్ధిని ప్రసాదించు నట్టివి అను అర్థ విశేషముచే శివుని చరణములను విశేషింపజేయును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ పాదద్వంద్వమున నమస్సు చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని ధ్యానము చెప్పబడుచున్నది.

**శ్లో॥ తుఙ్గాన్తరఙ్గఘనగాఙ్గతరఙ్గసాఙ్గ–**
**శృఙ్గారసఙ్గతమహోల్లసదుత్తమాఙ్గమ్।**
**అఙ్గీకృతాఙ్గభవభఙ్గమసఙ్గలిఙ్గ–**
**సఙ్గీతమీశమనిశం కలయామి చిత్తే॥ 13**



**ప్రతిపదార్థము :–** తుఙ్గాన్తరఙ్గ ఘన గాఙ్గ తరఙ్గ సాఙ్గ శృఙ్గారసఙ్గత మహోల్లస దుత్తమాఙ్గమ్ = ఉన్నతమైన అంతరఙ్గముగల, గొప్ప గంగా తరంగములతోడి సాంగ శృంగార రసముతో కూడిన మిక్కిలి ప్రకాశించు శిరముగల, అఙ్గీకృతాఙ్గ భవభఙ్గమ్ = అంగీకరింపబడిన మన్మథుని వినాశముగల, అసఙ్గలిఙ్గ సఙ్గీతమ్ = సఙ్గ రాహిత్యము చిహ్నముగా గల వారి (సన్యాసుల) చేత మిక్కిలి స్తుతింపబడిన, ఈశమ్ = శివుని, అనిశమ్ = ఎల్లప్పుడు, చిత్తే = మనమున, కలయామి = ధ్యానించెదను.

**తాత్పర్యము :–** శివుని తలపై గంగ ఉన్నది. ఆమె అన్తరఙ్గము మిక్కిలి ఉన్నతమైనది. ఆమె తరంగములతో సాంగశృఙ్గార రసముతో ఆ తల సఙ్గతమై యున్నది. ఆ శివుడు మన్మథుని వినాశము నంగీకరించిన వాడు. సఙ్గరాహిత్యము చిహ్నముగా గల సన్యాసుల చేత అతడు స్తుతింపబడి యున్నాడు. అట్టి శివుని హృదయమున నిలుపుకొందును.

**వివరణ :–** శివుడు మన్మథుని నశింపజేసినవాడు. ఆ అంశమీ శ్లోకమున అంగభవుని వినాశము నంగీకరించుటగా చెప్పబడినది. అంగభవ శబ్దమునకు మన్మథుడను అర్థముతో పాటు కుమారుడను అర్థమున్నది. సమస్తలోకము లందలి ప్రాణులందఱకును శివుడు తండ్రియే కావున మన్మథుడును అతని కుమారుడే. అంగభవ శబ్దమునందలి అంగశబ్దము స్థూలసూక్ష్మకారణ శరీరములను మూడింటిని బోధించును. అజ్ఞానము కారణ శరీరము అనబడును. అజ్ఞానము నుండియే కామము జనించును. కావున అజ్ఞానాంగము నుండి అనగా కారణ శరీరమైన అజ్ఞానము నుండి పుట్టు కాముడు అంగభవుడు. సూక్ష్మశరీరము ప్రాణేంద్రియ సఙ్ఘాతము. ఇంద్రియములలో మనస్సు ముఖ్యము. దానికి అన్తరఙ్గము అను పేరు ప్రసిద్ధము. అట్టి అన్తరఙ్గమున కామము పుట్టును. కావున కాముడు అం (సూక్ష్మాన్తరం)గ భవుడు. శివుడు స్థూల శరీరము బ్రహ్మాండము. అది సమష్టి శరీరము జీవుల శరీరములన్నియు వ్యష్టులే. మన్మథుడు కూడ జీవుడు. శివుడు జీవ సమష్టియగు ఈశ్వరుడు. కావున జీవుడైన మన్మథుని శరీరము కూడ వ్యష్టియే. సమష్టివ్యష్టులకు అభేద సంబంధముతో పాటు కార్యకారణ సంబంధము (పితాపుత్ర సంబంధము) అంగీకరింపబడును. అద్వైత సిద్ధాంతమున జన్యజనకములకు కార్యకారణములకు అభేదసంబంధము అంగీకరింపబడును. మన్మథుడు శివుని స్థూలశరీరమైన బ్రహ్మాండ రూపమైన అంగమున పుట్టినవాడు. కావున అతడు అంగభవుడు. లయము ఈశ్వర కృత్యము. సృష్టియు ఈశ్వరకృత్యము కావున ఈశ్వరుడైన శివునకు సమస్త జీవులు అంగభవులే. వారి భంగము కూడ ఆయనకు అంగీకార్యమే, అనుటయు ఈ విశేషణముచే వ్యంగ్యము. ఈ దృష్టిలో మన్మథుని చంపుట (లయమొనర్చుట) ఈశ్వరుడైన శివుని

సాధారణ కృత్యమే. కావున విశేషముగా చెప్పదగినది కాదు కాని విశేషముగా చెప్పబడినది. కావున ఇది ఆ శివుని అవతారలీల యగుచున్నది. మన్మథుడు శివునిపై (పుష్ప) బాణప్రయోగము చేసి అపరాధియైనాడు. అతనిచే శిక్షింపబడినాడు. పార్వతిచే సృష్టింపబడినందున తనకును కుమారుడేయైన వినాయకుని ఉత్తమాంగమునే (తలనే) ఖండించి అతని భంగము నంగీకరించిన వాడు అను నర్థమును కూడ ఈ విశేణము వ్యంజించును. అంగీకృతాంగ భవభంగ శబ్దమును అంగీకృతాంగ – భవభంగ అని విభజించి ఉపాసకుల భవభంగ మొనర్చుటకు శివుడు అంగీకృతాంగుడైనాడు. అనగా శరీరము స్వీకరించినాడు అనియు అర్థాంతరము చెప్పవచ్చును. 2. అంగభవ భంగము నంగీకరించిన శివుడు కామినియైన గంగను తలపైకి ఎక్కించుకొనుటయేమి? పార్వతికి శరీరార్థము నొసగుట యేమి? ముందుగా గంగను తలపైకి ఎక్కించుకొన్న పిమ్మటనే శివుడు పార్వతి నర్థాంగముగా చేసికొన్నాడు. శ్రీమద్రామయణమున ఈ కథ స్పష్టముగా నున్నది. గంగకు తన జన్మస్థానమైన విష్ణుపదము మఱపునకు రాక ఆమె అంతరంగమున నెప్పుడు నుండును. అందుచే గంగ ఇట తుంగాంతరంగ అని చెప్పబడినది. ఆమె తరంగములు కూడ తుంగాంతరంగములే. అం నిర్గుణమైన పరమాత్మను సముద్రతుల్యమును తరంగింప జేయునది అనగా తరంగముగా (అంశముగా జీవునిగా) జేయునది కావున మనస్సునకు అంతరంగమను పేరు సార్థకముగానే ఉన్నది. అకారము విష్ణువునకు, శివునకు వాచకమే. కావున తుంగులని చెప్పదగిన వారిరువురి యందు పుట్టిన మెట్టిన కారణముచే ఆమె అంతరంగమున ఆ (శివుడు లేక విష్ణువు) ను ధరించి ఉండును. కావున గంగ తుంగాంతరంగయే. ఆమె తరంగ సంగముచే శివుని ఉత్తమాంగమే శృంగార సంగతమై యున్నది. శివుడు తలనిండ శృంగారరసమే తరంగిత మగుచున్నది. శివుని శరీరమున ఆయన తల తుంగ స్థానమున ఉన్నది. కావున శివుని అంతరంగముననే కాక ఉత్తమాంగమున కూడ ఆమె ప్రేమ తరంగములే పొంగుచున్నవి. శివుడు తనను ఉత్తమాంగమున ధరించి హిమవత్పుత్రికలైన గంగా పార్వతులతో తన జ్యేష్ఠాత్వము నంగీకరించి నందుకా గంగ అంతరంగమున శృంగార రసము తరంగిత మగుచున్నది. ఈ అర్థమంతయు ఈ శ్లోకముయొక్క పూర్వార్థమున వ్యంగ్యమగుచున్నది. 3. సన్యాసు లింగములు కాషాయ దండములనుట బాహ్య దృష్టి. వాస్తవమునకు అసంగమే వారి ముఖ్య అంగము. అన్నింటి సంగము వీడిన వారు కూడ స్వాత్మయైన శివుని సంగము వీడజాలరు. వారి కాయన యందుండు ప్రేమ యట్టిది. అట్టి అసంగులను సైతము ఆకర్షించగల ప్రేమకు కేంద్రమైన వాడు శివుడు. శివుని తమ ఆత్మగా భావించు





సన్యాసుల ప్రేమకు శివుడు గాక మఱొకడు కేంద్రమెట్లు కాగలడు? (దు). అసజ్గత అనగా సర్వ ప్రపంచ భోగము నందాసక్తి. అది ఐహ లౌకికము కాని పారలౌకికము కాని ఏ భోగమునందును ఆసక్తి లేకపోవుటయే అసంగత. అట్టి అసజ్గుడు ఆనంద పారవశ్యమున ఉహా ఉహా ఉ అని పాడుకొనుచుండును. ఆ ఆనంద సంగీత ధ్వని శివుని రూపమే అను అర్థాంతరమును అసంగ లింగసంగీత శబ్దము స్ఫురింపజేయును. 4. మొత్తము శ్లోకమున జ్గావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. ప్రతిపాదమున త–భ–జ–జ–గ–గ అను గణము లుండుటచే నీ శ్లోకము వసంత తిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున గంగ శివుని ఉత్తమాంగ సంగగా చెప్పబడినది. ఈ శ్లోకము అతని అధోవయవములైన పాదములందు నూపురములైన సర్పముల సంగము చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిత్యమ్ప్రభఞ్జనసుజీవనపుఞ్జమఞ్జు–**
**మఞ్జీరరఞ్జితతరం పురభఞ్జనస్య।**
**కఞ్జాతసఞ్జయధురన్ధరమఞ్జసా న–**
**స్సఞ్జీవనం భవతు సన్తతమంఘ్రియుగ్మమ్॥ 14**

**ప్రతిపదార్థము :–** ప్రభఞ్జన సుజీవన పుఞ్జ మఞ్జుమఞ్జీర రఞ్జిత తరమ్ = వాయువు జీవనమైన వాని (సర్పముల) సమూహము అందమైన నూపురత్వము నొందగా మిక్కిలి ప్రకాశించు, కఞ్జాత సఞ్జయ ధురన్దరమ్ = కమలముల జయించు భారమును మోయు, పురభఞ్జనస్య = శివునియొక్క, అంఘ్రియుగ్మమ్ = పాదద్వంద్వము, అఞ్జసా = శీఘ్రముగా, నః =మాకు, నిత్యమ్ = ఎల్లప్పుడు, సన్తతమ్ = ఎడతెగకుండ, సఞ్జీవనమ్ = రక్షకము, భవతు = అగుగాక!

**తాత్పర్యము :–** సర్ప మంజీరములు గల కమలముల జయించునట్టి శివుని పాద యుగ్మము మాకు జీవనమగు గాక!

**వివరణ :–** సర్పమనుటకు బదులుగా ప్రభఞ్జన సుజీవన మనుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్యాలంకార మేర్పడి యున్నది. ఞ్జావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మను శబ్దాలంకార మేర్పడియున్నది. వృత్తము వసంత తిలకా.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని పదయుగ్మము భక్తులైన తమకు సంజీవనమని చెప్పబడగా నీ శ్లోకమున నది ఏకవచనమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ మన్మహే మన్మనోదేశే – తత్పదం పరమేశితుః।**
**యత్సదా వేదవేదాన్త – ప్రతిపాదితవైభవమ్॥ 15**

**ప్రతిపదార్థము :–** యత్ = ఏది, సదా = ఎల్లప్పుడు, వేదవేదాన్త ప్రతిపాదిత వైభవమ్ = వేదములందు, ఉపనిషత్తులయందు ప్రతిపాదింపబడిన వైభవము కలదో, తత్ = ఆ, పరమేశితుః = పరమేశ్వరునియొక్క, పదమ్ = పదమును, మన్మనోదేశే = నా (మా) మనస్సునందలి యొకచోట, మన్మహే = ధ్యానించెదము.

**తాత్పర్యము :–** ఏ పరమేశ్వరుని పదము వేదవేదాన్త ప్రతిపాదితమో, ఆ పదములు మా మనః ప్రదేశమున తలచుచుందుము.

**వివరణ :–** 1. పదశబ్దము పాదమును స్థానమును చెప్పును. పరమేశ్వరుని స్థానము స్వాత్మయే. ఆత్మ చిన్తనమే. అనగా ఆత్మను సచ్చిదానన్దరూపమును నిర్గుణముగా చింతించుటయే. పాదావయవము అవయవికన్న భిన్నము. కావున పాదధ్యానమనగా పరమేశ్వరశరీరధ్యానమే లేక పరమేశ్వరుని దేహము సచ్చిదానంద ఘనమగుటచే పాదము కూడ సచ్చిదానన్ద రూపమే అని ధ్యానించుటయే తత్పద ధ్యానము. 2. నామ రూపములు వేదవేదాన్త ప్రతిపాదిత సచ్చిదానన్ద పరమేశ్వరుని ధ్యాన స్థానములు అనగా ప్రతీకములు. నామ ప్రతీకోపాసనము గాని రూప ప్రతీకోపాసనము గాని కర్తవ్యములుగా శాస్త్ర ముపదేశించుచున్నది. కావున నామముగాని, రూపముగాని తత్పదమని చెప్పబడును. తచ్చిన్తనమే పరమేశ్వరుని పదముయొక్క చిన్తనము. 3. **పాదోఽస్య విశ్వా భూతాని** అను పురుషసూక్తముననుసరించి బ్రహ్మాండములో ఏ ప్రాణి భూతమునుగాని అప్రాణి భూతమునుగాని చింతించుట తత్పద ధ్యానమని చెప్పబడవచ్చును. 4. వేదవేదాన్త ప్రతిపాదిత శివతత్త్వమే పరమేశ్వర పదము. తద్ధ్యానమే శివపద ధ్యానము 5. పరమవ్యోమమే శివపదము. కావున తచ్చిన్తనమే తత్పదధ్యానము. 6. మన్మ అను శబ్దము ద్విరావృతమగుటచే అనుప్రాసాలంకార మేర్పడి యున్నది.

ప్రతిపాదమున ఎనిమిది అక్షరములుండుటచే అనుష్టుప్ఛందమున నీ శ్లోకము నిబన్ధింపబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని పదము చింతింపబడినది. ఈ శ్లోకమున శివుని చరణ ద్వయి నందు శరణాగతి చేయబడుచున్నది.



**శ్లో॥ శరణమ్మమాస్తు తరుణీయుతా స్ఫుర–**
**చ్చరణద్వయీ ఫణిఫణామణిప్రభా।**
**సకలం ప్రకాశయతు సర్వదేవరా–**
**ణ్మకుటస్థరత్నమహనీయదీపికా॥ 16**

**ప్రతిపదార్థము :–** తరుణీయుతా = యువతితో కూడిన, ఫణిఫణామణిప్రభా = పాము పడగ యందలి మణికాంతులుగల, స్ఫురచ్చరణ ద్వయీ = ప్రకాశించు పాదముల జంట, మమ = నాకు, శరణమ్ = దిక్కు, అస్తు = అగుగాక! సర్వదేవరాణ్మకుటస్థ రత్న మహనీయ దీపికా = సమస్త దేవతల ప్రభువుల కిరీటమందలి రత్నములచే పూజింపబడిన దీపమైన, (సా = ఆ పాదముల జంట), సకలమ్ = సర్వమును, ప్రకాశయతు = వెలిగించుగాక!

**తాత్పర్యము :–** శివ పాద ద్వయము ప్రక్కన పార్వతీదేవి కూడనున్నది. అందుచేత శివపాద ద్వయము తరుణీయుతము. ఆ శివుని పాదములకు సర్ప నూపురములున్నవి. అందుచేత ఆ పాదములు ఆ సర్పముల మణుల కాంతులు గలవై యున్నవి. దేవతల ప్రభువులైన బ్రహ్మోపేంద్రాదుల కిరీటములలోని రత్నముల కాంతులతో ఆ పాదముల కాంతి పూజితమై మహనీయత నొందినది. ఆ పాదముల జంట స్వయముగా దీపికయై యున్నది. ఆ పాదముల జంటయే నాకు దిక్కు. అదియే యెరుగదగిన సర్వమును నా కెఱింగించుగాక!

**వివరణ :–** 1. శివచరణద్వయి దీపికగా రూపింపబడుటచే శ్లోకమున రూపకాలంకార మేర్పడియున్నది. సర్పముల పడగలపైనున్న మణులు దేవతల ప్రభువుల కిరీటమందలి మణులును ఆ పాదములను వెలిగించుచున్నవేమో అని ఇట స్ఫురించుచున్నది. కాని శివపాదములు స్వయం ప్రకాశములగుటచే మణులకు వెలిగించు శక్తిని ప్రసాదించుట యథార్థము. శివపాద దీపముయొక్క మహాకాంతినుండి తదనుగ్రహమున కొంత కాంతిని పొందిన దేవతా ప్రభుకిరీటరత్నములు శివుని చరణముల జంటకే నీరాజనము పెట్టుచు (పూజించుచు) మాలోని ప్రకాశము నీవిచ్చినదే అని అంగీకరించుచు అందఱనుభవించు సర్వమును ఆ చరణము అనుగ్రహమున పొందబడినది గదా! ఇది యెట్టిదనగా సూర్యునకు నీరాజనమిచ్చుట లేక గంగలో నిలబడి గంగకర్ఘ్యము నొసగుట మహనీయ శబ్దము ఈ యర్థమును వ్యంజించుచున్నది. 2. సకలమ్ ప్రకాశయతు అను ప్రార్థనము ఇదివఱకు ప్రసాదింపని ఆవశ్యకమునంతను ప్రసాదించుట కొఱకే. 3. తరుణీయతా శబ్దము పార్వతీదేవి శివచరణ సమీపమున నుండి స్వయముగా ఆ చరణముల

నర్చించుచు సర్వలోకముల కాదర్శముగా నున్నది. ఎట్లా చరణములకు నమస్కరింపవలెనో దేవతా ప్రభువులకు ఆచరించి చూపుచున్నది. భక్తుల రక్షించు విషయమున పురుషకారము చూపుచున్నది అను అర్థమును వ్యంజించుచున్నది. 4. రేఫణకారావృత్తి యుండుటచే నీ శ్లోకము వృత్త్యనుప్రాసా లంకృతమై యున్నది. ప్రతిపాదమున స-జ-స-జ-గ అనుగణము లుండుటచే నీ శ్లోకము మఞ్జుభాషిణీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున దేవతా ప్రభుకృత శివపాద ప్రణతి చెప్పబడినది. ఈ శ్లోకమున కవి తన మనసును శివభజనమునకై ఆజ్ఞాపించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ శరణాగతభరణాతతకరుణాకరహృదయం**
**సురమానితపరమాద్భుతశరమారితవిమతమ్।**
**శమలాలితకమలాసనవిమలాసనవినుతం**
**భజ మానస! నిజమాశ్రయమజమాహతమదనమ్॥ 17**

**ప్రతిపదార్థము :-** శరణాగత భరణాతత కరుణాకర హృదయమ్ = శరణాగతుల పోషించు విశాలమైన కరుణకు చోటైన హృదయముగల, సురమానిత పరమాద్భుత శరమారిత విమతమ్ = దేవతలచే గౌరవింపబడిన మిక్కిలి అద్భుతమైన బాణములచే చంపబడిన శత్రువులు గల, శమలాలిత కమలాసన విమలాసన వినుతమ్ = శమమున లాలింపబడిన పద్మాసనము అను స్వచ్ఛమైన ఆసనమున నుతింపబడిన, నిజమ్ = స్వకీయమైన, ఆశ్రయమ్ = ఆశ్రయమైన, అజమ్ = జన్మలేని, ఆహత మదనమ్ = మదనాంతకుని (శివుని), మానస = ఓ మనసా!, భజ = భజింపుము.

**తాత్పర్యము :-** శరణాగతులను రక్షించు కరుణగల దేవతలచే గౌరవింపబడిన, మిక్కిలి అద్భుతమైన బాణములచే శత్రువుల సంహరించిన, శమ ప్రధానమైన పద్మాసనమను పేరుగల స్వచ్ఛమైన ఆసనమున స్తుతింపబడిన, తన(కు) ఆశ్రయమైన మదనాన్తకుడైన శివుని ఓ మనసా! సేవింపుము.

**వివరణ :-** 1. పూర్వార్ధమున ఏక సమాస పాదములున్నవి. మొదటిదానిలో రణావృత్తి, రెండవ దానిలో రమావృత్తి దానికి వృత్త్యనుప్రాస శోభను కల్గించు చున్నవి. 3వపాదమున మకార లకారావృత్తి, నాల్గవపాదమున జమావృత్తి ఆ పనినే చేయుచున్నవి. 2. మనస్సునకు ప్రభువు జీవుడు. కావున మనసు నాజ్ఞాపించుట ఉచితముగానే ఉన్నది. కాని సాధారణముగా మనసు చెప్పినట్లే జీవుడు చేయుచుండును. కావున ఇచట



మనసులోని వివేక యుక్తమయిన భాగము మరొక అవివేకి భాగము నాజ్ఞాపించు ననుట ఉచితతరముగా నుండును. ధృతి ఛందము.

---

**అవతారిక :-** పై శ్లోకమున మానసమునకు శివభజనమునకై ఆజ్ఞాపించుట చెప్పబడినది. ఈ శ్లోకమున శివునకు వందనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ గౌరీవిలాసరసలాలససత్కటాక్ష-**
**వీక్షాదృతాబ్దవిమలామృతరుక్ప్రసారమ్।**
**కన్దర్పదర్పమథనం ఘననీలకణ్ఠం**
**వన్దామహే వయమనాదిమనన్తమీశమ్॥ 18**

**ప్రతిపదార్థము :-** గౌరీవిలాస రసలాలస సత్కటాక్ష వీక్షాదృతాబ్ద విమలామృత రుక్ప్రసారమ్ = గౌరియొక్క విలాసరసము నందు ఆసక్తమైన మంచి కడగంటి చూపులయందాదరము గల, మేఘము వలె స్వచ్ఛమైన అమృతకాంతుల ప్రసారముగల, కందర్ప దర్ప మథనమ్ = మన్మథుని గర్వమును మథించు, ఘన నీల కణ్ఠమ్ = గొప్పగా లేక మేఘమువలె నల్లనైన కణ్ఠముగల, అనాదిమ్ = ఆదిలేని, అనన్తమ్ = అన్తములేని, ఈశమ్ = ఈశ్వరుని, వయమ్ = మేము, వన్దామహే = నమస్కరించెదము.

**వివరణ :-** 1. శివుని శిరసున జటాజూటము మేఘమువలె అబ్దమైయున్నది. అనగా అది జలమును ప్రసాదించును. భగీరథున కిదివరకు జలమును ప్రసాదింపగా అది భూమియందు జాహ్నవిగా, పాతాళమున భోగవతిగా మారి కపిల కోపాగ్ని దగ్ధులైన సగర పుత్రులకు స్వర్లోకము ననుగ్రహించినది. ఆ జటాజూటముపై అమృత రుక్కు అనగా చన్ద్రుడున్నాడు. అతడు తన అమృత కాంతులను ప్రసరించుచున్నాడు. శరత్కాలపు మేఘము స్వచ్ఛముగా నుండును. అప్పుడా చన్ద్రుడు కూడా స్వచ్ఛముగానే ఉండును. మేఘములు చన్ద్రుడు వర్షాశరదృతువులలో కామోద్దీపనకారులు. శృంగార రసము నకవి ఉద్దీపన విభావములు. అవి అమ్మవారిలోని కామమును. శృంగారరసము నుద్దీపింపజేసినవి. కాని శివుని యందవి అట్లు చేయలేక పోవుటచే కన్దర్పుని అనగా మన్మథుని దర్ప మణగిపోయినది. కావుననే శివుడు కన్దర్ప దర్ప మథనుడైనాడు. 2. సాధారణముగా నెమలి మన్మథుని పరివారములో చేరి శృఙ్గారము నుద్దీపింపజేయు విభావము. కాని యిట శివుడను నెమలి గౌరియందలి శృంగారము నుద్దీపింపజేసినను కన్దర్ప దర్పము నుపశమింపజేసినాడను విరోధాలంకారము మూడవ పాదమున నీలకణ్ఠ శబ్దశ్లేష ద్వారమున స్ఫురించుచున్నది. శివ విశేషణమైన ఘన నీలకణ్ఠ శబ్దము దీనిని

స్ఫురింపజేయును. శివుని కణ్ఠము ఘననీలము. మేఘమువలె నల్లనిది. లేక గొప్ప నలుపు గలది అనియు అర్థమును చెప్పుకొనవచ్చును. నెమలివలె శివుడు నాట్యప్రియుడు. ఆ విషయమున శివుడు గొప్ప నెమలియే. చన్ద్రుడు కూడ శివునివలె సోముడు. ఉమాసహితుడు. చన్ద్రునకు గౌరి అధిదేవత. తన్మన్త్రము గౌరీమి మాయేత్యాదికము గౌరీవిలాసరసలాలస వీక్షలయందాదృతుడైన ఆ అమృతరుక్కు శివత్వము నొందినాడు అని గౌరీ శబ్దము స్ఫురింపజేయుచున్నది. 3. రెండవ, నాల్గవ పాదములందు మొదటి వర్ణములు, ఆఱవ, ఐదవ వర్ణములతో; మూడవ పాదమున మొదటి వర్ణము తొమ్మిదవ వర్ణముతో మైత్రిని పొంది శ్లోకమున అక్షరరమ్యత నాపాదించు చున్నవి. ప్రతిపాదమున త–భ–జ–జ–గ–గ అను గణములున్నందున ఈ శ్లోకము వసంత తిలకా వృత్తము.

---

**అవతారిక :–** పై శ్లోకమున నీలకణ్ఠ శబ్దముచే స్ఫురింపజేయబడిన శివతాణ్డవ మీ శ్లోకమున వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ పదప్రచురకిఙ్కిణీకిణికిణిధ్వనిభ్రాజితం**
**హరిప్రముఖదేవతాధృతలసన్మృదఙ్గాదికమ్।**
**ధిమిన్ధిమితదిద్ధితోద్ధురరవానుసారిక్రమం**
**సదా స్వమతి మఙ్గలం దిశతు శామ్భవం తాణ్డవమ్॥ 19**

**ప్రతిపదార్థము :–** పద ప్రచుర కింకిణీ కిణికిణి ధ్వనిభ్రాజితమ్ = పదముల బహులకింకిణుల ధ్వనులతో నొప్పిన, హరిప్రముఖ దేవతాధృత లసన్మృదఙ్గాదికమ్ = విష్ణ్వాది దేవతలచే ధరింపబడిన ప్రకాశించుచున్న మృదఙ్గాది వాద్యములుగల, ధిమిన్ధిమిత దిద్ధితోద్ధుర రవానుసారి క్రమమ్ = ధిమి న్ధిమిత దిద్ధిత ఇత్యాది ధ్వనుల ననుసరించిన పాదవిక్షేపములుగల, శామ్భవమ్ = శివునకు సంబంధించిన, తాణ్డవమ్ = నాట్య విశేషము, స్వమతి మఙ్గలమ్ = నా బుద్ధియందు శుభమును, సదా = ఎల్లప్పుడు, దిశతు = ఇచ్చుగాక!

**తాత్పర్యము :–** శివుని పాదముల గజ్జెలు ప్రచురములుగా అనగా అధికముగా నున్నవి. వాని నుండి కలుగు కిణికిణి ధ్వనులతో శివ తాండవ మొప్పును. విష్ణ్వాదులు, మృదఙ్గాదుల ధిమిన్ధిమిత దిద్ధి ధ్వనుల కనుగుణముగా శివుని పాదములు ప్రక్షిప్తములగుచున్న ఆ శివతాణ్డవము నా మతిలో మఙ్గలమును ప్రసాదించుగాక!

**వివరణ :–** ప్రమథ గణములలో తణ్డువొకడు. అతడు చేసినది అగుటచే ఆ నృత్యము తాణ్డవమని పిలువబడినది. మొదలు తణ్డువుచే చేయబడి పిదప పరమ పురుషుడైన



శివునచే సన్ధ్యాకాలమున చేయబడుచున్న ఆ తాణ్డవము పురుషులచే చేయబడుచు నేటికినీ ఆదరింపబడుచున్నందున నేడు పురుషులు చేయు నృత్యము తాణ్డవమని పిలువబడుచున్నది. శివుడు తాణ్డవ మొనర్చునప్పుడు విష్ణువు మృదఙ్గమును వాయించును. ఇన్ద్రుడు వేణు వూదును. బ్రహ్మ తాళమును వేయును. లక్ష్మీదేవి పాట పాడును. 'హర్యాది, మృదఙ్గాది' శబ్దములలో ఆది పదములీ యర్థమును సూచించును. 2. ఒకప్పుడు మట్టితో రెండు వైపుల పెద్ద రన్ధ్రములుండునట్లు మధ్య ఉబ్బెత్తుగా నుండునట్లు తయారుచేయబడిన అఙ్గము అనగా పాత్ర రంధ్రములను తోలుతో మూసి తయారు చేయబడిన కారణమున మృదఙ్గము (మృత్ + అఙ్గము) నకు ఆ పేరు వచ్చినది. నేటి మృదఙ్గమునకు తొలిరూపమున మట్టియే ప్రధాన ద్రవ్యము. నేడు మట్టికి బదులు కఱ్ఱ ఉపయోగింపబడు చున్నను పేరు మారలేదు. 3. ప్రథమ పాదమున కణావృత్తి, తృతీయ పాదమున రేఫావృత్తి ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారమును కూర్చుచున్నవి. జ–స–జ–స–య –ల–గ అను గణములుండుటచే నీ శ్లోకము పృథ్వీవృత్త నిబన్ధనము

---

**అవతారిక :–** పై శ్లోకమున తీవ్రవేగముగల శివతాణ్డవము వర్ణింపబడినది. ఈ శ్లోకమున నిశ్చలమైన శివుని స్వాత్మధ్యానము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ స్వాన్తం భ్రాన్తిసమృద్ధబాహ్యవిషయవ్యావృత్తపఞ్చేన్ద్రియం**
**సద్యోజాతముఖాద్యమన్త్రసహితం పద్మాసనాత్యద్భుతమ్**
**ధ్యాయన్మన్మనసి స్మరామి మహితం సత్యస్వరూపానుభూ–**
**త్యానన్దైకరసోల్లసత్పశుపతేశ్చిత్తం యమత్వాన్వితమ్॥ 20**

**ప్రతిపదార్థము :–** స్వాన్తమ్ = మనస్సు, భ్రాన్తి సమృద్ధ బాహ్య విషయ వ్యావృత్త పఞ్చేన్ద్రియమ్ = భ్రాన్తితో సమ్పన్నమైన బాహ్య విషయములనుండి మఱల్చిన ఐదింద్రియములు గలది, సద్యోజాత ముఖాద్య మన్త్ర సహితమ్ = సద్యోజాతము ముఖముగా మరియు మొదటి మన్త్రముగా గల (ఐదు) మన్త్రములతో కూడినది, పద్మాసనాత్యద్భుతమ్ = పద్మాసనమున మిక్కిలి వింతగ నున్నది, యమత్వాన్వితమ్ = యమము అను గుణముల గుంపుతో కూడిన, సత్యస్వరూపాను భూత్యానన్దైక రసోల్లసత్ = సత్యస్వరూపాను అను అఖండమైన భూత్యానందరసమున ప్రకాశించు, మహితమ్ = గొప్పదైన, పశుపతేః = శివునియొక్క, చిత్తమ్ = చిత్తమును, మన్మనసి = నా మనసునందు, ధ్యాయన్ = ధ్యానించుచు, స్మరామి = చింతించెదను.

**తాత్పర్యము :–** చిత్తము భ్రాంతములైన బాహ్య విషయముల నుండి పఞ్చేన్ద్రియములను మరల్చియున్నది. అది యమముతో కూడియున్నది. సద్యోజాతమన్త్రము ముఖముగా ఇతరములైన నాల్గు మన్త్రములు ఇతరవయవములుగా నున్న శివుని మన్త్రమయ శరీరముతో పద్మాసనమున అత్యద్భుతముగా నున్న రూపముతో కూడియున్నది. అట్టి నా చిత్తమున సత్యము, స్వప్రకాశ రూపము, ఆనన్దైక రసము నయిన అనుభూతియే స్వరూపముగా గల శివుని చిత్తమును నా మనసున ధ్యానించుచు చిన్తించెదను.

**వివరణ :–** 1. మనసు నేకాగ్రము చేయుటయే యోగము. చిత్తావృత్తుల నిరోధించుటయే యోగము అని పాతంజల యోగశాస్త్రము చెప్పును. అప్పుడేర్పడు కొన్ని విఘ్నముల నివారించు నుపాయములను సైతము అది పేర్కొనును. రాగ విషయముల వీడిన యోగుల చిత్తమును చింతించుట యొకటి ఈ శ్లోకమున వీతరాగుడైన శివుని చిత్తమునే కవి ధ్యానించుట చెప్పబడుచున్నది. 2. పఞ్చేన్ద్రియములను అనగా చక్షుః శ్రోత్రత్వగ్జిహ్వా ఘ్రాణములను నియమించుట అనగా రూప, శబ్ద, స్పర్శ, రస, గన్ధములనుండి పైన పేర్కొనబడిన ఐదు ఇన్ద్రియములను మరల్చి మనసున చేర్చుట దమమని చెప్పబడును. మనసు నుండియే పై ఇన్ద్రియములు చక్షురాది గోళస్థములై బాహ్యములైన పైన చెప్పబడిన విషయములను మనసునకు సమర్పించుచుండును. పైన చెప్పబడిన విషయములన్నియు సత్యమైన స్వస్వరూపమున అధ్యస్తములై యున్నవి. కావున అవి భ్రాన్తములు. కావున వాని యనుభవము క్షణికానందమునే కలిగించును. అది క్షణిక మగుటచే అది వాస్తవమునకు ఆనన్దాభాసమే. కాని సత్యమైన ఆనన్దము కాదు. అని గమనింపవలెను. ఆనన్దాభాసము కలిగించు ఇన్ద్రియ విషయస్పర్శను తొలగించుట ఈ శ్లోకమున ప్రథమ పాదము నందలి దీర్ఘసమాసము చెప్పుచున్నది. ఒకమాటలో పై సమాసము యొక్క అర్థము దమము అనగా బహిరిన్ద్రియ నిగ్రహము. అది యోగాభ్యాసిచే మొదట పొందదగినది. 3. ఆ తరువాత యోగాభ్యాసి చేయదగినది మానస మన్త్రజపము. శైవ సంప్రదాయమున జప్యములైన మన్త్రములలో పఞ్చాక్షరి ముఖ్యమైనది. **నమఃశివాయ** అను ఈ మన్త్రము త్రయిలోని నడిమి యజుర్వేదము నడిమి కాణ్డమైన నాల్గవ కాణ్డములోని నడిమి రుద్రాధ్యయమున నడిమి ఆఱవ అనువాకము నడుమనున్నది. కావున అది సర్వవేద సారము. సర్వవేద హృదయము అనుట శైవుల విశ్వాసము. దీనిలోని ఐదక్షరములు పఞ్చాంగ రుద్రతలుగా ధ్యానింపబడును. దాని తరువాత తత్పఞ్చాక్షరవిస్తృతిరూపములుగా భావింపబడిన శివపూజలో నుపయోగింపబడు **సద్యోజాత వామదేవ తత్పురుష అఘోర ఈశాన** అను పదములతో మొదలగు ఐదు



మన్త్రములు ముఖ్యములు. ఈ ఐదు మన్త్రములే శివుని మన్త్రమయ శరీరమున ముఖ్యములని చెప్పబడును. ఆ ఐదు మన్త్రముల మొదటి పదములే శివుని పఞ్చ ముఖములకు నామములైనవి. ఒక ముఖము సద్యోజాతము. రెండవది వామదేవము. మూడవది అఘోరము. నాల్గవది తత్పురుషము. ఐదవది ఈశాన్యము. సద్యోజాతము పశ్చిమ ముఖము. అనగా ప్రతీచీదిగభిముఖము. వామదేవము ఉత్తరముఖము. అనగా ఉత్తర దిగభిముఖ ముఖము. తత్పురుషము పూర్వముఖము అనగా ప్రాగభిముఖ ముఖము. అఘోరము దక్షిణ ముఖము అనగా దక్షిణ దిగభిముఖ ముఖము. ఈశాన్యము ఊర్ధ్వముఖము అనగా ఊర్ధ్వదిగభిముఖ ముఖము. పక్షాంతరమున శివునకు సద్యోజాత పదాది మంత్రము పాదములు, వామదేవ పదాది మంత్రము ఊరువులు, ఊరు మధ్యము లేక గుహ్యము, అఘోర పదాది మన్త్రము హృదయము, తత్పురుష పదాది మన్త్రము ముఖము, ఈశాన పదాది మన్త్రము మూర్ధము, ఇది శివుని మన్త్రమయ శరీరము. ఇది ఈ శ్లోకమున రెండవ పాదమందలి మొదటి విశేషణముచే చెప్పబడినది. 4. శివుడు యోగి, వీతరాగుడు. తద్ధ్యానము సాధకులకు ఏకాగ్రత కలిగించుటలో సాయపడునని ఈ వఱకు చెప్పబడినది. ఆ శివుడు సత్యస్వరూప స్వప్రకాశక స్వానంద రూపమగు, స్వానుభూతి రూపమునగు స్వాత్మనే ధ్యానించుచుండును. ఆయన చిత్తము స్వాత్మమయమై అమనస్క స్థితిని పొందియుండును. అట్టి శివుని చిత్తమును తన మనసున ధ్యానించుచు కవి స్మరించుట ఈ శ్లోకమున ముఖ్యాంశము. 5. శివుని చిత్తమున ధ్యానించు సాధకుని చిత్తమును శివుని చిత్తము వలెనే యమాన్వితము కావలెనను అంశము శ్లోకాంతము నందలి విశేషణము స్ఫురింపజేయును. యోగమునకున్న అష్టాంగములలో మొదటిది యమము. అది అహింస, సత్యము, అస్తేయము, బ్రహ్మచర్యము, అపరిగ్రహము అను ఐదు గుణముల సమాహారమని పాతంజల యోగశాస్త్రమున వివరింపబడినది. ఛందోనుగుణతకై యమాన్వితము అనుటకు బదులుగా ప్రయోగింపబడిన యమత్వాన్వితము అను శబ్దమున త్వప్రత్యయము అభేదార్థమున ప్రయోగింపబడినది. 6. శివుని చిత్తము మహితము కావుననే అది ధ్యేయము, స్మర్యము. దాని ధ్యాన స్మరణములు సాధకుని చిత్తమును శివచిత్తముతో సమ మొనరించును. అందుకే కవి శివచిత్తమును తన మనసున నిలుపుకొని స్మరించుచున్నాడు. గతానుభవ సంస్కార జన్యము స్మరణము అవ్యవహిత వృత్తి జ్ఞానధార. ధ్యానము, ధ్యాన స్మరణముల భేదము గమనింపదగినది. 7. ఈ శ్లోకమున యకార తకారావృత్తి వృత్త్యనుప్రాసాలంకారమును కూర్చుచున్నది. సరిపాదముల పదాన్తానుప్రాసమున్నది. స్వాన్తమ్ భ్రాన్తి మన్మనసి స్మరామి

అను పదబంధములోనను ఆ యలంకారమే యున్నది.

ప్రతిపాదమున మ-స-జ-స-త-త-గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూల విక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున కవికృత శివచిత్త ధ్యాన స్మరణములు చెప్పబడినవి. ఈ శ్లోకమున శివదర్శనాభావము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనన్తనిష్ఠాతిగరిష్ఠయోగం - సదాశయైర్వాపి విరాజమానమ్।**
**పినాకపాణిన్తు వినాధునాపి - శివం న పశ్యామి దయాసముద్రమ్॥ 21**

**ప్రతిపదార్థము :-** అనన్త నిష్ఠాతి గరిష్ఠ యోగమ్ వినా = అనన్తమైన నిష్ఠతో కూడిన మిక్కిలి గొప్పదైన యోగము లేక, సదాశయైః వాపి వినా = సదాశయములైనను లేక, విరాజమానమ్ అపి = ప్రకాశించుచున్నను, అధునా = ఇప్పుడు, పినాకపాణిమ్ = పినాకము చేతగల, దయా సముద్రమ్ = కరుణాసింధువైన, శివమ్ = శివుని, న పశ్యామి = చూడలేక పోవుచున్నాను.

**తాత్పర్యము :-** అనన్త నిష్ఠా గరిష్ఠయోగమో, సదాశయములో లేనందువలన, పినాక పాణియు దయాసముద్రుడును ఐన శివుని చూడలేకపోవుచున్నాను.

**వివరణ :-** కార్యసిద్ధి యగు వరకు అన్తము అనగా వీడుట లేని నిష్ఠ అనగా పట్టుదల అనన్త నిష్ఠ అనబడును. అట్టి అనన్త నిష్ఠ యున్నపుడే యత్నమున సంభవించు యోగము (ఏకాగ్రత లేక చిత్తవృత్తి నిరోధము) గరిష్ఠము (మిక్కిలి గొప్పది) అని చెప్పబడును. ఆ యోగమున అనన్త నిష్ఠాగరిష్ఠత లేకున్నను కనీసము సదాశయములతో కూడి యుండవలెను. (సదాశయములనగా నిష్కామ కర్మభక్త్యాదులు) అనన్త నిష్ఠా గరిష్ఠ యోగమో, సదాశయములో లేనిచో శివదర్శనము అనగా జీవబ్రహ్మైక్యానుభూతి సాధ్యము కాదు. నేను శివదర్శనమునకై ధ్యానము నారంభించి ఎంతో కాలము గడచినది. ఇప్పటికిని నాకు శివదర్శనము కలుగలేదు. అను అంశము అధునా శబ్దముచే స్ఫురింపజేయబడు చున్నది. 2. దయాసముద్రత పినాకపాణిత పరస్పర విరుద్ధములు. దయా సముద్రుని చెంత పినాక మెందులకు? ఆయుధముల ధరించుట హింసకు; దయ అహింసకు సూచకములు గదా. విరుద్ధములైన ఆ రెండు అంగములు శిష్టుల రక్షించుటకు దుష్టుల సంహరించుటకు అనివార్యములు. కావున శిష్టుల యందలి దయాకారణముగనే దుష్టుల సంహరించుటకు పినాకము చేతబట్టిన శివుని యందీ విరోధము ఆభాసమాత్రమై పోవుటచే నీ శ్లోకమున విరోధాభాసాలంకార మేర్పడి యున్నది. స్థూలముగా పినాకమును





ధరించిన శివునియందు శిక్షకత్వము లయకారిత్వము తద్ధేతుకమైన తమోగుణము చూచువారికి స్ఫురించును. పినాకము స్థూలదేహావయవమైన చేత ధరింపబడును. ఆ చేయి బహిరంగావయవము. ఇక దయయో అంతరఙ్గగతము అనగా సూక్ష్మదేహావయవ మైన మనసున నుండునట్టిది. అది సముద్రమంత యున్నను రక్షించక పోయినచో కొంచెము కూడ తెలియబడదు. 3. శివుడు కనబడకపోవుటకు లేక ఆ శివుని చూడలేకపోవుటకు హేతువేమి? ఆయన ప్రకాశించుట లేదా ప్రకాశించినచో నేల కనబడడు? కవియేల చూడలేకపోవుచున్నాడు అను ప్రశ్నలు కలుగును. శ్లోకమున శివుడు ప్రకాశించుచునే ఉన్నాడు. అని విరాజమానమ్ అను పదము ప్రయోగింపబడినది. సామాన్యముగా ప్రకాశించుట కాదు విశేషముగా ప్రకాశించుచున్నాడు అని విరాజమాన శబ్దములోని 'వి' అను ఉపసర్గము తెలుపుచున్నది. లోకములోని శివేతర పదార్థములకు ప్రకాశించుట, ప్రకాశింపకపోవుట కాలభేదమును బట్టి జాగ్రత్స్వప్నాద్యవస్థా భేదమును బట్టి ఏర్పడును. నిద్రలోనే వస్తువు ప్రకాశింపక పోయినను అనగా ఏ వస్తువు తెలియబడక పోయినను ఏ వస్తువు తెలియబడక పోవుట అను అజ్ఞానము తెలియబడుచున్నది. కావున దానికి రాజమానత ఉన్నదనవలెను. ఆత్మరూప శివుడో ఆవరణమైన ఆ అజ్ఞానమును నిద్రావస్థలో తద్విక్షేపములైన పదార్థములను జాగ్రదవస్థలో స్పష్టముగా స్వప్నావస్థలో కించిత్స్పష్టముగా ప్రకాశింపజేయును. కావున ఆ జ్ఞానమునకు తద్విక్షేపము లైన స్వప్న జాగ్రద్వస్తువులకు రాజమానత ఉన్నదే కాని విరాజమానత లేదు. ఇంకను సూక్ష్మముగా విచారించుచో వాని రాజమానత ఆత్మాధీనమే. నిజమైన రాజమానత ఆత్మకు మూడవస్థలం దుండుటచే ఆ ఆత్మరాజమానమనుట కన్న విరాజమాన మనుటయే ఉచితము. ఏదో ఒక అవస్థలో ప్రకాశింపబడుట రాజమానత అనుకొన్నచో సర్వావస్థలయందు ప్రకాశించుట విరాజమానతయే అగును. ఆ ఆత్మకు ప్రకాశించుటయే కాని ప్రకాశింపబడుట లేదు. చిదాభాసుడు అంతఃకరణము ఇంద్రియములు వీనికి రాజమానములు, ప్రకాశించునవి అను వ్యవహారమున్నను, వ్యవహారము ననుసరించి వానికి రాజమానత ఉన్నదనవచ్చునేమో కాని ఆ వ్యవహారము భ్రాన్తియే. విరాజమానత వాని కసలు లేనేలేదు. ఈ యర్థమంతయు విరాజమాన శబ్దముచే స్ఫురింపజేయబడు చున్నది. 4. బేసిపాదములో నకారము, సరిపాదములలో పాదాన్తాను ప్రాసములుండుట. విరాజమాన, నిష్ఠాగరిష్ఠ వినాధునా శివం న అను పదబన్ధము లుండుట ఈ శ్లోకములో వృత్త్యనుప్రాసాలంకార మున్నదని తెలుపును. ప్రతిపాదమున జ-త-జ-గ-గ అను గణములుండుటచే ఈ శ్లోకము ఉపేన్ద్రవజ్రా వృత్త (నిబన్ధన)ము.

**అవతారిక :-** పై శ్లోకమున శివుడు కనబడుట లేదని చెప్పబడగా ఈ శ్లోకమున తద్దర్శన మెన్నడు కలుగునో అను చిన్త స్ఫురింపజేయబడుచున్నది.

**శ్లో॥ అపూర్వతాభాసిపునర్భవాప్తం -విభూతివిన్యాసవిశేషకాన్తిమ్।**
**సరోజభూవిష్ణుసురేశకామ్యం - ద్రక్ష్యే కదా శైవపదమ్ముదాహమ్। 22**

**ప్రతిపదార్థము :-** అపూర్వతాభాసి పునర్భవాప్తమ్ = అపూర్వతతో ప్రకాశించు పునర్జన్మమున లభింపబడు, విభూతి విన్యాస విశేష కాన్తిమ్ = విభూతిని విన్యసించుటచే విశేషమైన కాన్తిగల, సరోజభూ విష్ణు సురేశ కామ్యమ్ = బ్రహ్మవిష్ణింద్రాదులచే కోరదగిన, శైవపదమ్ = శివపదమును, ముదా = సంతోషమున, కదా =ఎప్పుడు, అహమ్ = నేను, ద్రక్ష్యే = చూడగలనో!

**తాత్పర్యము :-** అపూర్వతతో ప్రకాశించు పునర్జన్మమున పొందబడు భస్మమును ధరించుటచే విశేషకాన్తిగల బ్రహ్మ విష్ణింద్రులచే కోరదగిన శివపదమును సంతోషమున చూడగల్గుట ఎన్నడో!

**వివరణ :-** భవ శబ్దము శివుని జన్మమును, సంసారమును బోధించు బహ్వర్థ శబ్దము. పుట్టుకకు ముందున్న జన్మము పూర్వజన్మము, చావునకు తరువాత కలుగు జన్మము పునర్భవము అనగా పునర్జన్మము. పై రెండు సాధారణ సంసారుల కనివార్యములు. వానిలో దేనికిని అపూర్వత లేదు. అవి అపూర్వతతో ప్రకాశించునవి కాదు. కాని బహుపూర్వజన్మపుణ్యము ఫలించుటచే ఒకానొక పునర్జన్మము కలుగును. దానియందు భవుడు (శివుడు) ఆప్తుడైనచో అనగా లభించినచో మరొక పునర్జన్మముండదు. పునర్భవాప్తిని నివారించు శివదర్శనమైన జన్మమే చరమ జన్మము. శివదర్శన మనగా ఆత్మరూప శివ సాక్షాత్కారమే. జీవన్ముక్తియే. అది కలిగిన తరువాత మరణ పర్యంతము ప్రారబ్ధాధీనమై శరీరము జీవించియుండును. అట్టి శివ సాక్షాత్కారానంతర స్థితి జీవన్ముక్త స్థితి. ఏ జన్మమున ఈ స్థితి సంభవించునో వానికి మరణానంతరము పునర్జన్మముండదు. దేహపాతానంతరము ఆత్మసాక్షాత్కారము నొందినవాడు కైవల్యము నొందును. వానికి పునః పునః ఆత్మేతర భవ (శివ) ప్రాప్తికల భవములు (జన్మలు)ండవు. ఇవియు ఒక విధమైన అపూర్వతాభాసి పునర్భవములే. అపూర్వతా భాసులైన వానిలో పునర్భవాప్తి అనగా మరల మరల శివుని పొందుట సంభవించును. వానికి సాలోక్య సారూప్య సాయుజ్యాది ముక్తులును ఉండవు. వాని ప్రాణములు లోకాంతరమును ప్రయాణించవు. ఇక్కడి పంచ భూతములలోనే లీనమగును. సంసారుల కెవ్వరికైనను జన్మకలిగిన దనగా అది పునర్జన్మమే. తమ కది పునర్జన్మమనగా ఇదివఱకు మరణించిన పిమ్మట కలిగిన





జన్మ అని తెలియదు.కావున దానిని జన్మయందురే కాని పునర్జన్మ అనరు. కాని అది పునర్జన్మయే. ఇది వఱకు చావనిదే ఈ పుట్టుట యెట్లు సంభవించును? ఇప్పుడు చచ్చినచో మరల పుట్టకుండుట యెట్లు? పునర్జన్మము లేకుండుట యెట్లు? పునర్జన్మము కలుగకుండవలెనన్నచో ఈ జన్మమున శివదర్శనము కావలసినదే. అప్పుడీ జన్మము ఇదివఱకు మరణించిన తరువాత కలిగి ఉన్నందున పునర్జన్మమే, యైనను అది పూర్వము కలిగిన పునర్జన్మల వంటిది కాకపోవుట, అపూర్వ శివదర్శనముచే భాసించినందున అది అపూర్వతాభాసి. అట్టి జన్మకు మరణము తప్పక సంభవించును. కాని ఆ మరణము తరువాత మరల జన్మముండదు. ఇట్టి స్థితి మనము పొందిన ఏ పూర్వ జన్మమునకును లేదు. ఆ జన్మములు కేవల పూర్వజన్మములే. అపూర్వతతో అనగా అపూర్వ శివదర్శనముతో భాసించినవి కావు. కావున పూర్వతా భాసులే. శివదర్శనము అను అనాద్యనంత జన్మ పరంపర నొందు జీవులలో ఒక్కనికి మాత్రమే అపూర్వతతో అనగా శివదర్శనముతో భాసించు జన్మము కలుగును. అపూర్వ మనగా పుణ్య (పాప) కర్మవలన జనించిన సంస్కారము. ప్రతి జన్మకు అట్టి అపూర్వ ముండును. అందు విశేషమేమీ లేదు. కాని శివదర్శనము కలిగింపజాలిన అపూర్వమే అపూర్వమని చెప్పదగినది. అట్టి అపూర్వతయే శ్లోకమునందలి **అపూర్వతా** శబ్దమున వివక్షితము. అనగా శివదర్శనము నొందజాలిన జన్మము అపూర్వతాభాసి పునర్భవమున అనియే కవి చెప్పదలచినది. 2. శివుడు తెల్లనివాడు. వాని పాదము తెల్లనిది. దాని గోళ్ళు తెల్లనివి. ఈ పాదము భస్మధారణముచే విశేషమైన కాంతిని పొందినది. అని రెండవ విశేషణము బోధించును. 3. అట్టి శివపదము బ్రహ్మ విష్ణింద్రులచే కోరదగినదె యున్నది. వారికే అది లభింపక పోవుటచే కోరిక తీరక పోవుటచే ఎంతకాలము నుండియో వారు కోరుచునే యున్నారు. ఇంకను వారికా శివపదము కామ్యమే అయి ఉన్నది. అస్మదాదులకు అది కామ్యమని చెప్పనక్కఱ లేదనుట తృతీయపాద ప్రతిపాదితార్థము. 4. ద్వితీయ పాదము 'వి' ఆవృత్తమైనది. కావున అందు వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. ఈ శ్లోకము పై శ్లోకమువలె ఉపేన్ద్రవజ్రావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున వలె ఈ శ్లోకమునందు శివ దర్శనానందమే ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ సుముఖమ్ముఖమస్య దర్శయ - ద్విధుచూడామణిశోభిదైవతమ్।**
**సదయం హృదయం సదా కదా - కలితానన్దకరం కరోతి నః॥ 23**

**ప్రతిపదార్థము :–** విధుచూడామణి శోభిదైవతమ్ = చన్ద్రుడు అను శిరోభూషణముతో ప్రకాశించు దైవతము (శివుడు), సదయమ్ = దయకలదై, అస్య = దీని (ఇతని)యొక్క, సుముఖమ్ = అభిముఖమైన, ముఖమ్ = ముఖమును, దర్శయత్ = చూపించుచు, నః = మాయొక్క, హృదయమ్ = హృదయమును, సదా = ఎల్లప్పుడు, కలితానన్ద కరమ్ = ఆనన్దమును కలిగించు దానినిగా, కదా = ఎల్లప్పుడు, కరోతి = చేయునో!

**తాత్పర్యము :–** చన్ద్రుడు అను శిరోభూషణముతో శోభించు దైవతమైన శివుడు దయతో దన ప్రసన్నమైన ముఖమును చూపించుచు మా హృదయము నానన్దము కలదానినిగా నెప్పుడు చేయునో!

**వివరణ :–** ఎవని ముఖమున కోపతాపాది దుర్భావములు భాసించవో వాని ముఖమే సుముఖము. శివుడు ప్రలయాభిముఖుడైనచో అతని ముఖము లలాటాగ్నిచ్ఛటలతో భయంకరముగా నుండును. అదే ముఖము భక్తానుగ్రహాభిముఖమైనచో లలాటాగ్ని నేత్రము కస్తూరీతిలకమువలె శోభిల్లుచు ముఖమును సుముఖము నొనర్చును. ఆ శివుడు తన ముఖమును సుముఖముగా జేసికొని మనకు చూపించవలెను. ఎప్పుడాతడు అట్టి ముఖమును చూపించును? అతని హృదయమున దయ కలిగినప్పుడు అనగా హృదయము సదయము కావలెను. అప్పుడే అతని ముఖము సుముఖముగా మనకు చూపించును. అప్పుడా ముఖము మన హృదయము ఆనన్దకరముగా నిలిచిపోవును. అట్టి అనుభవము కలిగెనేని అది తరువాత నెన్నడు మఱపునకు రాదు. ఎల్లప్పుడును ఉండును. అను అర్థము సదా శబ్దముచే స్ఫురింపజేయబడుచున్నది. 2. శివుడనక విధుచూడామణి శోభిదైవతమ్ అని భంగ్యంతరముగా చెప్పబడినందున ఈ శ్లోకమున పర్యాయోక్తాలంకారమేర్పడి యున్నది. సుముఖమ్ ముఖమ్ హృదయమ్ సదయమ్ సదా కదా ఇత్యాది పదబన్ధాదులు ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారము నేర్పఱచు చున్నవి. వృత్తము **వియోగినీ.**

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని సుముఖతా దర్శన మర్థింపబడినది. ఈ శ్లోకమున ఆ శివుని శమలక్షణ దర్శనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అక్షరక్షణనిరీక్షణం రక్షం – దక్షయాగవరశిక్షణదక్షమ్**
**శిక్షితోగ్రవిషభక్షణపక్షం – లక్షయామి శమలక్షణదీక్షమ్॥ 24**

**ప్రతిపదార్థము :–** అక్షర క్షణ నిరీక్షణ రక్షమ్ = జీవునియందు క్షణకాలము దృష్టిని నిలిపి రక్షించువాడును, దక్షయాగవర శిక్షణ దక్షమ్ = దక్షుని యజ్ఞ శ్రేష్ఠమును





శిక్షించుటలో దక్షత కలవాడును, శిక్షితోగ్ర విషభక్షణ పక్షమ్ = నేర్చిన ఉగ్ర విషభక్షణ పక్షము గలవాడును, శమలక్షణ దీక్షమ్ = శమము యొక్క లక్షణమునందు దీక్షవహించిన వాడును అయిన శివుని, లక్షయామి = చూచుచున్నాను.

**తాత్పర్యము :–** జీవునందు క్షణకాలము దృష్టి నిలిపి రక్షించువాడును, దక్షయజ్ఞమును శిక్షించు దక్షత గలవాడును, ఉగ్ర విషభక్షణ పక్షమును నేర్చినవాడును అయిన శివుని చూచెదను.

**వివరణ :–** 1. ఏ జీవు నందైన నొక క్షణకాలము దృష్టి నిలిపి శివుడు చూచినచో వాని రక్షణము సిద్ధించును. ఇది మొదటి విశేషణముయొక్క ఒక అర్థము. ఏ జీవుడైన క్షణకాలము శివవాచకమైన ఓంకారము నందా దృష్టిని నిలిపెనేని వాని రక్షణము సిద్ధించును. ఇది రెండవ అర్థము. ఏ జీవుడైన అక్షరుడైన శివునందు దృష్టి నిలిపినని వారి రక్షణము శివుని చేత సిద్ధించును. ఇది మూడవ అర్థము. ఏ జీవుడైన క్షణకాలము అక్షరమైన శివ రూపమైన తన ఆత్మయందు దృష్టి నిలిపెనేని వానికి ముక్తి రూపరక్షణము సిద్ధించును. ఇది నాల్గవ అర్థము. అక్షరక్షణ పదమును అక్ష – రక్షణ అనురీతి విభజించిన ఈ క్రింది అర్థము లభించును. ఇన్ద్రియములను లేక మనస్సును విషయములవైపు పోనీయకుండుటచే ఇన్ద్రియములయొక్క యథార్థ రక్షణము లేక విషయమగు ఆత్మయందు బాహ్యేంద్రియోపసంహారముగల మనస్సు నాత్మయందు నిలుపుటయే అక్షరక్షణము. అట్లు అక్షరముల రక్షించుకొనుచు శివానుగ్రహము కొఱకు నిరీక్షించిన ఆ శివుని అనుగ్రహము (స్వరక్షణ రూపము) సిద్ధించును. లేక అకారాది క్షకారాంత మాతృక అక్షము దానికి బహిరంతరంగములలో న్యసించు చేసికొను రక్షణము అక్షరక్షణము మరియొక విధముగా అది అక్షరక్షణ = అక్షరమైన ఆనందము, క్షరానందముల జోలికి పోక అక్షరమైన ఆనందమునకై నిరీక్షించు వానిని శివుడు రక్షించును. ఇది యెల్ల ప్రథమపాద వివరణము. 2. ఆద్యంతము లందు దక్ష పదముండుటచే ద్వితీయపాదమున పాదాద్యంత యమకాలంకారమేర్పడి యున్నది. దక్షుడు ప్రజాపతులకు (నవబ్రహ్మలకు) అధిపతి. అధ్యక్షుడు. అతడు యజమానుడుగా చేయబడు యజ్ఞమైన యజ్ఞభోక్త యగు శివుని కాహుతి సమర్పణము చేయకపోవుటచే అది యభిచర రూపమై వీరభద్రునిచే ధ్వంసింపబడినది. యజ్ఞమునకే ధ్వంసము కలుగుటయే కాదు. యజమానుడై దక్షుడును శిక్షింపబడినాడు. అట్టి దురహంకార దక్షయాగ శిక్షణమున శివుడు దక్షుడు. ఇది ద్వితీయ పాద వివరణము. 3. దేవత లమృతము భక్షింపగోరి రాక్షసులతో కూడి క్షీరసాగరమును మథింపగా ఉగ్రవిషము కాలకూటము పుట్టెను. అట్టి ఉగ్రవిషమును భక్షించు పక్షమున

శివుదాశ్రయించెను. కాని అమృతము భక్షించు పక్షమును దేవతలకై వదిలివేసెను. చిరంజీవిత్వ మమృత భక్షణ పక్షము వారికి లభించు ఫలము. ఉగ్రవిషభక్షణ పక్షమున ఆ దేవతల చిరంజీవిత్వ వాంఛకు విరుద్ధమై తత్క్షణము మృత్యువును కలిగించునది. కావున వారు వదలివైచిరి. దేహ ధారులెల్లరిట్లే ప్రవర్తించెదరు. అనగా దేహమే అత్మయను అజ్ఞానులాశ్రయించు పక్షమిదియే. శివుడు దేహమే ఆత్మయను అజ్ఞానము లేనివాడు ఆత్మకు మృత్యువులేదని యెఱిగిన వాడు అనగా ఆత్మరూపుడైన తనకు మృత్యువు లేదని యెఱిగి విషభక్షణ పక్షము నాశ్రయించెను. శరీరము పోయినను పోనీ అనుకొనెను. కాని శరరీము నశించలేదు. మృత్యువు దరిచేరలేదు. భయము పంచమునివలె పారిపోయెను. ఇది మూడవపాదము యొక్క వివరణము. 4. శివుడు స్వాధీన కోపుడు, ఆత్మజ్ఞులెల్లరు స్వాధీనకోపులే. ప్రలయము నొనర్చుటకు కోపింవలెననుకొని కోపించును. లోకముల లయము నొనర్చును. అట్టి శివుని సహజ లక్షణము శమమే. కావుననే యోగుల కాతడు ఆదర్శము. శివ శబ్దము ఆయన లక్షణము. శమముతో పాటే కూడి వినవచ్చును. 'శివమ్ శాన్తమ్' 'కాన్తమ్ పద్మాసనస్థమ్' వంటి ప్రయోగము లీ యంశమును సిద్ధపరుచును. ఆయన శమలక్షణ దీక్షను స్ఫురింపజేయును. కావుననే శ్లోకమున శివపదము లేకున్నను 'శమలక్షణదీక్షమ్' అను విశేషణము శివ శబ్దమును స్ఫురింపజేయుచున్నది. 5. క్షకారవత్తి శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారమును కలిగించుచున్నది. ర-న-భ-గ-గ అను గణములు ప్రతిపాదమున నుండుటచే ఈ శ్లోకము స్వాగతా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుని ఉగ్రవిష భక్షణ పక్ష శిక్షణము చెప్పబడినది. ఈ శ్లోకమున అంతటి ఉగ్ర విషభక్షణమునుసహింపగల శివుని శీతలత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ గఙ్గాతరఙ్గపతదమ్బుకణావృతేన**
**మస్తేన్దుఖణ్డమృదుచన్ద్రికయావృతేన।**
**ప్రత్యక్షతాముపగతేన త్వదాననేన**
**శ్రీకణ్ఠ! మేఽక్షియుగలం కురు శీతలం త్వమ్॥ 25**

**ప్రతిపదార్థము :-** గఙ్గాతరఙ్గ పతదమ్బుకణావృతేన = గఙ్గాతరఙ్గముల నుండి పడుచున్న జలబిన్దువులచే ఆవరింపబడిన, మస్తేన్దు ఖణ్డ మృదు చన్ద్రికయా = శిరమునందలి చన్ద్రుని అర్ధభాగము నుండి వెడలు మెత్తని వెన్నెలచే, ఆవృతేన = ఆవరింపబడిన, ప్రత్యక్షతామ్ = చక్షుర్గోచరతను, ఉపగతేన = పొందిన, త్వదాననేన = నీ ముఖముతో,



శ్రీ కణ్ఠ = ఓ నీలకణ్ఠా, త్వమ్ = నీవు, మే = నాయొక్క, అక్షియుగలమ్ = కన్నులజంటను, శీతలమ్ = చల్లని దానినిగా, కురు = చేయుము.

**తాత్పర్యము :-** ఓ శివా! గఙ్గాతరఙ్గముల నుండి జాఱు జలకణములచే నిండిన, శిరము నందలి మెత్తని వెన్నెలచే వెలుగునట్టి, నీ ముఖమును చూపించి నా రెండు కన్నులను చల్లబఱచుము.

**వివరణ :-** 1. పై శ్లోకమున ఉగ్ర విషభక్షణము చేత శివుని కణ్ఠము నల్లబడుటను శ్రీ కణ్ఠ శబ్దము స్ఫురింపజేయుచున్నది. శ్రీ అనగా విషము. దానిని మ్రింగినచో తన కుక్షి లోపలి జగములు నశించునని, ఉమ్మివేసినచో లేక కక్కివేసినచో బయటి జగములు నశించునని తదుభయ జగముల రక్షించుటకు శివుడు విషమును కణ్ఠమున నిలిపినందున శివునకు శ్రీ కణ్ఠమును నల్లబఱచినదే కాని అంతకంటె నెక్కుడుగా నెట్టి వికారమును కలిగించలేకపోయినది. ఇది శ్రీ కణ్ఠ అను సంబుద్ధిచే తెలియబడు అర్థ విశేషము. 2. శివుని శిరమందు పొంగులు వారు గఙ్గాతరఙ్గముల నుండి రాలిన చల్లని జలకణములు శివుని ముఖమును చల్లబఱచుచున్నవి. అట్లే ఆ శివుని శిరమునందలి హిమాంశులైన అనగా చల్లనికాంతులుగల అర్ధచన్ద్రుని నుండి వెడలు వెన్నెల కూడ ఆ శివుని ముఖమును చల్లబఱచుచున్నది. ఆ గఙ్గా చన్ద్రోభయ గత శైత్యమును విరజిమ్ము ముఖమును చూపించిన కవి కన్నులు చల్లబడును. చల్లని వస్తువును కన్నులతో చూచినప్పుడు ఆ కన్నులలోని కాచల్లని వస్తువునుండి వెడలు చల్లదనము కన్నులలోనికి ప్రవేశించుట మన అందఱకు అనుభవ సిద్ధమే. కవి తన హృదయము నందలి బహుజన్మ సమార్జిత పాపములచే కలిగిన దుఃఖముయొక్క తాపము తన హృదయమున చోటు చాలక తన కన్నులలోని కెగచిమ్మినదని అది చల్లని శివముఖ దర్శనముచే శమించునని శివునకు విన్నవించు కొనుట ఈ శ్లోకమున స్ఫురింపబడు అంశము. 3. చల్లని వస్తువును చూచునప్పుడు కన్నులు చల్లబడుమాట ఎట్లున్నను ఇష్టవస్తు దర్శనము వలన చక్షుః ప్రీతి కలుగుట వాస్తవము. భూమధ్యరేఖకు దగ్గఱగా నున్న జనులకు చల్లదనము సంతోషము నిచ్చును. కావున చల్లబఱచుట యనగా సుఖము నిచ్చుటయే. ధ్రువముల సమీపములలో నున్న జనులకు వెచ్చదన మిష్టము. అందుచే ఇంగ్లండు వాసులు సుఖమునిచ్చు స్వాగతమును వామ్ వెల్‌కమ్ అని అందురు. భారతదేశమునందలి దక్షిణ భాగము భూమధ్యరేఖకు దగ్గరగా ఉన్నది. కావున దాక్షిణాత్యమైన ఆన్ధ్రభాషలో చల్లబఱచుట అనునది, సుఖింపజేయుటగా భావింపబడును. ఈ కవి అక్షియుగలమ్ శీతలమ్ కురు అని శివుని ప్రార్థించుట కవియొక్క (భారత) దాక్షిణాత్యతను స్ఫురింపజేయును. మొదటి మూడు

పాదములలోని అన్ని పదములలోను పదాన్తాను ప్రాసమున్నది. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము వసంతతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున కన్నుల సుఖింపజేయు దర్శన మొకటి అర్థింపబడినది. ఈ శ్లోకమున అట్టి దర్శనముతో పాటు శ్రవణమును అర్థింపబడుచున్నది.

**శ్లో॥ కదా వా శ్రూయన్తే ప్రమథజయశబ్దద్విగుణితాః**
**శివోద్వాహప్రాఞ్చద్వృషభగలసత్కిఙ్కిణిరవాః।**
**కదా వా కైలాసాచలనిలయదివ్యా గురుచయాః**
**కథం వా దృశ్యన్తే కలితభసితాఙ్గాభిరుచిరాః॥ 26**

**ప్రతిపదార్థము :-** ప్రమథ జయ శబ్ద ద్విగుణితాః = ప్రమథగణముల జయ శబ్దముచే రెట్టింపైన, శివోద్వాహ ప్రాఞ్చ ద్వృషభ గల సత్కిఙ్కిణి రవాః = శివుని మోయుటలో పూజను పొందు ఎద్దుయొక్క కణ్ఠమునందలి మంచి గజ్జెల ధ్వనులు, కదా శ్రూయన్తే వా = ఎప్పుడు వినబడునో, కైలాసాచల నిలయ దివ్యాః = కైలాసపర్వతనివాసులు దివ్యులునగు, కలిత భసితాఙ్గాభిరుచిరాః = పూయబడిన భస్మముతో కూడిన శరీరములతో మిక్కిలి సున్దరులు నగు, గురుచయాః = గురువుల గుంపులు, కదా దృశ్యన్తే వా = ఎప్పుడు కనబడుదురో.

**తాత్పర్యము :-** ప్రమథ గణముల జయ శబ్దములతో రెట్టింపైన, శివుని మోయుటచే పూజనీయమైన వృషభము యొక్క కణ్ఠమందలి గజ్జెల ధ్వనులు ఎప్పుడు వినబడునో గదా! కైలాసమున నివసించుటచే దివ్యులైన బూది పూతతో ప్రకాశించు శరీరములు గల గురువుల గుంపులు ఎప్పుడు కనబడుదురో కదా!

**వివరణ :-** 1. సర్వలోకముల ప్రలయ కాలమున ప్రమథింపజేయు శివునితోపాటు కైలాసమున నుండి అతని నిరంతరము సేవించు గణములు ప్రమథ గణములు. వారు నిరంతరము వెంట నడుచుచుండగా శివుడు వృషభవాహనుడై కైలాసమున విహరించు చుండును. అప్పుడు వాహన వృషభము మెడలోని గంటలు గజ్జెలు మ్రోయుచుండును. వెంట నడుచు ప్రమథులు చేయు శివునకు జయకారముల ధ్వనులు వృషభముయొక్క చిఱుగంటలు గజ్జెల ధ్వనులను రెట్టింపుజేయుచున్న వనగా ఆ గంటలు గజ్జెలును జయ అనియే మ్రోయు చుండుట ఇట వ్యంగ్యము. అవి ఎప్పుడు వినబడునో? అనగా తనకెప్పుడు సాలోక్యముక్తి కలుగునా? యను కవి చింత పూర్వార్ధమున ప్రధాన వ్యంగ్యము. 2. అట్లే ఉత్తరార్ధముననను కైలాసము నందలి భస్మము నదలిన శరీరములు



గల దివ్య గురువులెప్పుడు కనబడుదురో గదా అను చింత కూడా కవియొక్క సాలోక్యముక్తి వాంఛనే వ్యంజింపజేయును. తెల్లని విభూతిని పూసికొన్నట్లు కనబడుచున్నవి. అవి శివుని వలె తెల్లనై శివు స్థాణుత్వమును అనగా శివసారూప్యమును పొందినట్లున్నవి. అహంకార భారమును విడచిన వగుటచే అగురువు లైనవి. అనగా వాని పరిమళము గాలిలో తేలిపోవునంత లఘుత్వము నొందినవను అర్థాంతరమును ఇట భావనీయము. తృతీయ పాదమున చకారలకారావృత్తి వృత్త్యనుప్రాస శోభను కలిగించుచున్నవి. ప్రతిపాదమున య-మ-న-స-భ-ల-గ అను గణములతో శ్లోకము శిఖరిణీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివ గురువుల దర్శన మర్థింపబడినది. ఈ శ్లోకమున యోగులు దర్శించు శివస్వరూపము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనిన్ద్యమానన్దమయం నిరామయం**
**నిరఞ్జనం నిష్కలమద్వయం విభుమ్।**
**అనాదిమధ్యాన్తమహో పరం శివం**
**హృదన్తరే సాధు విదన్తి యోగినః॥ 27**

**ప్రతిపదార్థము :-** అనిన్ద్యమ్ = నిన్దింపదగని, ఆనన్దమయమ్ = ఆనన్దాధిక్యము గల, నిష్కలమ్ = అంశరహితుడైన, నిరామయమ్ = దుఃఖరహితుడైన, నిరఞ్జనమ్ = కలఙ్క రహితుడైన, అద్వయమ్ = అద్వితీయుడైన, విభుమ్ = ప్రభువైన, అనాదిమధ్యాన్తమ్ = ఆదిమధ్యాన్తములు లేని, పరమ్ = ఉత్కృష్టుడైన, శివమ్ = శివుని, హృదన్తరే = హృదయము లోపల, సాధు = చక్కగా, యోగినః = యోగులు, విదన్తి = తెలిసికొను చున్నారు.

**తాత్పర్యము :-** అనిన్ద్యుడు, ఆనన్దమయుడు, నిరామయుడు, ఆదిమధ్యాన్తరహితుడు, నిష్కలుడు. అద్వైతమూర్తియునైన పరమశివుని హృదయముల లోపల యోగులు చక్కగా తెలియుదురు. అనగా సాక్షాత్కరించు కొందురు.

**వివరణ :-** శ్లోకమున మొదటి రెండు విశేషణములు, ఉత్తరార్ధమున మొదటి విశేషణమును అకార నకారాదులై యుండుట నిర్ నిస్ ఉపసర్గలు ఆదిగాను మూడు పదములు చివఱి పాదమున దకారా మధ్యములైన రెండు పదములు శైలీరామణీయకమును శ్లోకమున కలిగించుచున్నవి. ప్రతిపాదమున జ-త-జ-ర అను గణములుండుటచే నీ శ్లోకము వంశస్థ వృత్త నిబన్ధనము.

**అవతారిక :-** పై శ్లోకమున యోగుల హృదయముల లోపల కాననగు శివ స్వరూపము చెప్పబడినది. ఈ శ్లోకమున కవిచే ఆ శివుడు తనకును కానరాదగిన శివ స్వరూపము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అర్ధాఙ్గోపరిగిరికన్యకాలలామ-**
**ప్రోద్భాసిత్రినయనమిన్దుఖణ్డభూషమ్।**
**భక్తానామభయదమీశ్వరస్వరూపం**
**ప్రత్యక్షమ్మమ భవతాత్పరాత్పరం తత్॥ 28**

**ప్రతిపదార్థం :-** అర్ధాఙ్గోపరి గిరికన్యకా లలామ ప్రోద్భాసి త్రినయనమ్ = అర్ధాంగము పైన గిరి కన్యకా శ్రేష్ఠము (గంగ)తో ప్రకాశించు మూడు కన్నులుగల, ఇన్దుఖణ్డభూషమ్ = చన్ద్రఖణ్డము అలంకారముగా గల, భక్తానామ్ = భక్తులకు, అభయదమ్ = అభయమును ఇచ్చు, తత్ = ఆ, పరాత్పరమ్ = శ్రేష్ఠము కన్న శ్రేష్ఠమునగు, ఈశ్వర స్వరూపమ్ = ఈశ్వర స్వరూపము, మమ = నాకు, ప్రత్యక్షమ్ = ప్రత్యక్షము, భవతాత్ = అగుగాక!

**తాత్పర్యము :-** అర్ధాఙ్గముపై గంగతో, మూడు కన్నులతో, ప్రకాశించు అర్ధచన్ద్ర లలాటుడైన, భక్తుల కభయము నొసగు పరాత్పరుడైన ఆ ఈశ్వరుని స్వరూపము నాకు ప్రత్యక్షమగుగాక!

**వివరణ :-** 1. అర్ధనారీశ్వరుడైన శివుని ఎడమభాగము పార్వతి, కుడి భాగము శివుడు. కుడి అర్ధాఙ్గము, ఆ భాగముపైన గిరికన్యకా లలామ యున్నది. నదులన్నియు గిరి కన్యకలే. గంగా, యమునాదు లెన్నియో హిమవద్గిరి నుండి పుట్టియున్నవి. అవి అన్నియు హిమవద్గిరి కన్యకలే. వారిలో గంగశ్రేష్ఠ. ఆమె కుడి అర్ధాఙ్గముపై నున్నది. ఆ కుడి అర్ధాఙ్గముపై మూడు కన్నులు నున్నవి. వానిపై లలాటమున అర్ధచన్ద్రుడు భూషణముగా నున్నాడు. భక్తుల కభయ మొసగు ఆ పరాత్పరేశ్వరుని స్వరూపము తన హృదయమున ప్రత్యక్షము కావలెనను ప్రార్థనము ఈ శ్లోకమున ప్రతిపాదింపబడినది. 2. ఉపరిగిరి, త్రినయన, పరాత్పర, ఈశ్వరస్వరూపమ్ అను పదబద్ధములలో వృత్త్యనుప్రాసమున్నది. ప్రతిపాదమున మ-న-జ-ర-గ అను గణములుండుటచే నీ శ్లోకము ప్రహర్షిణీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివ సాక్షాత్కార మర్థింపబడినది. ఈ శ్లోకమున శివసౌముఖ్య మర్థింపబడుచున్నది.



**శ్లో॥ అనుగ్రహాన్మే సుముఖో భవాశు**
**కృతార్థతామస్మి గతస్తతోఽహమ్।**
**కిమాత్మభక్త్యా సుముఖే త్వయీశ!**
**కిమాత్మభక్త్యా విముఖే త్వయీశ!॥ 29**

**ప్రతిపదార్థము :-** ఈశ = ఓ ప్రభూ, అనుగ్రహాత్ = అనుగ్రహము వలన, మే = నాకు, ఆశు = శీఘ్రముగా, సుముఖః = సుముఖుడవు, భవ = కమ్ము, తతః = అందువలన, అహమ్ = నేను, కృతార్థతామ్ = కృతార్థతను, గతః = పొందిన వాడను, అస్మి = అగుచున్నాను, ఈశ = ఓ ప్రభూ!, త్వయి = నీవు, సుముఖే = సుముఖుడవు కాగా, ఆత్మభక్త్యా = నా భక్తితో, కిమ్ = ఏమి, త్వయి = నీవు, విముఖే = విముఖుడవు కాగా, ఆత్మభక్త్యా = నా భక్తితో, కిమ్ = ఏమి?

**తాత్పర్యము :-** ఓ ప్రభూ! అనుగ్రహముతో నీవు నాయెడ సుముఖుడవగుము. అప్పుడు నేను కృతార్థుడనే అగుదును. ఒకవేళ నీవు సుముఖుడ వైనచో నా భక్తితో నేమి పని? నీవు విముఖుడవైనచో నా భక్తితో నేమి పని?

**వివరణ :-** భక్తి ఇష్టదేవతా సౌముఖ్యమునకై చేయదగినది. ఒకవేళ ఆ దైవము స్వయముగానే సుముఖుడై ఉన్నచో సాధకుని భక్తి నిరర్ధకము. అట్లే ఒకవేళ దైవము స్వయముగా విముఖమే అయియున్నచో అప్పుడును సాధకుని భక్తి నిరర్ధకమే అగును. జ-త-జ-గ-గ అను గణములు ప్రతిపాదమున నుండుటచే నీ శ్లోక ముపేంద్ర వజ్రా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివసౌముఖ్య మర్థింపబడినది. ఈ శ్లోకమున ఉగ్రతాప నిరసన మర్థింపబడుచున్నది.

**శ్లో॥ నిపత్య పాదాబ్జయుగే త్వదీయే**
**విభో! విధాయాఞ్జలిమీశ! యాచే।**
**మమోగ్రతాపం తవ దర్శనైక-**
**కథామృతాసారభరాన్నిరస్య॥ 30**

**ప్రతిపదార్థము :-** విభో = ఓ ప్రభూ!, త్వదీయే = నీకు సంబంధించిన, పాదాబ్జ యుగే = పాదకమల ద్వన్ద్వమున, నిపత్య = పడి, ఈశ = ఓ ఈశ్వరుడా!, అఞ్జలిమ్ = అఞ్జలిని, విధాయ = చేసి, యాచే = అడుగుచున్నాను, మమ = నాయొక్క, ఉగ్రతాపమ్ = తీవ్రమైన తాపమును, తవ = నీయొక్క, దర్శనైక కథామృతాసార భరాత్ = దర్శనము ముఖ్యమైన కథామృతము యొక్క జడివాన బరువువలన, నిరస్య = నిరసింపజేయుము.

**తాత్పర్యము :-** ఓ ఈశ్వరా! ప్రభూ! నీ పాదములందు సాష్టాంగపడి నీ దర్శనము ముఖ్యమైన కథామృతవర్షముతో నా (సంసార సంబంధ) ఉగ్రతాపమును నిరసింపజేయు మని వేడుకొనుచున్నాను.

**వివరణ :-** శివుని రూపమును దర్శించుట, ఆయన కథను (గుణనామములకు సంబంధించిన దానిని) వినుట సంసారోగ్రతాపము నివారింప సమర్థములనుట ఈ శ్లోకమున ప్రతిపాద్యము. 'విభో విధాయ' అను పదబన్ధమున పదాద్యనుప్రాసము ఆసారభరా న్నిరస్య' అను పదబన్ధమున రేఫావృత్తితో వృత్త్యనుప్రాసము నున్నవి. ప్రతిపాదమున జ-త-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకముపేంద్ర వజ్రా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున ఉగ్రతాపమును నివారించు కథామృతమను జడివాన (చినుకుల నాట్యము) చెప్పబడినది. ఈ శ్లోకమున సింహాసనము (వృషభము)యొక్క (తాండవమను పేరుగల) నాట్యము చెప్పబడుచున్నది.

**శ్లో॥ నిత్యం సురాసురగజావనకీర్తనీయే**
**సింహాసనస్య గిరిజాపతిదర్శనీయే।**
**గన్ధర్వగానరచనానుగతానుకూ(కా)లే**
**లోలం విలోచనయుగమ్మమ తాణ్డవేఽస్తు॥ 31**

**ప్రతిపదార్థము :-** నిత్యమ్ = ప్రతిదినము, సురాసుర గణావన కీర్తనీయే = దేవరాక్షసుల గణముల రక్షణము (హేతువు)చే కీర్తింపదగిన, గిరిజాపతి దర్శనీయే = శివునిచే చూడదగిన, గన్ధర్వగాన రచనానుగతానుకూలే = గన్ధర్వుల గాన రచన ననుసరించి అనుకూలమైన, సింహాసనస్య = సింహాసనముయొక్క (వృషభము యొక్క), తాణ్డవే = తాణ్డవ నాట్యమునందు, మమ = నాయొక్క, విలోచనయుగమ్ = కంటి జంట, లోలమ్ = ఆసక్తిగలది, అస్తు = అగుగాక!

**తాత్పర్యం :-** దేవ రాక్షసుల గణముల రక్షించు నిమిత్తమైన శివునిచే చూడదగిన, గన్ధర్వ గాన రచనల ననుసరించు అనుకూలమైన సింహాసనమైన వృషభముయొక్క తాణ్డవమున నా కంటి జంట ఆసక్తమై ఉండుగాక!

**వివరణ :-** శివుడు తనకు భక్తులెవరైనను సరే కాపాడవలెననియే భావించుచుండును. దేవ రాక్షసులు పరస్పర విరోధులు. ఆయనకు ఈ ఉభయుల గణములందు సమత్వమే





ఉన్నది. వరముల నొసగు సందర్భమున వారు దేవతలా, రాక్షసులా అనునది ఆయన దృష్టిలో విచార్యము కాదు. ఎవరైననేమి వారర్థులే. కావున అనుగ్రాహ్యులే. ఇది శివుని సమత్వదృష్టి. శివుని సింహాసనమైన వృషభమున కా సమదృష్టి మిక్కిలి సంతోషమును కలిగించుచుండును. అందుచే ఎవరిని రక్షించినప్పుడును ఆయన సంతసించి తాండవ మొనర్చుచుండును. అతని తాణ్డవము శివునకు దర్శనీయమై యుండును. గిరిజాపతి అని శివుని చెప్పుటచే అమ్మవారితో కూడి ఆ వృషభ తాణ్డవము శివునిచే చూడబడుచుండు ననుట వ్యంగ్యము. వృషభేశ్వరుని తాణ్డవము గన్ధర్వగాన రచనల తాళములకు అనుకూలముగా నుండునని శ్లోకములోని మూడవపాదము చెప్పును. అనుగత శబ్దము తాళముల మధ్యకాలము నందలి లయకు అనుకూల శబ్దము. తాల ధ్వనికి ఆ రెంటికి తాణ్డవ గతమైన అనుగుణ్యమును సూచించును. విలోచనయుగమ్ అను సమాసములోని యుగశబ్దము శివుని మూడు కన్నులకు దర్శనీయమైన వృషభ తాణ్డవము కవి తన రెండు కన్నులతో చూచుట సాధ్యమగునా కాదా అను ఆందోళనమును లోల శబ్దము వ్యంజించుచున్నది. వృషభముయొక్క కుడికాళ్ల నాట్యమును శివుడెడమ కన్నుతో గమనించును. ఎడమకాళ్ల నాట్యమును కుడికంటితో గమనించుచుండును. రెండు నాట్యములను ఒకేసారి ఫాలనేత్రము నిర్విరామముగా గమనించుచుండును. అప్పుడా మూడవ కంటిలోనుండి అగ్నులు చిమ్మవు. ఆనన్దప్రకాశమును మాత్రమే చిమ్మును. శ్లోకమున రేఫనకారముల ఆవృత్తి తాణ్డవ నాదానుగుణ్యమును సూచించును. కావున దీనికీ అను ప్రాసాలంకారౌచిత్యము వ్యక్తమగుచున్నది. వసంతతిలకా వృత్తమిది.

---

**అవతారిక :-** పై శ్లోకమున తన లోచన యుగము శివతాణ్డవము చూచుటలో సక్తము కావలెనని కోరబడినది. ఈ శ్లోకమున తన కట్టి భాగ్యమెప్పుడు కలుగునో యని చింత చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్వత్తాణ్డవం సకలలోకసుఖై (శుభై)కమూలం**
**గౌరీమనోహరమనేకవిధిక్రమాఢ్యమ్।**
**ద్రష్టుమ్మహేశ! మమ చర్మవిలోచనాభ్యాం**
**భోగ్యం భవాన్తరసహస్రకృతం కదా ను॥ 32**

**ప్రతిపదార్థం :-** సకలలోక సుఖైకమూలమ్ = సర్వలోకముల శుభములకు ముఖ్యకారణ మైన, గౌరీమనోహరమ్ = గౌరియొక్క మనస్సును హరించు, అనేకవిధిక్రమాఢ్యమ్ = అనేక విధుల క్రమముతో కూడిన, త్వత్తాణ్డమ్ = నీ తాణ్డవమును, మమ = నాయొక్క

చర్మవిలోచనాభ్యామ్ = చర్మచక్షువులచేత, ద్రష్టుమ్ = చూచుటకు, భవాన్తర సహస్ర కృతమ్ = వేలకొలది జన్మలలో చేయబడిన కర్మ, మహేశ! = ఓ శివా, కదా ను = ఎప్పుడు, భోగ్యమ్ = అనుభవమునకు వచ్చునో కదా!

**తాత్పర్యము :–** సర్వలోక శుభములకు ముఖ్య మూల కారణమైన గౌరి కాహ్లాద హేతువైన అనేక విధుల క్రమముగల నీ తాణ్డవమునో శివా! నా చర్మచక్షువులచే చూచుటకు నేను వేలకొలది జన్మలలో చేసిన సుకృతము ఫలించుట ఆవశ్యకము. అది ఎప్పుడు సంభవించునో కదా!

**వివరణ :–** 1. తణ్డువు అను శివభక్తుడు స్వోపజ్ఞముగా పురుషులు చేయు నృత్త విశేషము నొక దానిని చేసి శివుని మెప్పించెను. ఆ నృత్య విశేషము తాణ్డవ మనబడును. ప్రతికదలికకు అర్థ విశేషము చెప్పుటకు వీలు లేకున్నను ఏదో ఒక రస విశేషమును వ్యంజింపజేయు నాట్య విశేషము నృత్తము అనబడును. స్త్రీలచే చేయబడు నృత్తము లాస్య మనబడును. అమ్మవారు కూడ అట్టి లాస్యము చేయుటలో కౌశల్యము కలదియే. ఇట్టి నృత్తమును ఉద్ధృతముగా శివుడొనరించును. అది భక్తుడైన తణ్డువు ననుగ్రహించుటకే. తదుపజ్ఞమైన తాణ్డవమును సంతోషముతో శివుడొనరించును. ఆ శివుడు చేయు తాణ్డవము అమ్మవారి నలరింపజేయుటకును శివుడొనరించును. ఆమె కా తాణ్డవము మిక్కిలి ఆహ్లాదకరము. అని గౌరీ మనోహర శబ్దము వ్యంజించును. ఆ శివుని ఆ తాణ్డవము సర్వలోక సుఖ మూలకారణమని సకలలోక సుఖైకమూల శబ్దము చెప్పును. లలిత కళలలో శిల్పకళ, చిత్రకళ, సంగీత కళ, నాట్యకళ మొదలగునవి సర్వలోక సుఖమును కలిగింపజాలక పోయినను సహృదయ హేతువులనుటలో సందేహము లేదు. లోకములోని వారందరు సహృదయులని చెప్పజాలము కదా! ఔరంగజేబు సంగీతకళను ద్వేషించినాడని చారిత్రకులు కొందఱు చెప్పిరి. కళలకు రాజాదరము లేనప్పుడు సుఖమయ జీవితమును భార్యలకు కలిగింపలేని కళాకారులను, కళాభిజ్ఞత లేని వారి భార్యలే ఈసడించుట లోక ప్రసిద్ధము. ప్రలయమునకు ముందుండునది లోకస్థితి. ప్రలయ పూర్వస్థితియే స్థితి శబ్ద వాచ్యము. లోకస్థితి లోకముయొక్క సమష్టి పూర్వ కర్మకు ఫలముగా లోకముచే ననుభవింపబడు సుఖ దుఃఖముల స్థితియే లోకముయొక్క ప్రారబ్ధసమష్టి కర్మము. సుఖదుఃఖానుభవముచే నశించగా నేర్పడునది ప్రలయము. అది వ్యష్టిలో రాత్రియనబడును. నిద్రయనుట మిక్కిలి సముచితము. సర్వలోకముల సుఖదుఃఖానుభవముచే వారి సమష్టి ప్రారబ్ధకర్మ నశించగా లోకము నిద్రించును. ఆ నిద్రయే ప్రలయము. వ్యష్టి నిద్రలో సుఖదుఃఖానుభవముండునట్లే



సమష్టి నిద్రయైన ప్రలయమున సుఖదుఃఖానుభవముండదు. అప్పుడానందమే ఉండును. ఆ ఆనందము ఈ సమాసములోని సుఖశబ్దముచే చెప్పబడినది. 2. వ్యక్తులు నిద్రలో విషయజన్య సుఖదుఃఖాతీతమైన స్వరూపానందము ననుభవించెదరు. అట్లే వ్యక్తుల సమూహము అనగా లోకము ప్రలయమున నా స్వరూపానందమునే అనుభవించుటయే సుఖశబ్ద వాచ్యమైన ఆ ఆనందమునకు మించి న సుఖము లేనే లేదు. దానికి మూలము లేక ముఖ్యకారణము శివుని తాణ్డవము. ఆయన తాణ్డవము నారంభించుట అనగా లోకము నిద్రించుట. మృత్యువు కూడ నిద్రా విశేషమే. శివుడు లోకములను చంపుట యనగా మరొక నిద్రా విశేషమున ముంచుటయే. ఆటలాడి అలసి ఆరాటపడుచున్న శిశువునకు తల్లి జోకొట్టి నిద్రపుచ్చును. అట్లు శివుడు సుఖదుఃఖానుభవముచే వేసారిన జీవులను నిద్రపుచ్చును. ఆజ్ఞులైన సాధారణ జనులు ఈ అంశము నెఱుగక చంపుట అను కృత్యము నొనరించు శివుని ఈ జీవగత ప్రేమను గ్రహింపజాలరు. తాణ్డవ శబ్దముయొక్క సకలలోక సుఖైకమూలమ్ అను విశేషము పై అర్థ విశేషమును వ్యంజించును. 3. గౌరి ప్రకృతి స్వరూపిణి. ప్రకృతి సత్త్వరజ స్తమోగుణ. ఈ మూడు గుణముల సామ్యావస్థ ప్రలయము. శివుని తాణ్డవము ప్రకృతికీ గుణసామ్యస్థితిని కలిగించును. ఎవరినైనను భిన్న గుణముల సామ్యస్థితి వికారముల నివారించును. గుణవైషమ్యము అనగా సత్త్వరజస్తమో గుణములలో నేవేని ఒకటి రెండు గుణముల ఆధిక్యము లేక అల్పత తదుపమర్ధహేతువు, సాధారణముగా ఒక గుణమధికమైనచో అది మిగిలిన వానిలో ఒకదానినో రెండింటినో ఉపమర్ధించుట కారంభించును. ఇట్టి ఉపమర్ధము గుణవైషమ్య కార్యము. ఇది మహదాది సృష్టి హేతువు. ఈ సృష్టి ప్రకృతి స్వరూపిణి యగు అమ్మవారి అంతరము నందలి గుణముల పరస్పరోపమర్ధము అగుటచే అది ఆమె కశాంతిని కలిగించును. శివుని తాణ్డవము అమ్మవారి అంతర గుణోపమర్ధ రూపశాంతిని తొలగించి సామ్యరూప శాంతిని కలిగించుటచే శివతాణ్డవము గౌరీ మనోహరమని ఈ శ్లోకమున చెప్పబడినది. 4. నాట్యము నృత్తము, నృత్యము అని ద్వివిధము. తాణ్డవము నృత్తవిశేషము. పురుషోచితము. శివుడు పురుషోత్తముడు ఆయన తాణ్డవము ఉత్తమ నృత్తము. ఆ తాణ్డవమున అనేక విధులుండును. ఆ విధులకు క్రమము కూడ నుండును. అనేక విధి క్రమాఢ్యమ్ అను విశేషణము శివుడు విధుల క్రమము పాటించియే తాండవ మొనరించినాడని తెలుపును. 5. శివుడు సాయం సంధ్యాసమయమున కైలాసమున సహృదయగౌరీ సమక్షమున చేసిన తాణ్డవము బహుజన్మ పుణ్యఫలముగా కలిగిన శివుని అనుగ్రహమున సాలోక్యముక్తిని పొందిన

శివభక్తుల లోచనములకు గోచరమగును. భూలోకవాసుల కెవరికైన శివానుగ్రహమున దివ్యచక్షువు నొందిన శివభక్తులకు లభించునేమో కాని మనవంటి చర్మ చక్షువులకు లభించదు. వేలకొలది జన్మలలో చేయబడిన సుకృతము ఫలించి శివానుగ్రహమున్నచో తాణ్డవము తన చర్మ చక్షువులకును గోచరము కావచ్చును. కవి ఈ జన్మముననే చర్మ చక్షువులతోడనే ఆ శివుని తాణ్డవమును చూడ గోరుచున్నాడు. ఆ శివ తాణ్డవదర్శనము తన చర్మ చక్షువులకు గోచరించు భాగ్యమెన్నడు కలుగునో కదా అని కవియొక్క చింతాభావముయొక్క ఉదయము శ్లోకమున వ్యంగ్యమగును. భావోదయము శివగతి రతి కంగముగా ఉన్నది. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే ఈ శ్లోకము వసంత తిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున కవి గౌరీ మనోహర శివతాణ్డవ దర్శన వాంఛ చెప్పబడినది . ఈ శ్లోకమున శివగౌరీ సల్లాప శ్రవణ వాంఛ చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రీమన్తి పావనతరాణి సుధాన్తరాణి**
**సర్వోత్తరాణి హృదయాద్వయజీవనాని।**
**అన్యోన్యమీశ! తవ చాద్రితనూభవాయాః**
**సల్లాపరూపవచనాని కదా శృణోమి॥** **33**

**ప్రతిపదార్థము :-** శ్రీమన్తి = జ్ఞాన సహితములు, పావన తరాణి = మిక్కిలి పవిత్రములు, హృదయాద్వయ జీవనాని = హృదయైక్యమే జీవనముగా గలవి, సర్వోత్తరాణి = అన్నిటి కంటే గొప్పవి, సుధాన్తరాణి = లోపల అమృతము కలవి, ఈశ = ఓ ఈశ్వర!, తవ = నీయొక్క, అద్రితనూభవాయాః చ = పార్వతియొక్కయు, అన్యోన్యమ్ = పరస్పరము, సల్లాపరూప వచనాని = సల్లాప వచనములను, కదా = ఎప్పుడు, శృణోమి = వినెదనో.
**తాత్పర్యము :-** మిక్కిలి పవిత్రములు జ్ఞానయుక్తములు సర్వవచనముల కన్న మిన్నయైన హృదయైక్యమును ప్రకటించు శివపార్వతీ పరస్పర వచనముల వినుట యెన్నడో!
**వివరణ :-** ఏ మాటలు జ్ఞానయుక్తములో ఆ మాటలే మిక్కిలి పవిత్రములు. జ్ఞానము కన్న మించిన పవిత్రము లేదని గీత చెప్పెను. అందుచేతనే ఆ గౌరీ శంకరుల వచనములు జ్ఞానయుక్తము లగుటచేత సర్వవచనముల కన్న గొప్పవి. అందరి మాటలకు (ప్రశ్నలకు) ఉత్తరములు అనగా సమాధానములు కూడ కాగలిగినపుడు అర్థాంతరము కూడ సర్వోత్తరాణి అను సమాసము స్ఫురింపజేయును. వారి మాటలలో అమృతముండుటచే





పతిమాట సతికి, సతిమాట పతికి జీవనము. కావున వారి పరస్పర సల్లాపములే వారికి జీవన దానము లగును. ఇద్దరి ముఖముల నుండి వెలువడినవై వారి హృదయముల ఐక్యము నవి ప్రకటించును. హృదయాద్వయ జీవనాని అను సమాస మీ యంశమును స్ఫురింపజేయును. ఈ శ్లోకమున్ను వసన్తతిలకా వృత్తనిబన్ధనమే.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివపార్వతీ సల్లాప శ్రవణ వాంఛ చెప్పబడినది. ఈ శ్లోకమున వారి వాహనమైన వృషభముయొక్క గిట్టల చప్పుడు వినవలెనని కవి వాంఛ చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనేకలీలాగతిచాతురీయుతం**
**తవేశ! వోఢుర్వృషభస్యనర్తితమ్।**
**సభూషణధ్వానఖురారవం కదా**
**కరిష్యతి శ్రోత్రయుగోత్సవ మ్మమ॥** **34**

**ప్రతిపదార్థం :-** హే ఈశ - ఓ శివా!, అనేక లీలాగతి చాతురీయుతమ్ = అనేక విలాసముల గతుల చాతుర్యముతో కూడిన, తవ = నీయొక్క, వోఢుః = వాహనమైన, వృషభస్య = ఎద్దుయొక్క, నర్తితమ్ = నటనము చేయబడిన, సభూషణధ్వాన ఖురారవమ్ = భూషణ ధ్వనితో కూడిన గిట్టల చప్పుడు, కదా = ఎప్పుడు, మమ = నాయొక్క, శ్రోత్రయుగోత్సవమ్ = కర్ణద్వయమునకు సంతోషమును, కరిష్యతి = కలిగించునో?
**తాత్పర్యము :-** ఓ శివా! అనేక విలాసముల గతుల చాతుర్యముగల త్వద్వాహన వృషభ నటన సమయ జనిత భూషణ ధ్వనితో కూడిన గిట్టలచప్పుడు నా చెవుల కెపుడు సంతోషమును కలిగించునో?
**వివరణ :-** ధీరోధాత్త పురుషులు సింహశార్దూల వృషభగజ (చతుర్విధ) గతులు కలిగి యుందురు. చతుర్విధ గతులలో వృషభగతి యొకటి. శివుని వాహనమైన వృషభము కూడ విలాసముతో (ఒయ్యారముతో) కూడిన గతిచాతురి కలదియే. అయినను ఆ యెద్దు ముసలిదని హాస్యమొనరించుటకు శివుడును ఆ వృషభమువలె వృషభ శిరము వంటి తొడుగు నొకదానిని తన తలకు తగిలించుకొని, తన చేతులకు కాళ్లకు గిట్టల తొడుగులను ధరించి అభినయించు నప్పుడు ధరించిన సొమ్ముల ధ్వనితో పాటు గిట్టల చప్పుడును వినిపించును. దానిని వినవలెనను కవి వాంఛ ఇందు వ్యంజింపజేయబడినది. ప్రతిపాదమున జ-త-జ-ర అను గణములుండుటచే నీ శ్లోకము వంశస్థవృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** ఆ పై శ్లోకమున దర్శనీయ నర్తన సమయజ భూషణ ఖుర ధ్వని శ్రవణవాంఛ చెప్పబడినది. ఈ శ్లోకమున దర్శనీయ శివరూప (రసాయన) పానవాంఛ చెప్పబడుచున్నది.

**శ్లో॥ శార్దూలచర్మపరివీతపవిత్రమూర్తిం**
**చన్ద్రావతంసకసమఞ్చితచారుమస్తమ్।**
**నన్దీశవాహనమనాథమనాథనాథం**
**త్వాం పాతుముత్సుకతరోఽస్మి విలోచనాభ్యామ్॥ 35**

**ప్రతిపదార్థము :–** శార్దూల చర్మ పరివీత పవిత్రమూర్తిమ్ = పులిచర్మము దాల్చిన పవిత్రాకృతిగల, చన్ద్రావతంసక సమంచిత చారుమస్తమ్ = చన్ద్ర భూషిత సుందర పూజ్య శిరముగల, నన్దీశ వాహనమ్ = నన్దీశ్వరుడు వాహనముగాగల, అనాథమ్ = ప్రభువులేని, అనాథనాథమ్ = దిక్కులేనివారికి ప్రభువైన, త్వామ్ = నిన్ను, విలోచనాభ్యామ్ = కన్నులతో, పాతుమ్ = త్రాగుటకు, ఉత్సుకతరః అస్మి = మిక్కిలి ఉత్కంఠ కలిగి యున్నాను.

**తాత్పర్యము :–** పులిచర్మము దాల్చిన పవిత్రాకృతి చన్ద్రభూషిత శిరమును గల, తనకు మరొక ప్రభువులేని, అనాథలందరకును నాథుడవైన నిన్ను కన్నులతో త్రాగుటకు మిక్కిలి ఉత్కంఠ కలిగియున్నాను.

**వివరణ :–** 1. శివుడు పులి చర్మమును కట్టుకొనువాడు. కప్పుకొనువాడు. యోగీశ్వరుడైన ఆ శివుని ఆదర్శముగా గొని యోగులు పులి చర్మమును ధరించుట, పులి చర్మముపై కూర్చొని ధ్యానించుట జపించుట మొదలగు కర్మల నాచరించెదరు. వారెల్ల పవిత్ర మూర్తులుగా భారతదేశమున భావింపబడుచున్నారు. శివుడు సహజముగానే పవిత్రమూర్తి. అతడు ధరించుటచే ఎల్ల పులుల చర్మములకును పవిత్రత చేకూరినదేమో వానిని ధరించుటచేత తమకు పవిత్రత కలుగునని యోగులట్లు చేసెదరు. 2. శివుని శిరమున చంద్రుడు భూషణముగా నున్నాడు. అతని శిరములోపల సహస్రార చంద్రుడున్నాడు. యోగులు తమ మూలాధారము నందలి కుండలినిని తమ శరీరములోని సహస్రార చన్ద్ర మండలము జేర్చి శివత్వమును పొందెదరనుట తాంత్రిక సిద్ధాంతము. 3. శివుడు సర్వేశ్వరుడు. అతనికి మరొక ఈశ్వరుడుండుట అసంభవము. అందుచేత ఈ శ్లోకమున అతడు అనాథుడని చెప్పబడినాడు. నాథుడనగా అడిగిన దానినిచ్చు ప్రభువు. లోకమున దీనుల కెవరికైన ఏమైనా ఇచ్చువారికి ప్రభువులగుదురు. అట్లు ఇచ్చుటకు తల్లిదండ్రీ మొదలగు వారెవరు ఏమియునిచ్చి పోషించు వారులేనివా రనాథలనబడుదురు. అట్టి



లోకమున అనాథులైన వారిని శివుడు పోషించును. సంపన్నుల హృదయములలో ప్రవేశించి దీనులైన అనాథులకేమైనా కావలసిన దానినిచ్చునట్లు చేయువాడు శివుడే. కావున శివుడనాథనాథుడు. అనాథ అనాథనాథ శబ్దముల ప్రయోగమున విరోధాభాసాలంకార స్ఫూర్తి ఉన్నది. 4. ఈశ్వర వాహనమైన నంది ఈశ్వరునికి వాహనముగా నుండి అతనికి నన్దము అనగా ఆనందము కలిగించును. అందుచేత ఆ వృషభము నన్ది యను సార్థకనామము నొందెను. ఈశ్వర నన్దియైన అతనికి నన్దీశ నామము ప్రసిద్ధముగా నున్నది. 5. పానము చేయుట ముఖముయొక్క లేక ముఖములోని నాలుకయొక్క కృత్యము. ఘనపదార్థములు బాగుగా నములుటచే ద్రవ భూతములు కాగా నవి త్రాగదగిన వగును. ఘనద్రవ పదార్థములు కంఠముద్వారా అన్నకోశమును చేరును. పానక్రియలో ముఖకంఠ దంతాద్యవయములు పాల్గొనినను వాని రుచి నాలుకచేతనే గ్రహింపబడును. రుచిగల పదార్థము లన్నియు నాలుకచే గ్రహింపబడి భోక్త కానందము నొసగును. చెవులు శబ్దమును, కన్నులు రూపమును గ్రహించి శ్రోతకు ద్రష్టకు ఆనందము కలిగించును. ఘనపదార్థముల నములునప్పుడు వాని రుచిని గ్రహించు నాలుక ద్వారానే జీవునికి భోకృత్వము సంభవించినను చక్షశ్శ్రోత్రాంద్రియ ద్వారమున రూప శబ్దాది విషయములనుభవించిన జీవుని కూడ భోక్తయనుట శాస్త్ర వ్యవహారసిద్ధము. కథామృత పానము, నామామృత పానము, గుణకథామృతపానము, రూపామృతపానము మొదలగు వ్యవహారములు కవి వ్యవహార సిద్ధములు. వాస్తవమునకు అమృతారోపము కలవైనను నామ కథాగుణకథాకథనములు శ్రోత్ర ద్వారముననే శ్రోత కానందము కలిగించును. అవి శ్రోత్రప్రేయములు (చెవులచే త్రావదగినవి) అనుట కూడ కవి వ్యవహారసిద్ధమే. అట్లే అమృతారోపము చేయబడినను రూపము చక్షుఃపేయమే. సుందర రూపము చక్షుఃపేయమనుటయు కవి వ్యవహార సిద్ధమే. కావున ఈ శ్లోకమున కవి శివరూపము తన కన్నులతో త్రావుటకు ఉత్కంఠ కలిగి యున్నానని చెప్పుట కవి వ్యవహారానుగుణముగా నున్నది.

ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము వసంతతిలకా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివరూపామృత పాన వాంఛ వ్యక్తము చేయబడినది. ఈ శ్లోకమున శివునినుండి అభయ మర్థింపబడుచున్నది.

**శ్లో॥ కురఙ్గరఙ్గత్తరమధ్యభాగం - భుజఙ్గమశ్రీకరకఙ్కణాఢ్యమ్।**
**హస్తం ప్రశస్తం తవ మస్తకే మే - నిధాయ నిత్యాభయమీశ! దేహి॥ 36**

**ప్రతిపదార్థము :-** కురఙ్గ రఙ్గత్తర మధ్యభాగమ్ = జింకతో మిక్కిలి ప్రకాశించు మధ్యభాగముగల, భుజఙ్గమ శ్రీకర కఙ్కణాఢ్యమ్ = భుజఙ్గ కాంతిని ప్రసరింపజేయు చేతి కడియములతో కూడిన, ప్రశస్తమ్ = ప్రశంసింపదగిన, తవ = నీయొక్క, హస్తమ్ = చేతిని, ఈశ = ఓ ఈశ్వరా!, మే = నీయొక్క, మస్తకే = శిరమున, నిధాయ = ఉంచి, నిత్యాభయమ్ = సర్వ (భవిష్య) కాలాభయమును, దేహి = ఇమ్ము.

**తాత్పర్యము :-** మధ్యన జింకగల, ఆది యందు సర్పకంకణముగల ప్రశస్తమైన నీ హస్తము నో ఈశ్వరా! నా శిరమున ఉంచి సర్వభావికాలాభయము నొసగుము.

**వివరణ :-** శివుని దశభుజములలో నొక హస్తమున జింక యుండును. అది హస్తమున నెక్కడ ఉన్నదను ప్రశ్నమునకు హస్త మధ్యభాగమున అని కవిచే ఈ శ్లోకమున ప్రథమ (పాద) విశేషణమున చెప్పబడినది. హస్తమునకు అనగా చేతికి అది ముంజేయి. ఆ ముంజేయి సర్పకంకణముతో కూడి యున్నదని రెండవ (పాదము) విశేషణమున చెప్పబడినది. ఇక నీ హస్తముయొక్క చివఱిభాగము వ్రేళ్ళుగల భాగమును అనగా హస్తాగ్రమును శిరమున ఉంచుట మూడవ పాదమున అర్థింపబడినది. హస్త మస్తక సంయోగము అనుగ్రహసూచకము. కావున అది ఈ శ్లోకమున మూడవపాదమున అర్థింపబడినది. ఇప్పటివఱకు మరణ జరాది బహువిధ దుఃఖభయమున తనకు భావికాలమున భయరాహిత్యము నాల్గవపాదమున అర్థింపబడినది. ఇందలి 1,2,4 పాదములు జ-త-జ-గ-గ అను గణములతో అనగా ఉపేన్ద్రవజ్రా లక్షణములతో 3వ పాదము ఇన్ద్ర వజ్రా లక్షణముతో అనగా త-త-జ-గ-గ అను గణములతో కూడి యుండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనము. 2. జింక సర్పముల నమిలి తినును. ఆ జింక మధ్య భాగమున నుండుటయే ఆ జింకకు వెనుక ముంజేత సర్పకంకణమున్నను అది భక్తులకు భయమును కలిగించదు. పైగా ఆ హస్తము వరాభయదాన నిపుణమగుటచే ప్రశస్తమైనదని ప్రశస్త శబ్దము వ్యంజించును.

---

**అవతారిక :-** పై శ్లోకమున అభయదాన మర్థింపబడినది. ఈ శ్లోకమున తాపత్రయ శమన మర్థింపబడినది.

**శ్లో॥ యావన్న మాం భవదదర్శనరన్ధ్రవేది**
**తాపత్రయం పరిదృఢం నితరాన్ధునోతి।**



**తావన్మహేశ! కురు చన్ద్రవిలోచనేన**
**దృష్ట్వా సుశీతలమతీవ సుధామయేన॥ 37**

**ప్రతిపదార్థము :-** యావత్ = ఎంతలో, భవదదర్శన రన్ధ్రవేది = నీ అదర్శనము అను అవకాశము నెఱుగు, తాపత్రయమ్ = తాపత్రయము, పరిదృఢమ్ = మిక్కిలి దృఢమై, నితరామ్ = మిక్కిలి, మామ్ = నన్ను, న ధునోతి = పీడించదో, తావత్ = అంతలోనే, మహేశ! = ఓ మహేశ్వరా!, సుధామయేన = అమృతమయమైన, చన్ద్ర విలోచనేన = చన్ద్రనేత్రముతో, దృష్ట్వా = చూచి, అతీవ = మిక్కిలి, సుశీతలమ్ = చల్లనైన వానినిగా, కురు = చేయుము.

**తాత్పర్యము :-** నిన్ను చూడలేదను అవకాశము నెఱిగి మిక్కిలి దృఢమైన తాపత్రయము నన్నెంతలో మిక్కిలి పీడించకుండునో అంతలోనే అమృతమయమైన నీ చన్ద్రనేత్రముతో నన్ను మిక్కిలి చల్లనైన వానినిగా చేయుము.

**వివరణ :-** చన్ద్రు దమృతమయుడు. శివుని ఒక (ఎడమ) కన్ను చన్ద్రరూపము. కావున కవి సుధామయ చన్ద్రనేత్రముతో తనను చూచి చల్లబఱచుమని శివుని కోరుచున్నాడు. శివుని దర్శనము కలిగిననే ఆయన చన్ద్రనేత్రము కటాక్షామృతమును తనపై వర్షించగలదు. ఈతనికి శివదర్శనము కలుగలేదని ఎఱిగిన తాపత్రయము ఇంతవఱకు బాధించినదాని కన్న అధికముగా బాధించుటకు దృఢముగా పూనుకొనును. నీ దర్శనముచే నేను చల్లబడితినేని ఆ తాపత్రయము నాదగ్గఱకు రాగానే అదియు చల్లబడి నన్ను తపింపజేయ జాలకుండును. ఇప్పటివఱకు ఎట్లో తాపత్రయము ననుభవించుచున్నను నీ కరుణచే సహింపరానంత తీవ్రబాధ కలుగుటలేదు. ఒకవేళ కలిగినను నీ దర్శనము కలుగునను ఆశతో సహించుచున్నాను. నీకు కరుణ నాపై రాదని ఈ తాపత్రయము నిశ్చయించుకొని నన్ను బాధింపబూనుకొనెనేని నేనా బాధను తట్టుకొనలేక మరణమునే పొందవలసి వచ్చును. 2. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవిక భేదమున తాపము మూడు విధములుగా నుండును. ఈ మూడు తాపములు తాపత్రయమనబడును. శరీరమున రోగాదులచే మనసున చిన్తాదులచే కలుగు బాధ (తాపము) ఆధ్యాత్మికమనబడును. కుక్కలు మొదలగు భూతము (జంతువు) లచే కలుగు బాధ (కాపము) ఆధిభౌతికమనబడును. పిడుగులు కఱువు మొదలగు దేవతలచే కలిగింపబడిన బాధ (తాపము) ఆధిదైవికమనబడును. దీనిలో ఒక్కొక్కటే మిక్కిలి తపింపజేయు ననగా ఈ మూడు ఒకేసారే వేధించినచో కలుగు తాపము మిక్కిలి తీవ్రముగా నుండునను అంశము తాపత్రయ శబ్దము స్ఫురింపజేయును. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే నీ

శ్లోకము వసంతతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పూర్వ శ్లోకమున చంద్ర నేత్రమున తనను చూచి చల్లబఱచుట అర్థింపబడినది. ఈ శ్లోకమున సూర్యనేత్రమున తనలోని అంధకారముయొక్క వినాశమర్థింపబడుచున్నది.

**శ్లో॥ యావన్న మే మనసి దుష్టతమోఽభివృద్ధిః**
**సర్వార్థదర్శనవిఘాతకరీ దురన్తా।**
**తావత్క్షణం తవ విలోచనరూపసూర్య–**
**తేజః ప్రసారయ మయీశ్వర! దీనబన్ధో!॥ 38**

**ప్రతిపదార్థము :–** దీనబన్ధో = దీనులకు బన్ధుడవైన, ఈశ్వర = ఓ ఈశ్వరా, యావత్ = ఎంతలో, మే = నాయొక్క, మనసి = మనసున, న దుష్ట తమోభివృద్ధిః = దుష్టమైన తమస్సుయొక్క వృద్ధినొందదో, సర్వార్థ దర్శన విఘాతకరీ = అన్ని విషయములు చూచుటకు, విఘాత మొనరించునదై, దురన్తా = దుఃఖము అన్తమందు గలదైన, తావత్ = అంతలో, క్షణమ్ = క్షణకాలము, తవ = నీయొక్క, విలోచనరూప సూర్యతేజః = కన్ను అనెడి సూర్యుని తేజమును, మయి = నాయందు, ప్రసారయ = ప్రసరింప జేయుము.

**తాత్పర్యము :–** నా మనసున సర్వార్థ దర్శనమునకు ఎంతలో విఘాతమొనరించు దురన్తమైన తమము అభివృద్ధినొందదో అంతలోనే నీ సూర్యనేత్రమును నాయందు ప్రసరింపజేయుము.

**వివరణ :–** ఇప్పటికి దినదినము నా మనసున తమము వృద్ధియై కొన్ని విషయములు దర్శింపనీయకున్నది. అది ఇంకను వృద్ధిచెంది నా మరణ సమయమున సర్వార్థములు అనగా సర్వ విషయముల దర్శనమునకు విఘాతమును కలిగింపజేయునేమో ఆ లోపుననే నీ సూర్యనేత్ర కటాక్ష కాంతిని ప్రసరింపజేసినచో ఆ తమము సంపూర్ణముగ నశించి వెంటనే సంసారబన్ధము నుండి ముక్తుని కాగలను అనునది శ్లోకము నందలి ముఖ్యమైన భావము. పై శ్లోకమువలె ఈ శ్లోకమును వసంతతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పూర్వ శ్లోకద్వయమున శివుని సూర్యచంద్రనేత్ర కటాక్ష కాంతి ప్రసారాణానుగ్రహము అర్థింపబడినది. ఈ శ్లోకమున అట్టి అనుగ్రహమున విలమ్బమును సహింపక దానికి శివుని బహుప్రకారసంబోధనము చేయబడుచున్నది.



**శ్లో॥ హే రుద్ర! హే మహిత! హే పరమేశ! శమ్భో!**
**హే శర్వ! హే గిరిశ! హే శివ! హే స్వయమ్భో!**
**హే దేవ! హే పశుపతే! కరుణార్ద్రచిత్త!**
**గన్తుమ్మమాక్షిపథమేష కథం విలమ్బః॥ 39**

**ప్రతిపదార్థము :–** హే రుద్ర = ఓ రుద్రా!, హే మహిత = ఓ పూజ్యుడా! హే పరమేశ = ఓ పరమేశ్వరా!, శమ్భో = ఓ శమ్భూ!, హే శర్వ = ఓ శర్వా, హే గిరిశ =ఓ గిరిశా, హే శివ = ఓ శివా!, హే స్వయమ్భో = ఓ స్వయమ్భూ!, హే దేవ = ఓ దేవా, హే పశుపతే = ఓ పశుపతీ! హే కరుణార్ద్రచిత్త! = ఓ దయతో తడిసిన మనస్సు కలవాడా!, మమ = నాయొక్క, అక్షిపథమ్ = నేత్రమార్గమును, గన్తుమ్ = పొందుటకు, ఏష = ఈ, విలమ్బః = ఆలస్యము, కథమ్ = ఎట్లు?

**తాత్పర్యము :–** రుద్ర మహిత పరమేశ శమ్భు శర్వ గిరిశ శివ స్వయమ్భూ దేవ పశుపతి కరుణార్ద్రచిత్త నామముల సంబోధింపదగిన శివుడు నా కంటి మార్గమున ప్రవేశించుటకు ఆలస్యము చేయుట ఎట్లు సహింపదగును.

**వివరణ :–** రు లేక రుత్ అనగా దుఃఖము. దానిని ద్రవింపజేయువాడు అనగా పారద్రోలు వాడు రుద్రుడు. ఎవని కీశుడు మరొకడు లేడో వాడే పరమేశుడు. ఎవని నుండి సుఖము (ఇతరులకు) కలుగునో అతడు శమ్భువు. ఎవడు ప్రపంచమును నశింపజేయునో (శ్వహింసాయామ్) ఆతడు శర్వడు, గిరియందు శయనించువాడు గిరిశుడు. సుఖ స్వరూపుడు శివుడు. తనకు తానే జన్మించువాడు స్వయమ్భువు. ప్రకాశించువాడు దేవుడు. పశువులైన అనగా అజ్ఞానులైన జీవులకు పతి అనగా ప్రభువైనవాడు పశుపతి. కరుణార్ద్ర చిత్త అను సంబోధనము తనయందు కరుణ చూపించగలవాడవు నీవే పర అని పరమేశ్వరుని కరుణచూపగల సమర్థతను అట్లు సంబోధించిన కవియొక్క కరుణా పాత్రతను వ్యంజించును. పైన చెప్పిన యర్థము నందే అజాదియైన ఋద్రశబ్ద మొకటి శైవమున కాన్పించును. ఆ శబ్దమునుండి పుట్టిన శబ్దము ఆర్ద్రశబ్దము. ఆర్ద్రశబ్దార్థ మాధారముగా తన్మూలమైన ఋద్రశబ్దము ఆర్ద్రతకు మూలమైన అభిషిక్తితను సూచించునేమో, శివుని అభిషేక ప్రియత లోక ప్రసిద్ధము కదా! రుద్రాది శబ్ద ప్రతిపాద్యుడైన శివుడు తనదృష్టి మార్గమున సముపస్థాపితుడు కావలెనను వాంఛ ఈ శ్లోకమున ప్రతిపాదించబడినది. శ్లోకము వసంతతిలకా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని (రూపముయొక్క) చక్షుర్గోచరిత అర్థింపబడినది. ఈ శ్లోకమున మనఃస్థితుడైన శివుని అధిక ప్రసన్నతకై యత్నము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కిమిదముదితం వారం వారం త్రిలోకధురన్ధరం**
**మదనమథనమ్మాయాతీతమ్మదన్తరవర్తినం।**
**యమనియమనం కారుణ్యామ్భోనిధిం పరమేశ్వరం**
**బహు రసనయా స్తుత్వా కర్తుం ప్రసన్నతరం యతే॥ 40**

**ప్రతిపదార్థము :–** వారం వారమ్ = మాటిమాటికి, ఉదితమ్ = ఉదయించునది, ఇదమ్ = అది, కిమ్ = ఏమి, త్రిలోక ధురంధరమ్ = మూడులోకముల బరువును మోయు, మదన మథనమ్ = మన్మథుమథించిన, మాయాతీతమ్ = మాయను దాటి యున్న, మదన్తర వర్తినమ్ = నాలోననున్నట్టి, యమనియమనమ్ = యముని నియమించునట్టి, కారుణ్యామ్భోనిధిమ్ = దయా సముద్రుడైన, పరమేశ్వరమ్ = పరమేశ్వరుని, బహు = మిక్కిలి, రసనయా = నాలుకతో, స్తుత్వా = స్తుతించి, ప్రసన్నతరమ్ = మిక్కిలి ప్రసన్నునిగా, కర్తుమ్ = చేయుటకు, యతే = యత్నము చేయుదును.

**తాత్పర్యము :–** నాలో నేదో తెలియకయే ఉదయించుచున్నది. ముల్లోకపు బరువుమోయు, యమమన్మథుల నణచిన, మాయాతీతుడైన, కరుణాసముద్రుడై నాలోన నున్నట్టి, పరమేశ్వరుని నాలుకతో మిక్కిలి స్తుతించి మిక్కిలి ప్రసన్నునిగా చేసికొనుటకు యత్నించెదను.

**వివరణ :–** మెఱుపువలె నామదిలో నేదో మెదులుచున్నదనుట ప్రథమపాద ప్రథమార్ధార్థము. ముల్లోకముల బరువును శివుడే మోయుచున్నను జీవులీ సంసార భారమును తామె నెత్తి కెత్తుకొని మోయుటయే 'లోకో' అను తద్వితీయార్ధార్థము. మాయామయ జగమున మన్మథుని మథించు వాడెవడును లేడు. శివుడు మాయాతీతుడు కావున వాని మథించినా డనుట ద్వితీయపాద ప్రథమార్ధార్థము. మాయాతీతుడయ్యు తనలోనే ఉన్నట్లు కలుగు తన విశ్వాసమునకు హేతువేమి? అను ప్రశ్నమును తద్వితీయారార్థము వ్యంజించును. తన యాజ్ఞ చేతనే లోకమును యమించిన అనగా చంపిన యముడు తన భక్తుడైన మార్కండేయునట్లే చంపబోగా తానే ఆ యముని గర్వము నణచవలసి వచ్చుట విచిత్రము గాదా! అను ఆశ్చర్యమును తృతీయపాదము నందలి ప్రథమ విశేషణము వ్యంజించును. పైగా శివుడు కారణ్యామ్భోనిది. ఇట భక్తుడైన మార్కండేయునిపై గల కారుణ్యముతో యముని ఇప్పటివఱకు తన యాజ్ఞనే పాటించిన వానిని నియమించుట మఱొక యాశ్చర్యము. ఆయన పరమేశ్వరుడు గదా. ఆయనను





కాదను వాడెవ్వడును లేడను భావము తోడనే ఇట్లు స్వేచ్ఛగా తన ప్రభుత్వమును అధికారమును లోకమున రుద్దుచున్నాడేమో? అను సందేహమును మూడవ పాదమందలి చివటి పరమేశ్వరమ్ అను పదము వ్యంజించును. ఇప్పటికే కొంత ప్రసన్నుడై తనలో నేదో తెలియని ప్రసన్న భావమును ప్రకటింపజేసిన శివుని మఱింత ప్రసన్నునిగా చేయుటకు నాలుకతో మిక్కిలి స్తుతించుట అను యత్నమున కన్న తాను చేయదగిన, చేయగలిగిన ప్రయత్నము మరొకటి లేదను అంశమును నాల్గవపాదము వ్యంజించును. రెండవ పాదమున ప్రతిపదముయొక్క ఆదియందు మకారముండుట 'యమ నియమన' అనుచోట య,మ,న,ల ఆవృత్తి, నాల్గవ పాదమున 1–11 వర్ణముల మైత్రి శ్లోకమందక్షర రమ్యతను కలిగించుచున్నది. ప్రతిపాదమున న–స–మ–ర–స–ల–గ అను గణములుండుటచే నీ శ్లోకము హరిణీ వృత్త నిబన్ధనము.

---

**శ్లో॥ హే శమ్భో! శివ! హే మహేశ్వర! విభో! వారాణసీశ! ప్రభో!**
**హే మృత్యుఞ్జయ! హే హిమాద్రితనయా ప్రాణేశ! హే శఙ్కర!**
**హే కైలాసగిరీశ! హే పశుపతే! హే శేషభూషాదృతే!**
**హే నన్దీశ్వరవాహనాఞ్చితగతే! హే దేవదేవేశ్వర!॥ 41**

**ప్రతిపదార్థము :–** హే శమ్భో = ఓ శమ్భో!, హే శివ = ఓ శివా!, హే మహేశ్వర! = ఓ మహేశ్వరా!, విభో = ఓ విభో!, వారాణసీశ = ఓ కాశీనాథా, ప్రభో = ఓ ప్రభూ!, హే మృత్యుఞ్జయ = ఓ మృత్యుఞ్జయా!, హే హిమాద్రితనయా ప్రాణేశ! = ఓ పార్వతీ ప్రాణనాథా!, హే శఙ్కర = ఓ శఙ్కరా!, హే కైలాసగిరీశ! = ఓ కైలాస పర్వతేశ్వరా!, హే పశుపతే = ఓ పశుపతీ!, హే శేషభూషాదృతే = ఓ శేష భూషణాదరా!, హే నన్దీశ్వర వాహనాఞ్చితగతే = ఓ నందీశ్వర వాహనముయొక్క పూజితమైన నడక గలవాడా!, హే దేవ దేవ = ఓ దేవదేవా, ఈశ్వర = ఓ ఈశ్వరా!

**తాత్పర్యము :–** శమ్భు శివాదినామ ప్రతిపాద్యుడు శివుడు.

**వివరణ :–** సుఖము పుట్టించువాడు శమ్భువు. త్రిగుణాతీతుడు శివుడు. ఈశ్వరులకు ఈశ్వరుడైనవాడు మహేశ్వరుడు లేక గొప్ప ప్రభువు ఈశ్వరుడు. సర్వవ్యాపకుడు విభువు. వరణ, అసి అను నదులచే చుట్టబడిన నగరము వారణాసి. దాని ప్రభువు వారాణసీశుడు. ప్రభువు ఉత్కృష్టమైన పుట్టుక లేక మాటి మాటికవతరించుట గలవాడు. మృత్యువును జయించినవాడు, మృత్యుఞ్జయుడు. హిమాద్రి తనయ పార్వతి. ఆమె ప్రాణనాథుడు

హిమాద్రి తనయా ప్రాణేశుడు. శమ్ అనగా సుఖము. దానిని కలిగించువాడు శఙ్కరుడు. కైలాస పర్వతమునకు ఈశుడు కైలాస గిరీశుడు. శివునిచే బంధింపబడిన పశువులు, జీవులు వారిని విడిపించు ప్రభువు పశుపతి. శేషనామక సర్పాధిపతి భూషణముగా ధరించుట యందాదరము గలవాడు శేషభూషాదృతి. నందీశ్వర వాహనముపై పూజితమైన గమనము గలవాడు నందీశ్వర వాహనాఞ్చితగతి. దేవతలతో వ్యవహరించువాడు దేవదేవుడు. ఎవరికీశ్వరుడో ప్రత్యేకముగా పేర్కొని నిరుపపదమైన ఈశ్వర శబ్దము సర్వుల కీశ్వరుడను నర్థము బోధించును. మ-స-జ-స-త-త-గ అను గణములు అన్న పాదములందుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత నిబన్ధనము.

---

**శ్లో॥ హే గౌరీకుచకుమ్భమర్దనపటో! హే సర్వలోకప్రభో!**
**హే హేరమ్బకుమారనన్దనగురో! హే చన్ద్రచూడామణే।**
**హే గఙ్గాధర! హే గజాసురరిపో! హే వీరభద్రాకృతే!**
**హే విశ్వేశ్వర! హే మహాగణపతే! హే పఞ్చబాణాప్రియ!॥ 42**

**ప్రతిపదార్థము :-** హే గౌరీకుచకుమ్భ మర్దన పటో = ఓ గౌరీదేవియొక్క కుండలవంటి స్తనముల మర్దించుట యందు సామర్థ్యము గలవాడా!, హే సర్వలోక ప్రభో = ఓ అన్ని లోకములకు ప్రభువైన వాడా!, హే హేమర్భ కుమార నన్దనగురో! = ఓ గణపతి కుమారస్వామి అను కుమారులకు తండ్రివైన వాడా!, హే చంద్ర చూడామణే! = ఓ చంద్రుడు జూట మందలి మణిగా గలవాడా!, హే గఙ్గాధర! = ఓ గంగను ధరించిన వాడా, హే గజాసుర రిపో = ఓ గజాసురనకు శత్రువైన వాడా!, హే వీరభద్రాకృతే = ఓ వీరభద్రాకృతి గలవాడా!, హే విశ్వేశ్వర! = ఓ విశ్వమున కీశ్వరుడైన వాడా, హే మహా గణపతే = ఓ గణపతులకు పతివైన వాడా!!, హే పఞ్చబాణాప్రియ! = ఓ మన్మథునకు శత్రువైన వాడా!

**తాత్పర్యము :-** శివుడు గౌరీ కుచ కుంభ మర్దన పట్వాది శబ్దవాచ్యుడు.

**వివరణ :-** గౌరీకుచ కుమ్భ మర్దన పటో! అను సంబోధనము శివుని శృంగారిత్వమును, విశ్వేశ్వర మహాగణపతే వీరభద్రాకృతే సర్వలోక ప్రభో అను సంబోధనములు శివుని వత్సలతను, చన్ద్ర చూడామణే గంగాధర అను సంబోధనములు శివుని అద్భుతత్వమును, గజాసురరిపో అను సంబోధనము శివుని రౌద్రతను సూచించును.

ఈ శ్లోకమున్ను శార్దూలవిక్రీడిత నిబన్ధనము.



**శ్లో॥ హే శ్రీకణ్ఠ! జనార్దన ప్రియ! గురో! హే భక్తచిన్తామణే!**
**హే సర్వాఞ్చిత! సర్వమఙ్గలతనో! హే సత్కృపావారిధే!।**
**హే రుద్రామితభూతనాయకపతే! హే విష్టపాలఙ్కృతే!**
**హే సర్వేశ! సమస్తసద్గుణనిధే! హే రాజరాజప్రియ!॥ 43**

**ప్రతిపదార్థము :-** హే శ్రీకణ్ఠ! = ఓ విషమును కంఠమందు ధరించినవాడా, జనార్దనప్రియ = విష్ణువునందు ప్రేమగలవాడా!, గురో = (సర్వలోకములకు) గురువైన వాడా, హే భక్త చిన్తామణే! = ఓ భక్తుల చింతితార్థముల నిచ్చు దేవమణి వైన వాడా!, హే సర్వాఞ్చిత! = ఓ అందఱ చేత పూజింపబడిన వాడా!, సర్వమంగలతనో! = సర్వమంగలములు శరీరమందు గలవాడా!, హే సత్కృపా వారిధే = ఓ మంచి కృపకు సముద్రుడైనవాడా, హే రుద్ర = ఓ రుద్రా!, అమిత భూత నాయక పతే! = అంతులేని భూతముల నాయకులకును పతివైన వాడా, హే విష్టపాలఙ్కృతే = ఓ లోకాలంకారా!, హే సర్వేశ = ఓ సర్వేశ్వరా!, సమస్త సద్గుణనిధే! = ఓ సమస్త సద్గుణములకు గనియైనవాడా!

**తాత్పర్యము :-** శివుడు శ్రీ కంఠాది శబ్ద ప్రతిపాద్యుడు.

**వివరణ :-** శ్రీ అనగా విషము. అది కంఠమునందు కలవాడు శ్రీ కణ్ఠుడు. జనులను ప్రేమించి సంతోషింపజేయువాడు జనార్దనుడు. అందుచేతనే జనార్దను నందు ప్రేమ కలిగినవాడు శివుడు. జన్మ లేని శివుడు జన్మకల వారందఱకు గురుడు. భక్తుల కోరికలు దీర్చుటలో శివుడు చిన్తామణి వంటివాడు. శివుడు సర్వుల చేతను పూజితుడు అగుటచే సర్వాఞ్చితుడు. ఆయన శరీరముగా నున్న పఞ్చభూతములు సూర్యచంద్రులు యజమానుడును అందఱకు అన్ని మంగలముల నొసగుటచే శివుడు సర్వమఙ్గల తనువు. శివుని దయ మంచిది. అందఱిలోనను మంచితనమును పెంచును. అందఱును మంచివారుగా చేయును. మంచివారైన వారి యందందఱయందును ఆయన కృప కంతములేదు. కావున ఆయన సత్కృపావారిధి. సముద్రమందు జలము ఎట్లు అనంతముగా నుండునో, శివుని యందట్లు కృప అనంతముగా నుండును. అందుచేత శివుడు సత్కృపావారిధి. **'యోఽరోదిత్ సోరోదీత్తస్య రుద్రస్య రుద్రత్వమ్'** అను శ్రుతి ననుసరించి, లోక దుఃఖమునకు ద్రవించి రోదించు వాడు రుద్రుడు. అట్లు రోదించి లోక దుఃఖమును పోగొట్టు వాడగుట చేతను అతని రుద్రత్వము సార్థకము. భూతములు అమితములు. వాని నాయకులెందరో, వారందఱకును పతి కావున శివుడు అమితభూత నాయకపతి. శివుడు లోకాలంకార భూతుడగుటచే విష్టపాలంకృతి. సర్వనియామకు డగుటచే శివుడు సర్వేశుడు. సర్వకల్యాణ గుణనిధి యగుటచే శివుడు సమస్త సద్గుణనిధి.

రాజరాజులకు లేక కుబేరునకు ప్రియుడగుటచే శివుడు రాజరాజ ప్రియుడు. ఈ శ్లోకమును శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**శ్లో॥ హే విష్ణ్వమేయచరణ! రజరజ్గవిభీకర!**
**కరవాలహతామిత్ర! మిత్రకోటిసమప్రభ!॥ 44**

**ప్రతిపదార్థము :–** హే విష్ణ్వమేయ చరణ! = ఓ విష్ణువుచేత కొలువరాని చరణములుగల వాడా!, రణరజ్గవిభీకర! = రణరజ్గమునందు మిక్కిలి భయము కలిగించువాడా!, కరవాల హతామిత్ర! = కత్తిచేత కొట్టబడిన శత్రువులు కలవాడా!, మిత్రకోటి సమప్రభ! = కోటిసూర్యుల కాంతితో సమానమైన కాంతిగలవాడా!

**తాత్పర్యము :–** విష్ణువు చేతను కొలువరాని చరణములుగల, రణరజ్గమున మిక్కిలి భీతిని కలిగించు, కరవాలమున శత్రువుల చంపు కోటి సూర్యకాంతితో సమానమైన కాంతి గలవాడు శివుడు.

**వివరణ :–** విష్ణువు బ్రహ్మ అహంకరించి ఉత్కర్ష విషయమున నేనంటెనేనే అధికుడనని పోట్లాడు కొనుచుండగా శివుడు ఆపాతాల నభ స్థలాంత బ్రహ్మాండాధికుడై ఊర్ధ్వాధో దిశలలో వ్యాపించిన లింగాకృతితో వారిమధ్య నిలువగా శివుని తలపైకి పోయిగాని, చరణములకు క్రిందికి పోయి చూడగలవాడు గొప్పవాడు అను ఆకాశవాణిని ఆదరించి బ్రహ్మ హంసరూపమున పైకి పోయినను, విష్ణువు క్రిందకు వరాహరూపమున భూమిని చీల్చుకొని పోయినను శివుని తల ఎంత పైనున్నదో చరణములెంత కిందకున్నవో కొలువలేకపోయిరను కథాంశమును ప్రథమపాదము సూచించును. రణ రంగమున మృత్యువు (యముడు) ప్రతివీరుడుగా నెదుటనున్నను వానికి మిక్కిలి భయమును కలిగించువాడని ద్వితీయ పాదము తెలుపును. కరవాలము అను శబ్దము కత్తి అను అర్థమున రూఢమైనను ఆయుధ సామాన్య సూచకముగా నిందు గ్రహించి శివుడు దాల్చు శూలాదులలో దేనినైనను సూచించునని చెప్పవచ్చును. వాల శబ్ద భవమైన వాలు అను తెలుగు శబ్దము శూలవాచకముగా నుండుట విజ్ఞులెఱుగుదురు. తృతీయపాదము మొత్తము మీద కత్తి, శూలము, ఖట్వాంగము మొదలగు ఏ ఆయుధము నుపయోగించియు ఉపయోగించక, హస్తము నుపయోగించియు అనగా కేవల హస్తమునే ఆయుధముగా నుపయోగించియు ఒకప్పుడు దానిని గూడ ఉపయోగింపక సంకల్ప మాత్రమునను శత్రుసంహారము చేయుగల శివుని మహిమను సూచించును. నాల్గవపాదము శివుని కాంతి సూర్యకోటి కాంతి సమానమైనదని కోటి శబ్దమానంత్య



వాచకమనియు స్ఫురింపజేయును. 2వ పాదముయొక్క అంతమునందలి శబ్దమునే తరువాతి పాదముయొక్క ఆదియందు ఉపయోగించుటచే ఈ శ్లోకమున ముక్తపద గ్రస్తాలంకారము ఏర్పడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–**పై నాలుగు శ్లోకములలో శివుడు వివిధ నామములతో సంబోధింపబడినాడు. ఈ క్రింది పూర్వాపరార్ధాద్యేకాక్షరైకమకుటములైన ఐదు శ్లోకములలో అతడు తనను రక్షింప బ్రార్థింపబడుచున్నాడు.

**శ్లో॥ వన్దితామన్దకున్దారవిన్దేన్దుసత్**
**సున్దరానన్దసన్దోహకన్దాకృతే।**
**మన్దమన్దార్థసంసారనిన్దామతే**
**పాహి మాం హే విభో! పార్వతీశ! ప్రభో!॥ 45**

**ప్రతిపదార్థము :–** వన్దితామన్ద కున్దార విన్దేన్దు సత్ సున్దరానన్ద సన్దోహ కన్దాకృతే = స్తుతింపదగిన గొప్ప మొల్లలు కమలములు, చన్ద్రుడు, ఆకాశమువలె సున్దరమైన ఆనన్ద సన్దోహముల గడ్డవంటి ఆకారముగలవాడా!, మన్దమన్దార్థ సంసార నిన్దామతే = మిక్కిలి అల్ప విషయమైన సంసారమును నిందించు మతి (బుద్ధి) గలవాడా, విభో! = సర్వ వ్యాపకుడా!, ప్రభో! = (సర్వలోకములకు) ప్రభువైన వాడా!, హే పార్వతీశ! = ఓ పార్వతీనాథా!, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.

**తాత్పర్యము :–** మొల్లలు తెల్ల కమలములు చన్ద్రుడు ఆకాశమువలె తెల్లనైన సున్దరమైన సుఖసమూహములకు మూలమైన ఆకారముగల వాడా! అత్యల్ప సంసారమును నిందించు బుద్ధి గలవాడా! ఓ పార్వతీనాథా! నన్ను కాపాడుము.

**వివరణ :–** పూర్వార్ధమున శివుని ధవలత స్వచ్ఛత సుఖమయత సుఖహేతువు చెప్పబడినవి. మూడవపాదమున పార్వతీనాథుడై సంసారివలెనున్న శివుని సంసార వైముఖ్యము చెప్పబడినది. దీనివలన అతనిని భజించు వారి సంసార దుఃఖము తొలగుట వ్యంజింపజేయబడినది. ఒక సంసారి లేక సర్వలోక సంసారుల మోచన మొనరించుట అనువైచిత్రి పరమేశ్వరు నందున్నదని అదేమంత విచిత్రము కాదనుటయు వ్యంజింపజేయబడుచున్నవి. ప్రతిపాదమున నాలుగు 'ర' గణములుండుటచే నీ శ్లోకము స్రగ్విణీ వృత్త నిబన్ధనము.

---

**శ్లో॥ అత్రిగోత్రప్రభూమిత్రచిత్రాంశుసద్ -**
**గోత్రనేత్రత్రయీపాత్రచిత్రానన!।**
**శత్రువిత్రాసకృజ్జైత్రయాత్రాస్థితే**
**పాహి మాం హే విభో! పార్వతీశ! ప్రభో॥ 46**

**ప్రతిపదార్థము :-** అత్రి(గోత్ర) ప్రభూ మిత్ర చిత్రాంశు సద్ గోత్ర నేత్ర త్రయీ పాత్ర చిత్రానన = అత్రినేత్ర ప్రభువు మిత్రుడు చిత్రాంశువు అను మంచి పేర్లు గల మూడు నేత్రములకు పాత్రమైన చిత్రమైన ముఖము కలవాడా!, శత్రువిత్రాసకృజ్జైత్రయాత్రాస్థితే = శత్రువులకు భయము కలిగించు జైత్రయాత్రయందునికి కలవాడా!, విభో = సర్వవ్యాపకుడా!, ప్రభో = (సర్వలోకములకు) ప్రభువైన వాడా, హే పార్వతీశ! = ఓ పార్వతీనాథా, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.

**తాత్పర్యము :-** అత్రి నేత్ర ప్రభువు మిత్రుడు చిత్రాంశువు అను నామాంతరములు గల, చంద్ర సూర్యాగ్నులు నేత్రములుగాగలవాడా!, శత్రువులకు భయమును కలిగించు జైత్రయాత్ర కలవాడా! ఓ ప్రభూ! ఓ విభో! ఓ పార్వతీనాథా! నన్ను కాపాడుము.

**వివరణ :-** అత్రినేత్రప్రభూ అను పాఠముకన్న, **అత్రిగోత్రప్రభూ** అనుపాఠము సమంజసతరముగా నుండునేమో, చంద్రుడు బ్రహ్మయొక్క అనుగ్రహమున అత్రి కుమారుడుగా జన్మించినాడను కథ పురాణ ప్రసిద్ధము. శివుడు త్రిపురాది రాక్షసులపై జైత్రయాత్ర చేసినాడు. శత్రువులైన అత్రిపురాదులు భయపడినారనుట మూడవ పాదమున చెప్పబడినది. ఈ శ్లోకముయొక్క మూడు పాదముల పూర్వాపరార్ధములలో 'త్రి' ప్రాసము కలదు. మరియు పెక్కుసార్లు తకారేకారరేఫల ఆవృత్తిలో ఈ శ్లోకము వృత్త్యనుప్రాసాలంకృతము. పూర్వశ్లోకము వలె ఈ శ్లోకము స్రగ్విణీ వృత్త నిబన్ధనము.

---

**శ్లో॥ చణ్డదోర్దణ్డపిణ్డీకృతోద్దణ్డసత్-**
**తుణ్డశౌర్యప్రచణ్డేభగణ్డస్థల!।**
**కుణ్డలశ్రీభజత్కుణ్డలీశ! ప్రభో!**
**పాహి మాం హే విభో!పార్వతీశ! ప్రభో!॥ 47**

**ప్రతిపదార్థము :-** చణ్డ దోర్దణ్డపిణ్డీకృతోద్దణ్డ సత్తుణ్డ శౌర్య ప్రచణ్డేభ గణ్డస్థల! = భయంకర ములై దండముల వంటి బాహువులచేత పిండి చేయబడిన మంచి తొండము శౌర్యము గల గజ (రాక్షసుని) గణ్డ స్థలములు గలవాడా!, కుణ్డలశ్రీ భజత్కుణ్డలీశ = కుణ్డలముల కాంతిని పొందుచున్న సర్పనాయకులు గలవాడా!, ప్రభో!=ఓప్రభూ, విభో = ఓ విభూ, ప్రభో!=ప్రభూ, హే పార్వతీశ! = ఓ పార్వతినాథా!, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.





**తాత్పర్యము :-** శివా! నీ బాహువులు దండముల వలె భయంకరములు వానితో గజాసురుని ప్రచణ్ద గణ్డ స్థలములను పిండి చేసినావు. చెవులకు కుండలములుగా కుండలీశులనే అనగా సర్పనాయకులనే ధరించినావు. అట్టి నీవు నన్ను కాపాడుము.

**వివరణ :-** పూర్వార్ధమున తన భుజముల తోడనే గజాసుర గణ్డ స్థలముల పిండిచేయుట అను అసాధారణమైన శివుని పరాక్రమము వర్ణింపబడినది. మూడవ పాదమున కుండలీశుల శివకుండల శ్రీ భజన విశేషణము చెప్పబడినది. కుండలములు అనగా చుట్టుకొనుటలు. వానిని కలిగియుండుటచే సర్పములకు కుండలినామమేర్పడియున్నది. ఆ సర్పరాజులనే కుండలములుగా ధరించి శివుడు కుండలి యగుట భూషణముల (సర్పరాజుల) కు భూష్యములు (శివున)కు అభేదభావము స్ఫురింపజేయబడినది. భూష్య భూషణములకు లోకమున వ్యావహారికమైన భేదము సుప్రసిద్ధమే అయిన సర్వాభేదము శివునందుండటయే భూష్యభూషణాభేద ముండుటలో విప్రతిపత్తి ఉండనక్కఱలేదు. కుండలశ్రీని భజించినచో కుండలిత్వమే లభించదు. కుండలీశత్వ మెట్లు లభించగలదు. ఎప్పుడో ఒకప్పుడు కుండలములు గలవాడును కుండలిగా వచ్చును. కాని సర్వవేళల (ఈశ) కుండల (భావ)ము భజించు వానికి కుండలీశత్వము లభించుటలో నాశ్చర్యము లేదు. అను అర్థ విశేషస్ఫురణము కలదు. మూడవ పాదమున పూర్వపరార్ధములలో కుణ్డలావృత్తి మూడు పాదములలో ణడల ఆవృత్తితో వృత్త్యనుప్రాసాలంకృతత్వము. ఒక ప్రభు శబ్దము సామర్థ్యమున మరొక ప్రభు శబ్దము ఈశత్వమును చెప్పును. ప్రభు శబ్దద్విరావృత్తి శివునందు సమర్థేశత్వమును సూచించును. వృత్తము స్రగ్విణీ.

---

**శ్లో॥ భద్రరౌద్రాభకద్రూతనూజాధిరా**
**ణ్ముద్రితాక్షుద్రరుద్రాక్షమాలాధర!।**
**రుద్ర! చిద్రూపదృగ్వీరభద్రాకృతే!**
**పాహి మాం హే విభో! పార్వతీశ! ప్రభో!॥ 48**

**ప్రతిపదార్థము :-** భద్ర రౌద్రాభ కద్రూతనూజాధి రాణ్ముద్రితాక్షుద్ర రుద్రాక్షమాలాధర! = మంగళమయమైన క్రూరమైన కాంతిగల సర్పరాజ ముద్రగల పెద్ద రుద్రాక్షల మాలల ధరించువాడా!, రుద్ర = దుఃఖమును బోగొట్టువాడా!, చిద్రూపదృక్ = జ్ఞాన (ఫాల) నేత్రము గలవాడా!, వీరభద్రాకృతే = వీరము భద్రమునైన ఆకృతిగల వాడా!, విభో! = విభూ, ప్రభో! = ప్రభూ, హే పార్వతీశ! = ఓ పార్వతీనాథా, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.

**తాత్పర్యము :–** భద్రము రౌద్రమునైన సర్పరాజ ముద్రగల పెద్ద రుద్రాక్షల మాలలను ధరించువాడా, జ్ఞానమయ ఫాలనేత్రము గలవాడా, వీరభద్రాకృతి గలవాడా! ఓ రుద్రా! పార్వతీనాథా! నన్ను కాపాడుము.

**వివరణ :–** రుద్రాక్షలలో ఏక ముఖాది చతుర్దశ ముఖాంతములు గలవు. ఒక్కొక్క ముఖమున ఏవో చిహ్నములున్నట్లు కనబడును. పెద్ద రుద్రాక్షల ముఖములలో సర్పముద్ర లుండునని ఈ శ్లోక ప్రథమార్ధము తెలుపుచున్నది. కశ్యపుని భార్య కద్రూనామిక. ఆమె పుత్రులు సర్పములు. కద్రూ తనూజులు వాని నాయకులు. కద్రూతనూ జాధిరాట్టులు. మహాసర్పములకు ఫణములు తల లనేకముండునని వానిపై మణులుండునని ఆదిశేషుడను సర్పాధినాయకునకు వేయి పడగలున్నవని పురాణములు వచించును. ఆ సర్పముల తలలలో విష ముండుటచే సర్పములు రౌద్రాభములు. మణులుండుటచే భద్రాభములు. ఇట్లు భద్రము రౌద్రమునైన ఆభ అనగా కాంతి గలవి సర్పములు. విరుద్ధములై ద్వివిధములైన కాంతులతో నలరారుటచే వానిని చేరదీయవలెనని దూర మొనర్పవలెనని ద్వివిధములైన భావములు వాని దర్శన సమయమున కలుగును. దకార రేఫావృత్తితో నీ శ్లోకము వృత్త్యనుప్రాసాలంకృతము. స్రగ్విణీ వృత్త నిబన్ధనమునై యున్నది. ఈ శ్లోకముయొక్క మొదటి మూడుపాదములలో రేఫావృత్తి యుండుటచే ఈ శ్లోక పాదములలో ఆది ప్రాసము కలిగియున్నది.

---

**శ్లో॥ దుర్గమస్స్వర్గమార్గత్రిమార్గాపవ–**
**ర్గప్రదానర్గలాఙ్చన్నిసర్గాకర!॥**
**భర్గగర్గాదిమౌనీడ్య! దుర్గాపతే!**
**పాహి మాం హే విభో! పార్వతీశ! ప్రభో!॥ 49**

**ప్రతిపదార్థము :–** దుర్గమస్స్వర్గ మార్గ త్రిమార్గాపవర్గ ప్రదానర్గలాఙ్చ న్నిసర్గాకర = చేరరాని స్వర్గమునకు మార్గమైన గంగానది మోక్షమిచ్చుటలో అడ్డులేని పూజనీయమైన స్వభావమునకు స్థానమైనవాడా!, భర్గ గర్గాదిమౌనీడ్య = భర్గ గర్గాది మునులచే స్తుతింపదగిన వాడా!, దుర్గాపతే = దుర్గకు పతివైన వాడా!, విభో! = ఓ విభూ, ప్రభో! = ఓ ప్రభూ, హే పార్వతీశ = ఓ పార్వతీ పతీ!, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.

**తాత్పర్యము :–** చేరరాని స్వర్గమునకు చేర్చు గంగానదిని మోక్షము నీయగల నిరంకుశ స్వభావమును ధరించినవాడా!, గర్గాదిమునులచే స్తుతింపదగినవాడా!, దుర్గాపతీ! భర్గా! ప్రభూ! విభూ! పార్వతీపతీ నన్ను కాపాడుము.



**వివరణ :–** గంగకు త్రిమార్గ అని పేరు. స్వర్గమున మన్దాకిని, భూలోకమున జాహ్నవి, పాతాళమున భోగవతి అను పేర్లతో మూడు లోకములలో మార్గముల నేర్పరుచుకొని ప్రవహించుచు తనలో స్నానమాడిన వారిని చేరరాని స్వర్గము చేర్చు గంగానదిని నీవు ధరించి స్వర్గప్రదాతవు. ధర్మార్థకామరూప త్రివర్గమును చేరరాని అను వర్గమును అనగా మోక్షమును ప్రసాదించు స్వభావమును కలిగియున్న వాడవు ఐనందున చతుర్విధ పురుషార్థముల నొసగువాడవు నీవే అయినందున అన్యదేవతారాధన మనావశ్యకమై పోయినదని ప్రథమార్ధము వ్యంజించును. దేవతాప్రార్థనచే దేవతేజస్సమూహమున జన్మించిన దుర్గకు దక్షునకు జన్మించి యోగాగ్నిలో దగ్ధమైన సతికి ఆ తరువాత పర్వత రాజునకు పుత్రిగా జన్మించిన పార్వతికి శివుడు భర్తయైనాడని ఉత్తరార్ధము వ్యంజించును. 1–3 పాదములలో ఆదిప్రాసమున్నది. ప్రథమ పాదాంతమున యతి భంగమున్నది. రేఫ గకారావృత్తితో ప్రథమ తృతీయ పాదాంతము నందలి యతి భంగము భర్తృహర్యాది మతము ననుసరించి దోషము కాదని చెప్పవచ్చును.

---

**అవతారిక :–** నాలుగు రగణములు గల స్రగ్విణీ వృత్తముతో పూర్వ శ్లోక పంచకము నిబన్ధింపబడినది. తరువాత నాలుగు సగుణములతో కూడిన తోటక వృత్తమున నీ శ్లోకము నిబంధింపబడుచున్నది.

**శ్లో॥ తరుణారుణతుల్యఫణస్థమణీ – ఘృణిమణ్డితశేషకిరీటధర।**
**శరణాగతరక్షణదక్ష! విభో! – కరుణాకర! శఙ్కర! పాలయ మామ్॥ 50**

**ప్రతిపదార్థము :–** తరుణారుణ తుల్యఫణస్థ మణీ ఘృణి మండిత శేషకిరీట ధర! = కాంతులతో అలంకరింపబడిన శేషుని కిరీటముగా ధరించినవాడా!, శరణాగతరక్షణ దక్ష! = శరణాగతుల రక్షించుటలో సామర్థ్యము గలవాడా!, విభో! = సర్వవ్యాపకా!, కరుణాకర! = దయకు గనివైనవాడా!, శఙ్కర! = శంకరా!, మామ్ = నన్ను, పాలయ = పాలింపుము.

**తాత్పర్యము :–** శేషుని వేయి తలలపై మణు లెట్టిని కాంతితో బాల సూర్యసమములై యున్నవి. అట్టి ఆదిశేషుని కిరీటముగా ధరించినవాడా! శరణాగతుల రక్షించుటలో దక్షత గలవాడా! దయకు గనివైన వాడా! ఓ శంకరా! నన్ను కాపాడుము.

**వివరణ :–** సర్వభూమండలము నవిశ్రాంతముగా ప్రలయకాలము వఱకు తలపై తన ఆజ్ఞనువలె శిరమున దాల్చిన శేషుని కర్తవ్యభారనిర్వహణమున శివునకు గలిగిన సంతోష మింతింత యనరాదు. ఆ శేషుని తన తలపైననే కిరీటముగా ధరించినాడు. ఆయన

కరుణ ఇంతటి దని కరుణాకర శబ్దము స్ఫురింపజేయును. హాలాహలమున త్రావి శరణాగతులయిన దేవతల రక్షించుట అనితర దేవతాసాధ్యము. కావున ఇతర దేవతల కెవఱకును ఇంతటి శరణాగత రక్షణ దక్షత లేదని చెప్పవలసియున్నది. ఆ దేవతలవలె నిన్ను ఓ శఙ్కరా! హాలాహలమున త్రావుమనుట లేదు. శేషునివలె నన్ను నెత్తిన పెట్టుకొమ్మనలేదు. పాలించిన చాలును అని ఈ శ్లోకము వ్యంజింపజేయుచున్నది. 1,3,4 పాదములలో ద్విప్రాసమున్నది. రేఫ ణకారావృత్తి తోడను వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున సుఖ ప్రదాన రూపపాలన మర్థింపబడినది. ఈ శ్లోకమున దుఃఖ నివారణ రూప రక్షణ మర్థింపబడుచున్నది.

**శ్లో॥ త్రయీనిర్మాణచతురచతురాననవన్దిత!**
**వన్దితాలమ్బివిబుధ! విబుధప్రథ! రక్ష మామ్॥ 51**

**ప్రతిపదార్థము :–** త్రయీ నిర్మాణ చతుర చతురానన వన్దిత = వేద (త్రయ) నిర్మాణమున చతురుడైన నాలుగు ముఖములుగల బ్రహ్మచే నమస్కరింపబడినవాడా!, వన్దితాలమ్బి విబుధ = నమస్కరించిన ఆలమ్బముగల దేవతలు గలవాడా, విబుధ ప్రథ = దేవతలలో ప్రసిద్ధి గలవాడా!, మామ్ = నన్ను, రక్ష = రక్షింపుము.

**తాత్పర్యము :–** వేదనిర్మాణ చతురుడైన బ్రహ్మచేతను ఇతర దేవతలచేతను నమస్కరింప బడినవాడా, దేవతలలో ప్రసిద్ధి గలవాడా నన్ను రక్షింపుము.

**వివరణ :–** ఋగ్య జుస్సామవేదత్రయి త్రయీశబ్ద వాచ్యము. అథర్వవేదము నాల్గవ వేదము. ఈ నాలుగు వేదములను తన ముఖమునుండి బహిర్గత మొనరించుటయే త్రయీ నిర్మాణము. ఆ కృత్యమునందు చతురుడైన బ్రహ్మ నాల్గు ముఖముల నుండి నాలుగు వేదముల నావిష్కరించెను. ఇట్లు చతురములైన చతురాననములు అనగా నాల్గుముఖములుగల బ్రహ్మచేతను శివుడు వందితడగుట చూచి మిగిలిన దేవతలందఱి ముందు బ్రహ్మయే సురజ్యేష్ఠుడని భావించియుండినను బ్రహ్మయొక్క యీ శివవందనమను శిష్టాచారమును చూచి దాని నవలంబించి వారును అట్లు చేసి విబుధులనిపించుకొనిరి. నాల్గు వేదములందును శివుని విబుధ శ్రేష్ఠత్వమే ప్రతిపాదింపబడింది. శివ శ్రేష్ఠతా ప్రతిపాదన రూప చాతుర్యము గల బ్రహ్మ వేదముల ద్వారమున శివునే స్తుతించెను. స్తుతింపబడిన అనియు అర్థముగల వన్దిత శబ్ద మీ యంశమును వ్యంజించును. బ్రహ్మకు నాలుగు ముఖములున్నను ఈ చాతుర్యమును అనగా శివశ్రేష్ఠతా ప్రతిపాదమును





చేయనిచో ఆయన అచతురాననుడే అయి యుండెడి వాడు. నాల్గు ముఖములు లేక ఒక ముఖమున నైనను యథాశక్తి శివశ్రేష్ఠతను ప్రతిపాదించి నందున చతురాననుడే అయి యుండెడివాడు. అను అంశము చతురశబ్ద ద్వితీయ పాదాదిని, ద్వితీయపాదాంత శబ్దము. తృతీయ పాదాదిని, తృతీయ పాదాంతశబ్దము చతుర్థ పాదాదిని అవృత్తమగుటచే ఈ శ్లోకమున ముక్తపదగ్రస్తమను శబ్దాలంకారమేర్పడి యున్నది. ఈ శ్లోకము అనుష్టు ప్ఛందో నిబద్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున దుఃఖనివారణ రూప రక్షణ మర్థింపబడినది. ఈ శ్లోకము మొదలు 54వ శ్లోకము వఱకు గల శ్లోకములలో శివుడు సంబోధింపబడుచున్నాడు.

**శ్లో॥ శశిమకుటతడిదరుణజటముఖకృపీట –**
**స్ఫుటనిటలతటఘటితవికటకటువహ్నే!**
**వటవిటపినికటపటుచటులనటనాతి –**
**ప్రకటభటకుటిలపటలవిఘటన! శమ్భో!॥ 52**

**ప్రతిపదార్థము :–** శశి మకుట తడి దరుణ జట ముఖ కృపీట స్ఫుటనిటల తట ఘటిత వికట కటు వహ్నే! = చంద్ర కిరీటము మెరుపువంటి ఎర్రని జడలుగల ముఖము వాయువు ఫాల ప్రాంతమున కూర్చబడిన భయంకర దుఃఖకరమైన అగ్ని కలవాడా!, వట విటపినికట పటు చటుల నటనాతి ప్రకట భట కుటిల పటల విఘటన = మఱ్ఱిచెట్టు దగ్గఱ సమర్థమైన చంచలమైన నటనతో మిక్కిలి ప్రకటింపబడిన ప్రతి వీరుల కుటిల వృత్తుల విఱచుట గలవాడా!, శమ్భో! = ఓ శమ్భూ.

**తాత్పర్యము :–** చంద్ర కిరీటము మెఱుపు వలె నున్న ఎఱ్ఱని జడలు ముఖవాయువున స్పష్టమైన భయ దుఃఖముల కలిగించు అగ్నికలవాడా! మఱ్ఱిచెట్టు సమీపమున సమర్థమైన నటనచే మిక్కిలి ప్రకటింపబడిన ప్రతివీరుల కుటిల స్వభావముల విఱచు వాడా, ఓ శమ్భో!

**వివరణ :–** బహువార టకారావృత్తి ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారము నేర్పఱచుచున్నది. అయిదు న గణములపై గ–గ ప్రతి పాదమున నున్నందున ఇది పాలాశదళ వృత్తము.

---

**శ్లో॥ రుచిరవరనిచయమృగమదరచనగౌరీ–**
**కుచలికుచరుచినిచయఖచితశుచిమూర్తే!॥**

**ప్రచురతరచతురనిగమవచనపాలీ**
**నిచయసువచవికచవిమలగుణ! శమ్భో!॥ 53**

**ప్రతిపదార్థము :–** రుచిరవర నిచయ మృగ మదరచన గౌరీ కుచలి కుచ రుచి నిచయ ఖచిత శుచి మూర్తే! = అందమైన మంచి లక్షణములుగల కస్తూరి రచనగల గౌరి గజనిమ్మ పండ్లవంటి కుచకాంతుల సమూహములచేత కూర్చబడిన తెల్లని ఆకృతి గలవాడా!, ప్రచురతర చతుర నిగమ వచన పాలీ నిచయ సువచ వికచ విమలగుణ! = మిక్కిలి ప్రసిద్ధమైన నిపుణమైన వేద వాక్య సమూహము చేత (మాత్రమే) చక్కగా చెప్పుటకు వీలైన విప్పారిన స్వచ్ఛమైన గుణములు గలవాడా!, శమ్భో = ఓ శమ్భూ!

**తాత్పర్యము :–** అందమైన మంచి లక్షణములుగల సమూహముగల గౌరీదేవియొక్క గజనిమ్మలవంటి స్తనములందలి కస్తూరి పూత చేత నల్లబడిన తెల్లని శరీరము గలవాడా! మిక్కిలి ప్రసిద్ధములైన నిపుణములైన వేదవాక్సమూహములచేతనే చెప్పుటకు వీలైన స్వచ్ఛమైన గుణములు గలవాడా! ఓ శమ్భూ!

**వివరణ :–** రేఫ చకార బహువారావృత్తిచేత ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. ఇందు 1,2 పాదములు పై శ్లోకమువలె పాలాశదళ వృత్తపాదాలు 3,4 పాదాలు 4న గణములపై స–గ యున్నందున వృత్తము ఫలసదనం; కలిసిన ఉపజాతి వృత్తమిది.

---

**శ్లో॥ అదరదరకరవిసరపురహరణకేలీ–**
**స్థిరమురహృదమరధరశరవరశరాస!॥**
**సరససురనికరకరసరసిరుహపూజా–**
**భరభరణగురుశరణచరణయుగ! శమ్భో!॥ 54**

**ప్రతిపదార్థము :–** అదరదర కర విసర పురహరణ కేలీ స్థిర ముర హృదమర ధర శరవర శరాస! = భయములేని భయమును కలిగించు పురాసురుల సంహార కేలియందు స్థిరమైన విష్ణువు బాణముగా మేరువువిల్లుగా గలవాడా!, సరస సురనికరకర సరసిరుహ పూజాభరభరణగురుశరణచరణయుగ! = సరసుడైన దేవతా సమూహముల కరకమల పూజాభరమును భరించు గురువులకును శరణములైన పాదముల ద్వయము కలవాడా!, శమ్భో = ఓ శమ్భూ!.

**తాత్పర్యము :–** భయములేని భయంకరమైన త్రిపురాసురుల సంహారకేలియందు స్థిరమైన విష్ణువు బాణముగా మేరుపర్వతము విల్లుగా గలవాడా! దేవతల కరకమల పూజా





భరమును భరించు గురువులకు శరణములైన పాదము జంట గలవాడా! ఓ శమ్భూ!.

**వివరణ :–** త్రిపురా (సుర) సంహార సమయమున విష్ణువు బాణముగా మేరువు విల్లుగా నొందుట పురాణ ప్రసిద్ధము. ఇది మొదటి అర్థమున చెప్పబడినది. రెండవ అర్థమున దేవతా పూజ్యము శివ చరణ ద్వయము అని చెప్పబడినది. బహువారరేఫావృత్తి వలన ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. ఈ వృత్తము పాలాశ దళము.

---

**అవతారిక :–** పై మూడు శ్లోకములలో శమ్భో అని సంబోధింపబడిన శివునియొక్క ఆయన యోగముగల శివయొక్కయు పాదముల యుగమందు నమస్కరింపబడుట ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

**శ్లో॥ శోణప్రభం చరణమేకమహం నమామి**
**శుభ్రం విలోచనయుగేక్షణనీలమన్యమ్।**
**అన్యోన్యయోగశివయోశ్శశిపద్మయోశ్చ**
**యుగ్మం కలఙ్కమధుపస్ఫుటయోస్తయోశ్చ॥ 55**

**ప్రతిపదార్థము :–** శోణప్రభమ్ = ఎఱ్ఱనికాంతిగల, ఏకమ్ = ఒక, చరణమ్ = పాదమును గూర్చి, విలోచన యుగేక్షణ నీలమ్ = రెండు కన్నుల చూపులతో నల్లనైన, అన్యమ్ = మరొక పాదమును, నమామి = నమస్కరించెదను. అన్యోన్యయోగ శివయోః = ఒకరితో నొకరి యోగము గల (మంగలత్వముగల) శివపార్వతుల యొక్క, కలఙ్క మధుప స్ఫుటయోః = కలఙ్కముచే తుమ్మెదచే స్పష్టములైన, తయోః = ఈ, శశిపద్మయోః = కమల పద్మముల యొక్కయు, యుగ్మమ్ = జంటను గూర్చి, నమామి = నమస్కరించెదను.

**తాత్పర్యము :–** ఎఱ్ఱని కాంతిగల ఒక చరణమును, కన్నుల చూపులచే నీలమైన మరొక తెల్లని పాదమును, గూర్చి నమస్కరించుచున్నాను. పరస్పర సంయోగము గల పార్వతీ పరమేశ్వరులయొక్కయు కలఙ్కముచేతను తుమ్మెదలచేతను స్పష్టములైన ఆ చంద్ర పద్మములయొక్కయు జంటకు నమస్కరించుచున్నాను.

**వివరణ :–** లత్తుక పూయకున్నను అమ్మవారి చరణ మెఱ్ఱనైనది. లత్తుక పూయబడిన ఆ అమ్మవారి చరణ మెఱ్ఱని కమలమే. అందుచేత తుమ్మెద వచ్చి వానిపై వాలినది. ఇక కమల మనుటకు సందేహమేమి? ఆమె పాదము కమలమనుట నిశ్చయమే. శివుని చరణమున భస్మము పూయకున్నను తెల్లనిదే. భస్మము పూయబడిన ఆ పాదము చంద్రుడే అయినది. అమ్మవారా పాదమును చూచినది. అమ్మవారి కన్నులలోని నీలకాంతి ఆ పాద చంద్రుని యందు కలఙ్కమే అయినది. అర్థము పార్వతి అర్థము శివుడునైన

అర్ధనారీశ్వరుని ఆ పాదముల జంటకు నమస్కరించుట చేత లౌకికమైన ప్రేయము అలౌకికమైన శ్రేయము కలుగును. అన్యోన్య యోగము సాధారణ దంపతుల యందప్పుడప్పుడుండును. (నిత్య యోగముండదు) యోగమున్నప్పుడును వారిలో నాలుగు పాదములు కానవచ్చును. ఆ యిద్దరు నొక్కటై రెండు పాదములే కనిపించుట అసమ్భవము. ఇట్టి నిత్యయోగముగల శివపార్వతుల జంటయొక్క పాదములకును ద్వంద్వతయే కాని చతుష్కత లేకుండుటచే యుగ్మమ్ అని ప్రయోగించుట ఉచితత్వము కలిగియున్నది. ఎఱ్ఱని పాదమునకు తెల్లని పాదమునకు కవి విడివిడిగా నమస్కరించుట శ్లోకములోని చకారము వ్యంజించును. కాని భక్తునికి చేతులు రెండు కావున ఒకవేళ ఒకసారే పార్వతీపరమేశ్వరుల పాదముల జంటకు నమస్కరించుట సులభమయి అట్లే చేసినాడను ఇరువురి పాదములకు విడివిడిగా ఒకచేత నొకదానికి మరొకచేత మరొక దానికి నమస్కరించి నట్లగును. కాని రెండు చేతుల చేతను ఎఱ్ఱని పాదమునకు ముందు తెల్లని పాదమునకు తరువాత నమస్కరించినట్లు కవి పూర్వార్ధమున వ్యంజింపజేసినాడు. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము వసంతతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివ నమస్కృతి చెప్పబడినది. ఈ శ్లోకము మొదలు పన్నెండు ఏకమకుట శ్లోకములలో తన మనస్కృతి ఫలముగా తనను పాలించుట అర్థింపబడుచున్నది. ఏకమకుట శ్లోకములలో మొదటిదైన ఈ శ్లోకము శ్రీశబ్దముతో ఆరంభింపబడుచున్నది.

**శ్లో॥ శ్రీమదనన్తభవ్యగుణసీమసమాదృతదేవతానతే!**
**సోమకలావతంస! ఘనసున్దరకన్ధర! బన్ధురాకృతే!।**
**కామినికామభీమ! నిజకామితదానలసన్మహామతే!**
**సామజచర్మచేల! శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 56**

**ప్రతిపదార్థము :-** శ్రీమదనన్త భవ్యగుణ సీమ సమాదృత దేవతానతే! = జ్ఞానయుక్తములైన, అనన్తములైన, ఉత్తమ గుణములైన గుణముల స్థానమగుటచే సమాదరించుట దేవతల నమస్కృతులు గలవాడా!, సోమకలావతంస! = చన్ద్రునికల శిరోలంకారముగా గల వాడా!, ఘన సున్దర కన్ధర! = మేఘమువలె సున్దరమైన కణ్ఠము గలవాడా!, బన్ధురాకృతే! = శిథిలములేని ఆకృతిగలవాడా!, కామి నికామభీమ! = కామము గలవారి గుంపులకు భయము కలిగించువాడా!, నిజకామిత దాన లసన్మహామతే! = తమ కోరికల నిచ్చుటలో





ప్రకాశించు గొప్పబుద్ధి గలవాడా!, సామజచర్మచేల! = గజ చర్మము వస్త్రముగా గలవాడా!, శివ = మంగల స్వరూపా!, శఙ్కర = సుఖము కలిగించువాడా!, పార్వతీపతే! = పార్వతీనాథా!, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :-** శివుని కల్యాణ గుణము లనంతములు, ఆ గుణముల నాదరించిన దేవతలాయనకు నమస్కరించెదరు. కామము గలవారి గుంపులకు ఆయన భయంకరుడు. అందఱకు తాము కోరిన కోరికలిచ్చు గొప్ప బుద్ధిగలవాడు. ఆయన శిరసున చంద్రుకలను ధరించినవాడు. మేఘమువలె నల్లనైన సుందర కణ్ఠము గలవాడు శిథిలత లేని ఆకారము గలవాడు. గజచర్మము వస్త్రముగా ధరించినవాడు. అట్టి శివుని తనను పాలింపవలెనని కవి కోరుచున్నాడు.

**వివరణ :-** ప్రథమ పాదమున **శ్రీమదనంత భవ్యగుణసీమ సమాదృత** అను భాగము నొక సమాసముగా, **దేవతానతే** అను భాగమును మరొక సమాసముగా విభజించుట కవకాశమున్నది. అట్లే రెండవ పాదమును మొత్తమొక సమాసముగా చేయుటకు గూడ అవకాశమున్నది. మూడవ పాదమందలి కామి నికామభీమ అను సమాసము కాములకాతడు భయంకరుడని, నిజకామిత దాన లస న్మహామతే అను సమాసము సర్వుల కామము తీర్చుగొప్ప బుద్ధికలవాడు అని చెప్పుటలో విరోధము కనిపించుచున్నది. కాముని సంహరించిన శివుడు కామవైరి. కావున కామపూర్తికొఱకు అతని జేరువారికి తాము కామ సమర్థకు లగుటచే శివుని కోపమునకు గురికావలసి వచ్చునను భయమును మొదట శివుడు కలిగించును. వారిలోని కామమును సంహరించి వాఱందఱకు కామహేతువైన అజ్ఞానమును పోగొట్టి శివజ్ఞానము ననుగ్రహించి మోక్షమును ప్రసాదించును. అట్లు మొదలు భీముడుగా కనిపించినను చివఱకు మోక్షము ననుగ్రహించి అంతటి ఆనందమును కలిగించు మఱొకడు లేకపోవుటచే అతడు వారి అత్యధిక ప్రేమను పొందును. రెండవ సమూహములోని నిజ శబ్దమునకు ఆత్మీయ అను అర్థమును గ్రహించి ఆత్మకాములకు మోక్షమునిచ్చు గొప్ప బుద్ధిగలవాడు శివుడను అర్థమును చెప్పి విరోధమును పరిహరింపవచ్చును. లేక కామమున్నంత వఱకు భయమును కలిగించు శివుడు కామహీనులయినచో మౌనుల చేతను గోరదగిన మోక్షము ననుగ్రహించునను అర్థమును చెప్పియు విరోధము పరిహరింపవచ్చును. లేక అజ్ఞానమున కామముల నభిలషించువారి కోరికల దీర్చు గొప్ప బుద్ధికల ఆ శివుడు వారి అజ్ఞానమును తజ్జన్య కామమును నశింపజేసి చివఱకు మోక్షము ననుగ్రహించును ఇట్లు కాలభేదమున కాముల నొసగుట, కామమును నశింపజేయుచు కామినీ కామ భయంకరుడగుట

అను రెండు స్థితులను శివునిలో నుండు ననుటచే విరోధమును పరిహరింపవచ్చును. ఆన్ధ్రభాషలో ప్రచురముగా నున్న ఉత్పల (మాలా) వృత్తమున ఈ శ్లోకము నిబన్ధింపబడినది. వృత్తరత్నాకరము నందును ఇది ఉదాహరింపబడలేదు. ఎక్కడనేని సంస్కృతగ్రంథములలో నున్నను ప్రాసవర్ణమైత్రీ నియమము లుండక పోవచ్చును. ఈ శ్లోకమున ఆ నియమములు పాటింపబడుటచే భరద్వాజముని అనబడు కవి దాక్షిణాత్యుడు. ముఖ్యముగా ఆన్ధ్రుడు అయి ఉండు అవకాశమున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున దీర్ఘ సమాస ప్రాయ రచన చేయబడినది. ఈ శ్లోకమున వ్యస్తపద హ్రస్వ సమాస ప్రాయ రచనము చేయబడి యున్నది.

**శ్లో॥ సర్వశరీరగస్త్వమసి సర్వనియామక ఏక ఏవ సన్**
**సర్వవిదాదిదేవ! హర! సర్వదృగీశ్వర! సర్వరక్షితా।**
**సర్వసమశ్చ మామవ తు సన్నతమేవముపేక్షసే కథం**
**శర్వ! భవోగ్ర! భీమ! శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 57**

**ప్రతిపదార్థము :–** ఆదిదేవ! =ఓ మొదటి దేవుడవైన వాడా!, ఈశ్వర! = ఓ ప్రభూ!, హర! = ఓ హరా!, త్వమ్ = నీవు, సర్వశరీరగః = అందటి శరీరములలో నున్నవాడవు, ఏకః = ఒకడవు, సర్వనియామక ఏవ సన్ = అందఱను నియమించు చున్నవాడవే అయు, సర్వవిత్ = సర్వమునెఱిగిన వాడవు, సర్వదృక్ = సర్వము చూచువాడవు, అసి = అగుచున్నావు, సర్వరక్షితా = సర్వుల రక్షించువాడవైన, సర్వ సమః చ = సర్వసముడవును అయిన, భవాన్ = నీవు, మామ్ = నన్ను, అవతు = రక్షించెదవు గాక!, సన్నతమ్ = మంచివాడను నమస్కరించియున్న, మామ్ = నన్ను, కథమ్ = ఎట్లు, ఉపేక్షసే = ఉపేక్షించెదవు, శర్వ! = శర్వుడా!, భవ! = భవుడా!, ఉగ్ర! = ఉగ్రుడా!, భీమ! = భీముడా!, శివ! = శివుడా, శఙ్కర! = శఙ్కరా!, పార్వతీపతే! = పార్వతీనాథా!, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** ఓ ఈశ్వరా! హరా! ఆదిదేవా! నీవు సర్వశరీరములందుండి సర్వ నియామకుడవుగానే ఉన్నావు. సర్వమును చూచువాడవు తెలియువాడవు అయి వున్నావు. సర్వరక్షకుడవు. సర్వసముడవును ఐన నీవు నన్ను కాపాడవలసి యుండగా నీకు నమస్కరించిన మంచి ప్రవర్తనగల నన్ను ఏల ఉపేక్షించుచున్నావు. ఓ శర్వా! భవ! ఉగ్రా! భీమా! శివా! శఙ్కరా! పార్వతీపతే! నన్ను కాపాడుము.





**వివరణ :–** అందఱును అదుపులో నుంచి ఆజ్ఞలను పాటించువారిగా నుంచువాడు సర్వనియామకుడు. నియమనమొనరించునప్పుడు నియమముల ధిక్కరించిన వారిని శిక్షించుటయు అవసరమగును. సాధారణ శిక్షలకు లొంగని వారిని చంపవలసి యుండును. ఈ అంశమును సూచించుటకు నియమాకత్వమును ప్రతిపాదించు ఈశ్వర శబ్దముతోపాటు సంహారకార్థము గల హరశబ్దముతో కూడ శివుడీ శ్లోకమున సంబోధింపబడినవాడు. ఆదిదేవ భవ శబ్దములు సృష్టి కర్తృత్వమును వ్యంజించును. సర్వ శరీరము లందుండి సర్వము నెఱిగినవాడు కావున తప్పు చేసినవాడు తప్పించుకొను నవకాశము లేకపోవుట వ్యంజితమగును. సర్వ దృశ్య మిథ్యాధిష్ఠాన మగుటచే సర్వమును తానే అయి దృక్కుగానే ఉన్నందున దృక్త్వము శివునందు, మిథ్యా దృశ్యత్వము ప్రపంచము నందును ఉన్నట్లు సర్వదృక్శబ్దము సర్వుడును దృక్కును అను విగ్రహము ననుసరించి బోధించును. సర్వసమః సర్వరక్షితా అను సమాసములు సర్వులందును సమముగా నుండిన సర్వరక్షకుడిగా ప్రసిద్ధుడవైన నీవు నన్నుపేక్షించుట న్యాయము కాదు అను ఆక్షేపమును ధ్వనించుటకు సహకరించు చున్నవి. పంచభూతములు, సూర్యచంద్ర యజమానులు (మనోబుద్ధ్యాత్మలు లేక మనో బుద్ధ్యహంకారములు) మూడు, మొత్త మెనిమిది మూర్తులతో నాలుగు మూర్తులను బోధించు శర్వ భవోగ్ర భీమ శబ్దములు నాల్గవపాదమున వరుసగా నుండుటచే శివుని అష్టమూర్తిత్వము సూచించుటలో సహకరించు చున్నది అని చెప్పనగును. ప్రాసవర్ణమైత్రీ నియమములతోపాటు ప్రతి పాదమున భ–ర–న–భ–భ–ర–ల–గ అను గణములుండుటచే ఈ శ్లోక ముత్పల (మాలా) నిబన్ధనమని ఆన్ధ్రచ్ఛన్దోభిజ్ఞులకు జ్ఞాతచరమే. పుష్పనామమయిన ఈ వృత్తము శివుని వాఙ్మయారాధనమున పూజాపుష్పతుల్యమగుట కవి యందలి ఈ వృత్త ప్రయోగౌచిత్యజ్ఞతను సూచించును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని సర్వసమత్వము చెప్పబడినది. ఒక వ్యక్తిని రక్షించుట గాని శిక్షించుటగాని కర్మాధీన మగుటచే కవి నుపేక్షించుటయే సర్వసమునకు తగినదును. ఆక్షేప మీ శ్లోకమున అనూదితమై పరిహరింపబడుచున్నది.

**శ్లో॥ కర్మ తథేతి చేద్వదసి కాధికతా తవ సర్వతః ప్రభో!**
**ధర్మరతస్య సర్వమపి ధర్మత ఏవ భవాన్ కిమన్తరమ్।**
**నిర్మలపుణ్యకర్మ మహనీయ! కథం త్వదనుగ్రహం వినా**
**శర్మ దదాశు దేహి శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 58**

**ప్రతిపదార్థము :–** తథా = అట్లు, కర్మ = కర్మము (అస్తి = కలదు), ఇతి = అని, వదసిచేత్ = పలికెదవేని, ప్రభో! = ఓ ప్రభూ!, తవ =నీకు, సర్వతః = అన్నింటికంటె, అధికతా = ఆధిక్యము,కా = ఏమి, ధర్మతరస్య = ధర్మమునందిష్టము కలవానికి, సర్వమ్ + అపి = అంతయు, ధర్మత ఏవ = ధర్మము వలననే (భవతి = కలుగునందువేని) తస్య = ఆ ధర్మమునకు, తవ = నీకు, అన్తరమ్ = భేదము, కిమ్ = ఏమి, భవాన్ = నీవు, దద = ఇమ్ము, మహనీయ = ఓ పూజనీయుడా, త్వదనుగ్రహమ్ వినా = నీ అనుగ్రహము లేక, నిర్మల పుణ్యకర్మ = శుద్ధమైన పుణ్యకర్మ, కథమ్ = ఎట్లు (భవతి = కలుగును), శివ = ఓ శివా!, శఙ్కర = ఓ శఙ్కరా!, పార్వతీపతే = పార్వతీపతీ!, అశు = శీఘ్రముగా, శర్మ = సుఖమును, దేహి = ఇమ్ము.

**తాత్పర్యము :–** నీ కర్మ అట్లున్నందువేని నీకుగల సర్వాధిక్యత నిష్ఫలము. ఆ సర్వ సుఖమును ధర్మాధీనముగానే నీవొసగుదేని, జడమైన ఆ ధర్మమునకును, చేతనుడవైన నీకును భేదమేమి? నీ అనుగ్రహము లేక పాపరహిత పుణ్యకర్మచేయుట ఎట్లు ఘటిల్లును? ఈ చర్చతో నాకేమి? నాకు శీఘ్రముగా సుఖము నీయవలసినదే. (అప్పుడే శివ శఙ్కర పార్వతీశాది నామములు నీయెడ సార్థకములగును.)

**వివరణ :–** కొందఱుజీవులు భగవద్భక్తులై యున్నను, వారు దుఃఖము ననుభవించు చున్నను, వారి నా భగవాను డుపేక్షించు చుండుట మనము గమనించు చుందుము. ఒకవేళ ఆ శివుని నిలదీసి ఏమయ్యా నీ భక్తులు దుఃఖము ననుభవించుచుండగా నీవుపేక్షించెదవేమి? అది నీకు తగునా? అని అడిగిన అప్పుడా శివుడు, వారి కర్మ అట్లున్నది అనగా వారు తమ తమ పూర్వజన్మలలో చేసిన పాపముల ఫలముగా దుః ఖము ననుభవించు చుండగా నేనుపేక్షింపక యేమి చేయుదును? పాపకర్మల నొనరించిన దుఃఖము కలుగునని అందుచేత పాపముల చేయరాదని నేను వేదాదులలో చెప్పియుండగా వారుపేక్షించిరి. పైగా ఆక్షేపించి పాపములనే చేసిరి. అప్పుడు వారు నా వచనముల నుపేక్షించిరి. ఇప్పుడు వీరి దుఃఖమును నేనుపేక్షించుచున్నాను. సరిపోయినది గదా! వేదాదులలో నీచే చెప్పబడిన ధర్మము వలన సర్వసుఖము కలుగును. ధర్మము చేయలేదు కావున వారు సుఖించుట లేదు. సుఖము ధర్మహేతుకము కదా! పాపము దుఃఖానుభవము వలననే తీరును కదా. అంతవఱకు అని ఆ శివుడు బదులు పల్కినాడనుకొందుము. అప్పుడు భక్తుడిట్లనవచ్చును. ఓ శఙ్కరా! నీచే చెప్పబడిన ధర్మముయొక్క ఆచరణముననే పాపము పోవుట సుఖము కలుగుట తప్పదేనీ నీకన్న ఆ ధర్మమే మిన్న అగును. సర్వముకన్న (నీచే చెప్పబడిన ధర్మము కన్నను) గొప్పవాడవు నీవు అను లోక ప్రసిద్ధియెట్లు



కలిగినదో నీవు చెప్పవలెను. లేదా నాచే చెప్పబడిన ధర్మము నాచరించెడు నా భక్తులు చేయు నా భజన నమస్కారాదులన్నియు నిష్ఫలములను లోక ప్రసిద్ధిని కొత్తగా కలిగింపుము. అప్పుడు నీ భక్తులనేల నీవుపేక్షించెదవు అని మేమడుగగము. అదిగాక నీచే వేదాదులలో చెప్పబడిన పుణ్యకర్మను పాపరహితముగా ఎవరేని చేయగలరా అని **'సర్వారంభా హి దోషేణ ధూమేనాగ్నిరివావృతాః'** అని నీవే శ్రీకృష్ణ రూపమున గీతలలో చెప్పలేదా. అన్ని కర్మలలోనను దోషములుండును. నిప్పుపుట్ట వలెనన్న పొగరావలసినదే. పొగనిప్పు నావరించినట్లు, పుణ్యకర్మను పాపము ఆవరించును; అనుట ఆ నీవు చెప్పిన మాట కర్థము కదా. అని నిలదీసిన నీవేమి చెప్పగలవు? ఈ ప్రశ్నలన్నింటికి సమాధానము చెప్పుటకు దిగి రమ్ము లేదా శీఘ్రముగా నీ భక్తుడనైన నాకు సుఖమిమ్ము. ఎవరి పక్షముననో నీతో వాదించి మా నోరు నొప్పి పుట్టించు కర్మము మాకేల? అని మౌనము వహించెదము. శివ శబ్దము సుఖస్వరూపతను, శఙ్కర శబ్దము సుఖజనకతను, పార్వతీపతి శబ్దము భక్తవత్సలతను చెప్పును. నీవు నన్ను సుఖింపజేసి పాలింపవేని ఆ నీ నామములు నీయెడ సార్థకత్వమును గోల్పోవును. తత్సార్థకతాసిద్ధికైనను నన్ను సుఖమిచ్చి పాలింపుము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివానుగ్రహము లేనిదే సత్కర్మ చేయుటకే సాధ్యము కాదని చెప్పబడినది. ఈ శ్లోకమున తదనుగ్రహమున లభించు (కర్మ) సన్యాసలబ్ధ తత్త్వమస్యాది వాక్యజన్యజ్ఞానమువలన కలుగు అజ్ఞాననాశము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అన్యమనాథనాథ! ఫణిహంసకమాన! గృహాణ మానసే**
**ధన్య! తథా న బోధయతి తత్త్వమసీతి వచస్త్రిపఞ్చతమ్।**
**శూన్య మిదం త్వయి స్ఫురతి శుక్తిదలే రజతం యథార్జునం**
**సన్యసనాది తస్య శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 59**

**ప్రతిపదార్థము :–** అనాథనాథ! = దిక్కులేని వారికి దిక్కైనవాడా!, ఫణి హంసకమాన = సర్పము నూపురముగా నుండు గౌరవము గలవాడా!, శివ! = శివుడా!, శఙ్కర! = శఙ్కరా!, పార్వతీపతే! = పార్వతీపతీ!, మానసే = మానసము నందు, అన్యమ్ = మరొకదానిని, గృహాణ = గ్రహింపుము, ధన్య! = ఓ ధన్యుడా!, తత్ త్వమ్ అసి ఇతి వచః = తత్త్వమసి అను వాక్యము, తథా = అట్లు, త్రిపఞ్చతమ్ = త్రిత్వమునో పంచతనో, న బోధయతి = బోధింపదు, శూన్యమ్ = శూన్యమైన, ఇదమ్ = ఇది, త్వయి =

నీయందు, శుక్తిదలే = ముత్తెపు చిప్ప యందు, అర్జునమ్ = తెల్లని, రజతమ్ = వెండి, యథా = ఎట్లు, (స్ఫురించునో), తథా = అట్లు, స్ఫురతి = స్ఫురించును, తస్య = దానికి, సన్యసనాది = సన్యాసాదికము, (హేతుః = హేతువు), మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** ఓ శివా! నాకై అన్యమైన దానిని (కర్మేతర మార్గమును) మానసే = మానసమునందు గ్రహింపుము, తత్త్వమసి యను వాక్యము త్రిత్వ పంచత్వములను ఆ విధముగా బోధించదు. ఎట్లు? ఈ కనబడు ప్రపంచము శూన్యమయ్యును ముత్తెపు చిప్పయందు వెండి వలె స్ఫురించును. దానికి (అట్లు స్ఫురించునని తెలియుటకు) సన్యాసాదికము హేతువై యున్నది. నన్ను కాపాడుము.

**వివరణ :–** మోక్షమార్గమున ప్రయాణించువాడు మొదట సత్కర్మ ననుష్ఠింపవలెను. ఆ సత్కర్మ కోరిక ఫలించునా? లేదా? అను అంశములను పట్టించుకొనని సమబుద్ధితో చేయవలెను. స్థూల శరీరముతో చేయబడు యజ్ఞ యాగాదులను సూక్ష్మ శరీరమైన మనసున చేయబడు ప్రతీకాహంగ్రహోద్యుపాసములలను నిష్కామముగా నున్నప్పుడవి పాపక్షయమును కల్గించును. మోక్షప్రతిబన్ధము పాపము కావున తత్క్షయమునకై ఆ సత్కర్మలిచ్చు సంపదాది కామమును వదలుట అవశ్యము. ఇట్టి నిష్కామ కర్మానుష్ఠానము నావలన జరుగవలె ననిన నీ అనుగ్రహము అత్యావశ్యకము. నీ అనుగ్రహమున ఒకవేళ అద్వైత వాసన కలిగినచో కర్మ సన్యాసము అను సాధనము నవలంబించవలసి యుండును. దీనివలన అద్వైత జ్ఞాన సాధనావకాశము పెరుగును. జీవునకు తాను బ్రహ్మమను జ్ఞానము లేకపోవుట వలన అనాది సిద్ధముగా అజ్ఞానము తజ్జన్య సంసారము దుఃఖానుభవము సిద్ధములైనవి. జీవునకు తానే బ్రహ్మనని తత్త్వమస్యాది గురూపదేశమున తెలియగానే అజ్ఞానము తదుపాధికమైన జీవత్వము తొలగగా బ్రహ్మమొక్కటే యను అద్వైత జ్ఞానము సిద్ధించును. సృష్ట్యాదుల నొనరించు మూర్తిత్రితను గాని పంచకృత్యముల నొనరించు బ్రపంచతగాని తత్త్వమసి అను వాక్యము బోధించదు. తత్త్వమసి అను వాక్యమున మూడు పదములున్నవి. తత్ అను పదమునకు బ్రహ్మము. త్వమ్ అను పదమునకు జీవుడు, అసి అను పదమునకు అయి వున్నావు అని మూడు పదములకు మూడు అర్థములున్నవి. కాని ఈ త్రిత్వము ఈ వాక్యముయొక్క పదార్థగతమే కాని వాక్యార్థగతము కాదు. అట్లే తత్త్వమసి అను గురువుయొక్క ఉపదేశమున అహమ్ సః అస్మి అను జ్ఞానము కలుగును. ఈ అనుభవ వాక్యములోని అయిదు అక్షరముల పంచత యీ శబ్ద నిష్ఠమే కాని తజ్జన్మ చరమ వృత్తి నిష్ఠమే కాదు. తదనంతర





బ్రహ్మత్వసిద్ధిలో దానికి చోటే లేదని వేరుగా చెప్పనవసరము లేదు. ఇట్లు గురూపదేశ వాక్యములో మూడు పదముల అర్థములలోని త్రిత్వము కాని, అనుభవ వాక్యగతాక్షరముల పంచత్వము గాని ఆ వాక్యములు బోధింపవు. అవి బ్రహ్మైకత్వమునే తాత్పర్యముగా బోధించును. ముత్తెపు చిప్పయందు శూన్యమయ్యు రాజతము కనిపించునట్లు ఈ ప్రపంచము శూన్యమయ్యు బ్రహ్మయందు అజ్ఞానమును స్ఫురించును. కావున అజ్ఞానము నశింపగానే నేను బ్రహ్మను కానను అజ్ఞానము అది ఉపాధిగాగల జీవత్వమును తొలగిపోగా బ్రహ్మైకత్వము సిద్ధించును.

---

**అవతారిక :–** పూర్వ శ్లోకమున చెప్పబడిన కర్మ సన్యాసాదిక మార్గము చిన్మయ విగ్రహ శివభావనలేని తనకు సాధ్యము కాదని ఈ శ్లోకమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ సన్మహనీయమీశ! తవ సావయవం వపురీశ! సాగమం**
**చిన్మయవిగ్రహస్య పరిశీలనమీశ్వర! మే భవేత్కథమ్।**
**త్వన్మయభావనా తు హృది నాస్తి హి నాస్తి నాస్తి మే**
**జన్మ నిరర్థకం హి శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 60**

**ప్రతిపదార్థము :–** ఈశ = ఓ ప్రభూ!, ఈశ్వర = ఓ నియామకుడా!, శివ! = ఓ శివా!, శఙ్కర! = ఓ శఙ్కరా!, పార్వతీపతే! = ఓ పార్వతీ పతీ!, తవ = నీయొక్క, సావయవమ్ = అవయవములతో కూడిన, సాగమమ్ = (ఆగమ ప్రతిపాదితమైన) రాక (పోక)తో కూడిన, వపుః = శరీరము, సన్మహనీయమ్ = సత్పురుషులచే పూజింప దగినదైయున్నది, చిన్మయ విగ్రహస్య = విజ్ఞాన శరీరము (యొక్క) గల (నీయొక్క), పరిశీలనమ్ = పరిశీలనము, మే = నాకు, కథమ్ = ఎట్లు, భవేత్ = అగు (కుదురు)ను, త్వన్మయభావనా తు = నీవు నిండిన భావన మాత్రము, హృది = హృదయమున, నాస్తి నాస్తి నాస్తి హి = లేదు లేదు లేదు (ముమ్మాటికిని లేదు) గదా!, మే = నాయొక్క, జన్మ = జన్మము, నిరర్థకం హి = వ్యర్థము గదా!, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** సత్పురుషులు అవయవములు గల నీ శరీరమునే పూజించుచున్నారు. నీ చిన్మయ విగ్రహమును పరిశీలించుట నాకు సాధ్యమెట్లగును. అసలు నిన్ను గూర్చిన భావనయే నా హృదయమున లేదని ముమ్మాటికి చెప్పుదును అయినను నన్ను నీవు కాపాడుము.

**వివరణ :–** సత్పురుషులు కొందఱు నీకు శిరఃపాద హస్తాద్యవయవములు గల శరీరము ఉన్నదని భావించి పూజించెదరు. లోకమున మానవుడు పూజించుట యనగా వారికర్ఘ్య

పాద్యాదులను గంధ వస్త్రపుష్పాదులను ధూపదీప నైవేద్య తాంబూలాదులను సమర్పించుటయే కదా! అట్లు చేసిన పూజింపబడిన వారికి సంతసము కల్గును. వారు చేసిన వారిని అనుగ్రహించుట లోకసాధారణము. ఈ లోక సాధారణ రీతినే అనుసరించి లౌకిక పురుషవిధమైన సావయవ శరీరము నీకున్నదని భావించి దానికి (ప్రతి) బింబముగా విగ్రహమును నిర్మించి నీ అనుగ్రహమును పొందుటకు పూజించుచున్నారు. నా కదియే సులభ మనిపించుచున్నది. కావున నేనును వారి పద్ధతినే అనుసరించెదను. మఱికొందరు సత్పురుషులు విగ్రహముల కాయా యుపచారముల సమర్పించక మనస్సుననే నిల్పుకొని మానసికముగ నుపచారములు సమర్పించుకొని పూజ పూర్తియైనదని భావించెదరు. మఱికొందఱు సత్పురుషులు నీకు దయా గుణములున్నవని, నిన్ను నిరంతరము ధ్యానించుచుందురు. మఱికొందఱు నీ విగ్రహములోని విశిష్టలక్షణములను గంగాధరత్వాదులను విరాట్దేహము (బ్రహ్మాండదేహము)ను సూచించునవిగా భావించి నీ వైభవమును భావించుట, స్తుతించుట చేయుదురు. మఱికొందఱు నీకు దేహము లేదని, గుణములున్నవని తదాధారము అనగా సూక్ష్మదేహము, మాత్రమున్నదని దానినే స్తుతించుట, ధ్యానించుట చేయుదురు. మరికొందఱు నీకున్న శరీరము మానవాది శరీరములవలె భౌతికము కాదని కర్మజము కాదని స్వేచ్ఛగా కల్పించుకొన్నదని లేక పంచోపనిషన్మయము లేక జ్ఞానమయమని భావించుట, స్తుతించుట, ధ్యానించుట చేయుదురు. మరికొందరు తమలోని జీవుడే అనగా నేను అనబడే వాడే నీ జ్ఞానమయ శరీరమును అయి యున్నానని భావించెదరు. ఇట్టి భావనలో నేదియు నా హృదయమున లేనే లేనప్పుడు అనగా కుక్షి కుటుంబ భరణాది సంసారవిషయములు తప్ప నిన్ను గూర్చి ఏ ఆలోచనయే లేనప్పుడును నన్ను శిక్షింపక కాపాడు మనుట ఒక్కటియే నేను చేయగల పని. అంతతోడనే సంతోషించి కాపాడుము. నీదేమి పోవును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ భావన హృదయమునలేని తన జన్మము వ్యర్థమని చెప్పబడినది. ఈ శ్లోకమున శివరూప దర్శనము గాని శివకథా (నామ) శ్రవణము కాని తలపై శివ పాదతీర్థ ధారణము కాని ధూపగన్ధాఘ్రాణము కాని చేయని తనను శివుడు కాపాడవలెనని చెప్పబడుచున్నది.

**శ్లో॥ రూపమవేక్షితం న తవ రుద్ర! మయేహ కథాపి న శ్రుతా**
**ధూపసువాసనాపి గణతోషణ! నో మమ నాసికాం గతా।**





**నాపి సుపీతమీషదపి నామకథామృతమంఘ్రివారి న**
**స్థాపితమాత్మమూర్ధ్ని శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 61**

**ప్రతిపదార్థము :–** రుద్ర! = ఓ రుద్రా!, శివ! = ఓ శివా!, శఙ్కర! = ఓ శఙ్కరా!, పార్వతీపతే! = ఓ పార్వతీపతీ!, తవ = నీయొక్క, రూపమ్ = రూపము, ఇహ = ఇక్కడ (ఈ జన్మమున) మయా = నాచేత, న అవేక్షితమ్ = చూడబడలేదు, కథా అపి = కథయు, న శ్రుతా = వినబడలేదు, గణతోషణ! = ఓ గణముల సంతోషింప జేయువాడా!, ధూపసువాసనా అపి = ధూపముయొక్క సుగంధము కూడ, మమ = నాయొక్క, నాసికామ్ = నాసికను, నో గతా = పొందలేదు, ఈషత్ అపి = కొంచెము కూడ, అంఘ్రివారి = పాదోదకము, నామకథామృతమపి = నామకథనమను అమృతము కూడ, న సుపీతమ్ = బాగుగా త్రాగబడలేదు, ఆత్మమూర్ధ్ని = నా తలపై, న స్థాపితమ్ = ఉంచబడలేదు, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** ఓ శఙ్కరా! నీ రూపదర్శనముగాని, నీ కథానామ శ్రవణము గాని, నేను చేయలేదు. నీ పాదతీర్థము త్రావకపోవుట మాత్రమే కాదు, కనీసము దానిని తలపై చల్లుకొనలేదు. కనీసము నీకు సమర్పించిన ధూపముయొక్క వాసన గూడ నా ముక్కుతో పీల్చలేదు. అయినను నన్ను కాపాడుము.

**వివరణ :–** ఈ లోకమున శివుడిచ్చిన కన్నులతో కైలాసము నందున్న ఆయనను దర్శింపలేకున్నను ఈ లోకమునందున్న ఆయన లింగమును గాని, విగ్రహమునుగాని దర్శింపవచ్చును. ఆయన ఇచ్చిన చెవులతో కనీసము ఆయన నామ కథలను వినవచ్చును. కనీసము ఆయనకు ఎవరో సమర్పించిన ధూపముయొక్క సుగంధము నైనను ఆయన ఇచ్చిన ముక్కుతో పీల్చవచ్చును. కనీసము ఆయన పాదోదకమును త్రాగకపోయినను తలపై తాల్చవచ్చును. పై పనులన్నింటిని కాకపోయినను ఏ ఒక్కదానినైనను చేయకపోవుట అకృతజ్ఞతయే. లేక కృతజ్ఞతయే అగును. ఇట్టి దోషము నొనర్చినను నన్ను మాత్రము నీవు కాపాడవలసినదే. నేను నీ బిడ్డను గదా. ఏ దోషము చేసినను నీవు క్షమించవలసినదే. నీవు చేజేతుల నన్ను శిక్షించెదవా? శిక్షించుటకు నీకు చేతులెట్లాడును? 2. గణ తోషణ శబ్దము శివునియొక్క గుంపులను సంతోషింప జేయు శక్తి స్వభావములను తెలుపును. అట్టి శంకరున కొక్కని పాలించుట కష్టము కాదని పైగా మిక్కిలి సులభమను అర్థము వ్యంజింపజేయును. పూర్వార్ధమున అంత్యప్రాసము కూడ నున్నది.

---

**అవతారిక :-** పూర్వశ్లోకమున రూప దర్శన నామకథా శ్రవణ ధూప గంధాఘ్రాణములు చేయలేదని చెప్పబడినది. ఈ శ్లోకమున పాదార్చిత స్తుతుల జేయలేదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ పాదయుగం కదాచిదపి బాలతయా తవ నార్చితమ్మయా**
**వేదమహం న శాస్త్రమపి వేద్మి తవేశ్వర! న స్తుతిః కృతా।**
**వాదరతోఽ హమల్పగృహవాసనయా నితరామహర్నిశం**
**సాదరమాశు వీక్ష్య శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 62**

**ప్రతిపదార్థము :-** కదాచిదపి = ఒకప్పుడును, తవ = నీయొక్క, పాదయుగమ్ = పాదముల జంట, మయా = నాచేత, బాలతయా = అజ్ఞానము చేత, అర్చితమ్ న = పూజింపబడలేదు. వేదమ్ = వేదమును, శాస్త్రమ్ అపి = శాస్త్రమును గూడ, న వేద్మి = ఎఱుగును, ఈశ్వర! = ఓ ఈశ్వరా!, తవ = నీయొక్క, స్తుతిః = స్తుతి, న కృతా = చేయబడలేదు, అహర్నిశమ్ = రాత్రింబవళ్ళు, నితరామ్ = మిక్కిలి, అల్పగృహవాసనయా = అల్పమైన ఇంటి వాసనతో, అహమ్ = నేను, వాదరతః = వాదమందు ఆసక్తిగలవాడనై (అస్మి) ఉన్నాను, శివ! = ఓ శివా!, శఙ్కర! = ఓ శంకరా!, పార్వతీపతే! = ఓ పార్వతీపతీ!, ఆశు = శీఘ్రముగా, సాదరమ్ = సాదరముగా, మామ్ = నన్ను, వీక్ష్య = చూచి, అవ = కాపాడుము.

**తాత్పర్యము :-** ఓ ఈశ్వరా! ఓ శివా! ఓ శంకరా! ఓ పార్వతీపతీ! అజ్ఞానమున నీపాదయుగము నొకప్పుడును పూజింపలేదు. స్తోత్రమును చేయలేదు. వేదమును గాని, శాస్త్రమును గాని, ఎఱుగను. అల్పమైన గృహ వాసనతో, ఇరుగు పొరుగుతో వాదులాడుచు కాలమంతయు గడిపితిని. అయినను శీఘ్రముగా ఆదరమున నన్ను చూచి పాలింపుము.

**వివరణ :-** బాలతయా అను శబ్దము లక్షణావృతితో బాలురకు సాధారణమైన అజ్ఞానమును బోధించును. వేదము శాసకమగుటచే శాస్త్రమనదగిన దైనను వేదమూలకమైన ధర్మశాస్త్రాది వేదేతర శాస్త్రమునే ఇట శాస్త్ర శబ్దము బోధించును. స్తుతి అనగా యథార్థ గుణకథనము. అట్టి స్తుతి చేయుటలోనే శ్లేషమును లేకపోయినను సులభమైన ఆ స్తుతిని చేయలేదు. మఱి యేమి చేసితినని అడుగుదువేమో! ఇరుగుపొరుగు ఇండ్లవారితో నేనున్న ఇల్లు నాది అను వాసనతో దానికేదో హాని చేయుచున్నారేమో అని వారితో వాదులాడుచూ రాత్రింబవళ్ళు గడిపితిని. 'కావ్యశాస్త్ర వినోదేన కాలోగచ్ఛతి ధీమతామ్, వ్యసనేన చ మూర్ఖాణాం నిద్రయా కలహేన చ' అను సూక్తిలో చెప్పబడినట్లు ఇరుగు పొరుగు వారితో వాక్కలహము చేయుచు ధీమంతుడను కాని, మూర్ఖుడనైన నేను కాలమంతయు గడిపితిని. నీపాదార్చనము చేయకపోవుట గాని నిన్ను



స్తుతించకపోవుటగాని, వేద శాస్త్రాదుల నేర్చుకొనక పోవుట గాని, ఇరుగుపొరుగు వారితో వాదులాడుట గాని, కాలమును వ్యర్థమొనరించుట గాని, ఈ నేను చేసిన దంతయు నా అజ్ఞానముననే జరిగినది. ఇందు నా తప్పేమీ లేదు. ఆ అజ్ఞానము నిచ్చినది నీవు. జ్ఞానము నిచ్చినచో త్వత్పాదార్చన స్తుతులతో నీ భక్తుల వలెనే చక్కగా కాలమును సద్వినియోగము చేసి యుండెడివాడినే. ఇప్పటికే నీ తప్పు గుర్తించినావు గదా! మిగిలిన జన్మకాలమున చేయవచ్చు గదా! అందువేమో! గృహాదులందలి అల్ప వాసనను మమతాభినివేశమున వీడజాలని నేను ఇరుగుపొరుగు వారితో వాదము చేయుట యందాసక్తి గల నేను నీ పాదార్చనమును స్తుతిని చేయుదు నేమో అని ఎదురు చూడకుము. ఇట్టి నాస్థితిని గమనించి నీవే నన్ను కాపాడుము అని వీక్ష్య అను శబ్దము వ్యంజించును.

---

**అవతారిక :-** పూర్వశ్లోకమున తన శివార్చన స్తుత్యాది హీనత కజ్ఞానము హేతువుగా చెప్పబడినది. ఈ శ్లోకమున శరీరమే నేను అను అజ్ఞానమున జన్మమృత్యాది బాధలననుభవించు నాయెడ అవి లేని నన్నుపేక్షించుట తగదనుట సూచింపబడుచున్నది.

**శ్లో॥ స్వర్గ! నదీశసాయక! న జన్మ భవశ్చ మృతిశ్చ సన్తి తే**
**దుర్గమమేష తద్బహు న దుఃఖమిదం భవతానుభూయతే।**
**భర్గ! తదేవమేభిరతిబాధకభావముపైషి నో ధ్రువం**
**సర్గలయస్థితీశ! శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 63**

**ప్రతిపదార్థము :-** స్వర్గ! = ఓ సుఖస్వరూపుడా!, భర్గ! = (దుఃఖ) దహన స్వరూపుడా!, సర్గలయస్థితీశ! = సృష్టి లయ స్థితులకు ప్రభువైన వాడా!, శివ! = త్రిగుణాతీతుడా!, శఙ్కర! = మోక్షసుఖ స్వరూపుడా!, పార్వతీపతే! = ఓ పార్వతీ పతీ!, నదీశ సాయక! = సముద్రము అమ్ము(లపొది)గా గలవాడా!, తే = నీకు, జన్మ = జన్మము, భవః = పుట్టుక, మృతిఃచ = చావును, న సంతి = లేవు, ఏషు = వీనియందు, దుర్గమమ్ = అనుభవింపరానంత, బహు = అధికమైన, ఇదమ్ = ఈ, దుఃఖమ్ = దుఃఖము, భవతా = నీచేత, న అనుభూయతే = అనుభవింపబడదు, తత్ = అందువలన, ఏభిః = వీనిచే, అతి బాధక భావమ్ = బాధించుచున్నా నను భావమును, న ఉపైషి = పొందుట లేదు, ధ్రువమ్ = నిశ్చయము, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :-** పుట్టుక, చావు మొదలగు బాధలు మాకున్నట్లు నీకు లేకపోవుటచే వానివలన ఎంత దుర్భర దుఃఖము కలుగునో నీవెఱుగవు. అందుచేత వానితో నీవు

మమ్మెంత బాధించుచుంటివో కూడ నీవెఱుగవు. (అందువలన నా మాటతో దానినూహించుకొని) నన్ను కాపాడుము.

**వివరణ :-** మీమాంసకులు దుఃఖమున వ్యవహితము కాని, నశింపని, కోరినది లభించునట్టి సుఖము 'స్వర్' అని చెప్పుదురు. అట్టి స్వర్ అనగా సుఖము కలిగించునది స్వర్గమని, స్వర్గ శబ్దమున కర్థము గ్రహింపవలెను. అట్టి సుఖమును కలిగించు శివుడును స్వర్గశబ్ద వాచ్యుడగును. నదీ శబ్దము సముద్రమును బోధించును. సాయక శబ్దము సాధారణముగా బాణమును బోధించును. కాని ఇట బాణముల (అమ్ముల) పొదిని బోధించును. శివునకు సముద్రము అమ్ములపొది. ఆయన బాణమైన విష్ణువు సముద్రమందుండుటచే సముద్రము శివునకు అమ్ములపొదియైనది. బాణమును బోధించు సాయక శబ్దము బాణ సంబంధి అనగా బాణాధారము అయిన అమ్ములపొదిని లక్షణావృత్తి నాశ్రయించి బోధించునని చెప్పవలెను. ఇట్లు **నదీశసాయక** శబ్దము శివబోధకమగును. లేక స్వర్గనది. అనగా గంగానది. దానికీశుడు సముద్రుడు. అతడు బాణాధారము అనగా అమ్ములపొది గలవాడు అని **స్వర్గనదీశసాయక** అను సమాసము శివబోధకముగా గ్రహింపవచ్చును. కాని నదులన్నింటికి ఈశుడైన సముద్రుని నదీశ శబ్దమే బోధించుచుండగా స్వర్గనదీశ అని స్వర్గ పదమును నదీశ శబ్దమునకు ముందు చేర్చుటలో ఔచిత్యము కానరాదు. అస్తు. నదీశునందు అనగా సముద్రమునందు సాయకము (బాణము) అనగా విష్ణువు గలవాడని బహువ్రీహిగా విగ్రహించి అర్థమును చెప్పవచ్చును. ఈ మొదటి పాదమున జన్మశబ్దము దానికి దాదాపు పర్యాయమనదగిన భవశబ్దము ఉండుటచే నిట జన్మశబ్దమును జన్మ మృత్యువుల మధ్యలోని స్థితిని బోధించునదిగా భావించుట ఉచితము. లేక భూ ధాతువు సత్తా బోధకము కావున దానినుండి యేర్పడిన భవ శబ్దము స్థితిని బోధించునన్నచో జన్మశబ్దము పుట్టుక అను ప్రసిద్ధార్థబోధక మగును. శివునకు జన్మ స్థితి లయములు లేవనుట ప్రథమపాదార్థము. ద్వితీయ పాదమున జన్మస్థితి లయములు కలిగించు దుర్భర దుఃఖము అవి లేని శివు డనుభవించడని చెప్పబడినది. తృతీయ పాదమున వీని దుఃఖము తెలియని శివుడు జీవులను వీనితో నెంత బాధించుచున్నానని యెఱుగడని చెప్పబడినది. ఏతావాతా ఇంత దుఃఖము ననుభవించుటలోనే కాలము గడుపు జీవులకు శివార్చనాస్తుతుల నొనర్చుట సాధ్యము కాదని యెఱిగి ఆ స్తుత్యర్చనాదికము నొనర్చని జీవులను శిక్షించక క్షమించవలసియే యుండును. కాదు కాదు తాననుభవించని అనగా తనకు తెలియని ఇంత దుఃఖమునకు గురిచేసిన తన తప్పును తెలిసికొని తద్దోష పరిహారముగా అందఱి జీవులను పాలించి





తీరవలెను. అట్లే జీవులలోని కవిని సైతము పాలించి తీరవలెను. జీవుల సర్గస్థితిలయములకు అనగా జన్మస్థితిమృత్యువులకు ఈశ్వరుడని నాల్గవపాదము నందలి సర్గలయస్థితీశ శబ్దము బోధించును. భృజ్ధాతువు నుండి యేర్పడిన భర్జనార్థక భర్గశబ్దము జీవుల పాపదుఃఖ భర్జక శివుని బోధించును.

---

**అవతారిక :-** పై శ్లోకములలో శివార్చన స్తుతి భావనాదులు చేయకపోవుట కారణముగా తనకు ముక్తిని ప్రసాదింపక జన్మ స్థితి లయ దుఃఖమును అనుభవించుట ఎంత దుర్భరమో తెలియనందుననే వాని నాయన తొలగించలేదని ఆ దుఃఖము దుర్భరమని తాను అనుభవ పూర్వకముగా చెప్పిన మాటను గమనించి తనకు ముక్తి ప్రసాదనరూప పాలనమును గ్రహింపుమని ప్రార్థించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అర్చన స్తుతి భావనాదులు చేయకపోవుటకు శివునికి ఆకృతి లేకపోవుటయే కారణము. స్వీకృతాకృతి యందును విషమదృష్టి దిగంబర పంచ వక్రత్వాదులు భీతిని కలిగించుట మరొక కారణము. కావున తనకు జన్మాది దుఃఖము నిచ్చుట న్యాయము కాదు. కావున తనకు ముక్తి ప్రసాదన రూప పాలనము చేయవలెనని ప్రార్థింపబడుచున్నది.

**శ్లో॥ ఆకృతిరేవ నాస్తి తవ హా కథమీశ్వర! భావయామ్యహం**
**స్వీకృతహేతిభూతివిషశేషజటావి కపాలమాలికే!।**
**ధీకృతవిగ్రహే విషమదృష్టిదిగమ్బరపఞ్చవక్త్రతా**
**సాకృతి భీతిదా హి శివ శఙ్కర మామవ పార్వతీపతే!॥ 64**

**ప్రతిపదార్థము :-** శివ! = శివా!, శఙ్కర! = శఙ్కరా!, పార్వతీపతే! = పార్వతీపతే!, తవ = నీకు, ఆకృతిః ఏవ = ఆకారమే, న అస్తి = లేదు, ఈశ్వర! = ఓ ప్రభూ!, కథమ్ = ఎట్లు, అహమ్ = నేను, భావయామి = భావించెదను, స్వీకృత హేతి భూతి విష శేష జటావి కపాలమాలికే = స్వీకరింపబడిన ఆయుధము, బూడిద, విషము, శేషుడు, జడల సమూహము, పుఱ్ఱెల మాలలు కల, ధీకృత విగ్రహే = బుద్ధితో చేసికొనబడిన విగ్రహమునందు, విషమదృష్టి దిగమ్బర పంచవక్త్రతా = బేసి కన్నులు వస్త్రములు లేకపోవుట అయిదు ముఖములు కలిగియుండుట, యా = ఏదో, సా = ఆ, ఆకృతి = ఆకారము, భీతిదా = భయమును కలిగించునదిగా, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :-** ఓ శివా! నీకు ఆకృతియే లేనప్పుడు నేనెట్లు భావింపగలను? నీవు స్వీకరించిన శరీరమున ఆయుధములు, బూడిద, విషము, శేషుడు (సర్పనాయకుడు) జడలగుంపు, పుఱ్ఱెల పేర్లుగల, బుద్ధినిర్మిత విగ్రహమునందు, బేసికన్నులు, వస్త్రములు

లేకపోవుట, అయిదు ముఖములు కలిగియుండుట అను ఆకృతి భయముకొల్పును గదా! నన్ను కాపాడుము.

**వివరణ :–** నీ తత్త్వము నెఱిగిన కొందఱు పెద్దలు నీకు ఆకృతియే లేదనిరి. అందుచేతనే నిన్ను భావించు యత్నమునే నేను చేయకుంటిని. నేను నిన్ను భావింపకుండుటకు వారాకృతి లేదనుటయే కారణము కావున ఇందు నా దోషము లేదు. కొందఱు పెద్దలు నీవు స్వీకరించిన దేహమును గూర్చి చెప్పియున్నారు. దానిని భావించగూడదా అందువేమో, ఆ నీ స్వీకృత శరీరమునందలి ఆయుధములు, బూడిద, విషము, శివుడు, జడల గుంపు, పుఱ్ఱెలపేర్లు, చూచినచో భయము కల్గును. అవి శరీరము నందున్నవని వారు చెప్పిన మాటలు వినునప్పుడే నాకు భయము కలిగినది. భయము గొల్పు విషయమును భావించుట కూడ కష్టము. అట్టి భావన ఒకవేళ ఎప్పుడైనను కలిగినను దానిని దూరమొనర్చుటకే ప్రయత్నించుట జరుగును. కాని భయంకర విషయమును ప్రియురాలి ఆకృతివలె జ్ఞప్తియందుంచుకొనుట సాధ్యముకాదని నీకు తెలియదా! పోనీ నీవు పైన పేర్కొనబడిన వస్తువులను ధరింపకయే (విడచి) యున్నావనుకొని భావించవలె ననుకొన్నాను. నీ అవయవములైన మూడు కన్నులను తొలగించు కొందువా? అయిదు ముఖములను తొలగించుకొందువా? అది నీకును సాధ్యము కాదనుకొందును. ఇక నేను నీ శరీరమున అవిభాజ్యములైన ఆ అవయవములనెట్లు తొలగించగలను. నా కడనున్న విగ్రహమున తొలగించి దాని ఆకృతిమార్చిన దానిని శివుని విగ్రహమని ఎవరును అంగీకరించరు గదా! నీవు స్వీకరించిన ఆయుధములు దేహమునందలి ఆకృతి ధీకృతములని వదలి వైచినచో ఏక భావనకే చోటుండదు. బుద్ధి నామరూపములనే భావింపగలదు. కాని నామరూపాతీతుడవైన నిన్ను భావింపలేదు గదా! నీ ఆయుధములు భయంకరములు. నీ అవయవములు భయంకరములు. ఇట్టి వీనిని ధరించిన నీవు నీ భావన చేయలేదని పాలించకుండుట న్యాయమా! భావింపకపోయినను నన్ను పాలించుటయే నీకు న్యాయమై యున్నది. ధీకృత విగ్రహమందు భయంకరములైన ఆయుధాదులను అవయవములందు ధరింపకుండ వచ్చును గదా! అసలు విషమ దృష్ట్యాద్యవయవములు గాక మనోహరములైన అవయవముల ధరింపవచ్చును గదా! అట్లు నీకెందుకు బుద్ధి పుట్టలేదు అని ధీకృతశబ్దము వ్యంజించును. ఆయుధముల స్థానమున సుందర పుష్పాదులనో, మధురములైన అమృతాదిపేయ భోజ్యాదులనో ధరించి యున్న బాగుండెడిది కదా! అవి నీచే ఈయబడక పోయినను, తలచుకొనినను ఆసక్తి పుట్టును. నోరూరును. అట్టి లౌకిక వస్తువులందాసక్తి గల నేను భావించుకొని



తృప్తి పడి యుందును. నీ అనుగ్రహమును పొంది నీచే పాలింపబడి యుందును గదా! నాకు ఈ అవకాశము లేకపోయినది. నన్ను కాపాడు అవకాశము నీకును లేకపోయినదని నీవూరుకొననక్కఱ లేదు. నన్ను కాపాడుము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ భావననే చేయజాలకపోయితినని చెప్పిన కవి ఈ శ్లోకమున స్తోత్రము చేయుదు ననుచున్నాడు.

**శ్లో॥ పాత్రతయాహమద్య పరిభావ్య చ దీనదయాలుతాం తవ**
**స్తోత్రమహం కరోమి మమ దోషగణం పరిహృత్య శాశ్వతమ్।**
**గోత్రభిదాదికామ్యవర! గోపతివాహ! వితీర్య తే పదం**
**శాత్రవతోషశోష! శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 65**

**ప్రతిపదార్థము :–** అహమ్ = నేను, పాత్రతయా = పాత్రుడనగుటచేత, అద్య = ఈనాడు, తవ = నీయొక్క, దీనదయాలుతామ్ = దీనులయందు దయగలిగి యుండుటను, పరిభావ్య చ = ఆలోచించియు, అహమ్ = నేను, స్తోత్రమ్ కరోమి = స్తుతిచేయుదును, శాశ్వతమ్ = చిరకాలమునుండి యున్న, మమ = నాయొక్క, దోషగుణమ్ = దోషముల సమూహమును, పరిహృత్య = వదలి, గోత్రభిదాది కామ్యవర = ఇంద్రాదుల కోర్కెలు (నీవిచ్చిన) వరములుగా గలవాడా!, గోపతివాహ = వృషభరాజు వాహనముగా గలవాడా!, తే = నీయొక్క, పదమ్ = పాదమును, వితీర్య = ఇచ్చి, శాత్రవతోషశోష = శత్రువుల సంతోషమును ఎండింపజేయువాడా!, శివ! = శివా!, శఙ్కర! = శఙ్కరా!, పార్వతీపతే! = పార్వతీపతీ!, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** నేను దీనుడను, దయకు పాత్రుడను, నీవు దీనులందు దయగల వాడవు అని ఆలోచించి నిన్ను స్తోత్రము చేయుటకు నిశ్చయించుకొనుచున్నాను. ఇంద్రాదుల కోర్కెల తీర్చినవాడవు. వృషభరాజమును వాహనముగా గలవాడవు. నాకు నీ పదము ననుగ్రహించి కాపాడుము.

**వివరణ :–** శివుడు దీనదయాలువు. ఆయన దయకు పాత్రత కలిగించునది దీనత్వము. నేను దీనుడను. కావున నీదయకు పాత్రుడను. తన దీనతను గ్రహించిన వాడహంకారమును వీడి దీనతను పోగొట్టు వానిని స్తుతించుటకు సిద్ధపడును. తన దీనతను గుర్తింపక అనగా తానే గొప్పవాడను అని అహంకరించినవాడు ఇతరుల గొప్పతనమును గుర్తించి స్తుతించుటకు సిద్ధపడడు. నేను నీ దీనదయాలుతను ఇంద్రాదులకును కోరిన వరముల నిచ్చిన నీ గొప్పతనమును గుర్తించి స్తుతించుటకు

సిద్ధపడినాను అనుటను **గోత్రభిదాదికామ్యవర** అను శివసంబోధనము వ్యంజించును. నాలో దోషములున్న మాట వాస్తవమే. పురాకృత పాప ఫలమైన దీనత నన్ను నీ దయకు పాత్రు నొనరించినచో నా పాపములు దోషములును నీ దయ నాపై ప్రసరించుటకు కడ్డు కాకూడదు. ఒకవేళ అవి ఉన్నంతవరకు నిన్నను గ్రహించను అని అందువేమో. వానిని తొలగించి అనుగ్రహింపుము. అని రెండవ పాదములోని ఉత్తరార్ధము వ్యంజించును. **శాత్రవతోషశోష** అను సంబోధనము నీ శత్రుకోటిలోని వైన నా దోషముల శోషింపజేయగలుగుటను బోధించును. దుష్టులను సంహరించుటయే నీ విధానము కాకూడదు. దుష్టుడనైన నాలోని దోషములను తొలగించినచో నా శిక్షార్హత రూపుమాసి పోవుననుటను వ్యంజించును. **తే పదం వితీర్య** 'నీ పదమును ఇచ్చి' అను మాట ఆయనను స్తుతించుటకు వలసిన శబ్దసంపత్తిని అను ఒక అర్థమును, ఆయన నివసించు కైలాసములో చోటును అని మరొక అర్థమును, శివాభేదమను మరొక అర్థమును బోధించును.

---

**అవతారిక :–** పై శ్లోకమున కవి శివ పదమర్థించుట చెప్పబడినది. ఈ శ్లోకమున నాకు నీవు తప్ప మరొకటి తల్లిదండ్రి మొదలగు ఏదియు లేదని నీవే నా తల్లిదండ్రి అంతయును అని స్తుతించబడుచున్నది.

**శ్లో॥ త్వం జననీ పితా చ మమ దైవతమీశ! గురుస్సఖేశితా**
**త్వం జగదీశ! బన్ధురపి వస్తు చ మూలధనం చ జీవితమ్।**
**త్వం జయ ధామ భూమ పరతత్త్వమవైమి న కిఞ్చినాపరం**
**త్వం జనమైశమాశు శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 66**

**ప్రతిపదార్థము :–** త్వమ్ = నీవు, జననీ = తల్లివి, పితా చ = తండ్రివి కూడ, మమ = నాయొక్క దైవతమ్ = దైవమవు, ఈశ = ఈశ్వరా!, గురుః = గురుడవు, సఖా = మిత్రుడవు, ఈశితా = ప్రభుడవు, జగదీశ = ఓ జగదీశ్వరా!, త్వమ్ = నీవు, బన్ధుః అపి = బన్ధుడవు, వస్తు చ = (నాకు కావలసిన) వస్తువువు కూడ, మూలధనమ్ = మూలధనము, జీవితమ్ చ = జీవితము కూడ, త్వమ్ = నీవు, జయ = జయింపుము. (సర్వోత్కర్షముగా వర్ధిల్లుము), ధామ = (నా) నివాసము, భూమ = గొప్పనైన, పర తత్త్వమ్ = పరతత్త్వముగా, (త్వామ్ = నిన్ను), అవైమి = తెలియుచున్నాను, అపరమ్ = ఇక జరుగవలసినది, కిఞ్చన = ఇంచుకంత, న అవైమి = తెలియదు, త్వమ్ = నీవు, ఐశమ్ = ఈశ్వర సంబంధియైన, జనమ్ = జనమునుగా, అవైమి = తెలియదును,





శివ! =ఓ శివా, శఙ్కర! = ఓ శఙ్కరా!, పార్వతీపతే! = ఓ పార్వతీపతీ, అశు = శీఘ్రముగా, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** నీవే తల్లివి, తండ్రివి, నీవే నా దైవతమవు. ప్రభుడవు, నీవే గురుడవు, సఖుడవు. ఓ జగదీశ్వరా! నీవే నా బన్ధుడవు. నీవే నా వస్తువు మూలధనము జీవితమును ఐ యున్నావు. నీవే పరతత్త్వమవు. నీవే పరమ భూమ ధామమైన వాడవు నీవే నా ప్రభువుగా ఎఱిగెదను. నీవు తప్ప ఇతః పరంబెఱుగను.

**వివరణ :–** నా సర్వస్వము నీవే అని చెప్పుటచే నిందు ఆత్మ నివేదనమను తొమ్మిదవ భక్తి వ్యక్తము చేయబడినట్లైనది.

---

**అవతారిక :–** పై శ్లోకమున త్వం జయ అని జయధ్వని ఆరంభింపబడినది. ఈ శ్లోకమున జయధ్వనులు ఆమ్రేడితములు చేయబడుచున్నవి.

**శ్లో॥ జయ జయ హారహారిశశిచారుశరీర! వికాసహాసభృ–**
**జ్జయ జయ శాన్తదాన్త! వసుచన్ద్రరవీక్షణ! నిత్యనృత్యకృద్।**
**జయ జయ చణ్డదణ్డధరశాసన! సన్తతభక్తసక్తహృ–**
**జ్జయ జయ శేషభూష శివ! శఙ్కర! మామవ పార్వతీపతే!॥ 67**

**ప్రతిపదార్థము :–** హారహారి శశి చారు శరీర = మల్లెల మాలతో మనోహరమైన చంద్రుని వలె అందమైన శరీరము గలవాడా!, వికాసహాస భృత్ = వికాసమును హాసమును ధరించినవాడా!, జయజయ = సర్వోత్కర్షముగా వర్ధిల్లుము, శాన్త దాన్త! = అంతరింద్రియ (మనో) నిగ్రహము గలవాడా!, వసుచన్ద్ర రవీక్షణ = అగ్నిచన్ద్ర సూర్యులు నేత్రములుగా గలవాడా!, నిత్యనృత్యకృత్ = ఎల్లప్పుడు నృత్యము చేయువాడా!, జయజయ = చణ్డదణ్డధరశాసన! = కోపముగల యముని శాసించిన వాడా!, సన్తత భక్త సక్తహృత్ = ఎల్లప్పుడు భక్తులందు తగులుకొన్న మనస్సుగలవాడా!, శేషభూష = శేషుడు భూషణముగా గలవాడా, శివ! = ఓ శివా!, శఙ్కర! = ఓ శఙ్కరా, పార్వతీ పతే! = ఓ పార్వతీపతీ!, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :–** మల్లెల మాలతో మనోహరమైన చన్ద్రుని బోలిన అందమైన శరీరము గలవాడవు. అంతర్బహిరింద్రియ నిగ్రహము గలవాడవు. సూర్య చన్ద్రాగ్నులు నేత్రములుగా గలవాడవు. వికాసహాసములు ధరించువాడవు. నిత్యము నృత్యము చేయువాడవు. కోపించిన యముని శాసించిన వాడవు. ఎల్లప్పుడు భక్తులందు తగులుకొన్న మనస్సు గలవాడవు. శేషసర్పమును భూషణముగా ధరించిన వాడవు. నీకు పలుమారులు జయకారము నొసగుచున్నాను. నన్ను కాపాడుము.

**వివరణ :–** శ్రీమత్ అని ఆరంభించి పదునొకండు శ్లోకముల ఉత్పలమాలను శివుని మెడలో వైచి, చివరకు చంపకము నొకదానిని సమర్పించినాడు. ఈ చమ్పకము అను వృత్తము ఆన్ధ్రమున మిక్కిలి ప్రసిద్ధమైనను సంస్కృతమున సాధారణముగా కానరాదు. ఛన్దో గ్రంథములలో నెక్కడైన ఉదహరింపబడి యుండిన ఉండవచ్చును. ఉత్పలములోని మొదటి భగణమును నలము అను నాలుగు లఘువులుగా మార్చిన చంపకమగును. కావున శివ శఙ్కర పార్వతీపతే అను మకుటము పదునొకండు ఉత్పలము లందువలె ఈ చంపకమందు నిబంధించుట సుసాధ్యమైనది. సంస్కృత కావ్యములలో సర్గాంతమున వృత్తము మార్చుట ఒక సంప్రదాయము. ఆ పదునొకండు ఏకమకుట ఉత్పలముల అనంతరము జయ జయ అని ఆరంభించిన చమ్పకము నిబంధించుట పై సంప్రదాయమును స్ఫురింపజేయును. ఇది సర్గాంతము కాదు. కాని ఏకమకుట వృత్తముల అంతమును సూచించుటకీ ఉత్పలేతర వృత్తము నిబన్ధింపబడిన దనుకొనుట కవకాశమున్నది.

---

**అవతారిక :–** పై వృత్తములలో శివుని స్థూల శరీరమే అధికముగా వర్ణింపబడినది. ఈ శ్లోకమున శివుని రూపము స్థూల రూపములన్నింటిలో స్థూలతమమని, సూక్ష్మ రూపము లన్నింటిలో సూక్ష్మతమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ స్థూలాత్ స్థూలతమమురుజ్ఞానిహితం సూక్ష్మతమమహో సూక్ష్మాత్!**
**రూపం తావకమతులం జ్ఞాతుమ్మే భవతి నేశ! సామర్థ్యమ్॥ 68**

**ప్రతిపదార్థము :–** ఉరుజ్ఞానిహితమ్ = గొప్ప జ్ఞానులుమాత్రమే (మనసున) నిలుపుకొనదగినది, స్థూలాత్ = స్థూలమున కంటె, స్థూల తమమ్ = మిక్కిలి స్థూలమైన, సూక్ష్మాత్ = సూక్ష్మమున కంటె, సూక్ష్మతమమ్ = మిక్కిలి సూక్ష్మమయిన, తావకమ్ = నీకు సంబంధించిన, అతులమ్ = సాటిలేని, రూపమ్ = రూపమును, జ్ఞాతుమ్ = తెలుసుకొనుటకు, మే= నాకు, సామర్థ్యమ్ = శక్తి, న భవతి = లేదు, ఈశ! = ఓ శివా!

**తాత్పర్యము :–** గొప్ప జ్ఞానులు మాత్రమే తెలియదగిన స్థూలతమమును, సూక్ష్మ తమమును అయిన నీ సాటిలేని రూపమును తెలియుటకు నాకు శక్తిలేదు. ఓ శివా!

**వివరణ :–** నీ విరాడ్రూపము స్థూలతమము. అది బ్రహ్మాండము. దానికన్న మించిన స్థూలము మరొకటి లేదు. నీ హిరణ్యగర్భ రూపము సూక్ష్మతమము. అది బ్రహ్మాండముగా మారక ముందు మిక్కిలి సూక్ష్మము. దానికి మించిన సూక్ష్మము మరొకటి లేదు. ఆ విరాడ్రూపము ఈ హిరణ్యగర్భ రూపము నుండియే యేర్పడినది. కావున నీ రూపము



సూక్ష్మముల కెల్ల సూక్ష్మము. స్థూలములకెల్ల స్థూలమని చెప్పదగినది. అది మహాజ్ఞానికి మాత్రమే గోచర మగుటచే నా వంటి వారికి దానిని తెలిసికొనుటకు శక్తి చాలదు. సూక్ష్మమైన అంకురమును చూడజాలని అది, మహావృక్షమైన పిదప లోకులు చూడగలుగుదురు. కారణము అది స్థూలమైనను స్థూలతమము కాకపోవుట. కాని శివుని స్థూలతమ బ్రహ్మాండరూపమును గాని సూక్ష్మతమ హిరణ్యగర్భరూపమును గాని నావంటి వారు తెలియజాలరు. ఒకే రూపము స్థూలతమము. సూక్ష్మతమము అని చెప్పుటలో విరోధమున్నను కాలభేదమున అనగా సృష్ట్యాదిలో సూక్ష్మమైన హిరణ్యగర్భ రూపము తరువాత విరాడ్రూపముగా మారి స్థూలతమ మగుటను చెప్పి విరోధము పరిహరించుకొనవచ్చును. బ్రహ్మాండమును మొత్తముగా తెలియజాలకున్నను మన యింద్రియములకు గోచరించినంతవరకు అందులోని కొంతభాగము మనచే ప్రత్యక్షముగ తెలియబడుచునే ఉన్నది. అట్లే సూక్ష్మతమ హిరణ్యగర్భ రూపమును చూపజాలకున్నను దానిలోని భాగమైన మన మనసును అంతరింద్రియములును అనుమాన ప్రమాణమున తెలియబడుచునే యున్నవి. దేవతలు హిరణ్యగర్భ రూపములో నింద్రియ స్థానములు తదంశములు మనలోని ఇంద్రియములు రెండును సూక్ష్మములే. కావున ప్రత్యక్షములు కావు కాని అనుమేయములు అగుట కభ్యంతరము లేదు. కాని సామాన్యులు దాని ననుమానించుటకును అసమర్థులు. శ్లోకమున చెప్పబడినట్లు ఉరుజ్ఞానులే దాని ననుమాన ప్రమాణమున తెలియసమర్థులు. సూక్ష్మస్థూలముల కన్న శివుని మాయా మయ రూపము మరి ఒకటి ఉన్నది. అది కూడ అనుమాన ప్రమాణమున ఉరుజ్ఞానులు తెలుసుకొన గలుగుదురు. ఈ మూడు రూపములకన్న తురీయ రూపమైన మఱియొక రూపమున్నది. అదికూడా స్థూలములలో స్థూలతమము. సూక్ష్మములలో సూక్ష్మతమము అని అనబడునే కాని అది దృశ్యము కాదు కావున శివజ్ఞానమున తత్తాదాత్మ్యము చెందవచ్చునే కాని దానిని తెలుసుకొనుట అను ప్రశ్నయే ఉదయింపదు. జ్ఞానులు తమతో శివునభిన్నతను **శివోహ**మను చరమ వృత్తి ద్వారమున పొందుదురు. ఆ చరమవృత్తి చరమ జన్మముననే కలుగును. ఆ జన్మము తరువాత మరి జన్మము లేదు. కైవల్యమే ఉండును. చరమ వృత్తి కలిగిన పిదప ఆ జన్మమున ప్రారబ్ధాధీనముగా కొంతకాలము శరీరము జీవించి యున్నచో ఆ శరీరము ధరించినవాడు జీవన్ముక్త పదమున వ్యవహరింపబడును. వాడు సామాన్యులచే నడచుచున్న బ్రహ్మగా భావింపబడ వలసి యుండును. ఈ శ్లోకము ఆర్యావృత్తమున నిబన్ధింపబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకము జ్ఞానులు పొందు భగవద్రూపము శివుని జ్ఞాన విగ్రహము వర్ణింపబడినది. ఈ శ్లోకమున భక్తానుగ్రాహక భగవద్రూపము దివ్యసుందరమని చెప్పబడుచున్నది.

**శ్లో॥ గౌరీమనోహరం దివ్య – సున్దరం తవ విగ్రహమ్।**
**భక్తానుగ్రాహకం శమ్భో! – దృష్ట్వాహం స్తోతుముత్సహే॥ 69**

**ప్రతిపదార్థం :–** శమ్భో! = ఓ సుఖజన్మహేతువైనవాడా!, గౌరీమనోహరమ్ = గౌరియొక్క మనస్సును హరించు, భక్తానుగ్రాహకమ్ = భక్తుల ననుగ్రహించు నట్టిదియు, దివ్యసుందరమ్ = దివ్యము మరియు సుందరమైన, తవ = నీయొక్క, విగ్రహమ్ = శరీరమును, దృష్ట్వా = చూచి, స్తోతుమ్ = స్తుతించుటకు, అహమ్ = నేను, ఉత్సహే = ఉత్సహించుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ శమ్భూ! గౌరీమనోహరము దివ్యసుందరము, భక్తానుగ్రాహకమైన నీ విగ్రహమును చూచి నేను స్తుతించగోరుచున్నాను.

**వివరణ :–** స్తుతించుట స్తుత్యముయొక్క మహత్త్వమును తత్సూచకమైన గుణములను చెప్పుట, రచయిత ఇంతవఱకు శివాలయమునకు వెడలలేదనీ, అందున్న గౌరీ మనోహర దివ్యసున్దర భక్తానుగ్రాహక శివవిగ్రహమును గూర్చి వినియున్నను చూడలేదని పూర్వ పుణ్యవశమున నేడు చూచినాను. కావున ఆ విగ్రహమును స్తుతించుట కుత్సాహము కలుగుచున్నదనుట కవ్యభిప్రాయము కావచ్చును. లేక నన్ను ముందు కైలాసమునకు గొని పొమ్ము లేక రానిమ్ము అప్పుడు ఈ గౌరిని ఆమె మనస్సు నా శరీరము ఎట్లు ఆకర్షించినది? దివ్యులను కూడ అక్కడ చూచి వారి శరీరముల కన్న అది మిక్కిలి సుందరమైన దని నేను విన్న మాటలు నిజమని నాకు రూఢియైనచో అక్కడకు వచ్చిన భక్తుల ననుగ్రహించు రీతిని ప్రత్యక్షముగా చూచి ఆ వైనమునంతను స్తుతించవలెనని ఉత్సాహము కలుగుచున్నదనియు చెప్పవచ్చును. **'ఉపాసకానామ్ కార్యార్థం బ్రహ్మణో రూపకల్పనా'** అను సూక్తి ననుసరించి బ్రహ్మము ఉపాసకములు అనగా భక్తుల యొక్క కార్యము అనగా ఉపసనార్చనాస్తుత్యాది కార్యము కొఱకు రూపమును కల్పించుకొని యున్నందున ఆ విగ్రహ (రూప)ము భక్తానుగ్రాహక మనుట స్పష్టము. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని స్తుతించు నుత్సాహము చెపప్బడినది. కాని ఈ శ్లోకమున శివుని సౌభాగ్యాది గుణముల వర్ణించు సామర్థ్యము తనకే గాక ఎవరికిని





లేదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్వత్సౌభాగ్యం త్వద్దయాం త్వద్విలాసాం–**
**స్త్వత్సామర్థ్యం త్వద్విభూతిం త్వదీక్షామ్।**
**త్వద్విద్యాశ్చ త్వత్పదం త్వచ్ఛరీరం**
**తత్త్వం శమ్భో! వర్ణితుం కస్సమర్థః॥ 70**

**ప్రతిపదార్థము :–** శమ్భో! = ఓ శమ్భో!, త్వత్సౌభాగ్యమ్ = నీయొక్క గొప్ప భాగ్యమును, త్వద్దయామ్ = నీ దయను, త్వద్విలాసాన్ = నీ విలాసములను, త్వత్సామర్థ్యమ్ = నీ సమర్థతను, త్వద్విభూతిమ్ = నీ ఐశ్వర్యమును, త్వదీక్షామ్ = నీ చూపును, త్వద్విద్యాః = నీ విద్యలను, త్వత్పదమ్ = నీ స్థానమును, చ = మరియు, త్వచ్ఛరీరమ్ = నీ శరీరమును, తత్త్వమ్ = తత్త్వమును, వర్ణితుమ్ = వర్ణించుటకు, కః = ఎవడు, సమర్థః = సమర్థుడు.

**తాత్పర్యము :–** నీ సౌభాగ్యమును దయను విలాసములను సామర్థ్యమును ఐశ్వర్యమును చూపును విద్యలను స్థానమును (కైలాసము) శరీరమును, తత్త్వమును ఎవడు వర్ణింపగలడు?

**వివరణ :–** నీ సౌభాగ్యాది గుణములను వర్ణించు సామర్థ్యము తనకే కాక ఎవరికిని లేదనుట పూర్తిగా వర్ణించు సామర్థ్యము లేదను అర్థమునే చెప్పును. కాని ఎవరు ఏ కొంచెము కూడ చెప్పజాలరను అర్థమును చెప్పదు. ఏ కొంచెమో నేను చెప్పుచున్నాను. ఇతరులు నాకంటె బాగుగా చెప్పగలిగి యుందురు. ఉండవచ్చును. వారు బ్రహ్మాదులంత వారైనను పూర్తిగా చెప్పుట కసమర్థులనుటయే కవి యుద్దిష్టార్థము. మ–త–త–గ–గ అను గణములు ప్రతిపాదమున నుండుటచే నీ శ్లోకము శాలినీ వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని శరీరము (పూర్తిగా) వర్ణించు సామర్థ్యమెవరికిని లేకపోవుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ శివుని శరీరము యథాశక్తి వర్ణించబడుచున్నది.

**శ్లో॥ అఙ్గమ్మౌక్తికరాశిమఞ్జిమమహోదారం శిరశ్చన్ద్రమః–**
**కోటీరం నిటలమ్మనోభవదవజ్వాలాకరాలాగ్నియుక్।**
**వక్త్రం తే శివ! మన్దహాసకలితం గ్రీవం వినీలప్రభం**
**చేతో దీనదయాపరం పరమిదం రూపం హృది స్తాన్ను మే॥ 71**

**ప్రతిపదార్థం :–** అఙ్గమ్ = శరీరము, మౌక్తికరాశి మఞ్జిమ మహోదారమ్ = ముత్తెముల రాశియొక్క అందమున మిక్కిలి గొప్పదై యున్నది. శిరః = తల, చన్ద్రమః కోటీరమ్ =

చన్ద్ర కిరీటముగలది, నిటలమ్ = నొసలు, మనోభవ దవ జ్వాలా కరాలాగ్ని యుక్ = మన్మథుడను అడవిలోని జ్వాలలతో భయంకరమైన అగ్నితో కూడినది, శివ = ఓ శివా!, తవ = నీయొక్క, వక్త్రమ్ = ముఖము, మన్దహాసకలితమ్ = చిరునవ్వుతో కూడినది, గ్రీవమ్ = కణ్ఠము, వినీల ప్రభమ్ = నల్లని కాంతిగలది, చేతః = మనసు, దీనదయాపరమ్ ను = దీనులందు దయగలదియే, ఇదమ్ = ఈ, పరమ్ = ఉత్కృష్టమైన, రూపమ్ = రూపము, మే = నాయొక్క, హృది = హృదయమున, స్తాత్ = ఉండుగాక!

**తాత్పర్యము :–** శివ! నీయొక్క శరీరము ముత్తెముల రాశియొక్క అందముతో, తల చంద్ర కిరీటముతో, నుదురు మన్మథుని కాల్చు కార్చిచ్చుతో, ముఖము చిరునవ్వుతో, కణ్ఠము నల్లని కాంతితో, చిత్తము దీనదయతో ఒప్పును. అట్టి నీ రూపము నా ఎదలో ఉండుగాక!

**వివరణ :–** ఈ శ్లోకమున శివుని నుదురు ముఖము కణ్ఠము అను స్థూలమైన బహిరంగము అనగా బాహ్యశరీరముయొక్క అవయవములు సూక్ష్మమైన అంతరఙ్గము లోని ఒక స్థితియైన అనగా చింతించు స్థితియైన చిత్తము వర్ణింపబడినది. పై అవయవములు శివుని శరీరముయొక్క ఊర్ధ్వభాగమునకు చెందినవి. శిరమున చంద్రకిరీటము, నొసట అగ్నినేత్రము, కణ్ఠమునందు నలుపు అసాధారణ చిహ్నములు కలిగియుండుటచే అవి వర్ణింపబడినవి. **గ్రీవాం వినీల ప్రభామ్** అను పాఠము బాగనిపించును. శరీరము ముత్తెముల రాశి అందములతో మహోదరమని చెప్పుటచే ప్రథమ పాదమున ఉపమాలంకార స్ఫూర్తి ఉన్నది. మొత్తము శరీరము ముత్తెముల రాశివలె తెల్లగానుండగా కణ్ఠము నల్లగా నుండుట అసాధారణమే. అట్లే శిరమునందు చంద్రుడు, నొసట మూడవనేత్రమైన అగ్ని ఉండుట అసాధారణము లనుటలో సందేహము లేదు గదా! శివుని అర్ధనారియైన గౌరి యందుండుట ఆ శివుని అర్ధశరీరమగుటచేతనే ఏర్పడినది. కావున ఆ అంశము అసాధారణత్వమును భంజింప జేయజాలదు. **ఆత్మావైపుత్రనామాసి** (ఆత్మయే పుత్రనామము కలిగియున్నది) అను వేదోక్తి వలన వినాయకునందు తద్రూపులైన వీరభద్రాదులందును ఉండుటయు ఈ అసాధారణత్వమును భంజింపజేయజాలదు. శివుని చిత్తము వలె ఇతర దేవతా చిత్తములను దీన దయాలువైనను శివానుగ్రహము చేతనే వారి చిత్తమునందా దీనదయ ఏర్పడిన దగుటచే మొదలు దీనదయ శివుని చిత్తగతమే అగుటచే శివుని చిత్తముయొక్క ఈ లక్షణము అసాధారణమే అని చెప్పనగును. ఇట్టి శివుని పరరూపము హృదయము నందుండినచో తత్ఫలము శివరూప ప్రాప్తియే. కావున ఆ రూపము హృదయము నందుండగోరుట సమంజసముగానే ఉన్నది.





ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూల విక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని శరీరోర్ధ్వ భాగము వర్ణింపబడినది. ఈ శ్లోకమున అందలి శరీరము పూర్వశక్తి లక్షణములతో పాటు మరికొన్ని లక్షణములతో కలిపి వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ వ్యోమ కేశాస్సుధాసూతిః – కిరీటం స్రక్సురాపగా।**
**తారా పుష్పాణి భోఃశమ్భో! – తవ శ్లాఘ్యతరం శిరః॥ 72**

**ప్రతిపదార్థం :–** వ్యోమ = ఆకాశము, కేశాః = వెంట్రుకలు, సుధాసూతిః = చన్ద్రుడు, కిరీటమ్ = కిరీటము, స్రక్ = హారము, సురాపగా = దేవనది, తారాః = చుక్కలు, పుష్పాణి = పూవులు, భోః శమ్భో = ఓ శమ్భూ!, తవ = నీయొక్క, శిరః = తల, శ్లాఘ్యతరమ్ = మిక్కిలి మెచ్చుకొనదగినది.

**తాత్పర్యము :–** నీ శిరమున ఆకాశమే వెంట్రుకలుగా, చన్ద్రుడే కిరీటముగా, హారము గంగానదిగా, చుక్కలు పూలుగా నుండుటచే అది మిక్కిలి మెచ్చుకొన దగినదిగానున్నది.

**వివరణ :–** పై శ్లోకమున శిరశ్చన్ద్రమః కోటీరమ్ అని చంద్రుడు కిరీటముగా నుండుట సమాసమున చెప్పబడగా నీ శ్లోకమున సుధాసూతిః కిరీటమ్ అని వ్యస్తపర్యాయ పదములలో చెప్పబడినది. పై శ్లోకము నందలి ఫాలనేత్రాగ్ని అను అంశము ఈ శ్లోకమున తిరిగి చెప్పబడలేదు. పై శ్లోకమున చెప్పబడని వ్యోమకేశత్వము గంగా స్రక్త్వము తారాపుష్పత్వము ఈ శ్లోకమున చెప్పబడినవి. బ్రహ్మాండోర్ధ్వ భాగము నందలి వ్యోమ తారా గంగలు శివకేశ పుష్ప స్రజములుగా చెప్పబడినందున శివుని శరీరము బ్రహ్మాండమే అని శివునియొక్క వైశ్వానరాంశము స్థూలదేహము అనగా విరాడ్దేహము వ్యంజింప జేయబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛందో నిబన్ధనము.

---

**అవతారిక :–**పై శ్లోకమున శివ శరీరోర్ధ్వభాగ గత శిరము వర్ణింపబడినది. ఈ శ్లోకమున శివ శరీర మధ్యాధోభాగ గత హస్త పాదములు వాగ్వృత్తులు వర్ణింప బడుచున్నది.

**శ్లో॥ హస్తౌ వినిర్మితశివాఘనకేశహస్తౌ**
**పాదౌ పవిత్రతమహారజత్రాదిపాదౌ।**
**వాచస్స్ఫుటం రచితబన్ధురపూర్వవాచో–**
**వృత్తిర్మహేశ! తవ సమ్భృతలోకవృత్తిః॥ 73**

**ప్రతిపదార్థము :–** మహేశ!= ఓ మహేశ్వరా!, తవ = నీయొక్క, హస్తౌ = హస్తములు, వినిర్మిత శివా ఘనకేశ హస్తౌ = పార్వతీదేవియొక్క గొప్ప కొప్పును నిర్మించినట్టివి, పాదౌ = పాదములు, పవిత్రత మహా రజతాద్రిపాదౌ = మహా కైలాస పర్వతాధః ప్రదేశముల పవిత్రముల నొనర్చినట్టివి. వాచః = వాక్కులు, స్ఫుటమ్ = స్పష్టముగా, రచిత బన్ధుర పూర్వవాచః = దట్టమైన వేదముల రచించినట్టివి, వృత్తిః = వృత్తి, సమ్భృత లోకవృత్తిః = లోకవృత్తిని పోషించినట్టిది.

**తాత్పర్యము :–** ఓ మహేశ్వరా! నీ హస్తములు అమ్మవారి కొప్పును ముడిచివైనట్టివి. పాదములు మహాకైలాస పర్వతముయొక్క క్రింది భాగముల పవిత్రముల నొనర్చినట్టివి. వాక్కులు స్పష్టముగా అశిథిలముగా వేదముల కూర్చినట్టివి. వృత్తి లోకమున కంతటికీ జీవనాధారవృత్తిని సంపాదించునట్టిది.

**వివరణ :–** 1. కేశహస్త మనగా వెంట్రుకలను హస్తమునందిమిడి పోవునట్లు దగ్గఱగా లేక జడగా వెంద్రుకల కూర్చుట. శివుడమ్మవారి వెంట్రుకలను కొప్పుగా లేక జడకొప్పుగా తీర్చినాడనుట ప్రథమ పాదార్థము. శివుని పాదములు కైలాస పర్వతము క్రింది భాగముల సంచరించి వానిని పవిత్రములుగా చేసినవనుట ద్వితీయపాదార్థము. శివుని వాక్కులు స్పష్టబంధుర రచనగల వేదములనుట తృతీయ పాదార్థము. ఆద్యంత యమకము లేక ఆద్యంత ప్రాసములు ఈ శ్లోకమున నాలుగు పాదములందున్నది(వి.) మనుష్యులకు పాదములు శరీరమున క్రింది భాగము నందుండును. అందుచే పర్వతమునందు మనుష్యభావనను చేసిన దాని క్రింది భాగములు పాద స్థానీయములగుటచే పాదము లనబడును. 2. 'భోక్తారం యజ్ఞ తపసాం సర్వలోక మహేశ్వరమ్' అను గీతాసూక్తిని స్మరింపజేయు మహేశ శబ్దము సర్వలోకుల కర్మల ఫలమును వారు సమర్పింపగా తీసుకొనుటయే శివుని (భిక్ష) వృత్తిలోని అంతరార్థమని స్ఫురింపజేయును. అట్లు కర్మఫలముల సమర్పించిననే శివున కనుగ్రహము కలిగి వారికి ధన సంపాదన సామర్థ్యము కలిగి కుటుంబముల పోషించుకొనుట తన పొట్టను నింపుకొనుట అను వృత్తి ఆ యజ్ఞతపః కర్తల కేర్పడినది. కొత్తగా పుట్టువారికి వృత్తి యేర్పడవలెననిన పాతవారు చావవలసినదే. శివుడు నిరంతరము కొన్ని శరీరముల సంహరించు వృత్తిని చేపట్టినందుననే నిరంతరము పుట్టుచున్న జీవులకు వృత్తి (బ్రతుకగలుగుట) యేర్పడుచున్నది అను అర్థాంతరమును కూడ ఈ శ్లోకము నందలి నాల్గవపాదము వ్యంజింపజేయును. త–భ–జ–జ–గ–గ అను గణములు ప్రతిపాదమునందుండుటచే నీ శ్లోకము వసన్తతిలకా వృత్తనిబన్ధనము.



**అవతారిక :–** పై శ్లోకమున శివుని దేహమందలి కొన్ని భాగములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున శివుని దేహము తెలుపని, కంఠము నలుపని తెలుపబడినది.

**శ్లో॥ దేహేఽర్జునం కణ్ఠతలే చ కృష్ణం – లలాటమధ్యే జ్వలనం దృగన్తః।**
**భాస్వజ్జటాల్యామరుణమ్మహేశ! – రూపం త్వదీయం బహుదేవచిత్రమ్॥ 74**

**ప్రతిపదార్థము :–** మహేశ! = ఓ మహేశ్వరా!, దేహే = దేహమున, అర్జునమ్ = తెల్లని (ఇంద్రుడు), కంఠతలే = కంఠతలము నందు, కృష్ణమ్ = నల్లని, (విష్ణువు), లలాటమధ్యే = నొసటి నడుమ, దృగన్తః = కంటి చివఱ, జ్వలనమ్ = అగ్ని, భాస్వజ్జటాల్యామ్ = ప్రకాశించు జడలసమూహమున, అరుణమ్ = ఎఱ్ఱని, త్వదీయమ్ = నీకు సంబంధించిన, రూపమ్ = రూపము, బహు దేవచిత్రమ్ = పెక్కురు దేవతల చిత్రములతో కూడినది లేక పెక్కురు దేవతలలో వింతయైనది.

**తాత్పర్యము :–** మహేశా! నీ దేహము అర్జునము (ఇంద్రుడు) కంఠము కృష్ణము (విష్ణువు,) లలాట మధ్యము కంటి కొసలోని అగ్ని, ప్రకాశించు జడల సమూహము అరుణము (సూర్యుడు) ఇట్లు నీ రూపము పెక్కురు దేవతల చిత్రములతో వింతగానున్నది.

**వివరణ :–** దేవతలలో ఇన్ద్రుడు తెల్లనివాడు. అతని కొడుకు అర్జునుడు. ఇన్ద్రుడు నరుడై అర్జునుడైనాడు. కావున అర్జున శబ్దము ఇన్ద్రుని బోధించును. కావున శివుని దేహము ఇన్ద్రుడు. కృష్ణుడు విష్ణువు అవతారము కావున కృష్ణ శబ్దము విష్ణువును బోధించును. కావున కంఠము విష్ణువు. లలాటమధ్య నేత్రాంతమున అగ్నియున్నది. కావున శివుని లలాటము అగ్ని. శివుని జడలెఱ్ఱనివి. సూర్యుని వర్ణము ఎఱుపు. కావున ఇచట అరుణ శబ్దము సూర్యుని బోధించుటచే శివుని జడలు సూర్యుడు. ఇట్లు ఇంద్రోపేంద్ర సూర్యాగ్ని దేవతల నిలయమైన శివుని రూపము బహుదేవ చిత్రమైనది. 1,3,4 పాదములలో ఇంద్రవజ్రాలక్షణ గణములు 2వ పాదమున జ–త–జ–గ–గ అను ఉపేన్ద్రవజ్రా లక్షణము నుండుటచే నీ శ్లోక ముపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున కొన్ని శివ శరీరావయవముల విశేషములు చెప్పబడినవి. ఈ శ్లోకమున మరికొన్ని అవయవములు విశేషణములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ చరణం శరణం భరణం కరణం**
**హృదయం సదయం వదనమ్ముదనమ్।**
**అలికం ఫలికం విమలం కమలం**
**తవ భూతపతే! భవ! భాస్వరతే!॥ 75**

**ప్రతిపదార్థము :–** తవ = నీయొక్క, చరణమ్ = పాదము, శరణమ్ = దిక్కైనది, కరణమ్ = ఇంద్రియము, భరణమ్ = పోషించునది, హృదయమ్ = హృదయము, సదయమ్ = దయతో కూడినది, వదనమ్ = ముఖము, మదనమ్ = మన్మథరూపమైనది, అలికమ్ = నొసలు, ఫలికమ్ = చిట్లునది, కమలమ్ = కమలము, విమలమ్ = స్వచ్ఛమైనది, భవ = ఓ శివా!, భూతపతే = భూతనాయకుడా!, భాస్వరతే = జ్ఞానమయ స్వరూపమునందు రతి గలవాడా!

**తాత్పర్యము :–** ఓ భవా! భూతపతీ జ్ఞానమయ స్వరూపమున రతి గలవాడా? నీ చరణము, శరణము, ఇంద్రియము పోషకము, హృదయము దయగలది, ముఖము అందమైనది, నొసలు చిట్లించునది, కమలము స్వచ్ఛమైనది.

**వివరణ :–** శివుని పాదము సర్వలోకములకు శరణము. ఆయన పాదములాశ్రయించుట కన్న మరొక తరణోపాయము లోకులకు లేదు. కరణమనగా ఇంద్రియములు, ముఖ్యముగా ఇచట చక్షురింద్రియము. ఆ చక్షువే సర్వలోకముల పోషింప సమర్థమైనది. లేదా ఆయన హస్తము అది సర్వలోకముల కభయమును వరములను ప్రసాదించునట్టిది. ఆయన హృదయమున దయనిండి యుండును. అది సర్వలోకముల దుఃఖముల దూరము చేయునట్టిది. ఆయన ముఖము మదనము. మన్మథుని అందమైన ముఖమువలె చూపరులకు సంతోషము కలిగించునట్టిది. ఆయన ఫాలము ఎల్లప్పుడు ఫలించునదై యుండును. ఫలించుట యనగా పండిన పండు విచ్చుకొని దానిలోని భాగములు కొన్ని కనబడుట, దానిమ్మపండు విచ్చుకొన్నప్పుడు దానిలోని బీజములు కనబడును. అట్లు బూడిద గాలికి తొలగినప్పుడు బూడిద క్రింద యున్న నిప్పుకణములు కనబడును. అట్లు శివుని నొసట అగ్ని ఆయన కన్ను తెరచుకొన్నప్పుడు లోపలి నుండి మిణుగురులు వచ్చుటయే శివుని నొసలు చిట్లుటయే 'అలికమ్ ఫలికమ్' అను పదముల జంటచే బోధింపబడును. విమలం కమలం అను పదముల జంట శివుని చేతిలోని కమలము స్వచ్ఛమైన దను అర్థమును బోధించును. శ్లోకము చివఱి భాస్వరతే అను సంబోధనము లోని కాంత్యర్థకమైన భా శబ్దము జ్ఞానమును, స్వశబ్దము స్వరూపమును, రతి శబ్దము నిష్ఠను బోధించుట మొత్తము కలిసి జ్ఞానమయస్వరూపనిష్ఠను బోధించును. ప్రతిపాదమున నాలుగు స గణములుండుటచే నీ శ్లోకము తోటక వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పూర్వ శ్లోకమున అగ్నినేత్రముగల శివుని అద్భుతమైన నొసలు చెప్పబడినది. ఈ శ్లోకమున మొత్తము శివరూపమే అద్భుతమైనదని చెప్పబడుచున్నది.



**శ్లో॥ ఇదమద్భుతమీశాఖ్య – మవిజ్ఞేయం సురాసురైః॥**
**వైరాగ్యే బహుభోగే చ – సమం సమరసమ్మహః॥** **76**

**ప్రతిపదార్థం :–** సురాసురైః = దేవ రాక్షసుల చేతను, అవిజ్ఞేయమ్ = తెలియరాని, ఈశాఖ్యమ్ = ఈశ అను పేరుగల, ఇదమ్ = ఈ అద్భుతమైన, మహః = తేజము, వైరాగ్యే = వైరాగ్యము నందునను, బహుభోగే చ = ఎక్కువ భోగించుట యందును, సమమ్ = సమమైనది, సమరసమ్ = సామరస్యము కలిగినది.

**తాత్పర్యము :–** దేవతల చేతగాని రాక్షసుల చేతగాని తెలియరాని ఈ అద్భుతమైన శివతేజము వైరాగ్యమును బహుభోగమును కలిగి ఈ రెంటి యందు సమముగా ఆనందించుట అను సామరస్యమును కలిగియుండుట అద్భుతము.

**వివరణ :–** దేవతలు సద్విషయ భోగమున, రాక్షసులు అసద్విషయ భోగమున ఆనందించెదరు. శివుని భోగము దేవతల రాక్షసుల భోగమున కన్న మిక్కిలి అద్భుతము ఎంతో వింత యనిపించును. భోగులు కనకాభరణములను ధరించుట సామాన్యమే. చన్ద్రవంకవంటి నగనొక దానిని శిరసున ధరింపవచ్చును. కాని చంద్రవంకనే నెత్తిన పెట్టుకొనరు కదా! శిరమున పూల మాల ధరింపవచ్చును. ఆకాశగంగనే హారముగా శిరమున ధరింపరు గదా! మెఱయునటువంటి రంగురంగుల పూలు ధరింపవచ్చును. కాని చుక్కలనే ధరింపరు గదా! నొసట ఎఱ్ఱని బొట్టును ధరింపవచ్చును. అది మాటిమాటికి మాసినప్పుడు మరల మరల ధరించెదరు. ఎఱుపు మాయని నిప్పునే బొట్టుగా ధరింపరు గదా! రాత్రులందు స్వస్త్రీలతో (దేవతలు) పరస్త్రీలతో (రాక్షసులు) రమింపవచ్చును. కౌగిలింతలతో కొంతకాలము గడపవచ్చును. రాత్రింబవళ్ళు విడవక తమ దేహములకు స్త్రీలనంటించుకొన్న వారెవరును లేరు. ఇంతటి బహుభోగము శివునందు మాత్రమే వినబడు వింత, కైలాసముననున్న వారికి కనబడు అద్భుతము. లోకమున యోగులు వైరాగ్యము కలిగియుండుట కాననగును. రుచియైన పరమాన్నాదుల వర్జించి కందమూలాదులతో పొట్ట నింపుకొందురు. లేదా మితముగా భుజించెదరు. చేదు కాకరకాయలో, వేపాకులనో తినువారుందురు. విషమును తిందురా? త్రావుదురా! అది భక్ష్యము కాదు. పేయమును కాదు. శివుడు దానినే త్రావెనో, తినెనో తెలియదు గాని ఆయన కంఠము నల్లనైనదని మాత్రము విందుము. అట్లు కంఠము నల్లబడు నంతటి ఆహారమును ఎవరైనా స్వీకరించెదరా! శివుడు స్వీకరించుట వింత గాదా. శరీరము నశించునను భయము లేనప్పుడు వేపాకు వంటి చేదునెంతయైన తినవచ్చును. శరీరమును నశింపజేయు విషమును భుజించుటకు శరీరము నశించినను సరే అన్నంత

వైరాగ్యముండవలెను. ఏ యోగులందును కానరాని ఇంతటి వైరాగ్యము అద్భుతమనియే చెప్పవలెను గదా! శరీరము నశించదని యెఱిగినను అత్యంత తాపమును కలిగించు విషము నెవరు భుజించెదరు? నొసట నిప్పు నెవరు ధరించెదరు? శివుని యందు మాత్రమే ఇంతటి వైరాగ్యము వినబడును. కాంతా సంభోగాది భోగమున ననుభవించు సమయమున సుఖమునుగాని, విషాస్వాదనగాని సమయమున దుఃఖమును గాని పొందక శివుడు సమముగా వాని ననుభవించు నప్పుడు సమముగా స్వాత్మానందమును వీడకపోవుట మరింత వింత. ఇది అనుష్టుప్ ఛందము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడొక గొప్ప వింతయని చెప్పబడినది. ఈ శ్లోకమున కైలాసమున నున్న వింత దర్శింపవలెనను ఉత్సుకత చెప్పబడుచున్నది.

**శ్లో॥ కైలాసే ప్రమథైస్సురాసురయుతైస్స్వస్తికం సాఞ్జలి–**
**ప్రస్థం స్థాపితరత్నకాఞ్చనమహాసింహాసనే సంస్థితమ్।**
**అర్ధాఙ్గే నిహితాద్రిరాజతనయాం సానన్దమిన్దుప్రభం**
**త్వాం భక్త్యా హి భజన్తి శఙ్కర! తథా తద్ద్రష్టుమస్మ్యుత్సుకః॥ 77**

**ప్రతిపదార్థము :–** కైలాసే = కైలాస పర్వతమునందు, సురాసురయుతైః = దేవరాక్షసులతో కూడిన, ప్రమథైః = ప్రమథులచేత, స్వస్వస్తికమ్ = చేతులు కట్టుకొని (స్వస్తికముద్రలో చేతులుండునట్లుగా), సాఞ్జలి ప్రస్థమ్ = అఞ్జలిబన్ధ ముందునట్లుగా, స్థాపితరత్న కాంచన మహాసింహాసనే = ఉంచబడిన రత్నములు (పొదిగిన) కూడిన బంగరు సింహ (పుబొమ్మ గల) పీఠమునందు, సంస్థితమ్ = ఉన్నట్టి, అర్ధాఙ్గే = అర్ధ శరీరమున, నిహితాద్రి రాజ తనయామ్ = ఉంచబడిన పార్వతిగల, సానన్దమ్ = ఆనన్దముతో కూడిన, ఇన్దుప్రభమ్ = చన్ద్రకాంతిగల, త్వామ్ = నిన్ను, భక్త్యా = భక్తితో, భజన్తి = సేవించెదరు గదా!, శఙ్కర = ఓ శఙ్కరా!, తథా = అట్లు, త్వామ్ = నిన్ను, ద్రష్టుమ్ = చూచుటకు, ఉత్సుకః అస్మి = ఉత్సుకుడనై ఉన్నాను.

**తాత్పర్యము :–** ఓ శఙ్కరా! కైలాసమున దేవాసురులతో కూడిన ప్రమథుల చేత చేతులు కట్టుకొని చేతులు జోడించి నిల్చబడిన, రత్నములు పొదిగిన బంగరు సింహాసనమున కూర్చొనియున్న, అర్ధశరీరమున పార్వతిని నిల్పుకొనియున్న, ఆనన్దముతో కూడియున్న, చన్ద్రునివలె తెల్లనైన కాంతిగల నిన్ను భక్తితో పుణ్యాత్ములు సేవించెదరు గదా, వారివలె నేనును నిన్ను చూచుటకు మిక్కిలి ఉత్సుకుడనై యున్నాను.





**వివరణ :–** కైలాస పర్వతమున సభామండపమున శివుడు వేంచేయుటకు ముందు చేతులు కట్టుకొని కొందఱు, చేతులు జోడించి మరికొందఱు నిలువబడియుందురు. ఇంతలో శివునకు రత్నములు పొదిగిన బంగరు సింహాసనము స్థాపింపబడును. ఆ వెంటనే అర్ధనారీశ్వరుడైన శివుడు వచ్చి కూర్చొనును. ఆయన ఎంత ఆనన్దముగా నున్నాడని ఆ ఆనన్దము పార్వతీదేవి తన దేహమున కంటుకొని యున్నదనియో? సురాసురులు తనను పరివేష్ఠించి యున్నారనియో? చిరకాల పుణ్యఫలముగా ఆనాడే కొత్తగా సాలోక్యముక్తికి అధికారులైన భక్తులు వచ్చి సేవించుచున్నారనియో? అట్టి ఆనన్దయుక్తుడైన వెన్నెల కుప్ప బోసినట్లున్న ఆ శివుని దర్శించుటకు నాకును ఉత్సుకతయున్నది. కాని నాకంత పుణ్యమున్నదా? ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే ఈ శ్లోకము శార్దూల విక్రీడిత వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున కైలాసమున శివుని దర్శింపవలెనను ఉత్సుకత చెప్పబడినది. ఈ శ్లోకమున తత్సాధనము చేయుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ కారుణ్యసీమ కపటాచరణైకసీమ**
**వైరాగ్యసీమ వనితాదరణైకసీమ।**
**ఆనన్దసీమ జగదాహరణైకసీమ**
**కైవల్యసీమ కలయే గణభాగ్యసీమ॥ 78**

**ప్రతిపదార్థము :–** కారుణ్యసీమ = దయకు సీమ (హద్దు), కపటాచరణైక సీమ = కపటాచరణమునకు ఒకే ఒక హద్దు, వైరాగ్యసీమ = వైరాగ్యమునకు హద్దు, వనితాదరణైక సీమ = ఒకే ఒక కాంతాదరణముయొక్క హద్దు, ఆనన్దసీమ = ఆనన్దముయొక్క హద్దు, జగదాహరణైకసీమ = జగములను మింగుటకు ఒకే ఒక హద్దు, కైవల్యసీమ = కైవల్యముయొక్క హద్దు, గణభాగ్యసీమ = గణముల భాగ్యముయొక్క హద్దు, (అయిన శివుని), కలయే = ధ్యానించెదను.

**తాత్పర్యము :–** దయకు కాపట్యమునకు వైరాగ్యము, వనితాదరణమునకు ఆనందమునకు జగముల మ్రింగు ఆకలికి ఏకత్వమునకు గుంపుల భాగ్యమునకు చరమసీమ అయిన శివుని ధ్యానించెదను.

**వివరణ :–** పరస్పర విరుద్ధ గుణముల ఒకే ఒక విధముగ అవిరుద్ధముగ ధరించిన శివుడీ శ్లోకమున వర్ణింపబడినాడు. దయ ఉన్నచోట కపట ముండదు. శివునందు అవి రెండును ఉన్నవి. దయ ఉన్నదనుటకు ఆయన ఆశుతోష నామమొక నిదర్శనము. శీఘ్రముగా సంతోషించు వాడగుట ఆశుతోష శబ్దార్థము. దయ ఉన్నవాడు శీఘ్రముగా

సంతోషించును. శీఘ్రముగా సంతోషించి నాడనగ అధికముగ దయ కలిగి ఉన్నాడన్న మాటయే. అపరాధియైన వానిని క్షమించుట దయకు మరొక నిదర్శనము. రావణుడు తన నివాసమైన కైలాసమును కూలద్రోయుటకు యత్నించినను వానిని కొంచెము శిక్షించి వాని కఖండైశ్వర్యమును ప్రసాదించినాడు. ఇది శివుని దయాగుణమునకు నిదర్శనము. బాణుడు తనతో యుద్ధ మొనరింపుమనినను, అతనికి కృష్ణునితో నేర్పడిన యుద్ధమున బాణపక్షమున తనకిష్టుడైన కృష్ణునితో యుద్ధమొనరించెను. ఇంతకన్న దయకు గొప్ప నిదర్శనము మరొక చోట నెట్లు లభించును. తన భక్తుడైన మార్కండేయునకై తనయాజ్ఞ పాటించు యముని శిక్షించినాడు. లోకోత్తరమైన శివుని చిత్తము నెఱుగ నెవరి తరము? దేవతల కోరికచే విషమును భక్షించినాడు. ఆయన దయకెన్నని నిదర్శనములు చెప్పగలము? దయ ఉన్నచోట కపటముండ దనవలెను. కాని శివునందు కావలసినంత కపటాచరణము కలదు. తన కోసమై ఘోరతప మొనరించి కృశించియున్న తననే నమ్ముకొన్న పార్వతి యెదుట కపటవటువై వచ్చి ఆమెను కొంతసేపు దాదాపు ఏడ్పించినంత పనిచేసెను. చాలాకాలము తపమొనరించిన అర్జునునితో కపట కిరాతుడై యుద్ధమునే చేసెను. అయినను చివరకు వారిపై అంతులేని దయను చూపెను. ఇది ప్రథమపాద వర్ణితమైన విరోధము. తత్పరిహారము. కావున ఇందు విరోధాభాసాలంకార మేర్పడియున్నది. శివుని మించిన వైరాగ్యమే యోగులందును చూడమని వెనుక శ్లోకమున చెప్పుట జరిగినది. దిగంబరత్వము, విషభక్షణము, బూడిద పూత మొదలగునవి శివుని వైరాగ్య చిహ్నములు. ఒకతెను (పార్వతిని) తన శరీరమున కంటించుకొనుట, మరొకతెను గంగను నెత్తిపై నిరంతరము ధరించుట ఆయనకు గల స్త్రీలపై పెనవేసికొని పోయిన ఆదరణమునకు నిదర్శనము. ఇట్లు వైరాగ్య వనితాదరములు శివుని యందున్నంత అధికముగా మరియొకరి యందు లేకపోవుట ఆ విరుద్ధ గుణముల లోనికిని ఆయనయే హద్దు అను ద్వితీయ పాదార్థము. భుజించినవాడు తృప్తిగా ఆనందముగా నుండును. శివునకు దుఃఖమున్నట్లు ఎవరును కనలేదు. విషమునైనను కుక్షిలోనికి పంపక ముందే భోజనము ముగించుట ఆయన తృప్తికి ఆనందమునకు లక్షణమేమో? అట్లని ఆయనకు ఆకలి లేదందుమా? అనలేము. ఎప్పుడు మొదలిడినాడో ఈ జగముల (బ్రహ్మాండముల) మ్రింగుట ఇప్పటికిని ఆ పని తప్ప మరొక పనిలేనట్లు మ్రింగుచునే యున్నాడు. ఇది తృతీయ పాదార్థము. శివుడు కైవల్యమునకు సీమ అనగా అంతయు శివుడే. శివుని కన్న వేఱు వస్తువులేనే లేదు. ఇట్టి కైవల్యము మరొక చోట లేకపోవుటచే శివుడు కైవల్యసీమ అయినను గుంపుల కొలది ప్రమథ గణములు శివుని తమ భాగ్యముగా





భావించెదరు. తనకన్న రెండవ వస్తువే లేని శివుడు ఈ ప్రమథ గణములతో నిరంతరము కలిసి యుండును. సాధారణ జనులు కొంతకాలము జగముల గుంపులలో తిరిగినను శివునివలె వారిని విడువక యెవడుండును. ఇందఱిలో నుండినను తన అద్వితీయత్వమునకు అనగా కైవల్యమునకు కొఱత లేకుండ ఉండును. కైవల్య గణానందములకు రెండింటికిని ఆయనయే చరమసీమ. ఇది చతుర్థపాదార్థము. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము వసంత తిలకావృత్త నిబన్ధనము. మొత్తము నాలుగు పాదములలో ఆంధ్రభాష యందువలె ప్రాసవర్ణమైత్రి (యతు)లు పాటింపబడినవి. క్రియాపదము తక్క మిగిలిన పదములన్నియు సీమ శబ్దాంతములై యుండుట నాల్గవ పాదమున మొదటి రెండు పదములు కకారాదులై యుండుట, అట్లే ప్రథమ పాదమున కకారాది పదత్వము, ద్వితీయ పాదమున వకారాది పదత్వము వృత్త్యనుప్రాసశోభను కలిగించును.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుడు పరస్పర విరుద్ధములైన కారుణ్య కాపట్యములకు, వైరాగ్య వనితాదరణములకు, తృప్తి బుభుక్షులకు, కైవల్య గణ భోగ్యములకు సీమగా వర్ణింపబడినాడు. ఈ శ్లోకమున దేహోర్ధ్వసీమయైన ఆ శివుని శిరము వర్ణింప బడుచున్నది.

**శ్లో॥ శ్వేతోచ్చలద్గాఙ్గతరఙ్గబిన్దు - ముక్తాస్రగానద్ధజటాకలాపమ్।**
**నిరన్తరం చన్ద్రకిరీటశోభి - నమామి మాహేశ్వరముత్తమాఙ్గమ్॥ 79**

**ప్రతిపదార్థము :-** శ్వేతోచ్చలద్గాఙ్గ తరఙ్గ బిన్దు ముక్తాస్రగానద్ధ జటాకలాపమ్ = తెల్లని కదలుచున్న గఙ్గకు సంబంధించిన తరఙ్గము బిన్దువులు అను ముత్తెముల హారములతో కట్టబడిన జడల గుంపుగల, చన్ద్రకిరీట శోభి = చన్ద్ర కిరీటమున శోభించు, మాహేశ్వరమ్ = మహేశ్వరునకు సంబంధించిన, ఉత్తమాఙ్గమ్ = శిరమును, నిరన్తరమ్ = ఎల్లప్పుడు, నమామి = నమస్కరించెదను.

**తాత్పర్యము :-** తెల్లని కదలుచున్న గంగా తరఙ్గ బిన్దువులను ముత్తెముల హారమున చుట్టబడిన, చన్ద్రకిరీటముగల శివుని శిరమును నిరన్తరము నమస్కరించెదను.

**వివరణ :-** ముక్తాస్రగానద్ధ అనుటకు బదులు ముక్తాసరానద్ధ అను ముద్రిత పాఠమున్నది. సర అను శబ్దము హారార్థకముగా సంస్కృతభాషలో అన్యత్ర నాకు కనిపించలేదు. అచ్చ తెలుగున ఆ పదమునకు హారము అను అర్థమున్నది. దీనిని సంస్కృత పదముగా భావించి ప్రయోగించిన ఈ కవి ఆంధ్రుడేమో అను ఊహ కలిగించును. ఇన్ద్రవజ్రోపేన్ద్ర వృత్తములలో పూర్వోత్తరార్ధముల నుండుటచే నీ శ్లోక ముపజాతివృత్త నిబన్ధనము.

గాఙ్గబిన్దువులు ముత్తెములుగా రూపించబడినందున రూపకాలంకారము పూర్వార్ధమున నేర్పడియున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని శీర్షమునకు దాని యందలి గాంగ బిందువులు చన్ద్రుడు అలంకారములు అని చెప్పబడినది. ఈ శ్లోకమున వానికి క్రిందుగా నున్న శివుని ముఖములైదు వానిలోని విభూతి త్రిపుండ్రములు, నేత్రత్రయము, నవ్వు వర్ణించబడుచున్నవి.

**శ్లో॥ భూతిత్రిపుణ్డ్రాశ్రితఫాలభాగం – నేత్రత్రయీరఞ్జనమఞ్జుశోభమ్।**
**భక్తావలీలాలనలోలహాసం – మాహేశ్వరం పఞ్చముఖం నమామి॥ 80**

**ప్రతిపదార్థము :–** భూతి త్రిపుణ్డ్రాశ్రిత ఫాలభాగమ్ = విభూతియొక్క మూడురేఖ లాశ్రయించిన ఫాలభాగముగల, నేత్ర త్రయీ రఞ్జన మఞ్జు శోభమ్ = మూడు నేత్రముల రఞ్జనమున అందమైన శోభగల, భక్తావలీ లాలన లోలహాసమ్ = భక్తుల గుంపు లాలించుటలో ఆసక్తమైన నవ్వుగల, మాహేశ్వరమ్ = మహేశ్వరునకు సంబంధించిన, పఞ్చముఖమ్ = ఐదు ముఖములను, నమామి = నమస్కరించెదను.

**వివరణ :–** 1. శివుని ఫాలము భస్మ త్రిపుండ్రముతో నేత్రత్రయముతో ప్రకాశించు చున్నదనుట పూర్వార్ధార్థము. ఫాలము క్రింది ముఖములందలి నవ్వు భక్తుల గుంపులను రక్షించుటలో ఆసక్తమై యున్నదనుట ఉత్తరార్ధార్థము. 2. శివునికి పంచ ముఖములు సమాంతరముగా ఉన్నట్లు బొమ్మలు చిత్రకారులచే చిత్రించబడి కానవచ్చును. కాని అవి అట్లు సమాంతరముగా ఉన్నట్టివి కావు. శివుని పంచముఖములు నాలుగు దిక్కులకు అభిముఖములుగా, ఒకటి ఊర్ధ్వముఖముగా గ్రన్థములలో వర్ణింపబడినవి. పాతాళ (మునకు అభిముఖమైన) షష్ఠముఖముగా ఒకటి ఉన్నట్లు ఒక శ్లోకము కొన్ని మహాన్యాసప్రతులలో గోచరించును. సద్యోజాత వామదేవ తత్పురుష అఘోర ఈశాన అనుపేర్లు ఆ ముఖముల కున్నట్లును ఆ వర్ణనలలో ఉన్నది. కొన్ని గ్రంథములలో ఈ అయిదుపేర్లు శివుని దేహావయవముల కున్నట్లును కొన్ని శ్లోకములు కనిపించును. కాని పంచముఖత్వ మతిప్రసిద్ధము. శివుని శరీరమంతయు మంత్రమయ మగుచో ఈ అయిదు మంత్రములు ముఖస్థానీయము లగును. దూర్వాసుడు తన పరశమ్భుమహిమ్నః స్తోత్రమున శమ్భువును షడాస్యమ్ అని స్పష్టముగానే పేర్కొనియున్నాడు. శివుని సద్యోజాత ముఖము పశ్చిమాభి ముఖము. తెల్లనిది. వామదేవ ముఖము ఉత్తరముఖము గౌరవర్ణము. తత్పురుష ముఖము ప్రాగభిముఖము కనకవర్ణము, అఘోర ముఖము దక్షిణాభిముఖము





నల్లనిది. ఈశాన ముఖము ఊర్ధ్వాభిముఖము స్ఫటిక వర్ణము. మంత్రముల వరుస ననుసరించి ఈ ముఖముల వరుస చెప్పబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని పఞ్చముఖములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున ఆయన హస్తములు వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ త్రిశూలపాశాఙ్కుశపట్టిసాసి – గదాధనుర్బాణధరం నతానామ్।**
**అభీతిదం కుణ్డలికఙ్కణాఢ్యం–మాహేశ్వరం హస్తచయం భజేఽహమ్॥81**

**ప్రతిపదార్థము :–** త్రిశూలపాశాఙ్కుశ పట్టిసాసి గదా ధనుర్బాణ ధరమ్ = త్రిశూలము, పాశమును అఙ్కుశమును గదను ధనువును బాణమును ధరించిన, నతానామ్ = నమస్కరించిన వారికి, అభీతిదమ్ = అభయము నొసగు, కుణ్డలి కఙ్కణాఢ్యమ్ = సర్ప కంకణములతో కూడిన, మాహేశ్వరమ్ = మహేశ్వరునకు చెందిన, హస్త చయమ్ = హస్తముల సమూహమును, అహమ్ = నేను, భజే = భజించెదను.

**తాత్పర్యము :–** త్రిశూలము, పాశము, అఙ్కుశము పట్టిసము (బాడిస) అసి, (కత్తి), గద,ధనువు, బాణమును ధరించిన, సర్ప కంకణములచే నలంకరింపబడిన మహేశ్వరుని హస్తముల గుంపును నమస్కరించెదను.

**వివరణ :–** ఎనిమిది ఆయుధములు ఎనిమిది చేతులలో అభయముద్రను తొమ్మిదవ చేత శివుడు ధరించినట్లు చెప్పబడిన వరద ముద్రను పదవచేత ధరించినట్లు చెప్పబడక పోయినను ఊహించుకొనవచ్చును. హస్తయుగమ్ అను ముద్రిత పాఠము ఉచితముగా లేదు. మూడు పాదము లుపేన్ద్రవజ్రా లక్షణము, నాల్గవపాదము మింద్ర వజ్రా లక్షణము కలిగియుండుటచే నీ శ్లోక ముపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని హస్తములు వర్ణింపబడినవి. ఈ శ్లోకమున ఆయన పాదములు వర్ణింపబడుచున్నవి.

**శ్లో॥ సమస్తసురపూజితే స్వరబలాభినీరాజితే**
**విభూతిభరభాసితే విమలపుష్పసంవాసితే।**
**భుజఙ్గపతినూపురే బుధజనావనశ్రీపరే**
**మహామహిమనీ భజే మనసి శైవపాదామ్బుజే॥ 82**

**ప్రతిపదార్థము :–** సమస్త సుర పూజితే = సర్వసుపర్వుల (పురుషుల)చే పూజింపబడిన, స్వరబలాభి నీరాజితే = స్వర్గ స్త్రీలచే నీరాజన మొసగబడిన, విభూతి భర భాసితే =

విభూతి భారమున ప్రకాశింపబడిన, విమల పుష్ప సంవాసితే = స్వచ్ఛములైన పూవులచే సువాసను పొందిన, భుజఙ్గపతి నూపురే = సర్ప రాజములు నూపురములుగాగల, బుధ జనావన శ్రీపరే = జ్ఞాని జనమును కాపాడు కాంతియందు ఆసక్తములైన, మహామహిమనీ = గొప్ప మహిమగల, శైవపాదామ్బుజే = శివునకు సంబంధించిన పాదకమలములను, భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** సురపురుషులచే పూజింపబడిన, సురస్త్రీలచే నీరాజితములైన, విభూతి భారముచే ప్రకాశించిన, స్వచ్ఛములైన పుష్పముల సుగంధమును విరజిమ్ము సర్పరాజములు నూపురములుగా గల శివుని పాద కమలముల సేవించెదను.

**వివరణ :–** విభూతి బిల్వ పుష్ప నాగాభరణ నీరాజనములు శివపాద పూజలోని పంచోపచారములు ఈ శ్లోకమున పేర్కొనబడినవి. మొదటి నాలుగు ఉపచారములు సుపర్వులలోని పురుషులు సమర్పించగా చివరిదైన నీరాజనము సుపర్వ స్త్రీలచే సమర్పింపబడినది. శ్రీ శబ్దము మారేడు పత్రమును బోధించు శక్తి కలది. దానిని సమర్పించిన బుధజనుల నది కాపాడును. శివ పాదాంబుజములా పత్రమందు ఆసక్తి కలిగియుండును అను అర్థాంతరము నీ విశేషణము వ్యంజించును. ప్రతి పాదమున జ–స–జ–స–య–ల–గ అను గణములుండుటచే పృథ్వీ వృత్త నిబన్ధనమైన పిదప ఈ శ్లోకమున దాదాపు నడుమ అనగా ఎనిమిది అక్షరములు పిదప యతి అనగా విశ్రాంతి యుండును. పాదాంత యతి సంస్కృత పద్యములందన్నింటనుండును. ఈ శ్లోకమున మధ్యయతికి పూర్వము అది పాదపూర్వార్ధమని పిదప తొమ్మిది అక్షరములతో పాదము పూర్తి యగుటచే అది పాదాత్తోరార్ధము అని చెప్పవచ్చును. ప్రతిపాదమున పూర్వార్ధోత్తరార్ధములలో పదాన్తానుప్రాస మున్నది. దాక్షిణాత్యమైన మైత్రి కూడా పాద పూర్వోత్తరార్ధముల ఆది వర్ణములకు కూర్పబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ పాదామ్బుజ వర్ణనముతో శివకేశాది పాదాన్తవర్ణనము ముగిసినది. ఈ శ్లోకమున మొత్తము శివ తనువు వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ జటావలీచన్ద్రకలాభ్రగఙ్గాం – కపాలమాలాకలితోత్తమాఙ్గామ్।**
**దిగమ్బరాం పఞ్చముఖీం త్రినేత్రాం – శివాశ్రితాం శైవతనుం భజేఽహమ్॥ 83**

**ప్రతిపదార్థము :–** జటావలీ చన్ద్ర కలాభ్రగఙ్గామ్ = జడల గుంపు చన్ద్రకల ఆకాశగంగ గల, కపాల మాలా కలితోత్తమాఙ్గామ్ = పుఱ్ఱెల పేరుతో కూడిన శిరముగల, దిగమ్బరామ్ = దిక్కులే వస్త్రములుగాగల, పఞ్చముఖీమ్ = ఐదు ముఖములుగల, శివాశ్రితామ్ = అమ్మవారిచే ఆశ్రయింపబడిన, శైవతనుమ్ = శివునకు సంబంధించిన శరీరమును, అహమ్ = నేను, భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** శిరమున జడల గుంపును చన్ద్రకలను ఆకాశగంగను పుఱ్ఱెలపేరును ధరించిన, దిక్కులే వస్త్రములుగా గల అనగా వస్త్రములు లేని అయిదు ముఖములుగల పార్వతీదేవి చేత ఆశ్రయింపబడిన శివునకు సంబంధించిన శరీరమును సేవించెదను.

**వివరణ :–** పూర్వార్ధప్రథమపాదమున శివుని శిరమందలి జడల సమూహము చన్ద్రకల ఆకాశగంగ కపాలమాల పేర్కొనబడినవి. శివుడు వ్యోమకేశుడు అనగా ఆకాశమే కేశసమూహముగా గలవాడు. అదియే ఆయన జడల సమూహము. దానియందే చన్ద్రకల ఆకాశగంగయు నున్నవి. ఆకాశమునందు చన్ద్రకల ఆకాశగంగ ఉండును గదా! అనగా అవి శివుని కేశములందున్నట్లే. ఇదియే ప్రథమపాదమున ప్రతిపాదింపబడిన రహస్యము. శివుడు పుఱ్ఱెలమాలను శిరమున ధరించినాడని రెండవ పాదమున చెప్పబడినది. కపాల శబ్దము నక్షత్రములను కపాలమాలను జ్యోతిశ్చక్రమును సూచించును. శివుని తలకు నక్షత్రరాశి యంతయు పూలమాల చుట్టబడియున్నదనుట ఏతద్రహస్యము. మూడవ పాదమున దిక్కులే శివునకు వస్త్రములు అని చెప్పబడినది. ఈ యంశము కూడ శివుని విరాడ్దేహవర్ణనములోని భాగమే. ఆయన ఐదు ముఖములలో ఒక్కొక్క ముఖమున మూడేసి నేత్రముల చొప్పున పదునైదు కనులున్నవి. అవి అన్నీ కలిసి అమ్మవారిని చూచుచున్నవి. పంచదశాక్షరమై యున్నది. ఆమె అతని పంచ దశాక్ష గోచరమై యుండునది అని తాత్పర్యము. పూర్వార్ధమున పాదాన్తాను ప్రాసము, లకారావృత్తియు నుండుటచే, ఉత్తరార్ధమున రేఫావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకారము శ్లోకమున నేర్పడియున్నది. ప్రతిపాదమున జ–త–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోక ముపేంద్రవజ్రావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివసంబంధి రూపము వర్ణింపబడినది. ఈ శ్లోకము తత్సంబంధి రూప దర్శన వాంఛ చెప్పబడుచున్నది.

**శ్లో॥ భేరీమృదఙ్గపణవానకతూర్యశఙ్ఖ–**
**వీణారవైస్సహ జయధ్వనివేణునాదః।**
**సప్తస్వరానుగుణగానమనోహరోఽయం**
**కర్ణద్వయమ్మమ కదా సముపైతి శమ్భో!॥ 84**

**ప్రతిపదార్థము :–** సప్త స్వరానుగుణ గాన మనోహరోఽయమ్ = సప్త స్వరముల తగిన గానముతో మనోహరమైన, భేరీమృదఙ్గ పణవానక తూర్య శఙ్ఖ వీణా రవైః = భేరీ మృదఙ్గము, తప్పెట, ఆనక, తూర్యము, శఙ్ఖము వీణ వీనియొక్క ధ్వనులతో, సహ = కూడిన, అయమ్ = ఈ, జయధ్వని వేణునాదః = జయధ్వనితో కూడిన వేణునాదము, శమ్భో = ఓ శమ్భూ!, మమ = నాయొక్క, కర్ణద్వయమ్ = రెండు చెవులను, కదా = ఎప్పుడు, సముపైతి = పొందునో!

**తాత్పర్యము :–** భేరీ మృదఙ్గాది (తాళ) వాద్యములతో సప్తస్వరానుగుణ గానముతో జయధ్వనితో కూడిన మురళి ధ్వని నా రెండు చెవులకు సోకుట యెన్నడో!

**వివరణ :–** కైలాసమున సాయంకాలమున శివుని తాణ్డవసందర్భమున వివిధ వాద్యధ్వనులు భక్తుల జయజయ ధ్వనులు వినబడి నాకు సంతోషము కలుగుట యెన్నడో అను కవి చింతాభావముయొక్క దిగులు ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. ఈ పాదమున త–భ–జ–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము వసన్త తిలక వృత్తనిబన్ధనము.

---

**శ్లో॥ శివమస్తేన్దురేఖాయా – శ్చన్ద్రికేయం సమాగతా।**
**సత్యం యతో నిరస్తమ్మే – బాహ్యమాభ్యన్తరం తమః॥ 85**

**ప్రతిపదార్థము :–** యతః = ఏ కారణమున, బాహ్యమ్ = బయటి, అభ్యంతరమ్ = లోని, తమః = చీకటి, నిరస్తమ్ = తొలగింపబడినదో (తతః = అందువలన), శివమస్తేన్దు రేఖాయాః = శివ శీర్షగత చన్ద్రరేఖయొక్క, ఇయమ్ = ఈ, చన్ద్రికా = వెన్నెల, సమాగతా = వచ్చినది.

**తాత్పర్యము :–** నాలోపలి బయటి చీకట్లు తొలగుటచే ఇది శివ శీర్ష చన్ద్రరేఖ నుండి వచ్చిన వెన్నెలయే కావలయును.

**వివరణ :–** లోకమునందలి చన్ద్రుడు బయటి చీకటిని కొంత పోగొట్ట గలడేమో గాని హృదయములోని చీకటిని పోగొట్టలేడు. నా లోపలి అనగా హృదయము లోపలి చీకటిని పోగొట్టలేడు. నా లోపలి అనగా హృదయము లోపలి చీకటిని గూడ తొలగించిన శివ శీర్షగతచన్ద్రచన్ద్రికకే సాధ్యమగును. అను శివరూప సాక్షాత్కారమునకు ముందు హృదయమున (సూచించబడినది) వ్యాపించిన వెలుగు (స్వానుభవము) ఈ శ్లోకమున సూచించబడినది. తకారావృత్తి ఈ శ్లోకమున వృత్త్యనుప్రాసాలంకారమును కల్గించుచున్నది.

---





**అవతారిక :–** పై శ్లోకమున శివరూప సాక్షాత్కారమునకు ముందు హృదయాంధకారము నివారింపబడుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ రూపముయొక్క సాక్షాత్కార కథనము ఆరంభింపబడుచున్నది.

**శ్లో॥ సందృశ్యతేఽసౌ వృషభో ధ్వజాగ్రే**
**వసన్మయా శృఙ్గయుగేన కోపాత్।**
**వక్రస్వభావం సదృశం ద్వికోటి–**
**మర్ధేన్దుమాహన్తుమివోత్పతన్ ఖమ్॥ 86**

**ప్రతిపదార్థము :–** ధ్వజాగ్రే = ధ్వజముయొక్క పై కొనయందు, వసన్ = నివసించుచున్న, అసౌ = ఈ, వృషభః = వృషభము, మయా = నాచేత, ద్వికోటిమ్ = రెండు మొనలుగల, సదృశమ్ = సమానమైన, వక్రస్వభావమ్ = వక్ర స్వభావముగల, అర్ధేన్దుమ్ = అర్ధచంద్రుని, కోపాత్ = కోపమున, ఆహన్తుమ్ ఇవ = కొట్టుట (పొడచుట) కోయన్నట్లు, ఖమ్ = ఆకాశమునకు, ఉత్పతన్ = ఎగురుచు, సందృశ్యతే = కనబడుచున్నది.

**తాత్పర్యము :–** శివుని జండాపై వృషభమున్నది. దానికి రెండు కొమ్ములుగల ముఖమున్నది. శివుని శిరమందలి తనవలె ఉన్న అర్ధచంద్రుని పడద్రోయుట కాకాశమునకు ఎగురుచున్నట్లు ధ్వజముపై కనబడుచున్నది.

**వివరణ :–** కొందఱిలో సాదృశ్యము విరోధమునకు, మఱికొందరిలో నది స్నేహమునకు కారణమగుట లోకములోని ఒక తథ్యము. శివుని ధ్వజముపై (జండా గుడ్డపై) వృషభ చిహ్నమున్నది. దానికి రెండు కొమ్ములు చిత్రింపబడి యున్నవియ శివుడా జెండా వెనుక దూరమున ఉన్నాడు. శివుడు వచ్చుటకు ముందు జండా పట్టుకొని తత్సేవకుడెవడో వచ్చుట పరిపాటి గదా! ఆ జండాగుడ్డ ఆకాశము పైకి పోవచున్నట్లు రెపరెప లాడుచున్నది. ఆ వృషభము కూడ ఆకాశమున కెగురుచున్నట్లు కనబడుచున్నది. ఆకాశమున అర్ధచన్ద్రుడున్నాడు. (శివ శీర్షమున అర్ధచంద్రుడున్నాడు) ఆకాశమే శివశీర్ష మనవచ్చును. అది అట్లుండుగాక. ఆ అర్ధచంద్రుడు ద్వికోటియై యున్నాడు. రెండు కొమ్ములు కలిగి తనవలెనే ఉన్నాడని ఆ వృషభమునకు తోచినది. ఈ అనర్హుడు తనవలె ఉండుటను అనగా తన సాదృశ్యము కలిగియుండుటను సహింపని ఆ వృషభము ఆ చంద్రుని పొడవబోవు చున్నట్లున్నది. అను సంభావన మీ శ్లోకమున ఉండుటచే ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారమేర్పడియున్నది. వృషభ ధ్వజము ఆకాశముపై కెగురుటకు చంద్రుని పొడచుట ఫలము కాదు. కాని అట్లు చెప్పబడుటచే నిది ఫలోత్ప్రేక్షాలంకారము. ఈ శ్లోకము 1,3,4 పాదములలో ఇంద్రవజ్రాగణము లుండుటచే రెండవ పాదమున

ఉపేన్ద్రవజ్రాలక్షణము లుండుటచే ఉపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని వృషభ చిహ్న ధ్వజము వర్ణింపబడినది. ఈ శ్లోకమున అతని వాహనమైన వృషభము యొక్క దర్శనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ముక్తిద్వారస్తమ్భశుమ్భద్విషాణో**
**లీలాచారశ్రీచతుర్వర్తితాంఘ్రిః।**
**ప్రాప్తోఽ యమ్మే దృక్పథమ్మన్దగామీ**
**బిభ్రచ్ఛమ్భుం శుభ్రదేహో మహోక్షః॥ 87**

**ప్రతిపదార్థము :–** ముక్తిద్వార స్తమ్భ శుమ్భద్విషాణః = ముక్తికి ద్వారములో యనునట్లున్న ప్రకాశించు కొమ్ములుగల, లీలాచార శ్రీ చతుర్వర్తితాంఘ్రిః = లీలగా ఆచరించు సంపద (ధర్మము)ను ప్రవర్తింపజేయబడిన పాదములు గల, మన్దగామీ = మెల్లగా నడుచు, శమ్భుమ్ = శివుని, బిభ్రత్ = మోయు, శుభ్రదేహః = తెల్లని దేహము కల, అయమ్ = ఈ, మహోక్షః = పెద్ద ఎద్దు, మే = నాయొక్క దృక్పథమ్ = నేత్రమార్గమును, ప్రాప్తః = పొందియున్నది.

**తాత్పర్యము :–** శివుని వాహనమైన పెద్ద యెద్దునకున్న రెండు కొమ్ములు ముక్తి ద్వారమున నుండు రెండు స్తమ్భములో యన్నట్లున్నవి. దాని నాలుగు పాదములు లీలగా ఆచరింపబడు ధర్మముయొక్క నాలుగు పాదము లనదగినవిగా నున్నవి. మెల్లగా నడచు తెల్లని దేహముగల శివుని మోయు ఆ పెద్దయెద్దు నాకు కనబడినది.

**వివరణ :–** శివుడు వృషభముయొక్క మూపురము వెనుక కూర్చొని యుండును. శివుని చేరవలసిన అనగా ముక్తుడు కావలసిన జీవశిశువు ఆ కొమ్ముల మధ్య నుండియే పోవలయును. అందుచేత ఆ వృషభముయొక్క కొమ్ములు ముక్తి ద్వారస్తమ్భములో యన్నట్లు సంభావింపబడుటచే మొదటి పాదమున ఉత్ప్రేక్షాలంకారమేర్పడియున్నది. జీవుని మనస్సే శివుని మోయు వృషభము. అది సత్యము. (ఈశ్వరో) సోహమస్మి లేక ఈశ్వర ధ్యానము (శివజీవైక్య) ధ్యానము అను నాలుగు అక్షరములు పాదములుగల ధర్మమే ఆ వృషభము. శివుని వృష(భ) వాహనముయొక్క రహస్యమిదియే. నిత్య (ముక్తిగల) జీవుడైన వృషభుడు లోకమున అనాయాసముగా ధర్మము నాచరించును. అందుచేతనే అతడు **లీలాచారశ్రీచతుర్వర్తితాంఘ్రిః** తనవలెనే ఇతరులు ధర్మమున ప్రవర్తింప జేయుననుటను వర్తిత శబ్దము వ్యంజించును. శివుని వలె వృషభము తెల్లనిది. శివుని కంఠమున విషము (శ్రీ) ఉన్నది. వృషభమున ఆ నలుపును లేదు. కాని దీని





యందాచార్యశ్రీ యున్నది. ధర్మసదాచారమున నేర్పడిన బ్రహ్మ వర్చస్సే శ్రీ పద వ్యంగము. ప్రతిపాదమున మ-త-త-గ-గ అను గణము లుండుటచే నీ శ్లోకము శాలినీవృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ వాహన వృషభము వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆ వృషభముయొక్క లోకులను గూర్చి సంజ్ఞద్వారా చేయు ఉపదేశము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మయి స్థితం శమ్భుమవేక్ష్య తూర్ణ-**
**మాగత్య ధన్యా భవతేతి సంజ్ఞామ్।**
**కుర్వన్నివాయాతి పురో వృషోఽ యం**
**ముహుర్ముహుః కమ్పనతో ముఖస్య॥ 88**

**ప్రతిపదార్థము :–** మయి = నా(యందు) పైన, స్థితమ్ = ఉన్న, శమ్భుమ్ = శివుని, తూర్ణమ్ = వేగముగా, అవేక్ష్య = చూచి, అగత్య = వచ్చి, ధన్యాః = ధన్యులు, భవత = అగుదురు, ఇతి = అని, ముహుర్ముహుః = మాటిమాటికి, ముఖస్య = ముఖముయొక్క కమ్పనతః = కదల్చుట వలన, సంజ్ఞామ్ = సైగను, కుర్వన్ ఇవ = చేయుచున్నట్లున్న, అయమ్ = ఈ, వృషః = ఎద్దు, పురః = ముందు, ఆయాతి = వచ్చుచున్నది.

**తాత్పర్యము :–** నా పైన కూర్చొనియున్న శివుని చూచి వచ్చి సేవించి ధన్యులు కండని మాటిమాటికి ముఖమును కదల్చుటతో సైగలను చేయుచున్నట్లున్న ఆ వృషభము ముందు వచ్చుచున్నది.

**వివరణ :–** వృషభ స్వభావమైన ముఖకమ్పనమును నా యందున్న శివుని చూచివచ్చి ధన్యులు కండు అను లోకోపదేశముయొక్క సంజ్ఞగా సంభావింపబడినందున ఉత్ప్రేక్షాలంకారమేర్పడి యున్నది. బేసిపాదములలో ఇంద్రవజ్రాలక్షణము, సరి పాదములలో ఉపేంద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోకము ఉపజాతి వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున వృషభము యొక్క లోకోపదేశము చెప్పబడినది. ఈ శ్లోకమున వృషభముయొక్క మూపురము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ భాత్యయం వృషభశ్శుభ్రా - మ్మహతీం కకుదం దధత్।**
**ప్రీతయే పురతః శమ్భోః - కైలాసాద్రిం వహన్నివ॥ 89**

**ప్రతిపదార్థము :–** అయమ్ = ఈ, వృషభః = ఎద్దు, శుభ్రామ్ = తెల్లని, మహతీమ్ = గొప్పనైన, కమదమ్ = మూపురమును, దధత్ = ధరించుచు, పురతః = ఎదుట,

శమ్భోః = శివునియొక్క, ప్రీతయే = ప్రీతికొఱకు, కైలాసాద్రిమ్ = కైలాస పర్వతమును, వహన్ ఇవ = మోయుచున్న దానివలె, భాతి = ఒప్పుచున్నది.

**తాత్పర్యము :–** తెల్లని మూపురము మోయుచున్న వృషభము శివుని సంతోషము కొఱకు అతని ముందు కైలాసపర్వతమును మోయుచున్నదో అన్నట్లున్నది.

**వివరణ :–** ప్రభువు సంతోషము కొఱకు బరువుల మ్రోయుట మొదలగు (ప్రభు) వినోద కృత్యముల నొనరించుట లోకపరిపాటి. దాని ననుసరించి కైలాస పర్వతమును మోయుచున్నదో అన్నట్లు తెల్లని మూపురమును మోయు వృషభ మొప్పుచున్నదని ఈ శ్లోకమున మూపురము కైలాస పర్వతముగా సంభావింపబడుటచే నుత్ప్రేక్షాలంకార మేర్పడి యున్నది. ఒకప్పుడు దుష్టబుద్ధితో కైలాసము నెత్తి రావణుడు శిక్షింపబడి పిదప అనుగ్రహింపబడెను. దానిని గుర్తించిన వృషభము సద్బుద్ధితో నెత్తినట్లు కనబడి శివుని ప్రీతికి పాత్రమయినదను విశేషము ఇట స్ఫురించును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున వృషభవర్ణనము ముగింపబడినది. ఈ శ్లోకమున శివుని నేత్ర వర్ణనము, దర్శనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కిమిదం యుగపచ్చిత్రం – పుష్పవన్తావిహోదితౌ।**
**ప్రత్యక్షీభవతశ్శమ్భో – రిమే నేత్రే భవిష్యతః॥ 90**

**ప్రతిపదార్థము :–** ఇదమ్ = ఈ, చిత్రమ్ = చిత్రము (వింత), కిమ్ = ఏమియో, యుగపత్ = ఒకేసారి, పుష్పవన్తౌ = సూర్యచన్ద్రులు, ఉదితౌ = ఉదయించినారా, ప్రత్యక్షీభవతః = ప్రత్యక్షమగుచున్న, శమ్భోః = శివునికి, ఇమే = ఇవి (వీరు), నేత్రే = నేత్రములు, భవిష్యతః = కావచ్చును.

**తాత్పర్యము :–** ఇదేమి చిత్రము, సూర్యచంద్రులొకేసారి ఉదయించినారా? ప్రత్యక్షమగుచున్న శివుని నేత్రములు కాబోలు.

**వివరణ :–** శివుడు ప్రత్యక్షమగుచున్నాడు. ముందుగా అతని నేత్రములు కాంతివంతములై కనబడుచున్నవి. ఆ కాంతి తీవ్రతచే మిగిలిన ముఖ భాగము కనిపించలేదు. సూర్యచంద్రుల నొకేసారి చూచు అనుభవ మింతకు ముందు లేని వాని (కవి) కిది వింతగా తోచినది. కొంతసేపటికి ఈ కనబడినవి శివుని కన్నులు కావచ్చునని నిపుణముగా ఊహించుట ఈ శ్లోకమున స్ఫురింపజేయబడినది. సూర్యచన్ద్రుల ఉదయము



ఏకకాలమున అసంభవము. శివముఖ దర్శన మైనప్పుడు ఇది సమ్భవము అను అంశము అందముగా నీ శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున సూర్యచంద్రయుగప ద్దర్శనము శివ నేత్ర దర్శన చిహ్నముగా చెప్పబడినది. ఈ శ్లోకమున సహస్ర సూర్యకాంతి శివదర్శన చిహ్నముగా చెప్పబడు చున్నది.

**శ్లో॥ సహస్రాంశుసహస్రాణాం – ప్రకాశకమిదమ్మహః।**
**ప్రార్థితస్సమ్ప్రతి శివః – ప్రత్యక్షత్వం గతో మమ॥ 91**

**ప్రతిపదార్థము :–**సహస్రాంశు సహస్రాణామ్ = వేల సూర్యులయొక్క, ప్రకాశమ్ = ప్రకాశకమైన, ఇదమ్ = ఈ, మహః = తేజస్సు, సమ్ప్రతి = ఇప్పుడు, ప్రార్థితః = ప్రార్థితః = ప్రార్థింపబడిన, శివః = శివుడు, మమ = నాకు, ప్రత్యక్షత్వమ్ = ప్రత్యక్షతను, గతః = పొందినాడు.

**తాత్పర్యము :–** వేలకొలది సూర్యులకీ తేజము ప్రకాశముగా నున్నది. కావున ఇదివఱకు ప్రార్థింపబడిన శివు డిప్పుడు ప్రత్యక్షమైనా డనిపించుచున్నది.

**వివరణ :–** శివుడు జ్ఞాన స్వరూపుడు. జ్ఞానమొక సూర్యుని గాని, వేలకొలది సూర్యులను గాని చూపగలదు. జ్ఞానము లేనినాడు బయటి వెలుగును చూచుట సాధ్యము కాదు. లోపలి వెలుగై శివుడు సాక్షాత్కరించినపుడు బయట ఎంత అంధకారమున్నను తద్దర్శనమునకు అడ్డంకి కాజాలదు. సహస్రశబ్దమిట ఆనంత్య సూచకము. నేత్రములతో చూడవలెనన్న బాహ్య ప్రకాశము సాయపడవలయును. శివదర్శనమునకు దాని సాయమవసరము లేదు. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకములలో శివదర్శనానుభవము చెప్పబడినది. ఈ శ్లోకమున శివదర్శనమువలన కలిగిన శరీరరోమాఞ్చితము, మనోవికాసము ఆనందబాష్పము(లు) చెప్పబడుచున్నవి.

**శ్లో॥ రోమాఞ్చితం సర్వమిదం శరీరం–సానన్దబాష్పే నయనే మనోఽను।**
**వికాసి కామమ్మహదాశు జాతం – శివస్య సన్దర్శనతో మమాహో॥ 92**

**ప్రతిపదార్థము :–**శివస్య = శివునియొక్క, సందర్శనతః = సందర్శనము వలన, ఇదమ్ = ఈ, శరీరమ్ = శరీరము, రోమాఞ్చితమ్ = రోమాఞ్చమును పొందినది, నయనే = కన్నులు, సానన్దబాష్పే = ఆనన్ద బాష్పములు కలవైనవి, మహత్ = గొప్పనైన, ఆశు =

శీఘ్రముగా, మనః = మనస్సు, అను = పిదప, కామమ్ = మిక్కిలి, వికాసి = వికాసముగలది, జాతమ్ = అయినది, మమ = నాకు, అహో = ఆహా!

**తాత్పర్యము :–** శివదర్శనము వలన నా శరీరమున గగుర్పాటు కలిగినది. నేత్రముల నుండి కన్నీరొలికినది. మనసెంతో వికాసము నొందినది.

**వివరణ :–** శివుడానంద రసస్వరూపుడు. ఆనందము స్వరూపము. ఆ స్వరూపానందము కలిగినప్పుడు మనస్సు వికసించును. కన్నుల నుండి ఆనంద బాష్పములు, శరీరమున రోమాఞ్చము అనుభావములు కలుగును. ఇవి అనుభవజ్ఞులకే తెలియు విశేషములు పూర్వార్ధమున ఇంద్రవజ్రా లక్షణము. ఉత్తరార్ధమున ఉపేన్ద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోక ముపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివదర్శనమున కలిగిన మనోవికాసానంద బాష్ప రోమాఞ్చములు చెప్పబడినవి. ఈ శ్లోకమున తన మనసునందు అనేక జన్మముల నుండి ఆర్జితమై యున్న పాపముల దహనము కలిగిన అనుభవము చెప్పబడుచున్నది.

**శ్లో॥ అనేకజన్మార్జితపాతకాని దగ్ధాని మే దర్శనతశ్శివస్య।**
**నేదం విచిత్రం శివదర్శనేన కామో హి దగ్ధోఽఖిలదుష్ప్రధర్షః॥ 93**

**ప్రతిపదార్థము :–** శివస్య = శివునియొక్క, దర్శనతః = దర్శనమువలన, మే = నాయొక్క అనేక జన్మార్జిత పాతకాని = అనేక జన్మలలో సంపాదింపబడిన పాపములు, దగ్ధాని = దహింపబడినవి, ఇదమ్ = ఇది, విచిత్రమ్ న =విచిత్రము కాదు, అఖిల దుష్ప్రధర్షః = అందఱకు లొంగని, కామః = కాముడు, శివదర్శనేన = శివదర్శనము చేత, దగ్ధః హి = దహింపబడినాడు గదా!

**తాత్పర్యము :–** శివుని దర్శనము వలన అనేక జన్మలనుండి పోగుచేయబడిన నా మనసులోని పాతకములు దహింపబడిన వనుట వింత కానే కాదు. ఏలననగా ఎవరికిని లొంగని మన్మథుడే శివదర్శనము అనగా కంటి (మంట)చే దహింపబడినాడు గదా!

**వివరణ :–** జన్మకు మూలము కర్మము. కర్మమునకు మూలము కామము. దాని మూలము అజ్ఞానము. అజ్ఞానమునకు వేదాంతులు కారణదేహ మందురు. అజ్ఞానమునకు దానినుండి పుట్టు కామముల కాశ్రయము మనస్సు అను అంతరింద్రియము, బాహ్యములైన జ్ఞానకర్మేంద్రియములు, ప్రాణములు మనస్సు చేతనే బంధించి యుంచబడును. ఇట్టి మనస్సు ప్రాణేంద్రియ సహితమై సూక్ష్మ శరీరమన బడును. ఈ రెండు శరీరములు అనాదులు. స్థూలశరీరమున పాపపుణ్యకర్మ జన్మ దుఃఖసుఖానుభవము



కొఱకు సూక్ష్మశరీరము ధరించును. తదనుభవానంతరము విడచి మరొక శరీరమును మిగిలిన పాపపుణ్య కర్మ జన్మ సుఖదుఃఖానుభవము కొఱకు ధరించును. ఇట్లీ స్థూల శరీరముల జన్మ మరణములు అనంతముగా సాగి పోవలసినదేనా! కాదు. నిష్కామముగా చేయబడిన సత్కర్మలచే మనస్సున పేర్కొనియున్న పాపములు దహింపబడు చుండును. అట్టి సత్కర్మలు జన్మహేతువులు గావు. దుఃఖానుభవ హేతువయిన పాపములు దహింపబడుకొలది దుఃఖానుభవము కొఱకు పొందవలసిన స్థూల శరీరమునకు హేతువైన కర్మలు నశించి యున్నందున మరల జన్మలు రావు. కాని కర్మ హేతువైన కామము నశింపనంతవరకు ఈ జన్మ మరణ పరంపర ఆగిపోదు. కామము తిరిగి పుట్టకుండ వలెనన్న కామమూలమైన అజ్ఞానము తొలగవలెను. జ్ఞాన స్వరూపుడైన శివుని దర్శనము చేత మాత్రమే అనగా, శివుడే ఆత్మ, ఆత్మయే శివుడు (శివోఽహమ్) అను శివ జీవైక్యరూప శివదర్శనము (శివజ్ఞానము) చేత మాత్రమే అజ్ఞానము నశించును. అజ్ఞానము నశించగా ఇక కాముడు మరల పుట్టుట కవకాశముండదు. శివనేత్రాగ్ని దర్శనము చేత కాముడు కాలినాడన్న పురాణకథయొక్క అంతరార్థము. రహస్యము .2. సాధారణముగా జీవులు అజ్ఞానులు. అజ్ఞానజన్మ కామము కలవారు ఒకరిద్దరు జీవన్ముక్తు లిందు కపవాదముగా నుందురు. అది అట్లుండు గాక! కామము జీవసాధారణము. కావున కామునిట జీవునిగా లేక జీవప్రతినిధిగా పరిగ్రహింపవచ్చును. శివదర్శనము అనగా శివోహమను జ్ఞానము కలుగగానే కామము లేక జీవత్వము తన్మూల కాజ్ఞానము నశించును. కథలో కాముడు మరల పుట్టుట రతి సంతోషము కల్గించుటకు అజ్ఞానము నశింపక అనగా మూలము నశింపక కామము నశించుట అనగా అంకురము నశించుట మరల శివునిలోనే కామ మంకురించి పార్వతిని పెండ్లాడుట అనునవి శివుని లీలలుగా అనగా కేవలము ప్రదర్శనములుగా భావింపనగును. 3. **సోఽకామయత** అను శ్రుతి పరమేశ్వరునిలో జన్మించిన కామమును చెప్పును. విష్ణువు కామ జనకుడనుటలోని అంతరార్థమిదియే. పరమేశ్వరుడు స్వాధీన మాయుడైనను తన కర్మకు సాక్షిగానుండు వాడైనను పూర్వకల్ప సమష్టి జీవ కర్మ పరిపక్వత నొందినప్పుడు జగత్కారణ కామము బహు భవన సంకల్పము కలిగి జగముల సృష్టించి జగత్కర్తయని పేర్కొనబడుచున్నాడు. శివోహమను శివ జ్ఞానము కలవారి దృష్టిలో జగమే మిథ్య కావున బహుభవన కామము ఆత్మ (శివ) జ్ఞానమున తద్దహనము ఇవి యథార్థముగా లేనివే. 4. జన్మ హేతువైన పుణ్యకర్మ కూడా శివైక్య జ్ఞాన ప్రతిబంధక పుణ్యలోక భోగాది హేతువగుటచే నదియు పాతక శబ్ద బోధ్యమే. శివ దర్శనమున అదియు నశించును. 5. మొదటి పాదమున ఉపేన్ద్రవజ్రా లక్షణము

మిగిలిన మూడు పాదములలో ఇంద్రవజ్రా లక్షణము నుండుటచే నీ శ్లోక ముపజాతి వృత్త నిబన్ధనము. 6. కామ మఖిల దుష్ప్రధర్షమనుటకు బ్రహ్మ శివ విష్ణువులు తమ భార్యల నెత్తికెక్కించుకొనుట, శరీరమున కంటించుకొనుట నిదర్శనములు. తమ భార్యల మాట దాటరని యెఱిగిన భక్తులు తమను రక్షించుటకు శిక్షించకుండుటకును పురుషకారము చేయుమని వారిని ప్రార్థించుట శ్రీ వైష్ణవ భక్తులలో నధికముగా గాననగును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివదర్శనము వలన పాప దహనానుభవము చెప్పబడినది. ఈ శ్లోకమున శివదర్శన సంజనిత కృతార్థత చెప్పబడుచున్నది.

**శ్లో॥ అహో! భాగ్యమహో భాగ్య – మ్మహదీశ్వరదర్శనాత్।**
**కృతార్థోఽహం కృతార్థోఽహం – త్రైలోక్యేఽపి న సంశయః॥ 94**

**ప్రతిపదార్థము :–** అహో = ఆహా, భాగ్యమ్ = భాగ్యము, అహో = ఆహా, భాగ్యమ్ = భాగ్యము, మహత్ = గొప్పనైనది, ఈశ్వర దర్శనాత్ = ఈశ్వరునియొక్క దర్శనము వలన, త్రైలోక్యేఽపి = మూడు లోకములందును, అహమ్ = నేను, కృతార్థః = ధన్యుడను, అహమ్ = నేను, కృతార్థః = ధన్యుడను, సంశయః న = సంశయము లేదు.

**తాత్పర్యము :–** ఈశ్వరుని దర్శనమున నాకు చేకూరిన భాగ్యమెంత గొప్పది. మూడు లోకములందును నేనే కృతార్థుడను. నాకంటె గొప్ప భాగ్యముగల కృతార్థుడెవడును లేడు. ఇందు సంశయము లేదు.

**వివరణ :–** అహో భాగ్యమ్ కృతార్థోహమ్ అను పదబన్ధముల ద్విరుక్తి అదరాతి శయమును వ్యంజించును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివదర్శనము వలన కృతార్థత ప్రకటింపబడినది. ఈ శ్లోకము మొదలేడు శ్లోకములలో దానిని కలిగించిన శివునకు కృతజ్ఞతా ప్రకటనార్థ త్రికరణ నమస్కారము చెప్పబడుచున్నది.

**శ్లో॥ నమస్కరోమ్యహమిదం – కాయేన మనసా గిరా।**
**ఆనన్దైకరసం దేవం – భక్తానుగ్రహణం శివమ్॥ 95**

**ప్రతిపదార్థము :–** కాయేన = శరీరముతో, మనసా = మనసుతో, గిరా = వాక్కుతో, అహమ్ = నేను, ఆనన్దైకరసమ్ = ఆనంద రసమొక్కటే స్వరూపముగా గల, భక్తానుగ్రహణమ్ = భక్తుల ననుగ్రహించు, శివమ్ = శివుని గూర్చి, ఇదమ్ = ఇదిగో, నమస్కరోమి = నమస్కరించుచున్నాను.





**తాత్పర్యము :–** మనోవాక్కాయములతో ఆనన్దైకరసుడు భక్తుల ననుగ్రహించు శివదేవుని గూర్చి నమస్కరించుచున్నాను.

**వివరణ :–** కొందఱు శరీరముతో నమస్కరించునప్పుడు మనసున నమస్కార్యుల నిందించెదరు. వాక్కుతో వినబడునట్లు నమస్సు అని చెప్పుదురు. కాని మనసున నిందించెదరు. మనసులో తాను చేసిన నిందను ఎదుటి వ్యక్తి గమనింపడు గదా. మనసున తిరస్కార భావమును పూనెదరు. కొందఱు మనసున నమస్కరించుచున్నను అలసటతో వాక్కాయములతో నమస్కరింపరు. అట్లు నమస్కారము చేయబడినచో అది త్రికరణ శుద్ధమని చెప్పబడును. ఈ శ్లోకమున త్రికరణశుద్ధమైన నమస్కారము శివునకై చేయబడుట చెప్పబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**శ్లో॥ నమః పరమకల్యాణ – దాయినే హతమాయినే।**
**హిమాచలతనూజాతా – రాగిణేఽతివిరాగిణే॥ 96**

**ప్రతిపదార్థము :–** పరమకల్యాణదాయినే = గొప్ప శుభమును ఇచ్చు, హతమాయినే = కొట్టబడిన మాయగల, హిమాచలతనూజాతా రాగిణే = హైమావతి యందు రాగముగల, అతివిరాగిణే = మిక్కిలి విరాగియైన, శివాయ = శివుని కొఱకు, నమః = నమస్సు.

**తాత్పర్యము :–** మాయను పోగొట్టి పరమ కల్యాణము నొసగువాడు, హైమవతి యందు రాగము కలిగియున్నను విరాగియైన శివునకు నమస్సు (అర్పించుచున్నాను.)

**వివరణ :–** మాయియైనవాడే ఒకరికి భక్తునకు పరమకల్యాణమునో, కల్యాణమునో భక్తి తారతమ్యము ననుసరించియో ఆజ్ఞాకరణ తారతమ్యము ననుసరించియో ఇచ్చును. కానీ ఈ శివుడు మాయలేని ఆజ్ఞాకరణ తారతమ్యము ననుసరించియో ఇచ్చును. కానీ ఈ శివుడు మాయలేనివాడయ్యు కర్మోపాసనగల ఫలము నిచ్చుటను నివారింపడు. కావున ఇచ్చినట్లగుటనే ఇచ్చు (టయని) నట్లు చెప్పిన విరోధము పరిహరింపబడును. అట్లే శరీరార్థమున ధరించి హైమవతి యెడ రాగమును ప్రకటించినట్లు కనబడును. ప్రకృతియైన హైమవతితో నేమాత్రము సంబంధము లేనివాడని చెప్పి విరోధము పరిహరించుకోవచ్చును. కావున ఈ శ్లోకమున విరోధాభాసాలంకారము ఏర్పడియున్నది. ఈ శ్లోకమున పాదాన్తానుప్రాసమను శబ్దాలంకారము కలదు. అనుష్టుప్.

---

**శ్లో॥ నమః కున్దేన్దుధవల – మూర్తయే భవ్యకీర్తయే।**
**నిరస్తభక్త సంసార – నీతయేఽనేకభూతయే॥ 97**

**ప్రతిపదార్థము :–** కున్దేన్దు ధవళమూర్తయే = మల్లెమొగ్గలవలె చన్ద్రునివలె తెల్లని ఆకారముగల, భవ్యకీర్తయే = గొప్ప కీర్తిగల, నిరస్తభక్త సంసారనీతయే = భక్తుల సంసార ప్రాపణము నిరసించిన, అనేక భూతయే = అనేకైశ్వర్యములుగల, (శివాయ = శివుని కొఱకు), నమః = మనస్సు.

**తాత్పర్యము :–** మల్లెమొగ్గలవలె చన్ద్రునివలె తెల్లనిమూర్తి గొప్ప కీర్తిగల, భక్తుల సంసారమున బడకుండ కాపాడు అనేకైశ్వర్యములుగల శివునకు నమస్సు. (చేయబడుచున్నది).

**వివరణ :–** పదాన్తానుప్రాసమను శబ్దాలంకారమున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**శ్లో॥ భారతీ శ్రీ శచీ ముఖ్య – సౌర కాన్తార్చితాంఘ్రయే।**
**వారాణసీపురాధీశ! – సారాచారాయ తే నమః॥ 98**

**ప్రతిపదార్థము :–** భారతీ శ్రీ శచీ ముఖ్య సౌరకాంతార్చితాంఘ్రయే = సరస్వతి లక్ష్మిశచి మొదలగు దేవస్త్రీలచే పూజింపబడిన పాదములుగల, సారాచారాయ = సారమైన ఆచారములుగల, తే = నీకొఱకు, వారాణసీపురాధీశ = ఓ కాశీపురాధినాథా! నమః।

**తాత్పర్యము :–** సరస్వతి లక్ష్మి శచ్యాది దేవకాన్తలచే బూజింపబడిన పాదములు గల సారమైన ఆచారముగల నీ కొఱకో వారాణసీపురాధిపతీ! నమస్సు నొనరించెదను.

**వివరణ :–** తమ భర్తల సర్వవిధ క్షేమమునకై దేవతాస్త్రీలు శివుని పాదముల నర్చించుట శివుని మహాదేవత్వమును వ్యంజించును. వైకుంఠ విరక్తి నొంది విష్ణువు శేషాద్రిపై వేంచేసినట్లు, బ్రహ్మ హత్యా దోషము బాపుకొనుటకు శివుడు కైలాసము విడచి కాశీనగరము చేరినట్లు, పురాణములలో చెప్పబడియున్నది. సర్వత్ర బ్రహ్మదర్శనము గలవాడు శివుడు. సర్వత్ర బ్రహ్మదర్శనము సర్వాచారములలో సారము. అట్టి సారమైన ఆచారము గలవాడు శివుడు. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**శ్లో॥ నమో వేదస్వరూపాయ – గుణత్రయవిభాగినే।**
**లోకకర్త్రే లోకభర్త్రే – లోకహర్త్రే చ తే నమః॥ 99**

**ప్రతిపదార్థము :–** వేద స్వరూపాయ = వేద స్వరూపుడైన, గుణత్రయ విభాగినే = త్రిగుణ విభాగముగల, లోకకర్త్రే = లోకకర్తయైన, లోకభర్త్రే = లోక భర్తయైన, లోకహర్త్రే చ = లోకహర్తయునైన, తే = నీకొఱకు, నమః = నమస్సు.





**తాత్పర్యము :–** వేద స్వరూపుడు గుణత్రయముతో తనలో విభాగముల నేర్పఱచు కొన్నవాడునై లోకముల సృజించి, కాపాడుటయే గాక వానిని చంపుట అను కర్మమును గూడ నిర్వర్తించిన నీకు నమస్సు నర్పించెదను.

**వివరణ :–** శివుడు వేద స్వరూపుడు. వేదమనగా జ్ఞానము. జ్ఞానస్వరూపుడైన శివుడే శ్లోకమున వేదస్వరూపుడని చెప్పబడినాడు. వేదమనగా ఋగాది రూప శబ్దరాశి. తదర్థము కూడ శివుడే. వేదము వాచకము. శివుడు వాచ్యుడు. (వేదము లక్షకము. శివుడు లక్ష్యుడు) వాచ్య వాచకములకు అభేదము. వేదమనగా వేదసారమైన ఓంకారము శివ వాచకము. ఓంకార వాచ్యుడు శివుడు. కావున అతడు వేద స్వరూపుడు. **"వేదః శివః శివో వేదః"** అను సూక్తి శివుడే వేదము. వేదమే శివుడనుటకు ప్రమాణము. 2. ఆ శివుడు గుణాతీతుడయ్యును మాయవశమున గుణియై గుణభేదమున నామరూప భేదములను పొందినందున గుణత్రయ విభాగి అని చెప్పబడినాడు. 3. పురాణములలో సృజించుటకు రజోగుణమును స్వీకరించి బ్రహ్మయై సృష్టికర్తయైనాడని, సత్త్వగుణమును స్వీకరించి విష్ణువై లోక కర్తయైనాడని, తమోగుణమును స్వీకరించి రుద్రుడై లోకహర్తయైనాడని చెప్పబడినది. లోకకర్త యనగా లోకమును సృజించువాడు. లోకభర్త యనగా లోకమును పాలించువాడు. లోకహర్త యనగా లోకమును సంహరించువాడు. 4. ఉపనిషత్తులలో ఎవడు భూతముల సృజించి కాపాడి సంహరించునో వాడొకడే (బ్రహ్మ) యని చెప్పబడినది. లోకమున కుమారుని సృజించి, కాపాడిన తండ్రిగాని, తల్లి గాని సంహరించుట జరుగదు. కారణము కుమారుని యందు గలిగిన మమకారము. కాని బ్రహ్మకట్టి మమకారము లేదు. కావున సృజించిన విధముగా పాలించిన విధముగా సంహరించుటలో ఏ విధమైన బాధను పొందదు. కుమారుని సృజించి పెంచుటలో లోకమున ఒకని నొకడు ద్వేషముతో చంపును కాని బ్రహ్మద్వేషముతో లోకమును సంహరించదు. రాగద్వేషములతో కర్మల నాచరించు జీవులకు పాపము కలుగును. వేదోక్త కర్మల నొనరించిన పుణ్యము కలుగును. బ్రహ్మకు లోకసృష్టి స్థితి సంహారకర్మల వలన పుణ్యపాపములు కలుగవు. నేను కర్మల నొనరించితినను అహంకారము కల జీవునకు పుణ్యపాపములు కలుగుట తత్ఫలముగా స్థూలశరీరముల ధరించి సుఖదుఃఖానుభవము నొందుట సంభవించును. బ్రహ్మకా కర్మల నొనరించి నాడనను అహంకారము లేకపోవుటచే, సృజించి పాలించినందున పుణ్యము కాని, సంహరించుట వలన పాపము కాని సంభవింపదు. జీవుడు కూడ అహంకార మమకారముల విడచి వేదోక్త కర్మల నాచరించిన పుణ్యమునొంది, లోకాంతరమున తత్ఫల సుఖము నొందును.

దేవుని వలెనే కర్మకు సాక్షిగా నుండు జీవునకు జంతు సంహారాది దుష్కర్మ ఫలముగా దుఃఖము గూడ ననుభవింపడు. ఇట్లు సాక్షి భావము నొందిన జీవునకే సుకృత దుష్కృత ఫలసుఖ దుఃఖానుభవము లేదనగా ఇక లోకసృష్టి స్థితి సంహారకర్మలకు సాక్షిభావముగా నుండి తన సమష్టి హిరణ్యగర్భ శరీర ద్వారమున నిర్వర్తించు లోక సృష్టి స్థితి లయ కర్మల పుణ్య పాపముల ఫలము ననుభవింప దగుట చెప్పనక్కఱ లేనిది.

శివాగమములో బ్రహ్మ విష్ణునామ రూపముల జోలిలేని శివుడే గుణియై అనగా ఈశ్వరుడై రజోగుణమును, భవరూప నామముల నొంది **లోకకర్త** యగును. సత్త్వగుణమును మృడనామ రూపములను పొంది **లోకభర్త** యగును. తమోగుణమును హరనామ రూపముల నొంది **లోకహర్త** యగునని చెప్పబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**శ్లో॥ నమస్తే పార్వతీనాథ! - నమస్తే వృషభధ్వజ!।**
**నమస్తే పరమేశాన! - నమస్తే నన్దివాహన!॥ 100**

**ప్రతిపదార్థము :-** పార్వతీనాథ! = ఓ పార్వతీపతీ!, తే = నీకు, నమః = నమస్సు, వృషభధ్వజ! = ఓ వృషభధ్వజా!, తే = నీకు, నమః = నమస్సు, పరమేశాన! = ఓ పరమేశ్వరా!, తే = నీకు, నమః = నమస్సు, నందివాహన! = ఓ నందివాహనా!, తే = నీకు, నమః = నమస్సు.

**తాత్పర్యము :-** పార్వతీపతీ! వృషభధ్వజా, పరమేశ్వరా, నందివాహనా నీకు నమస్సుల నర్పించుచున్నాను.

**వివరణ :-** నాలుగు పాదములలోని 'నమస్తే' అను పదములను కర్ణికగా నాల్గు సంబోధనములను దళములుగా వ్రాసినచో చతుర్దళపద్మముగా కనబడును.

---

**శ్లో॥ నమస్తే నమస్తే మహాదేవ! శమ్భో!**
**నమస్తే నమస్తే పరేశ! స్వయమ్భో!।**
**నమస్తే నమస్తే శిరస్సారసిన్ధో!**
**నమస్తే నమస్తే త్రిలోకైకబన్ధో!॥ 101**

**ప్రతిపదార్థము :-** మహాదేవ! = గొప్ప దేవుడా, శమ్భో! = ఓ శమ్భూ!, పరేశ! = పరమేశ్వరా!, స్వయమ్భో! = స్వయముగా బుట్టినవాడా!, శిరస్సారసిన్ధో! = శిరమున దేవ నది కలవాడా, త్రిలోకైక బన్ధో! = మూడు లోకములకు ఒకే ఒక చుట్టమైన వాడా!, నమస్తే... నమస్తే = నీకు నమస్సులు.





**తాత్పర్యము :-** గొప్ప దేవుడా! శమ్భూ! నీకు నమస్సులు. పరమేశ్వరా! స్వయమ్భూ! నీకు నమస్సులు. శిరమున గంగ గలవాడా! నీకు నమస్సులు. త్రిలోకమున కేకైక బన్ధువైన వాడా! నీకు నమస్సులు.

**వివరణ :-** ఈ శ్లోకమున పాదములన్నిట ఆద్యంతానుప్రాసము లున్నవి. కర్ణికయందు నమస్తే పదములను రెండు మార్లు వ్రాసి దళములందు సంబోధనములను వ్రాసినచో ఈ శ్లోకము చతుర్దల కమలాకారమున కన్పించును. ప్రతిపాదమున నాలుగు 'య' గణములుండుటచే నీ శ్లోకము భుజంగ ప్రయాత వృత్త నిబన్ధనము.

---

**శ్లో॥ శ్రీకరీ పఠతామేషా శివకర్ణామృత స్తుతిః।**
**శివానన్దకరీ నిత్యం భూయాదాచన్ద్రతారకమ్॥ 102**

**ప్రతిపదార్థము :-** శివానన్దకరీ = శివునకు ఆనందమును కలిగించు, శ్రీకరీ = సంపదను లేక జ్ఞానమును కలిగించు, శివకర్ణామృతస్తుతిః = శివకర్ణామృత నామకమైన స్తుతి, ఆచన్ద్రతారకమ్ = చంద్ర తారకలుండునంత వఱకు, భూయాత్ = ఉండుగాక! నిత్యమ్ = ప్రతిదినము, పఠతామ్ = చదువుడు.

**తాత్పర్యము :-** శివునకు ఆనందమును కలిగించు సంపదను లేక జ్ఞానమును కలిగించు నీ శివకర్ణామృత నామక స్తుతి కావ్యము చన్ద్ర తారక లుండునంతవఱ కుండుగాక! ప్రతిదినము చదువుడు.

**వివరణ :-** పరమేశ్వరుడైన శివునకు ఆనందము నీ శివకర్ణామృత నామకస్తుతి కావ్యము కలిగించును. శివస్వరూపుడైన జీవునిలోని మనస్సున ఇది ఆనన్దమును అనగా శివస్వరూపము యొక్క ప్రతిబింబమైన ఆనన్దమును కలిగించును. శివ స్వరూపులైన శివ భక్తుల కానందమును కలిగించును.

ఇట్టి ఈ స్తుతికావ్యము చన్ద్రతారక లున్నంత కాలము అనగా ప్రలయ పర్యంత ముండుగాక. ప్రలయమున మాయలో లీనమై యుండి రాబోవు కల్పమున సైతము జగత్తులతో పాటు బయల్పడు గాక!

ఇతి శ్రీ భరద్వాజ మునికృతే శ్రీ శివకర్ణామృత స్తోత్రే ప్రథమోఽధ్యాయః సమాప్తః

---



శ్రీః

## ద్వితీయోఽధ్యాయః

శ్రీ శివకర్ణామృత స్తోత్రముయొక్క ప్రథమశతకమని చెప్పదగిన ప్రథమాధ్యాయానంతరము ద్వితీయశతకమని చెప్పదగిన ద్వితీయాధ్యాయ మారంభింపబడుచున్నది.

**శ్లో॥ ఘనమధుమధురోక్తిస్యన్దమానన్దకన్దం**
**వరగుణమణివృన్దం వన్ద్యమోజః పురారేః।**
**భజతు నిజజనార్తేర్భేషకృద్రోషదోష-**
**ద్విషదతిమతియోషాభూషితం భాషితమ్మే॥ 1**

**ప్రతిపదార్థము :-** ఘనమధుమధురోక్తిస్యన్దమ్ = గొప్ప తేనెవంటి తీయని మాటలను స్రవించు, ఆనన్దకన్దమ్ = ఆనన్దపు గడ్డయైన, వన్ద్యమ్ = నమస్కరింపదగిన, పురారేః = శివునియొక్క, వరగుణ మణి వృన్దమ్ = శ్రేష్ఠమైన (వరునికి సంబంధించిన) గుణసమూహముగల, ఓజః = తేజమును, నిజ జనార్తేః = తన జనుల ఆర్తియొక్క



భేషకృద్రోషదోష ద్విషత్ = నాశమును కలిగించు క్రోధమను దోషమునకు శత్రువైన, అతిమతి యోషా భూషితమ్ = బుద్ధి అను శ్రేష్ఠస్త్రీకి అలంకారమువంటి, మే భాషితమ్ = నా వాక్కు, భజతు = సేవించుగాక!

**తాత్పర్యము :-** గడ్డ కట్టిన తేనెవంటి తీయని మాటల యూట గల, ఆనన్దపు గడ్డయైన వరగుణమణి సమూహముగల శివుని తేజము, తన జనుల బాధలను నశింపజేయునట్టి, రోషదోషమునకు శత్రువైన (నా) బుద్ధి యను శ్రేష్ఠ స్త్రీ అలంకారము వంటి నా వాక్కు సేవించుగాక!

**వివరణ :-** నీరు గడ్డ కట్టి మంచు ముక్కగా (మేఘముగా) పిలువబడును. కాని గడ్డ కట్టిన తేనె నేమందురో తెలియదు. అట్టి తేనెవంటి తీయని మాటల యూట శివుని తేజము. ఒక స్త్రీ ఏ గుణములు గల పురుషుని వరించునో ఆ గుణముల రాశి ఈ రచయిత మతియొక స్త్రీ రత్నము తీయని మాటల యూటయైన శివుని తేజము వరుని పెండ్లాడుటకు తగియున్నదని చెప్పుటకు ఆమె మాట గొప్ప నిదర్శనమై యున్నది అని పూర్వార్ధమందలి వరశబ్దము ద్వితీయార్ధమందలి యోషాశబ్దము వ్యంజించుటచే ఈ శ్లోకమున ఉపమాలంకారముయొక్క స్ఫూర్తి యేర్పడుచున్నది. తేనె గడ్డ కట్టదు అని నమ్మువారి దృష్టిలో ఈశ్లోకమున అభూతోపమాలంకారముయొక్క లేక ఉత్ప్రేక్షాలంకారము యొక్క స్ఫూర్తి యేర్పడుచున్నదని చెప్పవలెను. గడ్డ కట్టి తేనెవంటి మాటల యూటయా అన్నట్లు శివుని తేజము వినబడుచున్నది లేదా గడ్డ కట్టి పురుషాకృతి ధరించి కనబడుచున్నది. ఆ తేజమును చూసి రచయిత (అతి) మతి వధువుగా మారినదను విషయమును రచయిత యీ భాషితము వ్యంజించుచున్నది. మధుమధురోక్తి అను పదబన్ధమున ఛేకానుప్రాసము లేక యమకము అను శబ్దాలంకారమున్నది. 'భేషకృద్రోషదోషద్విషత్' యోషా భూషితం భాషితమ్ అను పదబన్ధములందు, 'భజతు నిజజనార్తే' అతిమతి స్యన్దమానన్దకన్దమ్' అను పదబన్ధములందును వృత్త్యనుప్రాసము అను శబ్దాలంకారమున్నది. ప్రతిపాదమున న-న-మ-య-య అను గణములుండుటచే నీ శ్లోకము మాలినీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివతేజ మానన్ద హేతువని చెప్పబడినది. ఈ శ్లోకమున నది ఆ యానన్ద మెవరికి కలుగజేయు చున్నదో చెప్పబడుచున్నది.

**శ్లో॥ యద్వీక్ష్యామృతమిత్యమర్త్యవనితాః పాతుం యతన్తే ముదా**
**యజ్జ్యోత్స్నేతి చకోరికాతతిరతిప్రేమ్ణాభిధావత్యలమ్।**

**యత్క్షీరామ్బుధిరిత్యనఙ్గజననీ సన్తోషతః ప్రేక్షతే**
**తత్తేజః పురమర్దనస్య ధవలం పాయాత్సదా సాధు మామ్॥ 2**

**ప్రతిపదార్థము :–** యత్ = దేనిని, వీక్ష్య = చూచి, అమృతమ్ ఇతి =అమృతము అని, అమర్త్యవనితాః = దేవతాస్త్రీలు, ముదా = సంతోషముతో, పాతుమ్ = త్రాగుటకు, యతన్తే = యత్నించెదరో, యత్ = దేనిని, జ్యోత్స్నా + ఇతి =వెన్నెల అని, చకోరికా తతిః = చకోరికా సమూహము, అతి ప్రేమ్ణా = మిక్కిలి ప్రేమతో, అలమ్ = పూర్తిగా, అభిధావతి = ఎదురుగా పరుగిడునో, యత్ = దేనిని, క్షీరామ్బుధిః ఇతి = పాలసముద్రము అని, అనఙ్గజననీ = లక్ష్మీదేవి, సంతోషతః = సంతోషము వలన, ప్రేక్షతే = చూచునో, తత్ = ఆ, పురమర్దనస్య = శివునియొక్క, ధవలమ్ = తెల్లని, తేజః = తేజము, సదా = ఎల్లప్పుడు, సాధు = చక్కగా, మామ్ = నన్ను, పాయాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :–** ఏ తేజమును చూచి అమృతమని దేవతాస్త్రీలు త్రాగుటకు యత్నించెదరో, ఏ తేజమును చూచి పాలసముద్రమని లక్ష్మీదేవి సంతోషముతో చూచునో, ఏ తేజమును వెన్నెలయని ప్రేమతో దానికెదురుగా పూర్ణశక్తితో చకోరసమూహము పరుగెత్తునో ఆ శివుని తేజము ఎల్లప్పుడు నన్ను చక్కగా కాపాడుగాక!

**వివరణ :–** శివుని తేజమును దేవతాస్త్రీలు అమృతముగా, చకోరికలు వెన్నెలగా, లక్ష్మీదేవి పాలసముద్రముగా భ్రమించుట ఈ శ్లోకమున ధవల శబ్దమున వ్యంగ్యమగుటచే భ్రాన్తిమదలంకారస్ఫూర్తి యేర్పడినది. స్త్రీలకే (దేవతాస్త్రీలు, చకోరస్త్రీలు (పక్షులు), లక్ష్మీదేవి) భ్రమ కలిగినట్లు చెప్పబడుటచే రచయిత స్త్రీలకే అజ్ఞాన మధికముగా నుండునని భ్రమించినాడేమో ననిపించును. ఒకసారి అమృతమును త్రాగి ఆకలి దప్పుల వీడినను దేవతాస్త్రీలు శివుని తేజము నమృతముగా భ్రమించి త్రాగుటకు యత్నించు చున్నారనుటచే అమృతముయొక్క మాధుర్యము నాస్వాదించు దేవతాస్త్రీ లప్పుడసాధారణామృతము (శివతేజోమృతము) వలన వారనుభవించిన ఆనందాతిశయము స్ఫురించుచున్నది. చకోరికలు (పక్షులు) వెన్నెలను త్రాగుటకు పరుగులెత్తుట చెప్పబడుటచే అమావాస్య ఒక్కనాటి రాత్రి ప్రియవిరహమును భరింపలేకపోవుట, ఆ అమావాస్య రాత్రి గడచిపోయి వెన్నెల ఎప్పుడు వచ్చునా? ప్రియసమాగము మెన్నడు కలుగునా? అను ఉత్కంఠ చకోరిక పక్షులకు సహజము. లౌకికమైన వెన్నెలపట్ల వానికున్న ఆసక్తియు సహజమే. కాని ఇచట అమావాస్య నాడును ప్రియుని విరహమును కలిగింపక సర్వకాలము ప్రియసమాగమును కలిగించి ఆనందింపజేయు శివుని తేజమును వెన్నెల వానికి స్ఫురింపగనే పొందిన అత్యంతానంద**మభిధావతి అలమ్** శబ్దములు స్ఫురింపజేయును.



అంతేగాక శివతేజో జ్యోత్స్నయొక్క అభూత పూర్వము పూర్వాననుభూతము నయిన విశిష్టత నవి గుర్తించుట ఈ శబ్దములవలన వ్యంజితమగుచున్నది. ఇది ఈ చకోరికా సమూహము బహుశః శివవిరహము సహింపలేని భక్త జీవ సమూహమేమో అను ఊహను కూడ స్ఫురింపజేయుచున్నది. లక్ష్మీదేవి విష్ణువక్షస్థలమున నిత్యము ఆనన్దమున నోలలాడుచు విష్ణువునకు కామసౌఖ్యమును వర్ధిల్లజేయు చున్నను ఆమెకీ శివతేజము తండ్రియైన పాలసముద్రముగా తోచి ఆమె ప్రియాసమాగమును మించి సంతోషించుట స్ఫురింప జేయబడినది. అనఙ్గ సంహారక శివతేజముయొక్క పవిత్రత, అనఙ్గజననీ శబ్దము స్ఫురింపజేయుచున్నది. ఇట్లు ఉపమానోపమేయముల ఔషమ్యములతో పాటు విశేషము స్ఫురించుటచే వ్యతిరేకాలంకార ధ్వని యీ శ్లోకమున నున్నది. అనఙ్గుడు అనగా కాముడు. అతనికి తల్లియైన లక్ష్మికిని కామవాంఛ కలిగించినాడేమో అను ఊహయు ఆ శబ్దముచే స్ఫురింపజేయబడుచున్నది. 'అమృతమిత్యమర్త్యవనితాః పాతుం యతన్తే', జ్యోత్స్నేతి చకోరికాతతిరతిప్రేమ్ణాభిధావత్యలమ్, సన్తోషతఃప్రేక్షతే, పదబన్ధములలో వృత్త్యను ప్రాసాలంకారమున్నది. ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూల విక్రీడిత వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున అమృతాది భ్రాన్తిహేతుదేవతావనితాది శివతేజఃప్రేక్షణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున భ్రాన్తిరహిత పార్వతీకృత ప్రీతస్ఫీత చకిత శివప్రేక్షణము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ స్వోద్వాహార్థం దృఢమతిజలే శీతలే కణ్ఠదఘ్నే**
**కుర్వన్త్యాస్స్వమ్ప్రతి బహు తపః శైలజాయాస్తదా నః।**
**ప్రత్యక్షస్సన్ పరిధృతకరస్సస్మితః కాన్తయాలం**
**ప్రీతస్ఫీతం చకితచకితం ప్రేక్షితో నశ్శివోఽవ్యాత్॥ 3**

**ప్రతిపదార్థము :–** స్వోద్వాహార్థమ్ = తన పెండ్లికొఱకు, దృఢమ్ = గట్టిగా, కణ్ఠదఘ్నే = మెడబంటి, శీతలే = చల్లనైన, అతిజలే = ఎక్కువ నీటియందు, స్వమ్ ప్రతి = తనను గూర్చి, బహు = అధికమైన, తపః = తపమును, కుర్వన్త్యాః = చేయుచున్న, శైలజాయాః = పార్వతికి, తదా = అప్పుడు, ప్రత్యక్షః = సాక్షాత్కరించినవాడై, పరిధృతకరః = చేతిని పట్టుకొన్నవాడును, కాన్తయా = కాన్తచే, అలమ్ = పూర్తిగా, ప్రీతస్ఫీతమ్ = స్నిగ్ధమైన ప్రేమకలుగునట్లుగా, చకితచకితమ్ = భయభయముగా, ప్రేక్షితః = చూడఁ బడినవాడును, సస్మితఃసన్ = చిఱునవ్వు గలవాడునునైన, శివః = శివుడు, నః = మమ్ము, అవ్యాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :–** శివుని పెండ్లాడుటకై శివుని గూర్చియే దృఢముగా మెడబంటి చల్లని అధిక జలమందు నిలచి తపమొనరించుచున్న పార్వతికి అతడు ప్రత్యక్షుడై చేయి పట్టుకొని ఆమెచేత ప్రేమ భయములు ముప్పిరిగొనునట్లు చూడబడి స్మితముతో కూడినవాడై శివుడు మమ్ము కాపాడుగాక!

**వివరణ :–** జలము శీతస్పర్శ కలిగినట్టిది. అతి శబ్దమును శీతల శబ్దముతో అన్వయించినచో చలికాలమున మిక్కిలి చల్లనైన నీటిలో నిలబడుట అను విశేషముగా మాత్ర మొనర్చిన జలాధిక్యము మాత్రము స్ఫురించును. అది ఎక్కువగా సందర్భమునకు శోభను గూర్పఁజాలదు. ఉపసర్గలనిట్లు వ్యస్తముగా నన్వయించ వలసిన ఆవశ్యకత వేదమంత్రములలో ఆర్ష రచనముల కాననగును. సాధారణముగా నొక శ్రేష్ఠ (దేవ) పురుషుడు భర్త కావలెనను కోరికతో మరొక శ్రేష్ఠ దేవినో (శ్రేష్ఠ) దేవ పురుషునో ఉద్దేశించి స్త్రీలు తపమొనరించు చుందురు.

రుక్మిణి హరిన్ఁబతిసేయుమమ్మయని, నమ్మితి నా మనమ్మున సనాతనులైన యుమా మహేశులన్ మిమ్ముఁబురాణదంపతుల (పార్వతీ శివుల) నుద్దేశించి, ప్రధానముగ పార్వతీదేవి నుద్దేశించి ప్రార్థించినది. ఇచట పార్వతీదేవి శివుడు భర్తకావలెనని శివునుద్దేశించియే తపమొనరించుట విశేషము. ఈ విశేషమును గమనించిన శివుడు ప్రత్యక్షమై చేపట్టునప్పుడు ఆయనకు నవ్వువచ్చినది. అందుకే ఆయన సస్మితుడైనాడు. సాక్షాత్కరించినపుడు సిగ్గుతో కూడిన ప్రేమతో కూడిన, భయము ముప్పిరిగొన్న పార్వతిని చూచి శివుడు సస్మితు డయినాడు. ప్రతిపాదమున మ–భ–న–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము మన్దాక్రాన్తావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శైలజా చకితచకిత ప్రీతస్ఫీత వీక్షిత శివుడు వర్ణింపఁ బడినాడు. ఈ శ్లోకమున గిరిజా విలోచనాలోకన సంప్రకీర్ణమైన శివుని అంగము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ యదఙ్గమచ్ఛం గిరిజోత్పలవిచ్ఛవి–**
**ర్విలోచనాలోకనసమ్ప్రకీర్ణమ్।**
**స్ఫుటోత్పలం గాఙ్గమివ స్మ భాతి**
**స్రోతస్స పాయాత్సతతం శివో నః॥ 4**

**ప్రతిపదార్థము :–** గిరిజోత్పల చ్ఛవి ర్విలోచనా లోకన సంప్రకీర్ణమ్ = పార్వతీదేవి కలువకాంతిగల కంటి చూపులచే వ్యాపింపఁబడిన, అచ్ఛమ్ = స్వచ్ఛమైన, యదఙ్గమ్ = ఎవని శరీరము, స్ఫుటోత్పలమ్ = వికసించిన కలువలు గల, గాఙ్గమ్ = గంగకు సంబంధించిన, స్రోతః ఇవ = ప్రవాహము వలె, భాతి స్మ = ప్రకాశించినదో, సః = ఆ శివుడు, సతతమ్ = ఎల్లప్పుడు, నః = మమ్ము, పాయాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :–** అమ్మవారి చూపులు అను కలువకాంతి వ్యాపించుటచే శివుని స్వచ్ఛ శరీరము వికసించిన కలువలుగల గంగాప్రవాహము వలె శివుని అంగము ప్రకాశించినది. అట్టి శివుడు మమ్ము కాపాడుగాక!

**వివరణ :–** అమ్మవారి కంటి చూపులుత్పలముల కాంతి గలవనుటచే పదార్థవృత్తి నిదర్శనాలంకారము ప్రథమార్ధమున నేర్పడియున్నది. అది ఉత్తరమున ఉపమాలంకారమున కంగముగా నుండుటచే శబ్దార్థోభయాలంకారమైన సంకరాలంకార మీ శ్లోకమున నేర్పడియున్నది. 'అచ్ఛం గిరిజోత్పలచ్ఛవిర్', 'విలోచనాలోకన సంప్రకీర్ణమ్', స్రోతస్సపాయాత్సతతమ్ అను పదబన్ధనములలో వృత్త్యనుప్రాసా లంకారములున్నవి. మొదటి మూడు పాదము లుపేన్ద్రవజ్రా పాదములు. చివరి పాదము ఇన్ద్రవజ్రా పాదముగా నుండుటచే నీ శ్లోక ముపజాతి వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పూర్వ శ్లోకములలో శివుడు రక్షించుగాక యని శివుడు రక్షకత్వము చెప్పఁబడినది. ఈ శ్లోకమున రక్షకుడైన ఆ శివుని చరణ కమల సంగమున క్షేమము నొందుమని తన బుద్ధికి కవియుపదేశ మొనర్చుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ బుద్ధే శుద్ధే! జనని! భవతీం దుష్టభోగానుషక్తాం**
**కుర్వే సర్వేష్వహమనితరం వక్రకర్మా దురాత్మా।**
**తత్త్వం క్షేమం కలయ కుశలే! న ధ్రువం నాన్యసక్తా**
**నిత్యం స్థిత్వా చరణయుగలే యోగరూపస్య శమ్భోః॥ 5**

**ప్రతిపదార్థము :–** శుద్ధే = పరిశుద్ధురాలైన, బుద్ధే = ఓ బుద్ధీ, జనని = తల్లీ, సర్వేషు = అందఱియందు, వక్రకర్మా = వంకర కర్మల నొనరించిన, దురాత్మా = దుష్ట చిత్తుడైన, అహమ్ = నేను, భవతీమ్ = నిన్ను, దుష్టభోగానుషక్తామ్ = దుష్టభోగములందాసక్తముగా, అనితరమ్ = ఎల్లప్పుడు, కుర్వే = చేయుదును, తత్ = అందువలన, త్వమ్ = నీవు, కుశలే = ఓ నేర్పరులారా!, అన్యసక్తా = అన్యసక్తురాలవై, న ధ్రువమ్ = అశాశ్వతమైన, క్షేమమ్ = క్షేమమును, న కలయ = పొందకుము, యోగ రూపస్య = యోగ రూపుడైన, శమ్భోః = శివునియొక్క, చరణ యుగలే = పాదములయొక్క జంటయందు, స్థిత్వా = నిలచి, నిత్యమ్ = శాశ్వతమైన, క్షేమమ్ = క్షేమమును, కలయ = పొందుము.

**తాత్పర్యము :–** ఓ నా శుద్ధబుద్ధీ, తల్లీ, నేను వక్రకర్ముడనై, దురాత్ముడనై, నిన్ను ఎల్లప్పుడు దుష్టభోగము లందాసక్తి కలదానినిగా చేయుదును. నేర్పరితనము గలదానా! నీవు అన్యసంగమున చంచలమైన క్షేమము నాశించక యోగరూపుడైన శివునియొక్క చరణ కమలమందుండి నిత్యమైన క్షేమమును పొందుము.

**వివరణ :–** సాధారణముగా బుద్ధి జీవునకు భార్యగా చెప్పఁబడుచుండును. కాని ప్రకృతి స్వరూపిణి లేక ప్రకృతి వికారమైన మహత్తత్త్వముయొక్క రూపమనదగిన బుద్ధికి మాతృత్వమే ఉచితమని భావించిన కవి బుద్ధిని జనని అని సంబోధించినాడు. శివునకు వశురాలై యుండుటచే శుద్ధబుద్ధి జనని అని సంబోధింపఁబడుటయే యుచితము. జీవునకు భార్య యని కొందఱు చెప్పుట అది జీవుని దురాత్మునిగా జేయు కారణమున మరియు వశురాలై యుండవలసిన ఆ బుద్ధి జీవునే వశునిగా జేసికొని దురాత్ముని జేయు (గయ్యాలి) భార్య వంటిదై యుండుట లోకమున ప్రచురమగుట చేతనే అని భావించుకొనవచ్చును. శ్రీమద్భాగవత పురంజనోపాఖ్యానమున పురంజనుని భార్యయైన పురంజని బుద్ధిగానే తదంతరార్థ నిరూపణ ప్రసంగమున చెప్పబడినది. సాధారణ బుద్ధి విషయమున ఆ రూపణము సమంజసముగా నుండుగాక! శుద్ధబుద్ధి తల్లి కుమారుని సన్మార్గమున ప్రవేశింపఁజేయునట్లు జీవుని సన్మార్గముననే ప్రవేశింపఁజేయును. గావున జనని అని సంబోధించుట అనుచిత మనుట అనుచితమేమో! సాధారణముగ బుద్ధి ఉపదేశక స్థానమున నిల్చి గౌరవింపఁబడు చుండును. బుద్ధివలె అంతఃకరణ విశేషమే యైనను ఉపదేశ్యముగా భావింపఁబడిన మనస్సు శిష్యరూపమని, బుద్ధి గురు రూపమనియు భావింపఁబడు చుండును. తద్భిన్నముగా ఇట జీవుడు బుద్ధిని ఉపదేశ్యముగా భావించి దానికి ఉపదేశ మొనర్చుచున్నాడు. ఇదంతయు శుద్ధే అను విశేషణముచేత స్ఫురింపఁజేయబడుచున్నది. సాధారణముగ దుష్టమైన మనస్సు జీవుని దురాత్మునిగాఁజేయునని భావింపఁబడును. ఇట కవి జీవుడే శుద్ధబుద్ధిని దుర్భోగాసక్తగా నొనరించునని చెప్పుచున్నాడు. అందుచేత నీ వికమందు శాశ్వత క్షేమము నొసగ జాలని అన్యుల సంగము విడచి శివపద యుగలమున నిలచి శాశ్వత క్షేమము నొందుమని ఉపదేశించుచున్నట్లు కవి చెప్పుచున్నాడు. ఆ బుద్ధి శుద్ధము కావున తన యుపదేశమును పాటించునని నమ్మి ఉపదేశించుచున్నట్లు చెప్పుచున్నాడు. ఏ గణములు వాస్తవముగ లేని జీవుడు శుద్ధ బుద్ధిని సైతము దుష్టభోగాసక్తగా చేయు దురాత్ముడనని అంగీకరించినట్లు కవి చెప్పుచున్నాడు. వాస్తవమున కిట కవి తనను తానే దురాత్మునిగా జెప్పుకొనుచున్నాడు. తన బుద్ధి తన ఉపదేశమును పాటించి శివపద యుగల



మందాసక్తమై అన్యసంగము విడచి తనకు శాశ్వత క్షేమము కలుగజేయునని నమ్ముచున్నట్లు చెప్పికొన్నాడు. ఈ శ్లోకమునందలి నాన్యసక్తా అను సమాసము నందలి అన్యపదము తనకు భిన్నము నంతను చెప్పుచున్నను అన్యదేవతను అనగా శివభిన్న దేవతను వ్యంజించుచున్నది. ఇతర దేవతలు కొంతకాలముందు క్షేమము నొసగ గలరని శివుని పాదద్వంద్వమువలె శాశ్వత క్షేమమునొసగ జాలరని నధ్రువ శబ్దము చెప్పును. కుశలే అను శబ్దము తన బుద్ధిని కవి బుజ్జగించుటను వ్యంజించును. యజమానుడు ఒకప్పుడు దాసులను కూడ బుజ్జగించి తన పనిని నెరవేర్చుకొనుట లోకసిద్ధము. తాత్త్వికముగా తల్లి తండ్రి అనుజుడు మొదలగు వారికి పుత్రకలత్రాదులకు వలె యజమానుడు గానే జీవుడు భావింపఁబడును. తదనుగుణముగానే ఇట కవి తన తల్లియైన బుద్ధిని సైతము తన సేవయందు నియోగించుచు తనకు క్షేమమును కలిగించుమని కోరుచున్నాడు.

2. యోగాభ్యాసము వలన నిష్కామకర్మోపాసనానుష్ఠానము వలన బుద్ధి శుద్ధతను బొందును. బుద్ధి శుద్ధమైననే ఏకాగ్రత నొందును. ఆ బుద్ధిలోని వృత్తులన్నియు నిరోధింపఁ బడినప్పుడు జీవునకు యోగముయొక్క సిద్ధిగలుగును. ఆ సిద్ధియే యోగము కాని లోకమున తత్సాధనములు, తదంగములు (యోగాంగములైన ప్రాణాయామాదులు) యోగముగా వ్యవహరింపఁబడుచున్నవి. శివుడు యోగ సిద్ధవస్తువు (ఆనందము). తత్సాధనమైన యోగము కూడ శివుడే **కృష్ణం ధర్మం సనాతనమ్** ఇత్యాది సూక్తులు పరమేశ్వరుని సాధనభూతునిగా పేర్కొనుచున్నవి. శైవవైష్ణవ మతములు పరమేశ్వరు నుపేయోపాయోభయరూపుడు అని పేర్కొనును. యోగ శబ్దము నప్రత్యయాంతముగా భావించినపుడు యోగశబ్దము యోగి అను అర్థమును బోధించును. విష్ణువు భోగిగా, శివుడు యోగిగా ఉపాసింపఁబడుట లోకప్రసిద్ధము. **వీతరాగవిషయం వా చిత్తమ్** అను పాతంజల సూత్రము వీతరాగుని (శివుని) చిత్తమున ధ్యానించిన యోగ విఘ్నములు తొలగి యోగసిద్ధి కలుగునని చెప్పును. ఇట్లు వృత్తి నిరోధాభ్యాసము ఫలించి చిత్త వృత్తి నిరోధరూపమైన యోగము సిద్ధించును. చిత్తము బుద్ధి శుద్ధత్వము నొందును. చిత్తబుద్ధులు రెండును అంతఃకరణ విశేషములే అగుటచే ఒక్కొక్కప్పుడు అభిన్నములుగా భావింపఁ బడు చుండును. బుద్ధే శుద్ధే కుర్వే సర్వే అను పూర్వపాదాది పదముల జంటలలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. ప్రతిపాదమున మ–భ–న–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము మన్దాక్రాన్తావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు యోగరూపుడు (యోగి) అని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని ఆ యోగ (తపో) రూపము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ తత్తన్మన్త్రైర్నిగమవిదితైర్వాయునాపూర్య నాసాన్**
**సంరున్దన్తం సవిధచరమారేచనాదఙ్గులీభిః।**
**యోగే మార్గాన్నిభృతనయనం బద్ధపద్మాసనాంఘ్రిం**
**సేవే భావే హిమగిరితటే తం తపస్యన్తమీశమ్॥ 6**

**ప్రతిపదార్థము :–** యోగే = యోగమునందు, నిగమ విదితైః = వేద వేదితములైన, తత్తన్మన్త్రైః =ఆయా మంత్రములచే, నాసాన్ = ముక్కులను, వాయునా = వాయువుతో, ఆపూర్య = నింపి, సవిధ చరమ్ = సమీపమున తిరుగు (ఆ వాయువును), ఆరేచనాత్ = రేచనారమము వఱకు, అఙ్గులీభిః = వ్రేళ్ళతో, మార్గాన్ = నాసా మార్గములను, (ఇతరేన్ద్రియ మార్గములను), సంరున్దన్తమ్ = అడ్డగించుచున్న (మూయుచున్న), నిభృతనయనమ్ = మూసిన కన్నులుగల, బద్ధ పద్మాసనాంఘ్రిమ్ = పద్మాసనమున బంధింపబడిన పాదములు గల, హిమగిరితటే = హిమవత్పర్వత సానువునందు, తమ్ = ఆ, తపస్యన్తమ్ = తపించుచున్న, ఈశమ్ = శివుని, భావే = మనసున, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :–** హిమవత్పర్వత సానువున బద్ధ పద్మాసనమున కూర్చొని నాసా మార్గములతో వాయువును పూరించి వ్రేళ్ళతో ఆ గాలిని తిరుగకుండ రేచనకాలము వచ్చువఱకు (ఇతరేన్ద్రియ మార్గములను కూడ) బంధించుచు తపమొనరించుచున్న శివుని మనసున సేవించెదను.

**వివరణ :–** అది ప్రశాన్త హిమగిరి సానువు. అచట శివుడు ఎక్కువసేపు సుఖముగా ప్రశాన్తముగా కూర్చొనుటకు అనుకూలమైన పద్మాసనమున తన పాదములను బంధించి యుంచి ప్రాణాయామరూప తపమొనరించుచున్నాడు. శివుని ప్రాణాయామ విధానము మొదటి మూడు పాదములలో చెప్పఁబడినది. ప్రాణాయామ మనగా ప్రాణ వాయువును క్రమము ననుసరించి నియమించుట. అన్నమయ కోశమునకు అనగా స్థూలదేహమునకు వ్యాయామ మవసరమైనట్లు ప్రాణమయ కోశమునకు వ్యాయామ మవసరము. వ్యాయామము ద్వారా స్థూలదేహమందలి రక్త ప్రసరణాది బహువిధ దేహ వ్యవస్థలలో నేర్పడిన వ్యాధులను తొలగించుటకు వీలయినట్లే, మానస వ్యాధులను అనగా ఆధులను మరియు స్థూల శరీరవ్యాధులను తొలగించుటకు వీలు కలిగించునది 'ప్రాణాయామము'. ఆయామ శబ్దమునకు దైర్ఘ్యమర్థము. ప్రాణవాయువును శరీరము లోపలికి తీసుకొనుట,





దీర్ఘకాలము అనగా వీలైనంత ఎక్కువసేపు శరీరమున (భ్రూమధ్యమున) బన్ధించి యుంచుట, నిదానముగా దానిని వదలుట సహజ శ్వాసప్రక్రియలో దైర్ఘ్యము పాటించు పద్ధతి ప్రాణాయామమని శాస్త్రగ్రన్థముల తాత్పర్యము. **ప్రాణాయామ స్త్రిధా మతః** అను సూక్తి ననుసరించి పూరకము, కుంభకము, రేచకము అని మూడు విధములుగానుండును. పూరకమనగా బయటనున్న ప్రాణవాయువును శరీరములోపలికి నాసామార్గమున పంపించుట, కుంభకము అనగా లోపలికి తీసుకోబడిన ప్రాణవాయువునట్లే కొంచెముసేపు శరీరమున (భ్రూమధ్యమున) నిలిపి యుంచుట, ఆ నిలిపి యుంచిన వాయువును మెల్లగా శరీరమునుండి బయటకు పంపించుట రేచకము అనఁబడును. బయటకు గాలిని పంపిన తరువాత లోపలకు వెంటే గాలిని పంపక శరీరమును (భ్రూమధ్యముగా) రిక్తముగా అనగా ఖాళీగా నుంచుట రిక్తమనఁబడుట, నాల్గవ ప్రాణాయామ మొకటి అరుదుగా గ్రంథములలో కనఁబడును. దానిని కలుపుకొన్నచో ప్రాణాయామము చతుర్విధమని చెప్పఁబడవలసి యుండును. ఈ నాలుగు ప్రాణాయామములను కలిపికొన్న మొత్తము ప్రక్రియ ఒకే ప్రాణాయామముగా భావింపఁబడు సంప్రదాయమే బలముగ నున్నది. సగర్భమని అగర్భమని ప్రాణాయామము ద్వివిధమని చెప్పఁబడినది. సగర్భమనగా మానసిక మన్త్రోచ్చారణ సహితము. అగర్భమనగా మానసిక మన్త్రోచ్చారణ రహితము. కుమ్భకము మాత్రమే సగర్భము, అగర్భమని ద్వివిధము. పూరణ రేచకములలో మన్త్రోచ్చారణ ముండదు. అని మొత్తము ప్రక్రియ యొకే ప్రాణాయామముగా భావించు వారిలో కొందఱు చెప్పెదరు. పూరక రేచకములలో కూడ మానసిక మన్త్రోచ్చారణము ఆవశ్యకమని మఱికొందఱు చెప్పెదరు. పూరకము చేయుటకు ఎంతకాలము అభ్యాసికి పట్టునో దానికి నాలుగింతలు కుంభకమునకు, రెండింతలు రేచకమునకు ఉపయోగించు కొనవలెననుట **సాధారణనియమము**. సగర్భ ప్రాణాయామమున మన్త్రముయొక్క హ్రస్వ దీర్ఘ పరిమాణములననుసరించి ప్రాణాయామ పరిమాణము మారుట తప్పనిసరి. ఈ శ్లోకమున శివుని ప్రాణాయామము సగర్భము. అనగా మన్త్రోచ్చారణ సహితము అని **నిగమవిదితైః, తత్తన్మన్త్రైః** అను సమాసపదములు స్పష్టమొనరించుచున్నవి. అంతేకాక పూరక కుంభక రేచకములు మూడును భిన్నభిన్న మన్త్రగర్భములని తత్తన్మన్త్రైః అను సమాసము లోని తత్తత్ అను పదములు సూచించుచున్నవి.

1. సాధారణముగ ఓంకారమొకటే ప్రాణాయామ ప్రకారములైన పూరక, రేచక, కుంభకముల కన్నింటికి వినియోగించు కొందుఱు 2. ఓంకార పూర్వక సప్తవ్యాహృతులు పూరకమున ఓంకార పూర్వక గాయత్రీ మన్త్రము, కుంభకమున ఆద్యంతోంకార సహిత

గాయత్రీ శీర్షము, రేచకమున మన్త్రము దశప్రణవగాయత్రి అనఁబడు ఓంకార పూర్వకములైన సప్త వ్యాహృతులు (సప్తోంకార సహితములు) 3. ఓంకార పూర్వకమైన గాయత్రీ మన్త్రము (ఒక ఓంకారముతో కూడినది.) ఓంకార మాద్యన్తములందుగల గాయత్రీ శీర్షము (రెండు ఓంకారములతో కూడినది). కుంభకమున మాత్రమే వినియోగింప వలెనను నీ మూడు సంప్రదాయములే సాధారణముగ గోచరించుచున్నవి. కాని ఈ శ్లోకమునందలి పై సమాస పదములు ఏతద్భిన్న మన్త్రముల వినియోగించు సంప్రదాయము లున్నవనుటను సూచించుచున్నవి. పైన పేర్కొనఁబడిన ఓంకార పూర్వక సప్తవ్యాహృతి గాయత్రి గాయత్రీ శీర్షములు మొత్తము ఒకే ప్రాణాయామ మన్త్రముగ గ్రన్థములలో పేర్కొనఁబడియున్నది. ప్రాణాయామమున ఏతదితర మన్త్రముల వినియోగము గ్రన్థములలోని పెద్దల ఆచరణ మందు గాని కానరాలేదు. పై ప్రాణాయామ మన్త్రములోని సప్తవ్యాహృతులు సప్తమన్త్రములుగా గాయత్రి యొక మన్త్రముగా గాయత్రీ శీర్షము నొక మన్త్రముగా భావించి తత్తన్మన్త్రైః అను సమాసములో తత్తత్ అను పదమును వ్యాఖ్యానించు కొన్నచో ప్రాణాయామమున వినియోగింపఁబడు నితర మన్త్రముల జోలిని విచారించ నక్కఱలేదు. అస్తు. ప్రథమ పాదములోని ఆపూర్య అను పదము పూరకమును చెప్పుచునే అది ఆ అను ఉపసర్గ ద్వారమున శివుని పూరకము సాధారణ యోగి పూరకముల కన్న సుదీర్ఘమని వ్యంజించును. రెండవ పాదముయొక్క ఆదిలోని 'సంరుద్ధన్తమ్' అను పదము ఆ శివుని కుంభకము ఇప్పటికి ముగియ లేదని ఇప్పటికిని ఆ కుంభకము కొనసాగుచునే యున్నదని వర్తమాన కాలార్థక శతృప్రత్యయ ద్వారమున వ్యంజించును. మూడవ పాదమందలి **'నిభృతనయనమ్'** అను సమాసమందలి నిభృతశబ్దము శివుని నేత్రముల నిశ్చలతను, **అఙ్గులీభిః సవిధచరమ్** అనుపదములు వాయువును పూరించిన పిమ్మట కించిచ్చలనముతో క్రిందకు రాబోవుచున్న ప్రాణవాయువునట్లు రానీయకుండునట్లు, శివుడు వ్రేళ్ళ నుపయోగించునట్లు తెలుపును. లేక పూర్తిగా వాయువు రేచించిన పిమ్మట మరల వాయువును శివుడు నిరోధించు చున్నట్లును చెప్పవచ్చును. ఈ పక్షమున సంరుద్ధన్తమ్ అను పదములోని శతృప్రత్యయము బహుపర్యాయములు ప్రాణాయామముల నొనరించును. కుంభకము నెక్కువ కాలమొనరించును. అనగా కుంభక సహితముగా ధ్యానమును గూడ చేయుచున్నట్లును వ్యంజించును. కుమారసంభవమున **'ఆత్మానమాత్మన్యవలోకయుక్తమ్'** అని చెప్పిన అంశము నీ శ్లోక మీ విధముగ వివరించు చున్నదని చెప్పవచ్చును. వాస్తవమునకు శివుడు పూరక మొనరించుట అనగా వాయుజన్యములైన పృథివ్యాపస్తేజములతో





నిర్మితములైన బ్రహ్మాండములతో సహా పీల్చుకొని ప్రలయము నొనరించుటయే, ఆయన కుంభక మొనరించుట అనగా మహాప్రలయ కాలమున నేకాకిగా గడపుటయే. ఆయన రేచక మొనరించుట యనగా మరల వాయువును తద్గర్భగతులైన పృథివ్యాపస్తేజములతో నిర్మింపఁబడిన సకల బ్రహ్మాండముల సృజించుటయే. యోగమందలి వాయుసంచార మార్గములు ప్రధానముగ నాసములే. ఉత్తరార్ధాది యందలి **'యోగేమార్గాన్'** అను పదముతో నన్వయించుట కొంచెము దూరాన్వయమే అగునేమో? మార్గాన్ అను శబ్దమునకు ఇతరేన్ద్రియ మార్గములు (రంధ్రములు), (శ్రోత్రాదులు) అను అర్థమును కూడ చెప్పవచ్చును. అప్పుడు దూరాన్వయదోషము తొలగును. నాసాన్ అను పదములోని బహువచనము శివుని పంచ ముఖత్వమును పురస్కరించుకొన్న నాసా బహుత్వమును చెప్పును. నాలుగవ పాదమందలి సేవే భావే అను పదములలో వృత్త్యనుప్రాసాలంకార మున్నది. పై శ్లోకమువలె ఈ శ్లోకమును మన్దాక్రాంతవృత్త నిబన్ధనమే. 2. **'స్థిరసుఖ మానసమ్'** అను పాతఞ్జలయోగసూత్రము యమనియమాదష్టాంగములలో యమ నియమములు గలవారే యోగసాధనమునకు ఉపక్రమించవలసిన వారి ఆసన లక్షణమును చెప్పుచున్నది. ఆసనము అను యోగాఙ్గ మెనిమిది యోగాంగములలో మూడవది. కొందఱు స్వస్తికాసనమును, మరికొందఱు వీరాసనమును, మఱికొందరు పద్మాసనమును యోగసాధనముకై స్వీకరించెదరు. ఈ శ్లోకము నందలి మూడవ పాదము నందలి చివఱి పదము శివుడు పద్మాసనమవలంబించి ధ్యాన నిమగ్నుడై తపమొనరించు చున్నట్లు చెప్పుచున్నది. ఈనాడు పాఠశాలలో ఆసన ప్రాణాయామములు పిల్లల ఆరోగ్యమును వృద్ధి పొందించుటకై ప్రవేశపెట్టఁబడుచున్నవి. యమనియమ రహితము లగుటచే నవి పిల్లలలో శరీరారోగ్యమునకు తోడ్పడుచున్నను చిత్తవృత్తి నిరోధము అను యోగముయొక్క సిద్ధికొఱకు గాని, ధ్యానసిద్ధి కొఱకుగాని ఉపయోగపడకున్నవి. అస్తు. తపస్సనగా శరీర మనస్సుల స్వేచ్ఛ నరికట్టి వానిని హితకరమైన మార్గమున లేక శ్రేయోమార్గమున ప్రవేశపెట్టుటకు వానిని తపింపఁజేయుట అనగా క్లేశానుభవమునకు స్వయముగా వానిని సిద్ధపఱచుట. క్లేశానుభవము లేనిది పాపక్షయము కలుగదు. పాపక్షయము కలుగనిదే యోగసిద్ధి కలుగదు. ముఖ్యముగా ఉపవాసము శారీరక స్థౌల్యాది దోషములు నివారించును. తప్ ఆలోచనే అను ధాతువునుండి పుట్టిన తపః శబ్దమును బోధించునపుడు స్వేచ్ఛ నరికట్టి మనస్సును సదాలోచనములలోనే బంధింపఁజేయు యత్నమున మనస్సు తపమునకు గురియై పాపక్షయమగును. ఆసనాభ్యాసము పాదేంద్రియ స్వేచ్ఛనరికట్టి నిర్బంధముగా నొకచోట కూర్చొనుట కభ్యసింపఁజేయుటలో

కలిగిన శారీరక తాపము కలుగుట చేతను పాపక్షయము కలుగును. క్లేశానుభవము లేనిదే పాపక్షయము కలుగదు. పాపక్షయము లేనిదే యోగసిద్ధి కలుగదని ఈ వరకే చెప్పఁబడినది. అట్లే ప్రాణాయామము కొంత క్లేశమును కలిగించును. కావున ఆసన ప్రాణాయామములు రెండు యోగాఙ్గములే గాక ఈ శ్లోకమున తపస్సాధనములుగను అయినట్లు చెప్పబడినది. శివుడే రెండింటిని అనగా ఆసన ప్రాణాయామముల నవలంబించుట సాధకులిట్లు చేసి పాపక్షయ మొనరించు కొనవలె నని బోధించుటకే కాని అవి వాస్తవమునకు శివునకు ఆవశ్యకములే కావు. అదిగాక ఒకసారి యోగానుభవ జనితానందము ననుభవించిన వారికి బ్రహ్మలోక పర్యంత భోగములును తుచ్ఛములుగానే తోచును. అట్టి సమాధ్యానందమును, యోగానుభవ జనితానందమును అనుభవించిన శివుడితర దేవతల వలె ఆహారాలంకరణాది భోగముల నాశించడు. ఈ సిద్ధిలేని ఇతర దేవతలు అలంకరణ – ఆహారాది భోగముల ఆశించిన ఆశింతురుగాక శివునకు వానితో నేమి పని? విషయ రూపములైన అవి శివునకు విషతుల్యములే. ఇతరులకు కష్టమును కలిగించు విషాహరణ క్లేశానుభవ మైచ్ఛికముగా స్వీకరించి దానిని సుఖముగా పరిణమింపఁజేసికొన్న శివునకు అది క్లేశరూపము గాక సుఖరూపమే అగుచున్నది. యోగ తపస్సులు రెండును శారీరక, మానసిక పాపదోషముల హరించు ననుట ఈ వివరణముయొక్క సారము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శారీరక మనో దోష నివారకములైన యోగతపస్సులు (ఆత్మజ్ఞాన రూప మోక్షమునకు పరమ్పరాహేతువులుగా) చెప్పఁబడినవి. ఈ శ్లోకమున శివుడు కైలాసమున పరులచే సాక్షాన్మోక్ష హేతువైన వేదోదిత ధర్మరహస్య వాదానంతరము మనస్సునకు వేదాన్తతత్త్వముయొక్క స్వరూపమైన శివుని పొందుట కావశ్యకమైన భజన ముపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ నిత్యం నిత్యం నిగమవచనైర్ధర్మనర్మాణి సాఙ్గం**
**కైలాసాద్రౌ ఘనమునివరైర్వాదయన్తం వసన్తమ్।**
**తత్త్వార్థం ప్రాగ్వచనశిరసాం తం త్రయాణాం పురాణాం**
**హర్తారమ్మానస! భజ సదా శైలజాప్రాణనాథమ్॥ 7**

**ప్రతిపదార్థము :–** నిత్యం నిత్యమ్ = ప్రతిదినము, నిగమవచనైః = వేదవాక్కులతో, సాఙ్గమ్ = అఙ్గసహితముగా, ధర్మనర్మాణి = ధర్మ రహస్యములను, కైలాసాద్రౌ = కైలాస పర్వతమున, ఘనమునివరైః = గొప్పముని వరులతో, వాదయన్తమ్ = వాదింపఁ





జేయుచున్న, వసన్తమ్ = నివసించు, ప్రాగ్వచన శిరసామ్ = ఉపనిషత్తులయొక్క, తత్త్వార్థమ్ = తత్త్వార్థమైన, త్రయాణామ్ = మూడు, పురాణామ్ = పురములయొక్క, హర్తారమ్ = సంహారకుడైన, శైలజాప్రాణనాథమ్ = పార్వతీపతిని, మానస = ఓ మనసా! సదా = ఎల్లప్పుడు, భజ = భజింపుము.

**తాత్పర్యము :–** కైలాస పర్వతమున పార్వతీపతీ తనకొలువులోని గొప్ప మునివరులచే సాఙ్గవేదవచన ద్వారమున ధర్మరహస్యములను వాదింపఁజేయుచు తాను మాత్రము ఉపనిషత్తత్త్వార్థరూపుడై వసించును. త్రిపురసంహారియైన అట్టి శివునో మనసా! నిరతము భజింపుము.

**వివరణ :–** 1. వేదము ధర్మమూలము. కావున వేదవాక్కుల ద్వారమున ధర్మమును ధర్మరహస్యములను విచారింపవలెను. వేద మూలకములైన శిక్షాద్యంగములు స్మృత్యాచారముల ద్వారమునకు ధర్మ తద్రహస్యముల విచారింపవచ్చునని సాఙ్గమ్ అనుపదము తెలుపును. శిక్ష, వ్యాకరణము, ఛన్దము, నిరుక్తము, జ్యౌతిషము, కల్పము అనునవి వేదాఙ్గములు. ఇంకను ధర్మ విచార రూపములైన మీమాంసాశాస్త్రము మొదలైన వేదానుకూలశాస్త్రములు కూడ ఇట సాఙ్గశబ్దముచే సూచింపఁబడును మరియు సంధ్యోపాసనాది ధర్మముల అర్ఘ్యప్రదానాద్యంగ సహితముగా మునివరులు ధర్మ రహస్యములను వ్యాఖ్యానించుచున్నారనియు నీ సాఙ్గ శబ్దము సూచించును. సాఙ్గశబ్దము నిగమ వచనములకును ధర్మనర్మములకును అన్వయించి పై ఉభయార్థములు గ్రహింపవచ్చును. 2. ధర్మమును జైమిని మహర్షి తన మీమాంసా శాస్త్రములోని మొదటి సూత్రముగ '**చోదనా లక్షణోఽర్థో ధర్మః**' అని నిర్వచించినాడు. వేదాధ్యయనము చేసిన వారికిగాని వారిచే ఉపదేశింపఁబడిన వారికి గాని ధర్మముయొక్క లక్షణము కొంచెము తెలియుట కవకాశము కలదు.

**స్మృతిశ్చ భిన్నా స్మృతయశ్చ భిన్నా మహామునీనామ్మతయశ్చ భిన్నాః।**
**ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం మహాజనో యేన గతస్స పన్థాః॥**

అను సూక్తి ననుసరించి ధర్మముయొక్క తత్త్వము అనగా రహస్యము గుహయందు నిహితమై గుహానిహితము తెలిసికొన దుస్సాధ్యమై యున్నదని స్పష్టమగును. గుహ శబ్దమునకు హృదయ మనియే పెద్దలు అర్థము చెప్పుచున్నారు. ఆ హృదయ మెవరిది? మహాజనులది. మహాజనులనగా నెవరు? మహా మునులు. ప్రత్యక్షా ప్రత్యక్ష వేదములను దర్శించి, స్మరించిన స్మృతులలో ధర్మమును చెప్పినను దాని రహస్యము బహిర్గతముగా చెప్పక తమ హృదయములలోనే దాచుకొనుటచే వారి ఆచరణములద్వారా నిరూపింపఁ

బడిన ధర్మ రహస్యము, వారి ఆచరణమును గుర్తించి మాత్రమే గ్రహింపఁదగినది. **సాహసం చ మహతామ్** అను గౌతమ ధర్మసూత్రము ననుసరించి వారి ఆచరణమున సాహసములున్నట్లు అనగా ఇతరులచే ఆచరింపగూడని ప్రవర్తనలున్నప్పుడు వారు నడచిన మార్గము అనగా వారి ఆచరణము తప్ప మరొక మార్గములేని మనకు ధర్మరహస్యము తెలియఁబడుట యెట్లు? ఈ ప్రశ్నము చాలా క్లిష్టమైనది. ప్రత్యుత్తరింప పూర్ణసామర్థ్యములేని వాడనైనను యథామతి ఎరిగింప నెంచెదను. **సత్యం వద, మాతృదేవో భవ, సన్తానతన్తుమ్మావచ్ఛేత్సీః' అహరస్సన్ధ్యా ముపాసీత** ఇత్యాది శ్రుతి చోదితములైనవి ధర్మములు. వీని నాచరింపఁబూను కొన్నప్పుడు, మరొక ధర్మమునకు విఘాతము కలుగుచున్నప్పుడు అనగా ఒక ధర్మము ఆచరింపఁబడి నప్పుడు మరొక ధర్మముయొక్క అనాచరణముగాని, ఉపేక్షగాని, తద్విరోధ ప్రవర్తనము గాని సంభావింపఁబడి నప్పుడు, ఏది ఆచరింపవలయునో తెలిసికొనుటయే ధర్మరహస్యము తెలిసికొనుట. ఇట్లు ధర్మమునకు తద్రహస్యమునకు భేదము చెప్పఁబడవచ్చును. ఒక ధర్మము కోసము మరొక ధర్మము (అది ధర్మమేయైనను) ఆచరించుట ధర్మాచరణము కాదు. మరేమి చేయవలెను? చిన్ననాటి నుండి పిత్రాది పరంపరననుసరించి తన ఆచరణము తోడ ఏ ధర్మము ఈ వఱకు తప్పుట జరగలేదో ఆ ధర్మము నాచరించుటయే ధర్మాచరణము. అయితే ఇంకొకరికి మరొక ధర్మము అట్లే ఆచరింపఁబడినచో ఆ ఇంకొక ధర్మమే ఆచరణీయము కాని రెండును వేదచోదితములే. కావున ఏది ఆచరించినను అనగా దేనికవకాశమున్నను దాని నాచరించుట అవకాశ వాదమే కాని ధర్మాచరణము కాదు. స్థూలముగ రెండును ధర్మములుగానే కనిపించును. తనకు స్వభావముగా సహజముగా పిత్రాది క్రమముగా చిన్ననాటి నుండి ప్రవృత్తి కలిగి ఆచరింపఁబడుచు పరిపాలింపఁ బడుచున్నదే స్వధర్మము. మరియు ఆ సమయమున శంకాదులు, భీత్యాదులు, కర్మఫలాది వాంఛలు లేక ఆచరించుటయే ధర్మరహస్యమని గమనింపవలెను. దృష్టాంతములు లేనిదే పై ప్రతిపాదనములోని ఆ ధర్మరహస్య మర్థము గాదు. కావున దృష్టాంతము లిప్పుడు ప్రదర్శింపఁబడుచున్నవి.

శ్రీరాముడు దశరథుడు స్వయముగా నోట చెప్పకపోయినచో మూర్ఛిల్లి యుండిన కాలమున కైకేయి పిత చెప్పిన మాటలను అనువదించినప్పుడు తన తల్లి కౌసల్య తద్విరుద్ధముగా కానలకేగరాదని కంఠోక్తిగా చెప్పినను మాత్రాజ్ఞను తిరస్కరించి తద్విరుద్ధమైన వనవాస గమనమునే పిత్రాజ్ఞగా భావించి వనవాసమున కేగును. ఇదియే శ్రీరాముని ధర్మరహస్య పాలనము. అట్లే భార్యా విక్రయము ధర్మము కాకపోయినను





హరిశ్చంద్రుడు తన చిన్ననాటి నుండి పాల్యమైయున్న సత్యము కొఱకాపని చేసెను. మాత్రాజ్ఞ నుల్లంఘించి అడవికేగిన శ్రీరామునకు గాని, భార్యా విక్రయము చేసి సత్యము నిల్పుకొన్న హరిశ్చంద్రునకు గాని నరకప్రాప్తి వర్ణింపఁబడకపోవుటచే రెండు ధర్మములలో సహజము స్వాభావికము. చిన్ననాటి నుండి పాల్యము పాలితము అయిన ధర్మము నాచరించుటయే ధర్మరహస్యమని స్పష్టమగుచున్నది. దేవీ భాగవతము నందు సత్యవ్రతుడు తన కన్నుల ముందే పొదలోని కేగిన పంది వృత్తాంతమును వేటకానికి చెప్పక ఏది చూచినదో (కన్ను) అది చెప్పలేదు. ఏది చెప్పునో (నాలుక) అది చూడలేదు. కావున చూచిన దాని చెప్పుట సాధ్యముగాదని తప్పించుకొన్నప్పుడు అతని కసత్యదోషము వాటిల్లి నరకప్రాప్తి సంభవింపకపోవుటచే అహింస కొఱకే ఈ తప్పించుకొనుట అనగా సత్యము చెప్పకపోవుట ఆయన సత్యవ్రతత్వమునకు భంగము రాలేదు. అట్లే మహాభారతమున అతిథి కొఱకు భార్యను సమర్పించుటకు సిద్ధపడిన మునికి దోషము సంభవింపలేదు. కారణ మాతనికి చిన్ననాటి నుండి అతిథి సేవయే పాల్యముగా నుండెను. అందువలన ఆయన ఆ ధర్మబుద్ధిచే అతిథి మనస్సు మార్చఁబడి అతని భార్య పాతివ్రత్యమునకు భంగము కలుగలేదు. ఇట్టివెన్నో దృష్టాంతములు ధర్మ సంఘర్షణ కలిగినప్పుడు ఏదో ఒకటి మాత్రమే ఆచరింపఁబడి మరొక ధర్మము ఆచరింపఁబడనప్పుడు సహజ స్వాభావిక స్వధర్మము నాచరింప వలెననుటయే ధర్మరహస్యము. అస్తు. ధర్మ నర్మాణి అనుపదముచే చెప్పఁబడిన ధర్మ, తద్రహస్యములు వివరింపఁబడినవి. కైలాసమున శివుడు విద్వాంసుల ద్వారమున ఇట్టి ధర్మరహస్యములే వాదింపఁబడి నిశ్చయింపఁ జేయఁబడినవి.

3. ఉత్తరార్థమున శివుడుపనిషత్తత్త్వార్థముగా చెప్పబడినాడు. పూర్వార్థమున చెప్పఁ బడిన ధర్మరహస్యవాదపూర్వకనిశ్చయాచరణములు సాధ్యధర్మములు. ఉత్తరార్థమున ఉపనిషత్తత్త్వార్థముగా ప్రతిపాదింపఁబడిన శివుడు సిద్ధధర్మము. ఈ విధముగా ఈ శ్లోకమున సాధ్యసిద్ధ ధర్మ స్వరూపము రెండు చెప్పఁబడినవి. సాధ్యధర్మము సిద్ధధర్మ స్వరూపుడైన ఉపేయుడైన శివుని పొందింపఁజేయు ధర్మము. ధర్మ ధర్మ రహస్యములు నిశ్చయపూర్వకమైన ఆచరణము ఉపాయము. **"పాదేపాదే జాయతే తత్త్వబోధః"** అన్నట్లు సత్యనిశ్చయమునకు ఆవశ్యకమైన వాదము కైలాసమునఁ జేయఁబడుటను శివుడు స్వయముగా ప్రోత్సహించుట ప్రేరకత్వము వహించుటను 'వాదయన్తమ్' అను పదము వ్యంజించుచున్నది.

4. పురములనగా స్థూలసూక్ష్మ కారణ శరీరములు, అవి మూడు. కావున త్రయాణామ్ అను పదము పురాణామ్ అను పదమునకు విశేషింపఁజేయఁబడినది. శైలజా ప్రాణనాథునకు త్రిపురహరణమెట్లు సంభవించును? శైలజ త్రిపురసుందరి. ఆమె భర్తయైనను శివుడు **'గుణాగుణేషు వర్తంత ఇతి మత్వా న సజ్జతే'** అని గీతలోఁ జెప్పఁబడినట్లు త్రిపురసుందరికి శైలజకు ప్రాణనాథుడయ్యును త్రిపురము లందు సంగము లేక యుండుట ఆ శివునకు మాత్రమే సాధ్యమైనది. ఇట్టి శివభజనమే శివత్వప్రాప్తి హేతువనుట శ్లోకముయొక్క సారము. ఈ శ్లోకమును మన్దాక్రాన్తా వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివభజనము హృదయమున (మనసున) కుపదేశింపఁ బడినది. ఈ శ్లోకమున ఉపదేశ ఫలమైన శివుని హృదయాగమనము చెప్పఁబడుచున్నది..

**శ్లో॥ మస్తన్యస్తాతులితవిలసచ్చన్ద్రరేఖావతంసో**
**హేమాభాభిర్విహితమహితశ్రీజటాభిస్తటిద్భిః।**
**కుర్వన్ సర్వానగణితఫలాన్ హంససంతోషకారీ**
**వారం వారం హృదయమయతే మే శరత్కాలమేఘః॥ 8**

**ప్రతిపదార్థము :–** మస్త న్యస్తాతులిత విలస చ్చన్ద్రరేఖా వతంసః = శిరమున నుంచఁ బడిన సాటిలేని విధముగా ప్రకాశించుచున్న చంద్ర శిరోభూషణము గలవాడైన, హేమాభాభిః = బంగరు కాంతులుగల, విహితమహిత శ్రీ జటాభిః = గొప్ప కాంతిని కలిగించిన జడలు అను, తటిద్భిః = మెఱుపులచే, సర్వాన్ = అందఱను, అగణితఫలాన్ = లెక్కలేని ఫలములు గలవారినిగా, కుర్వన్ = చేయుచు, హంససంతోషకారీ = హంసలకు సంతోషమును కలిగించు, శరత్కాల మేఘః = శరత్కాల మేఘము, వారంవారమ్ = మాటి మాటికిని, మే = నాయొక్క, హృదయమ్ = హృదయమును, అయతే = పొందుచున్నది.

**తాత్పర్యము :–** సాటిలేని చంద్ర శిరోభూషణము గల బంగారుకాంతి గల జడలను మెఱుపులతో అందఱకు లెక్కలేనన్ని ఫలముల నొసంగు హంసలకు (సన్యాసులకు) మేఘమోయనఁదగిన శివుడు మాటిమాటికి నా హృదయమును పొందుచున్నాడు.

**వివరణ :–** శరత్కాలపు చంద్రున కే ఇతర కాలపు చన్ద్రుడును సాటిరాడు. ఇతర కాల చన్ద్రునితో ఇతర కాంతిమంతులను పోల్చిన పోల్చవచ్చునేమో కాని శరత్కాలపు చన్ద్రునితో వారెవ్వరును సాటి రాజాలరు. అట్టి చంద్రునితో కూడిన శరదృతువుతో నేయితర ఋతువును సాటి రాజాలదు. అట్టి శరత్కాలమువలె శివుడు చన్ద్రునితోడనే అసదృశ



శిరోభూషణుడై ప్రకాశించు చుండును. శివుని వలె నెవరును (అతని పరివారము తప్ప) (భార్య పార్వతి, కొడుకు గణపతి మొదలగువారు) శిరసున చన్ద్రరేఖను ధరింపరు గదా! రేఖమాత్రధారణము తోడనే శివుడు కితర దేవతాఽసాధారణ్యము కలిగినట్లు చన్ద్రుని రేఖను ధరించుటచే ఇతర కాంతిమంతు లెవరును రేఖామాత్రముగా నైనను సోమ శివునిఁ బోలజాలకున్నారు. ఇది యంతయు ప్రథమ పాద వ్యంగ్యము. శివునకు బంగరు జడలున్నవి. అవి మేఘమునకు మెఱుపులవలె శివుని ప్రకాశింపఁజేయుచున్నవి. ఈ జటాతటిద్ ఔపమ్యము ద్వితీయ పాదవ్యంగ్యము. శరత్కాలము సస్యములు ఫలించు కాలము అందఱకును లెక్కలేనన్ని ధర్మార్థ కామజన్యములైన సౌఖ్యములను కలిగించు, హంసలకు (సన్యాసులకు) మాత్రము యథార్థమైన (మోక్ష రూపులమైనామను) సంతోషమును ప్రసాదించు శివుడు హంసలకు సంతోషమును కలిగించు శరదృతు సామ్యము శివునందు తృతీయ పాదమున వ్యంజింపఁబడినది. ఇందుకు **'గర్జతి శరది న వర్షతి'** అన్నట్లు శరత్కాల మేఘము సస్యానుకూలత కొఱకు వర్షింపక పోవుటయే ఫలోత్పాదన హేతువగును. శరత్కాల మేఘమున మెఱుపులంతగా నుండవు. ఆ లోటు ఫలపూర్ణములై సస్యములు బంగరు కాంతితో ప్రకాశించు బంగరునే పండించు చున్నట్లు ప్రకాశించుచుండును. శివుడా విధముగా తన జడలతో ప్రకాశించు చుండును. అంతేగాక గంగను తన జడలలో నుండి వర్షింపఁజేయుచు వర్షాకాల మేఘమువలె ఉన్నాడు. అను విశేషము స్ఫురించుటచే వ్యతిరేకాలంకారము. శరత్కాల మేఘ విరుద్ధముగా జటాతటిత్కాంతి శివునందు స్ఫురించుటచే విరోధాభాసాలంకారమును వ్యంజితములగు చున్నవి. ఒకవేళ శరదృతువును మేఘములు తటి ద్వన్తము లైనను అవి గర్జన మాత్రోపయోగులే కాని వర్షము కలిగింపలేని వనియే పై సూక్తి స్ఫురింపఁజేయు చున్నది గదా! వర్షింపక, పండిన పంటలను నీటిపాలు చేయక శరత్కాల మేఘము ఎక్కువ తాపమును సూర్యుడు కలిగించకుండ నాతని గప్పుచు సస్యముల రసహీనముల గాకుండ కాపాడి వానిని భుజింపవచ్చు హంసల కానందమును కలుగఁజేయును. అందుచే హంసలు శరత్కాల మేఘము నభినందించుచు గుంపులు గుంపులుగా శరత్కాల మేఘము చుట్టు చేరి ఆనందమును పొందును. అట్లే పరమ హంసలకు మోక్షమును ప్రసాదించు శివుడు ఇతర ఫలముల నితరులకు ప్రసాదించుట గమనింపఁదగినది కాదని అగణిత శబ్దము వ్యంజించును. శ్లోకమున పాదాది ప్రాసలు సతకార బహువారావృత్తిచే వృత్త్యనుప్రాసము శబ్ద శోభావహములై యున్నవి. ఈ శ్లోకమును మన్దాక్రాన్తా వృత్త నిబన్ధనమే.

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు మాటిమాటికి భక్తుడైన రచయిత హృదయమును చేరుట చెప్పఁబడినది. ఈ శ్లోకము అమ్మవారు శివుని మనస్సును అతని అర్ధదేహముతో పాటు అపహరించుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యస్మిన్ సర్వాధికబహుగుణైర్వఞ్చయిత్వా మనస్స్వం**
**హృత్వాన్తర్ధిం గతవతి తపోవైభవేన స్వదేశమ్।**
**ప్రత్యాకృష్యాహరదగసుతా యన్మనస్సార్ధదేహం**
**యావజ్జీవం సరసమవతాన్నో మహేశస్స నిత్యమ్॥ 9**

**ప్రతిపదార్థము :–** యస్మిన్ = ఎవడు, సర్వాధిక బహుగుణైః = అందఱను మించిన అధిక గుణములతో, స్వమ్ =తన, మనః = మనసును, హృత్వా = అపహరించి, వంచయిత్వా = వంచించి, తపో వైభవేన = తపోవైభవమున, స్వదేశమ్ = తన దేశమును గూర్చి, అంతర్ధిమ్ = అంతర్ధానమును, గతవతి = పొందిన వాడు కాగా, యావజ్జీవమ్ = బ్రతికియున్నంత వఱకు, సరసమ్ = సరసమైన, యన్మనః = ఎవని మనమును, ప్రత్యాకృష్య = త్రిప్పుకొని, అగసుతా = పార్వతి, సార్ధదేహమ్ = అర్ధదేహముతో పాటు, అహరత్ = అపహరించెనో, సః = ఆ, మహేశః = మహేశుడు, నిత్యమ్ = ఎల్లప్పుడు, నః = మనను, అవతాత్ = కాపాడుగాక.

**తాత్పర్యము :–** ఎవడు సర్వాధిక గుణములతో పార్వతి మనసునపహరించి తపో వైభవమున ఆమెను వంచించి స్వదేశమున కేగెనో పిమ్మట ఎవని మనసును పార్వతి తనవైపు త్రిప్పుకొని అతని అర్ధదేహముతో పాటు జీవితాంతము సరసమైన అతని మనస్సును తానే హరించెనో ఆ మహేశ్వరుడు ఎల్లప్పుడు మనలను రక్షించుగాక!

**వివరణ :–** శివుడు తన సర్వాధిక గుణములతో పార్వతి మనస్సును హరించి, ఆమెను మోసగించి అంతర్ధానమై పోయెను. పార్వతి శివుని మనస్సును తనవైపు త్రిప్పుకొని యావజ్జీవము సరసమైన అతని మనసును వడ్డీ తీసుకొన్నట్లు ఆతని అర్ధ దేహముతో పాటు హరించి తిరిగి ఆతనిని తననుండి తీసికొని పోనీయలేదు. ఈ పోటీలో సర్వాధిక గుణములు కలవాడినని విఱ్ఱవీగి అంతర్ధాన శక్తినుపయోగించి పార్వతిని వంచించి గెలిచితి ననుకున్నాడు. కాని పార్వతి వినయముతో ఇక పొమ్మన్నను పోలేని బలహీనత నా మనస్సునకు కలిగించి అతని అర్ధదేహమును సైతము వడ్డీగా అపహరించి వైచినది. ఇక మిగిలిన అర్ధదేహముతో శివుని సగమైన మో మేముఖము పెట్టుకొని దూరము పోవును. జీవితాంతము తానే ఆమెకు అమ్ముడుపోయినట్లు దాసుడై జీవించెను. ఇంతకు ముందాతడీ స్థితిని పొందలేదు. ఇట్లు తన దేహమును పార్వతికిచ్చి కోలుపోయి



నాడనిపించినను శివుడు మహేశత్వమును సంపాదించుకొన్నాడు. శివుడు నష్టపోయిన దేమియు లేదు. కావుననే అట్టి మహేశుడు మనలను కాపాడుటకు సమర్థుడు తన సామర్థ్యమును వినియోగించుకొని భక్తులను రక్షించనిచో ఆతని కీర్తిప్రతిష్ఠలు మహేశ్వరత్వ పురస్కృతములు ఆతనికే లేకుండ పోవును గదా! శివ పార్వతులు ఈ మనోవినిమయ క్రీడలో పార్వతికి శివార్ధదేహలాభము, శివునికి మహేశ్వరత్వ లాభము, భక్తులకు, రక్షణ లాభము సిద్ధించినవి. ఈ లాభములకు మూలము శివుని మనస్సునకు సరసత్వ ప్రాప్తి లేక సరసత్వ లాభము. ఈ శ్లోకమును మన్దాక్రాన్త వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని మనమున సరసత కలుగుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ శివుని సరస క్రీడ యొకటి వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ కైలాసాద్రౌ వనవిహరణే హాసతో వఞ్చనార్థం**
**వృక్షస్కంధాన్తరితవపుషం ధీరమారాదదృష్ట్వా।**
**యః పౌరస్త్యే సితమణితటే విస్మితాం పార్వతీం ద్రా**
**గాలిఙ్గన్మాం స పరమశివః పాతు మాయావిలాసీ॥ 10**

**ప్రతిపదార్థము :–** కైలాసాద్రౌ = కైలాసపర్వతమునందు, వనవిహరణే = వన విహారము నందు, హాసతః = హాసమువలన, వఞ్చనార్థమ్ = మోసగించుట కొఱకు, వృక్షస్కన్ధాన్తరిత వపుషమ్ = చెట్టుకొమ్మ చాటున దాగిన శరీరముగల, ధీరమ్ = ధైర్యశాలిని, ఆరాత్ = దూరము నుండి, అదృష్ట్వా = చూడక, విస్మితామ్ = ఆశ్చర్యపడిన, పార్వతీమ్ = పార్వతిని, పౌరస్త్యే = ఎదుటనున్న, సితమణితటే = తెల్లని మణి ప్రదేశమున, యః = ఏ శివుడు, ద్రాక్ = శీఘ్రముగా, ఆలిఙ్గత్ = కౌగిలంచుకొనెనో, సః = ఆ, మాయావిలాసీ = మాయా విలాసముగల, పరమశివః = పరమశివుడు, మామ్ = నన్ను, పాతు = కాపాడుగాక!

**తాత్పర్యము :–** కైలాసపర్వతమున పార్వతీ పరమేశ్వరులు వనవిహారము చేయుచుండగా చెట్టుకొమ్మ చాటున దాగియున్న ధీరుడైన శివుని చూడగా పార్వతి విస్మితురాలు కాగా ఆ తెల్లని మణిమయప్రదేశమున ఆమెను కౌగలించుకొన్న ఆ పరమశివుడు నన్ను కాపాడుగాక!

**వివరణ :–** కైలాస పర్వతమున శివపార్వతులు వన విహారము నొకనాడు చేయుచుండిరి. ఆ సమయమున చెట్టు చాటున ధీరుడైన శివుడు దాగుకొనెను. పార్వతి ఇంతలో శివుడెటుపోయెనా అని ఆశ్చర్యపడుచుండెను. ఆశ్చర్యమునకు కారణము : ధీరుడైన

వాడు దాగుకొనడు. పిరికివాడే దాగియుండును, అను పార్వతి మనసులోని ఊహ. దాగుకొనిన శివుడేమయ్యెనో యని అధీరురాలై ఆమె ఆశ్చర్యపడుచుండగా చెట్టుకొమ్మ వెనుక దాగుకొనియున్న శివుడు ఏమఱుపాటున నున్న పార్వతిని శీఘ్రముగా కౌగలించుకొని ఆమెను మరింత ఆశ్చర్యమునకు గుఱిచేసెను. **వృక్షస్కన్ధాంతరితవపుషం ధీరమ్** అను పదములీ యర్థమును వ్యంజిత మొనర్చును. పరమ శివుడిట్లనును. నేను నిర్గుణుడను. ఎవరిని కాపాడుటకు పూనుకొనను. అనగా భక్తుడిట్లనును. పార్వతితో కైలాసపర్వతమున వనవిహారమొనరించి మాయావిలాసముల ప్రదర్శించిన నీవు నిర్గుణుడవెట్లగుదువు? నిర్గుణుడవయ్యును శుద్ధ సత్త్వ ప్రధాన మాయతో విలాసముల జూపిన నీవు నన్ను కాపాడుటలో నీ నిర్గుణత్వ మడ్డురాదులే, అని మాయావిలాస శబ్దములు వ్యంజించును.

---

**అవతారిక :–** పై శ్లోకమున ఏ కైలాసమున పరమశివుని సరసక్రీడ వర్ణింపఁబడినదో ఈ శ్లోకమున ఆ కైలాసమున తనకు జన్మ కలుగవలెనను కవివాంఛ చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ భవతు మమ భవిష్యజ్జన్మ కైలాసభూమీ–**
**ధరతటవసుధాయాం బిల్వరూపేణ పత్రమ్।**
**యది వినిహితమేకం జాతు కేనాపి శమ్భోః**
**సరసపదయుగే వా శేషభాగ్యం భజేయమ్॥ 11**

**ప్రతిపదార్థము :–** కైలాసభూమీధరతట వసుధాయామ్ = కైలాస పర్వత ప్రాంతభూమి యందు, మమ = నాకు, భవిష్యత్ జన్మ = రాబోవు జన్మము, బిల్వరూపేణ = బిల్వవృక్ష రూపమున, భవతు = కలుగుగాక! యది = ఒకవేళ, కేన అపి = ఎవని చేతనైన, ఏకమ్ అపి = ఒకటైనను, పత్రమ్ = ఆకు, శమ్భోః = శివునియొక్క, సరసపదయుగే = సరసపద ద్వంద్వమున, జాతు = ఒకప్పుడు, వినిహితమ్ = ఉంచబడినచో, శేషభాగ్యం వా = శేషముగా నుండు భాగ్యమునైనను, భజేయమ్ = పొందెదను.

**తాత్పర్యము :–** నాకు కైలాసపర్వతప్రాంతభూమియందు బిల్వవృక్ష రూపమున జన్మ భవిష్యత్ కాలమున కలుగుగాక. ఎవడో యొకడు నా యొక్క ఏ ఒక పత్రమునైనను శివుని పాదద్వంద్వమున సమర్పింప కుండునా? శివసమర్పిత ద్రవ్యరూప శేషత్వము పొందకుందునా?

**వివరణ :–** భగవదర్థ ద్రవ్యము శేషమనబడును. విశిష్టాద్వైత సిద్ధాంతమున జీవులందరు పరమాత్మకు శేషభూతులే. పరమాత్మ శేషి. అద్వైతసిద్ధాంత మందును వ్యావహారిక సత్యముగ పరమాత్మ జీవాత్మలకు శేషశేషి భావము అంగీకార్యమే. ప్రతిపాదమున న–న–మ–య–య అను గణములుండుటచే నీ శ్లోకము మాలినీ వృత్త నిబన్ధనము.





---

**అవతారిక :–** పై శ్లోకమున శివ సమర్పిత ద్రవ్య భావాసక్తి గల భవిష్యజ్జన్మ మర్థింపబఁడినది. ఈ శ్లోకమున జిహ్వను సంబోధించి భవిష్యజ్జన్మమును సైతము నివారింపగల శివ కథనము చేయుమని ఉపదేశింపఁబడు చున్నది.

**శ్లో॥ కథయ కథయ జిహ్వే! కామదే మే త్రిసన్ధ్యం**
**రవిశశిశిఖినేత్రం రాజరాజస్య మిత్రమ్।**
**ప్రమథనివహపాలం పార్వతీభాగ్యజాలం**
**గురుతరరుచిమల్లీగుచ్ఛసచ్ఛాయమీశమ్॥ 12**

**ప్రతిపదార్థము :–** కామదే = కామములనిచ్చు, జిహ్వే = ఓ నాలుకా, త్రిసన్ధ్యమ్ = మూడు సన్ధ్యలలో, రవి శశి శిఖినేత్రమ్ = సూర్యచన్ద్రాగ్ని నేత్రుడైన, రాజరాజస్య = కుబేరునియొక్క, మిత్రమ్ = మిత్రుడైన, ప్రమథ నివహ పాలమ్ = ప్రమథ గణమును పాలించు, పార్వతీభాగ్యజాలమ్ = పార్వతి భాగ్యరాశియైన, గురుతరరుచి మల్లీ గుచ్ఛ సచ్ఛాయమ్ = గొప్ప కాంతిగల మల్లె గుత్తితో సమానమైన కాంతిగల, ఈశమ్ = ఈశుని, కథయ = చెప్పుము, కథయ = చెప్పుము.

**తాత్పర్యము :–** ఓ కోరికలిచ్చు నా నాలుకా! త్రిసన్ధ్యలలో, సూర్య చన్ద్రాగ్ని నేత్రుడైన, కుబేర మిత్రుడైన, ప్రమథ గణపాలకుడైన, పార్వతీ భాగ్యముల రాశియైన, గొప్ప మల్లెపూవుల గుత్తివలె కాంతిగల ఈశుని చెప్పుచుండుము.

**వివరణ :–** 1. రెండు మూడు పాదములలో మధ్య అంత్య ప్రాసములున్నవి. గురుతర రుచి గుచ్ఛసచ్ఛాయమ్ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. 2. శివనామము కామదము. ఈ శ్లోకమున ఆ శివనామము నుచ్చరించుటకు నాలుకను ప్రోత్సహించును. దానిని కామదే అని విశేషించి సంబోధించుట విచిత్రముగా నున్నది. చెప్పిన మాట వినక మారాము చేయుచున్న కూతురిని బుజ్జగించుచున్నాడా కవి అన్నట్లు స్ఫురింపఁజేయు చున్నది. త్రిసన్ధ్యమ్ అను పదము శివుని గూర్చిన ప్రసంగము. సన్ధ్యోపాసనము వలె నిత్య (కర్మ)ము అని తెలుపును. కథయ కథయ అను ఆమ్రేడనము శివ ప్రసంగమునందు కవికి గల ఆదరమును తెలుపును. అన్ని పాదములలో 1–9 వర్ణముల మైత్రి పాటింపబడినది. ఈ శ్లోకమును మాలినీ వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున తనకున్న ఒక నాలుకకు శివ ప్రసంగ కరణము కవిచేత ఉపదేశింపఁబడినది. ఈ శ్లోకమున రెండువేల నాలుకలు గల ఆదిశేషునితో శివునకు తన ప్రార్థనము చెప్పుమని ఉపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ అయి భుజగపతే! త్వం వర్తసే కర్ణమూలే**
**నిరతమపి సహస్రం సన్తి వక్త్రాణి సన్తి।**
**భవతి చ తవ సద్వాక్చాతురీ తేవ యాచే**
**బహు వద సమయే మే ప్రార్థనాం సాధు శమ్భోః॥ 13**

**ప్రతిపదార్థము :–** అయి భుజగపతే = ఓ సర్పరాజా!, త్వమ్ = నీవు, శమ్భోః = శివునియొక్క, కర్ణమూలే = చెవి మూలమున, వర్తసే = వర్తించుచున్నావు. నిరతమ్ అపి = ఎల్లప్పుడును, సహస్రమ్ = వేయి, సన్తి = మంచివైన, వక్త్రాణి = ముఖములు, తవ = నీకు, సన్తి =ఉన్నవి, సద్వాక్ = మంచి వాక్కుయొక్క, చాతురీచ = నైపుణ్యమును, భవతి = ఉన్నది, తేన = అందుచేత, యాచే = అడుగుచున్నాను, సమయే = సమయమునందు, సాధు = చక్కగా, బహు = ఎక్కువగా, మే = నాయొక్క, ప్రార్థనామ్ = ప్రార్థనను, వద = చెప్పుము.

**తాత్పర్యము :–** ఓ సర్పరాజా! వెయ్యి తలలతో శివుని కర్ణమూలమందున్నావు. మాటకారి తనము కూడ నీకున్నది. నా ప్రార్థనము చక్కగా ఎక్కువగా తగిన సమయమున శివునకు వినిపించుము.

**వివరణ :–** భూలోకమున నా నాలుక ఒకవేళ శివునికి నా ప్రార్థనమును చెప్పినచో అది శివునకు నీ ఫూత్కారకారణముగా వినబడునో లేదో? నీవా శివుని కర్ణభూషణముగా నున్నావు. రెండువేల నాలుకలతో నీకు నా ప్రార్థనమును శివునకు వినిపించు నవకాశమున్నది. ఆ వినిపించుట కూడ తగిన సమయమున నీవు చేయుము. నీకు ఆ పని చేయుటకు తగినంత వాఙ్నైపుణ్యము కూడ నున్నది. వేయితలల సర్పరాజు శివుని కర్ణమును మొత్తము వ్యాపింపలేక కర్ణమూలమందే ఉన్నట్లు చెప్పఁబడుటచే శివుని శరీరమెంత పెద్దదో, ఆ పెద్దతనము ఊహకును అందదనుట వ్యంగ్యమగుచున్నది. తనవంటి ఒక జీవుడైన సర్పరాజు శివుని కర్ణమూలమందు వసించునట్టి భాగ్యమును పొందినాడను ఆదరమున, నేనును జీవుడనే కావున జీవత్వాభిమానమును పురస్కరించుకొని శివునికి నా ప్రార్థనమును వినిపించుమను కవి వాంఛ ఈ శ్లోకమున వ్యంగ్యము. అసత్యమాడుటచే నేనును ద్విజిహ్వుడనే. కావున ద్విజిహ్వ రాజువైన నీ యందు ఎంతో ఆదరమును పొంది కర్ణమూల మందుంచు కున్నాడనగా శివుని కడ నీ



స్థానమెంత గొప్పదో స్పష్టమగుచున్నది. నీవు ద్విజిహ్వ రాజువు. కావున నీ యేలుబడిలోని వాడనే నేను కావున నా గోడును నీవు వినిపించి నా దుఃఖమును దూరముచేయుట నీకు కర్తవ్యమను కవి భావమొకటి వ్యంగ్యమగు చున్నది. భుజగ శబ్దము జారుని కూడ బోధించును. నేను జారుడనగుటచే భుజగుడను నీవు భుజగపతివి. కావున నీకు నా ప్రార్థనమును శివునకు వినిపించుట కర్తవ్యమను కవి భావము మరొకటి ఈ శ్లోకమున వ్యంగ్యము అగుచున్నది. ఈ రెండవ కవి భావ వ్యక్తికి భుజగ శబ్దశక్తి మూలము. కావున ఇది శబ్దశక్తి మూలధ్వని ఈ శ్లోకమున నేర్పడినది. ఈ శ్లోకమును మాలినీ వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున వేయితలల నాగరాజు శివకర్ణ మూలమున నున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని తలపై నున్న కపాలము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ విహితరజతశైలం వేదజాలైకమూలం**
**మదనమథనశీలం మస్తకాఞ్చత్కపాలమ్।**
**అనలరుచిరఫాలం హస్తభాస్వత్త్రిశూలం**
**సురనుతగుణజాలం స్తౌమి గౌరీవిలోలమ్॥ 14**

**ప్రతిపదార్థము :–** విహితరజతశైలమ్ = రజత శైలమున (నివాసముగా) విధించుకొన్న, వేదజాలైకమూలమ్ = వేద సమూహమునకు మూలమైన, మదన మథన శీలమ్ = మన్మథుని మథించు శీలముగల, హస్తభాస్వ త్రిశూలమ్ = చేత ప్రకాశించు త్రిశూలము గల, మస్తకాఞ్చత్కపాలమ్ = శిరమున ప్రకాశించు కపాలము గల, సురనుత గుణజాలమ్ = దేవతలచే స్తుతింపఁబడిన గుణముల సమూహముగల, గౌరీవిలోలమ్ = గౌరీదేవియందు విశేషాసక్తిగల (శివుని), స్తౌమి = స్తుతించుచున్నావు.

**తాత్పర్యము :–** నివసించుటకు కైలాస పర్వతమును నిర్మించుకొన్న, వేదజాలమునకు మూలమైన, మన్మథుని మథించు శీలముగల, శిరమున కపాలమును, చేత త్రిశూలమును ధరించిన, దేవతల చేత పొగడదగిన సుగుణములుగల, గౌరీ దేవియందు విశేషమైన ఆసక్తి గల శివుని స్తుతించెదను.

**వివరణ :–** ఈ శ్లోకమున పాదాన్తానుప్రాసాలంకారము వర్ణమైత్రియు నున్నవి. ఈ శ్లోకమును మాలినీ వృత్తనిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకము పాదాన్తానుప్రాసముతో నలంకరింపబడినట్లు ఈ శ్లోకము పాదాన్తానుప్రాసము చేతనే అలంకరింపఁబడుచున్నది.

**శ్లో॥ పురజయఘనయోధం పూరితానన్దబోధం**
**ఘటితయమనిరోధం ఖణ్డితారాతియూథమ్।**
**మదసుహృదపరాధం మన్దబుద్ధేరగాధమ్**
**భజ హుతవహబాధం పార్వతీప్రాణనాథమ్॥ 15**

**ప్రతిపదార్థము :–** పుర జయ ఘన యోధమ్ = పురముల జయము నందు గొప్ప యోధుడైన, పూరితానన్ద బోధమ్ = ఆనన్ద బోధనలను నింపుకొన్న, ఘటితయమ నిరోధమ్ = యముని కడ్డంకిని ఘటింపఁజేసిన, ఖణ్డితారాతి యూథమ్ = శత్రు సమూహమును ఖండించిన, మదసుహృదపరాధమ్ = మదముయొక్క మిత్రులకు (గర్వాధికులుకు) అపరాధ మొనర్చు లేక నా శత్రువుల (కామాదుల) లేక నాకపరాధమొనర్చు వారికి అపరాధ మొనర్చు (హాని కలిగించు) లేక (ప్రాణములదీయు) శత్రువుల కపరాధ మొనర్చు, మన్ద బుద్ధేః = మందబుద్ధిగల వారికి, అగాధమ్ = అవగాహ్యుడు గాని, (సముద్రమువలె లోతైన) హుతవహబాధమ్ = నిప్పుయొక్క బాధ గల, పార్వతీ ప్రాణనాథమ్ = పార్వతియొక్క భర్తయైన శివుని, భజ = సేవింపుము.

**తాత్పర్యము :–** త్రిపుర విజయ ఘనయోధుడు, జ్ఞానానందపూర్ణుడు, యముని జయించినవాడు, శత్రుసమూహమును జయించినవాడు, నా బాహ్యాంతశ్శత్రువుల నశింపఁజేయువాడు, మన్దబుద్ధులకు తెలియరాని వాడును, నిప్పుతో బాధ కలిగిన వాడునునైన పార్వతీప్రాణనాథుని సేవింపుము.

**వివరణ :–**1. పురశబ్దము పట్టణముల బోధించును. పురముల జయించుటలో శివుడు గొప్ప యోధుడు, స్థూల, సూక్ష్మ కారణ శరీరములు త్రిపురములు. వానిని జయించువాడు అనగా వానిని నశింపఁజేసిన వాడని యర్థము. శివుడు త్రిపురాసురుల సంహరించిన వాడను పురాణకథ ఈ ఆధ్యాత్మికతత్త్వమును పరమార్థముగా బోధించును. వ్యష్టిలో విశ్వతైజసప్రాజ్ఞులు (స్థూల సూక్ష్మ కారణ శరీరాభిమానులు) త్రిపురులు. సమష్టిలో వైశ్వానర హిరణ్యగర్భావ్యాకృతులు త్రిపురులు. ఈ ముగ్గురు అసురులు (అజ్ఞాన రూపులు కావున) జ్ఞాననాశ్యులు. ఆత్మజ్ఞానము కలుగగానే మాయాజ్ఞానాభిమానులైన అవ్యాకృతాప్రాజ్ఞులు అనఁబడు కారణ పురుషులు స్థూల కార్యా (శరీరా)భిమానులైన విశ్వా వైశ్వానరులు, సూక్ష్మ (వ్యష్టి సమష్టి) కార్యా (శరీరా)భిమానులైన తైజస హిరణ్య గర్భులు నశించిపోగా అనగా సకారణముగా మాయాజ్ఞానములు నశింపగా తదభిమానులు నశించి తుర్యాత్మ పురుషుడు మిగులును. అతనినే మాండూక్యోపనిషత్తు **'శివమద్వైతం చతుర్థమ్'** అని పేర్కొన్నది. 2. ఆతడు ఆనన్దాదభిన్న జ్ఞానరూపుడు లేక





జ్ఞానా భిన్నానన్ద రూపుడు 3. అన్నిటికి మృత్యువు కలిగించు యముడు ఆతని నేమి చేయ జాలకుండుటచే ఆతడు సర్వమృత్యువైన యమునకును మృత్యు వగుటచే మృత్యుమృత్యువగుటచే యమనిరోధము మృత్యు మృత్యుత్వమును ఘటించి 'ఘటిత యమ నిరోధమ్' అని ఈ శ్లోకమున పేర్కొనఁబడినాడు. 4. అంతర్బాహ్య శత్రువులైన కామాదుల, గజాసురాదుల సమూహముల సంహరించిన వాడగుటచే ఈ శ్లోకమున **"ఖణ్డితారాతి యూథమ్"** అని పేర్కొనఁబడినాడు. 5. మదసుహృదపరాధమ్ అను సమాసమును మద – సుహృత్ అపరాధమ్ అని, మత్ అసుహృత్ అపరాధమ్ అని, ద్వివిధముగా విడదీయవచ్చును. మొదటి విభాగమున మదముయొక్క మిత్రులైన గర్వాది గుణముల నశింపఁజేయువాడని, రెండవ విభాగమున మత్ – నాకు అనగా ఆత్మ (జ్ఞానము)కు, అసుహృత్ అనగా విరోధులైన అజ్ఞాన తజ్జన్య కామాదులకు అపరాధ మొనర్చు జ్ఞానమును ప్రసాదించు శివుడు మదసుహృదపరాధమ్ అని పేర్కొనఁబడినాడు. 6. **నాయమాత్మా బలహీనేన లభ్యః** అను శ్రుతి ననుసరించి బుద్ధిబలము లేని వారలకు అల్పబుద్ధిగల మన్ద బుద్ధిగలవారికి అనగా హీనునకు అందని వాడు కావున మన్దబుద్ధేర గాధమ్ అని పేర్కొనఁబడినాడు. 7. ఆయన ఫాలాగ్ని నేత్రుడగుటచే అగ్ని బాధ గలవాడు అని అర్థముగల "హుతవహబాధమ్" విశేషణముచే శివుడు విశేషింపఁజేయబడినాడు. 8. పార్వతీ ప్రాణనాథుడయిన ఆ శివుని భజనము ఆత్మజ్ఞానమునకు అంతరంగసాధనము అగుటచే నాల్గవ పాదాది యందు "భజ" సేవింపుము అని శిష్యుని గూర్చిన ఉపదేశము చేయబడినది. 9. నాలుగు పాదములయందు 1–9 వర్ణములకు మైత్రి కూర్పబడినది. పాద మధ్యాన్త అనుప్రాసము అలంకారముగా కూర్చబడినది. తవర్గ ద్వితీయ చతుర్థములకు గల ఉచ్చారణ సామ్యము ననుసరించి ఈ అనుప్రాసము కూర్చబడినది. ఈ శ్లోకమును మాలినీవృత్త నిబన్ధనమే.

–––

**అవతారిక :–** పై శ్లోకమున శిష్యునకు శివసేవ ఉపదేశింపఁబడినది. ఈ శ్లోకమున కవి స్వయముగా తాను శివోపాసనమును చేయుచున్నట్లు చెప్పఁబడుచున్నాడు.

**శ్లో॥ రుచిరకణ్ఠవికుణ్ఠితమేఘభం**
**స్ఫటికకాన్తికృతాగ్రహవిగ్రహమ్।**
**ప్రణవనాదసమోదభరాదరం**
**కమపి యోగివరేణ్యముపాస్మహే॥ 16**

**ప్రతిపదార్థము :–** రుచిర కణ్ఠ వికుణ్ఠిత మేఘభమ్ = అందమైన కణ్ఠముచేత ఓడింపఁ బడిన మేఘకాన్తిగల, స్ఫటిక కాన్తి కృతాగ్రహ విగ్రహమ్ = స్ఫటిక మణికాన్తిచే ఆగ్రహము

చేయcబడిన దేహముగల, ప్రణవనాద సమోద భరాదరమ్ = ప్రణవనాద జన్య సంతోషముయొక్క అతిశయము నందు ఆదరముగల, కమ్ + అపి = ఒకానొక, యోగివరేణ్యమ్ = యోగిశ్రేష్ఠుని, ఉపాస్మహే = ఉపాసించుచున్నాము.

**తాత్పర్యము :–** కణ్ఠకాన్తిచేత మేఘకాన్తి నోడించిన, స్ఫటికమణి కాన్తి నిండిన శరీరముగల, ప్రణవనాదానుసన్ధాన జన్యానందమం దాదరముగల ఒకానొక యోగిశ్రేష్ఠు నుపాసించు చున్నాము.

**వివరణ :–** ప్రథమ పాదము నందుపమేయమైన కణ్ఠకాన్తిచే మేఘకాన్తి ఓడినట్లు చెప్పుటచే ప్రతీపాలంకార మేర్పడియున్నది. రెండవ పాదము స్ఫటికమణికాన్తి అను నాయిక చేత పెనవేసుకొనcబడిన దేహము అనుటచేత సమాసోక్త్యలంకార మేర్పడియున్నది. ఉత్తరార్ధమున ప్రణవనాదసంధానమున కలుగు నానందము నందు ఆదరముచేత ఎల్లప్పుడు ప్రణవనాదానుసన్ధానరసికుడైన యోగిగా శివుడు చెప్పcబడినాడు. ప్రతిపాదమున న–భ–భ–ర అను గణములుండుటచే నీ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్త నిబన్ధనము. కణ్ఠ వికుణ్ఠిత, గ్రహ విగ్రహమ్, నాదసమోదభరాదరమ్ అను పదబన్ధములలో వృత్త్యనుప్రాసాలంకార మున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు యోగివరేణ్యుడని చెప్పcబడినది. ఈ శ్లోకమున శివుడు శిష్యుల కధ్యాపన మొనరించు గురువుగా చెప్పcబడుచున్నాడు.

**శ్లో॥ స్వకరే వినిధాయ పుస్తకం స్వం**
**ఘనశిష్యప్రకరాయ సర్వవిద్యాః।**
**గురురాదిశతి స్ఫుటమ్మహేశో**
**వటమూలే వటుయుక్తబోధశాలీ॥ 17**

**ప్రతిపదార్థము :–** వటమూలే = మఱ్ఱిచెట్టుయొక్క మూలమున, స్వకరే = తన చేతియందు, స్వమ్ = తన, పుస్తకమ్ = పుస్తకమును, వినిధాయ = ఉంచుకొని, ఘనశిష్యప్రకరాయ = గొప్ప శిష్యుల సమూహము కొఱకు, వటుయుక్త బోధశాలీ = జపమాలతో కూడిన జ్ఞానముతో నొప్పిన, గురుః = గురువైన, మహేశః = మహేశ్వరుడు, సర్వవిద్యాః = అన్ని విద్యలను, ఆదిశతి = ఉపదేశించు చున్నాడు.

**తాత్పర్యము :–** మఱ్ఱిచెట్టు క్రింద గొప్ప శిష్య(బ్రహ్మచారు)లకు సర్వవిద్యలను చేత తన పుస్తకమును ధరించి జపమాలతో కూడిన జ్ఞానముతో నొప్పిన మహేశ్వరుడు సర్వ విద్యల నుపదేశించుచున్నాడు.





**వివరణ :–** ఘనశిష్యులనుటచే శిష్యుల ఘనత్వము వయఃకృతమైన దనుట స్ఫురించు చున్నది. మరొక విధముగా శిష్యుల జ్ఞానకృతఘనత్వము గురువు ముందఱ నుండ జాలదు కదా! ఈ శ్లోకమున త్రిష్టుప్ఛందము బేసి పాదములలో, జగతీఛందము సరిపాదములలో నిబన్ధింపబడియున్నది. (బేసి పాదమున స–స–జ–గ–గ, సరిపాదమున స–భ–ర–య అను గణములున్నవి) దీని లక్షణము ఛన్దోగ్రన్థములలో లభ్యము కాలేదు. ఇట్లు భిన్నచ్ఛందములలో శ్లోకముల రచనము సంస్కృతములో అరుదుగానే కానవచ్చును.

---

**అవతారిక :–** పై శ్లోకమున బోధశాలిత్వము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆతని భువనావనశాలిత్వము చెప్పబడుచున్నది.

**శ్లో॥ భువనావనశాలియోగివేషం – భుజగాధీశ్వరభూషణాతతాఙ్గమ్।**
**భజతాద్భజతాం శుభప్రదమ్మే – హృదయం హీరపటీరహారితేజః॥ 18**

**ప్రతిపదార్థము :–** భువనావన శాలి యోగివేషమ్ = భువనముల కాపాడుయోగి వేషముగల, భుజగాధీశ్వర భూషణాతతాఙ్గమ్ = సర్పరాజములనెడి సొమ్ములచే వ్యాపింపc బడిన శరీరము లేక అవయవములు గల, భజతామ్ = సేవించువారికి, శుభప్రదమ్ = శుభముల గలిగించు, హీరపటీరహారి = వజ్రమువలె చందనమువలె అందమైన, తేజః = తేజమును, మే = నాయొక్క, హృదయమ్ = హృదయము, భజతాత్ = సేవించు గాక!

**తాత్పర్యము :–** భువనముల రక్షణమున నొప్పు యోగి వేషముగల, సర్పరాజ భూషణముల నలంకరింపcబడిన విశాల శరీరావయవములుగల, భజించువారికి శుభముల నొసగు, వజ్రమువలె చన్దనము వలె అందమైన తేజమును (శివుని) నా హృదయము సేవించుగాక!

**వివరణ :–** జన సమూహములకు దూరముగా యోగులుందురు. అయినను వారి యునికి లోకముల కాపాడుచునే యుండును. అట్లే భువనావనము కొఱకే యోగులు ఏకాంతముగా నుండవలెనని వారి కుపదేశించుట కొఱకే యోగి వేషము ధరించి నట్లున్నాడు. అను అర్థము ప్రథమ పాదమున వ్యంగ్యము. నాల్గవ పాదమున శివుడని చెప్పక తేజమని చెప్పుటచే పర్యాయోక్త్యాలంకారమేర్పడి యున్నది. అట్లే హీర పటీరౌపమ్యమము ఆ తేజమునకు సమాసమున సాదృశ్య వాచకమును లుప్తమొనరించి చెప్పుటచే లుప్తోపమాలంకార మేర్పడియున్నది. మూడవ పాదమున భజతాం శుభప్రదామ్ అని భజన హేతువు చెప్పcబడినది. రెండవ పాదమున 1–7 వర్ణముల మైత్రి కూర్పc బడినది. ద్వితీయ తృతీయ పాదములలో భకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది.

అట్లే నాల్గవపాదమున "హీరపటీరహారి" అను పద బన్ధమందును వృత్త్యనుప్రాసమున్నది. ఈ శ్లోకము ఛందస్సు విషయమున పై శ్లోకము వంటిదే.

---

**అవతారిక :–** పై శ్లోకమున యోగి వేష శివుని భువనావనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున దానికొఱకై విషమును గూడ స్వీకరించిన శివునియందు దాని యందలి అత్యాదరము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అయమాత్తవిషస్తు రక్షణార్థం – భయమాపన్నమవేక్ష్య విష్టపౌఘమ్।**
**వయమాశు భజామ దేవదేవం – జయమానన్దభరం చ కిం న దద్యాత్॥19**

**ప్రతిపదార్థము :–** భయమ్ = భయమును, ఆపన్నమ్ = పొందిన, విష్టపౌఘమ్ = లోక సమూహమును, రక్షణార్థమ్ = రక్షించుట కొఱకు, అయమ్ = ఈతడు (శివుడు) ఆత్త విషఃతు = స్వీకరించిన విషముగలవాడు గదా!, జయమ్ = జయమును, ఆనన్దభరమ్ చ = ఆనన్దాతిశయము, దద్యాత్ న కిమ్ = ఇవ్వడా?, (తప్పక ఇచ్చును. అందువలన), వయమ్ = మేము, ఆశు = శీఘ్రముగా, (తమ్ = ఆ), దేవదేవమ్ = దేవదేవుని (శివుని), భజామ = సేవించెదము గాక!

**తాత్పర్యము :–** భువనసమూహము విషభయమును పొందగా దాని రక్షణము కొఱకు విషము స్వీకరించిన యీ శివుడు మనకు జయమును, ఆనన్దాతి శయమును ఈయడా! తప్పక ఇచ్చును. అందువలన ఆతనిని శీఘ్రముగా సేవించెదము గాక!

**వివరణ :–** ఈ శ్లోకమున దాక్షిణాత్యమైన ప్రాస (పాద ద్వితీయాక్షరమన్ని పాదములలో నొకటిగా నుండుట)ము ప్రయోగింపఁబడినది. ఈ శ్లోకము నందును పూర్వ శ్లోకవృత్తమే నిబంధింపఁబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున లోక రక్షణార్థము విషమును సైతము స్వీకరించిన శివుని భజనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున విషధరయోగపట్టధారియైన శివుని భావనముపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ నిటలస్ఫుటభాసిత త్రిపుణ్డ్రం –**
**కటిమధ్యే ఘటితాహియోగపట్టమ్।**
**హృదయే పరిభావితస్వరూపం –**
**హృదయే భావయ భావభావదావమ్॥** **20**



**ప్రతిపదార్థము :–** నిటల స్ఫుట భాసిత త్రిపుణ్డ్రమ్ = నొసట స్పష్టముగా ప్రకాశించిన భస్మ త్రిపుణ్డ్రము గల, కటిమధ్యే = కటియొక్క నడుమ, ఘటితాహి యోగపట్టమ్ = పాములతో యోగపట్టమును కట్టుకొన్న, హృదయే = హృదయము నందు, పరిభావిత స్వరూపమ్ = బాగుగా భావింపఁబడిన స్వరూపము గల, భావభావదావమ్ = మనస్సునకు సంబంధించిన లేక మనసిజునియొక్క భావములను అడవికి దావాగ్నియైన శివుని, అయే = ఓయీ, హృత్ = హృదయమా!, భావయ = భావింపుము.

**తాత్పర్యము :–** ఓయీ హృదయమా! నీలో ప్రకటింపఁబడిన స్వరూపము గల, నుదుట స్పష్టముగా ప్రకాశించిన భస్మ త్రిపుణ్డ్రము (రేఖాత్రయము)గల, కటి ప్రదేశమున బిగించిన యోగ పట్టముగల, కామసంబంధ భావములను అడవులకు దావాగ్నియైన శివుని భావింపుము.

**వివరణ :–** భాసిత శబ్దముయొక్క ఒక అర్థము ప్రకాశింపఁజేయబడిన అనునది. ఈ అర్థము భాస ధాతువునుండి జనించిన కృత్ప్రత్యయాన్త శబ్దమునుండి లభించును. భాసిత శబ్దమునకు తద్ధిత ప్రత్యయము చేర్చగా నేర్పడిన తద్ధితాన్త భాసితా శబ్దము మఱొకటి. దీని అర్థము భసితమునకు అనగా భస్మమునకు సంబంధించిన అనునది. శివునినొసట నున్న భస్మరేఖలు ప్రకాశించినవి అనునది రెండు విధములుగా లాభించిన ఏకార్థము. 2. యోగులు కటి ప్రదేశముపైన ధరించిన లేక నొసట ధరించిన పట్టుబట్ట యోగపట్టము అని పిలువఁబడును. మరియు గురువు సన్యసించిన శిష్యుని పిలుచు నూతన నామము కూడ కొన్నిచోట్ల యోగపట్టమని వ్యవహరింపఁబడుట గలదు. 3. హృదయే అను శబ్దము తృతీయ చతుర్థ పాదాదియందు ప్రయోగింపఁబడుటచే ఉత్తరార్ధమున యమకాలంకార మేర్పడియున్నది. హృత్ హృదయ శబ్దములు ఏకార్థకములు. **చిత్తం తు చేతో హృదయం స్వాన్తం హృత్ మానసమ్ మనః** అను నిఘంటువు పై పదముల ఏకార్థకత్వమునకు ప్రమాణము. ఓ హృదయమా! హృదయమున అనగా నీలో ప్రకటింపబడిన స్వరూపముగల శివుని నీవు భావించుటలో అధిక సౌకర్యము గలదనుట ఈ యమకాలంకారము చేత వ్యంగ్యమగు అర్థము. ఈ వ్యంగ్యమును సాధించుటకు పై యమకముచే కవి ఉత్తరార్ధమునలంకరించి యున్నాడు. లేక గురువు తన హృదయమున ప్రకటితమైన శివుని, శిష్యుని హృదయమున భావింపుమని ఉపదేశించు చున్నాడనియు చెప్పవచ్చును. **భావభావదావమ్** అను చతుర్థ పాదాంతములోని సమాసములోని మొదటి భావ శబ్దము మనస్సుయొక్క లేక మనస్సునకు సంబంధించిన అను అర్థముల బోధించును. షష్ఠీ విభక్తి సంబన్ధార్థకమనుట విద్వాంసు లెఱిగిన విషయమే.

మన్మథునకు భావభావ శబ్దము వాచకము. కావున అది కామవాచకము. ఈ రెండు విధములుగా లభించిన అర్థమే కామసంబంధ భావములు అనునది. భావభావ శబ్దార్థము. చివరి దావ శబ్దము అడవిలో జనించిన అగ్ని అను అర్థముగల శబ్దము. కావున మొత్తము సమాసము కామసంబంధ భావారణ్య దాహకత్వ రూప శివలక్షణమును బోధించును. లేక మొదటి భావ శబ్దమును భవశబ్దము నుండి యేర్పడిన తద్ధితాన్తముగా గ్రహించి సంసారసంబన్ధి అను అర్థమును, రెండవ భావ శబ్దమునకు సాధారణ భావము అను అర్థమును స్వీకరించి మొత్తము సమాసమునకు సంసార సంబన్ధి భావారణ్య దాహకత్వ శివలక్షణమును బోధించు ననియు చెప్పవచ్చును. లేక మొదటి భావశబ్దము మనోవాచకము కావున ఆ మనస్సునకు సంబంధించిన వాడు మన్మథుడు. కావున మన్మథార్థకముగా గ్రహించి తత్సంబంధి భావములు అను అర్థమును భావభావ శబ్దము నుండి గ్రహించవచ్చును. ఈ పక్షమునందు కామసంబంధి భావారణ్య దాహకత్వ రూప శివలక్షణం మొత్తము సమాసముయొక్క అర్థముగా గ్రహింపబడదగినది. ఈ శ్లోకమున పూర్వార్ధమున టకారప్రాసము ఉత్తరార్ధమున వకార ప్రాసమును ప్రయోగింపబడినవి. మరియు నాల్గవ పాదమున 'భావయ భావభావ' అను పద బన్ధనమున భావశబ్దావృత్తిచే యమకాలంకారమేర్పడి యున్నది. 'భావభావ' శబ్దముచే ఛేకానుప్రాసమేర్పడి యున్నది. 'భావదావమ్' అనుచోట వృత్త్యనుప్రాస మేర్పడి యున్నదనియు చెప్పవచ్చును. పూర్వార్ధమున టకారవృత్తి వలన, ఉత్తరార్ధమున వకారావృత్తి వలనను వృత్త్యనుప్రాసము లేర్పడియున్నవి. పూర్వశ్లోకముల వృత్త నిబన్ధనమే ఈ శ్లోకము నందును కలదు.

---

**అవతారిక :–** పై శ్లోకమున హృదయోపాసనీయుడుగా శివుడు చెప్పబడినాడు. ఈ శ్లోకమున సూర్యచంద్రప్రణవ గౌరీమనః కమలములందు ప్రకాశించువాడుగా నతడు చెప్పబడుచున్నాడు.

**శ్లో॥ కోపి ప్రకామగరిమాశు స ధామ భూమా**
**రామాభిరామవపురాదరణీయమేవ।**
**యో భాస్కరే శశిని చ ప్రణవే చ నిత్యం**
**గౌరీమనఃసరసిజే చ చకాస్తి భూయః॥ 21**

**ప్రతిపదార్థము :–** కోపి = కోపముగల, ప్రకామగరిమ = ఉత్కృష్టకామ గౌరవముగల, ఆశు = త్వరగల, రామాభిరామ వపురాదరణీయమ్ = స్త్రీమనోహర శరీరమున



ఆదరణీయమైన, ధాము+ఏవ = స్థానమే, యః = ఎవడు, భాస్కరే = సూర్యుని యందును, శశిని = చంద్రునియందు, ప్రణవే చ = ఓంకారమునందును, గౌరీ మనః సరసిజేచ = పార్వతీ మనస్సనెడి కమలమునందును, భూయః = మాటిమాటికి, చకాస్తి = ప్రకాశించునో, సః = ఆతడు, భూమా = అల్పుడుగాడు.

**తాత్పర్యము :–** ఎవడు సూర్యచన్ద్ర ప్రణవములందు పార్వతీ మనఃకమలమునందును మాటిమాటికి ప్రకాశించునో ఆతడల్పుడు గాడు. మరియు కామక్రోధముల ఆధిక్యము కలిగియు స్త్రీల మనోహర శరీరమున ఆదరణీయమైన స్థానమే ఆతడు.

**వివరణ :–**ప్రకృష్ట కామగరిమకు కోపమునకు స్థానమైనవాడు శివుడు. సృష్టి హేతువగుటచే ఆతని కామము ప్రకృష్టగరిమ కలది. లయకర్త యగుటచే ఆతడు కోపమునకును ధామ(స్థాన)మైనవాడు. సృష్టిలయముల మధ్య స్థితి అది భోగానుభవ స్థితియే. భోగముల కాయతనము శరీరము. అది రామాభిరామము ఐనప్పుడుత్తమ భోగ సాధనమగును. ఉత్తమ భోగము సత్కర్మ (ధర్మ) ఫలము. సత్కర్మచేత రామాభిరామ అనగా స్త్రీలచే కోరదగిన సుందరమైన శరీరము లభించును. అనుట శాస్త్రలోక వ్యవహార సిద్ధమైన అంశము. భూతకాలమున సృష్ట్యారంభమైనది. వర్తమానకాలమనను సృష్టితోపాటు లయమును జరుగుచుండును. భావికాలమున సర్వభూతముల సంహారమైన పిదప లయకృత్యమును ఆగిపోవును. మరల సమష్టి జీవ భోగకాలము సమీపముగానే శివుని ప్రకృష్ట గరిమమైన కామము కలుగును. ఇదియే **సోఽకామయత** అని ఉపనిషత్తుల యందు చెప్పఁబడిన సృష్టి హేతువుగా ప్రకృష్ట గౌరవము గల్గిన కామము. నిరంతన సృష్టిలయమున కాతని కామక్రోధములు త్వరగలవిగానే ఉండవలెను అనుటకై ఆశు శబ్దము ప్రయోగింపఁబడినది. ఆతని యందుండు కామక్రోధములు త్వర శీఘ్రసృష్టి లయహేతువులగును. లేక కోపి శబ్దమును **కః+అపి** అని విభజించి అనిర్వాచ్యుడు అను నర్థము చెప్పవచ్చును. 2. సూర్యచంద్ర ప్రణవగౌరీ మనస్సరసిజములందు మాటి మాటి కాతడు ప్రకాశించును. భూయః అను శబ్దము సూర్యాది ప్రతీకములలో ధ్యాన జన్యమై ధ్యాన సమస్థితియై ధ్యానాంతమున లయమొందు శివుని తేజోమయ రూప ప్రకాశమే చకాస్తి శబ్దార్థమనుటను సూచించు చున్నది. అది భూయః చకాస్తి అనుటకు వీలైనది కాదు. ఒకసారి కలిగినచో అది ఆరునది కాదు. కావున భూయః ప్రకాశము దానికవశ్యము కాదు. అది ఆరినచో గదా భూయః ప్రకాశావశ్యకత. కావున ఈ శ్లోకమునఁ జెప్పఁబడినది. ధ్యాన జన్య శివతేజోరూప ప్రకాశమే. అది ధ్యానము చేసినప్పుడెల్ల ప్రకాశించుచు ధ్యానేతరావస్థలలో ప్రకాశింపదు. కావున అట్టి ప్రకాశము

కోరినవారు మరల మరల ధ్యానము చేయుదురు. అది మరల మరల ప్రకాశించును. ఇట్టి ధ్యానాభ్యాసముచే ఉత్తర కాలమున అభ్యాసికి ఆత్మజ్ఞానము అనగా శివాత్మైక్యజ్ఞానము కలిగి శివశాశ్వత స్వరూప ప్రకాశము సిద్ధించును. 3. సన్ధ్యోపాసనము సన్ధ్యాకాలమున చేయదగిన సూర్యప్రతీక శివోపాసనమే అను అంశము భాస్కరే అను పదముచే సిద్ధించును. అన్ని కాలములలో ఏ సూర్యప్రతీక శివోపాసనము చేయదగినదేయైనను సన్ధ్యాకాలమున అది నిత్యము ఇతర కాలములలో అది ధ్యాత ఇచ్ఛననుసరించినదే గాని నిత్యముకాదు. శివుడు అర్ధనారీస్వరూపుడు, శివుని పుంభాగము సూర్యమండలమున ధ్యానింపదగినది. పూర్ణిమనాటి రాత్రి యంతయు చన్ద్ర మండలమున దేవి నుపాసించుట ఒక శాక్తేయ సంప్రదాయము. కనీసము అర్ధరాత్రమున చతుర్థ సంధ్యోపాసనము తాన్త్రికులలో ప్రసిద్ధము, చన్ద్రుడున్నను లేకున్నను, చన్ద్ర మండలము కల్పించుకొని చన్ద్ర ప్రతీకోపాసనము చేయనగును. అట్లే మనస్సున సూర్యమండలమును కల్పించుకొని సూర్య ప్రతీకోపాసనము చేయనగును. ఈ సూర్య చన్ద్ర ప్రతీకోపాసనములు రెండును రూపప్రతీకోపాసనములు. 4. ప్రణవము శివ వాచక నామము. కావున ప్రణవ ప్రతీకముగా శివోపాసనము చేయుట నామ ప్రతీకోపాసన మనఁబడును. సూర్యచన్ద్రులే గాక సమస్త ప్రపంచములోని అర్థములన్నియు శివరూపములే. వానియందు (శివలింగ విగ్రహాదులయందు తదితరములందును) శివునుపాసించుట రూప ప్రతీకోపాసనమే యైనను పెద్దలచేత అనుష్ఠింపఁబడుచు వచ్చిన సూర్యచన్ద్రలింగ విగ్రహాదులందు శివునుపాసించుట శివరూప ప్రతీకోపాసనములలో ఉత్కృష్టము. సాంప్రదాయకము. అట్లే అన్ని నామములును శివవాచకములే యైనను ప్రణవమున శివునుపాసించుట ఉత్కృష్టము. సాంప్రదాయకము. అంత మాత్రమున ప్రణవేతర శివాది శివ నామములందు శివునుపాసింపరాదు అని చెప్పరాదు. రూపోపాసనమున నామమునకు నామోపాసనమున రూపమును అనుషంగికముగా నైనను అవశ్యముగా అనుసన్ధానము జరుగును. నామరూపములొక దానిని విడచి మరొకటి యుండక పోవుటయే దానికి కారణము. తైలధారావ దవిచ్ఛిన్న జ్ఞాన సన్తాన రూపమైన ఈ ఉపాసనమును గూర్చి విచారించు కొనుటయు నొక విధముగా ఉపాసనమే అగును. ఈ విచారణము తైలధారావ దవిచ్ఛిన్న జ్ఞానసన్తాన ప్రవాహరూపము కాకపోయినను, తత్ప్రేరకము తదితి కర్తవ్యతా బోధకము నగుటచే, తదంశమే తదంగమే అగును. ప్రణవమనగా అకారోకార మకార రూప త్రివర్ణమేలనమైన ఓంకారమని దాదాపు సాధకులందఱును ఎఱుగుదురు. ఈ మూడింటి పిదప తొమ్మిది నామరూప బేధభిన్న నాదభేదములున్నవి. వీని నన్నిటికి



కలిపి అర్ధమాత్రయను నొక పేరున్నది. నాదమను మరొక పేరున్నది. భ్రూమధ్యమున ప్రాణమును కుమ్భించి ప్రణవమునుపాసించుట యోగి మాత్ర సాధ్యము. వాయు నిరోధము లేకున్నను ఉచ్ఛ్వాసమున సోకారమును హల్లును విడచి మకారమును మాత్రము స్వీకరించి యేర్పడిన యోంకారమును జాగ్రదవస్థ యందంతటను అనుసన్ధించు అభ్యాసముచే సాధకునకైనను (యోగి కాక పోయినను) సాధ్యమే యగును. ఇదియొక విధముగా జపముగాని ప్రణవ జపమే (అజప గాయత్రి అని దీనికి మరొక పేరున్నది) ప్రణవోపాసన చేయలేని వారు ఈ అజపా నామ సార్వకాలిక లేక జాగ్రదవస్థాశ్రయ) ప్రణవ జపము నొనరింపవచ్చును. దినమునకు 21 వేల 6 వందలసార్లు ప్రణవ జపము ప్రతి జీవియు చేయుచుండును గాని ఇది జపమని యెఱిగి అనుసన్ధించుట మనుష్యునకే సాధ్యము. యోగాభ్యాసము లేకున్నను శరీరమునందలి షట్చక్రములలోని దేవతలకు ఈ ప్రణవ జపమును నివేదించిన, వారికి సత్ఫలము లభించును. మూలాధారము నందలి గణేశున కాఱువందల జపమును, స్వాధిష్ఠాన మందలి బ్రహ్మకు ఆరువేల జపమును, మణిపూరమందలి విష్ణువునకు ఆరువేల జపమును, విశుద్ధమందలి జీవునకు వేయి జపమును, ఆజ్ఞ (భ్రూమధ్యమ) యందలి గురువునకు వేయి జపమును, సహస్రారమందలి శివునకు వేయి జపమును నివేదించవలెను. ప్రణవోపాసనమునకు ముందుగా ప్రణవ జపము నందు సిద్ధికలిగినచో ప్రణవోపాసనము మిక్కిలి సుకరమగును. **"సోఽహమ్"** యొక్క శేషమే ఓం కారము కావున, దీనికి "సోఽహమ్" అను హంసమంత్రమునకు వలె జీవబ్రహ్మైక్యమే అర్థము కావున, ఏతద్ జ్ఞానమునకు అన్నింటికన్న, ప్రణవాను సన్ధానమున కన్నను, ముఖ్యస్థానము కలదు. అది (ఆజ్ఞానము) చరమ జన్మ మాత్ర సాధ్యము. అస్తు. ప్రణవములోని అంశములు మూడు. అకారోకార మకారములీ వఱకు చెప్పఁబడినవి. మిగిలిన నామరూప భేదభిన్న నాదభేదము లర్ధమాత్రయనఁబడునని చెప్పుట జరిగినది. ఇప్పుడా నాదభేదములు వివరింపఁ బడుచున్నవి. బిందువు వర్తులము. అది సున్నవంటి ఆకృతి గలది. అర్ధచన్ద్రము పేరు ననుసరించి అది అఱసున్నవంటి ఆకృతి గలదనుట స్పష్టము.

**రోధి :** ఇది ఊర్ధ్వాగ్రత్రికోణాకారము. ఇది వెన్నెల కాంతి గలది.

**నాదము :** రెండు అండముల మధ్య శిరవంటిది. ఇది పద్మరాగ వర్ణము.

**నాదాన్తము :** ఇది ఎడమవైపు బిందువుగల నాగలి వంటి దిశ. ఇది మెఱుపు వంటిది.

**శక్తి :** ఇది అడ్డముగా నుండి రెండు బిందువులలో ఎడమ బిందువు నుండి బయలుదేరు సిరగలది. దీనివర్ణము 60

**వ్యాపిక :** ఇది పైన బిందువున్న త్రికోణాకారము గలది.

**సమన :** ఇది పై బిందువు కింది బిందువునకు కలుపు రేఖవలె నుండును.

**ఉన్మన :** మనస్సునకు అందని ఆకారము గలది. అనగా ఆకారము లేనిదే కాని దానిపై మహాబిందువులుండును. దానిని గుర్తించి కింద ఖాళీగా నుంచుటయే తదాకారముగా భావింప వలసియుండును.

**పై తొమ్మిది చక్రములని అవి సూక్ష్మ శ్రీ చక్రగత నవచక్రములని భావింప వలెననుట శ్రీ విద్యా శ్రీ చక్రోపాసక సంప్రదాయము.** ఈ తొమ్మిది భ్రూమధ్యము మొదలుకొని సహస్రారమువఱకు ఒకదానిపై ఒకటి భావనీయములు. అకారోకారమకార ములతో కలిపి ప్రణవము ద్వాదశాంశము అని చెప్పఁబడినది. మాండూక్యోపనిషత్తు చతుర్మాత్రమని చెప్పఁబడిన ఓంకారము షోడశ భాగము పరమహంస పరివ్రాజకోప నిషత్తున చెప్పుట ఔపనిషత్సంప్రదాయమున ఓంకారోపాసనా ప్రకారాంత విస్తరమే.

అకారము – జాగ్రద్విశ్వ రూపము
ఉకారము – జాగ్రత్తైజస రూపము
మకారము – జాగ్రత్ప్రాజ్ఞ రూపము
అర్ధమాత్ర – జాగ్రత్తురీయ రూపము
బిందువు – స్వప్న విశ్వరూపము
నాదము – స్వప్న తైజసరూపము
కల – స్వప్న ప్రాజ్ఞరూపము
కలాతీతము – స్వప్న తురీయరూపము
శాంతము (శాంతి) – సుషుప్త విశ్వరూపము
శాంత్యతీతము – సుషుప్త తైజస రూపము
ఉన్మన – సుషుప్త ప్రాజ్ఞరూపము
మనోన్మని – సుషుప్త తురీయ రూపము
వైఖరి (పురీ) – తురీయ విశ్వరూపము
మధ్యమ – తురీయ తైజస రూపము
పశ్యంతి – తురీయ ప్రాజ్ఞరూపము
పర – తురీయ తురీయ రూపము

నీ రూపము నిర్గుణము నయిన శివతత్త్వము. ఓంకారముయొక్క అఖణ్డార్థము. అది చరమ వృత్త్యానుభవ రూపము. దానియందు పై షోడశ కళలు ధ్యేయ, బ్రహ్మానామ





రూపాంశములు. సమాధిలో యోగులనుభవించు నీ భేదములన్నియు (అపరబ్రహ్మ నామరూపములు) యోగి దర్శనీయములు. అయోగులు సైతము వీనిని భావించి కొంత ఫలమును పొందవచ్చును. 5. గౌరీ మనస్సరసిజము నందును శివుడు ధ్యేయుడు. మనస్స రసిజ శబ్దము అవాహత కమలమును గూడ బోధించును. గౌరీదేవి నిరంతరము అచట శివుని ధ్యానించుచుండగా అచటనే శివుడు ప్రకాశించుచుండును. పూర్వార్ధమున రేఫ మకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. ప్రతిపాదమున త–భ–జ–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము వసన్తతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున ఏ శివుడు భాస్కరాది ప్రతీకములందు పుంధ్యేయుడై ప్రకాశించునని చెప్పఁబడినాడు. ఈ శ్లోకము ఆ శివుని ధ్యానము చేతగాక పోవుటచే తత్ప్రణామము లేక తచ్ఛరణాగతి నొనర్చుట చెప్పుచున్నాడు.

**శ్లో॥ తం మల్లికాసుమసమానవిభాసమానం**
**సారఙ్గపాణిమణిమాదివిరాజమానమ్।**
**ముక్తాప్రవాలపరిపూరణచారుభద్ర –**
**రుద్రాక్షమాలికమహమ్ ప్రణమామి రుద్రమ్॥ 22**

**ప్రతిపదార్థము :–** మల్లికా సుమ సమాన విభాసమానమ్ = మల్లెపూవుతో సమానముగా ప్రకాశించుచున్న, సారఙ్గపాణిమ్ = జింక చేతగల, అణిమాది విరాజమానమ్ = అణిమాదులతో (అష్టసిద్ధులతో) ప్రకాశించుచున్న, ముక్తాప్రవాల పరిపూరణ చారు భద్ర రుద్రాక్ష మాలికమ్ = ముత్తెముల పగడములనన్నివైపుల నింపుటచే సుందరమైన మంగలకరములైన రుద్రాక్షమాల మాలికలగల, తమ్ రుద్రమ్ = ఆ రుద్రుని, అహమ్ = నేను, ప్రణమామి = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :–** మల్లెపువ్వు వంటి తెల్లని కాంతితో నణిమాద్యష్ట సిద్ధులతో ప్రకాశించు చున్న, ముత్తెములు పగడములును మధ్యమధ్య నింపుటచేత అందమైన మంగలకరములైన రుద్రాక్షల మాల ధరించిన రుద్రునికి నేను ప్రణామమొనర్చెదను.

**వివరణ :–** ప్రథమపాదమున మల్లికాసుమ సమానముగా శివుడు ప్రకాశించు చున్నాడనుటచే లుప్తోపమాలంకారమేర్పడి యున్నది. మల్లెపువ్వునకు, శివునకు అనగా ఉపమానోపమేయముల సామ్యమును నిరూపించుటకు కావలసిన సమానధర్మము లేక సాధారణ ధర్మము తెలుప బడకపోవుటయే అందుకు హేతువు. రెండవ పాదమున 'పాణి మణి మాది' అను పద బన్ధమున వృత్త్యనుప్రాసాలంకార మున్నది. "సమాన

విరాజమానమ్” అను పదబన్ధమున మాన శబ్ద ద్విరావృత్తిచే యమకాలంకారమేర్పడి యున్నది. పూర్వార్ధమున పాదాన్తాను ప్రాసమున్నది. ఉత్తరార్ధమున **ముక్తాప్రవాళ పరిపూరణచారుభద్రరుద్రాక్షమాలికమ్** అను విశేషణమున క్రమము ననుసంధించినచో ముత్తెములు చారుతమ ప్రవాలములు భద్రతను అనగా మంగలకరత్వమును హేతువులను సూచింపంజేయును. అణిమ, మహిమ, లఘిమ, గరిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అను అష్టసిద్ధులు అణిమాది అను పదములోని ఆది పదముచే గ్రాహ్యములు. ఈ శ్లోకమును పై శ్లోకము వలె వసన్తతిలకా వృత్తనిబన్ధనమే. 2. ప్రణమామి అను క్రియ నవ విధ భక్తులలోని వందన భక్తిని, లేక ఆత్మనివేదన భక్తిని సూచించును. తనను నివేదించుకొన్న పిమ్మట దానిపై నభిమానము నశించి నందున తద్రక్షణము శివ కర్తవ్యముగా మారిపోవును. ఇది శరణాగతి రూపమని కొందఱు పెద్దలు చెప్పెదరు.

---

**అవతారిక :–** పై శ్లోకము శివోద్దేశ్య ప్రణామ సామాన్యము చెప్పంబడినది. ఈ శ్లోకమున పాదాబ్ద సంచార రూపమైన పాదోపగ్రహణ రూపమైన, మానసికమైన ప్రణామ విశేషణము చెప్పంబడుచున్నది.

**శ్లో॥ నో వైష్ణవమ్మతమవైమి న చాపి శైవం**
**నో సౌరమన్త్రవిదితం న తు మన్త్రజాలమ్।**
**శఙ్కా తథాపి నహి శఙ్కరపాదపద్మే**
**సఞ్చారమేతి మమ మానసచఞ్చరీకః॥ 23**

**ప్రతిపదార్థము :–** వైష్ణవమ్ = విష్ణువునకు సంబంధించిన, మతమ్ = మతమును, నో అవైమి = తెలియను, శైవమ్ = శివునకు సంబంధించిన, మతమ్ చ = మతమును గూడ, అవైమి = తెలియను, సౌరమన్త్రవిదితమ్ = సూర్యునికి సంబంధించిన మంత్రము జ్ఞానము, నో = లేదు, మంత్రజాలమ్ = మంత్ర సమూహమును, న = లేదు, తథాపి = అట్లయినను, శఙ్కా = శఙ్క, న = లేదు, శఙ్కరపాదపద్మే = శివుని కమలము వంటి పాదమునందు, మమ = నాయొక్క, మానసచఞ్చరీకః = మనసను తుమ్మెద, సఞ్చారమ్ = సఞ్చారమును, ఏతి = పొందుచున్నది.

**తాత్పర్యము :–** నేను శైవ మతమునుగాని, వైష్ణవ మతమునుగాని ఎఱుగను, నాకు సూర్యసంబంధ మంత్రజాలము లేదు. ఇతర మన్త్రముల సమూహమును దేనిని ఎఱుగను. అయినను నాకు శఙ్క అనగా భయముగాని, సందేహముగాని లేదు. శఙ్కర పాదపద్మమునందు నా మనసను తుమ్మెద సంచరించుచునే ఉన్నదిగదా!





**వివరణ :–** విష్ణువు సర్వోత్కృష్టుడని అంగీకరించు మతము వైష్ణవ మతమనంబడును. శివుడు సర్వోత్కృష్టుడని చెప్పు మతము శైవ మత మనంబడును. అట్లే సౌరమతము సూర్యుని, గాణాపత్యము గణపతిని, శాక్తేయము శక్తిని సర్వోత్కృష్టములుగా భావించును. ఇంకను వేదములోని విష్ణు మహిమా ప్రతిపాదక మంత్రములకు ప్రాధాన్యమును ప్రామాణ్యమును వైష్ణవ మతమంగీకరించును. శివమహిమా ప్రతిపాదక మంత్రములకు ప్రాధాన్యమును శైవమత మంగీకరించును. ఇట్లే సూర్యమహిమా ప్రతిపాదకములైన సౌరమన్త్రముల ప్రాధాన్యమును సౌరమత మంగీకరించును. ఇట్లే ఇతర మతములు తమ తమ దేవతల ప్రాధాన్యమును ప్రతిపాదించు మంత్రజాలముల నంగీకరించును. ఈ మంత్రములను గాని ఈ మతములనుగాని నేనెఱుగను. ఏదో ఒక దేవతను రక్షకుడుగా భావించినచో నన్ను ఆపదనుండి సంసారము నుండి కాపాడువాడు లేడను భయము లేదు. నాకు తెలియకుండగనే నా మనము అను తుమ్మెద శివపాదము అను పద్మమున సంచరించుచున్నది. కావున నన్ను ఇతరులు శైవుడని భావించెదరు గాక. నేను వారివలె ఇతర దేవతల నిందింపను. ఇతర దేవతా నిందాపూర్వక, స్వదేవతా స్తుతియే వారి దృష్టిలో మతము. అందుచే వారు స్వ మతము లందభిమానమును ప్రదర్శించుచు ఇతర దేవతల నిందించుటకు సైతము వెనుదీయరు. నా మనము శివుని పాదపద్మము నుండి బయటకు వచ్చినగదా ఇతర మతములున్న సమజ్ఞానముగాని, అది ఉత్కృష్టము కాదని నిందించుట గాని సంభవించును. నాకట్టి అవకాశమే లేదు. పాదమునందు పద్మారోపము, మానసమందు చంచరీకారోపము నుండుటచే ఉత్తరార్ధమున రూపకాలంకార మేర్పడియున్నది. శఙ్కా – శఙ్క అని తృతీయ పాదమున, సఞ్చా – చఞ్చ అని నాల్గవ పాదమున పాదాది మధ్యప్రాసమున్నది. ఈ శ్లోకమును వసన్తతిలకావృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివపాద పద్మమున కవి మనస్సు భ్రమించుటచే భ్రమరమని చెప్పంబడినది. ఈ శ్లోకమున శివుని భ్రమ చెప్పంబడుచున్నది.

**శ్లో॥ గౌరీ కరోతు శుభమీశవిలోలదృష్టి–**
**మధ్యే దధత్యతులకాఞ్చనకణ్ఠమాలామ్।**
**తద్భ్రుగ్రసాననుభవన్ ప్రణమన్తమిన్ద్రం**
**కిం క్షేమమమ్బుజభవేతి వదన్ శివోఽపి॥ 24**

**ప్రతిపదార్థము :-** ఈశవిలోల దృష్టి మధ్యే = శివుని చంచల దృష్టి మధ్యమున, అతులకాఞ్చన కణ్ఠమాలామ్ = సాటిలేని బంగరు కంఠహారమును, దధతీ = ధరించుచున్నది, గౌరీ = గౌరి, శుభమ్ = శుభమును, కరోతు = చేయుగాక! తద్భుగ్రసాన్ = ఆ దృష్టిసారములను, అనుభవన్ = అనుభవించుచు, ప్రణమన్తమ్ = నమస్కరించు చున్నది, ఇన్ద్రమ్ = ఇన్ద్రుని గూర్చి, అమ్బుజభవ = ఓ బ్రహ్మా!, కిం క్షేమమ్ = క్షేమమా! ఇతి = అని, వదన్ = పలుకుచున్న, శివః + అపి = శివుడను, శుభమ్ = శుభము, కరోతి = చేయుగాక!

**తాత్పర్యము :-** శివుని చంచల దృష్టి మధ్యమున సాటిలేని బంగరు కంఠహారమును ధరించు గౌరియు, ఆ చూపుల రసమును అనుభవించుచు నమస్కరించు ఇన్ద్రునితో ఓ బ్రహ్మా! క్షేమమా అని పలుకుచున్న శివుడును, శుభమును కలిగించెదరు గాక!

**వివరణ :-** శివుడు పంచాస్యుడు అనగా సింహస్వరూపుడు, కావును ఆయన కన్నులు పచ్చనివి. ఆ చూపులమ్మవారి కణ్ఠమున బంగారు కణ్ఠహారమైనవి. పార్వతీదేవి శివుని చూపులమాలనే హారముగా భ్రమించి కంఠమున హారము దాల్చినట్లు భ్రమించినది. పార్వతి కాంచన కంఠ సౌందర్యమునే శివుడు చూచుచున్నాడని గమనించిన పార్వతీ కాన్తకు కావలసిన అందమును ఆసక్తితో భర్త చూపుల మాలకన్న బంగారు మాల ఏమంత శ్రేష్ఠమైనది? కానే కాదు. అని నిశ్చయించుకొని సంతోషించుచున్నది. అనుట పూర్వార్ధ వ్యంగ్యము. శివుడు పార్వతి నాసక్తితో చూచినట్లే పార్వతియు శివునాసక్తితో చూచుచున్నది. కాని అమ్మవారి చూపులు ఎఱ్ఱగా నున్నవి. ఆ చూపులను చూచు తన కన్నులును కామ సహితములై ఎఱ్ఱబడినవి. శివుని కన్నుల నుండి ఎఱ్ఱని చూపులకు తనకు నమస్కరించు తెల్లని ఇన్ద్రుడును ఎర్రగా కనబడినాడు. అప్పుడు శివుడు ఇన్ద్రుని బ్రహ్మయని భ్రమించి 'ఓ అమ్బుజభవా! క్షేమమా! అని కుశలమడిగెను. అని ఉత్తరార్ధ వ్యంగ్యము. ఇట్టి గౌరీ శివులిరువురు సర్వులకు శుభమును కలిగించుగాక! 2. ఈ శ్లోకమున గౌరీ శివుల భ్రాంతి చెప్పఁబడుటచే భ్రాంతిమదలంకార మేర్పడియున్నది. "గౌరీ కరోతు, శుభమీశ", విలోల దృష్టి మధ్యే దధతి, అతుల కాఞ్చన కంఠమాలాం, తద్భుగ్రసాననుభవన్ ప్రణమన్తమ్, ఇంద్రమ్ భవేతి, వదన్ శివః ఇత్యాది పద బన్ధములలో వివిధ వర్ణావృత్తిలో వృత్త్యనుప్రాసాలంకారము లేర్పడియున్నవి. ఈ శ్లోకమును వసన్తతిలకా వృత్త నిబన్ధనమే.

---





**అవతారిక :-** పై శ్లోకమున గౌరీశంకరుల భ్రాంతి చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఇతరులకు భ్రమరభ్రాంతి కలిగించు శివుని కంఠముయొక్క నీలిమ వ్యంజింపఁ జేయబడుచున్నది.

**శ్లో॥ కర్పూరపూరధవలాధికచారుదేహం**
**కస్తూరికాభ్రమరవిభ్రమకారికణ్ఠమ్।**
**కల్యాణభూధరనివాసవిభాసమానం**
**కన్దర్పవైరిణమహం కలయామి నిత్యమ్॥ 25**

**ప్రతిపదార్థము :-** మిక్కిలి తెల్లనైన సుందరమైన దేహముకల, కస్తూరికా భ్రమర విభ్రమకారి కణ్ఠమ్ = కస్తూరియో, భ్రమరమో అను భ్రాంతిని కలిగించు కంఠముగల, కల్యాణ భూధర నివాస విభాసమానమ్ = మేరుపర్వత నివాసమున ప్రకాశించుచున్న, కందర్పవైరిణమ్ = మన్మథ విరోధి (శివుని), నిత్యమ్ = ఎల్లప్పుడు, కలయామి = ధ్యానించెదను.

**తాత్పర్యము :-** మేరు (కైలాస) పర్వతనివాసమున ప్రకాశించుచున్న, కసూర్తి భ్రమను భ్రమరభ్రమను కలిగించు కణ్ఠముగల, కర్పూరపురాశి తెల్లదనమును మించిన తెల్లదనము గల మన్మథ విరోధియైన శివుని నిరంతరము ధ్యానించెదను.

**వివరణ :-** శివుడు కైలాస వాసి. అమ్మవారు సుమేరు శృఙ్గమధ్యస్థ. కావున ఆ దంపతులిరువురకు కైలాస మేరువులు నివాసస్థానములే. కావున ఈ శ్లోకమున శివుడు బంగారు పర్వతమున నివసించుటచే ప్రకాశించుచున్న వాడని చెప్పబడినది. కల్యాణ శబ్దము బంగరు అను అర్థముతో మంగలకర (శుభకర) అని అర్థము ఉండుటచే, బంగారు వలె వెండియును శుభకరమగుటచే కల్యాణ శబ్దముచే వెండి అను అర్థము గ్రహించి కల్యాణ భూధర శబ్దమునకు వెండికొండయగు కైలాసము అను అర్థము చెప్పవచ్చును. మంగలదేవతయైన లక్ష్మి "హిరణ్యరజతస్రజ" యని శ్రీసూక్తమున వర్ణింపఁ బడుటచే వెండియు మంగల దేవతచే ఆదరింపబడినందున వెండియు కల్యాణమే, మంగలమే అని గ్రహింపవలెను. శ్లోకమందలి అన్ని పాదములును వృత్త్యనుప్రాసాలం కృతములే. అన్ని పాదములు కకారాదులై శబ్దశోభావాహములై, శయ్యాసౌభాగ్యమును కలిగించుచున్నవి. ఈ శ్లోకమును వసన్తతిలకా వృత్తనిబన్ధనమే.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుని నీలమైన కంఠము చెప్పఁబడినది. ఈ శ్లోకమున నీలముగా కనిపించు సముద్రము శివుని అమ్ములపొదియని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ యో౽న్తే౽తివృద్ధిమనయజ్జలధీన్ పయోధి-
ర్యస్యేషుధిః శిరసి దేవనదీ చ మూర్తిః।
ఆపో౽భిషిఞ్చతి జనో౽ధరధీర్విచిత్రం
తం నారికేలపయసా కలశీజలేన॥ **26**

**ప్రతిపదార్థము :-** యః = ఎవడు, అంతే = ప్రలయమున, జలధీన్ = సముద్రములను(కు), అతివృద్ధిమ్ = ఎక్కువ వృద్ధిని, అనయత్ = పొందించెనో, యస్య = ఎవనికి, పయోధిః = సముద్రము, ఇషుధిః = అమ్ములపొదియో, శిరసి = శిరమున, దేవనదీ చ = దేవనది (యున్నది)యో, ఆపః = నీరు, మూర్తిః = మూర్తియో, తమ్ = అతని (శివు)ని, అధరధీః = నీచ (అల్ప) బుద్ధిగల, జనః = నరుడు, నారికేల పయసా = కొబ్బరి (కాయలోని) నీటిచేత, కలశీజలేన = చిన్ననీటి చెంబులోని జలముచేత, అభిషించతి = అభిషేకించుచున్నాడు, విచిత్రమ్ = వింత!

**తాత్పర్యము :-** 1. ఎవడు ప్రలయమున సముద్రములను వర్ధిల్లఁజేయునో, పాల సముద్రమునే అమ్ములపొదిగా ధరించెనో, శిరమున గంగానదిని ధరించెనో, జలమెవని మూర్తియో, అట్టి శివుని అల్పబుద్ధిగల నరుడు కొబ్బరికాయలోని, చిన్న కలశములోని అల్పజలముతో అభిషేకించుట ఎంతో వింతగా నున్నది.

**వివరణ :-** సముద్రములలో జలములను వృద్ధి పొందించి భూమినంతను ప్రలయ కాలమున శివుడు ముంచివేయును. అట్టి స్వేచ్ఛ చేతనే జలధుల జలములనే పెంపొందించు శివుని కల్పజలాభిషేకమేమి? 2. సముద్రము శివుని అమ్ములపొది. వీపునకు కట్టుకొని యుంచుకొను బాణములతో నిండిన చిన్నతోలు సంచి అమ్ములపొదియని చెప్పఁబడును. లేక అమ్ముల నుంచుకొను పెట్టె అమ్ములపొది. అమ్ములపొదిలో బాణముల నుంచుకొని అవసరమైనప్పుడు ఒకటో రెండో బాణములను ధనువున నెక్కువెట్టి ధానుష్కులు (ధనర్ధారులు) ప్రయోగించుచుందురు. శివుని కసలు బాణమేది? విష్ణువే శివుని బాణము. విష్ణువు శివుని బాణము కావున విష్ణువును పెట్టెవలే, సంచివలె దాచి యుంచునది సముద్రము. కావున శివునకు సముద్రము అమ్ములపొదియని చెప్పఁబడును. అంతటి సముద్రము అమ్ములపొదియై ఆ శివుని వీపునకు కట్టు కొనఁబడునంత చిన్నది కాగా చెంబులోని జలము కాని కొబ్బరికాయలోని జలము కాని, ఆతని స్నానమునకెట్లు సరిపోవును .3. మూడు లోకముల ముంచి ప్రవహింపగల గంగ ఆ శిరమున చిన్న జలబిందువువలె అంటుకొని యుండగా ఆ శివుని స్నానమునకు కొబ్బరికాయలోని లేక ఆ చిన్న కలశము లోని కొంచెము జలము





కాని ఎట్లు సరిపోవును 4. నదీ సముద్రాది సర్వజలాశయములలోని జలమంతయు శివుని అష్టమూర్తులలో నొక మూర్తిగానే యుండగా ఆ జలమూర్తిని జలముతో అభిషేకించి తడుపఁదలచుట యేమి? 5. పై నాలుగు కారణములచే శివాభిషేక వైయర్థము చెప్పఁబడినది. కొబ్బరికాయలోని అల్పజలముల చేతనో అభిషేకించు జనుని బుద్ధియొక్క హ్రాసమునే ప్రకటించును అని నిరూపింపబడినది. అదిగాక ఆ అభిషేకము శివునెట్లు తృప్తుని చేయగలుగును? చేయలేదు అనుట అభిషేక వాయర్థ్యమునే సమర్థించును. అభిషేకము తాపోపశమనము గావించుటకో తృప్తికొఱకో చేయఁబడును. శివునకు తాపము లేదు. కావున తదుపశమన ప్రయత్న రూపాభిషేకము వ్యర్థము. ఆయనకు దప్పిక లేదు. తాపమును కలిగించు విషము తోడనే తృప్తుడైనాడేమో! అప్పటి నుండి తృప్తికై ఇతర దేవతలవలె అమృతమునే త్రాగలేదు. గావున నారికేల ఫల కలశాది జలములు నివేదన యోగ్యములును గావు. అవి నివేదింపఁబడినను వాని నాతడాహరింపడు. కావున పానీయముగా సమర్పించుటయు వ్యర్థమే అని చ కారముచే వ్యంగ్యమగును. 6. శ్లోకమున ధకారలకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. ఈ శ్లోకమును వసన్తతిలకా వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :-** పై శ్లోకమున జనుల శివాభిషేకము నిర్హేతుకమని చెప్పఁబడినది. ఈ శ్లోకముల కవి మనసు శివుని పదము నొందుట తత్కరుణకొఱకే అదియు తనపై నిర్హేతుకమే అని చెప్పఁబడుచున్నది.

శ్లో॥ శైవమ్మతమ్మమ తు వైష్ణవమప్యభీష్టం
సర్వేషు దైవతపదేషు సమత్వబుద్ధేః।
సత్యం తథాపి కరుణామృదు శఙ్కరస్య
సర్వేశ్వరస్య పదమేతి సదా మనో మే॥ **27**

**ప్రతిపదార్థము :-** సర్వేషు = అన్ని, దైవతపదేషు = దైవతము అను పదము చెప్పఁదగిన అందఱియందు, సమత్వబుద్ధేః = సములు అను బుద్ధిగల, మే = నాకు, శైవమ్ = శివునకు సంబంధించిన దైనను, వైష్ణవమ్ = విష్ణువునకు సంబంధించినదైనను, మతమ్ అపి = మతము కూడ, అభీష్టమ్ = మిక్కిలి ఇష్టము, సత్యమ్ = సత్యము, తథా + అపి = అట్లయినను, సర్వేశ్వరస్య = సర్వేశ్వరుడైన, శఙ్కరస్య = శివునియొక్క, కరుణామృదు = దయచే మెత్తనిదయిన, పదమ్ = పదమును, మే = నాయొక్క, మనః = మనము, సదా = ఎల్లప్పుడు, ఏతి = పొందుచున్నది.

**తాత్పర్యము :–** శైవమతముతో వైష్ణవమతమును నాకు మిక్కిలి ఇష్టములు. నాకు దేవతలందఱిలో శంకరుని కరుణచే మెత్తనిదయిన పాదమునందే నా మనమెప్పుడాసక్తి కలిగియున్నది.

**వివరణ :–** బుద్ధి తర్కించి నిశ్చయించు అంతరంగశక్తి. అట్టి బుద్ధినుపయోగించినప్పుడు దేవతలందఱు సమానులే. ఒకరు ఎక్కువ అగుటకు కాని, మరొకరు తక్కువ అగుటకు గాని హేతువులేదు. మరియును అన్ని నామరూపములు ఒకే సర్వేశ్వరునికే చెందియున్నందున శివవిష్ణ్వాది నామరూప భేదములకించిత్కరము లేయని తోచును. అట్టి యెడ ధవల వర్ణము గంగాధరత్వము, నీలకంఠత్వము అను అంశములు గల రూపములందు తద్బోధకములైన నామములందు గాని నాకేల ఆసక్తి కలిగెనో నాకు తెలియదు. శివునకే సర్వేశ్వరత్వమున్నదని, ఆయన పాదమునందే కరుణామృదుత్వ మున్నదని నాకేల విశ్వాసము కలిగినదో హేతుబద్ధముగా తెల్పఁజాలను. ఇది బుద్ధికతీతమయిన యేదో కారణము చేత నా మనస్సు శివపాదాసక్తమైనదని భావించెదను. అని ఈ శ్లోకమున వ్యంగ్యమగు భావము. తకార దకారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమును వసన్తతిలకా వృత్తనిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున బుద్ధికందని కవి శివపదాసక్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున బుద్ధికందని శివమాయ ప్రస్తావింపఁబడుచున్నది.

**శ్లో॥ మమ వచనమిదం గృహాణ సత్యం**
**దురధిగమోపనిషద్విచారతః కిమ్।**
**క్షితిభృతి రచయన్నితాన్తమాయాం**
**పరమశివో దృఢజిష్ణుబాహుబన్ధః॥ 28**

**ప్రతిపదార్థము :–** మమ = నాయొక్క, ఇదమ్ = ఈ, వచనమ్ = మాటను, సత్యమ్ = సత్యమునుగా, గృహాణ = స్వీకరింపుము, దురధిగమో పనిషద్విచారతః = తెలియని ఉపనిషత్తులయొక్క విచారము వలన, కిమ్ = ఏమి? (ప్రయోజనము), క్షితిభృతి = పర్వతమునందు, నితాన్తమాయామ్ = గొప్ప మాయను, రచయన్ = రచించుచు, పరమశివః = పరమశివుడు, దృఢజిష్ణుబాహుబన్ధః = దృఢములైన అర్జునునియొక్క బాహువుల యందు బంధము కలవాడైనాడు.

**తాత్పర్యము :–** నామాట సత్యమని గ్రహింపుడు. ఉపనిషత్తుల విచారమువలన నేమి ఫలము? (ఇంద్రకీలక నామకమైన) పర్వతమున మాయను రచించుచు అర్జునుని దృఢమైన





బాహుబన్ధమున చిక్కియున్నాడు.

**వివరణ :– ఈశ్వరానుగ్రహాదేవ పుంసామద్వైతవాసనా** (ఈశ్వరానుగ్రహము) వలననే శివుడు జీవులు అభిన్నులను జ్ఞాన అద్వైతవాసన కలుగును) అను సూక్తి ననుసరించి ఈశ్వరానుగ్రహము లేని వారెంత ఉపనిషద్విచార మొనరించినను వారికద్వైతసిద్ధి అను ప్రయోజనము లభించదు. అద్వైత వాసనకే ఈశ్వరానుగ్రహ మవసరము. మోక్షహేతువైన జీవైక్య చరమవృత్తి జ్ఞానమునకీశ్వరానుగ్రహము ఆవశ్యకమని వేఱుగా చెప్పనక్కఱలేదు. అసలు నేను బద్ధుడను అనుభావనమే మిథ్య. ముక్తికై కావలసిన ఈశ్వరానుగ్రహమునకై యత్నించుట మిథ్య. ముక్తుడననుకొనుట మిథ్య. ఇది యంతయు మిథ్య అని తెలియుట ఎట్లు? ఉపనిషద్విచార మొనరించినవారు జగమంతయు మిథ్యయని చెప్పుదురు. మిథ్యయైన జగము సత్యముగా కనిపించుట ఈశ్వరుని మాయ అని చెప్పుదురు. వారి మాట విశ్వసించనివారు ఉపనిషత్తులను స్వయముగా విచారించి జగమంతయు సత్యమే మిథ్యగాదని చెప్పిరి. పైగా అంతకుముందు ఉపనిషద్విచారము చేసి జీవబ్రహ్మైక్యమే సత్యమని, జగమంతయు మిథ్యయని సిద్ధాంతించిన ఉపనిషత్తాత్పర్యమును నిర్ణయించిన పూర్వులైన శంకరాచార్యానుయాయులు చెప్పినది తప్పు అని చెప్పిరి. స్వయముగా ఉపనిషద్విచారము చేసి ద్వైతము సత్యమో, అద్వైతము సత్యమో నిర్ణయించుటకు ఉపనిషద్విచార మొనరించితిని. కాని నాకు మాత్రము ఉపనిషత్తాత్పర్య మవగతము కాలేదు. అది నిష్ఫలమని తేలినది. ఇక ఏమి చేయవలెను? పురాణముల పరిశీలించితివి. వానిలో శివపురాణము మిక్కిలి ఆకర్షణీయముగా తోచగా దానిని కొంత లోతుగా అధ్యయనము చేసితిని. ముఖ్యముగా కిరాతార్జునీయ ఘట్టమును పరిశీలించితిని. అది ఇంద్రకీలాద్రి. అట అర్జునుడు భవిష్యద్యుద్ధమున కౌరవుల నోడించుటకు కావలసిన శస్త్రాస్త్రములకై శివునకై తపమొనరించు చుండెను. ఒక కిరాతుడు పందిని వేటాడుచు, వెంటాడుచు వచ్చెను. అది తన బాణమున నెత్తురోడుచుండెను. ఆ పందిపై మరొక బాణముండెను. అది నాది అన్న అర్జునునితో కిరాతుడు వివాద మొనరించెను. వివాదము ముదిరి కలహముగా పరిణమించెను. అర్జునుడు శస్త్రాస్త్రహీనుడై శివునితో మల్ల యుద్ధము నొనరించును శివుని తన బాహువున బంధించెను. పాపము శివుడే తనకు తాను కోరుకొని కిరాత వేషము వేసికొని మూకాసురుని పందిగా కల్పించుకొని బాణమేసిన అర్జునునితో కలహించి ఆతని బాహువులచే బంధింపఁబడెను. ఆ బన్ధింపఁబడుట అర్జునుని అనుగ్రహించుటకే అను కథ విచిత్రమనిపించెను. ఇది తత్త్వరహస్యమును విప్పుకథగా తోచెను. శివుడే స్వయముగా జీవుడుగా బన్ధింపఁబడెనని, ఇది యంతయు

ఆయన మాయతో నొనర్చెనని, వాస్తవమునకు ఆయనకు బన్ధమే లేదని ఆ కథయొక్క సార మవగత మయ్యెను. బంధింపఁబడనివాడే బన్ధింపఁబడుటయేమి? అది కేవలము మాయ అని తెలిసెను. ఆ మాయ ఎవరిదో? మాయతో శివుడితరుల బంధించెనా? (అర్జునుని బంధించెనా) లేదు. తానే బద్ధుడయ్యెను. ప్రభు సమ్మితమైన ఉపనిషత్తును విచారించినప్పుడు సిద్ధించని ప్రయోజన మీసుహృత్సమ్మిత పురాణ (కథా) పరిశీలనమున సిద్ధించినది. ఇది ఈ శ్లోకమున వ్యంగ్యమగు నర్థము. 2. క్షితి భృతి నితాంత బాహుబన్ధః అను పద బన్ధములలో వృత్త్యనుప్రాసాలంకారమున్నది. ఈ శ్లోకమున బేసి పాదములు జగతీచ్ఛన్దమునకు చెందిన న–న–ర–య అను గణముల కలిగియున్నది. త్రిష్టుప్ఛందము నకు చెందిన భద్రికా అను వృత్తమునకు చివఱ గురువు చేర్పఁబడినట్లున్నది. సరిపాదమున న–జ–జ–ర అను గుణములుగల జగతీచ్ఛన్దము నందలి మాలతి అను వృత్త పాదమునకు చివఱ గురువు చేర్పఁబడినట్లున్నది. ఇట్లు భిన్నచ్ఛన్దములతో శ్లోకము రచింపఁబడుట సంస్కృతభాషలో అరుదుగానే కానవచ్చును.

---

**అవతారిక :–** పై శ్లోకమున భక్తుని చేతులలో భగవానుని బన్ధము చెప్పఁబడినది. ఈ శ్లోకమున భక్తుడైన కవి భగవానుని (శఙ్కరు) భయఙ్కర దణ్డముగా భావించుట చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ మూర్ధరాజితతరైన్దవఖణ్డో – మర్దితాతతఘనాహితషణ్డః।**
**దైవతం హి యమశాసనచణ్డః – శఙ్కరో మమ కృతే యమదణ్డః॥ 29**

**ప్రతిపదార్థము :–** మూర్ధ రాజితతరైన్దవ ఖణ్డః = శిరమున మిక్కిలి ప్రకాశించు చన్ద్రఖణ్డము గల, మర్దితాతత ఘనాహితషణ్డః = మర్దింపఁబడిన విశాలమైన గొప్పవైన శత్రువుల గుంపుగల, యమ శాసన చణ్డః = యముని శాసించు కోపస్వభావముగల, శఙ్కరః =శఙ్కరుడు, దైవతం హి = దైవమే, మమ కృతే = నాకొఱకు, యమదణ్డః = యముని (చేతి) దణ్డము లేక యమములయొక్క శిక్షగలవాడు.

**తాత్పర్యము :–** శిరసున మిక్కిలి ప్రకాశించు చన్ద్రఖండముకల, విశాల ఘనశత్రు సమూహముల మర్దించిన యముని శిక్షించుటచే కోపస్వభావుడైన శఙ్కరుడు నా కొఱకు యమదణ్డమై యున్నాడు.

**వివరణ :–** పూర్వార్ధమున బహువార తకారవృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి యున్నది. మూడవ పాదమున యముని శాసించు కోపముగల అను అర్థమునిచ్చు విశేషణము శివునకు కూర్పఁబడినది. యముడు పుణ్యపాప విచక్షణ చేయునో లేదో



అను సంశయము కలుగునట్లు అందఱకు మరణము కలుగవలెనని శాసించుచున్నాడు. యముడు తన భక్తుడైన మార్కండేయుని ప్రాణముల గొనిపోవుటకు యత్నించినప్పుడు శివుడాతని శాసించెను. ఱొమ్ముపై తన్నినాడని కొందఱు చెప్పుదురు. ఏమైన నేమి? శివుని కోపము ఆ సందర్భమున బయటపడినది. ప్రలయ కాలమున జగమునంతయు యముడు సంహరించును. శివుడా యముని సంహరించునపుడు శివుని కోపము బయటపడినది. శివుడనుగ్రహించిన శక్తిచేతనే యముడు లోకమును సంహరించ గలిగినను అహంకారముచే తనకెదురు లేదని భావించి మార్కండేయుని ప్రాణముల తీయఁబోయిన సమయమున శివుని శరణు నొందుటను గమనింపలేదు. అందుచే శివుని కోపము బయటపడినది. యమున కద్భుత మృత్యువును కలిగించు శక్తినిచ్చుట చేత యముడు కోపించినట్లు కనబడినను, ఆ కోపము నిజముగా శివునిదే. యమ శాసనము శివ శాసనమే, కావున శివునిదే ఆ కోపము. ఆయనను తప్ప వేరొకరి నెట్లాశ్రయించెదను? అను అర్థము వ్యంగ్యము. నాల్గవ పాదమున శఙ్కరుడు నా కొఱకు యమదణ్డమని చెప్పఁబడినది. పేరు శఙ్కరుడు. చేయునది సంహారకృత్యము. అందఱను చంపునట్లే నన్నును చంపును. అమ్మో శివుడు నాపాలిట యమదణ్డము. అహింసా సత్యాస్తేయ బ్రహ్మచర్యా పరిగ్రహములైదు యమములు. శివుడు వానిని కఠోరముగా పాటించి తనను దండించుచున్నాడు. నాకేమో ఆ యమములనిన యమదణ్డము చూచినప్పుడు కలుగునంత భయము కలుగును. ఆ యమములు లేనిదే నిన్ననుగ్రహింపను, నీవే ఆ యమముల పాటించి నావలె నిన్ను నీవు దండించుకొనుము. అని నా యెదలో నుండి పోరుపెట్టుచున్నాడు. నిజముగా ఆ యమముల దండము నా పాలిట యమదణ్డమే. యమశబ్దము నియమసూచకము కూడా. నియమములలో తపస్సొకటి. స్వేచ్ఛాచారముల వడిన నాకు తపమొనరించుట యనగా యమదణ్డమే. తపమనగా ముఖ్యముగా ఉపవాసము. ప్రాణాయామమును అని రెండును ఆచరించుట అనగా నాకు చచ్చినంత పని అనగా యమదణ్డము. **మమ కృతే యమదణ్డః** అను పదములను "**మమకృతేఅయమ్అదణ్డః**" అని విభజించి మరొక విధముగా శివుడు లోకదృష్టిలో యమశాసనచణ్డుడైనను నాకొఱకు **అయమ్ శఙ్కరః అదణ్డః** = నాకొఱకు మాత్రము దణ్డహీనుడుగా కనఁబడుచున్నాడు. ఆయన నాయెడల పరమ ప్రేమ స్వరూపుడు. లోకమునకు యమదణ్డుడైనను నాకు శఙ్కరుడే అనగా సుఖమునే కలిగించువాడు అని శఙ్కర శబ్దమును మమకృతే అను పదములతో అన్వయించి అర్థము చెప్పవచ్చును. పరమ ప్రేమస్వరూపుడు కావున ఈశ్వరత్వమును పురస్కరించు నా

మరణశిక్ష కూడా కరుణప్రేరితమే. కష్టముల నొసగి శిక్షించుట కూడ పాపహీను నొనరించు నుద్దేశమున చేయు దయయే. కావున ఎల్లరను దణ్డించకపోవుట అను కరుణను చూపును. నాయెడ మాత్రము ఈ శఙ్కరత్వము అనగా సుఖమును కలుగఁ జేయు అను కరుణను చూపును. జనులొనర్చిన పూర్వ దుష్కర్మయే వారికి యమదణ్డము కలిగించును. కావున శివుడు అదణ్డ స్వరూపుడు. శఙ్కర స్వరూపుడును. ఇది యంతయు ఉత్తరార్ధవ్యంగ్యము. మొత్తము శ్లోకము నాలుగు పాదములలో పాదాన్తాను ప్రాసాలంకారముచే నలంకరింపబడినది. 2. యమ శాసన చణ్డుడైన శివుడు నా దైవతము కదా. ఆతని యందలి భక్తిచే అన్ని సుఖదుఃఖములందు సమత్వబుద్ధి లభించిన వాడనగుటచే యమదణ్డమును శఙ్కరమే అని శఙ్కర యమదణ్డః శబ్దములకు విశేషణ విశేష్యభావము కల్పించియు వ్యాఖ్యానించ వచ్చును. అపుడు మొదటి మూడు పాదములొక వాక్యముగా నాల్గవ పాదము విడిగా మరొక వాక్యముగా భావింపవలెను. హి అను అవ్యయము మొదటి మూడు పాదముల యొక్కయు చివఱి పాదము యొక్కయు హేతుహేతు మద్భావమును బోధించును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునియొక్క మూర్ధాలంకార చన్ద్రఖణ్డము చెప్పబడినది. ఈ శ్లోకమున శ్రోత్రాలంకార కుణ్డలి రాజు వర్ణింపఁబడుచున్నాడు.

**శ్లో॥ శ్రోత్రకుణ్డలితకుణ్డలీట్ఫణా – రత్ననూత్నరుచిగణ్డమణ్డలమ్।**
**సన్మతం సకలలోకనాయకం – సామ్బమూర్తిమనిశం భజామహే॥ 30**

**ప్రతిపదార్థము :–** శ్రోత్రకుణ్డలిత కుణ్డలీట్ఫణారత్న నూత్న రుచిగణ్డ మణ్డలమ్ = చెవుల కుండలముగా నున్న నాగరాజుల పడగలపైనున్న రత్నములచే నూత్నమైన కాంతి కలిగి గణ్డస్థలము కలిగిన, సన్మతమ్ = సత్పురుషులకిష్టుడైన, సకలలోక నాయకమ్ = సకల లోకములకు నాయకుడైన, సామ్బమూర్తిమ్ = సామ్బమూర్తిని, అనిశమ్ = ఎల్లప్పుడు, భజామహే = సేవించెదను.

**తాత్పర్యము :–** కర్ణకుండలముగా నున్న నాగరాజు పడగలపై రత్నములచే శివుని గణ్డస్థలములకు కొత్తశోభ కలిగినది. ఆయన సత్పురుషసమ్మతుడు. సకలలోక నాయకుడు. అట్టి సామ్బమూర్తి నెల్లప్పుడు సేవించెదము.

**వివరణ :–** కుణ్డలమనగా కర్ణాభరణము. శివుని కర్ణాభరణము నాగరాజు. కర్ణాభరణము గుండ్రముగా నుండును. నాగరాజు చుట్ట చుట్టుకొని యుండును. ఆయన చుట్టు కూడ గుండ్రముగా నుండుటచే కుణ్డలము అనఁబడును. కుణ్డలము కలవాడు కుణ్డలి. అట్టి





కుణ్డలి నామము సార్థకమైనది. అది గాక ఆతని పడగలపైనున్న రత్నములచే ఆయన గండ స్థలమునకు కొత్త శోభ ఏర్పడి కర్ణాభరణము నైనది. 'ణ్డ' కారావృత్తిచే పూర్వార్ధమున వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. సామ్బమూర్తి సత్పురుషుడు. ఆయన దుర్జనులకు సమ్మతుడు గాడు. కాని సత్పురుషులకు సమ్మతుడు. అటువంటి వాడు సకలలోక నాయకుడుగా నుండుట సకల లోకములకు క్షేమమే కదా! ఇది తృతీయ పాద వ్యంగ్యము. ఆయన (శివుడు) సామ్బమూర్తి. అమ్బా సహితమైన మూర్తి. అనగా శరీరము కలవాడు. అనగా అర్ధనారీశ్వరుడు. అమ్బ దయాస్వరూపిణి. ఆమె ప్రక్కన ఉండుట పిల్లలను బాగుకోరియు తండ్రియైన శివుడు దండింపఁజాలడు. కావుననే అపరాధులైన వారు సహితము నిర్భయముగా అమ్మ ప్రక్కన ఉన్న తండ్రి శివుని చేరి సేవింపవచ్చును. ఇది నాల్గవ పాదమున వ్యంగ్యమగు నర్థము. ప్రతిపాదమున ర–న–ల–గ అను గణములుండుటచే నీ శ్లోకము రథోద్ధతా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కర్ణమున నాగరాజు బన్ధనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ముని మనః కారాగారమున ఆతని బన్ధనము చెప్పఁబడినది.

**శ్లో॥ స్వేషాం దురన్తభవబన్ధనదుఃఖశాన్త్యై**
**సూక్ష్మే మనస్యతిదృఢమ్మునయో బబన్ధుః।**
**సర్వేశ్వరం దృఢశమాదిగుణైర్విచిత్రం**
**తత్తుల్యకష్టమపి సూక్ష్మతరస్య నాసీత్॥ 31**

**ప్రతిపదార్థము :–** స్వేషామ్ = తమయొక్క, దురన్త భవబన్ధన దుఃఖ శాన్త్యై = అంతమొందింపరాని సంసార బన్ధముయొక్క దుఃఖముయొక్క శాన్తికై, సర్వేశ్వరమ్ = సర్వేశ్వరుని, దృఢశమాది గుణైః = గట్టి శమాది గుణములను త్రాళ్ళచే, మునయః = మునులు, సూక్ష్మే = సూక్ష్మమైన, మనసి = మనసునందు, అతిదృఢమ్ = మిక్కిలి గొప్పగా, బబన్ధుః = బన్ధించినారు, తత్తుల్య కష్టమ్ అపి = దానితో సమానమైన కష్టముగూడ, సూక్ష్మతరస్య = మిక్కిలి సూక్ష్ముడైన వానికి (శివునకు), న ఆసీత్ = కలుగకుండెను.

**తాత్పర్యము :–** తమయొక్క తీవ్రమైన సంసార బన్ధనముయొక్క శాన్తికొఱకు మునులు మనసున బన్ధించినారు. అయినను అంతకంటెను మిక్కిలి సూక్ష్మముగా నుండుట శివునకు దానితో సమానమైన కష్టము కూడ కలుగకుండెను.

**వివరణ :–** శివుడు జీవులను పశువులను బంధించినట్లు సంసారమను కొయ్యను లేక సంసారమను కారాగారమున బన్ధించినాడు అని మునులు తమను బన్ధించిన దుఃఖమును పోగొట్టుకొనుటకై శమాది గుణములను త్రాళ్ళతో ప్రతీకారముగా శివుని బన్ధించిరి. శివుడు విశాలమైన కారాగారమున బన్ధింపగా శివునకు బన్ధవ దుఃఖమును కల్పింపగోరిన మునులు మిక్కిలి చిన్నదైన మనసున బన్ధించిరి. బన్ధన స్థానమంత చిన్నదైన బద్ధులకు అంత దుఃఖాతిశయము కలుగును. లావుగా నున్న వానిని ఇరుకు స్థలమున బన్ధించినచో నుక్కిరిబిక్కిరి యగును గదా!తేలుకుట్టిన నొప్పి కలుగును. తిరిగి తేలును చంపిన నొప్పి తగ్గుట కవకాశము లేకున్నను అపకారికి అపకారము తగినట్లుగా చేసినామను తృప్తి కలుగుటచే దుఃఖము తగ్గినట్లు అనిపించును. శివుడు సంసార బన్ధము కలిగించినాడు. ఆతనిని బన్ధించినచో మునుల బన్ధన దుఃఖమెట్లు పోవును? పోదు. పోకున్నను బన్ధించిన వానిని బన్ధించి పగతీర్చుకొన్నామను తృప్తిచే దుఃఖము తగ్గినట్లనిపించును. ఇట్లాలోచించి మునులు శివుని బన్ధించ దలచిరి. త్రాళ్లెచట నున్నవి? బన్ధించుటకు త్రాళ్ళు కావలెగదా! వెదుకగా తమలో శమాది గుణములున్నవని గమనించి వాని తోడనే శివుని బన్ధించిరి. గుణశబ్దము శ్లేషతో సద్గుణములను (శమాదులను) త్రాళ్ళను గూడ బోధించును. కావున బన్ధనమువలన బన్ధన దుఃఖము శమించుట విరూపకార్యోత్పత్తి రూప విషమాలంకార విశేషముతో నీశ్లేషము సంశ్లేషించినది. ప్రతిపాదమున త–భ–జ–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము వసంతతిలకా వృత్తనిబన్ధనము. 2. ఈశ్వరుడు దాసుని బంధించుట లోక సిద్ధము. కాని ఈ శ్లోకమున సర్వేశ్వరుని దాసులైన మునులు బన్ధించుట విరుద్ధహేతువు వలన కార్యోత్పత్తి యను విభావనాలంకార విశేష మేర్పడియున్నది. గట్టి త్రాళ్ళతో గట్టిగా బంధించుటను దృఢశబ్దము అతిదృఢమ్ అను శబ్దము చెప్పుచున్నవి. మనస్సణు పరిమాణమని చెప్పు తార్కికుల మతముననుసరించి మనస్సుకు సూక్ష్మ విశేషణము కూర్చుట ఉచితముగా నున్నది. '**అణోరణీయాన్**' అను శ్రుతి ననుసరించి అణువైన మనస్సునకంటె సర్వేశ్వరుడు అణుతరుడు. కావున ఆయనను సూక్ష్మతరుడని నాల్గవ పాదమున చెప్పుట సముచితముగా నున్నది. సూక్ష్మతరుని సూక్ష్మమున బంధించినప్పుడుక్కిరి బిక్కిరి యగుటకవశాకముండదు గదా! బన్ధింపఁబడిన వాడు బన్ధించిన వానిచే విడువఁ బడినప్పుడు మరొక చోట కేగుటకవకాశము కలదు. శివుడింతకు ముందు స్వేచ్ఛగానుండి మునుల మనస్సులోనికి వచ్చెడివాడు కాదు. మునులు, ప్రవర్తించి వేటకాడు వలత్రాళ్ళతో సింహము (పంచాస్యము)ను బంధించినట్లు, శమాది గుణములతో సర్వేశ్వరుని బంధించి



యుంచుట వలన సర్వేశ్వరుడయ్యును వారి మనస్సుల నుండి పారిపోవు యత్నమును చేయలేదు. ఎందుచేత అనగా ఆ త్రాళ్ళు గట్టివి అను దృఢ అను విశేషణముచే వ్యంగ్యమగు అర్థము. శివుడు మునుల సంసారమున బంధించి యున్నప్పుడు మునులకు కష్టము కలిగినది. శివుడితరుల బన్ధించ కుండవలెనన్న ఆతనికి బన్ధనకష్టము తెలియవలెననియే తమను బంధించిన దాని కన్న దృఢముగా శివుని ఇరుకైన సూక్ష్మమైన మనసున బంధించిరి. శివునకిప్పుడు బన్ధన కష్టము తెలిసి ఇకముందు మనను కాని ఇతరులను బన్ధింపడు. అలవాటు చొప్పున బన్ధించు యత్నమును శివుడొనర్చినప్పుడు తనకింతకు ముందు మునులు బంధించినప్పుడు కష్టము కలిగినది గాన వీని బంధించినచో వీరికి కష్టము కలుగునని బంధించుటకు పూనుకొనడని భావించియే మునులు బంధించిరి. కాని మునులకు కలిగిన కష్టముతో సమానమైన కష్టమును శివుడనుభవింపలేదు. ఎక్కువగ కష్టము కలిగించవలెనను మునుల కోరిక తీరలేదు. ఇరుకైన తమ మనసున బంధించినను శివుడు సూక్ష్మతముడగుట వలన సమాన కష్టమే యాతనికి కలుగునప్పుడు అధిక కష్టము కలిగించవలెనను మునుల కోరిక ఎట్లు తీరును? శమాది (షడ్) గుణసమ్పత్తి సాధన చతుష్టయమున ముఖ్యమైనది. మునులు దానిని సంపాదించిన పిమ్మట శివుని మనసున బంధించి మిగిలిన సాధన త్రయమున శివునితో నైక్యము పొందగోరిరను అంశము '**శమాదిగుణైః**' అను పదము వ్యంగ్యమగును. బద్ధులు బన్ధకుని బన్ధించి తమ బన్ధముయొక్క దుఃఖము నుపశమింపఁ జేసికొను తలపు వచ్చుటయే చిత్రము. అసమ్భవమైన ఆ పనిని చేయ గలుగుట మరింత విచిత్రము. ఇది విచిత్ర పదముచే వ్యంగ్యము నర్థము. '**ఆసీత్**' అను భూతకాల క్రియచేత మునులు శివునిచే బంధింపఁబడిన తాము శివుని బన్ధించినప్పటికి భూతకాలము సూచింపఁబడుటచే ఇప్పుడు శివభేదజ్ఞానమున బన్ధవిముక్తులైనారని వ్యంగ్యమగును.

---

**అవతారిక :–** పై శ్లోకమున మునుల నీశ్వరుడు బన్ధించినప్పటి కష్టము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ కష్టము దేహసంబన్ధియే అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యోగీశ్వరః కోఽపి దిగమ్బరస్సన్ – జటాధరస్సర్వవిదస్తి శైలే।**
**తద్దర్శనే చేతనశక్తిరస్తి – నివృత్తిమేవైష్యతి దేహకష్టమ్॥ 32**

**ప్రతిపదార్థము :–** దిగమ్బరః = గుడ్డలు లేనివాడై (దిక్కులే వస్త్రములుగా గలవాడై), జటాధరః = జడల ధరించినవాడై, సర్వవిత్ = సర్వజ్ఞుడయిన, కోఽపి = ఒకానొక, యోగీశ్వరః = యోగీశ్వరుడు, శైలే = పర్వతమున, అస్తి = ఉన్నాడు, తద్దర్శనే = ఆ

వానియొక్క దర్శనమునందు, తవ = నీకు, శక్తిః = సామర్థ్యము, అస్తిచేత్ = ఉన్నచో, దేహకష్టమ్ = దేహకష్టము, నివృత్తిమ్ = సమాప్తిని, ఏష్యతి ఏవ = తప్పకపొందును. (పొందియే తీరును)

**తాత్పర్యము :–** జడల ధరించి, గుడ్డలు వీడి సర్వజ్ఞుడైన ఎవడో ఒక యోగి కొండపై నున్నాడు. వానిని చూడ గల్గినచో నీ దేహకష్టము తప్పక తొలగును.

**వివరణ :–** యోగులు కొందరు జటాధారులుగా నుందురు .సాధారణ జనులట్లు జడలు ధరింపరు. గావున వారిని ప్రత్యేక దృష్టితో జనులు దర్శింప యత్నించెదరు. జడలతో పాటు కొందఱు దిగంబరులై యుందురు. దేహాభిమానము వీడినవారు కావున ఈ జనము తమను చీదరించుకొందురేమో యను భావము వారికుండదు. సాధారణముగా అట్టి యోగులు అడవులలోనే తిరుగుచు ఆకులలములతో పొట్టబోసు కొనుచుందురు. క్వాచిత్కముగా గ్రామీణుల పౌరుల భాగ్యములు ఫలించినప్పుడు గ్రామములకో, నగరములకో వత్తురు. చాలామంది వారిని వింతగా చూచుటయే గాక అంతగా పట్టించుకోరు. గ్రహాది బాధలు కలవారు వానిని తొలగించుటకు వారేమైనా ఉపాయము చెప్పుదురేమో యని వారి నాశ్రయించెదరు. వారిలో కొందఱు అట్టి బాధితుల మోసగించి ధనకనకాదుల సంపాదించుట కొఱకే అట్టి కుహనావేషము ధరించి గ్రామ నగరాలలో సంచరించు చుందురు. అట్టివారు (ఆత్మ) జ్ఞానహీనులగుటచే సంసారుల దుఃఖమునే మాత్రము తొలగించలేరు కదా. పై పెచ్చు వారి కష్టముల మరింత పెంపొందించు చుందురు. వారిలో (యోగులలో) కొందరట్లుగాక సర్వజ్ఞులైన మానవాకారమున తిరుగు ఈశ్వరుని జంగము రూపములుగా నుందురు. అట్టివారిని గూర్చి అదృష్టముపండినవారు ఏ కొండపైననో చూచి గ్రామీణులకో పౌరులకో చెప్పినప్పుడు వారిని దర్శింప వారు యత్నించియు దర్శింపలేక పోవుదురు. ఇంతకు ముందే చూచినామని వీరు చెప్పెదరు. అంతలోనే మాయమై పోయినారేమో అని భావింపదగి యుందురు. అట్టి వారు యోగీశ్వరులలో గొప్పవారు అనుట యోగీశ్వర శబ్దమునకు మరొక యర్థము. కాని ఈశ్వరుడే యోగియై భూలోకమున తిరుగువాడు యోగీశ్వరుడు. యోగీశ్వర శబ్దమును కర్మధారయ సమాసముగా భావించుటయే ఉచితముగా నుండును. శివుడు రూప రహితుడైనను పైన చెప్పఁబడిన జటాధరత్వాదులు గల రూపము ధరించి కైలాసమున నుండునట. ఆతని నెవ్వరు చూచినారు? చూచినామని ఎవ్వరు చెప్పినారు? అక్కడకు పోయిన వారు తిరిగి భూలోకమునకు రానేరారు గదా! ఎవరైన అట్లు వచ్చి చెప్పినారా? లేక తాము చూచిన ఏ కొండనో కైలాసము అందున్న యోగీశ్వరుని చూచి చెప్పినవారును





చచ్చిరేమో కాని ఆతనివలన విన్నవారికెవరికైన ఆతని చూడగల సామర్థ్యమున్నదా? ఉన్నచో మంచిదే. అట్టి యోగి వేషధారియైన యోగీశ్వరుని చూచినచో పునర్జన్మ ముండదు. భావి కాలమున దేహకష్టముండ జాలదు. ఈ జన్మమునకు దర్శనము తరువాత కాలము జీవన్ముక్తా స్థితియే. కావున శరీరమున్నను తత్కృత కష్టము మాత్రముండదు. అని ఈ శ్లోకము తద్దర్శన మాత్రమున దేహకష్టము ఏకాంతముగా (తప్పక) నివర్తించునని చెప్పుచున్నది. 2. ఇతరులకు కనఁబడవలెనని లేక ఎక్కువ దూరమందున్న క్రిందివారిని చూచుటకు కొండెక్కుట లోకసిద్ధము. అట్టి యుద్దేశముతో శివుడు కొండపై నివసించు చున్నాడో లేదో కాని భూలోకమందలి కొండపైనను ఆ యోగీశ్వరుడు అన్వేషింపఁ బడియు కానవచ్చుట లేదు. బహుశః ఆ కొండయొక్క ఏదో గుహలో దాగియున్నను కొండపై దాగి యున్నాడను ప్రసిద్ధి పోకున్నను ఆతడు మాత్రము కానరాకున్నాడు. శైలశబ్దము నిరుప పదముగా ప్రయోగింపఁబడినప్పుడు చుట్టుపట్ల నున్న ప్రదేశముల వారికి శ్రీశైలము అను అర్థమే స్ఫురించును. కావున ఈ పద్యమున శైల శబ్దము శ్రీశైలమును బోధింపవచ్చును. అది యీ నాటికి యోగీశ్వరులకు నివాసముగా నున్నట్లు ప్రసిద్ధియున్నది. మల్లికార్జున లింగమందుగాని శ్రీశైల మందలి ఇతర ప్రాంతములందో గుహలందో అట్టి యోగీశ్వరులను దర్శించినచో మన దేహకష్టము తీరును. **శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ న విద్యతే** అనుసూక్తి ప్రకారము కైలాసమునకేగి అనగా సాలోక్యముక్తి నొంది అచట శివుని జూచు శక్తి మనకు కలదేని విదేహముక్తి అనగా శరీరములేని కైవల్యముక్తిని పొంది దేహకష్టము పూర్తిగా తొలగిపోయినట్లే. 'దిగమ్బరస్సన్' జటాధరస్సర్వ విదస్తి అను పదబన్ధములందును సకారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకారము ఏర్పడియున్నది. ఈ శ్లోకమున బేసి పాదములు తతజగగ అను గణములుగల ఇంద్రవజ్రా లక్షణము గలవై, సరిపాదములు జ–త–జ–గ–గ అను ఉపేన్ద్ర వజ్రాలక్షణము గలవై ఉండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనమై ఉన్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున యోగీశ్వరుడైన శివుని దర్శనమునకై ఏ శైలమునకో పోయి యత్నింపుమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున అట్లు తీర్థ భూతులైన యోగీశ్వరుల దర్శనమునకై దుర్గమమైన ఇంద్రకీలశైలమందలి అర్జునుని తపోవనమునకు మాత్రము పోవలదని తీర్థ యాత్రికులు హెచ్చరింపఁబడుచున్నారు.

**శ్లో॥ న యాత హే తీర్థచరాః! కదాచిత్ – తపోవనం దుర్గమమర్జునస్య।**
**మాయాకిరాతః ఖలు తత్ర కశ్చిద్ – దృష్టస్తనుచ్ఛేదమరం కరోతి॥ 33**

**ప్రతిపదార్థము :–** హే తీర్థచరాః = ఓ తీర్థయాత్రికులారా!, దుర్గమమ్ = పోరాని, అర్జునస్య = అర్జునునియొక్క, తపోవనమ్ = తపోవనమును గూర్చి, కదాచిత్ = ఎల్లప్పుడును, న యాత = పోకుడు, తత్ర = అచట, కశ్చిత్ = ఒకానొక, మాయాకిరాతః = మాయా కిరాతకుడు, దృష్టఃచేత్ = కనఁబడెనని, తనుచ్ఛేదమ్ = శరీర ఖండనమును, అరమ్ = శీఘ్రముగా, కరోతి ఖలు = చేయునుగదా!

**తాత్పర్యము :–** ఓ తీర్థయాత్రికులారా! ఎల్లప్పుడును పోరాని అర్జునుని తపోవనమునకు పోకుడు. అచట ఒకవేళ మాయాకిరాతకుడు కనఁబడెనేని శీఘ్రముగ తప్పక మీ శరీరములను ముక్కలు ముక్కలు చేయును.

**వివరణ :–** ఒకప్పుడు అర్జునుడు తపమొనరించిన వనము నేటికిని ఇంద్రకీలాద్రి యందున్నది. యాత్రికులిప్పుడు అర్జునుడు లేడని యెఱిగియు అతని తపముచే మరియు శివుని సాక్షాత్కారముచే పవిత్రమైన ఆ వనమునకు పోగోరుట సహజము. కాని ఆ తపోవనమెంత పవిత్రమైన దనగా కొందఱు తీర్థయాత్రికులక్కడ కెట్లో చేరుకుని అక్కడ మాయాకిరాతదర్శనమును హఠాత్తుగా పొంది ఆ పుణ్యముచే కైలాసమునకే పోవుటచే తిరిగివారు తమ గృహములకు మరలిరాలేదు.ఈ వృత్తాంతము నెఱిగిన కవి యాత్రికులను ఆ తపోవనమునకు పోరాదని హెచ్చరించుచున్నాడు. ఇది ఈ శ్లోకము యొక్క వాచార్థ్య వివరణము. వ్యంగ్యార్థమేమనగా యాత్రికులారా! ఏ క్షేత్రమునకు పోయినను పోకున్నను అర్జునుని తపోవనమునకు తప్పక పోగలరు. అచట మీకు మాయాకిరాతకుడైన శివుని దర్శనముచే మోక్షమే లభించును. పునర్జన్మము ఉండదు. ఈ శరీరము ఎక్కువ కాలము కష్టములను పొందవలసి యుండదు. శివదర్శనము కలిగెనేని వెంటనే మీ రాతనిలో నైక్యము పొందెదరు. ఇది ఈ శ్లోకమున వ్యంగ్యార్థము. వాచ్యార్థ్యము నిషేధము కాగా వ్యంగ్యార్థము విధియై యున్నది. ఇటువంటి సందర్భము నొకదానిని ఆనందవర్ధనుడు ధ్వనికావ్యమున నుదాహరించినాడు. అస్తు. ఈ శ్లోకమున తకారావృత్తిచే వృత్త్యను ప్రాసాలంకారమేర్పడి యున్నది. శివుడు మాయాకిరాత వేషమున తన భక్తుడైన అర్జునునితో మల్లయుద్ధ వ్యాజమున ఆతని తనుస్పర్శ వలన కలిగిన ఆనందముతో ఆ అర్జునుడిప్పుడు లేకున్నను ఆ ప్రదేశముల సంచరించుచు తన తీయని జ్ఞాపకముల నెమరు వేసికొనుచుండును. ఆనాడర్జునునితో తలపడిన నేలను తాకి అచటి మట్టి తన శరీరమునకు భూతిని వలె పూసికొనును. అర్జునుడనిన అంత ప్రీతి అను అర్థము వ్యంగ్యమగుచున్నది. ఈ శ్లోకమున పూర్వార్ధమున నుపేన్ద్రవజ్రా పాదములు,ఉత్తరార్ధమున ఇంద్రవజ్రాపాదములు నుండుటచే నీ శ్లోక ముపజాతిచ్ఛందో నిబన్ధనమైయున్నది.



**అవతారిక :–** పై శ్లోకమున తీర్థయాత్రికులు అర్జునుని తపోవనగమనము నిషేధింపఁ బడినది. ఈ శ్లోకమున ఆయన ఏ కొండయైనను శివుడుండు నవకాశము కలదు కావున ప్రయత్నింప వచ్చునని సంభావనము చేయఁబడుచున్నది.

**శ్లో॥ కైలాసభూమిభృతి మన్దరశైలమూర్ధ్ని – స్యాద్గన్ధమాదనగిరౌ హిమవత్తటీషు।**
**వేదేషు వేదశిఖరేషు చ దైవతమ్మే – గౌర్యర్ధదక్షిణతనౌ నిజభక్తచిత్తే॥ 34**

**ప్రతిపదార్థము :–** కైలాసభూమిభృతి = కైలాస పర్వతమున, మన్దర శైలమూర్ధ్ని = మందరగిరి శిఖరమున, గన్ధమాదనగిరౌ = గన్ధమాదన పర్వతమున, హిమవత్తటీషు = హిమవత్పర్వత సానువులందు, వేదేషు = వేదములందు, వేదశిఖరేషు = ఉపనిషత్తుల యందు, గౌర్యర్ధ దక్షిణతనౌ = గౌరియున్న శరీరపుకుడి భాగము శరీరమున, నిజభక్త చిత్తే = తన భక్తుని మనమున, మే = నాయొక్క, దైవతమ్ = దైవతము, స్యాత్ = ఉండును.

**తాత్పర్యము :–** కైలాస మందర గన్ధ మాదన గిరులలోని యే గిరియందో హిమవత్పర్వత సానువులందో వేదములందో ఉపనిషత్తులందో తన భక్తుల చిత్తమునందో నా దైవతము ఉండును.

**వివరణ :–** శివునకు గిరిశ అను నామమున్నది. గిరియందు శయనించి యుండువాడని ఆ పదమున కర్థము. అది ఏ గిరియో, కైలాసమో, మందరమో, గన్ధమాదనమో, ఏదని చెప్పగలము? ఆ కొండలరాయుడెప్పుడే కొండ యందుండునో? హిమవత్పర్వత సానువులందు విహరించు చుండునేమో? వేదములఁజదివిన వారికి ఆతడు సాక్షాత్కరించునని ఆ వేదముల చివఱలైన వేదాన్తములందు అనగా ఉపనిషత్తులందు తాత్పర్యము విచారించిన ఆతడే ఆ తాత్పర్యమని పెద్దలు చెప్పెదరు. గౌరిని సాక్షాత్కరించు కొనిన ఆమె కుడివైపున నుండును గదా! అని కొందఱు శాక్తేయులు చెప్పెదరు. ఈ అన్వేషణమేల? తన భక్తుల చిత్తములందుండడా? నేను భక్తుడనే గదా! నా చిత్తమందేల యుండడు? అని విచారించి తన మనసులో వెదికిన దొఱికిపోవును. ఇది శ్లోకార్థ వివరణము. త–భ–జ–జ–గ అను గణములు ప్రతిపాదము నందుండుటచే నీ శ్లోకము వసన్తతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున ఒకే శరీరమున గౌరికి కుడి భాగమున నుండువాడు శివుడని గౌరీశంకరుల సంగతి చెప్పఁబడినది. ఈ శ్లోకమున కాళీగిరీశుల సంగతి గంగాయమునా సంగతి వంటిదని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ గిరీశకాల్యోశ్చ సితాసితాభ - శరీరయోస్సజ్గతిరర్థయోర్మే॥**
**స్వాన్తేఽస్తు గజ్గాయమునాతటిన్యో - ర్యా సజ్గతిర్వేతి విరాజమానా॥ 35**

**ప్రతిపదార్థము :-** యా = ఏది, గజ్గాయమునా తటిన్యోః = గజ్గాయమునా నదులయొక్క, సజ్గతిర్వా = సంగతియా, ఇతి = యన్నట్లు, విరాజమానా = ప్రకాశించుచున్నదో, మే = నాయొక్క, అర్థయోః = ప్రయోజనములైన, (లేక తపోవర్గ చతుర్థముగా భావించి అక్షరములందు అనియు చెప్పవచ్చును). సా = ఆ, సితాసితాభ శరీరయోః = తెల్లని నల్లని కాంతులుగల శరీరములుగల, గిరీశకాల్యోః = శివపార్వతులయొక్క, సజ్గతిః = కలయిక, మే = నాయొక్క, స్వాన్తే = చిత్తమున, అస్తు = కలుగుగాక!

**తాత్పర్యము :-** గంగా యమునల వలె తెల్లని నల్లని కాంతులుగల శరీరములుగల పురుషార్థ స్వరూపులైన శివపార్వతులు నా చిత్తమున కలసి యుందురు గాక!

**వివరణ :-** పార్వతీపరమేశ్వరులు సత్యజ్ఞానానందఘనవిగ్రహము. తెల్లని నల్లని కాంతులు గల శరీరము మాంసాస్థిరక్తాది భౌతిక (భౌమ) ధాతు మయములు కావు. ఆనందమే సర్వజీవపురుషార్థము. ఆనందము నర్థించని వారెవరును ఈ లోకములలో నుండరు. కావుననే ఆనందము పరమ పురుషార్థముగా చెప్పబడినది. ధర్మాది పురుషార్థములు తత్సాధనత్వేన అర్థనీయములగుటచే పురుషార్థములని పిలువఁబడుచున్నవి. అవి సాక్షాత్పురుషార్థములు గావు. పార్వతీపరమేశ్వరులే నా అర్థములు. అనగా పురుషార్థములు. తత్ప్రాప్తియే నా చరమ ప్రయోజనము. శివుడు తెల్లని శరీరము కలవాడు. దాని తెల్లని కాంతి గంగ వంటిది. ఆతని భార్య కాళి. ఆ పేరే ఆమె నల్లనిదని చెప్పును. కావున ఆమె శరీరకాంతి నల్లనిది. కావున అది యమున వంటిది.పగలు తెల్లనిది. రాత్రి నల్లనిది. ఆ రెంటి సంధ్య ఎఱ్ఱనిది. నా అజ్ఞాన రాత్రియొక్క జ్ఞాన దినముయొక్క సంధ్యవంటి తెల్లని నల్లని శివపార్వతుల శరీరముల కాంతుల సంగతి నా చిత్తమున ఉషఃకాలారుణిమను లేక ప్రాతస్సంధ్యారుణిమను లేక సూర్యునకు సారథియైన అనూరుడైన అరుణుని అరుణకాంతి నింపును. ఆ అరుణకాంతి రాబోవు జ్ఞాన భాస్కరుని రాక అవశ్యంభావియను తెలుపు నిద్రాంతపు తొలి సంకేతము. తెలుపు నలుపులు విలీనమైన వాని భేదము తొలగిన పార్వతీ పరమేశ్వరైక్య సంకేతము. పార్వతి ప్రకృతి స్వరూపిణి. సర్వజీవ ప్రతినిధి. ఆమె శివునితోడి యైక్యము. సర్వజీవుల శివునితోడి యైక్యము. 2. గంగా యమునలు ప్రయాగ క్షేత్రమున కలిసిపోవును. అంతకుముందు నల్లనిదైన యమున గంగతో కలిసి తన ప్రత్యేకతను భిన్నతను కోల్పోయి గంగైక్యము నొందును. రాబోవు జ్ఞానముల శ్వేతకాన్తితో రాత్రి లీనమై తన ఉనికిని కోల్పోవును. గుహలోని చీకటి





కాంతి ప్రవేశించిన పిమ్మట ఎక్కడకు పోయినది? కాంతిలోనే కలిసిపోయినది. అట్లే రాత్రియును దానికి భాస్కరోదయమే అవధి. ఈ జ్ఞాన భాస్కరుడు అనంతుడు. కావున అతనిలోని లీనమైన నల్లని కాంతి ఇక ఎన్నడును మరల బ్రతికి బట్టకట్టదు. పగటి తరువాత ఎఱ్ఱని ఎఱ్ఱని సాయంసంధ్య ఆ తరువాత మరల రాత్రి వచ్చునట్లు ఈ జ్ఞానభాస్కరునికి అంతము అనునది లేకపోవుట తదంతము తరువాతి అజ్ఞాన రాత్రి ఆగమనము అసంభవములు. కావున పార్వతీ పరమేశ్వరుల ఆ ఎఱ్ఱని ప్రాతస్సన్ధ్యా కాలిక సమావేశము చరమవృత్తి స్వరూపము అహమే అను పార్వతియొక్క బ్రహ్మ అను శివునియొక్క అసంగతి రాత్ర్యంత ప్రాంత సంధ్య రూపము తదంతమున ఆ ఎఱుపు తరువాత ఇక తెలుపే. జ్ఞానమే జ్ఞానము. అజ్ఞానము నశించిన దను కథ కూడ మిగలదు. గంగా యమున సంగమ దేశము ప్రయాగ. అది తీర్థరాజము. శరీరము భ్రూమధ్యమే ప్రయాగము. అట ప్రాణవాయువు నావేశింపఁజేసి ఉచ్ఛ్వాస నిఃశ్వాసముల యైక్యమును యోగులు కలిగించుకొందురు. ఉచ్ఛ్వాసము శివుడు నిఃశ్వాసము పార్వతి తదైక్యము భ్రూమధ్యమున నేర్పడును. అప్పుడచట తెఱచుకొన్న మూడవకన్ను ఎఱ్ఱనిది. అది సన్ధ్యాదీపత్వమునంది సహస్రారము వఱకు కాంతిని వ్యాపింపఁజేసి సాధకుని ప్రయాణించు మార్గమును కాంతి మంతము నొనరించును. సహస్రారము చేరుకొన్న పిదప వెలుగే వెలుగు. జ్ఞానమే జ్ఞానము. ఇట్లు సితాసితప్రభా సంయోగము ఎఱ్ఱని జ్ఞాననేత్ర స్థానమైన భ్రూమధ్యమున కలుగును. పై శివపార్వతుల సంగతి గంగా యమున సంగతి వంటిదను **ఉపమాలంకార** మీ శ్లోకమున **వా** శబ్దముచే వాచ్యమై యున్నది. ఒకవేళ వా శబ్దము ఇవార్థకము అనగా సాదృశ్యవాచకము. ఒకవేళ **వా** శబ్దము సంభావనార్థకమని భావించిన ఈ శ్లోకమున **ఉత్ప్రేక్షాలంకార**మని చెప్పవలెను. **వా** శబ్దమును పాదపూరాణముగా భావించి ఇతి శబ్దమునర్థవంతమని భావించిన **ఆపహ్నవాలంకార** మేర్పడునని చెప్పవలెను.

---

**అవతారిక :-** పై శ్లోకము పార్వతీపరమేశ్వర సంగతి నదీద్వయ సంగతియని చెప్పఁబడినది. ఈ శ్లోకము శివ శరీరము నదీత్రయ సజ్గతిగా చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కర్పూరపూరప్రభమిన్ద్రనీల - వినీలకణ్ఠం వపురీశ్వరస్య॥**
**సువర్ణసజ్కాశజటాప్రయోగీ -నదీత్రయీసజ్గతిభాసి నోఽవ్యాత్॥ 36**

**ప్రతిపదార్థము :-** కర్పూర పూరప్రభమ్ = కప్పురపు రాశివంటి కాంతి కలిగిన, ఇంద్రనీల వినీల కంఠమ్ = ఇంద్రనీల మణివంటి నల్లని కంఠము కలిగిన, సువర్ణసంకాశజటా

ప్రయోగీ = బంగరు జడల రచన గలదైన, ఈశ్వరస్య వపుః = శివుని శరీరము, నదీ త్రయీ సఙ్గతి భాసి = మూడు నదుల కలయికతో ప్రకాశించునట్టివై, నః = మనలను, అవ్యాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :–** కర్పూరపు రాశి వంటి శివుని తెల్లని శరీరము ఇంద్రనీలమణివంటి నల్లని కంఠముతో కూడినదై శిరమున బంగరు జడల రచనగలదై మూడు నదుల సంగమముతో నొప్పినదై మనల కాపాడుగాక!

**వివరణ :–** కర్పూర రాశివలె శివుని శరీరము తెల్లనిది. ఆతని కణ్ఠము ఇంద్రనీల మణివలె నీలము అని చెప్పుట పూర్వార్ధమున రెండుపమాలంకారము లేర్పడియున్నవి. మూడవపాదమున శివుని జడలు సువర్ణ సంకాశములని చెప్పఁబడుటచే లుప్తోపమాలంకార మేర్పడియున్నది. సమాన ధర్మమైన ఎఱుపు రంగు చెప్పఁ బడకపోవుటచే ఈ ఉపమాలంకారము ధర్మలుప్తోపమాలంకారమైనది. బంగారము పసుపుపచ్చనిదైనను కాచిన బంగారము అను అర్థము సువర్ణ శబ్దమునకు గ్రహించుట ఉచితము. శివుని జడల రంగు ఎఱ్ఱనిదిగా ప్రసిద్ధము. పసుపు పచ్చరంగు జడలది అని అంగీకరించి సాధారణ మైన బంగారము రంగు గలవా జడలు అని చెప్పినను ఇబ్బంది లేదు. శివుని శరీరము మూడునదుల కలయిక అని మూడు రంగుల కలయిక కారణముగా రూపింపఁబడుటచే మొత్తము శ్లోకమునందు రూపకాలంకారమేర్పడి యున్నది. నదీశబ్ద స్త్రీలింగ స్వారస్యమున నదీనాయికా త్రయసంగమ స్ఫూర్తితో సమానోక్త్యలంకారమేర్పడి యున్నది. దానికి పై మూడు పాదములలోని మూడు ఉపమాలంకారములు అంగములై ఉన్నవి. కర్పూర పూర, ఇన్ద్రనీల వినీల అను పదబన్ధములలో యమకాలంకారమేర్పడి యున్నది. మొదటి పాదమున ఇన్ద్రవజ్రా లక్షణము మిగిలిన మూడు పాదములలో ఉపేన్ద్రవజ్రా లక్షణము ఉండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనమై యున్నది. 2. ప్రయాగ త్రివేణీ సంగమ స్థానము. అట గంగాయమునాసరస్వతులు కలియును. అది మిక్కిలి పవిత్ర క్షేత్రము. సాధారణముగా నదీ ద్వయ సంగమమే పవిత్రము. ప్రయాగ యందు మూడునదుల సంగమముచే మరింత పవిత్రత ఏర్పడి యున్నది. అక్కడి నదులలో గంగ తెల్లనిది. యమున నల్లనిది. గొప్పనదియైన సరస్వతియు తెల్లనిదే. కాని ఇట శివుని శరీరమందలి మూడు నదుల సంగమము మూడు రంగుల కలయికచే ప్రయాగ సంగమము కంటెను ఎక్కువ దర్శనీయమై ఉండును. ఎఱ్ఱని నది శోణ అను పేరుగల నది యొకటి యున్నది. తెల్లని గంగ నల్లని యమున ఆ యెఱ్ఱని నదితో కలిసి శివుని భ్రూమధ్యము వర్ణత్రయోజ్జ్వల



యైనది. శ్రీ శంకరు లమ్మవారి మూడు నేత్రముల కలయికతో కూడిన భ్రూమధ్యమునిట్లే సౌందర్యలహరిలో వర్ణించి యున్నారు.

---

**అవతారిక :–** పై శ్లోకమున నదీ నాయికా త్రయ సంగమము శివుని యందు చెప్పఁ బడినది. ఈ శ్లోకమున స్వాధీనపతిక (నాయికా భేదము) యైన గౌరీ దేవి సమక్షమున శివుని నర్తనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ రత్నసింహాసనే స్వాం నివేశ్య ప్రియాం**
**భూషణైర్భూషితాం తాం భవానీం పురః।**
**కామముద్యన్ముఖశ్రీః ప్రదోషోత్సవే**
**సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 37**

**ప్రతిపదార్థము :–** రత్నసింహాసనే = రత్నసింహాసనమున, భూషణైః = సొమ్ములచేత, భూషితామ్ = అలంకరింపబడిన, స్వామ్ = తనయొక్క, ప్రియామ్ = ప్రియురాలైన, తామ్ = ఆ, భవానీమ్ = భవానిని, సన్నివేశ్య = బాగుగా కూర్చొనజేసి, పురః = ఎదుట, కామమ్ = మిక్కిలి, ఉద్యన్ముఖశ్రీః = ఉదయించు ముఖకాంతిగల, శ్రీభవానీపతిః = శఙ్కరుడు, ప్రదోషోత్సవే = ప్రదోష సంతోష సమయమున, స్వయమ్ = స్వయముగ, కామమ్ = స్వేచ్ఛగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** ప్రియురాలైన పార్వతిని సొమ్ములతో నలంకరించి ఆమె ముందు ప్రదోషోత్సవ కాలమున ప్రకాశించు ముఖకాంతి గలవాడై శివుడు స్వయముగా బాగుగా స్వేచ్ఛగా నర్తించెను.

**వివరణ :–** దాసీజనమున్నను ప్రేమగల భర్త ప్రియురాలిని స్వయముగా నలంకరించి ఆనందించును. అందుకు పార్వతీదేవి శివునికొంగున ముడివేసికొని ఎట్లాడించిన అట్లు ఆడు వానినిగా జేసి కొన్న శృంగార నాయికా విశేషమైన స్వాధీనపతిక. భర్తను తన అధీనమున నుంచుకొన్న నాయిక స్వాధీనపతిక అనబడును. ఈమె ఎనుమండుగురు శృంగార నాయికలలో చేరిన నాయిక సాధారణముగా పురుషుల సంతోషమునకై స్త్రీలు ఆడుట మన మెఱుగుదుము. అట్లు ఆడు వారగుటచే వారికా పేరు సార్థకమేమో? నృత్యగానాది కళానైపుణ్యము స్త్రీపురుషోభయ సాధారణమే అయినను రాజాదులను రంజింపజేయుటకు ఆడువారే అధికముగా నాట్యమొనర్చుచుందురు. పురుషాధిక్య సమాజమున ఆడువారికట్లు ఆడుట తప్పదేమో? అది అట్లుండుగాక. ఇచటి కథవేరు.

శివుడు స్వయముగా పార్వతీదేవి నలంకరించి రత్నసింహాసనమున కూర్చోబెట్టి ఆమెను రంజింపజేయుటకు శివుడే స్వయముగా ప్రదోష సమయమున ఆనంద తాండవ మొనర్చినాడు. సంననర్త అను క్రియలోని 'సమ్' అను ఉపసర్గ శివుని నాట్యము ఆనంద తాండవ మని స్ఫురింపజేయుచున్నది. 2. భవానీపతిః అనగా భవానికి పతి. అనగా స్వామి. పతి శబ్దము స్వామ్యర్థకము. పైగా శివుడు శ్రీ భవానీ పతియట. శ్రీ అను విశేషణము కూడ భవానికి కూర్పఁబడినది. శివునకిప్పటిశ్రీ (ఐశ్వర్యము) అంతయు భవానీదేవి వలన వచ్చినదని శ్రీ భవానీపతి శబ్దము వ్యంజించును. పైగా పతి శబ్దము అమ్మవారి యెడ దాసునివలె ఉన్నాడని వ్యతిరేక లక్షణ ద్వారమున వ్యంజించును. ప్రభువును సింహాసన మందు కూర్చొనబెట్టినకదా భృత్యులు తద్వినోదమునకై నాట్యాది క్రియల నొనరించెదరు. భర్తచేతనే ఊడిగము చేయించుకొన్ననేమి! అది నాలుగు గోడల లోపలి విషయము. ప్రపంచ దృష్టిలో ఆ శివుడు భవానీ పతి కాదని ఎవరనగలరు? పైగా స్త్రీ పురుష సామ్యభావనమే సాజానంద దాయకము. అబలలైన వారిచే అధికశ్రమ చేయించుట, చేయుచున్నప్పుడు పేక్షవహించి పురుషులు ఆ కార్యములలో చేదోడు వాదోడుగా నుండకపోవుట ఒకవిధమైన పారుష్యమే (కాఠిన్యమే.) ప్రేమ సేవచేయగోరునే గాని చేయించుగొన గోరదు. తప్పని సరియైనప్పుడు ఒకరి కొకప్పుడు సేవ చేయవచ్చును. మరొకప్పుడు మరొకరు సేవ చేయవచ్చును. పరస్పరమైన ఆశ్రియ సహకారమే యగును. అట్టి దాంపత్యమున సామ్యమే తాండవించును. ఉచ్ఛనీచ భావమునకు తావులేని అద్వైతస్థితికాదర్శముగా నుండు దాంపత్యమే భవానీ శఙ్కర దామ్పత్యము. ఈ బాహ్యలక్షణ మా ఆదిదమ్పతుల ఆధ్యాత్మికైక్యమును వ్యంజించును. దానికి నీరాజనము పట్టుట మన పని. 3. శివుడట్లు తాండవము చేయునప్పుడు ఆనందమును ఉద్యన్ముఖ శ్రీశబ్దము స్పష్టమొనరించినది. అమ్మవారు తన నృత్యమును చూచి మైమఱచి ఆనందించు చున్నదను భావమే శివుని ఆ ముఖము నందలి ఉద్యచ్ఛ్రీత్వ హేతువు. 4. లయకారకుడైన శివునకు ప్రదోషకాలమే మిక్కిలి ఇష్టమైన కాలము. ప్రదోష శబ్దము ఎక్కువ చీకటి, గొప్ప చీకటి అనునర్థము లనిచ్చును. చీకటిలో అన్ని వస్తువులు లీనమై ఉండును. జాగ్రత్స్వప్నముల నిద్ర ఆనంద స్వరూపమని, కాలమనిద్రాకాలము అనియు చీకటి కాలము వంటిది నిద్ర కాకపోయినచో లౌకిక సుఖములలోని గొప్పనైన సంభోగసుఖమును నిద్రకై వదులుకొనుట జరుగదు. సర్వము ఇంతకుముందు తనకు భిన్నముగా దూరముగా నున్నట్లు అనిపించి ఈ లయకాలమున తనను చేరినందున తనది తాను పొందుట వలన లేక తనను తాను పొందుట వలన కలిగిన ఆనందమేమో? అది అందుకే





ప్రదోష (నిద్రా) సమయమున మేల్కొనియున్న స్వానందము **ఏష సుప్తేషు జాగర్తి** అని ఉపనిషద్వచనము. ప్రతి పాదమున నాలుగు 'ర' గణములుండుటచే నీ శ్లోకము స్రగ్విణీ వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని సమ్యఙ్నర్తనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని రాస(నృత్యము) చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ తాపసాన్తాపసాన్నన్తరా దేవతా – దేవతా దేవతాశ్చాన్తరా తాపసాః।**
**ఏవమాదృత్య వాగీశ్వరాదిస్థితౌ – సంననర్త స్వయం శ్రీ భవానీపతిః॥ 38**

**ప్రతిపదార్థము :–** తాపసాన్ తాపసాన్ అన్తరా = తాపసులకు తాపసులకు మధ్య దేవతాః = దేవతలు, దేవతాదేవతాః+చ+అన్తరా = దేవతలకు దేవతలకున్ను మధ్య, తాపసాః = తాపసులు, ఏవమ్ = ఇట్లు, ఆదృత్య = ఆదరించి, వాగీశ్వరాదిస్థితౌ = బ్రహ్మాదులయొక్క ఉనికియందు, శ్రీ భవానీపతిః = శ్రీ భవానీపతి, స్వయమ్ = స్వయముగా, సంనన్తర = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** తాపసుల నడుమ దేవతలు, దేవతల నడుమ తాపసులు ఇట్లు ఆదరించి బ్రహ్మాదులతో తాపసులతో స్వయముగా శివుడు నర్తించెను.

**వివరణ :–** మణ్డలాకారముగా స్త్రీలు పురుషులు భిన్నభిన్న వర్గములు వారు చేయు నృత్యమునకు రాసమని పేరు. అంగనకు అంగనకు నడుమ మాధవుడు మాధవునకు మాధవునకు నడుమ అంగన, ఇట్టి రాసము శ్రీ కృష్ణ కర్ణామృతము వర్ణించినది. ఈ శ్లోకమునందు శివనాయకమైన తాపసులకు, తాపసులకు మధ్య దేవతలను, దేవతలకు మధ్య తాపసుల నిలిపి చేయబడిన శివనాయకమైన రాస నృత్యము వర్ణింపబడుచున్నది. బ్రహ్మాది దేవతలు తాపాసకారము ధరించిన శివుని కుడి ఎడమ ప్రక్కల నిలబడి నృత్యము చేసిరనుట ఈ శ్లోకముయొక్క సారము లేక శివుడు కొలువులోని బ్రహ్మాది దేవతలు తాపసుల పరవశముగా నర్తించిరనియు చెప్పవచ్చును. ఈ శ్లోకమును స్రగ్విణీవృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున బ్రహ్మాది దేవతాతాపసుల (ప్రధానముగ పాదములు ఉపయోగింపబడు) నర్తనము వర్ణింపబడినది. ఈ శ్లోకమున శివుని పాదములు సన్నిధి గుజ్జువేల్పైన గజముఖుడు నర్తించినప్పు డాతని కుమ్భస్పర్శచే స్తమ్భము కలిగిన శివుని పాదముల విక్షేపము చెప్పబడుచున్నది.

**శ్లో॥ కుమ్భికుమ్భాహతిస్తమ్భసమ్భావిత - శ్రీమదంఘ్రిద్వయీవిక్రమీ విక్రమీ।**
**భక్తిసక్తావలీభుక్తిముక్తిప్రదః - సంననర్త స్వయం శ్రీ భవానీపతిః॥ 39**

**ప్రతిపదార్థము :-** కుమ్భి కుమ్భాహతి స్తమ్భ సమ్భావిత శ్రీ మదంఘ్రిద్వయీ విక్రమీ = గజకుమ్భముల ఆహతిచే కలిగిన స్తమ్భముచే గౌరవింపబడిన కాంతిమంతములైన పాదద్వయము యొక్క విశేష విక్షేపముగల, విక్రమీ = పరాక్రమముగల, భక్తి సక్తావలీ భుక్తి ముక్తి ప్రదః = భక్తి యందాసక్తిగల వారి గుంపునకు భుక్తిముక్తులు నొసగు, శ్రీ భవానీ పతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :-** గజశీర్షునిచే కుమ్భముల ఆహతిచే కలిగిన స్తమ్భముచే గౌరవింపబడిన కాంతిమంతములైన పాదద్వయముయొక్క విక్షేపముగల పరాక్రమవంతుడైన, భక్తుల గుంపులకు భుక్తిముక్తుల నొసగు శివుడు స్వయముగా బాగుగా నర్తించెను.

**వివరణ :-** 1. శివుడు నర్తించుచుండగా గజముఖుడు శివుని పాదములకు పితృపాద స్పర్శచే తన శిరమునందలి కుంభములను గట్టిగా తాకించుచుండెను. శివుని పాదములా కుమ్భముల స్పర్శసుఖముచే స్తమ్భించినట్లు కొంచెము సేపు నిశ్చలత వహించిన పిదప మరల నవి నాట్యానుకూల న్యాసము కలవైనవి. ఇది పూర్వార్ధ వ్యంగ్యము. 2. భక్తులకు భుక్తి ముక్తుల నొసగు శివుని నర్తనమీకించిత్కాల విఘ్నము తోడను బాగుగనే యుండెను. ప్రథమ పాదమున మ్భావృత్తితే వృత్త్యనుప్రాసము, ద్వితీయపాదము విక్రమీపదామ్రేడనముచే యమకము, మూడవ పాదమున, క్తావృత్తిచే వృత్త్యనుప్రాసము నేర్పడి యున్నది. ఈ శ్లోకమును స్రగ్విణీ వృత్తనిబన్ధనమే.

---

**అవతారిక :-** పై శ్లోకమున గజముఖుని కుమ్భ స్పర్శచే స్తంభము (విఘ్నము) కలిగి మరల విజృంభించి శివుని నర్తనము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆకాశము నంటిన మందాకినీ బిన్దుసంచారి నృత్యము చెప్పబడుచున్నది.

**శ్లో॥ త్వఙ్గదుత్తుఙ్గరఙ్గద్వరాఙ్గోద్ధతా - మన్దమన్దాకినీబిన్దుభిర్వ్యాప్య ఖమ్।**
**చారువిన్దత్సుసంస్ఫారతారాకృతిః - సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 40**

**ప్రతిపదార్థము :-** త్వఙ్గత్ = కదులుచున్న, ఉత్తుంగ = మిక్కిలి ఎత్తైన, రఙ్గత్ = ప్రకాశించు, వర = శ్రేష్ఠమైన, అఙ్గ = అవయవములే, ఉద్ధత = పైకి కొట్టబడిన, అమన్ద = లావైన, మన్దాకినీ బిన్దుభిః = ఆకాశగంగా బిన్దువులచే, ఖమ్ = ఆకాశము, వ్యాప్య = వ్యాపించి, చారువిన్దత్సు సంస్ఫారతారాకృతిః = అందముగా పొందుచున్న



మిక్కిలి విశాలములైన చుక్కల ఆకృతిగల, శ్రీ భవానీపతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :-** శివుని తలపై మన్దాకిని ఎత్తైన తరంగముల నాట్యాంగముగా శివుడు తలనెగురవైచినపుడు ఆ మన్దాకినీ జలబిన్దువు లాకాశమున వ్యాపించి పెద్దపెద్ద నక్షత్రముల (చుక్కల) ఆకారమును పొందునంత బాగుగా శివుడు నర్తించెను.

**వివరణ :-** పూర్వార్ధమున ఙ్గావృత్తిచే మూడవపాదమున రేఫావృత్తిచే వృత్త్యను ప్రాసాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమును స్రగ్విణీ వృత్తనిబన్ధనమే.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివనర్తన సమయమున శిరోజాలమన్దాకినీ బిన్దువులు ఆకాశమున నక్షత్రాకారము ధరించుట చెప్పబడినది. ఈ శ్లోకమున అవి కల్పవృక్ష పుష్పాకృతి వహించినవని చెప్పబడుచున్నది.

**శ్లో॥ దేవముక్తాగతం కల్పపుష్పజం - ద్రాక్సవర్ణం సమాలిఙ్గితుమ్మస్తకాత్।**
**ఉత్పతత్యాదరాద్గాఙ్గబిన్దూత్కరే - సంననర్త స్వయం శ్రీ భవానీపతిః॥ 41**

**ప్రతిపదార్థము :-**దేవ ముక్తాగతమ్ = దేవతలచే విడువబడి వచ్చిన, సవర్ణమ్ = సమాన వర్ణముగల, కల్పపుష్పజమ్ = కల్పవృక్ష పుష్పహారమును, ద్రాక్ = శీఘ్రముగా, సమాలిఙ్గితుమ్ = కౌగలించుకొనుట కొఱకు, మస్తకాత్ = శిరము నుండి, గాఙ్గబిన్దూత్కరే = గఙ్గకు సంబంధించిన బిన్దువుల సమూహము, ఆదరాత్ = ఆదరమువలన, ఉత్పతతి = పైకెగురుచుండగా, శ్రీ భవానీపతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :-** శివుడు నర్తించుచుండగా దేవతలు కల్పవృక్షమాలను శివునిపై విడచిరి. అది క్రిందకు వచ్చుచుండగా అది తమతో సమానరంగు కలిగియున్నదను ఆదరమున శివుని తలపై నున్న గఙ్గాజలబిన్దు సమూహము పైకెగురునట్లు శివుడు బాగుగా స్వయముగా నర్తించెను.

**వివరణ :-** నాట్యమున తల పైకెగురవేసినపుడు శివుని శిరసుపై నున్న గఙ్గా జల బిన్దువులు పైకెగిరినవి. ఆ ఎగురుట సమానవర్ణముగల దేవతలు విడిచిన కల్పవృక్ష పుష్పమాలను ఆదరమున కాకపోయినను కౌగలించుకొనుట కొఱకు కాకపోయినను అందుకొఱకని సంభావింపబడుటచే నీ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారమేర్పడి యున్నది. గంగాజల బిన్దువులు పైకెగురుటకు కల్పవృక్ష పుష్పమాల యందలి ఆదరమువలవ

గాదు, అనగా ఆదరము హేతువుగాదు. కాకపోయినను ఆదరము హేతువుగా సంభావింపబడి నందున హేతూత్ప్రేక్ష అని లేక ఈ గంగా జలబిన్దువుల ఎగురుటకు కల్పవృక్ష పుష్పమాలాలింగనము ఫలము గాక పోయినను ఫలముగా సంభావింప బడినందున ఫలోత్ప్రేక్షగా గానిపై ఉత్ప్రేక్షను విశేషింపవచ్చును. ఈ శ్లోకమును స్రగ్విణీవృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున కల్పవృక్ష హారము దేవముక్తమైనట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున అమ్మవారిచే నీలోత్పల మాల వంటి తన చూపులమాల శివుని వక్షఃస్థలమున అర్పితమైనట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ అచ్ఛవక్షఃస్థలాలమ్బినీలోత్పల – స్రక్షు దృక్షూత్పలాక్ష్యా మహీభృద్భువా।**
**అర్పితాస్వేవమానన్ద్య వృత్తోత్సవే – సంననర్త స్వయం శ్రీ భవానీపతిః॥42**

**ప్రతిపదార్థము :–** అచ్ఛ వక్షః స్థలాలమ్బి నీలోత్పల స్రక్షు = స్వచ్ఛమైన వక్షఃస్థలము నవలమ్బించు నీలోత్పల హారములైన, దృక్షు = చూపులు, ఉత్పలాక్ష్యాః = కలువల వంటి కన్నులుగల, మహీభృద్భువా = పార్వతీదేవిచేత, వృత్తోత్సవే = గడచిన ఉత్సవమునందు, ఏవమ్ = ఇట్లు, ఆనన్ద్య = అభినందించి, అర్పితాసు = అర్పితములు కాగా, శ్రీ భవానీపతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** స్వచ్ఛమైన శివుని వక్షఃస్థలమునందలి నీలోత్పలమాలలైన చూపులు కలువలవంటి కన్నులు గల పార్వతీదేవి చేత జరిగిన ఉత్సవమునందు అభినందించి అర్పింపబడునంత గొప్పగా శివుడు స్వయముగా గొప్పగా నర్తించెను.

**వివరణ :–** శివుడు ప్రదోషోత్సవమున నర్తించుచుండెను. పార్వతీదేవి ఆ నాట్యము నభినందించుచు చూచిన చూపులు శివుని తెల్లని వక్షఃస్థలమున నీలోత్పల మాలలుగ అర్పింపబడినవి. చూపులు నీలోత్పలమాలలుగా సంభావింపబడుటచే నీ శ్లోకమున (గమ్య) ఉత్ప్రేక్షాలంకార మేర్పడియున్నది. "స్రక్షు దృక్షూత్పలాక్ష్యా" అను పదబన్ధమున వృత్త్యనుప్రాసాలంకార మున్నది. ఈ శ్లోకమును స్రగ్విణీ వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున పార్వతీదేవి శివనర్తనము నభినందించుట చెప్పబడినది. ఈ శ్లోకమున ఆమె చెలికత్తెలైన సరస్వత్యాదుల అభినందనాభివందనాత్మక స్తుతులను శివుడు వినుట చెప్పబడుచున్నది.



**శ్లో॥ ఏకతో భారతీముఖ్యదేవీస్తుతీ – రన్యతో భారతీః శబ్దభేదాకృతీః।**
**సర్వతో భారతీః కామమాకర్ణయన్– సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥43**

**ప్రతిపదార్థము :–** ఏకతః = ఒకవైపునుండి, భారతీముఖ్య దేవీస్తుతీః =సరస్వతీదేవి మొదలగు దేవస్త్రీల స్తుతులను, అన్యతః = మరొకవైపునుండి, శబ్దభేదాకృతీః = శబ్దముల విశేషములే ఆకారములుగాగల, భారతీః = భాషలను, సర్వతః = అన్నివైపుల నుండి, భారతీః = వాక్కులను, కామమ్ = స్వేచ్ఛగా, ఆకర్ణయన్ = వినుచు, శ్రీ భవానీపతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** ఒకవైపు నుండి సరస్వతీ దేవ్యాది దేవతాస్త్రీల స్తోత్రములను మరొకవైపు నుండి శబ్ద భేదముల ఆకృతులుగల వివిధ భాషలను, అన్ని వైపులనుండి అన్ని విధములైన వాక్కులను స్వేచ్ఛగా వినుచు శ్రీ భవానీపతి స్వయముగా బాగుగా నర్తించెను.

**వివరణ :–** దేవతాస్త్రీలు దేవభాష సంస్కృత భాషలో రచించి గానము చేయుచున్న స్తుతులను, మరొకవైపునుండి దేవేతర జాతులైన మనుష్య రాక్షసాది జాతులితర లోకముల నుండి వివిధ శబ్దముల నుండి వేరు వేరు ఆకారములు దర్శించిన, వివిధ భాషలను శివుడు వినుచున్నాడు. వినుటకు వీలైనది వాక్కే. కావున మూడవ పాదమున భారతీః ఆకర్ణయన్ అని ఉండుటచేత పూర్వార్ధములోని మొదటిపాదమున చెప్పబడిన భారతులు కూడ భాషలే ఏవియైనను శబ్ద భేదాకృతులే. అట్టి భారతులను వినుచు ఆ భారతుల గానములలోని భావరాగ తాళలయానుగుణముగా శివుడు స్వేచ్ఛగా నర్తించినాడు. ఈ శ్లోకమున భారతీ ముఖ్యదేవీ స్తుతీః శబ్ద భేదాకృతీః అను వానిలో పాదాన్తానుప్రాస మున్నది. భారతీశబ్దము భిన్నార్థముల ద్విరుక్తమైనందున యమకమున్నది. ఈ శ్లోకమును స్రగ్విణీవృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమువ నాట్య సమయమున వినుచున్న భారతులు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున ఆ సమయమున శివుడు ధరించిన భాసములు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ చఞ్చలాభాసితా కాఞ్చనాఞ్చద్రుచా**
**చఞ్చలాభాసితా వ్యోమయాతా జటాః।**
**చఞ్చలాభాసితావేవ భాసీ దధత్**
**సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 44**

**ప్రతిపదార్థము :–** కాఞ్చనాఞ్చద్రుచా = బంగరుయొక్క పూజించబడుచున్న కాంతి, చఞ్చలాభాసితా = లక్ష్మీదేవిచే ప్రకాశింపజేయబడినది, వ్యోమయాతాః = ఆకాశమును

పొందిన, జటాః = జడలు, చఞ్చలాభాసితౌ = మెరుపు (తీగ)లచేత ప్రకాశింపజేయ బడినవి. చఞ్చలా భాసితా = చఞ్చలచే ప్రకాశింపజేయబడిన, భాసీఏవ = కాంతులచే, దధత్ = ధరించుచు, శ్రీ భవానీపతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** బంగరుయొక్క పూజింపదగిన కాంతి (లక్ష్మీదేవి) చేత ఆకాశము చేరిన జడలు మెరుపుల చేత ప్రకాశింపఁజేయబడినవి. ఇట్లు చఞ్చలా భాసితములైన రెండు కాంతులను ధరించు శివుడు స్వయముగా బాగుగా నర్తించెను.

**వివరణ :–** విష్ణువు కాఞ్చనోత్తరీయుడు. ఆయన వక్షఃస్థలమున లక్ష్మీదేవి చంచల అయ్యును స్థిరముగా నుండును. స్థిరముగా నున్నను లక్ష్మీదేవికి వచ్చిన చఞ్చల అను అప్రతిష్ఠ పోలేదు. శివునకు కాఞ్చనోత్తరీయము లేదు. ఆయనకు వ్యాఘ్ర చర్మోత్తరీయమున్నది. నాట్య సమయమున అటు ఇటు కదలు చుండుటచే శివుని శరీరమందలి బంగరు కాంతి (లక్ష్మి) చఞ్చలగానే భాసించినది. నాట్యాంగముగా శివుడు తలను పై కెగురవేసినప్పుడు శివుని జటలు ఆకాశమునంటినవి. మేఘావృతమైన నీలాకాశమునందలి మెఱుపు తీగలచేత శివుని జడలు ప్రకాశింపజేయబడినందున ఆ జడలు చఞ్చలా భాసితములైనవి. ఇట్లు శరీర జడల కాంతులు రెండును చఞ్చలా భాసితములు. ఆ రెండు చఞ్చలా భాసితములైన కాంతులు ధరించుచు శివుడు స్వయముగా బాగుగా నర్తించెను. చఞ్చలా శబ్దము ద్విరుక్తమగుటచే నీ శ్లోకమున యమకాలంకార మేర్పడినది. ఈ శ్లోకమును స్రగ్విణీ వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కాంతి ధారణము చెప్పబడినది. ఈ శ్లోకమున వివిధ నాట్య శబ్దముల ఉచ్చారణము చెప్పబడుచున్నది.

**శ్లో॥ తక్కతోధిక్కతోతౌతథాతైతథై – తోఝ్గదద్మాఝ్గధిన్నర్తశబ్దాన్ముహుః।**
**ఉచ్చరన్ హాసవిన్యాసచఞ్చన్ముఖం –సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥45**

**ప్రతిపదార్థము :–** తక్కతో ధిక్కతో తౌతథాతై తథైతోఝ్గ దద్మాఝ్గధిన్నర్తశబ్దాన్ = తక్కతాది నర్తన శబ్దములను, ముహుః = మాటి మాటికీ, ఉచ్చరన్ = ఉచ్చరించుచు, హాసవిన్యాస చఞ్చన్ముఖమ్ = నవ్వును పులుముటచే ప్రకాశించుచున్న ముఖము కలుగునట్లుగా, శ్రీ భవానీపతిః = శివుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** తక్కతాది నాట్యశబ్దముల నుచ్చరించుచు నవ్వును ముఖమున విన్యసించి శివుడు బాగుగా నర్తించెను.





**వివరణ :–** తక్కతాది శబ్దములు నాట్యసమయమున ఇతరుల చేతగాని స్వయముగా నర్తకుని చేతగాని ఉచ్చరింపబడుచుండుట ప్రసిద్ధము. అట్లే నవ్వుల కూడ ఇచట నాట్య విన్యాసమే. ఈ శ్లోకమును స్రగ్విణీ వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున లయ విన్యాసము చెప్పబడినది. ఈ శ్లోకమున రాగ విన్యాసము చెప్పబడుచున్నది.

**శ్లో॥ మూర్ఛనాభిర్గిరాం దేవతాయాం సమీ –**
**కృత్య తన్త్రీ ర్నఖైర్వల్లకీం చ శ్రుతీః।**
**సాధు సప్తస్వరాన్ వాదయన్త్యాముదా –**
**సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 46**

**ప్రతిపదార్థము :–** గిరాం దేవతాయాం = సరస్వతీదేవి, మూర్ఛనాభిః = మూర్ఛనలతో, నఖైః = గోళ్ళతో, వల్లకీమ్ = వీణను, సమీకృత్య = సమీకరించి, శ్రుతీఃచ = శ్రుతులను కూడ, సాధు = చక్కగా, సప్త = ఏడు, స్వరాన్ = స్వరములను, ముదా = సంతోషముతో, వాదయన్త్యామ్ = వాదించుచుండగా, శ్రీభవానీపతిః = శఙ్కరుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–** సరస్వతి మూర్ఛనలతో గోళ్ళతో వీణను సమీకరించి శ్రుతులను సప్తస్వరాలను చక్కగా వాయించుచుండగా శ్రీభవానీపతి చక్కగా స్వయముగా నర్తించెను.

**వివరణ :–** సంగీత శాస్త్ర ప్రసిద్ధములైనవి శ్రుతులు స్వరములు మూర్ఛనలు. సరస్వతీదేవి తదనుగుణముగా గోళ్ళతో వీణను మీటుచు సంతోషముగా వాయించుచుండగా శివుడు స్వయముగా బాగుగా నర్తించెను. షడ్జము (స), ఋషభము(రి), గాన్ధారము(గ), మధ్యమము (మ), పఞ్చమము (ప),ధైవతము (ద), నిషాదము (ని), అనునవి సప్త స్వరములు. ప్రథమ శ్రవణమువలన వినబడు హ్రస్వశబ్దము శ్రుతి. దాని అను రణనములు స్వరములు. శ్రుతులసంఖ్య ఇరువది రెండు. షడ్జ మధ్యమ పంచమములలో నొక్కొక్క దానికి సంబంధించిన శ్రుతులు నాలుగేసి నిషాదగాంధారములలో నొక్కొక్క దానికి సంబంధించిన శ్రుతులు రెండేసి ఋషభ దైవతములు నొక్కొక్క దానికి సంబంధించిన శ్రుతులు మూడేసి మొత్తము 22 శ్రుతులు. విడివిడిగా

| | |
|---|---|
| షడ్జమ సంబంధులు | ఆఱు |
| మధ్యమ సంబంధులు | ఆఱు |
| పంచమ సంబంధులు | ఆఱు |

| | |
|---|---|
| నిషాద సంబంధులు | రెండు |
| గాంధార సంబంధులు | రెండు |
| ధైవత సంబంధులు | మూడు |
| ఋషభ సంబంధులు | మూడు |

స్వరములు ఆరోహణావరోహణములు (రెండు) కలిసి మూర్ఛన. మూర్ఛనలు ఏడు. గాంధార గ్రామస్థ మూర్ఛనలు ఏడు. మొత్తము మూర్ఛనలు ఇరవై ఒకటి.

---

**అవతారిక :–** శివుని వీణానుగుణనర్తనము చెప్పబడినది. ఈ శ్లోకమున వేణ్వనుగుణ నర్తనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ శుమ్భదారమ్భగమ్భీరసమ్భావనా**
**గుమ్భనోజ్జృమ్భణో జమ్భదమ్భాపహే।**
**లమ్భయత్యుత్కటం వేణునాదామృతం**
**సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 47**

**ప్రతిపదార్థము :–** శుమ్భదారమ్భ గమ్భీర సమ్భావనా గుమ్భనోజ్జృమ్భణః = ప్రకాశించు ఆరమ్భము కల గమ్భీరమైన మంచి భావనయొక్క గుమ్భనముచే విజృంభించు, శ్రీ భవానీ పతిః = శఙ్కరుడు, జమ్భదమ్భాపహే = జమ్భు (రాక్షసు)ని గర్వమును నశింపజేసిన వాడు (ఇంద్రుడు), వేణునాదామృతమ్ = వేణునాదమను అమృతమును, ఉత్కటమ్ = ఎక్కువగా, లమ్భయతి = ప్రాపింపజేయు చుండగా, స్వయమ్ = స్వయముగా, సంననర్త = బాగుగా నర్తించెను.

**తాత్పర్యము :–**శివుని నాట్యారమ్భము ప్రకాశించునట్టిది. గమ్భీరములై మంచి భావనముల సమూహముల జృంభింపజేయు శ్రీ భవానీపతి ఇంద్రుడు వేణునాదామృతమును (అక్కడి వారికందఱకు) అందజేయుచుండగా స్వయముగా చక్కగా నర్తించెను.

**వివరణ :–** రెండున్నర పాదములలో మ్భావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమును స్రగ్విణీ వృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున వేణునాదానుగుణ శివునియొక్క నర్తనము చెప్పబడినది. ఈ శ్లోకమున గానానుగుణనర్తనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ సమ్భృతోత్కణ్ఠితాకుణ్ఠకణ్ఠస్వర –**
**శ్రీరమాభామినీస్ఫీతగీతామృతమ్।**



**విశ్రుతప్రక్రమం సుశ్రుతిభ్యాం పిబన్**
**సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 48**

**ప్రతిపదార్థము:–** విశ్రుతప్రక్రమమ్= ప్రసిద్ధమైన ఆరమ్భముగల, సమ్భృతోత్కణ్ఠితాకుణ్ఠస్వర శ్రీరమా భామినీ స్ఫీత గీతామృతమ్ = సంపాదింపబడిన ఎత్తిన గొంతుగల మొక్కవోని కణ్ఠ స్వరముగల శ్రీ లక్ష్మీరమణియొక్క చక్కనైన పాట అను అమృతమును, సుశ్రుతిభ్యామ్ = చక్కని చెవులతో, పిబన్ = త్రాగుచు, శ్రీభవానీపతిః = శివుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = చక్కగా నర్తించెను.

**తాత్పర్యము :–** గొంతెత్తి చక్కని కణ్ఠ స్వరముతో శ్రీ లక్ష్మీదేవి పాడుచున్న గీతామృతమును తన చక్కని చెవులతో వినుచు శ్రీ శివుడు స్వయముగా చక్కగా నర్తించెను.

**వివరణ :–** ఉత్కణ్ఠితా కుణ్ఠకణ్ఠ స్వర శ్రీరమాభామినీ స్ఫీతగీతామృతమ్, విశ్రుతప్రక్రమం సుశ్రుతిభ్యామ్ అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకృతములై యున్నవి. ఈ శ్లోకమును స్రగ్విణీవృత్త నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున లక్ష్మీదేవి గానానుగుణమైన శివునియొక్క నర్తనము చెప్పబడియున్నది. ఈ శ్లోకమున శివుని మృదఙ్గానుగుణమైన నర్తనము చెప్పబడు చున్నది.

**శ్లో॥ దర్శయత్యాదరాద్వాదనే నైపుణీం – సన్మృదఙ్గస్య గోవిన్దమార్దఙ్గికే।**
**తాలభేదం సహోదాహరత్యబ్జజే – స్సంననర్త స్వయం శ్రీభవానీపతిః॥ 49**

**ప్రతిపదార్థము :–** గోవిన్ద మార్దఙ్గికే = విష్ణువు అను మార్దఙ్గికుడు, సన్మృదఙ్గస్య = మంచి మృదఙ్గముయొక్క, వాదనే = వాదనమునందు, నైపుణీమ్ = నైపుణ్యమును, ఆదరాత్ =ఆదరమువలన, దర్శయతి = చూపుచుండగా, సహ = కూడ, అబ్జజేః = బ్రహ్మ, తాలభేదమ్ = తాళముల భేదమును, ఉదాహరతి = ఉదాహరించుచుండగా, శ్రీ భవానీపతిః = శివుడు, స్వయమ్ = స్వయముగా, సంననర్త = చక్కగా నర్తించెను.

**తాత్పర్యము :–** విష్ణువు ఆదరమున తన మృదఙ్గ వాదన నైపుణ్యమును ప్రదర్శించు చుండగా బ్రహ్మ తాల భేదముల నుదాహరించుచుండగా శివుడు స్వయముగా చక్కగా నర్తించెను.

**వివరణ :–** ఈ శ్లోకమున దకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. మృదఙ్గ వాదనము వృత్తిగా గలిగి దానియందు నైపుణ్యము కలవాడు మార్దఙ్గికుడనబడును. లయ ప్రధాన వాద్యము మృదఙ్గము. నర్తనము ముఖ్యముగా తద్భేదమైన నాట్యము

(తాణ్డవము). నర్తక ప్రధానము కావున నాట్యము రక్తి మృదఙ్గముపై నాధారపడి యుండునని తెనిసిన విష్ణువు ఆదరమున మృదఙ్గవాదన నైపుణ్యమును ప్రదర్శించు చున్నాడు. అనుట ఈ శ్లోకముయొక్క వ్యంగ్యము.

---

**అవతారిక :–** శివుడు తన నర్తనద్వారమున సమస్తలోకలాలనము చేయుట పై శ్లోకమున చెప్పబడినది. ఈ శ్లోకమున షణ్ముఖ లాలనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ సమస్తముఖలాలనం నహి ముఖస్య మే షణ్ముఖ!**
**సమస్తముఖలాలనం ఖలు మృగాంకరేఖానన!।**
**ఇతి స్వసుతవాదనమ్ముదితమున్ముఖైః పఞ్చభిః**
**సుతస్య మతిలాలనం విరచయఞ్ఛివః పాతు నః॥ 50**

**ప్రతిపదార్థము :–** షణ్ముఖ = ఓ కుమారా! మే = నాయొక్క, ముఖస్య = ముఖమునకు, సమస్త ముఖలాలనమ్ = అన్ని ముఖముల లాలనము, నహి = లేదుగదా, మృగాంక రేఖానన! = ఓ చంద్రరేఖ ఆననమందు గలవాడా (తండ్రీ) సమస్త ముఖలాలనమ్ ఖలు = సమస్త అన్ని ముఖముల లాలనమే గదా, ఇతి = అని, స్వసుత వాదనమ్ = తన కొడుకు మాటను, ముదితమ్ = సంతోషమున, సుతస్య మతిలాలనమ్ = కొడుకుయొక్క బుద్ధిలాలనమును, విరచయన్ = చేయుచు, శివః = శివుడు, నః = మనలను, పాతు = కాపాడుగాక!

**తాత్పర్యము :–** షణ్ముఖా! నా ముఖమున కన్ని ముఖముల లాలనము లేదుగదా! అని శివుడు అనగా, ఓ చంద్రరేఖాననా! తండ్రీ! శివా! సమస్త ముఖలాలనమే గదా ఉన్నది, అని కుమారుని ముఖముల నుండి వెలువడిన మాటలకు ఆనందమున కొడుకుయొక్క మతిని లాలించుచున్న శివుడు మనలను కాపాడుగాక!

**వివరణ :–** శివునకైదు ముఖములున్నవి. కుమారస్వామి కాఱుముఖములున్నవి. తండ్రి తన యైదు ముఖములతో కుమారుని యాఱు ముఖములు (చుంబనాదులతో) ఏక కాలమున లాలించవలసి వచ్చినప్పుడు ఒక ముఖమునకు లాలనము సంభవించనప్పుడు సమస్త ముఖ లాలనము కానట్లే. ఇది శివుని అభిప్రాయము. కుమారస్వామి తండ్రితో ఇది సమస్త ముఖ లాలనమే కదా.

శివుని అన్ని ముఖముల తోడి లాలనము తనకు సంభవించినదని కుమారస్వామి ముఖ లాలనము మస్తములో కూడియేయుండును గాని మస్తరహితముగా ఉండదుగదా అనియు అభిప్రాయము వాస్తవమునకు వివేకబుద్ధితో గ్రహించిన కుమారుని తృప్తిని





గమనించి ఆతని లాలించుచున్న శివుడు మనలను కాపాడుగాక! ఆఱవ ముఖము కుమారునిదే యైనను మమకారమున శివుడు నా ముఖమని దానికి తన యైదు ముఖముల చుంబనాది రూపలాలనము (సమస్తముఖముల) సంభవింపలేదనగా కుమారస్వామి నా సమస్త ముఖముల లాలనము సంభవింపగా సంభవించ లేదను చున్నావేమి? లాలనము సంభవించని ముఖమును పురస్కరించుకొని అసంతృప్తి యేమియు లేదని బదులు పలికినాడు. శివుని అన్ని ముఖములు మృగాంకరేఖకలవే అని **మృగాంకరేఖాననా** అను సంబోధనము తెలుపును. నీ లాలనము సంభవించని నా ఆఱవ ముఖము నా ముఖమునందలి చంద్రరేఖను చూచి ఆనందించుచున్నది గదా! కావున అన్ని ముఖములకు లాలనము సంభవించినట్లే కదా! అనుటను వ్యంజించును. ప్రతిపాదమున జ–స–జ–స–య–ల అను గణము లుండుటచే నీ శ్లోకము పృథ్వీవృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని స్వసుతలాలనము చెప్పబడినది. ఈ శ్లోకము స్వసుతప్రాయమైనలోక త్రయముయొక్క లాలనము శివకృత్యములలో నొకటియని చెప్పబడుచున్నది.

**శ్లో॥ మమహస్తగతాస్తు విష్టవ – త్రయసృష్టిస్థితిసంహృతిక్రియాః।**
**ఇతి సూచయితుం వహన్నివ – త్రిశిఖం శూలమయం శివోవతు॥ 51**

**ప్రతిపదార్థము :–** విష్టవ త్రయ సృష్టి స్థితి సంహృతిక్రియాః = లోకత్రయముయొక్క సృష్టిస్థితిలయములు, మమ = నాయొక్క, హస్తగతాః = చేతనున్నవియే, ఇతి = అని, సూచయితుమ్ = సూచించుటకు, త్రిశిఖమ్ = ముమ్మొనలుగల (వాలును), శూలమ్ = శూలమును, వహన్ ఇవ = వహించుచున్నదోయన్నట్లున్న, అయమ్ = ఈ, శివః = శివుడు, అవతు = కాపాడుగాక!

**తాత్పర్యము :–** మూడు లోకముల సృష్టిస్థితిలయములు నా చేతనున్నవి అని సూచించుటకే త్రిశూలము దాల్చినట్లున్న శివుడు కాపాడుగాక!

**వివరణ :–** త్రిశూలధారణము లోకత్రయ సృష్టి స్థితి లయములు నాచేత నున్నవని సూచించుట ఫలము కాక పోయినను ఫలముగా సంభావింపబడుటచే నీ శ్లోకమున ఫలోత్ప్రేక్షాలంకార మేర్పడియున్నది. పూర్వార్ధమున తకారావృత్తిచే వృత్త్యనుప్రాసాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము వైతాళీయ ఛ్ఛన్దోనిబన్ధనము. విషమ పాదమున ఆఱు మాత్రలు తరువాత సమ పాదమున ఎనిమిది మాత్రల తరువాత ర–ల–గ అను

గణములుండును. ఆ ఆఱు మాత్రలు ఎనిమిది మాత్రలు సర్వలఘువులు కాకూడదు. విషమ పాదమున స-స-జ-గ అను గణములు సమపాదమున స-భ-ర-ల-గ అను గణములు ఉండుటచే నీ వృత్తము వియోగినీ నామకమని చెప్పుదురు.

---

**అవతారిక :-** పై శ్లోకమున త్రిశూలధారణము చెప్పబడినది. ఈ శ్లోకమున భస్మధారణము చెప్పబడుచున్నది.

**శ్లో॥ భస్మవిలేపాశాంశుకభోగీ - సక్తజటస్సంసారవిరాగీ।**
**బ్రహ్మవిచిన్తాభాగనురాగీ - పాతు సదా మామాదిమయోగీ॥ 52**

**ప్రతిపదార్థము :-** భస్మ విలేపాశాంశుక భోగీ = భస్మ విలేపనముయొక్క దిక్కులను వస్త్రములయొక్క భోగము గలవాడు, సక్తజటః = జడలయందు సక్తుడు, సంసార విరాగీ = సంసారమునందు వైరాగ్యము గలవాడు, బ్రహ్మ విచిన్తాభాగనురాగీ = బ్రహ్మచిన్తన మొనర్చు వారియం దనురాగము గలవాడు, ఆదిమయోగీ = మొదటియోగి (శివుడు), మామ్ = నన్ను, సదా = ఎల్లప్పుడు, పాతు = కాపాడుగాక!

**తాత్పర్యము :-** భస్మ విలేపనము, దిగ్వస్త్రములు, శివుని భోగములు. ఆయన ఆసక్తి జడలయందు, ఆయన వైరాగ్యము సంసార విషయకము. ఆయన అనురాగము బ్రహ్మ చింతనము చేయు వారియందు, ఈ లక్షణములు గల ఆదిమయోగి శివుడు నన్ను ఎల్లప్పుడు కాపాడుగాక!

**వివరణ :-** యోగి భోగముల యందు సక్తుడై యుండడు. కాని శివుడు భస్మ లేపన దిగంబరత్వము భోగించుటకు వెనుదీయలేదు. స్రక్చందనాది భోగముల కలవాటు పడినవాడవి లేనప్పుడు దుఃఖభోగి యగును. భస్మవిలేపన దిగంబరత్వములు వాస్తవమునకు భోగములే కావు. భోగములైనను అవి ఆసక్తి పెంచు భోగములసలే కావు. చందనాది భోగము సుఖమును కలిగించి ఆసక్తి పెంచును. భస్మ విలేపన మట్టిది కాదు. ఐనను భస్మము పూసికొనువాడు భస్మభోగి కాకుండుటెట్లు! అట్లే వస్త్రములు భోగ్య వస్తువులు వానిని వదలుట దిగంబరత్వము. వాస్తవముగ దిగంబరత్వము విరాడ్దేహమును చెప్పును. వస్త్రహీనుని దిక్కులు వస్త్రమువలె ఆవరించును. కావున వస్త్రహీనుని దిగంబరుడనుట కలదు. అది భోగమని చెప్పుట ఈ శ్లోకమునందలి విశేషము. ఒక వస్తువు (వస్త్రము) లేనప్పుడును కొందఱకు సుఖము కలుగునేమో! అందుచే నిచట దిగంబరత్వమును భోగముగా చెప్పబడినది. సక్తజటః అనుపదము ఇతరులకు కేశములందముగా ముడుచుకొనుట భోగమైనట్లు శివుడు వాని తైలాది





సంస్కారము చేయక వాని విషయము పట్టించుకొనక పోగా కొన్నాళ్ళ కవి జడలు గట్టినవి. శివునకా జడలయందే ఆసక్తియని తెలుపును. సంసార దుఃఖముల ననేకముల ననుభవించు చున్నను దానియందలి సుఖలేశము కారణముగా లేక అందు సుఖాభాసమున్న కారణముగా సంసారమునందు వైరాగ్యమును పొందుట ఎంతవారికిని సాధ్యముకాదు. విషయ సన్నిధానము వాని యందు ఆసక్తిని పెంచును. కావున కొందఱు సన్యసించి విషయ సన్నిధానమును తొలగించుకొన గోరి సన్యసించెదరు. శివుడు అర్ధనారీశ్వరుడయ్యు సన్యసింపకుండగనే సంసార విరాగియైనాడు. ఇది యెంతో విచిత్రము. యోగులకు ఎవరి యందును అనురాగముండదు. కాని శివునకు బ్రహ్మచింతకుల లందనురాగముండుటచే వారిపై రాగి కావచ్చును. అనగా సాలోక్యముక్తి నొసంగును. ఆ ముక్తి కోరని వారికి తనతోడి యైక్యమునే అనగా కైవల్యమునే ప్రసాదించును. సర్వయోగులకు ఆధారమూర్తియైన ఆదిమ యోగి యనబడు శివుని లక్షణములివి. ఈ శ్లోకమున పాదాన్తనుప్రాసము అన్ని పాదములందును కలదు. ప్రతి పాదమున మ-భ-స-స అను గణములుండుటచే చమ్పకమాలయని పేరుగల దీవృత్తము, అని కొందఱు చెప్పెదరు. ఇది తెలుగు భాషలో ప్రసిద్ధమైన చంపకమాల కాదు.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుడు సంసార విరాగి యని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆయన సంసారమంతయు ప్రకటింపబడుచున్నది.

**శ్లో॥ అర్ధాఙ్గే హిమశైలజాం దధదయం బంధుం గృహం తద్గురోః**
**కైలాసాచలముద్వహన్ కరతలే కృత్వా సుమేరుం ధనుః।**
**గఙ్గామ్మూర్ధతలే తదాభమపి సన్మౌలౌ విధుం తత్కృతే**
**కాశీవాసకరః శుభం వితనుతాం శమ్భుర్మహాకార్ముకః॥ 53**

**ప్రతిపదార్థము :-** అర్ధాఙ్గే = సగము శరీరమునందు, హిమశైలజామ్ = హైమవతిని, దధత్ = ధరించును, తద్గురోః = ఆమె తండ్రియొక్క, బన్ధుమ్ = బన్ధువైన, కైలాసాచలమ్ = కైలాస పర్వతమును, గృహమ్ = గృహమునుగా, కరతలే = చేత, సుమేరుమ్ = మేరు పర్వతమును, ధనుః = ధనువుగా, కృత్వా = చేసికొని, మూర్ధతలే = శిరమున, గఙ్గామ్ = గఙ్గను, తదాభమ్ = తత్కాంతిగల, విధుమ్ = చంద్రుని, సన్మౌలౌ = మంచి శిరమున, ఉద్వహన్ = మోయుచు, తత్కృతే = అందుకొఱకు, కాశీవాసకరః = కాశీవాస మొనరించు, మహాకార్ముకః = గొప్ప విలుకాడైన, అయమ్ = ఈ, శమ్భుః = శమ్భువు, శుభమ్ = శుభమును, వితనుతామ్ = కలిగించుగాక!

**తాత్పర్యము:-** సగము శరీరమున హైమవతిని ధరించి, హిమవంతుని బన్ధువైన కైలాసము నిల్లుగా జేసికొని, సుమేరువును ధనువుగా చేసికొని, గంగను చన్ద్రుని శిరమున మోయుచు, (అందుకొఱకు) కాశీవాసమొనర్చు మహాకార్ముకుడైన శమ్భువు శుభము నొసగుగాక!

**వివరణ :-** శివునకు హైమవతి అను భార్య ఉన్నది. వారిరువురు కలిసి యుండుటకై హైమవతికి తండ్రియైన హిమవత్పర్వతమునకు చుట్టమైన కైలాసగిరి ఇల్లుగా నున్నది. వేటాడు వృత్తిలో జీవించుట కా వృత్తికి సాయపడు సుమేరువను పర్వతము హిమవంతుని మరొక చుట్టము వృత్త్యుపకరణమైన ధనువుగా నున్నది. శివుడు నీటి వసతి కిబ్బంది లేకుండగానే గంగనే శిరమున ధరించియున్నాడు. అతనికా భరణ ప్రీతి ఏమంత తక్కువగా లేదు. చన్ద్రుని శిరమందు విడువకుండ ధరించి యున్నాడు. మహాకార్ముకుడై అనగా ధనుర్విద్యా కుశలుడై సూటిగా జ్ఞానరూప బాణము వ్యర్థముగాకుండ వేటాడుచు సంసారులకు నరకభయమును చూపి బెదిరించుచు వారి అజ్ఞాన ధనమును దోచుకొనుచు జీవికను నిర్వహించుకొనుచున్నాడు. వేటాడుట సాధ్యము కానప్పుడు కాశీయందు నివాసమొనర్చుచు నామ రూపాంతరముల ధరించిన తన భార్య అన్నపూర్ణ కడనే భిక్షము గైకొనుచు మరల కైలాసమున తన భార్యతో బిడ్డలకు పెట్టుచు జీవికను నిర్వహించుకొనుచున్నాడు. ఇట్లు సంసారులకు కావలసిన అన్ని హంగులను, భార్య, ఇల్లు, వృత్తి, వృత్త్యుపకరములు మొదలగు వానినన్నింటిని సమకూర్చుకొనువాడు పక్కా సంసారియే యగును. సంసారి కాక పోవుటెట్లు? 2. ఇట్టి శివుని సంసారము యొక్క చింతనము కూడ ఒకవిధముగ బ్రహ్మ చిన్తనమే. అట్టి చిన్తన మొనర్చువారి సంసారమునతడు తొలగించి వేయును. 3. సాధారణముగా ఇరువురు భార్యలున్నప్పుడు చిన్న భార్యను నెత్తిన పెట్టుకొనుట లోకప్రసిద్ధము. పైగా అక్కసెల్లెండ్రను వివాహమాడుట లోక సాధారణము కాదు. అయినను శివుడు లోక ప్రసిద్ధికి విరుద్ధముగా పెద్ద భార్యయైన గంగను శిరమున ధరించి చిన్న భార్యయైన గౌరిని నీవే నా అర్ధాంగమవని నమ్మించు చున్నాడు. ఈ శివుడు సాధారణ సంసారికాక కపటముతో ఇద్దరు భార్యలకు పొరపొచ్చెములు రాకుండ తన దక్షిణ శృంగారనాయకత్వమును నిర్వహించు కొనుచున్నాడు. 4. అర్ధాంగమును గౌరికిచ్చినను తనను నెత్తిన పెట్టికొన్నాడని గంగయు గౌరమ్మను రెండవ భార్యగా కోరి చేసికొన్నప్పుడును నోరు మెదల్పలేదు. ఆమె ఒక జడురాలు. అది గ్రహించినవాడు కనుకనే శివుడీ తెంపరితనమునకు సాహసించినాడు. అట్టి జడుడేయైనను చన్ద్రుని శిరమున ధరించినాడు. తదాభమపి అనుశబ్దములు గంగను భార్యగా నెత్తిన పెట్టుకొనలేదు. మనకు నీరు అవసరము గదా అని గౌరికి తెలుపుటను





వ్యంజించుచున్నవి. ఈవిధముగా సంసార విరాగి అను లోక ప్రసిద్ధిని పొందిన శివుని లోగుట్టు (బండారము) బయట పెట్టినట్లున్న ఈ శ్లోకమున స్తుతియే వ్యంగ్యమగుటచే వ్యాజస్తుత్యాలంకార స్ఫూర్తి యేర్పడియున్నది. ప్రతిపాదమున మ-స-జ-స-త-త-గ అను గణములు ద్వాదశాక్షరాంతమున విశ్రాంతి యుండుటచే నీ శ్లోకము శార్దూల విక్రీడిత నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుని శృంగారసంబంధముయొక్క కాపట్యము ప్రస్తావనము వ్యంగ్యము చేయబడియున్నది. ఈ శ్లోకమున కాపట్యఫలముగా కలిగిన శృంగార రసోత్కర్షము ధ్వనింపజేయబడుచున్నది.

**శ్లో॥ కోవా హే శైలజాతే! వపుషి ద్రుతతరాలిఙ్గితో వర్తతే తే**
**మాయామద్వేషధారీ వద విదితమహో తావకీనం హి శీలమ్।**
**ఇత్యుర్వీభృత్తనూజాం క్షణం చకితతరాం భీషయిత్వా సహాసో**
**వీక్ష్యాత్మానం తదఙ్గప్రతిఫలితముమాప్రాణనాథోఽ వతాన్నః॥ 54**

**ప్రతిపదార్థము :-** తదఙ్గ ప్రతిఫలితమ్ = ఆమెయొక్క శరీరమున ప్రతిబింబించిన, ఆత్మానమ్ = తనను, వీక్ష్య = చూచి, హే శైలజాతే = ఓ పార్వతీ, తే = నీయొక్క వపుషి = శరీరమునందు, ద్రుతతరాలిఙ్గితః = మిక్కిలి శీఘ్రముగా కౌగలించుకొనబడిన, మాయామద్వేషధారీ = కపటముగా నా వేషమును ధరించిన వాడు, కోవా = ఎవడో, వద = చెప్పుము. తావకీనమ్ = నీకు సంబంధించిన, శీలమ్ = ప్రవర్తనము, విదితం హి = తెలియబడినది గదా!, అహో = ఆహా, ఇతి = అని, ఉర్వీభృత్తనూజామ్ = పార్వతిని, క్షణమ్ = క్షణకాలము, చకిత తరామ్ = మిక్కిలి భయపడిన దానినిగా, భీషయిత్వా = బెదిరించి, సహాసః = నవ్వుతో కూడిన, ఉమాప్రాణనాథః = శివుడు, నః = మనను, అవతాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :-** శివుడు పార్వతిని కౌగలించుకొనబోయెను. ఆ సమయమున ఆమె శరీరమున శివుడు ప్రతిఫలించెను. అది చూచిన శివుడో పార్వతీ! మిక్కిలి శీఘ్రముగా నీచేత కౌగిలింపబడిన నా వేషము ధరించిన వాడెవ్వడో చెప్పుము. నీ శీలము తెలియబడినదిలే, అని యొక్క క్షణకాలము ఆమె చకితురాలగునట్లుగా బెదిరించి నవ్వుతో కూడిన వాడైన శివుడు మనల గాపాడుగాక!

**వివరణ :-** స్ఫటికమణి జపాకుసుమము ఒకచోట నుంచబడినప్పుడు, ఒక దాని లక్షణము మరొక దాని యందు కనబడుచుండుట లోక ప్రసిద్ధము. సాంఖ్యశాస్త్రమున

**ప్రకృతిపురుషసంయోగము, జపాస్ఫటికమణిసంయోగము** వంటిదని చెప్పబడియున్నది. ఆ సంయోగము వంటిదే ఈ పార్వతీపరమేశ్వరసంయోగము. శివుడు స్ఫటికమణి పార్వతి జపాకుసుమము. ఎదురుగా నున్న శివుని ద్రుతముగా (శీఘ్రముగా) కౌగలించు కొన్నది. శివుని స్ఫటికసమానదేహమందు పార్వతి శరీరము ప్రతిఫలించవలెను. కాని పార్వతి శరీరము నందే శివుడు ప్రతిఫలించినాడు. అనగా శివుని స్ఫటిక సమానత్వము పార్వతియందు కనబడినది. శివుడా అంశమును గ్రహించినాడు. పార్వతిని కొంచెమేడిపించవలెనని తలంచినాడు. ఓ పార్వతీ! కపటముగా నా వేషమును ధరించిన వానిని ద్రుతతరముగా అనగా నన్ను కౌగలించుకొనుట కంటే ముందుగానే కౌగలించుకొన్నావు. నీ కౌగిటిలో నున్న వాడెవడో చెప్పుము. నీ శీలము బయటపడినదిలే అని కఠినముగా పల్కినాడు. ఆమె మిక్కిలి చకితురాలైనది. (అట్లు భీతయైన పార్వతిని శివుడు నవ్వుచు కౌగలించుకొన్నాడు) సుఖాంతమైన ఈ కథ శృంగార రసోత్కర్షమును ధ్వనించుచున్నది. "ముద్రిత పాఠము కావా హే శైలజాతే వపుష్ద్రుత తరాలింగితావర్తతేతే" అను పాఠము సమంజసముగా లేదు. తర్వాతి పాదములలో అన్వయమును పొందజాలకున్నది. శివుడు తనను పార్వతి కౌగలించు కొనబోవుచుండగా పైన చెప్పిన విధముగా పలికి పార్వతిని బాధించినను తన హాసముతో తాను పల్కిన మాటలు బూటకములే యని పార్వతికి చెప్పకయే చెప్పినాడు. ఆ తరువాత పార్వతి శివుని కఠిన తరముగానే శిక్షించియుండును. **ఆ శిక్ష వాచామగోచరము. శివానుభవైకవేద్యము.** తకారావృత్తిచే నీ శ్లోకమున వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. పరస్పర కణ్ఠములకు పరస్పర భుజ ద్వయము తను స్రజముల ధరించుటచే (అనగా వర్ణించుటచే) నీ శ్లోకముయొక్క స్రగ్ధరావృత్త నిబన్ధనముచితముగా నున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున పార్వతిని భయపెట్టిన శివుడు తన హాసముతో ఆమె భయము తొలగించుట, ఆ తరువాత వారి సంయోగశృంగారము ధ్వనింపజేయబడినది. ఈ శ్లోకమున వారి సమాగమము శ్వేతపీతమహస్సుల సమాగమముగా చెప్పబడు చున్నది.

**శ్లో॥ పఞ్చబాణవిజయస్య కాఞ్చన – స్తమ్భతావిలసితప్రతీతికృత్।**
**రాజతాద్రినిహితో ధినోతు మాం – శ్వేతపీతమహసోస్సమాగమః॥ 55**

**ప్రతిపదార్థము :–** పఞ్చబాణ విజయస్య = మన్మథ విజయముయొక్క, కాఞ్చన స్తమ్భతా విలసిత ప్రతీతికృత్ = కాఞ్చన స్తమ్భత్వ విలాసమును తపింపజేయు, రాజతాద్రి నిహితః





= కైలాసపర్వతమున దాచబడిన, శ్వేతపీత మహసః = తెల్లని (బంగారు) పచ్చకాంతుల యొక్క, సమాగమః = కలయిక, మామ్ = నన్ను, ధినోతు = సంతసింపజేయుగాక!

**తాత్పర్యము :–** మన్మథ విజయస్తమ్భము నాట బడినదా యన్నట్లు తెల్లని పచ్చని (బంగారు) కాంతుల కలయిక నన్ను సంతోషింపజేయుగాక!

**వివరణ :–**శివుని విరక్తతా గర్వమణిగినది. పార్వతి తపఃఫలముగా శివునిలో కాముడు పునర్జన్మ మందినాడు. శివుని గెలిచిన పిదప మన్మథుడు నాటిన విజయస్తంభమో యన్నట్లు తెల్లని పచ్చని కాంతుల సమాగమము సంభావింపబడుటచే ఈ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకారమేర్పడి యున్నది. పార్వతీదేవి వర్ణము పసిమి, శివుని వర్ణము తెలుపు. పార్వతీ పరమేశ్వరులు తద్వర్ణులని చెప్పక వారిని భంగ్యంతరముగా శ్వేతపీత మహస్సులు అని చెప్పుట అతిశయోక్తి పర్యాయోక్తాలంకారముల స్ఫూర్తిని కలిగించుచున్నది. ఉత్ప్రేక్షాతిశయోక్తులలో విషయాధ్యవసాయముండుటచే ఉత్ప్రేక్షవాచ్యాలంకారముగా నున్నప్పుడు అతిశయోక్త్యలంకార స్ఫూర్తి మాత్ర స్వరూపము గలదై యుండును.

2. అది రాజతాద్రి వెండికొండ. అచట మన్మథుడు నాటిన విజయస్తంభము కాఞ్చన స్తంభము. ఈ విధముగను తెల్లని పచ్చని కాంతుల సమాగమము ఏర్పడినది. ఇది బహిరంగమైన శ్వేత పీతమహస్సమాగమము. బుద్ధి గుహ ప్రతీకమైన రాజతాద్రి గుహలోని పార్వతీ పరమేశ్వరుల శ్వేతపీత మహస్సమాగమము ఆంతరింగకమైనది. ఈ యర్థము రాజతాద్రి నిహిత అను సమాసమందలి నిహిత శబ్దముచే వ్యంగ్యమగుచున్నది. 3. అరవిందము, అశోకము, చూతము, నవమల్లిక, నీలోత్పలము అనునైదు మన్మథుని బాణములు. మన్మథుడాకారణముననే పఞ్చ బాణుడని చెప్పబడును. ఈ శ్లోకమందలి పఞ్చ బాణ విజయము ఆతని ఐదు బాణముల విజయము ఏ యొక్క బాణమును వ్యర్థము కాలేదు. కావున ఇది ఆతనియొక్క ఆతని ఐదు బాణములయొక్కయు సంపూర్ణ విజయము. పంచబాణ శబ్దవ్యంగ్యమీయర్థము. ప్రతిపాదమున ర–న–ల–గ అను గణములుండుటచే ఈ శ్లోకము రథోద్ధతా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున పార్వతీ పరమేశ్వరుల సమాగమము శ్వేతపీత మహస్సమాగమముగా చెప్పబడినది. ఈ శ్లోకమున తన మనస్సున వారి సమాగమము కవిచే కోరబడుచున్నది.

**శ్లో॥ అన్యోన్యనైర్మల్యసమృద్ధిభాజో – రన్యోన్యదేహప్రతిబిమ్బనేన।**
**తేజోఽర్ధనారీశ్వరయోర్ద్వయోస్సత్ – ప్రకాశమానమ్మమ మానసేఽస్తు॥56**

**ప్రతిపదార్థము :–** అన్యోన్యదేహప్రతిబింబేన – ఒకరి శరీరమున మరొకరి శరీరము ప్రతిఫలించుటచేత, అన్యోన్య నైర్మల్య సమృద్ధి భాజో = పరస్పర నైర్మల్యముయొక్క సమృద్ధిని పొందిన, ద్వయోః = ఇద్దఱు, అర్ధనారీశ్వరయోః = అర్ధ నారీశ్వరులయొక్క, సత్ = శాశ్వతమైన, తేజః = తేజము, మమ = నాయొక్క, మానసే = మనసున, ప్రకాశమానమ్ = ప్రకాశించుచున్నదై, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :–** పార్వతీ పరమేశ్వరుల నిర్మల శరీరము లొకరి శరీరమున మరొకరి శరీరము ప్రతిఫలించుటచేత ఆ అర్ధనారీశ్వరు లిరువురి తేజము నా మనసున శాశ్వతముగా ప్రకాశించుచుండుగాక!

**వివరణ :–** పార్వతీ పరమేశ్వరుల వర్ణములలో భేదమున్నది. అనగా ఒకరి (పార్వతి)ది పచ్చని లేత ఎఱుపురంగు. మరొకరి (శివుని)ది తెలుపురంగు అయినను రెండును నిర్మలము లగుటచే నొకరి శరీరము మరొకరి శరీరము నందు ప్రతిఫలించుచున్నవి. అట్టి అర్ధనారీశ్వరులిరువురి తేజము తన మానసము నందు ప్రకాశించవలెనను కవి ఇచ్ఛ ఇందు స్పష్టముగా ఉన్నది. పార్వతీ పరమేశ్వరుల తేజము సత్తని చెప్పబడినది. సత్తనగా త్రికాలాబాధ్యము అని ఒక అర్థము. మరొక అర్థము మంచిది. ఇంకొక అర్థము ఇంద్రియగోచరము. నిర్గుణ పరబ్రహ్మలో స్త్రీపురుష సంయోగము రెండు వస్తువుల సంయోగము అను మూడవపదార్థము ఉండదు. కాని ఉపాసకులాతత్త్వమును సగుణముగానే చింతించెదరు. జీవులు మలిన సత్త్వప్రధానులు ఆ జీవులకీశ్వరుడైనవాడు శుద్ధసత్త్వప్రధానుడు. జీవుల సంసారము వంటి పార్వతీ పరమేశ్వర సంసారము పూర్వ శ్లోకములలో కొంత వర్ణింపబడియే యున్నది. వారిరువురు నర్ధనారీశ్వరులు. స్త్రీ పురుష శరీరములు అర్ధములు కలిసి పూర్ణ శరీరముగా నేర్పడినారు. చూచువారి కొకరి శరీరమున కొకరు అతుకబడినట్లు వారు తమ ఒక్కొక్క అర్ధమును తొలగించుకొని ఒకరైనట్లు కనిపించెదరు అని పురాణములలో చెప్పబడినది. ఆ పురాణములలో వర్ణితరూపమే ఇచట వర్ణింపబడినది. వీరిరువురులో పరస్పర ప్రతిబింబనమున్నది. ఒకరు సత్యబింబ భూతులైనప్పుడు మరొకరు మిథ్యా ప్రతిబింబముగా నుందురు. అనగా శివపారమ్య దృష్టితో అమ్మవారు ప్రతిబింబమాత్ర. శక్తి పారమ్య దృష్టితో శివునిలో నుండి ఆమె తొలగినచో ఆతడు శవప్రాయుడు. అశక్తుడు. శక్తి పారమ్యమమందు చైతన్యము కూడ శక్తియే. సృష్టి స్థితి లయములును శక్తి కృత్యములే. శక్తి వ్యాపారములే. ఇట్టి శక్తికల వానికే ఉపాసనము సంభవించును. ఉపాసనము చేయువారికి కోరిక తీరవలెననన్న తీర్చుశక్తి ఆయన కుండవలె గదా. శక్తి లేని వాని నెవ్వరు నుపాసించరు.





లెక్కచేయరు. మోక్ష ప్రధాన శక్తి యున్ననే నిష్కాములు అనగా మోక్షేతర కామరహితులు ఉపాసించెదరుగదా. నిర్గుణకైవల్యాద్వైత వాసన కలిగి దానికై యత్నించి పొందగలవారును **ఈశ్వరానుగ్రహా దేవ పుంసామద్వైతవాసనా** అను సూక్తి ప్రకారము ఈశ్వరోపాసన చేయవలసియే యుండును. మొదటి మూడు పాదములలో ఇంద్ర వజ్రా పాద లక్షణము. నాల్గవ పాదమున ఉపేన్ద్రవజ్రాలక్షణ ముండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున అర్ధనారీశ్వర తేజము వర్ణింపబడినది. ఈ శ్లోకమున వీర్యర్థము లీనమైన శివునిస్వభావము చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్మశానభూసంచారణాదరోఽపి – శ్మశానభస్మాకలితోఽపి నిత్యమ్।**
**కపాలమాలాఽభియుతోపి చిత్రం – స్వమఙ్గలాదానపటుర్మహేశః॥ 57**

**ప్రతిపదార్థము :–** శ్మశాన భూ సంచారణాదరః అపి = శ్మశాన భూమియందు తిరుగుటలో నాదరము గలవాడైనను, నిత్యమ్ = ఎల్లప్పుడు, శ్మశాన భస్మా కలితః అపి = శ్మశాన భస్మమును ధరించినవాడైనను, కపాలమాలాభియుతః అపి = పుఱ్ఱెల పేర్లను ధరించువాడైనను, మహేశః = మహేశ్వరుడు, స్వమఙ్గలాదానపటుః = తన వారికి మఙ్గలమును బాగుగా ఇచ్చుట యందు సమర్థుడు, చిత్రమ్ = చిత్రముగా.

**తాత్పర్యము :–** నిరంతరము శ్మశానభూమియందు తిరుగుచు అచట విభూతిని. అచటి పుఱ్ఱెల పేర్లను ధరించిన వాడైనను తనవారికి మంగలముల నిచ్చుట యందు ఆ మహేశుడు సమర్థుడు. అది చిత్రము గదా!

**వివరణ :–** శ్మశాన భూమి అమంగలము. అచట తిరుగుట అచటి బూడిదను పుఱ్ఱెలను ధరించుట అమఙ్గలకృత్యము. ఇట్లు మహేశుడు అమఙ్గలస్థాననివాసియై అమఙ్గలకృత్యముల నొనర్చు వాడైనను, సేవించు తన వారికి మఙ్గలముల నొసగుటలో ఆయన వంటి సమర్థుడు మరొకడు దేవతలలో కూడ లేదు. యోగులలో కాని ఇతర జాతులలో గాని లేదు అనుట యథార్థము. జ–త–జ–గ–గ అను గణములు ప్రతిపాదముననుండుటచే నీ శ్లోకము ఉపేన్ద్రవజ్రావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని మఙ్గల దాన సామర్థ్యము చెప్పబడినందున ఈ శ్లోకమున ఆయనకు మరల మరల వందన మనుకృత్యము చెప్పబడుచున్నది.

**శ్లో॥ వన్దే వన్దే వేదశిరోవర్ణితకేలిం**
**వన్దే వన్దే పాలితపాదానతపాలిమ్।**

**వన్దే వన్దే నిర్జితమత్తారిపురాలిం**
**వన్దే వన్దేఽహం హృది గఙ్గాధరమౌలిమ్॥ 58**

**ప్రతిపదార్థము :–** వేద శిరో వర్ణితకేలిమ్ = ఉపనిషత్తుల యందు వర్ణింపబడిన లీలలుకల వానిని గూర్చి, పాలిత పాదానతపాలిమ్ = పాదములందు వాలిన వారి గుంపుగుల గల వానిని గూర్చి, నిర్జిత మత్తారి పురాలిమ్ = ఓడింపబడిన మదించిన శత్రుపుర సమూహములు కల వానిని గూర్చి, గఙ్గాధరమౌలిమ్ = గంగను శిరముపై ధరించు వానిని గూర్చి, హృది = హృదయమున, వన్దే = నమస్కరించుచున్నాను.

**తాత్పర్యము :–** ఉపనిషత్తులలో వర్ణింపబడిన లీలలు, పాదములందు వాలిన భక్తుల గుంపులు గల, మదించిన శత్రు పురముల గుంపుల నోడించిన, గంగను భరించిన శిరముగల శివునకు మాటిమాటికీ హృదయమున నమస్కరించుచుండెదను.

**వివరణ :–** ఎనిమిదిసార్లు వన్దే అను క్రియ ప్రయోగింపబడుటచే నీ శ్లోకము కవికృతసాష్టాంగవన్దనమును వ్యంజించుచున్నది. ప్రతిపాదమున మ–త–య–స–గ అను గణములుండుటచే నీ శ్లోకము మత్తమయూర వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ వందన (భక్తి)ము చెప్పబడినది. ఈ శ్లోకమున శివనామ కీర్తన (భక్తి)ము చెప్పబడినది.

**శ్లో॥ అన్యోన్యసంవర్ధితతత్ప్రశంసా – దిగమ్బరాభూతిజటావతంసాః।**
**సహస్రశస్స్వప్రహసా వదన్తి – శమ్భో! మహేశేశ్వర! శఙ్కరేతి॥ 59**

**ప్రతిపదార్థము :–** అన్యోన్య సంవర్ధిత తత్ప్రశంసాః = పరస్పరము వర్ధిల్ల జేయబడిన ఆతని (శివ) ప్రశంసగల, దిగమ్బరా = వస్త్రము లేని, భూతిజటావతంసాః = (ఒడలి నిండ) విభూతిగల, జటలు అలంకారములుగా గల, సహస్రశః = వేలకొలది, శమ్భో! = ఓ శమ్భూ!, మహేశ! = ఓ మహేశా!, ఈశ్వర! = ఈశ్వరా! శఙ్కర! = ఓ శఙ్కరా!, ఇతి = అని, వదన్తి = చెప్పుచున్నారు.

**తాత్పర్యము :–** ఒకరి శివ ప్రశంస కంటే అధికముగా మరొకరు శివప్రశంస చేయుచున్న, వస్త్రములులేని ఒడలంత విభూతి ధరించిన, జడలు అలంకారములు గలవారు (ప్రమథులు) వేలకొలదిసంఖ్యలో శమ్భో, మహేశా, ఈశ్వరా, శఙ్కర అని పలుకుచున్నారు.

**వివరణ :–** శివభక్తులు శివుని వలెనే ఉండుటకు యత్నించెదరు. శివుడు ధరించినట్లు ఒడలంత విభూతిని జడలను ధరించియుందురు. అతని వలెనే దిగమ్బరులై సంచరించెదరు. అట్టి శివభక్తులు (ప్రమథాదులు) కైలాసమున ఇతర శివభక్తులు



భూమణ్డల మందును శివకీర్తనము చేయుచుందురు. పూర్వార్ధమున పాదాన్తాను ప్రాసమున్నది. మూడవపాదమున "సహస్రశ స్స్వప్రహాసాః" అను పదబన్ధమున శపమకారములు తప్ప మిగిలిన సహసరవర్ణముల ఆవృత్తి యున్నది. ఆద్యంత పాదము లింద్రవజ్రా లక్షణము కలిగి మధ్యలో ఉపేన్ద్రవజ్రా లక్షణము కలిగియుండుటచే నీ శ్లోక ముపజాతి వృత్త నిబన్ధనము.

---

**శ్లో॥ అతో మహత్సఙ్గతిరేవ కార్యా – యతో జటాధారిసుపఞ్జరస్థాః।**
**అమీ శుకాశ్చానువదన్తి నిత్యం – శమ్భో! మహేశేశ్వర! శఙ్కరేతి॥ 60**

**ప్రతిపదార్థము :–** యతః = ఏ కారణము వలన, జటాధారి సుపఞ్జరస్థాః = జడదారుల మంచి పంజరములందు ఇట్టి, అమీ = ఈ, శుకాః = చిలుకలు, శమ్భో! = ఓ శమ్భూ!, మహేశ! = ఓ మహేశా!, ఈశ్వర! = ఓ ఈశ్వరా!, శఙ్కర! = ఓ శఙ్కరా!, ఇతి = అని, నిత్యమ్ = ఎల్లప్పుడు, అనువదన్తి = అనువదించుచున్నవో, అతః = అందువలన, మహత్సంగతిః ఏవ = పెద్దల సంగతియే, కార్యా = చేయదగినది.

**తాత్పర్యము :–** ఎందువలన జడదారుల మంచి పంజరములందున్న చిలుకలు శమ్భో! మహేశా! ఈశ్వరా! శఙ్కరా! అని నిరంతరము అనువదించుచున్నవో అందువలన పెద్దల సంగతి (సహవాసము)యే చేయదగినదని తెలుపుచున్నది.

**వివరణ :–** శివభక్తులు శివునివలె జడల ధరించెదరు. కావున ఇట జటాధారి శబ్దము శివ భక్తులను ముందుగా బోధించును. రెండవ పాదమున భూతదయ మరియు వారికి శివానుగ్రహమువలన కలిగిన ఐశ్వర్యమును వ్యంగ్యములగుచున్నవి. ఈ శ్లోకమున హేతుహేతుమద్భావము చెప్పబడుటచే కావ్యలిఙ్గాలంకారస్ఫూర్తి ఉన్నది.

---

అవతారిక :– పై రెండు శ్లోకములలో శివనామ కీర్తన చెప్పబడినది. ఈ శ్లోకమున శివైక నిష్ఠులైన ప్రమథుల శివనామకీర్తన భక్తి చెప్పబడుచున్నది.

**శ్లో॥ కైలాసభూమీభృదిలాతలేషు – విభూతిరుద్రాక్షధరాఖిలాఙ్గాః।**
**తదేకభక్తాః ప్రమథాః పఠన్తి – శమ్భో! మహేశేశ్వర! శఙ్కరేతి॥ 61**

**ప్రతిపదార్థము :–** కైలాస భూమీ భృదిలాతలేషు = కైలాస పర్వత భూములందు, విభూతి రుద్రాక్ష ధరాఖిలాఙ్గాః = విభూతి రుద్రాక్షల ధరించు సర్వావయవములు గల, తదేకభక్తాః = శివుడొక్కడే అను భక్తిగల, ప్రమథాః = ప్రమథులు, శమ్భో! = ఓ శమ్భూ!, మహేశ! = ఓ మహేశా!, ఈశ్వర! = ఓ ఈశ్వరా!, శఙ్కర = ఓ శఙ్కరా! ఇతి = అని, పఠంతి = ఉచ్చరించుచుందురు.

**తాత్పర్యము :–** కైలాస పర్వత భూ భాగములందు విభూతి రుద్రాక్షల ధరించు సర్వావయవములు గల ప్రమథులు శమ్భో మహేశా ఈశ్వరా శఙ్కరా అని నిరంతరముచ్చరించు చుందురు.

**వివరణ :–** ఈ శ్లోకమును పై శ్లోకమువలె ఉపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున అన్వయ ముఖమున శివనామ కీర్తనోత్కర్షము చెప్పబడినది. ఈ శ్లోకమున వ్యతిరేక ముఖమున అది చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధిక్తస్య జిహ్వాం వచనం చ దిగ్ధి – గ్ధిగ్జీవనం జన్మకులం చ దిగ్ధిక్।**
**నిత్యమ్ముదా యః పురుషో న వక్తి – శమ్భో! మహేశ్వర! శఙ్కరేతి॥ 62**

**ప్రతిపదార్థము :–** యః = ఏ, పురుషః = పురుషుడు, శమ్భో! = ఓ శమ్భూ!, మహేశ! = ఓ మహేశా!, ఈశ్వర! = ఓ ఈశ్వరా!, శఙ్కర! = ఓ శఙ్కరా!, ఇతి = అని, న వక్తి = పలుకడో, తస్య = అతనియొక్క, జిహ్వామ్ = నాలుకను గూర్చి, ధిక్ = ధిక్కారము, వచనమ్ చ = వాక్కును గూర్చి కూడ, ధిక్ = ధిక్కారము, జన్మకులమ్ = జన్మకులమును గూర్చి, ధిక్ = ధిక్కారము, జీవనమ్ = బ్రతుకును గూర్చి, ధిక్ = ధిక్కారము, జన్మ చ = జన్మను గూర్చియు, నిత్యమ్ = ఎల్లప్పుడూ, ధిక్ = ధిక్కారము, ధిక్ = ధిక్కారము.

**తాత్పర్యము :–** ఎవడు శమ్భో! ఈశ్వర! శఙ్కర! అని పలుకడో వాని నాలుక వాక్కు కులము జన్మ జీవనము అన్నియు ధిక్కార్యములే.

**వివరణ :–** ఈ శ్లోకమున ధిక్కార్యముల సంఖ్య యైదు. ధిక్కారముల సంఖ్యయు ఐదు ఉండుటచే రెండు చకారములలోని ఒక **చకారము** ఉక్తత సముచ్చాయక మని మరొక **చకారము** అనుక్త తద్విద్యారూపాది సముచ్చాయకమని గ్రహింపవలెను. ప్రతిపాదమున త–త–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము ఇంద్రవజ్రా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకము శివనామ కీర్తిన మొనర్చని వాని సర్వస్వము నింద్యము అని చెప్పబడినది. ఈ శ్లోకమున శివకీర్తన మొనర్చువాని భాగ్యజన్మాదులు ప్రశంసింపబడు చున్నవి.

**శ్లో॥ స పణ్డితాద్యస్స హి లోకపూజ్యః**
**స దివ్యభాగ్యస్స హి భవ్యజన్మా।**



**యో వక్తి మోదాతిశయేన నిత్యం**
**శమ్భో! మహేశ్వర! శఙ్కరేతి॥ 63**

**ప్రతిపదార్థము :–** యః = ఎవడు, మోదాతిశయేన = మిక్కిలి సంతోషమున, నిత్యమ్ = నిరంతరము, శమ్భో = ఓ శమ్భూ, మహేశ = ఓ మహేశా!, ఈశ్వర = ఓ ఈశ్వరా!, శఙ్కర = ఓ శఙ్కరా!, ఇతి = అని, వక్తి = పలుకునో, సః = అతడు, పణ్డితాద్యః = పండితులలో మొదటివాడు, సః = అతడు, లోకపూజ్యః = లోకపూజ్యుడు, భవ్యజన్మా = మంచి జన్మ గలవాడు, దివ్యభాగ్యః = దివ్యమైన భాగ్యము గలవాడు.

**తాత్పర్యము :–** ఎవడు శమ్భో, మహేశ శఙ్కర ఈశ్వర అని నిరంతరము పలుకునో వాని భాగ్యము దివ్యమైనది. వాని జన్మము భవ్యమైనది. వాడు పండితులలో మొదటివాడు. వాడు లోకపూజ్యుడు. లోకమున పూజింపదగినవాడు.

**వివరణ :–** శివ భక్తి లేనివాడు పండితాగ్రగణ్యుడయినను అగణ్యుడే. లోకపూజ్యుడయినను అపూజ్యుడే. దివ్య భాగ్యము కలవాడయినను నిర్భాగ్యుడే. ఉత్తమ కులమందు జన్మించిన వాడయినను అకులీనుడే. అట్టి వానియందెన్ని సద్గుణము లున్నను అవి దుర్గుణములే అని శ్లోకములోని భావము. పూర్వార్ధ పాదములలోని తచ్ఛబ్ద ప్రథమైక వచనాంతముయొక్క యత్యనంతర స్థాన పునరావృత్తి మూడవ పాదములోని దివ్యభవ్యాశబ్దముల ప్రయోగమును శ్లోకములోని శబ్ద రామణీయకమును పెంచుచున్నవి. పూర్వార్ధ త–త–జ–గ–గ అను గణములలో ఇంద్రవజ్రా లక్షణమును కలిగి ఉండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివనామ కీర్తనము చేయువానియందే అన్ని గుణములున్నట్లు భావింపవలెనని చెప్పబడినది. ఈ శ్లోకమున తన నాలుకలోని దోషములనన్నింటిని శివనామ కీర్తనము పోగొట్టునని చెప్పబడుచున్నది.

**శ్లో॥ జిహ్వా మదీయా వసతాద్దురుక్తి – ర్నీచస్థితిః క్షారజలాన్వితా యా।**
**సోమస్య నామాఖ్యసుధాసముద్రే – శమ్భో! మహేశ్వర! శఙ్కరేతి॥ 64**

**ప్రతిపదార్థము :–** యా జిహ్వా = ఏ నాలుక, దురుక్తి = చెడ్డమాటలు గల, నీచస్థితిః = క్రిందియునికి గలది, క్షారజలాన్వితా = ఉప్పునీటితో కూడినదై యున్నదో, మదీయా = నాకు సంబంధించిన, (సా = ఆ నాలుక), సోమస్య = శివునియొక్క, నామాఖ్యసుధా సముద్రే = నామమ్ అను పేరుగల అమృత సముద్రమున, వసతాత్ = నివసించు గాక!

**తాత్పర్యము :–** చెడ్డమాటలు చెప్పు, క్రింది యునికిగల, ఉప్పునీటితో కూడిన నా నాలుక శివనామామృత సముద్రమున నివసించుగాక!

**వివరణ :–** నాలుక చెడ్డమాటలు చెప్పుట అనునది మాట్లాడువాని మానసిక సంస్కారము వలన జరుగునట్టిది. ముఖమున (నోటియందు దంతములు పైన నుండగా నాలుక క్రింది నుండును. ఇది సహజము. నీచస్థితి (అధమస్థితి)గా నిందింపబడినది. నాలుక గాటునొందగా మారునట్టి రక్తమిశ్రలాలాజలము యొక్క రుచి ఉప్పుగా నుండును. కావున మన శరీరమునందొక ఉప్పు సముద్రమే ఉన్నదనవలెను. లోన ఆ రసము కలిగిన నాలుక రసనయని చెప్పబడును. గంగానదీ మధుర రసముల నన్నింటిని తన ద్వారా శరీరమున ప్రవేశించినంతనే ఉప్పుగా మార్చివేయు ఉప్పు సముద్రముతో మన శరీరములోని ద్రవరాశి పోల్పదగియున్నది. అట్లుప్పుగా మార్చు ప్రక్రియ నాలుక ద్వారమున మ్రింగినంతనే జరుగుటచే నీ దుష్కృత్యమున నాలుక పాపముకలదైనది. అందుచే నెప్పుడు క్షారజల సంబంధము కలదిగానే ఉండును. అట్టి నాలుక శివనామ సుధా సముద్రమున నివసించి తన నీచస్థితిని పోగొట్టుకొనవలెనను కవివాంఛ ఇందు వ్యంగ్యమగుచున్నది. "సోమస్య నామాఖ్య మహాసముద్రే" అను పాదములోని **"సోమస్య"** అను పదము **'సోమేశ'** అని మార్చుకొన్నచో **ఏకదేశాన్వయదోషము** తొలగును. చాలామంది కవుల రచనలలో నీ దోషము ప్రాయికముగా నుండును. ఈ పాదమున మకారావృత్తిచే వృత్త్యనుప్రాస మేర్పడియున్నది. ఈ శ్లోకము పూర్వశ్లోకము వలె ఇంద్రవజ్రావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున తన నాలుక శివనామ కీర్తనము చేయవలెనను కోరిక కవిచే ప్రకటించబడినది. ఈ శ్లోకమున తన చెవులు శివనామ కీర్తనమునే వినవలెనను శ్రవణభక్తి వాంఛ ప్రకటింపబడుచున్నది.

**శ్లో॥ విహాయ భేరీఘనతూర్యవేణు – వీణామృదఙ్గాదిరవం చ గానమ్।**
**శృణోతు మే కర్ణయుగం సుశబ్దం – శమ్భో! మహేశ్వర! శఙ్కరేతి॥ 65**

**ప్రతిపదార్థము :–** భేరీ ఘన తూర్య వేణు వీణా మృదఙ్గాది రవమ్ = భేరీ అను గొప్ప వాద్యముయొక్క, వేణువుయొక్క, వీణయొక్క, మృదఙ్గాదులయొక్క ధ్వనిని, గానం చ = గానమును కూడ, విహాయ = విడచి, మే = నాయొక్క, కర్ణయుగమ్ = చెవులజంట, శమ్భో!= ఓ శమ్భూ!, మహేశ!=ఓ మహేశా!, ఈశ్వర! = ఓఈశ్వరా!, శఙ్కర! = శఙ్కరా!, ఇతి = అను, సుశబ్దమ్ = మంచి శబ్దమును, నిత్యమ్ = నిరంతరం, శృణోతు = వినుగాక!





**తాత్పర్యము :–** వీణా వేణు భేరీ మృదఙ్గాది వాద్యముల ధ్వనినిగాని, పాట ధ్వనిని గాని విడచి నారెండు చెవులెప్పుడును శమ్భో! మహేశా! శఙ్కరా! ఈశ్వరా! అను సుశబ్దమును వినుచుండుగాక!

**వివరణ :–** వీణా భేరీ మృదఙ్గాదులు తాల ప్రధాన వాద్యములు. వేణ్వాదులు శ్రుతి ప్రధాన వాద్యములు. బేసిపాదములు ఉపేన్ద్ర వజ్రా లక్షణము. సరిపాదములు ఇంద్ర వజ్రాలక్షణము కలిగి యుండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివనామ కీర్తనము వినవలెనను శ్రవణ భక్తి వాంఛ ప్రకటింపబడినది. ఈ శ్లోకమున శ్రవణము కీర్తనాధారమైనదగుటచే మరల శివనామ కీర్తనము కోరబడుచున్నది.

**శ్లో॥ ప్రాణప్రయాణే పతతాదనన్త – సంసారతాపాన్తమహౌషధం తత్।**
**నామామృతమ్మద్రసనాగ్రదేశే – శమ్భో! మహేశేశ్వర! శఙ్కరేతి॥ 66**

**ప్రతిపదార్థము :–** ప్రాణప్రయాణే = ప్రాణములయొక్క ప్రయాణమున, అనన్త సంసార తాపాన్త మహౌషధమ్ = అంతులేని సంసారమనెడి తాపముయొక్క అంతమును కలిగించు గొప్పమందైన, శమ్భో! = ఓ శమ్భూ!, మహేశ! = ఓ మహేశా!, ఈశ్వర! = ఓ ఈశ్వరా!, శఙ్కర! = ఓ శఙ్కరా!, ఇతి = అను, నామామృతమ్ = నామమును అమృతము, మద్రసనాగ్రదేశే = నా నాలుకయొక్క అగ్రభాగమున, పతతాత్ = పడుగాక!

**తాత్పర్యము :–** ప్రాణోత్క్రమణసమయమున అనంతసంసారతాపముల నంతమొందింప జేయు గొప్ప మందు శమ్భో! మహేశ! ఈశ్వర! శఙ్కర! అను నామామృతము నా నాలుక చివఱపడుగాక!

**వివరణ :–** తాపము, రోగము మొదలగు వాటివలన కలుగు అది ఆగంతుకమే అయియుండవలెను. కాని తాప (దుఃఖ) రూపమయ్యును నీ సంసారము అనాదియే. అనంతము కాదు. కాని ఆది లేని దానికంతము కూడ నుండదు. కావున ఈ శ్లోకమున అది అనంతమని చెప్పబడినది. అట్లు చెప్పియు దానినంతము చేయు మందొకటి ఉన్నదని ఆ సమాసమునందే చెప్పబడినది. సంసార తాపమున కంతము లేదేమో అన్నంత దీర్ఘకాల ముండునది. మందు నాలుకపై పడునంత వఱకు అది అనన్తమే. ఈ శివనామామృతము మహౌషధము. ఇది పూర్వార్ధ వ్యంగ్యము. మరియు

శివనామామృత మహౌషధము నాపై స్వయముగానే నా నాలుక చివఱ పడుగాక అని చెప్పబడినందున నా ప్రయత్నము లేకుండగనే పూర్వజన్మ సంస్కార ఫలముగనో లేక అవ్యాజమైన శివానుగ్రహముచేతనో ఆ మందు పడవలెనను కవి కోరిక కూడ ఇందు వ్యంగ్యము. ప్రతిపాదమున త–త–జ–గ–గ అను గణములుండుట నీ శ్లోక మింద్రవజ్రా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున తన నాలుకపై శివ నామామృత మహౌషధము తనకుతానే పడుగాక అని కోరబడినది. ఈ శ్లోకమున జడమైన ఆ మందు స్వయముగా పడదు గనుక శివునిచే పడవేయబడవలెను. కావున అందుకోసము శివుని భజించెదనని కవిచేత చెప్పబడుచున్నది.

**శ్లో॥ శాన్తం చంద్రకిరీటముజ్జ్వలతమం పద్మాసనస్థం విభుం**
**పఞ్చాస్యం త్రిదృశం సశూలపరశుం ఖడ్గం సవజ్రం శుభమ్।**
**నాగం పాశసృణీసఘణ్టమభితః కాలానలం బిభ్రతం**
**భవ్యాలంకృతిమర్కరత్నధవలం శ్రీపార్వతీశం భజే॥ 67**

**ప్రతిపదార్థము :–** శాన్తమ్ = శాన్తుడైన, చన్ద్రకిరీటమ్ = చన్ద్రుడు కిరీటముగా గల, ఉజ్జ్వలతమమ్ = మిక్కిలి ప్రకాశించు వాడైన, పద్మాసనస్థమ్ = పద్మాసన మందున్నట్టి, పఞ్చాస్యమ్ = ఐదు ముఖములుగల, త్రిదృశమ్ = మూడుదృక్కులుగల, సశూల పరశుమ్ = శూలముతో గండ్రగొడ్డలితో కూడిన, సవజ్రమ్ = వజ్రముతో కూడిన, శుభమ్ = మంగలకరుడైన, ఖడ్గమ్ = కత్తిని, నాగమ్ = సర్పమును, సఘణ్టమ్ = గంటతో కూడిన, పాశసృణీ = పాశమును అంకుశమును, అభితః = చుట్టూ, కాలానలమ్ = కాలాగ్నిని, బిభ్రతమ్ = మోయుచున్న, భవ్యాలంకృతిమ్ = మంచి అలంకారములు గల, అర్కరత్నధవలమ్ = సూర్యకాంత మణివలెతెల్లనైన, శ్రీ పార్వతీశమ్ = శ్రీ పార్వతీశ్వరుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** తలపై చన్ద్రుడు, చేతులలో శూలము, పరశువు, ఖడ్గము, వజ్రము, అంకుశము గంట మొదలగు వానిని ధరించిన శాన్తుడైన, పద్మాసనమునందు కూర్చొనియున్న ఐదుముఖములు గల సూర్యకాంతమణివలె ధవలోజ్జ్వల కాంతిని కలిగియున్న, కాలాగ్నిని చుట్టు ధరించియున్న, గొప్ప అలంకారములుగల, ప్రభువైన మంగలకరుడైన శ్రీ పార్వతీప్రాణపతిని సేవించెదను.





**వివరణ :–** మొదటి పాదమున శివునిపై భాగమునందలి చంద్రుడు క్రింది భాగమందలి పద్మాసనము పేర్కొనబడినవి. రెండవ పాదము క్రింది భాగమందలి ఆయన ఊర్ధ్వావయవమైన ముఖపఞ్చకము పేర్కొనబడినది. శిష్ట భాగమున మూడవపాదమున శివుని చేతులలోని ఆయుధములు పేర్కొనబడినవి. నాల్గవపాదముయొక్క ఆరమ్భమున ఆయన అవయవములు అలంకృతములని చెప్పబడినది. ఆ తరువాత సూర్యకాంతమణి తోడి పోలిక చెప్పబడుటచే లుప్తోపమాలంకార మేర్పడియున్నది. చుట్టు కాలాగ్నిని ధరించినందున ఆయన దుర్నిరీక్షుడై యున్నాడు అనుట వ్యంగ్యము. ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూల విక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమునందు వలె ఈ శ్లోకమునందును శివ భజనమే చెప్పబడు చున్నది.

**శ్లో॥ అమేయమానన్దఘనం గిరీశం – భజామి నిత్యం ప్రణవైకగమ్యమ్।**
**ఉమాపతిం శఙ్కరముజ్జ్వలాఙ్గం – మహేశ్వరం సాధుమనోనివేశమ్॥ 68**

**ప్రతిపదార్థము :–** అమేయమ్ = ప్రమాణములచే తెలియరాని, ఆనన్దఘనమ్ = ఆనంద(రస)ము గట్టి పడినట్లున్న, గిరీశమ్ = కొండలరాయడైన, ప్రణవైకగమ్యమ్ = ఓంకార మొకదానిచే పొందదగిన, ఉమాపతిమ్ = పార్వతీ పతియైన, శఙ్కరమ్ = సుఖకరుడైన, ఉజ్జ్వలాఙ్గమ్ = ప్రకాశించు శరీరముగల, సాధు మనో నివేశమ్ = సాధువుల మనస్సుల విడిదియైన, మహేశ్వరమ్ = మహేశ్వరుని, నిత్యమ్ = నిరంతరము, భజామి = సేవించెదను.

**తాత్పర్యము :–** 1. ప్రమాణముల కందని ఆనన్ద (రస)ము ఘనీభవించినట్లున్న కొండలరాయడైన, ఓంకారమొక దానిచేతనే పొందదగిన, పార్వతీపతియైన ప్రకాశించు శరీరముగల, సుఖకరుడైన, సాధువుల మనసుల విడిదియైన మహేశ్వరుని నిత్యము భజించెదను.

**వివరణ :–** శివుడు రూపములేని వాడగుటచే కంటి ద్వారా తెలియబడడు. స్పర్శలేని వాడగుటచే త్వక్కుద్వారా, వాసనలేని వాడగుటచే ఘ్రాణముద్వారా రుచిలేని వాడగుటచే రసనద్వారా, శబ్దములేని వాడగుటచే శ్రోత్రము ద్వారా తెలియబడడు. సుఖదుఃఖాదులు లేనివాడగుటచే మనస్సు ద్వారా తెలియబడడు. బహిరింద్రియములైదు. మనస్సును ప్రత్యక్ష ప్రమాణములు. వీని ద్వారమున అగోచరుడైన శివుడు ప్రత్యక్షప్రమాణాతీతుడు.

అగ్నిని చిహ్నమైన ధూమము ద్వారా తెలసికొన వీలున్నట్లు ఏ చిహ్నమును లేనివా డగుటచే అనుమాన ప్రమాణాతీతుడు. అట్లే ఆతని తోడి పోలికగల దేదియు లేక పోవుటచే ఆయన ఉపమాన ప్రమాణాతీతుడు. జాతి గుణ క్రియా ద్రవ్య సంజ్ఞలు లేనివా డగుటచే శబ్ద ప్రమాణమునకు అతీతుడే. శివుడు ఆనన్దఘనుడు. ఆనన్దమునకు రసమను పేరున్నది. **రసో వై సః** అని ఉపనిషత్తు శివుని రసమని చెప్పినది. ఆ ఆనందరసము ఘనీభవిచిన రూపము చంద్రశేఖరత్వాది యుక్తమైన కల్పితరూపము. ఆయన శరీరము త్వఙ్మాంసాదిధాతు నిర్మితము కాదు. చెరుకు రసము బెల్లముగా ఘనీభవించినట్లు ఆనందరసము ఘనస్వరూపమే పైన చెప్పబడిన రూపము. 3. గిరీశ శబ్దము శివుడు కొండల రాయడని బోధించును. కొండలరాయడు అను మరొక పేరుగల శ్రీ వేంకటేశ్వరుడు శివమూర్తియే. కావున ఆ శబ్దము శివుని బోధించును. కైలాసగిరీశ్వరుడై నందునను ఆయనకు గిరీశశబ్దము సార్థకము. 4. శివుడు ప్రణవైక గమ్యుడు. ప్రణవమనగా ఓంకారము. ఓంకారములోని అకారము శివుని మకారము శివుని బోధించును. ఉకారము ఏవ కార్థము. జీవుడు పరమాత్మయైన శివుని కొఱకే అనుట ఓంకారార్థము. వేదములు మూడు ఋగ్యజుస్సామములు. (అథర్వవేదములు త్రయములో చేరనివేదము). ఇతి **వేదాస్త్రయస్త్రయీ** అను నిఘంటువు ననుసరించి త్రయీశబ్దము ఋగ్యజస్సామములను బోధించును. అథర్వవేదము వేదమే అయినను త్రయీ శబ్దము ఆ వేదమును బోధించదు. అకారోకారమకారములు ఋగాదివేద త్రయ సార భూత వర్ణములు. కావున ఓంకారము వేదసారము. ఓంకారము చేత శివుడు చెప్పబడును. **తస్య వాచకః ప్రణవః** అని పాతఞ్జలయోగసూత్రము చెప్పుచున్నది. ఓంకారము చేత పరమాత్మయైన శివుడు చెప్పబడుననగా సర్వవేదములను శివునే చెప్పును అని చెప్పినట్లగును. భావరూపుడగుటచే ఆయన అర్థాపత్తిప్రమాణమునకు అందదు. ఇట్లు ఏ ప్రమాణమునకు అందని వాడగుటచే ఆయన అమేయుడని చెప్పబడినాడు. శివునకున్న అష్టమూర్తులలో పంచభూతములున్నవి. వానికి శబ్దస్పర్శాదులును ఉన్నవి. అందుచేత ఆయన మేయుడేగాని అమేయుడెట్లగును? అను ప్రశ్నము కలుగును. ఆ అష్టమూర్తిత్వము (సగుణత్వము) ఉపాసనార్థము కల్పితమే అగుటచేత కల్పితమైన శివుని ఈశ్వరత్వము కొంతవఱకు మేయము కావచ్చును. కాని ఆయన యథార్థమైన నిర్గుణస్వరూపము మేయము కాదు. కావున శివుడమేయు డనుట నిశ్చితము. 5. అమేయుడని చెప్పఁ బడిన శివుడు ప్రణవైకగమ్యు డగుట ఎట్లు? శివుడు స్వయం ప్రకాశస్వరూపుడు. కావున అమేయుడే అయినను తత్త్వమస్యాది మహావాక్యములు వృత్తివ్యాప్త రూపమున



ప్రమాణములైనను ఫలవ్యాప్యత లేకపోవుట వలన ప్రమాణములు కాలేకపోవుచున్నవి. తత్త్వమసి అను మహావాక్యములో తత్పదార్థముచే ఓంకారగతమైన అకారముచే ఈశ్వరుడు, మకారముచే ఆ మహావాక్యములోని త్వమ్పదముచే త్వమ్పదార్థము (శివుడు) చెప్పబడును. అసి పదార్థము కారముచే చెప్పబడును. ఇట్లు ఓంకారము "**తత్త్వమసి**" అను మహావాక్యము వలె జీవశివైక్యమును బోధించుటచే వృత్తివ్యాప్యత్వ రూపమున శివుడు ప్రణవైక గమ్యుడయినాడు. లోకములో కుండను తెలిసికొన్నవాడు నా చేత కుండ తెలియబడిదనును. ఇందు కుండను తెలిసికొనుట అనగా కుండను ఆవరించిన అజ్ఞానము (అనగా కుండ తెలియబడకపోవుట) కంటె యొక్క లేదా మనస్సుయొక్క వృత్తిచేత కుండ వ్యాప్యము కాగా ఆవరణాజ్ఞానము తొలగి కుండను తెలిసికొనుట సంభవించును. ఇదియే **వృత్తివ్యాప్యత**. ఈ తెలిసికొనుటయే ఇదియే ఫలవ్యాప్యత. శివుడాత్మ స్వరూపము కావున శివుని తెలిసికొంటిని అనగా తెలిసికొనిన జీవుడు వేరు. తెలియబడిన శివుడు వేరగును. ఈ తెలివి "**శివోఽహమస్మి**" అను వాక్యమువలన కలుగు జ్ఞానము కాదు. అది నేనే శివుడను అనగా తెలిసికొను నేనే శివుడనుట, తెలియబడుట అనునది ఇందుండదు. కావున ఫలవ్యాప్యత లేదు. 6. శివుడు ఉమాపతి, ఉమయనగా ఓంకారము. ఓంకారమునందు వలె అకార ఉకార మకారము లిందు క్రమభేదముననున్నవి. కావున ఉమాశబ్దార్థమోంకారము. ఓంకారము నుండియే వాఙ్మయ మేర్పడినందున ఉమయనగా మొత్తము వాక్కు అగును. ఓంకారార్థము శివుడు. శబ్దమునకు అర్థమే పతి. అర్థము కొఱకే శబ్దమైనట్లు భార్య భర్తకొఱకే అగును. కావున ఓంకారార్థమైన శివుడు వాక్పతి. ఉమాపతి. వాక్కే ఉమ. అర్థము శివుడు. ఓంకారము వాక్కుయొక్క మూలము. సర్వార్థమూలము శివుడు ఓంకారార్థము అగుటచే శివుడు ఉమాపతి అని చెప్పబడినాడు. 7. శివుడుజ్జ్వలాంగుడు. ఎంత ఉజ్జ్వలాంగుడనగా సాధువుల మనస్సులాతని హత్తుకొనిగాని మనలేవు. ఉజ్జ్వలాంగుని ఆకర్షణ మటువంటిది. వారికి అందువలన యథార్థసుఖము శాశ్వతానందము కలుగును అనుటను 'శఙ్కరమ్' అను శబ్దము బోధించును. ఇది ఉత్తరార్ధమున వ్యంగ్యమగు అర్థము. మహేశ్వరుని భజించుట మహేశ్వరత్వము నందుటకే. మహేశ్వరుడగుటకే. ఇది మొత్తము శ్లోకము యొక్క భావము. ప్రతిపాదమున జ-త-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము ఉపేన్ద్రవజ్రావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు ప్రణవైక గమ్యుడని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ప్రణవావయవములు (అకారోపకారమకారములు) చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ ఆదిస్వరం తృతీయేన - సహితం బిన్దుసంయుతమ్।**
**ధ్యాయామి హృదయే యోగి - ధ్యేయం కామితమోక్షదమ్॥ 69**

**ప్రతిపదార్థము :–** తృతీయేన = మూడవదైన స్వరముతో (ఉకారముతో), సహితమ్ = కూడిన, బిన్దుసంయుతమ్ = బిన్దువుతో (మకారముతో లేక అనుస్వారముతో) కూడిన, యోగిధ్యేయమ్ = యోగులచే ధ్యానింపదగిన, కామిత మోక్షదమ్ = కోరిన మోక్షము నిచ్చునట్టి, ఆదిస్వరమ్ = మొదటి స్వరము (అకారము)ను, హృదయే = హృదయమున, ధ్యాయామి = ధ్యానించెదను.

**తాత్పర్యము :–** కోరిన మోక్షమునిచ్చునట్టి, యోగులచేత ధ్యానింపబడిన తృతీయ స్వరము అనగా ఉకారముతో, బిన్దువు అనగా మకారము లేక బిన్దువుతో కూడిన ఆదిస్వరము అనగా అకారమును, అనగా ఓంకారమును హృదయమున ధ్యానించెదను.

**వివరణ :–** ఓంకారము శబ్దము తచ్ఛబ్దాభిన్నమైన అర్థము (శివుడు) కూడా ఓంకారమే అని చెప్పదగినది. ఓంకారము శివుని బోధించు శివాదినామముల వంటి నామము. దానిని ఉపాసించుట దానిలోని అకారోకారమకారముల ధ్యానించుట శివనామ ప్రతీకోపాసనము అనబడును. యోగులీ ప్రణవము అనగా ఓంకారమును శివనామముగా తదర్థరూపముగా శివుని ఉపాసించెదరు. కావున ఓంకారనామము అర్థము యోగి ధ్యేయములు. అట్లగుట తదర్థశివుడును యోగిధ్యేయుడు. ఇట్లు యోగులు ఓంకార ప్రతీకోపాసనములు అను రెండు విధముల ఉపాసనముల నొనరింతు రనుట యోగిధ్యేయ శబ్దార్థము. ఆ యోగుల వలె నేనును నా హృదయమున ద్వివిధముగా ఓంకారము నుపాసించెదను అనుట ఈ శ్లోకార్థము.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున ఓంకార నామరూప ప్రతీకముగా చేయదగిన శివోపాసనము చెప్పబడినది. ఈ శ్లోకమున అట్లుపాసన చేసిన కవి చేత తనకు పునర్జన్మ భయములేని ఈ జన్మమందలి సంసారదుఃఖభయముకాని యమదూతల భయముగాని లేదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ న జననీ జనగర్భనివాసజం**
**న చ నిరంతరసంసృతిజమ్మమ।**





**న యమదూతకృతం చ భయం యతోఽ**
**నవరతమ్మమ దైవతమీశ్వరః॥ 70**

**ప్రతిపదార్థము :–** మమ = నాకు, జననీజన గర్భనివాసజమ్ = మాతృజన గర్భమున నివసించుట వలన కలుగునది (భయము), న = లేదు, నిరంతర సంసృతి జమ్ చ = ఎడతెగని సంసారము వలన కలుగునది (భయము) యు, న = లేదు, యతః = ఎందువలననగా, అనవరతమ్ = ఎల్లప్పుడు, మమ = నాయొక్క, దైవతమ్ = దైవము, ఈశ్వరః = శివుడు.

**తాత్పర్యము :–** ఎందువలన నా దైవమీశ్వరుడో అందువలన నాకు మాతృగర్భమున పునర్జన్మ నొందుదునను భయముగాని, సంసారభయముగాని యమదూతల వలన (నరక) భయముగాని లేదు.

**వివరణ :–** సంసార భయము మూడు విధములు. ఒకటి మాతృగర్భము నుండి మరల పుట్టవలసి వచ్చునేమో యన్న భయము. రెండవది మరణ పర్యంతము అనుభవింప బడవలసిన దుఃఖముల భయము. మూడవది మరణానంతరము నరక దుఃఖముల భయము. ఈ మూడు సంసార భయములలో ఈ జన్మమున భవిష్య దుఃఖ భయము ముఖ్యమైనది. పునర్జన్మ యందు విశ్వాసము లేని వారికి మాతృగర్భ సంభవ భయముండదు. నరక విశ్వాసము లేని వారికి నరక భయము ఉండదు. కావున మరణ పర్యంత భవిష్యదుఃఖముల ననుభవించబోవు భయము ముఖ్యమైనది. అది ఈ శ్లోకమున రెండు భయముల నడుమ సంసార భయమని చెప్పబడినది. అంతమాత్రమున మిగిలిన పూర్వోత్తర భయములు సంసార భయములు కావనికాదు. 2. పుణ్యాత్ములు అనగా సకామముగా పుణ్యము నాచరించువారు. పుణ్యకర్మ ఫలముగా స్వర్గాది పుణ్యలోక సుఖభోగానంతరము మాతృగర్భమున పునర్జన్మ పొందవలసి యుండును. మరణానంతరము పుణ్యాత్ములను తీసికొనిపోవుటకు ఆతివాహక కాలాభిమానులైన అర్చిరహః శుక్ల పక్షోత్తరాయణాది దేవతలు ఇతరాతివహ దేవతలు వచ్చెదరు. పాపాత్ములు నరక దుఃఖ భోగానంతరము మాతృగర్భమున పునర్జన్మ నొందవలసియుండును. మరణానంతరము వారిని కొనిపోవుటకు యమదూతలు వచ్చెదరు. పుణ్యాత్ములు నాతివాహక దేవతలు కొని పోవునప్పుడెంతో గౌరవము చూపించుచు తీసికొని పోవుదురు. పాపాత్ముల గొనిపోవుటకు భయంకర ఆకారముగల యమదూతలు బెదిరించుచు, అవమానించుచు తీసికొని పోవుదురు. మరణానంతర పరలోక (నరకము లేక స్వర్గాదులు) ప్రయాణ సమయమున సుఖదుఃఖము లుండుననుట గమనింపఁదగినది.

అవమానించుచు బెదిరించుచు నిందించుచు కొట్టుచు ఈడ్చుకొనిపోవుచు బాధించు యమదూతల విషయమును పురాణముల వలన విని నమ్మినవారికి యమదూత కృతభయము తప్పనిసరి. ఈ అన్ని విధములైన భయములనుండి రక్షించు అభయంకరుడు శివుడు. అభయమను నామాంతరం గల శాశ్వతమైన మోక్షమునే ఇచ్చు శివుడు ఇతర కామితముల నీడేర్చుననుటలో వింత యేమున్నది? పూర్వార్ధమున నకారావృత్తి వలన వృత్త్యనుప్రాసమేర్పడియున్నది. ప్రథమ పాదమున జననీ జన అనుచోట జన శబ్దావృత్తి చేత యమకాలంకారమేర్పడి యున్నది. శ్లోకమునందన్నిపాదములు నకారాదులై యున్నవి. ఇవన్నియు శ్లోకమునందలి శబ్ద రామణీయకతను పెంచుచున్నవి. ప్రతి పాదమున న-భ-భ-ర గణములుండుటచే నీ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్త నిబన్ధనము. ఈ శ్లోకమున పంచాక్షరీమంత్రాది నకారముతో నాలుగు పాదములు కూర్చబడినది.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుడు భయనివారకుడని చెప్పబడినది. ఈ శ్లోకమున అట్టి మహాదేవుని స్తుతించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ మహావీరరుద్రమ్మనోజాతిరౌద్రం**
**మహీభృత్కుమారీమనఃపద్మమిత్రమ్।**
**మఖధ్వంసినం సమ్మతశ్రీకరమ్మ -**
**న్మనోమన్దిరం మహాదేవమీడే॥ 71**

**ప్రతిపదార్థము :-** మహావీర రుద్రమ్ = మహావీరుడు రుద్రుడునైన, మనోజాతి రౌద్రమ్ = మన్మథున కతి భయంకరుడునైన, మహీభృత్కుమారీ మనః పద్మమిత్రమ్ = పార్వతీ మనస్సను పద్మమునకు సూర్యుడునైన, మఖధ్వంసినమ్ = యజ్ఞమును ధ్వంసమొనరించిన, సమ్మత శ్రీకరమ్ = ఇష్టులైన వారికి సంపదను కలిగించు, మన్మనో మన్దిరమ్ = నా మనస్సు మందిరముగా గల, మహాదేవమ్ = మహాదేవుని, ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :-** మహావీర రుద్రుడు, మన్మథున కతి భయము కలిగించు శత్రువు. కాని పార్వతీదేవి మనస్సనెడి పద్మమునకు వికాసమును కలిగించు మిత్రుడు అనగా సూర్యుడు. దక్షుని యజ్ఞమును పాడుచేసినవాడు. ఇష్టులకు ఇష్ట సంపదల నొసగువాడు. నా మనో మన్దిరమున నివసించు మహాదేవుని స్తుతించెదను.

**వివరణ :-** వీర శబ్దము శత్రువులపై నిర్భయముగా దండెత్తు నుత్సాహవంతుని బోధించినట్లే అజ్ఞాన శత్రువుపై దండెత్తు 'వి' అనగా విశిష్టమైన, ఇర = జ్ఞానము లేక వాక్కుగల వానిని కూడ బోధించును. వీరులలో గొప్పవాడు మహావీరుడు. వీరుడే



గొప్పవాడు కావున శివుడు మహావీర శబ్దాభిధేయుడు. రుద్ర శబ్దార్థ మిట్లున్నది. రుత్ రు అను పదములకు దుఃఖము అని అర్థము. 'రుత్తు'ను లేక 'రు'ను ద్రవింపజేయువాడు, పారద్రోలువాడు రుద్రుడు. రుద్రుని స్వభావము రౌద్రము. అది యొక రసము. రౌద్రము కలవానిని చూచిన భయము కలుగును. అట్లు భయము కలిగిన వాడు పిఱికివాడు. వానిలో భయానక రసముండును. రుద్రుని రౌద్రము చూచి మనోజుడు (మనస్సున దాగి యుండువాడు) భయపడి చూడకముందే మనసున దాగుకొనేనో లేక చూచి దాగుకొనెనో కాని దాగుకొనియు నిర్భయముగా నుండలేక భయము నొందెను. అట్టి వారిని చూచిన భయపెట్టు వారికి మరింత ఉత్సాహము కలిగి పిరికి వారికి మరింత భయము కలిగించెదరు. రుద్రుడు అట్లు చేసినాడేమో, మనోజుని కా దృష్టిలో రుద్రుడతి రౌద్రము కలవాడుగా తోచినాడు. ఒకరి దృష్టిలో రౌద్రము కలవాడుగా కనబడినను మరొకరి దృష్టిలో మిత్రుడుగా కనబడవచ్చును. మన్మథునకతి రౌద్రుడుగా తోచిన రుద్రుడు పార్వతి మనఃపద్మమునకు మిత్రుడుగా కనబడినాడు. మిత్రుడుగా వికాసము కలుగజేసినాడు. మిత్రుని చూడగానే మనస్సున వికాసము కలుగుట సహజము గదా! పార్వతికి రుద్రుడు మనో మిత్రుడైనాడు. దేహసౌందర్యము వలన గాక మనఃసౌందర్యము వలన మిత్రుడైనవాడు రుద్రుడు. మిత్రశబ్దము సూర్యునికూడ బోధించును. పార్వతి మనస్సు పద్మము కాక పోయినను ఇపుడు పద్మముగా చూపించబడినందున శివుడు (శివుడు) మిత్రుడే అయినాడు. పార్వతి మనస్సు పద్మమైనప్పుడు మిత్రుడు అనగా సూర్యుడయినాడు. పార్వతి మనస్సుయొక్క పద్మతావస్థయందు అపద్మతావస్థ యందును మిత్రుడైనవాడు రుద్రుడు. రుద్రుని మనో మిత్రునిగా నొనర్చుకొనుట పార్వతీదేవికే చెల్లినది ఇది యంతయు పూర్వార్ధ వ్యంగ్యము. 2. రుద్రుడు దక్షుని యజ్ఞమును పాడు చేసినాడు. దక్షుడనని విఱ్ఱవీగినందున వాని యజ్ఞమును రుద్రుడు పాడు చేసెను. లేక భద్రుని చేత (వీరభద్రుని చేత) పాడుచేయించెను. భద్రుడు అను పేరు గలిగియున్నను పాడు చేసినవాడు రుద్రుడే. బహిరంగముగా దానిని పాడు చేసినవాడు వీరుడే. సందేహమేమి? నేను మాత్రము దక్షుడను గాను. దక్షునివలె శివనిందజేయలేను. నేనేమి అతని కుపకారము చేయకున్నను నా మనోమన్దిరమున మిత్రునివలె నిలచిపోయినాడు. పార్వతీదేవి మనఃపద్మమునకు మిత్రుడైనవాడు అకారణముగానే మిత్రుడై నా మనో మన్దిరమును నివాసము చేసికొన్నాడు. పార్వతీదేవి మనస్సును వీడి గంగమ్మ కడకెప్పుడైన పోవునేమోకాని వారి ముద్దుబిడ్డనైన నా మనోమన్దిరము నుండి మాత్రము కదలడు. అట్టి వానినెంత స్తుతించినను తక్కువయే గదా! పార్వతీదేవి మనస్సునకు వికాసము

కలిగించి నా మనస్సును మందిరముగా చేసికొన్న ఇంతమంచి వాడు దక్షుని యజ్ఞమేల పాడుచేసెను? దక్షుడు తప్పు చేసినాడే అనుకొందము. అట్లు చేయుట, అందఱ చేత అన్ని పనులు చేయించుచు, తన అనుమతి లేక చీమనైనను కుట్టనీయని భూతదయాపరుడైన రుద్రుడు దక్షుని మఖమును పాడుచేయుట న్యాయముగా కనిపించుటలేదు. అయినను ఆయన మహాదేవుడు గదా! వేమందరము సదస్యులముగానున్న మాకందఱకు ఆహుత్యాహారము నొసగి ఆదరించిన దక్షుని యజ్ఞమునేల పాడు చేసితివని అడుగుట కాదేవతలకే ధైర్యము లేదు. నేనెంత? అయినను సమ్మత శ్రీకరుడు ఇష్టుల కిష్ట సంపదలనిచ్చును. దక్షుడిష్టుడు గాకపోవుట వాని దురదృష్టమని సరిపుచ్చుకొందును. ప్రథమపాదమున మధ్యాంతానుప్రాసమున్నది. పూర్వార్ధము నందలి రెండు పాదములం దంతిమాక్షరైక్యమున్నది. అన్ని పాదములలో పూర్వోత్తరార్ధాది వర్ణములు మకారములై యున్నవి. ఇవి యన్నియు శ్లోకము పంచాక్షర మంత్ర ద్వితీయాక్షర మకారముతో నాలుగు పాదములు కూర్చబడినవి. ప్రతి పాదమున నాలుగు యగణము లుండుటచే నీ శ్లోకము భుజంగ ప్రయాత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున మహాదేవైక్యము చెప్పబడినది. ఈ శ్లోకమున మహాదేవ పర్యాయ శివసేవనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ శివేతరాపహన్తారం - శివసన్ధాయినం పరమ్**
**శివానన్దకరం శాన్తం - శివం సేవే నిరంతరమ్॥ 72**

**ప్రతిపదార్థము :-** నిరంతరమ్ =ఎల్లప్పుడు, శివేతరాపహన్తారమ్ = అమంగళములు బోగొట్టు, శివసన్ధాయినమ్ = మఙ్గలముల కలిగించు, శివానన్దకరమ్ = శివానందమును కలిగించు, శాన్తమ్ = శాన్తుడైన, పరమ్ = ఉత్కృష్టుడైన, శివమ్ = శివుని, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :-** అమంగలమును పోగొట్టు, మంగలముల కలిగించు శివానందమును కలుగజేయు శాన్తుడైన, ఉత్కృష్టుడైన శివుని సేవించెదను.

**వివరణ :-** మాండూక్యోపనిషత్తులో శాన్తశివుడు చెప్పబడినాడు. ఈ శ్లోకమునను అట్లే చెప్పబడినాడు. ఆయన తురీయుడని పరశబ్దమున వ్యంజింప జేయబడినది. తురీయ శివుడు ఆనందస్వరూపుడు. కావుననే శివానందకరుడని చెప్పబడినది. అన్తర శబ్దము (శివ జీవ భేదము) అది లేని శివైక్యమానంద స్వరూపమునకు నిరంతర శబ్దము వ్యంజకమై యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---



**అవతారిక :-** పై శ్లోకమున శివసేవనము చెప్పబడినది. ఈ శ్లోకమున వాయుదేవ పర్యాయుడైన ఆతని స్తుతి చెప్పబడుచున్నది.

**శ్లో॥ వాసుకీశ్వరవిభూషితకణ్ఠం - వామభాగపరిపూరితబాలమ్।**
**వారణాస్యభిధపట్టణవాసం - వామదేవమధిదైవతమీడే॥ 73**

**ప్రతిపదార్థము :-** వాసుకీశ్వర విభూషిత కణ్ఠమ్ = వాసుకి అను పేరునుగల సర్వేశ్వరుడు కణ్ఠమందుగల, వామభాగ పరిపూరిత బాలమ్ = ఎడమ భాగమందు నింపబడిన బాల లేక బాలుడుగల (కేశ పాశముగల), వారణాస్యభిధ పట్టణవాసమ్ = వారణాసి అను పేరుగల పట్టణమున వాసముగల, అధి దైవతమ్ = అధిదేవతయైన, వామదేవమ్ = వామదేవుని, ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :-** కణ్ఠమునందు వాసుకి అను పేరుగల సర్పేశ్వరుని ధరించిన, వామభాగమున బాల లేక బాలుడుగల లేక కేశపాశముగల, వారణాసి పట్టణమున వసించు గొప్ప దేవుడైన వామదేవుని స్తుతించెదను.

**వివరణ :-** ఈశ్వరుడు అనగా శ్రేష్ఠుడు. ప్రభువు. ఆతడట్టివారి తోడి సహవాసమే కోరుకొనును. తన కణ్ఠమున వాసుకి అను సర్పేశ్వరునే ధరించినాడు. సాధారణ సర్పమును ధరింపలేదని వాసుకీశ్వరశబ్దము వ్యంజించును. వామభాగము అలంకృత కేశముల లేక అలంకృతకేశోపలక్షిత బాల (పార్వతి)ను లేక ఎడమచంక యందు బాలుడైన వినాయకునో, కుమారునో ఎత్తుకొన్నాడని బాలశబ్దము బోధించును. వరుణ అసి అను నదులు చుట్టు ప్రవహించు కాశీ నగరమును నివాసముగా కలవాడని మూడవ పాదము బోధించును. వామదేవుడు అధిదేవత అనగా దేవతాధికుడు లేక అధిక దేవుడు అని నాలుగవ పాదము బోధించును. నాలుగు పాదములు వకారాదులై యున్నవి. ప్రతి పాదమున ర-స-భ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము స్వాగతావృత్త నిబన్ధనము. శివపంచాక్షరీ చతుర్థాక్షరాది పాద చతుష్టయ మీ శ్లోకమున ఉన్నది.

---

**అవతారిక :-** 70వ శ్లోకమునుండి శివ పంచాక్షరనకారాది చతుః పాద శ్లోకము లారంభింపబడి వాకారాదిగానున్న పై శ్లోకమున శివస్తుతి చెప్పబడినది. శివ పంచాక్షరాంతిమాక్షరమైన యకారముతో నారంభింపబడిన ఈ శ్లోకమున సర్వాశ్రయు డైన శివుని కవి తానాశ్రయించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ యదునాథపద్మభవవాసవాదయో**
**యదుదారభావగుణనాయకాః శివమ్।**

**యమశాసనోగ్రతరమాశ్రయంత్యహో**
**యమనాథనాథమహమాశ్రయామి తమ్॥** **74**

**ప్రతిపదార్థము :–** యత్ = ఏ కారణము వలన, ఉదారభావ గుణనాయకాః = ఉదారభావ గుణముల నాయకులైన, యదునాథ పద్మభవ వాసవాదయః = విష్ణు బ్రహ్మేంద్రాదులు, యమశాసనోగ్రతరమ్ = యముని శాసించుటచే మిక్కిలి ఉగ్రుడైన, యమ్ = ఎవనిని, అహో = ఆహా, ఆశ్రయన్తి = ఆశ్రయించెదరో, తత్ =అందువలన, అనాథనాథమ్ = అనాథులకు ప్రభువైన, తమ్ శివమ్ = ఆ శివుని, అహమ్ = నేను, ఆశ్రయామి = ఆశ్రయించెదను.

**తాత్పర్యము :–** ఏ కారణము వలన యమశాసన కారణమున ఉగ్రతరుడైన శివుని ఉదార భావ గుణములకు నాయకులైన విష్ణు బ్రహ్మేంద్రాదులు ఆశ్రయించెదరో ఆ కారణముననే అనాథనాథుడైన ఆ శివుని నేను ఆశ్రయించెదను.

**వివరణ :–** ఉదారభావ గుణమనగా దయతో దానము నాచరించు గుణము. విష్ణు బ్రహ్మేంద్రాదులట్టి గుణము కలవారే అయినను అంతకంటె నధికముగా ఆ గుణము కలవాడైన, తమకాగుణము ననుగ్రహించిన శివుని ఇంకను ఆ గుణము నధికముగా అనుగ్రహించగల శివుని ఆశ్రయించెదరు. వారికి యముని శాసించిన అధికోగ్రత కలవాడని తెలియక ఆశ్రయించినారా? లేదు తెలిసియే ఆశ్రయించినారు. ఆయన అనాథనాథుడని తెలిసి ఆశ్రయించినారు. విష్ణు బ్రహ్మేంద్రాదులు తాము అనాథులమని భావించి తమకు నాథుడైన ఆ శివునాశ్రయించినారు. అంతవారే అనాథ భావముతో ఆశ్రయించినారనగా వారి కన్నా ఎంతో అల్పుడను అనాథుడనైన నేను అనాథులైన విష్ణుబ్రహ్మేంద్రాదు లేనాథునాశ్రయించి ఇంత వారైనారో ఆ నాథుడైన శివుని ఆశ్రయించుటయే సముచితమని ఆశ్రయించుటను కవి తెల్పుచున్నాడు. యముని కూడా శాసించి మార్కండేయుని కాపాడిన శివుని ఉదారగుణము ముందర ఈ అఱనాయకులైన విష్ణుబ్రహ్మేంద్రాదుల ఉదారగుణమేపాటిది? పూర్వార్ధము నందు దకార ప్రాసము, ఉత్తరార్ధమున మకారప్రాసము కూర్పబడినది. అన్నిపాదములను యకారాదులై యున్నవి.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని ఆశ్రయము చెప్పఁబడినది. ఈ శ్లోకమున తత్కారణమైన శివుని సృష్టిస్థితి లయ కర్తృత్వరూపమైన ఈశ్వరత్వ రూపతటస్థ లక్షణము పురుషార్థమైన ఆనన్ద రూప స్వరూపలక్షణము చెప్పబడుచున్నవి. పై శ్లోకమున పంచాక్షరీ మంత్ర సమాప్తి చేయబడినది. ఈ శ్లోకమున తదర్థము చెప్పబడుచున్నది.





**శ్లో॥ నమః సృష్టిస్థితిలయాన్ – కుర్వతే జగతాం సదా।**
**శివయైక్యం గతాయాస్తు – పరమానన్దరూపిణే॥** **75**

**ప్రతిపదార్థము :–** జగతామ్ = లోకములయొక్క, సృష్టి స్థితి లయాన్ = సృష్టి స్థితి లయములను, సదా = ఎల్లప్పుడు, కుర్వతే = చేయుచున్న, శివయా = పార్వతీదేవితో, ఐక్యమ్ = ఐక్యమును, గతాయ = పొందిన, పరమానన్ద స్వరూపిణే = పరమానన్దము స్వరూపముగా గల వానికొఱకు, నమః = నమస్సు, అస్తు = అగుగాక!

**తాత్పర్యము :–** ఎల్లప్పుడు లోకముల సృష్టిస్థితి లయముల నొనర్చుచున్న శివ (పార్వతి)తో ఐక్యమును పొందినట్టి పరమానన్దస్వరూపుడైన శివునకు నా నమస్సు అగుగాక!

**వివరణ :–**శివుడు పరబ్రహ్మము. ఆయనకు రెండు లక్షణములున్నవి. **జన్మాదస్యస్య యతః** బ్రహ్మసూత్ర ద్వితీయసూత్రముచే చెప్పబడిన తటస్థ లక్షణ మీ శ్లోకముయొక్క పూర్వార్ధమున చెప్పబడినది. శివుడు నిరంతరము లోకముల సృష్టిస్థితి లయముల నొనర్చుచునే యుండు ఈ జగత్సృష్టి స్థితి లయ హేతుత్వము బ్రహ్మయొక్క తటస్థ లక్షణము. ఇవి చేయవలెనన్న ఇవి చేయు శక్తి ఉండవలెను. శక్తి లేనివాడు చేయలేడు గదా. ఆ శక్తి ఉన్నట్లెప్పుడు తెలియును.? జగత్సృష్టి స్థితి లయముల నొనర్చుచున్నప్పుడే తెలియును. అనగా శక్తి కార్యానుమేయము. జగత్సృష్టి స్థితిలయములు కార్యములు. జగత్తునందు పై కృత్యక్రమమెప్పుడు జరుగుచునే ఉండును. ప్రతిక్షణమున ఏవియో భూతములు పుట్టుట, పుట్టిన భూతములు రక్షింపబడుట, రక్షింపబడిన భూతముల సంహరించుట అను నీ కృత్యములు నిరన్తరము జరుగుచునే యుండును. ఈ అంశము సదా అను అన్వయము కుర్యతే అను కృత్రత్యయమైన వర్తమానార్థకమైన శతృ ప్రత్యయముచే వ్యంజింపబడుచున్నది. మూడవపాదము ఏ శక్తితో నీ జగత్సృష్టి స్థితిలయ కృత్యములు చేయబడుచున్నవో ఆ శక్తి శివ అని, ఆమెతో ఆతడైక్యమును పొందుట చెప్పబడినది. ఈ శివకే మాయ అని శాంకరాద్వైతదార్శనికవ్యవహార మున్నది. నాల్గవపాదమున బ్రహ్మస్వరూపమైన పరమానన్దము చెప్పబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని తటస్థ స్వరూప లక్షణములు చెప్పబడినవి. ఈ శ్లోకమున శివుని ఉపాసనా ప్రతీకములైన ఆకారాదులు చెప్పబడుచున్నవి.

**శ్లో॥ లిఙ్గరూపం జగద్యోనిం – సత్రిశూలాక్షమాలికమ్।**
**శ్రేష్ఠం సమృగఖట్వాఙ్గ – కపాలడమరుం భజే॥** **76**

**ప్రతిపదార్థము :–** లిఙ్గరూపమ్ = లిఙ్గము రూపముగాగల, జగద్యోనిమ్ = జగమునకు ఉపాదాన కారణమైన, సత్రిశూలాక్ష మాలికమ్ = త్రిశూలముతో జపమాలతో కూడిన, సమృగ ఖట్వాఙ్గ కపాలడమరుమ్ = జింక, మంచపుకోడు, కపాలము, డమరువులతో కూడిన, శ్రేష్ఠమ్ = శ్రేష్ఠుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** లింగాకారముగల జగమున కుపాదానమైన కపాలమును, డమరువును, జపమాల, త్రిశూలము, జింకను మంచపుకోడు, త్రిశూలమును ధరించిన శ్రేష్ఠుని సేవించెదను.

**వివరణ :–** రెండవ, మూడవ, నాల్గవ పాదములలో శివుడు ధరించిన యుద్ధ సాధనములైన త్రిశూలము, ఖట్వాఙ్గములు ఆయుధములు, జపసాధనమైన జపమాల, వినోద సాధనమైన జింక, డమరువు, భిక్షాసాధనమైన కపాలము చెప్పబడినవి. ప్రథమ పాదము నందలి లింగయోని శబ్దములు హేత్వర్థకములగుటచేత శివుని జగద్ధేతుత్వముతో పాటు ఆ స్త్రీ పురుషార్థకార్ధరీశ్వరత్వమును గూడ వ్యంజించుచున్నవి. రెండవ పాదములోని త్రిశూల శబ్దము శివుని లోని రౌద్రము, అక్షమాల శబ్దము ఆతనిలోని శాంతస్వభావము అను పరస్పర విరుద్ధ ధర్మముల ఆశ్రయత్వమును వ్యంజించును. ఉత్తరార్ధములోని మృగఖట్వాంగ కపాల డమరు శబ్దములు లయకర్తయగు శివునిలోని భీషణ కిరాతత్వమును వ్యంజించును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని లోక భీకరత్వము ప్రస్తావింపబడినది. ఈ శ్లోకమున శివునిలోని లోక రఞ్జనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ లమ్బోదరగురుం నిత్యం – హంసవాహనసేవితమ్।**
**యంత్రతంత్రరతం లోక – రఞ్జనం భావయే శివమ్॥ 77**

**ప్రతిపదార్థము :–** లమ్బోదరగురుమ్ = వినాయకునకు తండ్రియైన, నిత్యమ్ = శాశ్వతుడైన, హంసవాహన సేవితమ్ = బ్రహ్మచే సేవించబడు, యన్త్ర తన్త్ర రతమ్ = యంత్ర తంత్రములం దాసక్తుడైన, లోక రఞ్జనమ్ = లోకమును రంజింపజేయు, శివమ్ = శివుని, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** వినాయకునికి తండ్రియైన, బ్రహ్మచే సేవింపబడు యన్త్ర తన్త్రము లందాసక్తుడైన లోకరఞ్జకుడైన శివుని భావించెదను.

**వివరణ :–** లోకమును రంజింపజేయుట సంపాదనను పెంచుకొనుట ఆటవికులైన వారి ప్రవృత్తి యైనట్లు లోకము నెరిగిన వారికందఱకు తెలిసినదే. వారి కడకు





సామాన్యజనులు బాధలలో నున్నవారు బాధా నివృత్తి కొఱకు అధిక ధనార్జనాభిలాషతో యన్త్రమును తన్త్రమును పొందుట కొఱకు వచ్చెదరు. వారి నాకర్షించుట ఈ లోక రంజకుల కవసరము. వారధికధనమును గాని బాధానివృత్తిని గాని పొందెదరో లేదో కాని వీరి దారిద్ర్యబాధా నివృత్తి కాసుల పంట (అధిక ధనము) పండించుకొనుట మాత్రము తథ్యము. ఈ లోక రంజకులు తమ కడ నొక మరగుజ్జు నుంచుకొనెదరు వానిని చూచి నవ్వుకొనుట కొఱకు వినోదమును పొందుట కొఱకును సాధారణ జనులు ఈ లోక రంజకుల చుట్టూ మూగెదరు. వారి అదృష్టము పండి వారికెవరేని రెండు తలలో, మూడు తలలో కలిగినవారెవరైన నున్నచో నిక జనాకర్షణకు కొదవ యేముండును? జనాకర్షణమున్నచో ధనాకర్షణము కూడ నుండుననుటే వేరుగా చెప్పనక్కఱలేదు. శివునకాలోక రంజన వృత్తి ఎట్టి యిబ్బంది లేకుండ స్వాభావికముగ సహజముగా కుదిరిపోయినది. తన కొడుకే మరుగుజ్జై యున్నాడు. గుజ్జుతనముతో పాటు ఆ కొడుకునకు బాన పొట్ట కూడ నున్నది. ఇక లోకరంజనమునకు కొదువ యేమున్నది? ఆతనికి తోడు ఆతనికి నాలుగు తలల సేవకు డొకడున్నాడు. ఆయన వాహనము హంస. మరుగుజ్జు కొడుకైన గణపతి వాహన మెలుక. నాలుగు తలల సేవకుని వాహనము హంస, ఒకటి చూచుచుండగా భూమిలో బిలముచేసికొని లోనికి పోవుచు కొంచెము తలపైకి పెట్టి భయభయముగా చూచుచు మరల లోనికి పోవుచు కొంచెము లోకులకు వినోదము కల్పించును. ఆ ఎలుక అట్లు చేయుచుండగా హంస ఆ మరుగుజ్జు మెడలోని సర్పములను యజమానుని కాంచియైన సర్పమును ఆశగా చూచుచు ఆరగించ బోవుచుండును. ఇరువురకా హంసము నదలించుట తోడనే కాలక్షేపమగు చుండును. చూచు లోకులకును ఇది మంచి కాలక్షేపము. ఏ కోరికలు లేనివారును వీరి కడకు తమను తాము వినోదింపజేసుకొనుటకు అనగా కాలక్షేపమునకు వచ్చుచుందురు. మరికొందఱు ఈ యజమాను (శివుని) మన్త్రములను జపించుచు యన్త్రముల వేయుచుండుట జూచి తమ బాధ పోగొట్టుకొనుటకు యన్త్రమునో మన్త్రమునో అనుగ్రహింప గోరుచుందురు. ధనాశాపరులాపనినే యెట్లును చేయుచునేయుందురు గదా! ఈ శ్లోకమున అలంకారము వ్యాజస్తుతి. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని లోకాపహాస భాజనత్వము వ్యాజస్తుతి చెప్పబడినది. ఈ శ్లోకమున ఆయన భార్యయైన అమ్మయే ఆయన నపహసించుట చెప్పబడు చున్నది.

శ్లో॥ శమ్భో! పశ్య న మాం భయం భవతి తే దగ్ధో దృశా మన్మథః
కంఠే తే భుజబన్ధనం న మమ భోస్తత్రాస్తి హాలాహలః।
గణ్డే గణ్డతలార్పణం న భుజగః కర్ణేన చాలిఙ్గనం
దేహే తత్ర విభూతిరిత్యపహసాదుక్తోఽమ్బయాఽవ్యాచ్ఛివః॥ 78

**ప్రతిపదార్థము :-** శమ్భో = ఓ శివా!, మామ్ = నన్ను, న పశ్య = చూడకుము. భయమ్ = భయము, భవతి = కలుగును. తే = నీయొక్క, దృశా = చూపుచేత, మన్మథః = మన్మథుడు, దగ్ధః = కాలిపోయినాడు (కదా), భోః = ఓయీ, మమ = నాయొక్క, భుజబన్ధమ్ = కౌగిలింత, తే = నీయొక్క, కణ్ఠే = కణ్ఠమునందు, న = లేదు. తత్ర = అచట, (కణ్ఠమునందు), హాలాహలః = హాలాహలము( విషము), అస్తి = ఉన్నది. గణ్డే = చెక్కిలియందు, గణ్డ తలార్పణమ్ = చెక్కిలి నానించుట, న = ఉండదు. భుజగః = పాము, కర్ణేన = చెవిచే, ఆలిఙ్గనమ్ = కౌగలించుకొనుట (ఉన్నది గదా), చ = మఱియు, తత్ర = ఆ, దేహే = దేహమున, విభూతిః = బూడిద, ఇతి = అని, అపహసాత్ = అపహాసముగా, అమ్బయా = పార్వతిచే, ఉక్తః = చెప్పబడిన, శివః = శివుడు, అవ్యాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :-** ఓ శమ్భో! నన్ను చూడకుము. నీ చూపుచే మన్మథుడు కాలిపోయినాడు. అందువలన నాకు భయము కలుగును కదా! నేను నీ కణ్ఠమును కౌగలించుకొనను. దానియందు విషమున్నది గదా! నాకు భయము కలుగదా! నీ చెక్కిట చెక్కిలిని కూడా చేర్చను. ఇదివరకే నీ చెవియొక పాముచే చుట్టబడియున్నది. ఇవి యన్నియుగాక నీ దేహమున బూడిదయున్నది. అని అమ్బచే అపహసింపబడిన శివుడు కాపాడు గాక!

**వివరణ :-** పార్వతి :- కాముని కాల్చిన కంటితో చూచి నన్ను కాల్చకుము. నాకు భయము కల్గును.

శివుడు :- పోనీ! నేను నిన్ను చూడను. నీవే నన్ను చూడుము. నేను కన్ను మూసికొందును. నా కణ్ఠమును నీ భుజములతో కౌగలించుకొనుము.

పార్వతి :- నిన్ను కౌగలించుకొనను. నీ కణ్ఠమున విషమున్నది. ఆ విషముతో కూడిన నీ కణ్ఠస్పర్శ నాకు బాధను కల్పించదా?

శివుడు :- పోనీ! నీ చెక్కిలిని నా చెక్కిట చేర్చుము.

పార్వతి :- పాము నీ చెవిని చుట్టియున్నది. నాకు భయము.

శివుడు :- పోనీ, నీ ఎదను నాయురమున చేర్చుము.





పార్వతి:-అమ్మో, ఆ పనినసలేచేయను. నీయురమున కంటియున్న బూడిద నాకసహ్యము.

పై సంభాషణము శ్లోకములోని పార్వతి వాక్యములవలన వ్యంగ్యమగుచున్నది. పార్వతీదేవి ఏ శృంగారము చేయననుట అపహాస్య వాక్యమని శ్లోకమున చెప్పబడి నందున పార్వతీదేవి చేయనని చెప్పిన పనులన్నియు చేసినదనుట స్పష్ట వ్యంగ్యమే. అట్లు చెప్పుట ఆమె లజ్జాశాలీనత ఆస్వాదనీయ శృంగార రసమునను రణనరూపముగా వ్యంజించు నను భావ విశేషమే మూడవ పాదమున '**భుజగః కర్ణేన చాలింగీతమ్**' అను పాఠము సముచిత తరమనిపించుచున్నది. నేనెట్లును మీ సౌందర్యమును లజ్జా భారమున చూడలేక పోవుచున్నాను. కావున నన్ను చూడుము అని విపరీత లక్షణ ద్వారమున వ్యంగ్యమున్నను నేను నిన్ను కౌగిలింప ననుటలో లజ్జ చేత సంయగ్రహ పరిష్వంగము నొనర్పజాలనని శివుడు కౌగలించుకొనుటలో తన కభ్యంతరము లేదనుట వ్యంగ్యము. నాగములు శివుని కలంకారములే యగుటచే శివుని చెక్కిలి తన చెక్కిలిని లజ్జావకాశమున చేర్చలేకున్నను, శివుడు తన చెక్కిట చెక్కిలిని చేర్చుట తనకిష్టమని చెక్కిలి చెక్కిలి చేర్చననుటలో వ్యంగ్యము. **ఆ దేహమున విభూతి యున్నదనుటలో ఆ శివుడు తన నాలింగించుకొనుట కన్న విభూతి (ఐశ్వర్యము) మరొకటి ఏదియు తనకు లేదని వ్యంగ్యము.** శ్లోకమున పార్వతి లజ్జానుభావము ద్వారా శృంగారరసధ్వని యేర్పడియున్నది. శ్లోకమున వృత్తము శార్దూల విక్రీడితము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివ శివునపహసించుట చెప్పబడినది. ఈ శ్లోకమున శివుడు శివనపహసించుట చెప్పబడుచున్నది.

శ్లో॥ శ్రీగౌరీం ప్రణయేన జాతు కుపితాం వైముఖ్యసన్దాయినీ-
మఙ్గీకారమకుర్వతీమనునయైః కన్దర్పచేష్టాస్వలమ్।
సంక్రాన్తః కిమురోజయోర్హృది చ తే పాషాణభారః పరం
తాతస్యేతి నవదంశ్చిరాదభిముఖీకుర్వఞ్ఛివః పాతు నః॥ 79

**ప్రతిపదార్థము :-** జాతు = ఒకప్పుడు, ప్రణయేన = ప్రేమతో, కుపితామ్ = కోపించిన, కన్దర్ప చేష్టాసు = మన్మథ వ్యాపారములందు, అనునయైః = బుజ్జగింపులతో, అలమ్ = పూర్తిగా, అంగీకారమ్ = అంగీకారమును, అకుర్వతీమ్ = చేయని, వైముఖ్య సన్దాయినీమ్ = వైముఖ్యమును ప్రకటించు, శ్రీ గౌరీమ్ = శ్రీ గౌరిని, ఉరోజయోః = స్తనములందు, హృది చ = మనసునందును, తాతస్య = తండ్రియొక్క, పాషాణభారః = బండ బరువు, పరమ్ = అధికముగా, సక్రాన్తః కిమ్ = సంక్రమించినదేమో, ఇతి

=అని, వదన్ = పలుకగా, చిరాత్ = చాలాసేపటికి, అభిముఖీకుర్వన్ = అభిముఖురాలి నొనర్చుచున్న, శివః = శివుడు, నః = మనను, పాతు = కాపాడుగాక!

**తాత్పర్యము :–** శ్రీ గౌరీదేవి ప్రణయ కుపితురాలై మన్మథ వ్యాపారములకు విముఖురాలు కాగా శివుడెన్నియో అనునయవాక్యములు పలికినను వాని యందంగీకారము చూపకపోవుచుండగా, చివఱకు శివుడు ఆమెతో నీ స్తనములందు హృదయమునందును నీ తండ్రియొక్క పాషాణ భారము సంక్రమించినదేమో యని నిష్ఠూరమాడగా, చివఱకెట్లో ఊఱడిల్లిన ఆమెతో ఇట్లు అపహసితుడగుచు ఆమె నభిముఖునిగా చేసికొనుచున్న శివుడు మనను కాపాడుగాక!

**వివరణ :–** స్తనములందు కాఠిన్యము స్త్రీ సౌన్దర్యమును పెంచు గుణము కాని హృదయములోని కాఠిన్యము స్త్రీ సహజము కాక పోవుటయే గాక అది స్త్రీల యెడ దోషమే అని చెప్పబడు లోక సాధారణాంశము. పురుషుల యెడ కూడ హృదయ కాఠిన్యము దోషమే కాని పురుషుల కది యెక్కువ అనుటయు లోక సాధారణాంశమే. శివుడీ లోక సాధారణాంశము నాశ్రయించి, స్త్రీవైన నీకింత హృదయ కాఠిన్యము కూడదనుట శివుని అనునయ వాక్యస్వరూపము. దానిని అనునయైః అను పదము వ్యంజించును. ఆమె స్తన కాఠిన్యము తనకెంతో ఆహ్లాదమును కలిగించుచుండగా, నీ హృదయ కాఠిన్యము ఎంతో బాధాకరము. ఇది నీకు తండ్రి వలన సంక్రమించినదే గాని ఇది నీ దోషము కాదనుట శివుడు 'అనునయ' వాక్య తాత్పర్యము. ఈ తాత్పర్యమే ఆమె ప్రణయ కోపమును తగ్గించి శివుని మన్మథ వ్యాపారములందు పూర్తిగా ఆమె వైముఖ్యమును పోగొట్టి అభిముఖురాలినొనర్చినది. గమ్యమైన ఇందలి ఉత్ప్రేక్షాలంకార ముచే ధ్వనింపజేయబడిన ఈ తాత్పర్యము గ్రహించుటకు అభిధావ్యాపారము పశమించిన తరువాత తన సామర్థ్యమును వ్యంజనా వ్యాపారము చూపును. కావున ఆమె చిరాదభిముఖీ అని చెప్పబడినది. ఆ విలమ్బము ఏమంత గణింపదగినది కాకపోయినను శివునకదియే చిరాయుతమైనది. ఇది చిరశబ్ద వ్యంగ్యము. ఇచట హిమగిరి కాఠిన్యనింద తన్నిందా తాత్పర్యకము కాక పార్వతీదేవి స్తన కాఠిన్య ప్రశంసా తాత్పర్యకము అని వేరుగా చెప్పనక్కఱలేదు. హిమగిరి కాఠిన్యము స్తనములందు సంక్రమించి యుండవచ్చుననుట కెక్కువ అవకాశముండుటచే పార్వతీ స్తన కాఠిన్య ప్రశంస హిమగిరికి కూడ కొంత సంక్రమించుట ఈ శ్లోకములోని యొక చమత్కారము. సాధారణముగా స్త్రీలు తమ పుట్టింటి వారి ప్రశంసను కోరుకొనుట సాధారణాంశము. స్వప్రశంస కుబ్బిపోవుటయును అట్టిదే. శివుని అనునయ చాతుర్య ప్రశంసనము కవి తాత్పర్యము. కవి నిబద్ధప్రౌఢోక్తి





యైనను ఇది యంతయు యథార్థముగా కవి చాతుర్యమే. స్త్రీ హృదయ స్వభావములలో నధిక భాగము తల్లినుండి సంక్రమించును. **తండ్రి శరీర లక్షణములు ఆడు పిల్లలయందు సంక్రమించుట స్త్రీ సౌభాగ్యహేతువని సాముద్రిక శాస్త్రవేత్తలు చెప్పుదురు.** ఆ సౌభాగ్యమే శివునింత బ్రతిమాలు నట్లొనర్చినది. వాస్తవమునకు ఇచట శ్రీ గౌరీస్తన కాఠిన్యము గాని ఆమె హృదయ కాఠిన్యముగాని సంక్రాన్తము కాకున్నను అట్లు సంక్రాంతయైనదని సంభావించుటలో నుత్ప్రేక్షాలంకార మీ శ్లోకమున నేర్పడియున్నది. కాఠిన్య హేతువుత్ప్రేక్షింపబడినందున నిది హేతూత్ప్రేక్షా భేదమని గమనింపవలెను. ఈ శ్లోకమును శార్దూలవిక్రీడితమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున ఎట్టకేలకు శ్రీగౌరిని అభిముఖురాలినిగా శివుడొనర్చుకొనుట చెప్పబడినది. ఈ శ్లోకమున తత్సంతోషముచే శివుడొనర్చు నాట్యము చెప్పబడుచున్నది.

**శ్లో॥ ధిం-ధిమి-ధిమి-ధిమి-శబ్దై -**
**ర్బంధుర-పద-మన్దరం నటన్తం తమ్।**
**ఝం ఝణ ఝణ ఝణరావా -**
**రంజితమణిమణ్డనం శివం వందే॥ 80**

**ప్రతిపదార్థము :–** ధింధిమి ధిమిధిమి శబ్దైః = ధింధిమి ధిమిధిమి అను శబ్దములతో, బన్ధుర పదమన్దరమ్ = దగ్గఱకు చేర్చబడిన పదముల శనైశ్చలనము కలుగునట్లుగా, నటన్తమ్ = (నటించుచున్న) నాట్యమొనర్చుచున్న, ఝంఝణఝణఝణరావా రంజిత మణిమణ్డనమ్ = ఝంఝా ఝణఝణ అను ధ్వనులతో రంజింపజేయు మణిభూషణములుగల, శివమ్ = శివుని గూర్చి, వన్దే = నమస్కరించెదను.

**తాత్పర్యము :–** ధింధిమి ధిమిధిమి అను మృదంగ ధ్వనుల కనుగుణముగా ఝంఝణ ఝణఝణ అను శబ్దములతో అక్కడ నున్న వారిని రంజింపజేయు మణి భూషణములు కలిగియున్న, నాట్యమొనర్చు శివుని సేవించెదను.

**వివరణ :–** ధిమింధిమి ధిమీత్యాది ధ్వనులు మృదంగాది తాళవాద్యముల ధ్వనులు. ఝంఝా ఝణ ఝణేత్యాది ధ్వనులు నటుని ఆహార్య (వేషభూష) రత్న భూషణాదులు కదలుట వలననేర్పడు ధ్వనులు. ఈ శ్లోకము ఆర్యావృత్తమున నిబన్ధింపబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని నాట్యకళావైశారద్యము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆయనకు గానకళ యందును ప్రవేశము కలదని చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రత్యక్ప్రకాశం ప్రథితాఘనాశం – గానప్రవేశం గతమోహనాశమ్।**
**వస్త్రీకృతాశం వనితైకదేశం – కాశీపురీశం కలయే మహేశమ్॥ 81**

**ప్రతిపదార్థము :–** ప్రత్యక్ప్రకాశమ్ = లోననుండి ప్రకాశించునట్టి, ప్రథితాఘనాశమ్ = ప్రసిద్ధములైన పాపముల నశింపఁజేయు, గానప్రవేశమ్ = సంగీతమున ప్రవేశించు, గతమోహనాశమ్ = మోహనాశమును పొందిన, వస్త్రీకృతాశమ్ = వస్త్రములుగా చేయబడిన దిక్కులుగల, వనితైక దేశమ్ = ఏకదేశమున వనితగల, కాశీపురీశమ్ = కాశీనగరస్వామియైన, మహేశమ్ = శివుని, కలయే = ధ్యానించెదను.

**తాత్పర్యము :–** లోపలి వెలుగైన, ప్రసిద్ధములైన పాపముల నశింపజేయు, గాన కళా ప్రవేశముగల, మోహనాశమును పొందిన, వస్త్రములుగా దిక్కులను చేసికొన్న, శరీరైక దేశమైన వామభాగమున వనితను కట్టుకొనియున్న కాశీపురాధీశ్వరుడైన మహేశుని ధ్యానించెదను.

**వివరణ :–** పరాక్ శబ్దమునకు ప్రతిదంద్వియైన ప్రత్యక్ శబ్దము శరీరములోని అనగా తన ఆత్మయైన అనగా తన (జీవ) స్వరూపమైన లోని వెలుగును బోధించును. ఆ వెలుగు మనమన్నింటిని తెలియు మరియు తెలుపు తెలివి అని చెప్పదగినది. తనకు ఇంద్రియముల ద్వారా ప్రాప్తములైనప్పుడు విషయములను, ప్రాప్తములు కానప్పుడు, అనగా నిద్రావస్థలో విషయరాహిత్యము అను విషయము అది తెలుసుకొనును. అనగా తనకేమి తెలియనితనమును అది తెలుసుకొనును. ఒకప్పుడు ఇంచుమించుగా ఏమి తెలియునో ఏమి తెలియదో ఆ రెండింటికి సాక్షియై సాక్షిననియు అది తెలిసికొనును. ఇది ఒకప్పుడు ఆత్మయని మరొకప్పుడు జీవాత్మయని చెప్పఁబడును. స్వప్నావస్థలో విషయముల తానే కల్పించుకొని అనుభవించుచుండును. ఈయన్ని పనులు చేయుచును ఏమి చేయుట లేదనియు నొకప్పుడు తెలిసికొనును. అందరు జీవులలోని ఆ వెలుగు శివస్వరూపము. కావున ఇట్లు శివుడు ప్రత్యక్ప్రకాశముగా చెప్పబడినాడు. అసత్యము హింస మొదలగు పాపములు కొన్ని ప్రథితములు అనగా ప్రసిద్ధములు. జీవులలో పెక్కురకు తెలిసిన ఈ పాపములు ప్రథితాఘములు. ఒక్కొక్కప్పుడివి పాపములని తెలిసినవారు కూడ మానజాలరు. అట్టి పాపముల నీ శివుడు నశింపజేయును. కావున ప్రథితాఘనాశుడని చెప్పబడినాడు. జీవస్థితిలో మోహిగా కనబడు ఈ శివుడే ఆత్మజ్ఞానానంతర జీవన్ముక్త దశలో మోహనాశమును పొంది గత మోహనాశుడని చెప్పబడును. స్థూలబ్రహ్మాండము దేహముగాగల ఈ శివునకు దిక్కులనే వస్త్రములుగా భావింపబడవలసి యుండును. లేనిచో అంతటి బ్రహ్మాండ దేహము చుట్టుట కంత





పెద్ద వస్త్రములుండవు గదా. అందుచేతనే దిక్కులనే వస్త్రములుగా చేసికొన్నవాడుగా అనగా వస్త్రీకృతాశుడుగా ఈ శ్లోకమున భావింపబడినాడు. ప్రతిపాదమున త–త–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము ఇంద్రవజ్రా వృత్త నిబన్ధనము. ఈ శ్లోకము పదాన్తానుప్రాసమను శబ్దాలంకారముచే అలంకరింపబడియున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ కలన (ధ్యాన)ము చెప్పబడినది. ఈ శ్లోకమున శివనమస్కృతి (శరణాగతి) చెప్పబడుచున్నది.

**శ్లో॥ దేవాయ దివ్యశశిఖణ్డవిభూషణాయ**
**చర్మాంబరాయ చతురాననసేవితాయ।**
**సామప్రియాయ సదయాయ సదా నమస్తే**
**సర్వేశ్వరాయ సగుణాయ సదాశివాయ॥ 82**

**ప్రతిపదార్థము :–** దివ్య శశిఖణ్డ విభూషణాయ = దివ్యమైన చన్ద్రకలముతో ప్రకాశించిన, చర్మాంబరాయ = చర్మమే వస్త్రములుగాగల, చతురానన సేవితాయ = బ్రహ్మచే సేవించబడిన, సామప్రియాయ = సామ (వేద)మునందు ప్రీతిగల, సదయాయ = దయతో కూడిన, సగుణాయ = గుణములతో కూడిన, సర్వేశ్వరాయ = అందఱకు ప్రభుడవైన, సదాశివాయ = ఎల్లప్పుడూ మంగలమే స్వరూపముగాగల, దేవాయ = దేవుడనైన, తే = నీకు, సదా = ఎల్లప్పుడు, నమః = నమస్సు.

**తాత్పర్యము :–** చంద్రకళా భూషితుడవు. చర్మము వస్త్రముగా ధరించువాడవు. చతుర్ముఖ బ్రహ్మచే సేవింపబడినవాడవు, సామవేదప్రియుడవు. సదాశివుడవు. దేవుడవునైన నీకు ఎల్లప్పుడు నమస్కరించెదను.

**వివరణ :–** ప్రథమపాద పద ద్వయము దకారాది, ద్వితీయపాద పదద్వయము చకారాది, ఉత్తరార్ధపాదద్వయము సకారాది పదద్వయాది యగుటచే నీ శ్లోకము పదాద్యను ప్రాసాలంకృతము. తభజజగగ అను గణములతో ప్రతిపాదము కూడి యుండుటచే నీ శ్లోకము వసన్తతిలకా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకములో శివుని దయాగుణము చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ దయలయాభిమానముతో కూడినది అను వింత విశేషణము చెప్పబడుచున్నది.

**శ్లో॥ రక్షాధికారీ హరిరాత్తసత్త్వో – రరక్ష లోకానితి కిం విచిత్రమ్।**
**లయాభిమానీ సతతం జగన్తి – రక్షత్యహో శీఘ్రతరం పురారిః॥ 83**

**ప్రతిపదార్థము :–** ఆత్తసత్త్వః = పొందిన సత్త్వగుణముగల, హరిః = విష్ణువు, లోకాన్ = లోకములకు, రరక్ష = రక్షించెను, ఇతి = అనుట, కిమ్ = ఏమి, విచిత్రమ్ = వింత, లయాభిమానీ = చంపుట యందభిమానముగల, పురారిః = పురములకు శత్రుడు, జగన్తి = లోకములను, శీఘ్రతరమ్ = మిక్కిలి త్వరగా, రక్షతి = రక్షించుచున్నాడు (అనుటయే) అహో = ఆశ్చర్యముగదా!

**తాత్పర్యము :–** సత్త్వ గుణముగల విష్ణువు లోకములను రక్షించెననుటలో వింతయే మున్నది? లయాభిమానియు పురములకు శత్రువును నైన శివుడు లోకముల మిక్కిలి శీఘ్రముగా రక్షించుచున్నాడనుటయే విచిత్రము.

**వివరణ :–** రరక్ష అని అనద్యతనపరోక్షభూతకాలార్థక లిడంత క్రియ ప్రయోగింప బడుటచే విష్ణువుయొక్క లోక రక్షణము ప్రసిద్ధమైనను, భూతకాలము అప్రత్యక్షమునయిన ఆతని లోక రక్షణము అసత్యము కాదని నిశ్చయింపలేము. పైగా భూతకాలమున ఆలోక రక్షణ కృత్యము నొనరించి అలసిపోయి నేడు నిద్రించుచున్నాడు. అట్టి సమయమున తాను లోకములను చంపుటలో అభిమానము గల వాడయ్యు ఇప్పటికినీ రక్షించుచున్నాడని రక్షతి అను వర్తమానార్థకలడంత ప్రయోగము శివుని శీఘ్ర జగద్రక్షకత్వాంశము అసందిగ్ధము, ప్రత్యక్షము, నిశ్చితము అని వ్యంజించుచున్నది. ఈ శ్లోకమునందలి మూడు పాదములు ఉపేంద్రవజ్రా లక్షణమును, నాల్గవపాదము ఇంద్రవజ్రా లక్షణమును కలిగియుండుటచే నిది ఉపజాతిచ్ఛందో నిబన్ధనము.

---

**అవతారిక :–**పై శ్లోకమున శివుని లోక రక్షణము నిశ్చితమని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ లోకరక్షణమునకు హేతువైన దయాగుణమున కతడు నిధియని చెప్పబడు చున్నది.

**శ్లో॥ కృపానిధిఖ్యాతిరతిప్రసిద్ధా–**
**శమ్భోస్తథా శఙ్కర నామధేయమ్।**
**విభాత్యసాధారణమాదిదేవ**
**స్సనాతనోఽ యం నిఖిలైః ప్రసేవ్యః॥ 84**

**ప్రతిపదార్థము :–** శమ్భోః = శివునకు, కృపానిధిఖ్యాతిః = కృపానిధి అను పేరు, అతి ప్రసిద్ధా = మిక్కిలి ప్రసిద్ధమైనది, తథా = అట్లు, శఙ్కర ఇతి = శఙ్కరుడు అని, అసాధారణమ్ = సాధారణము కాని, నామధేయమ్ = పేరు, విభాతి = ప్రకాశించు చున్నది, ఆదిదేవః = మొదటి దేవుడైన, అయమ్ = ఈతడు, సనాతనః = ప్రాచీనుడైన వాడు, నిఖిలైః = అందఱచేత, ప్రసేవ్యః = సేవించదగినవాడు.





**తాత్పర్యము :–** శివునకు కృపానిధి అను పేరు ప్రసిద్ధము. శఙ్కర అను నామము అసాధారణము. సనాతనుడు. ఆదిదేవుడు అని పేర్కొనబడిన ఈ శివుడు అందరచేతను సేవింపదగినవాడై యున్నాడు.

**వివరణ :–** శివుడు లయకారుడు. లయమనగా జీవులనందఱను చంపుట, చంపువాడు కృపానిధి యనుపేర ప్రసిద్ధుడగుటయేమి? మన కుటుంబమున ఇదివఱకున్న తాతముత్తాత లెవ్వరును చావలేదను కొందుము. అప్పుడు మన మాయింట నివసించుటకు స్థలమే ఉండదు. పైగా ఆ ముసలి వారకందఱకు మందులు, సేవ అందించుటకు చాలినంత ధనము కాని ఓపికకాని మనకు ఉండుట అసంభవము. మనకు సుఖశాంతులుండనే ఉండవు. వారి దగ్గులు, మూల్గులును మనకు నిద్ర పట్టనిచ్చునా? అప్పుడు వారు చచ్చిననే బాగుండు ననిపించుట తప్పనిసరి. వారికి మృత్యువు రానిచో మనమే వారు చావవలెనని కోరుకొనుచునే యుందుము. కృపానిధియైన యా పరమేశ్వరుడు వారిని చంపి మనపై అపారమైన దయనే ప్రదర్శించినాడనుట కాదనరాని సత్యము. కావున లయకర్త శివునకు కృపానిధి యనుపేరు ప్రసిద్ధమైనది. పైగా అది అత్యంత సత్యము నిత్యము కూడనై యున్నది. శఙ్కర నామము శివున కసాధారణము. ఇతర దేవతలును సుఖకరులని యొకవేళ అయి యున్నారనుకొన్నను వారికా పేరు రానేలేదు. శివునకే ఆ పేరెట్లా వచ్చినది? ఆయనకున్నంత శఙ్కరత్వమితర దేవతలకు లేకపోవుటయే ఈ పేరు ఇతర దేవతా సాధారణము కాక శివునకే అసాధారణమై ఉండుటకు హేతువు. ఇది పూర్వార్ధ వ్యంగ్యార్థము. ఉత్తరార్థమున పూర్వర్దోక్త హేతువున శివుడు సేవింపదగిన వాడని ఉపదేశము తాత్పర్యముగా చెప్పబడినది. 1,3,4 పాదములలో ఉపేన్ద్రవజ్రా లక్షణము 2వ పాదమున ఇన్ద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోకముపజాతి చ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు నిఖిలసేవ్యుడని చెప్పబడినది. ఈ శ్లోకమున తద్ధేతువుగా ఆతని పాదపద్మసంచారణమున చంచలమతి తరణ ప్రయోజనము ప్రశ్నోత్తర రూపమున చెప్పబడుచున్నది.

**శ్లో॥ చఞ్చలమతితరణం కిమ్పఞ్చాననపాదపద్మసంచరణమ్।**
**అఞ్చితవిభవః కోవా? వఞ్చితపఞ్చాశుగశ్చ సేవే తమ్॥ 85**

**ప్రతిపదార్థము :–** చఞ్చలమతి తరణమ్ = చఞ్చల బుద్ధిని దాటుట, కిమ్ = ఏమి? పఞ్చాననపాదపద్మ సంచరణమ్ = శివుని పాద పద్మమున తిరుగుటయే, అఞ్చితవిభవః

= పూజనీయవైభవము కలవాడు, కోవా = ఎవడో? వఞ్చిత పఞ్చాశుగః = మన్మథుని వంచించినవాడు, తమ్ = ఆతనిని, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :–** ప్రశ్న :– చంచల బుద్ధిని దాటుట యేమి?
ఉత్తరము :– శివుని పాద పద్మమున సంచరించుటయే.
ప్రశ్న :– పూజనీయ వైభవము కలవాడు ఎవరు?
ఉత్తరము :– శివుడే – కావున ఆతనినే సేవించెదను.

**వివరణ :–** చంచల బుద్ధిని శివుని పాదపద్మములందు సంచరింపజేసినచో దాని చాంచల్యము నశించిపోవును. అది అచటనే చివఱకు నిశ్చలమై యుండిపోవును. దీనికి కారణమేమి? శివుని కామసంహరణమే. శివుని వైభవమే పూజనీయమగుట.

ఈ శ్లోకము ఆర్యా (మాత్రా) ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివపాద పద్మామృత సేవనము మతిచాఞ్చల్య నాశకమని చెప్పబడినది. ఈ శ్లోకమున ఆ శివుని పాదము కిఙ్కరులకు సంపత్తి నొసగునట్టి దని చెప్పబడుచున్నది.

**శ్లో॥ కలితభవభీతిభేదే – కరుణాసంఘటనపూరితామోదే**
**విలసతు శఙ్కరపాదే – విద్యా మమ చారుకిఙ్కరశ్రీదే. 86**

**ప్రతిపదార్థము :–** కలిత భవ భీతి భేదే = సంసార భయ నాశముతో కూడిన, కరుణా సంఘటన పూరితామోదే = దయకూర్చుటలో నింపబడిన సంతోష (సౌగంధ్య)ము గల, చారు కిఙ్కర శ్రీదే = అందమైన సేవక సంపదనిచ్చు, శఙ్కర పాదే = శివుని పాదమున, మమ = నాయొక్క, విద్యా = విద్య, విలసతు = ప్రకాశించుగాక!

**తాత్పర్యము :–** సంసార భయమును నశింపజేయు, కరుణను గూర్చి సంతోషమును కలిగించు, సేవకులకు సంపదనిచ్చు శంకరుని పాదమునందు నా విద్య విలసిల్లుగాక!

**వివరణ :–** ఆమోద శబ్దమునకు సంతోషము సౌగంధ్యము అను అర్థములు గలవు. సౌగంధ్యార్థమును స్వీకరించినచో శివుని పాదమందు కమలత్వారోపము వ్యంగ్యమగును. అప్పుడు రూపకాలంకారము కూడ వ్యంగ్యమగును. పూరిత శబ్ద బలమున కరుణా శబ్దముచే చెప్పబడు దయయందు పుష్పరసత్వారోపము తద్ద్వారా రూపకమును వ్యంగ్యమగును. పద్మము శ్రీకి నివాసము. కావున పద్మమైన శఙ్కర పాదము కిఙ్కరులకు శ్రీ నొసగునదైనది. మరియు పాదము పద్మమై కిఙ్కరులకు భ్రమరత్వమును సిద్ధింపజేయునదైనది. భ్రమరములకు పుష్పరస శ్రీయొక్క అనగా అమృతత్వరూప శ్రీ





యొక్క ప్రాప్తియే శివపాద సేవకుల అమృతత్వ రూప మోక్షప్రాప్తి అనియు వ్యంగ్యము. ఈ శ్లోకము ఆర్యావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని పాదమున కిఙ్కర శ్రీ యున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని పాదేతరావయవములం దేవేవి ఉన్నవో చెప్పబడుచున్నది.

**శ్లో॥ చాన్ద్రీరేఖా శిఖాయాం తటిదుపమజటాస్వచ్ఛగఙ్గాతరఙ్గాః**
**కర్ణద్వన్ద్వే భుజఙ్గప్రవరమయమహాకుణ్డలే దాహశీలే,**
**వహ్నిజ్వాలా లలాటే గరలమపి గలే వామభాగేన యోషా**
**యత్స్వానన్దమ్మహస్తత్ప్రభవతు హృది మే కోటిసూర్యప్రకాశమ్॥ 87**

**ప్రతిపదార్థము :–** శిఖాయామ్ = సిగయందు, చాన్ద్రీ = చంద్రునకు సంబంధించిన, రేఖా = రేఖ, తటిదుపమ జటాసు = మెఱుపుల వంటి జడలయందు, అచ్ఛగఙ్గా తరఙ్గాః = స్వచ్ఛములైన గంగా తరంగములు, కర్ణద్వన్ద్వే = చెవుల జంటయందు, దాహశీలే = మండు స్వభావము కలవియగు, అపి = మరియు, భుజఙ్గ ప్రవర మయ మహాకుణ్డలే = సర్పరాడులు అనెడి కుండలములు, లలాటే = నుదుట, వహ్నిజ్వాలా = అగ్నికీల, గలే = కణ్ఠమున, గరలమ్ = విషము, చ = మరియు, వామభాగేన = ఎడమ భాగముచే, యోషా = స్త్రీ, యత్ = ఏది, కోటి సూర్యప్రకాశమ్ = కోటి సూర్యులయొక్క వెలుగు కలదో, స్వానన్దమ్ = స్వానన్దరూపమో, తత్ = ఆ, మహః = తేజము, మే = నాయొక్క, హృది = హృదయమున, ప్రభవ = ప్రకాశించుగాక!

**తాత్పర్యము :–** శివుని సిగయందు చన్ద్రరేఖ, మెఱుపుల వంటి జటలందు స్వచ్ఛములైన గంగా తరంగములు, చెవులయందు దాహశీలములైన సర్పరాజ కుండలములు, నుదుట అగ్నిజ్వాల, కణ్ఠమందు విషము, ఎడమ భాగమున స్త్రీ ఉన్నవి. ఆ శివుడు కోటి సూర్యప్రకాశుడు, స్వానన్దస్వరూపుడు. అట్టి శివుడు నా హృదయమున విలసిల్లుగాక!

**వివరణ :–** శివుడని చెప్పక శివుని తేజమని చెప్పుటచే నీ శ్లోకమున పర్యాయోక్తాలంకార మేర్పడియున్నది. జటలు తటి దుపమములని చెప్పబడుటచే నుపమాలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున మ–ర–భ–న–య–య–య అను గణములుండుటచే నీ శ్లోకము స్రగ్ధరావృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు తేజముగా చెప్పబడినాడు. ఈ శ్లోకమున తేజముకల మణితో సమానుడని శివుడు చెప్పబడుచున్నాడు.

**శ్లో॥ జటాజూటత్వఙ్గత్తరసురనదీతుఙ్గవిలస-**
**త్తరఙ్గోద్యద్బిన్దూత్కరవికచమల్లీసుమభరః।**
**నిజార్ధాఙ్గస్వఙ్గీకృతగిరిసుతామఙ్గలతను-**
**ర్మహేశః పాయాన్మామనిశనిజచిన్తామణినిభః॥ 88**

**ప్రతిపదార్థము :–** జటాజూటత్వఙ్గత్తర సురనదీతుఙ్గ విలసత్తరఙ్గో ద్యద్బిన్దూత్కర వికచ మల్లీసుమభరః = జటాజూటము నందు మిక్కిలి చలించుచున్న దేవనదియొక్క ఎత్తైన ప్రకాశించు తరఙ్గములయొక్క శీకరముల సమూహముచే వికసించిన మల్లెపూల సమూహముకల, నిజార్ధాఙ్గ స్వఙ్గీకృత గిరిసుతా మఙ్గలతనుః = తన అర్ధదేహమును బాగుగా అంగీకరింపఁబడిన పార్వతీదేవి యొక్క శుభమైన శరీరముగల, అనిశ నిజచిన్తా మణినిభః = ఎల్లప్పుడు తనవారికి చిన్తామణివంటి, మహేశః = శివుడు, మామ్ = నన్ను, పాయాత్ = కాపాడుగాక!

**తాత్పర్యము :–** శివుని జటాజూటమున గఙ్గయున్నది. దాని తరఙ్గముల బిన్దువుల సమూహముచే ఆతని కొప్పులోని మల్లెపూవుల సమూహము వికసించియున్నది. ఆయన తన సగము దేహము పార్వతీదేవియొక్క శుభమైన శరీరము నంగీకరించియున్నాడు. ఆయన తనవారికి చిన్తించిన వానినెల్ల నొసగు చిన్తామణివంటి వాడై యున్నాడు. ఆతడు నన్ను కాపాడుగాక!

**వివరణ :–** శివుని జటాజూటము కపర్దమనియు, దేవనది గఙ్గయని పేర్కొనఁబడును. శివుని శిరమునందలి మల్లెలు నక్షత్రములు. పాలసముద్రమున పుట్టిన చిన్తామణిని ఇంద్రుడు స్వీకరించి స్వర్గమున దాచుకొన్నాడు. దాని నాశ్రయించి తాము చిన్తించిన వానిలో మోక్షముతప్ప మిగిలిన లౌకిక భోగసామాగ్రిని పొందగలడు. కాని శివుడు చిన్తామణి ఈయలేని మోక్షమును చింతించిన వారికీయగలడు. కావున చిన్తామణి ఉపమానముగా నున్నను తానధికుడైన శివుడు ఆ మణి యిచ్చు భోగముల నన్నింటి నిచ్చుటయే గాక మోక్షమునధికముగా ఈయగలడు. కావున ఈ శ్లోకమున నిభ శబ్దముచే ఔపమ్యము చెప్పఁబడినను శివుడుఅను ఉపమేయము మణి అను ఉపమానమున కన్న అధికుడని వ్యంజింపబడుటచే దానిని తిరస్కరించిన వాడైనాడు. ఆ కారణముచే ఈ శ్లోకమున ప్రతీపాలంకారము వ్యంగ్యమగును. వాచ్యాలంకారము ఉపమ, ప్రథమ పాదమున, తృతీయపాదమున, 'జ' కార, 'గ'కారావృత్తిచే, ద్వితీయపాదము 'ద'ర' క వర్ణావృత్తిచే, నాల్గవ పాదమున, మ'న' కారావృత్తిచే వృత్త్యనుప్రాసము లేర్పడియున్నవి. ప్రతిపాదమున య-మ-న-స-భ-ల-గ అను గణములుండుటచే నీ శ్లోకము శిఖరిణీ వృత్త నిబన్ధనము.



**అవతారిక :–** పై శ్లోకమున శివుని జటాజూటము శిరసున మల్లెపూవులున్నట్లు చెప్పబడినది. ఈ శ్లోకమున అందలి చంద్రుడు పుష్పముగా నున్నట్లు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఘనామ్బుదనిభాకృతిం ఘటితమిన్దుపుష్పోల్లస-**
**ల్లతాగ్రథితమౌలికం లలితనేత్రరక్తోత్పలమ్।**
**సచాపశరభీషణం సమణిమన్త్రసిద్ధిక్రియం**
**ధనఞ్జయజయం భజే ధృతకిరాతవేషం శివమ్॥ 89**

**ప్రతిపదార్థము :–** ఘనామ్బుదనిభాకృతిమ్ = గొప్ప మేఘముతో సమానమైన ఆకృతిగల, ఘటితమిన్దు పుష్పోల్లసల్లతాగ్రథిత మౌలికమ్ = చక్కగా కూర్చబడిన చన్ద్రుడను పుష్పముతో ప్రకాశించు తీగలచే గ్రుచ్చబడిన తలగల, లలితనేత్ర రక్తోత్పలమ్ = అందమైన కన్నులను ఎఱ్ఱ కలువలుగల, సచాపశరభీషణమ్ = ధనుర్బాణములతో కూడిన, సమణి మన్త్రసిద్ధి క్రియమ్ = మణి మన్త్రములు సిద్ధులు క్రియలుగల, ధనఞ్జయ జయమ్ = అర్జునుని జయించు, ధృతకిరాతవేషమ్ = ధరించిన కిరాత వేషముగల, శివమ్ = శివుని, భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** గొప్ప మేఘమువలె నల్లని ఆకారమును శిరమున చన్ద్రుడను పుష్పమును జడలను తీగలను గ్రుచ్చుకొని కను లెఱ్ఱకలువల వలె ఎఱ్ఱనివిగా జేసికొని ధనుర్బాణముల ధరించి మణి మన్త్రసిద్ధి క్రియలు గలవాడై అర్జునుని జయించు కిరాత వేషము ధరించిన శివుని సేవించెదను.

**వివరణ :–** శివుడు తెల్లనివాడు. కిరాతవేషము వేయదలచుకొని తన దేహమున నల్లని రంగు పులుముకొని వర్షాకాలమేఘము వంటి ఆకృతి గలవాడైవాడు ఆకృతి ఘనామ్బుదనిభమని చెప్పబడుటచే నచట ఉపమాలంకార మేర్పడినది. కిరాతులు తలకు చంద్రుని ఆభరణము ధరించెదరు. లేదా మొగలి పువ్వును తురుముకొందురు. శివునకు మొగలి పువ్వును సంపాదించవలసిన ఆవశ్యకత లేదు. దానితో పోలిన చంద్రరేఖ ఉన్నది. దానినే తలపై పువ్వుగా మలచుకొన్నాడు. కిరాతులు తమ తలకు తీగల చుట్టుకొందురు. చిన్న చిన్న రెమ్మల తలకు గ్రుచ్చుకొందురు. శివునకు తలపై నున్న పాములే తీగగా చేసి తలకు చుట్టుకొనవచ్చును. లేదా దానితో జడలను ముడిచి కట్టుకొనవచ్చును. కావున పామునే తీగగా మలచుకొన్నాడు. సఘటిత చన్ద్ర పుష్పోల్ల సల్లతాగ్రథితమౌలికమ్ అను విశ్లేషణము జడలను తీగలు చంద్రుడను పుష్పమును పుష్పించినట్లు స్ఫురింపజేయుటచే నిచట రూపకాలంకార వ్యక్తియు నున్నది. ఇప్ప పూవు సారా త్రాగిన కిరాతుల కన్ను లెఱ్ఱ బారియుండును. శివుని ఫాలనేత్రమెఱ్ఱని

నిప్పు కణముల చిందించుచు నెఱ్ఱగానే కన్పడును. సూర్యనేత్ర మెఱ్ఱనిదే. సంధ్యారుణ చంద్రుడును ఎఱ్ఱనివాడే కావున చంద్రనేత్రము చెప్పబడుటచే రూపకాలంకార మేర్పడినది. సమాస భేదమున నిచట లుప్తోపమాలంకార మనియు చెప్పవచ్చును. కిరాతులు ధనుర్బాణములు ధరించి తిరుగుచుందురు. శివునకెట్లును పినాకధనువు, నారాయణ శరము నున్నవి. కావున ఆతనికి శరచాప ధారణమునకే పృథక్ప్ర యత్నమక్కఱయే లేదు. కిరాతులు అడవులలో గుట్టలలో లభించిన విలువగల మణులను పాషాణములను సంపాదించుకొందురు. వారికి పూర్వుల ఉపదేశమున వాని మహత్త్వమేమియో తెలియును. ఏ మణి ధరించిన ఏ శుభము లేక అశుభము కలుగునో వారికి తెలియును. ఏ మణులింట నుండిన రోగములు ఆ యింటిలోని వారికి సంక్రమింపవో వారెఱుగుదురు. వారికి మంత్రములు తెలియును. ఆ మంత్రముల జపించి సిద్ధులను సంపాదించు కొందురు. అట్లే కొన్ని కనుకట్టులు, కొన్ని మాయక క్రియలు నేర్చుకొని లోకరంజనము చేయుచుందురు. లేదా లోకుల దోచుకొందురు. శివునికవి యన్నియు కరతలా మలకములే. ఇంతటి కిరాత వేషసామాగ్రి యుండగా నా వేషమును ధరించుట కాతనికెంత సేపు పట్టును? చిటికలో కిరాతవేషము ధరించి ధనంజయుని జయించుట కాతని పై కయ్యమునకు కాలు దువ్వినాడు. ధనుంజయుడన గొప్ప ధనవంతుడు. వానిని జయించుట ఆతని దోచుకొనుటకే అనుట అనునది సామాన్య కిరాతుని విషయమున సంభవము. ఇచటి శివుడు కిరాత వేష ధారియే కాని కిరాతుడు కాడు. ధనుంజయుని జయించి ఆతని గర్వము నణచి ఆతనికి పాశు పతాస్త్రమునను గ్రహించినాడు. నృసింహమూర్తిని ధరించిన విష్ణువును చూచి ప్రహ్లాదుని వలె లోక భీకర కిరాతవేషమును ధరించిన శివుని దర్శించి భయము చెందక ఆతని సేవించుట కెంత పుణ్యము కావలెనో? ఈ శ్లోకమున అన్ని పాదములందును దాదాపుగా పదాద్యనుప్రాసమున్నది. "పుష్పోల్లసల్లతా" మౌళికం లలిత రక్త నేత్రోత్పలమ్ అను పదబంధములలో వృత్త్యనుప్రాసములున్నవి. 'ధనంజయ జయమ్' అను పదబన్ధము లేక ధనపతికి ధనమునకు కాక నిధనపతికి జయవెట్టుచున్నట్లున్నది. దీనియందు యమకాలంకారమున్నది. ప్రతిపాదమున జ-స-జ-స-య-ల-గ అను గణము లుండుటచే నీ శ్లోకము పృథ్వీవృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కిరాత మూర్తి వర్ణింపబడినది. ఈ శ్లోకమున ఆయన అష్టమూర్తులలోని **భూమి** అను ప్రథమమూర్తి వర్ణింపబడుచున్నది.





**శ్లో॥ ధాత్రీమనన్తాం విపులాం – స్థిరాం విశ్వమ్భరాం ధరామ్।**
**గాం గోత్రామవనీ మాద్యా – మ్మూర్తిం శమ్భోర్భజామ్యహమ్॥ 90**

**ప్రతిపదార్థము :–** ధాత్రీమ్ = పోషించునట్టి, అనన్తామ్ = అన్తములేనట్టి, విపులామ్ = విశాలమైనట్టి, స్థిరామ్ = స్థిరమైనట్టి, విశ్వమ్భరామ్ = విశ్వమును మోయునట్టి, ధరామ్ = ధరించునట్టి, గామ్ = సాధువై ఆవోయనునట్లున్న, గోత్రామ్ = (జీవరూప) గోవులను కాపాడునట్టి (ఆహారమునిచ్చి గోవుల భయమును తొలగించునట్టి), అవనీమ్ = రక్షించునట్టి, శమ్భోః = శివునియొక్క, ఆద్యామ్ = మొదటి, మూర్తిమ్ = ఆకృతిని, అహమ్ = నేను, భజామి = సేవించెదను.

**తాత్పర్యము :–** పోషించునట్టి, అంతములేని విశాలమైన, స్థిరమైన విశ్వమును ధరించు, ధరించునట్టి గోవువలె సాధువైన, గోవులకాహారమిచ్చిన వాని భయమును తొలగించి, రక్షించు, భూమి అను శివుని, ప్రథమ మూర్తిని సేవించెదను.

**వివరణ :–** ఈ శ్లోకములోని ధాత్ర్యాది **నవ** పదములు రూఢి (అభిధా శక్తి)తో భూమికి వాచకములు. అనగా భూమి పేర్లు నిఘంటువులీ పేర్లతో భూమినే పేర్కొనును. ఈ పదములే యోగశక్తితో ప్రతిపదార్థమున చెప్పబడిన అర్థముల బోధించును. పునరుక్తిని వారించుట కీ యోగార్థ మాశ్రయించుట ఆవశ్యకము. శివుని ధర్మము లాతని మూర్తియందును గోచరించుననుట యోగార్థ స్వీకరణమునకు ప్రయోజనము. ఇందు పునరుక్తవదాభాసమనునలంకారము ఏర్పడియున్నది. భూమూర్తిని ధరించిన శివునకు శర్వుడని రూఢియున్నది. అంగారకునకు(భూ)జ అని పేరున్నందను అంగారకుడీశ్వరుని పుత్రుడు. శివపురాణమున శివుని ఫాల ఘర్మ బిందువు క్రింద అనగా భూమిపై పడి అంగారకుడు జన్మించినట్లు కథ కలదు. ఈ శ్లోకము అనుష్టుప్ఛందో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని మొదటి భూమూర్తి భజింపబడినది. ఈ శ్లోకమున రెండవదైన **జలమూర్తి** చెప్పబడుచున్నది.

**శ్లో॥ అమృతం జీవనం వారి – కమలం సర్వతోముఖమ్।**
**ద్వితీయమస్య రూపం చ – భజేఽ హం పరమేశితుః॥ 91**

**ప్రతిపదార్థము :–** అమృతమ్ = మరణములేని, జీవనమ్ = బ్రతుకైన, వారి = వారించు, కమలమ్ = బ్రహ్మయొక్క (వస్తిరూప) మలమైనట్టి, సర్వతోముఖమ్ = అన్నివైపుల ముఖములు గలిగినట్టి, అస్య = ఈ, పరమేశితుః = శివునియొక్క, ద్వితీయమ్ = రెండవదైన, రూపమ్ = మూర్తిని, అహమ్ = నేను, భజే = సేవించెదను.

**తాత్పర్యము :-** మరణములేని బ్రతుకైన, వారించునది బ్రహ్మయొక్క వస్తిరూప మలమైనట్టి, అన్ని వైపుల ముఖములు కలిగిన ఈ పరమేశ్వరుని రెండవ మూర్తియైన జలమును భజించెదను.

**వివరణ :-** జలము జీవనాధారము. అదిలేనిచో ఒకటి రెండు దినములలోనే మరణము సంభవించును. అది యున్నచో మరణము శీఘ్రముగా రాదు. ఘనాహారమున గూడ జలమే అధికము. జలేంద్రియమైన రసనచేనిది రస(ద్రవ)ముగా మారి యాస్వాదింప బడును. నీరు దొరకక దప్పికతో చావబోవు వారికి గ్రుక్కెడు నీటిని గొంతులోనికి పోసినచో అమృతము అది లేనిది బ్రతుకే లేదు. ప్రాణములే నిలువవు. జీవులందఱి జీవనమున కాధారము కావున జలము జీవనమని చెప్పబడినది. మన కడుపులో వస్తియను మలమొకటి యుండును. బ్రహ్మ ఆతని వస్తిమలమగుటచే జలమునకు కమలమును పేరేర్పడినది. తూర్పు పడమఱ అను భేదములేక అన్ని వైపులలో పల్లమునకు పారుటచే నిది సర్వతోముఖము. ఇట్టి జలమూర్తిని ధరించిన శివునకు భవుడని రూఢియున్నది. ఈశ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుని రెండవదైన జలమూర్తి భజింపబడినది. ఈ శ్లోకమున శివుని మూడవదైన **అగ్నిమూర్తి** ధ్యానింపబడుచున్నది.

**శ్లో॥ జ్వలనం పావకం దివ్యం - సువర్ణం కాఞ్చనం శుచిమ్।**
**తృతీయమూర్తిం తేజోఽహం - కలయే పార్వతీపతేః॥ 92**

**ప్రతిపదార్థము :-** జ్వలనమ్ = మండునట్టి, పావకమ్ = పవిత్రమొనర్చునట్టి, దివ్యమ్ = స్వర్గము నందుండునట్టి, సువర్ణమ్ = మంచి రంగుగల, కాఞ్చనమ్ = ప్రకాశించునట్టి, శుచి = పవిత్రమైనట్టి, పార్వతీపతేః = శివునియొక్క, తృతీయమూర్తిం = మూడవ మూర్తియైన, తేజః = తేజమును, అహమ్ = నేను, కలయే = ధ్యానించెదను.

**తాత్పర్యము :-** మండునట్టి, పవిత్రమొనర్చునట్టి, స్వర్గమునందున్నట్టి, మంచి రంగుగల, ప్రకాశించునట్టి, పవిత్రమైనట్టి శివుని తృతీయమూర్తియైన తేజమును ధ్యానించెదరు.

**వివరణ :-** జ్వలన పావక శుచి శబ్దములు అగ్నియందు రూఢములు. సువర్ణ కాంచన శబ్దములు బంగరు నందు రూఢములు. అవి తేజో భూతాంతర్గతములని తార్కికుల మతమగుటచే తేజోమూర్తి ధ్యానమున స్థానమును పొందినవి. స్వర్గవాసులైన దేవతలకగ్ని ముఖమగుటచే అగ్నిమూర్తి దివ్యమని చెప్పబడినది. ఈ అగ్ని మూర్తిని ధరించిన శివునకు పశుపతి యని రూఢియున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.





**అవతారిక :-** పై శ్లోకమున శివుని మూడవ మూర్తియైన తేజము ధ్యానింపబడినది. ఈ శ్లోకమున శివుని చతుర్థ వాయుమూర్తి భజింపబడుచున్నది.

**శ్లో॥ సదాగతిం జగత్ప్రాణం - మరుతం మారుతం సదా।**
**చతుర్థన్తమ్మూర్తిభేదం - శఙ్కరస్య భజామ్యహమ్॥ 93**

**ప్రతిపదార్థము :-** సదాగతిమ్ = ఎడతెగని గమనముగల, జగత్ప్రాణమ్ = జగములకు ప్రాణమైన, మరుతమ్ = ఇన్ద్రునిచే ఏడువవద్దని చెప్పబడిన, మారుతమ్ = చిన్న చిన్న మరుత్తులచే (పెద్దదిగా) నేర్పడిన, శఙ్కరస్య = శివునియొక్క, చతుర్థమ్ = నాల్గువదైన, (తమ్ = ఆ), మూర్తిభేదమ్ = మూర్తివిశేషమును, సదా = ఎల్లప్పుడు, అహమ్ = నేను, భజామి = సేవించెదను.

**తాత్పర్యము :-** ఎల్లప్పుడు కదలు, జగములకు ప్రాణమైన, ఇంద్రునిచే నేడవ వద్దని చెప్పబడిన, చిన్న చిన్న గాలులు కలిసి మహా వాయువు (భూతము)గా నేర్పడిన, శివుని నాల్గవదైన వాయుమూర్తిని సేవించెదను.

**వివరణ :-** సదాగతి జగత్ప్రాణ మరుత్ మారుత శబ్దములు వాయువున రూఢములు. ఇంద్రుని సంహరించు కోరికతో సంధ్యాకాలమున కశ్యపుని సంగమించిన దితికి భర్త కశ్యపుడు సంవత్సరకాలము పగలు నిద్ర పోగూడని నియమముగల వ్రతము నుపదేశించును. వ్రత భంగము చేయగోరి ఇన్ద్రుడామెను సేవించుచుండెను. ఒకనాడు పగలు నిద్రించుచుండగా ఇంద్రుడామెగర్భమున ప్రవేశించి గర్భమును ముక్కలు ముక్కలు చేయుచుండగా ఆ గర్భ రూప శిశువు ఏడ్చుచుండగా మారుద, మారుద (ఏడవవద్దు, ఏడువవద్దు) అని చెప్పెను. ముక్కలు గానే దితికి జన్మించిన శిశువులకు మరుత్తులని పేరు కలిగినదని పురాణగాథ యున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనమే. శివుని ఈ వాయుమూర్తికి **ఈశానము** అని రూఢియున్నది.

**అవతారిక :-** పై శ్లోకమున శివుని వాయుమూర్తి చెప్పంబడినది. ఈ శ్లోకమున శివుని ఐదవ ఆకాశమూర్తి సేవ చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆకాశం పుష్కరం నాక - మనన్తం శబ్దకారణమ్।**
**పఞ్చమం మూర్తిరూపం చ - శమ్భోస్సేవే నిరన్తరమ్॥ 94**

**ప్రతిపదార్థము :-** ఆకాశమ్ = మిక్కిలి ప్రకాశించు, పుష్కరమ్ = తామర జలమును వలె దేనిని అంటనట్టి, నాకమ్ = దుఃఖములేని, అనన్తమ్ = అన్తములేని, శబ్దకారణమ్ = ధ్వనికి హేతువైన, పఞ్చమమ్ = ఐదవ, శమ్భోః = శివునియొక్క, మూర్తి రూపమ్ = మూర్తి రూపమును, నిరంతరమ్ = ఎల్లప్పుడు, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :–** మిక్కిలి ప్రకాశించు, దేనిని అంటని, దుఃఖరహితమైన, అంతములేని శబ్దమును జనింపజేయు శివుని ఐదవ ఆకాశమూర్తిని సేవించెదను.

**వివరణ :–** ఆకాశపుష్కరానన్త శబ్దములు ఆకాశమున రూఢములు. నాక శబ్దము స్వర్గవాచి యైనను ఆ స్వర్గము ఆకాశగత మైనందున నాకశబ్దము ఆకాశమును కూడ బోధించును. శబ్దగుణక మాకాశమని తార్కికులు. ఆకాశగుణము శబ్దము అని చెప్పెదరు. గుణము ద్రవ్యము నుండియే జనించును. కావున గుణమునకు ద్రవ్యమే కారణము. ఇచట శబ్దగుణము ఆకాశద్రవ్యమునుండియే జనించిన దగుటచే తర్కశాస్త్రమున ఆకాశము శబ్దకారణమని చెప్పబడినది. ఈ అయిదవ ఆకాశమూర్తిని ధరించిన **శివునకు భీమ** అని రూఢి యున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని ఐదవ ఆకాశమూర్తి సేవనము చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని ఆఱవ **సూర్యమూర్తి** చెప్పబడుచున్నది.

**శ్లో॥ ప్రభాకరమినం హంసం – లోకబన్ధుం తమోపహమ్।**
**త్రయీమూర్తిం మూర్తిభేదం – షష్ఠం శమ్భోర్భజామ్యహమ్॥ 95**

**ప్రతిపదార్థము :–** ప్రభాకరమ్ = కాంతికి గనియైన లేక కాంతిని కలిగించు, ఇనమ్ = ప్రభువైన, హంసమ్ = హంసరూపుడైన, లేక హంసమంత్ర స్వరూపుడైన, లోకబన్ధుమ్ = లోకమునకు చుట్టమైన, తమోపహమ్ = చీకటిని లేక అజ్ఞానమును నశింపజేయు, త్రయీమూర్తిమ్ = ఋగ్యజుస్సామ వేదత్రయము ఆకృతిగాగల, శమ్భోః = శివునియొక్క, షష్ఠమ్ = ఆఱవ, మూర్తి భేదమ్ = ఆకృతి విశేషమును, అహమ్ = నేను, భజామి = సేవించెదను.

**తాత్పర్యము :–** కాంతికి గనియై దానిని వెలువరించు ప్రభువైన హంసమంత్ర స్వరూపుడైన (హం–స అను ఱెక్కలుగల) లోక బన్ధువైన చీకటిని అజ్ఞానమును బోగొట్టు శివుని ఆఱవ సూర్యమూర్తిని సేవించెదను.

**వివరణ :–** ఇన ప్రభాకర హంస శబ్దములు సూర్యునందు రూఢములు. బన్ధువు వలె లోకమునకు సంతోషము గూర్చు సూర్యుడు లోకబన్ధువని చెప్పబడును. ఆయన ముఖ్యకార్యము చీకటిని దానితోపాటు అజ్ఞానమును కూడా పోగొట్టుట. చీకటిలో కనబడని వస్తువులు చీకటి తొలగి ఆ వస్తువులు కనబడుటచే వానికి సంబంధించిన అజ్ఞానము కూడ తొలగును కదా! అందుచేత ఆయన 'తమోపహమ్' అని చెప్పబడినాడు. తమశ్శబ్దము చీకటిని అజ్ఞానమును గూడ బోధించును. రవమనగా ధ్వని, ధ్వనించువాడు





గావున సూర్యుడు రవి అని చెప్పబడినాడు. ఆ ధ్వని ఓంకార స్వరూపము. ఆ ఓంకారములోని అకార ఉకార మకారముల నుండి ఋగ్యజస్సామములు విస్తరింపబడినవి. కావున సూర్యుడు ఆ వేదముల స్వరూపము అను అర్థమిచ్చు త్రయీమూర్తి శబ్దముచే చెప్పబడును. శివుని ఈ ఆఱవ సూర్యమూర్తికి రుద్రుడను రూఢియున్నది. భగవంతుడే జగమును తన్మూలమైన రూపమైన ఉచ్ఛ్వాస నిశ్శ్వాస రూపమున వెలువరించుచు లోగొనుచున్నందున భగవంతుడు హంస మన్త్రస్వరూపుడు. **యస్యనిశ్వసితం వేదాః** అను శ్రుతి ననుసరించి ప్రణవ (ఓంకార) విస్తృతియైన హంసమన్త్ర విస్తృతియే వేదము. వేదశబ్దముల నుండి పుట్టిన జగము సోఽహమ్ అను మన్త్రమే ఆ వృత్తి సమయమున హంస అను రూపమును కూడ ధరించును. సోఽహమ్ మంత్రము గోపనీయమను బుద్ధితో సోఽహమ్ మంత్రమని చెప్పబడక హంసమంత్రమని చెప్పబడినది. ఆ మన్త్రములో సో అనునది ఉచ్ఛ్వాస రూపము. హం అనునది నిశ్శ్వాస రూపము. ప్రశ్లేషలో అకారము కనబడకపోయినను ఆ మన్త్రము **అహంసః** నేనే ఆ బ్రహ్మమును అని అర్థమును బోధించును. ఈ అర్థముగల ఆ రెండు అక్షరములు సృష్టి ప్రలయములను గూడ బోధించును. భగవంతుని ఉచ్ఛ్వాసము ప్రలయము. ఆయన నిశ్శ్వాసము సృష్టి. ఇవి యొనరించు భగవంతుని ఉపాసనకు ప్రతీకముగా సూర్యుడు హంస శబ్దబోధకుడు. ఉపాస్య భగవానుడు కూడా హంస శబ్దబోధ్యుడు అగ్ని ష్టోమములను ఱెక్కలు ఈ హంసకున్నవి. అగ్ని ప్రలయమునకు, సోమము సృష్టికి ప్రతీకములు. కొన్ని జీవులు నశించి కొన్ని జీవులు సృజింపబడును. శవము కుళ్ళి అనేక జీవులుగా సృజింపబడుట మనమెఱిగినదే.

ఈ సృష్టి ప్రలయములు ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములవలె నిరంతర ప్రవృత్తములై యుండును. సర్వజీవ సమష్టియైన భగవానుని వ్యష్టి రూపములే జీవులు. వ్యష్టియైన జీవుడు నుచ్ఛ్వాసనిశ్శ్వాసముల ద్వారా కొన్ని జీవుల సంహరించుచు కొన్ని జీవుల సృజించు చుండును. జీవుల ఉచ్ఛ్వాస నిశ్శ్వాసములు గూడ హంసో అను అక్షర ద్వయరూపములే. ప్రథమ జీవుడైన హిరణ్యగర్భుడు సూర్యమండలమున ఉపాస్యుడు. అతను ఆతని ప్రతీకమైన సూర్యగోళము కాని తదధిష్ఠాన దేవతా మూర్తియైన సూర్యుడు హంసములుగానే చెప్పబడును. జీవులచే ముఖ్యముగా మనుష్యులచే ఉచ్ఛ్వాస నిశ్శ్వాస రూప హంసమంత్రమువలె దినమునకు (ఇరువది నాలుగు గంటలకు) ఇరువది యొక్క ఆరువేల పర్యాయము లప్రయత్నముగా జపించబడుచుండును. కావున ఈ మంత్రజపములు జపముకాని (జపము)ది అను భావన అజప యని చెప్పబడును.

అజపాగాయత్రి యనియు దీనికిపేరు. గాయత్రీ మంత్రములోని మూడు పాదములు ఋగ్వజస్సామ రూపములు **"సోఽహమస్మి"** అను మహావాక్యముయొక్క విస్తృతి రూపములు. ఈ మన్త్రములోని ప్రథమ పదము బ్రహ్మమును, ద్వితీయ పదము జీవుని, తృతీయ పదము అస్మి అను పదముయొక్క అర్థమైన అభేదమును బోధించును. అస్మి అను పదము లేకపోయినను సోఽహమ్ అను పదములు జీవేశ్వరాభేదమునే బోధించును. కావున గాయత్రీ మంత్రార్థమునే హంస మంత్రార్థము కలిగియున్నందున అనుష్టుప్ఛన్దో నిబన్ధనమే. ఇందు వర్ణింపబడిన శివుని రవిమూర్తికి **రుద్రనామము** రూఢమైయున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని ఆఱవ సూర్యమూర్తి భజనము చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని ఏడవ చంద్రమూర్తి చెప్పబడుచున్నది.

**శ్లో॥ శుభ్రాంశుసోమమమృత – కరం చన్ద్రమసం సదా।**
**కలానిధిం మూర్తిభేదం – సప్తమం శూలినో భజే॥ 96**

**ప్రతిపదార్థము :–** శుభ్రాంశు = తెల్లని కిరణములుగల, సోమమ్ = ఉమయను షోడశ కలాసమష్టితో కూడిన, అమృతకరమ్ = మోక్షమును కలిగించు, సదా = ఎల్లప్పుడు, చన్ద్రమసమ్ = ఆహ్లాదింపజేయు, రమింపజేయు, కలానిధిమ్ = కలలకు నిధియైన, శూలినః = శివునియొక్క, సప్తమమ్ = ఏడవదైన, మూర్తిభేదమ్ = మూర్తి విశేషమును, భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** తెల్లని కిరణములుగల, ఉమయను షోడశ కలాసమష్టితో కూడిన అమృతమును అనగా మోక్షమును కలిగించు, ఆహ్లాదింపగ, రమింపగను చేయు కలానిధియైన శివుని ఏడవమూర్తి భేదమును భజించెదను.

**వివరణ :–** ఉదయకాలమున ఎఱ్ఱగానున్న సూర్యచంద్రుల కాంతులు మరల అస్తమింప బోవునప్పుడు ఎఱ్ఱగా నుండును. మధ్యకాలమున సూర్యకాంతియు, చంద్రకాంతియు తెల్లగానే ఉండును. కాని సూర్యకిరణములు తాపమును కలిగించు ఎఱ్ఱని అగ్నివలె తాపమును కలిగించునవగుటచే మధ్యకాలము నందును సూర్యుడు రక్తకిరణుడనియే చెప్పబడును. తద్వ్యతిరేకముగా ఆహ్లాదింపజేయు చంద్రుడు శుభ్రాంశువుగా చెప్పబడును. తిథులు పదేను. కావున కలలును పదేనే అనుభవింపబడినప్పుడు వాని సమష్టి కల **అమ**యని చెప్పబడును. మా యనగా కాంతి. అది మిక్కిలి అల్పముగా నున్న తిథి అమావాస్య అని చెప్పబడును. **అమా** శబ్దములోని నఞ్ శేషమైన అకారము అభావముగానే గాక అల్పతను కూడ బోధించును. కావున అమయనగా మిక్కిలి అల్పమైన





కాంతి. అనియు చెప్పబడినది. అమావాస్యనాడు కూడ అప్పుడప్పుడు చన్ద్రోదయ ముండును. అట్టి అమావాస్యను అనగా నష్ట చన్ద్రయైన అమావాస్య **కుహు** అని పేర్కొనబడును. కావున అమ సమష్టి కలగాక వ్యష్టికలయే యగును. కావున చన్ద్రస్పర్శలేని అమ షోడశ కలా సమష్టియైన ఆ యమావాస్య మహా సప్తదశి (దేవి) యని పేర్కొనబడును. పదేను కలలున్న తిథి **పూర్ణ** అని చెప్పబడును. పదేను కలలున్న వన్నను నది పదేను కలల సమష్టియే గదా. దానిని తన్త్ర శాస్త్రమున **షోడశి** యని చెప్పుదురు. కాల స్వరూప (కాళీ) దేవత యమయని మయ యనియు చెప్పబడును. షోడశి యమ చన్ద్రున కధి దేవతగా చెప్పబడుటచే చన్ద్రునకు సోమనామ మేర్పడినది. పదేను కలలతో కూడియున్న చన్ద్రునందు అమయనగా కాంత్యభావము కళంక రూపమున అనగా మృతిలేనందున దానిని కొందఱు అమృతకలయని చెప్పెదరు. **"వన్దే మహి చ తం వాణిమమృతా మాత్మనః కలామ్"** అని భవభూతి ఆ ఆత్మకలను అమృతయని పేర్కొనినాడు. చన్ద్రునిలోని అమృతమును దేవతలు ప్రతిదిన మాస్వాదించుటచే చన్ద్రుడు ప్రతిదినము క్షయము నొందునని పురాణములు పేర్కొన్నవి. దేవతల కాహారమైన అమృతమునొసగు చంద్రుడమృతకరుడని చెప్పబడును. ఈ అమృతము మోక్షరూపము కాదు. పాలసముద్రమున చన్ద్రుడు జన్మించినాడు. ఆ చన్ద్రుడు జన్మించిన తరువాతనే జన్మించిన అమృతము దేవతలకు ప్రలయాన్త పర్యన్త జీవనమును కలిగించును. సర్వజీవులు ప్రలయ కాలము వఱకు పెక్కుసార్లు చచ్చుచుండగా దేవతలట్లు చావరు. కావున ఆ అమృతము లేక అమృత(త్వ) స్థితి ఆత్మజ్ఞాన సాధ్యము. అట్టి ఆత్మజ్ఞానులకే మోక్షము. మోక్ష రూపామృత స్థితి. అది సంపూర్ణానంద స్వరూపము. శివుని దయానన్ద స్వరూపము కావున శివమూర్తి అమృతకరము. ఇట్లీ అమృతకర శబ్దము నశ్వరామృత స్వరూప సోముని అనగా చంద్రుని అనశ్వరామృత స్వరూపుడైన సోముని అనగా శివునిగూడ బోధించును. చన్ద్రమస్ శబ్దము చదిరము అను రెండు ధాతువులనుండి యేర్పడినదని భాషాశాస్త్రజ్ఞుల అభిప్రాయము. చదిధాతు వాహ్లాదార్థకము. రముధాతువు క్రీడార్థమైన క్రీడ. ఆనందమును సూచించును. కావున అదియు ఆనందార్థకమని చెప్పవచ్చును. లోకమున ఇతరుల నాహ్లాదింపజేయ వలసి వచ్చినప్పుడు తాను కష్టపడక తప్పదు. అట్లు తానేమాత్రము కష్టపడకుండ ఇతరుల నానందింపజేయ గలుగుట ఈశ్వరునకే సాధ్యము. ఆ ఈశ్వరుడు తాను కష్టపడక ఇతరుల నాహ్లాదింపజేయును. ఇతురుల తాము కష్టపడుచు పరుల సంతోషింపజేయుదురు. కావున ఆయన చన్ద్రమశ్శబ్దవాచ్యుడు. అనగా ఆహ్లాదింపజేయు వారిని (చన్దింపజేయు వారిని) ఆనందింపజేయును

(రమింపజేయును). ఈ పక్షమున చది రము అనగా రెండు ధాతువుల కలయికకు సార్థకత యేర్పడును. ఇది సాంప్రదాయిక వ్యాకరణము ననుసరించిన వివరణము కాదని వేరుగా చెప్పనక్కఱలేదను కొందును. చన్ద్రుడు కలలకు నిధి అనగా పదేనో లేక పదారోకలల సమష్టి స్వరూపముగా గలవాడు. కావున ఆయన కలానిధి అని చెప్పబడినాడు. శివుని ఈ ఏడవ చంద్రమూర్తికి **మహాదేవుడ**ని రూఢియున్నది. కలలనగా విద్యలు. **ఈశ్వరస్సర్వవిద్యానామ్**, అను శ్రుతి ననుసరించి శివుని ఈ సప్తమ కాల మూర్త్యుపాసకులకు సర్వవిద్యాసిద్ధి (ప్రాప్తి)యు కలుగును. కలానిధి శబ్దము శివునిలోని సర్వజ్ఞత్వరూపమైన శివుని షడంగములలో మొదటిదైన అంగమును సూచించును. కల అనగా అంశము (భాగము). కలానిధి అన్న కలల కలయిక. వాని సమష్టియు నైన బిందువును లేక వృత్తమును సూచించును చంద్రుని ఆకారము బిన్దువని అదియే శివమూర్తియని తాన్త్రిక సిద్ధాంతము. ఈ శ్లోకమున వర్ణింపబడిన చన్ద్రమూర్తికి మహాదేవ నామము రూఢమైయున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని ఏడవ చన్ద్రమూర్తి చెప్పబడినది. ఈ శ్లోకమున శివుని ఎనిమిదవ యజమాన మూర్తి చెప్పబడుచున్నది.

**శ్లో॥ ఆహితాగ్నిం యాగకారం – యజ్వానం సోమయాజినమ్।**
**అష్టమం మూర్తిసంభేద – మష్టమూర్తేర్భజామ్యహమ్॥ 97**

**ప్రతిపదార్థము :–** ఆహితాగ్నిమ్ = అగ్న్యాధానమను వైదికకర్మ నొనరించిన, యాగకారమ్ = దేవతోద్దేశమున ద్రవ్యమును త్యజించుట అను యాగమును చేయు, యజ్వానమ్ = దేవతలబూజించు, సోమయాజినమ్ = సోమయాగము నొనరించిన, అష్టమూర్తేః = శివునియొక్క, అష్టమమ్ = ఎనిమిదవ, మూర్తి సమ్భేదమ్ = మూర్తి విశేషమును, అహమ్ = నేను, భజామి = సేవించెదను.

**తాత్పర్యము :–** అగ్న్యాధానము యాగము దేవతాపూజ సోమయాగము నొనరించు శివుని ఎనిమిదవ అష్టమమైన యజమాన మూర్తిని సేవించెదను.

**వివరణ :–** ఈ శ్లోకమున వర్ణింపబడిన శివుని యజమాన మూర్తికి **ఉగ్రనామము** రూఢమైయున్నది. శివుని అష్టమూర్తి యజమాన స్వరూపము. యజమాన శబ్దము వ్యంజించుచున్న వానిని చెప్పును. వర్తమానము అను కాలభేదమును పాటింపక భూతకాలమందు యజ్ఞము చేసిన వానిని కూడ నీ శబ్దము బోధించును. ఈషద్భావి కాలమున యజ్ఞము పూర్తిచేయబోవు వానిని కూడ **వర్తమానసామీప్యే వర్తమాన వద్వా**ః





అను నియమముననుసరించి బోధించును. ఒక్కొక్కచోట యాగ సంబంధములేని సాధారణ పుం వాచక శబ్దము కూడ యజమాన శబ్దమునకు బదులుగా వాడబడిన సందర్భములు కలవు. ప్రసిద్ధ దక్షిణామూర్తి స్తోత్రమున యజమాన శబ్దమునకు బదులు ప్రమాత్ అని ప్రయోగింపబడినది. కొన్నిచోట్ల అహంకారము కూడ శివుని ఎనిమిదవ మూర్తిగా చెప్పబడినది. కావున యజ్ఞ సంబంధములేకున్నను దేహముయొక్క యజమాను (స్వామి)ని బోధించునని గమనింపవలెను. యజమానుని యాజ్ఞచే అగ్నిలో హోమ మొనర్చు హోత అను పేరుగల ఋత్విక్కుకూడ ఈ శ్లోక శబ్దములచే బోధింపబడినాడని చెప్పుట దోషము కాదేమో! యజమానుడే గృహమున నిత్యము హోమమొనరించునో నాతడు కూడ హోతయే యగును. కాళిదాసులు అభిజ్ఞాన శాకుంతల మంగళాచరణ శ్లోకమునందలి హోత అని పేర్కొనబడిన శివుని అష్టమూర్తి ఈ యజమానుడు (హోత) కాదని చెప్పలేము. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని అష్టమ యజమానమూర్తి వర్ణింపబడినది. ఈ శ్లోకమున యజమాన్యమును వదలిన మునిమూర్తిగా వర్ణింపబడుచున్నాడు.

**శ్లో॥ హస్తద్వయేనాంఘ్రితలద్వయం స్వ–**
**మూరుద్వయే సంపరియోజయన్తమ్।**
**పద్మాసనే రూఢతరం జపన్తం**
**మునిమ్మహేశమ్ముహురాశ్రయామి॥ 98**

**ప్రతిపదార్థము :–** హస్తద్వయేన = చేతులజంటతో, స్వమ్ = తన, అంఘ్రితల ద్వయమ్ = పాద తలముల జంటను, ఊరుద్వయే = తొడల జంటయందు, సంపరి = యోజయన్తమ్ = కలుపుచున్న, పద్మాసనే = పద్మాసనమునందు, రూఢతరమ్ = మిక్కిలి ప్రసిద్ధముగా, జపన్తమ్ = జపించుచున్న, మునిమ్ = మునియైన, మహేశమ్ = మహేశుని, ముహుః = మాటిమాటికి, ఆశ్రయామి = ఆశ్రయించెదను.

**తాత్పర్యము :–** తన చేతులతో తన పాదతలమును తన తొడలయందుంచు (బద్ధ) పద్మాసనమున కూర్చొని మిక్కిలి ప్రసిద్ధముగా జపించుచున్న మునియైన మహేశుని మాటిమాటికి ఆశ్రయించెదను.

**వివరణ :–** పూర్వార్ధమున పద్మాసనము వేయు విధానము చెప్పబడినది. చేతులతో పాదములను తొడలపైనుంచుకొనుట పద్మాసనము వేసికొను విధానము. ఉత్తరార్ధమున ఆ పద్మాసనమున కూర్చొని జపమొనర్చు చున్న మునిగా మహేశుడు వర్ణింపబడినాడు.

శిరమున వెంట్రుకలు మొలచుచు రాలిపోవునట్లు మనసున సంకల్పములు పుట్టి గిట్టు చుండును. ఒక సంకల్పము గిట్టగానే మరొక సంకల్పము పుట్టును. ఇట్లీ సంకల్ప తరంగ ప్రవాహమున కంతములేక మరణ పర్యంతము నిద్రావస్థలో తప్ప కొనసాగుచునే యుండును. పూర్తిగా గుండు గొఱిగించుకున్నవాడు ముండి, ముండనము చేయించుకొన్న శిరము ముండము. కాని మనసున మొలుచు నీ సంకల్ప కేశముల గొరుగు వాడెవ్వడు? తానే వానిని గొరుగవలెను. అట్లు గొరుగ గలవాడు ముని శివుడు ముండికాడు అని చెప్పలేము. **వ్యుప్తకేశాయ నమః** (గొరిగించు కొనబడిన కేశములు గలవాని కొఱకు నమస్సు) అని శ్రుతి వ్యుప్త కేశుడైన శివునకు నమస్సు నొనరించినది. శిరమునందలి వెంట్రుకల నొకవేళ గొరిగించుకొనకున్నను శివుడు మనస్సున మొలచు కేశములవంటి సంకల్పముల గొరిగించుకొని సంకల్పరహితుడై యుండువాడు. మరల మొలవకుండను చేసికొన్నవాడు. అనగా సంకల్ప మూలమైన అజ్ఞానమునే తొలగించు వాని ఆశ్రయణము పాపహరము. సుఖకరము. మూడు పాదములలో ఇంద్రవజ్రా లక్షణము. చివఱి పాదము ఉపేన్ద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోక ముపజాతి చ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివాశ్రయణము చెప్పబడినది. ఈ మూడు శ్లోకములలో నాతని భజనము చెప్పబడుచున్నది.

**శ్లో॥ సతతం సితచన్ద్రమణ్డలోపరి – స్థితపద్మాసనసంస్థితం విభుమ్।**
**ఘనమఞ్జులచన్ద్రవర్ణకం – విలసచ్చన్ద్రకలాధరం పరమ్॥ 99**

**ప్రతిపదార్థము :–** సతతమ్ = ఎల్లప్పుడు, సితచన్ద్రమణ్డలోపరి స్థిత పద్మాసన సంస్థితమ్ = తెల్లని చన్ద్ర మణ్డలముపై నున్న పద్మాసనము నందున్న, విభుమ్ = ప్రభువైన, లేక సర్వవ్యాపకుడైన, ఘనమఞ్జుల చన్ద్ర వర్ణకమ్ = దట్టముగా అందముగా చన్ద్రుని రంగును కలిగియున్న, విలసచ్చన్ద్ర కలాధరమ్ = ప్రకాశించు చన్ద్రకలను ధరించు, పరమ్ = శ్రేష్ఠుడైన.

---

**శ్లో॥ యోగముద్రాక్షమాలాదిద్యోతితాధఃకరద్వయమ్।**
**విధృతామృతసౌవర్ణకలశోర్ధ్వకరద్వయమ్॥ 100**

**ప్రతిపదార్థము :–** యోగముద్రాక్ష మాలాది ద్యోతి తాధః కరద్వయమ్ = యోగముద్ర జపమాల మొదలగు వానితో ప్రకాశింపజేయబడిన క్రింది రెండు చేతులుగల, విధృతామృత సౌవర్ణకలశోర్ధ్వ కర ద్వయమ్ = అమృతకలశముల ధరించిన పై రెండు చేతులు గల.

---



**శ్లో॥ సోమార్కాగ్నివిలోచనం ధృతజటాజూటం సదానన్దదం**
**సన్నాగాఞ్చితయజ్ఞసూత్రమధికం నాగేన్ద్రభూషాధరమ్।**
**శ్రీమన్తం భసితాఙ్గరాగసహితం శార్దూలచర్మామ్బరం**
**భక్తానుగ్రహకారణం మనసి తం శ్రీ రుద్రమీడే పరమ్॥ 101**

**ప్రతిపదార్థము :–** సోమార్కాగ్ని విలోచనమ్ = చన్ద్రసూర్యాగ్నులు నేత్రములుగాగల, ధృత జటాజూటమ్ = ధరించిన జడల సమూహముగల, సదానన్దదమ్ = ఎల్లప్పు డానందము నిచ్చు, సన్నాగాఞ్చిత యజ్ఞసూత్రమ్ = మంచి సర్పము అను పూజనీయ యజ్ఞోపవీతముగల, అధికమ్ = (అందఱకంటె) గొప్పవాడైన, నాగేన్ద్ర భూషాధరమ్ = సర్పరాజులు అను సొమ్ములను ధరించిన, శ్రీమన్తమ్ = (పార్వతి యను నామాంతరము గల) శ్రీగల, భసితాఙ్గ రాగ సహితమ్ = బూడిదయను మైపూతతో కూడిన, శార్దూల చర్మామ్బరమ్ = పులిచర్మము వస్త్రముగాగల, భక్తానుగ్రహకారణమ్ = భక్తులపై దయకు హేతువైన, తమ్ = ఆ, పరమ్ = శ్రేష్ఠుడైన, శ్రీరుద్రమ్ = శ్రీరుద్రుని, మనసి = మనసున, ఈడే = స్తుతించెదను.

**99,100,101 శ్లోకముల తాత్పర్యము :–** తెల్లని చన్ద్ర మండలముపై నున్న, పద్మాసనమందు కూర్చొనియున్న, ప్రభువు సర్వవ్యాపకుడైన దట్టమైన అందమైన చంద్రుని వన్నెకల, ప్రకాశించు చన్ద్రకలను ధరించు శ్రేష్ఠుడైన, యోగముద్ర జపమాల మొదలగు వానితో ప్రకాశింపజేయబడిన క్రింది రెండు చేతులు, సువర్ణ కలశము ధరించినపై రెండు చేతులుగల, సూర్యచన్ద్రాగ్నులు నేత్రములుగా గల నాగేంద్రాభరణముల ధరించిన, శ్రీమంతుడయ్యును బూడిదనే మైపూతగా ధరించిన, శార్దూల చర్మము వస్త్రముగా ధరించిన, భక్తులననుగ్రహించుటకు హేతువైన శ్రేష్ఠుడైన ఆ శ్రీ రుద్రుని మనసున స్తుతించెదను.

**వివరణ:–** చన్ద్రుడు పద్మముల ముకుళింపజేయును. సహస్రార చన్ద్ర మణ్డలముపై పద్మాసనమున శివుడు కూర్చొనియున్నాడు. చన్ద్ర మణ్డలముపై పద్మాసన ముండుట, చన్ద్రునిపై పద్మ విజయమును సూచించును. కావున ఇట విరోధాభాసము వ్యంగ్యమగును. పద్మాసనము ఒక ఆసనము పేరేగాని పద్మము కాదు. కావున విరోధము పరిహరింపబడును. ఇట విరోధాభాసాలంకార స్ఫూర్తియున్నది. తెల్లని వాడగుటచే శివుడు ఘనమఞ్జుల చన్ద్ర వర్ణకుడని చెప్పబడినాడు. ఆ శివుడు విలసచ్చన్ద్ర కలాధరుడు, 99వ శ్లోకములోని నాలుగు పాదములలో చన్ద్ర శబ్దము ప్రయోగింపబడుటచే తెల్లని నాలుగు పాదములు గల వృషభరూపము నీ శ్లోకము ధరించినది. ఏ పద్యముకైనను

నాలుగు పాదములు. కావున అవి యన్నియు శివుని వాహనముయొక్క స్వరూపములే యని భావింపనగును. ఆ పాదములు చన్ద్రశోభితములైనచో ఇక చెప్పవలసినదేమున్నది? 100వ శ్లోకమున శివుని నాలుగు చేతులు వర్ణింపబడినవి. శివుని రెండు చేతులలో యోగముద్ర జపమాలయున్నవి. జీవ బ్రహ్మైక్యమును స్ఫురింపజేయు కుడిచేతి బొటనవ్రేలు (బ్రహ్మము) తర్జని చూపుడువేలు (జీవుడు) వారిని యోజింపజేయు ముద్రయే ఇట యోగముద్ర. దీనికే జ్ఞానముద్ర అనియు రూఢి ఉన్నది. పై రెండు చేతులలో అమృత కలశమున్నది. ఈ అమృతము కూడా జ్ఞానామృతమే. అది త్రాగిన ఇక కృతి యుండదు. భక్తులకు శివుడు జీవ బ్రహ్మైక్యము అను జ్ఞానామృతమును పంచుననుట ఈ నాలుగు చేతులు (క్రింది రెండు పై రెండు చేతుల) యోగ ముద్రామృత కలశభరణములోని అంతరార్థము పైగా ఆ కలశము సౌవర్ణము. అనగా (బంగారుది) మంచి వర్ణములు సోహమక్షరములు అవి సువర్ణములు వానిలో కలశము నందు వలె దాచి యుంచబడినదే జ్ఞానామృతము. జీవబ్రహ్మైక్యమ్ ఆ సువర్ణ కలశము నందలి అమృతము అనగా జ్ఞానము. మరియొక విధముగా కకార లకారములే మంత్రమున శయనించునో ఆ మంత్రము క్లీమ్ అను బీజమంత్రము. దీనిలో కకారలకారములు శయనించి యున్నవి. దీని స్థూలాకృతియే కలశము. కలశ స్థాపనములేని దేవతా పూజయే యుండదు. నవరాత్రాది వ్రతముల కలశముయొక్క స్థాపనముయొక్క అంతరార్థము ఆంతరంగికము. 'క్లీమ్' బీజ స్థాపనమే. 'క్లీమ్' బీజమంత్ర జపానుసన్ధానమ్. దీనియందు కామింపదగిన మోక్షామృతమున్నది. అందుచేత నీ మంత్రము కామరాజు బీజమని చెప్పబడును. 101వ శ్లోకములోని ప్రథమ పాదమున సూర్యచంద్రాగ్ని నేత్రములు గల జటాజూటము గల ఆనన్దము (చది ధాతు జ చన్ద్రార్ధము) ను కనబఱచుచు చూచినవారికి ప్రసాదించుచున్న చంద్రుడు గల శివుని ఉత్తమాంగము అనగా తల వర్ణింపబడినది. రెండవ పాదమున నాగేన్ద్రాభరణ నాగ యజ్ఞోపవీతములు, మూడవ పాదమున భసితాఙ్గ రాగము శార్దూల చర్మముతో కూడిన శివుని మిగిలిన శరీరము వర్ణింపబడినది. నాల్గవ పాదమున మొత్తము శివుని శరీరము భక్తానుగ్రహార్థము ఆతనిచే స్వీకరింపబడినదే అని భక్తానుగ్రహకారణమ్ అను విశేషణముచే సూచింప బడినది. శ్రీ రుద్ర మీడే అను ముగింపు ఇందు ధ్యాన జపాది సాధనములెన్నియో చెప్పబడియున్నవి. అవి యన్నియు అనుష్ఠించలేని వారికీ రుద్రునీ విధముగా స్తుతించిన చాలును. కవితాత్మకముగా శ్లోకరచన ద్వారా స్తుతించలేని వారు దీనిని పఠించిన చాలునను సూచనము కూడా వ్యంజించుచున్నది. 99వ శ్లోకము బేసిపాదమున స-స-జ-ర





అను గణములను, సరి పాదమున స-భ-ర-ల-గ అను గణములు కలిగియుండుటచే ఇది అర్ధసమవృత్త నిబన్ధనము. దీని పేరు లభింపలేదు. 100వ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. 101వ శ్లోకము శార్దూల విక్రీడితమని దీనిలో శార్దూలచర్మామ్బరమ్ అను సమాసము ద్వారా స్ఫురింపజేయుటచే నిట ముద్రాలంకార స్ఫూర్తియున్నది.

**అవతారిక :–** పై శ్లోకమున శివకర్ణామృత ద్వితీయాధ్యాయము ముగింపబడినది. ఈ శ్లోకమున తత్పఠన ఫలము చెప్పబడుచున్నది.

**శ్లో॥ శ్రీకరీ పఠతామేషా శివకర్ణామృతస్తుతిః।**
**శివానన్దకరీ నిత్యం భూయాదాచన్ద్రతారకమ్॥ 102**

**ప్రతిపదార్థము :–** ఏషా = ఈ, శివకర్ణామృతస్తుతిః = శివకర్ణామృత స్తుతి, నిత్యమ్ = ఎల్లప్పుడు లేక ప్రతిదినము, పఠతామ్ = చదువు వారికి, శ్రీకరీ = జ్ఞానానందముల నొసగునదై, శివానందకరీ = (ఉపాస్యుడైన) శివునకు ఆనన్దము కలిగించునదై, ఆచన్ద్రతారకమ్ = చన్ద్రుడు నక్షత్రములు నుండు వఱకు, భూయాత్ = ఉండుగాక!

**తాత్పర్యము :–** ఈ శివకర్ణామృత స్తుతి నామక గ్రన్థము చదువువారికి మోక్షానందములను కలిగించుటకు కారణమైన శివానన్దమును కలిగించును. చన్ద్ర నక్షత్రములు లుండునంత కాలము అనగా ప్రలయ పర్యన్తము విద్వన్ముఖముల నిలచియుండుగాక!

**వివరణ :–** ఈ శ్లోకమున ఫలశ్రుతితోపాటు కవి తన గ్రంథ మా చంద్ర తారక ముండవలయునను ఆకాంక్షను వ్యక్తపఱచియున్నాడు. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---



శ్రీః

## తృతీయోఽధ్యాయః

**అవతారిక :–** పూర్వాధ్యాయాంతిమశ్లోకోత్తరార్ధము శ్రీమన్తమ్ అనుపదముతో ఆరంభింపఁ బడినది. ఈ అధ్యాయ ప్రథమశ్లోకముయొక్క పూర్వార్ధము ఆ పదము తోడనే ఆరంభింపఁ బడుచున్నది.

**శ్లో॥ శ్రీమన్తం స్వనితాన్తకాన్తపదకఞ్జస్వాన్తచిన్తామణిం**
**శాన్తం నాన్తరమన్తకాన్తకమతిక్రాన్తప్రియం సన్తతమ్।**
**సన్తం భాన్తమనన్తకున్తలసువిభ్రాన్తమ్మహాన్తం శివం**
**దాన్తం కన్తురిపుం తమన్తరహితం స్వర్దన్తికాన్తిం స్తుమః॥ 1**

**ప్రతిపదార్థము :–** శ్రీమన్తమ్ = సిరిగల, స్వనితాన్తకాన్త పదకఞ్జస్వాన్త చిన్తామణిమ్ = తన అధికమైన మనోహరమైన పాదకమలములందు మనసు (గలవారి కోరికల దీర్చు) చిన్తామణియైన, శాన్తమ్ = అంతరింద్రియ నిగ్రహముగల, కన్తురిపుమ్ = కామారియైన, నాన్తరమ్ = భేదములేని, అన్తకాన్తకమ్ = యమునకు యముడైన, అతిక్రాన్త ప్రియమ్ = మిక్కిలిగా తిరుగువారు (యాత్రికులు) ప్రియులుగా గల, సన్తతమ్ = శాశ్వతుఁడైన,



సన్తమ్ = సద్రూపుడైన, భాన్తమ్ = ప్రకాశించుచున్న, అనన్తకున్తల సువిభ్రాన్తమ్ = అనన్తుడు కేశములందు భ్రమించి తిరుగు, మహాన్తమ్ = గొప్పవాడైన, దాన్తమ్ = బహిరిన్ద్రియ నిగ్రహము గల, అన్తరహితమ్ = అన్తములేని, స్వర్దన్తికాన్తిమ్ = ఐరావతముయొక్క కాన్తివంటి కాంతిగల, తమ్ = ఆ, శివమ్ = శివుని, స్తుమః = స్తుతించెదము.

**తాత్పర్యము :–** తన అతిమనోహర పాదకమలములందు చిత్తము గలవారి కోర్కెలు దీర్చు చిన్తామణియైన, అంతర్బహిరిన్ద్రియనిగ్రహముగల, యమునకు యముడైన, యాత్రికులందు ప్రీతిగల, సత్యజ్ఞానానన్త స్వరూపుడైన, శిరసున శేషుడు భ్రమించునంత కేశములుగల, నాశరహితుడైన, మన్మథ శత్రువైన, ఐరావతము వలె తెల్లనైన కాన్తి గల మహాశివుని స్తుతించెదము.

**వివరణ :–** పార్వతీదేవికి శ్రీయను పేరు గలదు. ఆ శ్రీదేవి అర్ధశరీరము గలవాడగుటచే శివుడు శ్రీమన్తుడు. శ్రీమన్తుల యిండ్లలో సిరి (సంపద) యుండవచ్చును. శ్రీదేవి (లక్ష్మి)ని వక్షఃస్థలమున శరీరైకదేశమున నిలుపుగొన్న విష్ణువు శ్రీమన్తుడు కాదనలేము. శ్రీయనగా సరస్వతి, ఆమెను తన తలలో నొక భాగమైన జిహ్వయందుంచుకొని అనగా తలకెక్కించుకొని బ్రహ్మదేవుడును శ్రీమన్తుల వరుసలో చేరవచ్చును. ఇంద్రాదులను శ్రీమన్తులే కావచ్చును. శివునివలె దేహార్ధమున శ్రీదేవిని నిలుపుకొని శ్రీమన్తుడను పదమునకు మహార్థమును కలిగించిన వాడెవడును లేదు. కావున శివుడు శ్రీమన్తుడు. శ్రీమన్తులలో మొదటివాడని శ్లోకము ఆదియందలి శ్రీమన్తమ్ అను పదము వ్యంజింపఁ జేయును. 2. ఇన్ద్రుని కడ చిన్తామణి యున్నది. అది మోక్షేతరమైన శుభమును లేక సుఖమును ప్రసాదింపవచ్చును. కాని యథార్థ సుఖ స్వరూపమైన మోక్షమును ప్రసాదించలేదు. శివుని పాదమందలి భక్తిగలవారికి మోక్షమునొసగి చిన్తామణి శబ్దముయొక్క సంపూర్ణార్థమై యున్నాడని రెండవ విశేషణము తెలుపును. 3. సన్తమ్, భాన్తమ్, అనన్తమ్ అను ఉత్తరార్ధాది యందలి పదములు వరుసన **సత్యం జ్ఞానమనన్తమ్ బ్రహ్మ** అను శివబ్రహ్మయొక్క స్వరూపలక్షణమును పై ఉపనిషద్వాక్యము వలెనే బోధించుటచే నీ పాదాదిభాగము ఉపనిషత్తుల్యమై యొప్పుచున్నది. 4. శివుని శిరసున కేశములనన్తములు. వానిని లెక్కింపలేనంత సంఖ్య కలిగియున్నవవి, ఇంతటి అనన్తను అనగా భూమిని మోయు అనన్త నామకుడైన శేషుడే అందు త్రోవ తప్పి భ్రమించు చున్నాడనగా ఇక ఆ శివుడు ఎంత పెద్దవాడో ఎవరూహింపగలరు? అట్లు త్రోవదప్పి భ్రమించుచున్న శేషుడా శిరమునుండి బయటకు రాలేక శివుని శిరమునందలి అనన్త

పుష్ప భూషణములైన నక్షత్రములలో తన వేయి తలలోని మణులతో భూషణభావమును వీడి బయటకు వచ్చి తన అల్పభూషణత్వావమానమును పోగొట్టుకొనలేక అచటనే తిరుగుచున్నాడని మూడవ పాదమందలి నాల్గవ విశేషణము వ్యంజించుచున్నది. 5. స్వర్దన్తికాన్తిమ్ అను విశేషణమున వాచకోపమేయ ధర్మలుప్త అను లుప్తోపమాభేదమైన అర్థాలంకారమున్నది. 6. ఈ శ్లోకము శార్దూల విక్రీడిత నిబన్ధనమగుటచే శివుని శార్దూల చర్మధారణమును వ్యంజించును. వృత్త్యనుప్రాస నామక శబ్దాలంకారముచే శ్లోకమంతయు అలంకరింపఁబడియున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివస్తుతి నుపక్రమించినట్లు చెప్పిన ఈ కవి ఈ క్రింది శ్లోకమున శివేతర స్తుత్యాదికము యొక్క అనావశ్యకతను చెప్పుచున్నాడు.

**శ్లో॥ ఏకం వన్దనమస్తు తే పరమితో హే నిత్యకర్మాధునా**
**హే నైమిత్తికకర్మ! తేఽపి చ తథా తీర్థాన్యయే వో నమః।**
**క్షేమం వో గృహదేవతా భవదభిప్రాయానుసారోఽస్తు మా**
**వారం వారమహం కరోమి చ నుతిం శమ్భోరశమ్భోః కుతః॥ 2**

**ప్రతిపదార్థము :–** హే నిత్యకర్మ = ఓ నిత్యకర్మమా! ఇతఃపరమ్ = ఇక తరువాత, అధునా = ఇప్పుడును, తే = నీకు, ఏకమ్ = ఒక, వన్దనమ్ = నమస్కారము, అస్తు = అగుగాక, హే నైమిత్తికకర్మ = ఓ నైమిత్తిక కర్మమా!, తే అపి = నీకు కూడ, తథా = అట్లు, వన్దనమ్ = వన్దనము, అస్తు = అగుగాక!, అయే =ఓ, తీర్థాని = తీర్థములారా, వఃచ = మీకును, నమః = నమస్సు, అస్తు = అగుగాక!, గృహదేవతాః = ఓ గృహదేవత లారా!, వః = మీకు, క్షేమమ్ = క్షేమమ్, అస్తు = అగుగాక! భవదభిప్రాయానుసారః = మీ అభిప్రాయము ననుసరించుట, మా అస్తు = కలుగుకుండుగాక!, అశమ్భోః = అమంగళస్థానమైన, శమ్భోః = శమ్భువుయొక్క, నుతిమ్ = స్తోత్రమును, వారం వారమ్ = మాటిమాటికి, అహమ్ = నేను, కుతః = ఎందువలన, కరోమి = చేయుచున్నాను.

**తాత్పర్యము :–** ఓ నిత్యనైమిత్తిక కర్మలారా! తీర్థములారా! గృహదేవతలారా! ఇక మీ తోడి సంబంధమును వదలుకొనుచున్నాను. ఎందువలననగా మోక్షము నొసగు శివుని స్తోత్రము చేయుచున్నానుగదా!

**వివరణ :–** ప్రతినిత్యము అవశ్యము చేయఁదగిన కర్మలు నిత్యకర్మలు. ఇవి చేయనివారికి ఆ నిత్యకర్మలు చేయవలసిన కాలమున వానిని చేయక, ఇతర కర్మల నొనర్చుట వలన ప్రత్యవాయము అనగా పాపము కలుగును. నిత్యకర్మల వలన ఏ పుణ్యము కలుగదు.





కాని అవి చేయని వారికి మాత్రము పైన చెప్పిన విధముగా పాపము కలుగును. అని మీమాంసకులలో కొందఱు భావించెదరు. మరికొందరు నిత్యకర్మల నాచరించని వారికి అవి చేయవలసిన ఇతర కర్మల నాచరించినవారికి చిత్తశుద్ధి పరంపరగా మోక్షఫలము సిద్ధించు నందురు. ప్రతిదినము చేయనక్కఱ లేనివైనను దేశమునో కాలమునో నిమిత్తముగా చేయఁబడు కర్మలు నైమిత్తిక కర్మలు. ఇవి కూడ చేయనివారికి పైన చెప్పిన విధముగా ప్రత్యవాయము కలుగును.

సంధ్యోపాసనాదులు, బ్రహ్మయజ్ఞాది పంచయజ్ఞములు, వేదాధ్యయనము, మాతా పితృగురు సేవాదులు నిత్యములు. గంగానదీ తీరములలో గ్రహణాది కాలములలో చేయదగిన కర్మలు, దేశకాల నిమిత్తములలో చేయఁదగిన తీర్థ శ్రాద్ధము మొదలగు కర్మలు నైమిత్తికములు. తీర్థయాత్రలు నిత్యనైమిత్తిక కర్మలు కాకపోయినను గృహదేవతలుగా చెప్పఁబడరు. ఆయా కుటుంబములవారి ఇండ్లలో ప్రాచీనకాలమునుండి ఆరాధనీయులుగా నుండిన దేవతలు గృహదేవతలు అని చెప్పబడుదురు. ఈ రచయిత నిత్యనైమిత్తిక కర్మలననుష్ఠించుచు, తీర్థయాత్రలొనర్చుచు, గృహదేవతారాధనల నొనరించు చుండెడివాడు. ప్రస్తుతము మహాత్ముల ఉపదేశమున శివస్తుతి నొనరింపఁమొదలిడినాడు. దాని ప్రభావమేమో ఆ శివస్తుతికే కాలమంతయు వెచ్చింపవలయునను అభిప్రాయము ఆతనికి కలుగ నారంభించినది. నిత్యనైమిత్తిక కర్మలను, తీర్థయాత్రలను, గృహ దేవతారాధనల నొనరించుటచే నాతనికి ప్రీతితగ్గి, శివస్తుతియందే ప్రీతి అధికమగుచు, శివస్తుతి నొనరించక ఇతర కర్మల నాచరించు కాలమున అపరాధము చేయుచున్నానను భావము కలుగుచున్నది. అందుచేత నిత్యకర్మాదుల సంబోధించి ఇప్పటివరకు ఉత్సాహము కలిగించిన వీరిపుడుత్సాహము కలిగించక యున్నారు. ఇక మిమ్ముల నాదరించలేను. మీకు వీడ్కోలు చెప్పుచున్నాను. శివస్తుతి తప్ప వేరొక కర్మ చేయఁజాలకున్నాను. శమ్భువు అమంగళ స్థానమందురేమో? ఆయన ఎముకల ధరించుచున్నను, శ్మశానములలో తిరుగుచున్నను, భూతములతోడి సహవాసము చేయుచున్నను, శ్మశానభస్మము ధరించి తిరుగుచున్నను ఆతని అమంగళ కృత్యములు దోషములుగా నాకు కనఁబడుట లేదు. అవి దోషములేయైనచో ఇన్ద్రోపేన్ద్ర బ్రహ్మాదులు ఆతనిని సేవింపరు గదా! శ్రేష్ఠులైన ఆ ఆదర్శమూర్తుల ఆచరణము ఆదరింపఁదగినది కదా!వారి వలె నేను శివస్తుతి ఏల చేయుచున్నానో నాకు కొంచెమర్థమైనది. శివస్తుతి సమయమున నేదో చెప్పరాని ఆనందలహరి నా మనసున పొంగుచున్నది. ఆ ఆనందమును వదలుకొని ఇతర కర్మల నొనర్చుటకు మనస్కరించుట లేదు. నన్ను మీరన్యథానిరాదరణ భావమున చూడదగదు.

అను రచయిత అభిప్రాయము ఈ శ్లోకమున వ్యక్తమగుచున్నది. 2. గృహదేవతలారా! నేనిదివఱకు వలెనే మిమ్ము ఆరాధించుచు ఉండవలె ననునదియే మీ అభిప్రాయము కావచ్చును. మీ అభిప్రాయము ననుసరించుట నావలన కాదు. నాకిప్పుడు మీ అభిప్రాయము ననుసరించ వలెనను భావము కలుగక పోవుటయే బాగనిపించుచున్నది. ఈ స్థితియే నాలో కొనసాగు గాక! అని మూడవపాదమందలి వ్యంగ్యము 3. వన్దనమస్తు, క్షేమమస్తు వంటి ప్రయోగములు వీడ్కోలును వ్యంజింపఁజేయును. తెలుగు దేశమున దండము, వందనమువంటి మాటలు మానివేయుట అను అర్థమునందు ప్రయోగింపఁబడుట సాధారణము. ఈ ప్రయోగవిధానమున రచయిత తెలుగు వాడేమోనన్న ఊహకు అవకాశమొసగుచున్నది. **"ఏకం వన్దన మస్తు"** అను వాక్యములోని ఏక శబ్దము కూడ పై భావమును సమర్థించుచున్నది. 'నీకోదండము' అని కోపముతో వెడలిపోవువారు (దూరమగువారు) పల్కుట సాధారణము గదా!అందులోని (నీకు + ఓ) ఓకారము 'ఒక' శబ్దముయొక్క రూపాంతరము. కావున ఏక శబ్దార్థమునుటలో సంశయము లేదుగదా! క్షేమమస్తు అను వాక్యముయొక్క ప్రయోగమునందును నీవే బాగుపడువంటి తెలుగు వాక్యములలోని నిష్ఠురత గోచరించుట చేతను పై ప్రభావమునే దర్శింపవచ్చును. పూర్వశ్లోకమువలె ఈ శ్లోకమును శార్దూల విక్రీడిత చ్ఛన్దో నిబన్ధనమే.

---

**అవతారిక :–** పై శ్లోకమున మాటిమాటికి శివస్తుతి చేయుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున స్తుత్యమైన శివతనువు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సారానిద్రాముదశ్రీకరమహిమయుతా త్రాసవద్రావికాసా**
**సాకా విద్రావసత్రా రజతగిరి తటస్థాన సద్మాపభాసా।**
**సా భా పద్మాసనస్థా గిరిశ! శివతనుః ఖ్యాతసుజ్ఞాను దాసా**
**సాదానుజ్ఞా సుతఖ్యాభిరతిరవతు వః శ్రీదముద్రా నిరాసా॥ 3**

**ప్రతిపదార్థము :–** గిరిశ = ఓ గిరియందు శయనించువాడా!, సారానిద్రాముద శ్రీకరమహిమయుతా = సారమైన జాగరూకమైన పూర్ణానందరూపమైన నిర్విష మొనర్చు మహిమతో కూడిన, త్రాసవద్రావికాసా = భయముతో కూడిన ధనమును వికసింపఁజేయని, సాకావిద్రావసత్రా = దుఃఖములకు పారిపోని సత్పురుషుల రక్షించునది, రజతగిరి తటస్థాన సద్మాపభాసా = వెండికొండ సానుప్రదేశము నందలి కాంతి తక్కువ కాంతిగాగల, ఖ్యాతసుజ్ఞాను దాసా = ప్రసిద్ధులైన చక్కని జ్ఞానులు అనుసరించు దాసులుగా గల, సాదానుజ్ఞా = ప్రసాద (గుణ)మును అంగీకరించు, సుతఖ్యాభిరతిః = కుమారుల





కీర్తియందు మిక్కిలి ఆసక్తిగల, శ్రీదముద్రానిరాసా = సంపదనొసగు ముద్రను నిరసించు. సాభా = మిక్కిలి కాంతితో కూడిన, పద్మాసనస్థా = పద్మాసన మందున్నట్టి, శివతనుః = మంగళ శరీరము, వః = మిమ్ము, అవతు = రక్షించుగాక!

**తాత్పర్యము :–** సారమైన జాగరూకమైన, పూర్ణానందరూపమైన, నిర్విష మొనరించునట్టి మహిమతో కూడిన, భయమును కలిగించు ధనమును వికసింపఁజేయని, దుఃఖముతో కూడిన వారయ్యు చెదరని, సత్పురుషుల రక్షించు వెండికొండల సాను ప్రదేశమందలి కాంతిని అల్పకాంతిగా నొనర్చు ప్రసిద్ధులైన చక్కని జ్ఞానులు అనుసరించు దాసులుగా గల ప్రసాద గుణమును అంగీకరించు సుతుల కీర్తియందాసక్తిగల సంపదనొసగు ముద్రను నిరసించు గొప్పకాంతితో కూడి శివుని శివతనువు మిమ్ము రక్షించుగాక!

**వివరణ :–** శివునకు ఘోరము అఘోరము అను రెండు తనువులున్నట్లు శతరుద్రీయము తెలుపును. ఈ శ్లోకమున శివుని అఘోరతనువు అనగా శివతనువు వర్ణింపఁబడినది. ప్రథమ విశేషణము సార + అనిద్ర + ఆముత్ + అశ్రీకరమహిమయుతా అని,




శ్లోకం: 3 చతురర చక్రబన్ధము

ద్వితీయ విశేషణము త్రాసవత్ + రా + అవికాసా అని, మూడవ విశేషణము స+ అకా + అవిద్రావసత్ + త్రా అని, రజతగిరితటస్థాన సద్మా + అపభాసా అని నాల్గవ విశేషణము, స + ఆభా అని ఐదవ విశేషణము, పద్మాసన అని ఆఱవ విశేషణము, ఖ్యాతసుజ్ఞా + అను దాసా అని ఏడవ విశేషణము, సాద+ అనుజ్ఞా అని ఎనిమిదవ విశేషణము, సుత + ఖ్యా + అభిరతిః అని తొమ్మిదవ విశేషణము, శ్రీదముద్రా + నిరాసా అని విభజించి పై తాత్పర్యము చెప్పఁబడినది.

ఇందలి ఆది విశేషణము విలోమముగా పఠించినచో అంతిమ విశేషణమగును. ద్వితీయ పాదాంత విశేషణము యొక్క విలోమమే తృతీయ పాదాది విశేషణము. చతుర్థపాదాది విశేషణముయొక్క విలోమమే తృతీయ పాదాంత విశేషణము. ఇట్టి క్లిష్టరచన శబ్దాలంకార సిద్ధికొఱకై చేయఁబడుచుండును. కావున పై విశేషణములను మరొక విధముగా విభజించి తాత్పర్యమున కొంత మార్పు కలిగింపవచ్చును.

ఒక వృత్తమును గీచి దానిచుట్టు నాలుగు దళమూలములను కల్పించి వానిలో మధ్యలోని ఏడక్షరముల నడ్డముగా వ్రాసి ఆ దళమూలముల నొక్కొక్క దానినుండి రెండేసి దళములను కల్పించి అనగా మొత్తమెనిమిది దళముల కల్పించి వానిలో ఆద్యంతాక్షరములైన 'సా' అను అక్షరమును విడచి మిగిలిన ఆఱు అక్షరముల నిలువుగా వ్రాయవలెను. మధ్య కర్ణికాస్థానీయ వృత్తమున సా అను అక్షరమును వ్రాసినచో అష్టదళ పద్మరూప మీ శ్లోకమున నేర్పడును. వృత్తమునకు నాలుగు వైపులనున్న దళములలోని అక్షరములకు అనులోమ విలోమ భావము లేదు. కాని ఎనిమిది దలములలోని నాలుగింటి విలోమమే మిగిలిన నాలుగు దలములలో నుండును. ఆద్యంతములలో ప్రతిదళమును 'సా' తో కలిపి యేర్పడియుండును. ఇట్లుగాక నాలుగు దళములను మాత్రమే కల్పించి వృత్తములోని 'సా' ను ఆద్యంతములలో కలిపికొని అనులోమ విలోమముగా ఒక్కొక్క దళములోని అక్షరముల మాత్రమే పఠించి దళమూలముల పై జెప్పిన విధముగానే మధ్యాక్షరముల నడ్డముగా లిఖించి ఈ శ్లోకమును చతుర్దళకమలముగా నేర్పరచుకొనవచ్చును. మధ్య వృత్తమున మాత్రము 'సా' అనునదే వ్రాయఁబడవలెను. కావ్యమంతయు అనులోమ విలోమముగా వ్రాయఁబడిన సంస్కృతాంధ్ర రచనములున్నవి. తద్రచయితలు గొప్ప శబ్దరసికులు. ఈ కవియు అట్టి రచనము చేయగలవాడనుట కీ శ్లోకము ఒక సాక్ష్యముగా నున్నది. పూర్వార్ధమున రెండు పాదములందు చతుర్థాక్షరము ద్రాప్రాసముగా కూర్పఁబడినది. ఉత్తరార్ధమున ఐదవ అక్షరము (సను) ప్రాసముగా కూర్పఁబడినది. తృతీయ ద్వితీయ పాదముల





16వ అక్షరముగా కూడ పై ప్రాసయే కూర్పఁబడినది. వీనిలోనే గిరిశబ్దము ద్విరావృత్తమైనది. నాలుగు పాదములందును అంత్యానుప్రాసము కలదు. ఈ శ్లోకము స్రగ్ధరా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున ఎదుటివారి అవనమును కోరిన కవి ఈ శ్లోకమున తన రక్షణమునే కోరుచున్నాడు.

**శ్లో॥ హారహీరసమాకార! కారుణ్యజలధే! ప్రభో!।**
**వరవారాణసీవాస! గురో! గౌరీశ! పాహి మామ్॥ 4**

**ప్రతిపదార్థము :-** హారహీర సమాకార! = హారమునందలి (తెల్లని) రత్నముతో సమానమైన ఆకారముగల, కారుణ్యజలధే! = దయాంబోధీ, ప్రభో = ఓ ప్రభూ!, వరవారాణసీవాస = శ్రేష్ఠమైన కాశీనగరము నివాసముగా గలవాడా! గురో = ఓ గొప్పవాడా!, గౌరీశ = ఓ గౌరీపతీ!, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.

**తాత్పర్యము :-** హారమందలి తెల్లనిరత్నమువలె తెల్లనైన ఆకారము గలవాడా! దయాసముద్రుడా! ప్రభూ! గొప్ప కాశీనగరమున నివసించువాడా! ఓ గొప్పవాడా! గౌరీనాథా! నన్ను కాపాడుము.

**వివరణ :-** పద్యమంతట రేఫము బహువారావృత్తమగుటచే హ, కల ద్విరావృత్తి చేతను, వకారముయొక్క త్రిరావృత్తి చేతను వృత్త్యనుప్రాసాలంకార మిందేర్పడి యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛందో నిబన్ధనము. ప్రథమపాదమున సమశబ్దముండుటచే ఉపమాలంకారము, ద్వితీయపాదమున జలధిరూపణముచే రూపకాలంకారము నేర్పడియున్నవి.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివునిచే స్వరక్షణము కోరఁబడినది. ఈ శ్లోకమున తన మానసమున శివుని నివాస మర్థింపఁబడుచున్నది.

**శ్లో॥ భవ! భవనితరౌప్యశైల! గఙ్గా - శరశరణేన్దుకిరీటశస్తమస్త!**
**స్వమహిత! హితదాన! మానసే మే - వసనీకృతదిక్కరీన్ద్రచర్మన్॥ 5**

**ప్రతిపదార్థము :-** భవ! = ఓ భవా, భవనితరౌప్యశైల! = ఇల్లుగా చేసుకున్న వెండికొండ గలవాడా!, గఙ్గాశరశరణేన్దు కిరీట శస్తమస్త! = గంగాజలమునకు నివాసమైన చన్ద్ర మకుటముచే ప్రశంసింపఁబడిన శిరము గలవాడా!, స్వమహిత = స్వరూపముచే పూజింపఁబడినవాడా!, హితదాన = హితము నొసగువాడా!, వసనీకృత దిక్కరీన్ద్ర చర్మన్

= వస్త్రముఁజేసికొనఁబడిన దిగ్గజేన్ద్ర చర్మము గలవాడా!, మే = నాయొక్క, మానసే = మనసున, వస = నివసింపుము.

**తాత్పర్యము :–** ఇల్లుగా చేసికొనఁబడిన వెండికొండ గలవాడా! గంగాజల నివాసముచే చన్ద్రకిరీటము చేతను ప్రశంసింపఁబడిన శిరముగలవాడా!, స్వరూపం చేతనే పూజింపఁ బడువాడా!, హితము నొసగువాడా!, వస్త్రముగాఁ జేసికొన్నదిగ్గజేన్ద్ర చర్మము గలవాడా! భవా! నా మానసమున వసింపుము.

**వివరణ :–** నాలుగు పాదముల ఆరంభములందు యమక (ఛేకానుప్రాస)ములున్నవి. పూర్వార్ధాంతమున తృతీయపాదమున వృత్త్యనుప్రాసములున్నవి.

బేసి పాదమున న–న–ర–య అను గణములు, సరిపాదమున న–జ–జ–ర–గ అను గణములుండుటచే నీ శ్లోకము పుష్పితాగ్రా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున తన మానసమున కవిచే శివుని నివాస మర్థింపఁబడినది. ఈ శ్లోకమున ఆ మానసమే సందేహము కలదిగా చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మానమానస! సన్దేహీ – మత్క్లేశాపహరేఽ హరే।**
**మానమానసదాదిత్యే – సత్యే పురహరే హరే॥ 6**

**ప్రతిపదార్థము :–** మాన మానస = ప్రమాణమైన ఓ మనసా, మత్క్లేశాపహరే = నా క్లేశముల నపహరించు, అహరే = సంహారకుడు (దొంగ) కానట్టి (పరిపాలకుడైనట్టి), మాన మానసదాదిత్యే = ప్రమాణమునకు (కంటికి) ప్రమాణమైనట్టి (ప్రమాణత్వము కలిగించునట్టి) సూర్యుడైన, సత్యే = మిథ్య కానట్టి, పురహరే = పురముల హరించు నట్టి, హరే = శివునందు, సన్దేహీ = సందేహము కలదానవు (అగుచున్నావు).

**తాత్పర్యము :–** ఓ ప్రమాణమైన మానసమా! నా క్లేశములను పోగొట్టి కాపాడు. కంటిని ప్రమాణముగా నొనర్చు శాశ్వత సూర్యుడైన పురహరుడైన శివునందు సందేహము కలదానవై యున్నావు.

**వివరణ :–** ఇంద్రియములలో శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణములు అయిదు బాహ్యములు. మనస్సు ఆంతరము. ఈ ఆఱు ఇంద్రియముల ప్రత్యక్ష ప్రమను కలిగించునవగుటచే ప్రత్యక్షప్రమాణములు. బయటి శబ్ద స్పర్శ రూప రస గన్ధముల జ్ఞానము బాహ్యేన్ద్రియముల ద్వారమున కలుగును. ఆంతరములైన సుఖదుఃఖాదుల జ్ఞానము మనస్సు వలన కలుగును. బాహ్య విషయ జ్ఞానము కలుగుటలో బాహ్యేన్ద్రియములకు మనస్సుయొక్క సహకారము ఆవశ్యకము. సుఖదుఃఖాద్యాంతర విషయముల జ్ఞానమును బయటి



ఇన్ద్రియముల సహకారము నపేక్షించకయే మనస్సు స్వయముగా కలిగించును. కావున ఇవి అన్నియు ప్రత్యక్ష ప్రమను కలిగించు ప్రత్యక్ష ప్రమాణములని తర్కశాస్త్రమున పేర్కొనఁబడినవి.

శివుడు బాహ్యేన్ద్రియముల చేతగాని, మనస్సు చేతగాని, గోచరము కాకపోవుట వలన శివుని ఉనికి విషయమున మనస్సు సందేహము కలిగియుండును.

బాహ్యాంతరములైన వ్యాధులు ఆధులు దుఃఖజనకములగుటచే ఇవి క్లేశములని ఈ శ్లోకమున చెప్పఁబడినవి. ఈ క్లేశములు కలుగు సమయమున శివస్మరణము చేసినచో తొలగిపోవుట దాదాపు సర్వజనానుభవ సిద్ధమే అగుటచే ప్రత్యక్ష ప్రమాణ గోచరుడు కాని శివుడు అనుమాన ప్రమాణ గోచరుడు అని నిశ్చయింపవలసి యుండగా ఓ మానసమా! ఏల సందేహించెదవు? శివుడు తన ఉనికిని మనస్సునకు నిశ్చయముగా తెలుపుటకై క్లేశములను హరించి యున్నాడు. అయినను నీవు శివుని ఉనికిని నిశ్చయించుకొనక సందేహించి నీ మూర్ఖత్వమును ప్రకటించుకొనుచున్నావు. ఇది పూర్వార్ధ వివరణము.

ఓ మనసా! సందేహము కలుగుట బట్టి నీ యునికిని నందఱు నిశ్చయించు కొందురు. కాని శాస్త్రీయముగా (అద్వైతశాస్త్రము ననుసరించి) నీ యునికి హుళక్కియే. ఒకవేళ వ్యావహారికముగా నీ యునికి అంగీకరింపవలసి వచ్చినచో, నిశ్చయింపఁ బడవలసి వచ్చినచో శివుని ఉనికిని గ్రహించియే నేనున్నాను అని నీవు మిడిసిపడుచున్నావు. నీవు ప్రమాణము అయినచో నీకు ప్రమాణత్వమును కలిగించు శాశ్వతసూర్యుడు శివుడే సుమా!

కంటికి ప్రమాణత్వమును కలిగించుటకు అనగా చూచు శక్తి కలుగుటకు సూర్యుడవసరము. కావున సూర్యుడు మానమానుడు. ప్రమాణము (చక్షుస్సు) నకు ప్రమాణము అనుట లోక సిద్ధము. కాని సూర్యుడు సత్పదార్థము గాదు. అనగా శాశ్వతుడు గాడు. ఆ సూర్యుడు నీలో (మనస్సులోని) సన్దేహాజ్ఞానాద్యన్ధకారమును తొలగింపఁ జాలడు. శివుడు ఆదిత్యుని వలె మానమానుడే కాక సత్పదార్థము కూడ అయి ఉన్నాడు. కావున ఆ శివుడే శ్లోకమున మాన మానసదాదిత్యుడని చెప్పఁబడినాడు. ఆతడు శాశ్వతసూర్యుడై నీలోని అజ్ఞాన (సన్దేహ) తిమిరమును తొలగించుచుండగా అనేక వస్తువుల నెఱుగుచున్న నీవు ఆ శివునే ఉన్నాడో, లేడో అందువేమి? సత్పురుషులు 'కలడు కలండను వాడు కలడోలేడో' అని సందేహించుట ఎంత అనుచితము. ఇది యంతయు తృతీయపాద వివరణము.




శ్లోకం: 6 ఛురికా/జ్యోతి బన్ధము

3. శివుడు పరమహరుడు. పురములు అనగా శరీరములు. స్థూలసూక్ష్మ కారణ శరీరములు అను మూడు పురములను త్రిపురాసురులని పురాణములలో పరోక్షముగా చెప్పఁబడిన వానిని హరించువాడు హరుడు. లోకములను సంహరించి శివుడు హరుడైనాడనుట అటుంచి మోక్షమును పొందిన వారందఱి త్రిపురములు హరించి ఆతడు హరుడైనాడనుట శాస్త్రసిద్ధ విషయము. సూక్ష్మ శరీరమున భాగమై ఉన్న ఓ మానసమా! నీవిట్లు శివుడే లేడనుకొనుచు చిరంజీవివై యుండుము. క్లేశముల ననుభవించుచుండుము. నీవిట్లు శివుని సందేహించు చుందువేని నీకు మోక్షమెట్లు కలుగును? ఇది చతుర్థపాద వ్యంగ్యము.

4. పూర్వోత్తరార్ధంతములలో హరే హరే అను యమకమున్నది. అది ద్విరావృత్తమై హరిహరీ హరిహరీ ఇది ఎంత తప్పు అని మానసముయొక్క తప్పును అసహ్యించుకొను సత్పురుషుని వాక్య ధ్వనిని వ్యంజించుచున్నది. సత్పురుషులిట్టి మూర్ఖుల నసహ్యించు కొందురు గదా!

5. మానసముయొక్క ఉనికియే మిథ్య. దాని మానత్వము అనగా ప్రమాణత్వము కూడ మిథ్య. మిథ్య కాదన్నను దాని ప్రమాణత్వమును కలిగించు వాడు శివుడే. చక్షురింద్రియ ప్రమాణత వ్యావహారిక సత్యము. వానికి ప్రమాణత కలిగించు సూర్యుడు చక్షురింద్రియ విషయమై దృశ్యతను పొంది యున్నాడు. దృక్త్వ ప్రమాతృత్వరహితుడైన ఆ సూర్యుడు మానమానుడనుట వ్యావహారికమే అయినను యుక్తికి ఆతని వ్యావహారిక మానమానతయు అనుగుణముగా లేదు. ఆదిత్యాదులను దృశ్యముగా జేసికొన్న కంటికి ఇతర బాహ్యేంద్రియములకు వానికి ప్రమాణతను కలిగించు మానస సూర్యునకును **"చక్షుశ్చక్షుః మనసోమనః"** అని ఉపనిషత్తులలో చెప్పఁబడిన శివుడు ప్రమాత. నీకును ప్రమాతయై యుండగా ఆయనకు దృశ్యమైన (జ్ఞేయ) నీవు ఆ శివునే సందేహించుట నీ





సంశయాత్మకత కుచితముగా నుండుటయే గాక వన్ధ్యాపుత్రుడు యధార్థపుత్రుని సందేహించుటవలె నున్నది. ఇది మొత్తము శ్లోకమున వ్యంగ్యమగు అంశము.

ఈ శ్లోకమున పూర్వోత్తరార్ధాద్యంతములలో యమకములున్నవి. ఈ శ్లోకమును అనుష్టుప్ఛందో నిబన్ధనమే.

ఈ శ్లోకమున అడ్డముగా ఛురికాబన్ధము. నిలువుగా జ్యోతిబన్ధమున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు సత్యుడని చెప్పఁబడినది. ఈ శ్లోకమున సత్యాసక్తతో ఆతని సమీపింపుమని జీవుడుపదేశింపఁబడుచున్నాడు.

**శ్లో॥ సవాసహంసభం సత్యాసక్తసర్వం సభం సమమ్।**
**సవాసవసమాసత్తిం సర సత్రం సఖే! సదా॥ 7**

**ప్రతిపదార్థము :–** సవాసహంసభమ్ = వాసముతో కూడిన హంసయొక్క కాంతివంటి కాంతిగల, సర్వమ్ = అంతయునైన, సభమ్ = నక్షత్రములతో కూడిన, సమమ్ = సమముగా ఉన్న, సవాసవసమాసత్తిమ్ = ఇంద్రసమీప్యముతో కూడిన, సత్రమ్ = సత్పురుషుల రక్షించువానిని (శివుని), సత్యాసక్త = సత్యము నందాసక్తి గల, సఖే = మిత్రుడా! సదా = ఎల్లప్పుడు, సర = చేరుము.

**తాత్పర్యము :–** ఓ సత్యాసక్త మిత్రుడా (జీవుడా) వాసముతో కూడిన హంసల కాంతివంటి కాంతిగల, నక్షత్రములతో కూడిన అంతయునైన, సమముగానుండు ఇంద్రుడు సన్నిధియందుగల, సత్పురుషుల రక్షించువానిని (శివుని) చేరుము.

**వివరణ :–** శివుని నివాసమున కైలాసమున మానస సరోవరప్రాంతమున హంసలు నివసించును. వాని తెల్లని కాంతితో సమానమైన తెల్లని కాంతి శివునకున్నదని చెప్పుటచే లుప్తోపమాలంకారమేర్పడియున్నది.

హృదాకాశమున సంచరించు హంసలైన (ఆత్మలు) సాధువులు సత్త్వగుణ సంపన్నులై స్వచ్ఛులై యుందురు. అట్టివారు నీకు సమీపమందుండుటచే వారికి నీ స్వచ్ఛత (ధావల్యము) కలిగి యుండునని ప్రథమపాదము వ్యంజించును. శివుడు సర్వస్వరూపుడై సర్వము సమముగా నుండు వాడని ద్యుశిరసుడైన శివుని శిరమున నక్షత్రములుండుటచే శివుడు సభుడని అనగా నక్షత్రములతో కూడిన వాడని ద్వితీయ పాదమున చెప్పఁ బడినది. మూడవ పాదము దేవప్రభువైన ఇంద్రుడే శివుని సమీపముననుండగా నితర దేవతలుందురు అని వేరుగా చెప్పనక్కఱలేదని వ్యంజించును. ఆ శివుని గూర్చియే ఓ జీవుడా ప్రయాణించుమని నాల్గవ పాదముయొక్క వివరణము.




శ్లోకం: 7 షోడశదళ పద్మబన్ధము

ఈ శ్లోకమున మొత్తము పదాఱు సకారములున్నవి. మిగిలిన అక్షరములు పదాఱు కావున సకారము కర్ణికయందుంచి మిగిలిన అక్షరముల పదాఱు దళములలోనుంచిన ఈ పద్యమునకు షోడశదళపద్మాకృతి యేర్పడును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** జీవునకు సత్య శివానుసరణ ముపదేశింపఁబడినది. ఈ శ్లోకమున శివుని చేరగోరు శివభక్తుడే శ్రేష్ఠుడని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యస్య భక్తిస్సదా శమ్భౌ నిశ్చలా స పుమాన్ పుమాన్।**
**స పుమాన్ యత్ర జననం సమ్ప్రాప్తస్తత్కులం కులమ్॥ 8**

**ప్రతిపదార్థము :–** యస్య = ఎవనికి, శమ్భౌ = శివునందు, నిశ్చలా = చలించని, భక్తిః = భక్తి (ఉండునో), సః = ఆ, పుమాన్ = పురుషుడు, పుమాన్ = పురుషుడు, యత్ర = ఎచట, జననమ్ = జన్మము, సంప్రాప్తః = పొందినాడో, తత్ = ఆ, కులమ్ = కులము, కులమ్ = కులము.



**తాత్పర్యము :–** ఎవనికి శివునందు భక్తి నిశ్చలముగా నుండునో ఆ పురుషుడే శ్రేష్ఠ పురుషుడు. ఆ శ్రేష్ఠ పురుషుడే కులమున జన్మించెనో ఆ కులమే గొప్ప కులము.

**వివరణ :–** పుమాన్, పుమాన్, కులమ్, కులమ్ ద్విరావృత్తములైన పుమాన్ కులమ్ అను పదములలో అర్థభేదము లేకున్నను తాత్పర్య భేదము కలదు. కావున ఈ జంట పదములు లాటానుప్రాసము అను శబ్దాలంకారముతో శ్లోకము నలంకరించుచున్నవి. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివభక్తుని శ్రేష్ఠత చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆతడు చేయు శివవన్దనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సర్వేశం చతురం గవేన్ద్రియవశః శేషాహితాఖ్యం భవం**
**తత్పాకక్రతుకారకప్రియమకధ్వంసిస్వవన్తం ధ్రువమ్।**
**కర్పూరామితభం జటావయవచిత్రం సప్రథత్వం వరం**
**రజ్జద్భాసమనన్తమన్ధకరిపుం వన్దే శివం శఙ్కరమ్॥ 9**

**ప్రతిపదార్థము :–** సర్వేశమ్ = సర్వేశ్వరుడైన, చతురమ్ = నేర్పరియైన, శేషాహితాఖ్యమ్ = శేషాహితుడు అను పేరుగల, భవమ్ = సత్తారూపుడైన, తత్పాకక్రతు కారకప్రియమ్ = భవపాకమను క్రతువును చేయుచు వారి యెడల ప్రేమగల, అకధ్వంసి స్వవంతమ్ = దుఃఖమును ధ్వంస మొనర్చు (ర్చి) చక్కగా గాపాడుచున్న, ధ్రువమ్ = శాశ్వతుడైన, కర్పూరామిత భమ్ = కర్పూరమువలె అమితమైన కాన్తిగల, జటావయవచిత్రమ్ = జట అను అవయవముతో విచిత్రుడైన, సప్రథత్వమ్ = కీర్తిమత్త్వముగల, వరమ్ = శ్రేష్ఠుడైన, రజ్జద్భాసమ్ = ప్రకాశించు కాంతిగల, అనన్తమ్ = అంతములేని, అన్ధకరిపుమ్ అన్ధకుడను రాక్షసునికి శత్రువైన, శంకరమ్ = సుఖమును కలిగించు, శివమ్ = శివుని గూర్చి, గవేన్ద్రియవశః = పశువుల వంటి ఇంద్రియములకు వశుడను (ఐన నేను) వన్దే = నమస్కరించెదను.

**తాత్పర్యము :–** సర్వేశ్వరుడు చతురుడు. శేషాహితుడను పేరుగల సత్తారూపుడైన భవపాకమను క్రతువును చేయించువారి యందు ప్రేమగల, దుఃఖమును నశింపఁజేసి చక్కగా కాపాడుచున్న శాశ్వతుడైన, కర్పూరమును మించిన స్వచ్ఛకాంతి గల, జట అను అవయవముతో విచిత్రుడైన కీర్తి మత్త్వముగల, శ్రేష్ఠుడైన, ప్రకాశించు కాన్తిగల,

నాశరహితుడైన అన్ధకుడను పేరుగల రాక్షసునకు శత్రువైన, సుఖకరుడైన శివునిగూర్చి పశువులవంటి ఇంద్రియములకు వశుడైన నేను నమస్కరించెదను.

**వివరణ :–** ఈశ్వరభిన్నమైన ఈ జగమునకు శివుడు ఈశుడైనందున, ఆయన సర్వేశ్వరుడు అని సర్వేశ శబ్దమున కొక అర్థము. ఈశ్వర భిన్నముగా ఈ జగము కనcబడుచున్నను అది తదభిన్నము కాదు. ఈ సర్వము ఈశుడు అనునది సర్వేశశబ్దముయొక్క రెండవ అర్థము. సర్వము తానయ్యు తనకు భిన్నముగా కలిపింపcజేసి జగమునందలి వారందరిని మోపింపcజేయు చతురత గలవాడని చతురమ్ = అను రెండవ విశేషణము చెప్పుచున్నది. ఆ విధముగా తనకు భిన్నమైcగనబడు జగమునకంతటికి ఈశుడై సర్వేశుడనిపించుకొన్న శివునకే జగమంతయు శేషభూతమైనది. అట్టి శేషభూతమైన జగమునే తన శరీరముగా చేసికొని తనను శేషునివలె చుట్టుకొనునట్లు చేసికొన్న శివునకు శేషాహితుడను పేరు కలుగుటలో వింత ఏమియులేదు. కాని ఆ పేర ప్రసిద్ధముగా శివుడు పేర్కొనc బడకపోవుటయే వింత. శైవనాగమములలో ఈ ప్రపంచమును సృజించిన రజోగుణప్రాధాన్యము గల శివుని మూర్తికి '**భవ**' అను పేరు చెప్పcబడినది. అట్లే దానిని పాలించు సత్త్వగుణ ప్రాధాన్యముగల, శివునిమూర్తికి **మృడుడ**ను పేరు. దానిని సంహరించు తమఃప్రాధాన్యముగల శివుని మూర్తికి **హర** అను పేరు చెప్పcబడినది. సంసారమునకు భవ అను పేరు లోక ప్రసిద్ధము. ఆ సంసారము శివాభిన్నమే అగుటచే శివునకు భవ అను నామము ప్రసిద్ధముగానే ఉన్నది. భూ ధాతువు సత్తార్థకము కావున సత్తాస్వరూపుడైన శివునకు భవనామము సార్థకమే అగును. వర్తమాన సంసారము జీవభోగ్యముగా ఉన్నది. అది సృష్టి పూర్వ సమష్టి జీవకర్మ పరిపాకము. అపక్వ కర్మయందు జరుగుటచే వాడcబడిన పదార్థముయొక్క భోగ్యత వలెనే ఆ కర్మ పరిపక్వమై ఫల ప్రదాన సమర్థమైనది. ఫల ప్రదానమును ప్రారంభించి ప్రారబ్ధమైనది. ప్రారబ్ధఫలమైన సంసారమే భోగ్యతను పొందును. అట్టి భవపాకము జీవభోగము కొఱకు చేయింపc బడినది. అందుచేత తన ఇచ్ఛకు అనుగుణముగా పాక క్రతువును చేయించిన వారిపై శివునకు ప్రీతియున్నదని ద్వితీయపాదాది విశేషణము తెలుపును.

పాకానంతరము భోగ్యమైన ఆ సంసారము సుఖమును కలిగించునది మాత్రము గానే ఉండనక్కరలేదు. దుఃఖమును కలిగించునదిగా కూడా ఉండకతప్పదు.వండిన వంట తినువారిలో కొందఱకు సుఖమును, కొందఱకు దుఃఖమును కలిగించుటను మనమెఱుగుదుము కదా! అట్లు కర్మఫలము దుఃఖరూప మైనప్పుడు తన్నివారణమునకై జీవులలో కొందఱు శివుని ప్రార్థించెదరు. అట్లు ప్రార్థితుడైన శివుడు దానిని



ధ్వంసమొనర్చును. అందుచేత ఆయన అకధ్వంసి అనcబడును. క అనగా సుఖము అక అనగా తద్విరుద్ధమైన దుఃఖము దానిని ధ్వంసమొనర్చువాడు అకధ్వంసి. అట్లు ఆయన ఆ దుఃఖమును ధ్వంసమొనర్చి ప్రార్థించిన వారిని చక్కగా కాపాడుచున్నాడు.

కావున ఆయన (సు + అవన్తుడు) స్వవన్తుడు చక్కగా కాపాడుచున్నాడు. అకధ్వంసి, స్వవన్తుడును నైన శివుడు ఆఱవ విశేషణమైన అకధ్వంసి స్వవన్తమ్ అను **విశేషణోభయ పదకర్మధారయసమాసముచేత** చెప్పcబడినాడు. ఇట్లు కాపాడు శివుడు శాశ్వతుడు. ఆయన కాపాడు కృత్యము శాశ్వతమునగుటచే ఆయన ధ్రువుడు. (శాశ్వతుడు) పూర్వార్ధాంత విశేషణ పదము చెప్పును.

ఆ శివుడు కర్పూరమువలె అతి స్వచ్ఛుడు. అతి ధవళుడు. కర్పూరముయొక్క (కాంతి) ధావల్యమునకు మితి ఉన్నది. కాని వుని(కాంతి) ధావల్యమునకు మితి లేదు. కావున ఉత్తరార్ధాదియందు కర్పూరామితభమ్ అను విశేషణము శివునకు కూర్పcబడినది.



శ్లోకం: 9 షడర చక్ర బన్ధము

మూడు కన్నులుగల ఆయన ముఖమొక చిత్రమైన అవయవము. ఆ తెల్లని ముఖముల పై భాగమైన శిరమునందలి కేశములు చాలామందికి నల్లగా నుండును. వార్ధకమున తెల్లగానుండును. కాని శివుని ఆ కేశములు తైలసంస్కారము లేకపోవుట చేతనో లేక స్వాభావికముగానే ఎఱ్ఱగామారి జడ కట్టినవి. ఆ జట శివుని శిరమున చిత్రమైన అవయవముగా కనఁబడుటచే శివుడు మూడవ పాదమున జటావయవ చిత్రమ్ అను విశేషణమునే వర్ణింపఁబడినాడు.

శివుడు నిత్యసిద్ధుడుగా నిత్యప్రసిద్ధుడు. అందుచే ఆతని యందు ప్రథ అనగా ప్రసిద్ధియున్నది. ఆయన ఆ ప్రసిద్ధిత్వమే ప్రథత్వము. అదిగల ఆ శివుడు సప్రథత్వమ్ అను విశేషణముచే విశేషింపఁబడినాడు. ఇట్టి ఎన్నో గుణములుగల శివుడు భక్తులచే వర్ణింపఁబడువాడు కావున తృతీయ పాదాంతమున ఆయన వరుడని చెప్పఁబడినాడు. ఆయన కాంతి ప్రకాశింపఁబడుచుండుటచే చతుర్థపాదాదియందు ఆయన రజ్గద్భాసుడని చెప్పఁబడినాడు. ఆయనకు గాని, ఆయన గుణములకుగాని అంతము లేకపోవుటచే అనన్తుడని చెప్పఁబడినాడు. **సత్యం జ్ఞానమనన్తమ్** అని ఉపనిషత్తులలో కీర్తింపఁబడిన శివుడు అందఱకు సుఖమునిచ్చువాడు. కావున శజ్కరుడని శ్లోకాంతమున మంగళ కరత్వము శజ్కర అను విశేషణముచే చెప్పఁబడింది. విశేష్యమైన శివశబ్దము ఆయన మంగళస్వరూపుడని చెప్పును. ఆయనకుగాక మఱొకరికి సర్వ వంద్యత లేదు. కావున ఆయనకే ఈ శ్లోకమున నమస్సు అర్పింపఁబడుచున్నది. 2. కర్పూరామితభమ్ అను విశేషణమున ఉపమానమైన కర్పూరమును మించిన శివుని కాంతి చెప్పఁబడుటచే ప్రతీపాలంకారస్ఫూర్తి యున్నది. 3. ప్రతిపాదమున మ-స-జ-స-త-త-గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున **వన్దే శివం శజ్కరమ్** అని కవిచేత శివగత రతిభావము వ్యంజింపబడినది. ఈ శ్లోకమున భవ అనగా సంసారగత రతి (భావము)ని విడువుమని ఉపదేశింపబడుచున్నది.

**శ్లో॥ నిజజనావనం నిత్యపావనం భుజగకజ్కణం భూతిలేపనమ్।**
**భజ సదాశివం భావసంస్తవం త్యజ భవే రతిం త్యక్తసద్గతిమ్॥ 10**

**ప్రతిపదార్థం :-**నిజ జనావనమ్ = తన జనమును కాపాడునట్టి, నిత్యపావనమ్ = నిత్యము పవిత్రమొనర్చు, భుజగకజ్కణమ్ = సర్పములను కజ్కణములుగా ధరించు, భూతిలేపనమ్ = బూడిద పూసుకొను, భావ సంస్తవమ్ = భావమున పరిచయముగల,





సదాశివమ్ = సదాశివుని, భజ = భజింపుము, త్యక్త సద్గతిమ్ = సద్గతిని విడచిన, భవే = సంసారమున, రతిమ్ = ప్రేమను లేక ఆసక్తిని, త్యజ = విడువుము.

**తాత్పర్యము :-** తనవారిని కాపాడునట్టి ఎల్లప్పుడు పాపులను పవిత్రుల నొనర్చునట్టి, సర్పముల కంకణములుగా ధరించిన, భూతిని మైపూతగా పూసికొన్న, మనసున పరిచయము కలిగియున్న సదాశివుని భజింపుము. సద్గతికి దూరమైన భవమునందలి రతిని విడువుము.

**వివరణ :-** ఆనందపూర్ణుడు ఆనందప్రదాత శివుడు. ఆయన తనవారికి అనగా తన యందు ప్రభుభావము గలవారికి ఇహపరసౌఖ్యములను, తమ పృథగ్భావమును వీడి శివుననన్యభావమున ఉపాసించు వారికి స్వాత్మానందమునే శాశ్వతముగా నొసగును. అందుచేత శివభజనము సర్వకాలముల నొనర్పవలెను. ఆయన అమంగళ చితాభస్మరుండ మాలాదులు ధరించును. అయినను తన మంగళ స్వరూపము నెప్పుడును వీడడు. కావున ఆయన సదాశివుడని చెప్పఁబడినాడు. శివునకు వ్యతిరేకమై ఎల్లప్పుడు దుఃఖమునే ఇచ్చునది భవము. అట్టి భవము నందాసక్తి గలవారు సద్గతిని వీడియే యుందురు. కావున భవము త్యక్తసద్గతి. దానిని విడచి సదాశివుని భజింపుము అను ఉపదేశము ఈ శ్లోకమున చేయఁబడినది.

ఈ శ్లోకమునందలి ప్రతిపాదమున న-ర-ర-ల-గ అను గణములున్నవి. 11 అక్షరములు గలిగి యుండుటకు నిది త్రిష్టుప్ఛందమునకు చెందిన సమవృత్తము. దీనిపేరు ఛన్దోగ్రంథములలో లభింపలేదు. భాగవతములోని గోపికాగీతములతో పోలిక కలిగియున్నది.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివభజన ముపదేశింపఁబడినది. ఈ శ్లోకమున శివభజనానుష్ఠానము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ తం హంసం విశ్వరూపమ్మహితసురవరప్రీణనం సప్రమేయం**
**నమ్రాసక్తం సుధాతిప్రవిమలమలఘుం యుక్తమస్తం శరేణ।**
**కామా సోమేన చ శ్రీ సతతనుతవిభం ప్రీతిదం రూఢియుక్తా**
**తథ్యం శర్వం సకామా స్థిరతరమనవం చక్రిసుత్రమ్ భజేఽహమ్॥ 11**

**ప్రతిపదార్థము :-** హంసమ్ = జ్ఞాన స్వరూపుడైన, విశ్వరూపమ్ = విశ్వము రూపముగా గల, మహిత సురవర ప్రీణనమ్ = పూజనీయుడైన ఇంద్రుని ప్రేమించు, సప్రమేయమ్ = ప్రమేయముతో కూడిన, నమ్రాసక్తమ్ = నమస్కరించిన వారియందు ఆసక్తుడైన,

సుధాతి ప్రవిమలమ్ = అమృతము నతిశయించు స్వచ్ఛతగల, అలఘుమ్ = గొప్పవాడైన, శరేణ = జలముతో, సోమేన చ = చంద్రుని చేతను, యుక్తమస్తమ్ = కూడిన తలగల, శ్రీసతతనుత విభమ్ = లక్ష్మీదేవిచేత ఎల్లప్పుడు స్తుతింపఁబడు విశేషకాంతిగల, ప్రీతిదమ్ = ప్రీతినొసగు, తథ్యమ్ = సత్యుడైన, స్థిరతరమ్ = మిక్కిలి స్థిరుడైన, అనవమ్ = ప్రాచీనుడైన, చక్రిసుత్రమ్ = విష్ణువును బాగుగా రక్షించు, కామా = కోరదగిన, శర్వమ్ = శివుని, రూఢియుక్తా = రూఢితో కూడిన, సకామా = కోరికగల దాననైన, అహమ్ = నేను, భజే = సేవించెదను.

**తాత్పర్యము :-** జ్ఞానస్వరూపుడైన, విశ్వరూపుడైన, పూజనీయ దేవతాపతి ప్రీతిగల ప్రమేయముతో కూడిన, నమస్కరించువారి యందాసక్తుడైన అమృతమును మించిన



శ్లోకం: 11 నాగబంధము





స్వచ్ఛతగల, గొప్పవాడైన జలము చేత చన్ద్రుని చేతను కూడిన శిరముగల, కోరఁదగిన లక్ష్మిచేత ఎల్లప్పుడు స్తుతింపఁబడిన విశేష కాంతిగల ప్రీతినొసగు మిక్కిలి స్థిరుడైన, ప్రాచీనుడైన విష్ణువును బాగుగా రక్షించు శివుని రూఢితో కోరికతో కూడిన దాననైన నేను సేవించెదను.

**వివరణ :-** జ్ఞానార్థక (గత్యర్థక) హనధాతు నిష్పన్న హంస శబ్దము (శివుని) జ్ఞానస్వరూపమును బోధించును. విశ్వరూప శబ్దము విశ్వమంతయు శివుని రూపమని చెప్పును. అట్టి శివుడు ఇంద్రుని యందు ప్రేమగలవాడు అని తరువాత విశేషణము చెప్పును. ప్రమేయమనగా జ్ఞేయము. అది ఎప్పుడు జ్ఞానస్వరూపుడైన శివుని విడచి యుండదు. అని సప్రమేయ శబ్దము బోధించును. నమస్కరించు వారి యందాసక్తి గల శివుడు అమృతమును మించు నిర్మలత గలవాడని ద్వితీయ పాదార్థమున చెప్పఁబడుటచే ప్రతీపాలంకార స్ఫూర్తియున్నది. **రూఢియుక్తా, సకామా** అను ఆకారాన్త స్త్రీలింగ శబ్దములు శివునియందు కవి మధురభక్తి గలవాడని వ్యంజింపఁజేయుచున్నది. నాగబంధం - హంసంతం అని యున్నచో తల,తోక కలిసి ఒక అపూర్వ రచనా రీతియగును. మ-ర-భ-న-య-య-య అను గణములు ప్రతిపాదమునందున్నందున ఈ శ్లోకము స్రగ్ధరావృత్తనిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున కవి తనయందలి వనితాభావమును చెప్పినాడు. ఈ శ్లోకమున దేవతా వనితార్చితులు పార్వతీపరమేశ్వరులని చెప్పుచున్నాడు.

**శ్లో॥ దేవతావనితాకరార్చితదివ్యపాదసరోరుహౌ**
**సేవమానసురాసురోరగసిద్ధయక్షశుభావహౌ।**
**భావనామహితౌ జగత్త్రయపాలనావవినశ్వరౌ**
**భావయామి సదా హృదా మమ పార్వతీపరమేశ్వరౌ॥ 12**

**ప్రతిపదార్థము :-** దేవతా వనితా కరార్చిత దివ్య పాద సరోరుహౌ = దేవతాస్త్రీలయొక్క చేతుల చేత పూజింపఁబడిన దివ్యములైన పాదకమలములుగల, సేవమాన సురాసురోరగ సిద్ధ యక్షశుభావహౌ = సేవించుచున్న దేవరాక్షస నాగ యక్షసిద్ధులకు శుభములు కలిగించు, భావనా మహితౌ = భావనచేత పూజింపఁబడు, జగత్త్రయ పాలనౌ = ముల్లోకముల పాలించు, అవినశ్వరౌ = శాశ్వతులైన, పార్వతీ పరమేశ్వరౌ = పార్వతీ పరమేశ్వరులను, సదా = ఎల్లప్పుడు, మమ = నాయొక్క, హృదా = హృదయముతో, భావయామి = భావించెదను.

**తాత్పర్యము :–** దేవతాస్త్రీల చేత పూజింపఁబడు దివ్యపాదకమలములుగల, సేవించు దేవరాక్షససిద్ధయక్షోరగులకు శుభముల కలిగించు, భావనచే పూజింపఁబడు ముల్లోకముల పాలించు శాశ్వతులైన పార్వతీపరమేశ్వరులను ఎల్లప్పుడు నా హృదయముతో భావించెదను.

**వివరణ :–** ప్రథమపాదమున పార్వతీపరమేశ్వరుల పాదములు దేవతా వనితా కరార్చితము లనుటచే వాని సౌకుమార్యము, సరోరుహములతో రూపింపఁబడుటచే సౌగంధ్యసౌకుమార్యములు, దివ్యములని విశేషింపఁబడుటచే అవి పరమ వ్యోమ స్థితములని వ్యంగ్యములగు చున్నవి.

రెండవ పాదమున దేవతలకు దేవయోని విశేషములకు శుభములు కలిగించు ఆ పార్వతీపరమేశ్వరులు మనుష్యులకు శుభములు కలిగించుటలో ఇంకను ఎక్కువ దయను ప్రదర్శించు ననుట వ్యంగ్యము. దీనత్వమున మనుష్యులు వారిని మించి యుండుట అతి దీనత్వ మధిక దయా పాత్రత్వ హేతువు అనుట లోక ప్రసిద్ధములు గదా!

మూడవ పాదమున జగత్త్రయమునే పాలించు ఆ పార్వతీపరమేశ్వరులు నావంటి యొక్క దీనుని పాలించకుందురా అనుట వ్యంగ్యము. ఆంధ్రమహాకావ్యములలో వాడఁబడు వృత్తములలో గణనీయమైన మత్తకోకిల మీ శ్లోకమున నిబన్ధించఁబడినది. ఇందు ప్రతిపాదమున ర–స–జ–జ–భ–ర అను గణములుండును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ భావనా సాధనముగా హృదయము చెప్పఁబడినది. ఈ శ్లోకమున అది శివభజనాధిష్ఠానముగా చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ తారహారహీరసౌరనీరపూరసౌరభం**
**భఙ్గసఙ్గతాన్యమఙ్గలప్రదం హృదమ్బుజే।**
**జేతృగాతృదాతృతాప్తమాప్తవాగదుర్లభం**
**భఞ్జనం పురాం నృరఞ్జనం నిరఞ్జనం భజే॥ 13**

**ప్రతిపదార్థము :–** తార హార హీర సౌర నీర పూర సౌరభమ్ = స్వచ్ఛముక్తా హారము లందలి సూర్యకాంత మణుల (కరగుటచేత నేర్పడిన) నీటి ప్రవాహముల సారపు కాంతిగల, భఙ్గ సఙ్గతాన్య మఙ్గల ప్రదమ్ = నాశముతో కూడిన దానికన్న భిన్న (నిత్య)మైన మఙ్గలముల నొసగు, జేతృ గాతృ దాతృ తాప్తమ్ = ఇంద్రియముల జయించుట, స్తుతించుట, దానము చేయుటచే పొందఁబడు, ఆప్తవాగదుర్లభమ్ = యథార్థవాక్కులు గలవారికి దుర్లభుడుగాని (సులభుడైన), పురామ్ = (మూడు) శరీరములయొక్క లేక





త్రిపురులయొక్క నాశకుడైన, నృరఞ్జనమ్ = మనుష్యుల రంజింపఁజేయు, నిరఞ్జనమ్ = నిరఞ్జను (శివు)ని, హృదమ్బుజే = హృదయకమలమున, భజే = భజించెదము.



శ్లోకం : 13 ఖడ్గబన్ధము

**తాత్పర్యము :–** స్వచ్ఛముక్తాహారములందలి సూర్యకాంతమణులు కరిగి యేర్పడిన జలప్రవాహ సారపు కాంతిగల, శాశ్వత మఙ్గల (మోక్ష)ము నొసగు, ఇంద్రియముల జయించుట చేత, స్తుతించుట చేత, దానము చేయుట చేత పొందఁబడు సత్యము పలుకువారికి సుఖముగా (అనాయాసముగా) లభించు, త్రిపురాసుర సంహర్త లేక స్థూల సూక్ష్మ కారణ రూప శరీరత్రయమును నశింపజేయు నిరంజనుడైన శివుని హృదయకమలమున భజించెదను.

**వివరణ :–** ప్రథమపాదము శివుని స్వచ్ఛతను, రెండవపాదము ఆయన మోక్ష ప్రదత్వమును, మూడవపాదము ఇంద్రియస్తుతి దాన సత్యసాధన సాధ్యత్వమును బోధించును. ప్రథమపాదమున రావృత్తి, ద్వితీయపాదమున ఙ్గావృత్తి, తృతీయ పాదమున త్రావృత్తి, నాల్గవపాదమున ఞ్జావృత్తి, వృత్త్యనుప్రాసమున శోభను కలిగించుచున్నవి. ప్రతి పాదమున ర–జ–ర–జ–ర అను గణములుండుటచే నీ శ్లోకము సుగన్ధి వృత్త నిబన్ధనము. ఇందు ఖడ్గబంధము కలదు.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు న్సరఞ్జనుడయ్యు నిరఞ్జనుడని చెప్పఁబడినది. ఈ శ్లోకమున పశుపతి యయ్యు శివుడు యోగీశ్వరుడుగా రాజిల్లుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మస్తే చన్ద్రకలాకిరీటమలికే భూతిత్రిపుణ్డ్రేక్షణే**
**గ్రీవాయాం కటుకాలకూటమురసి స్ఫారా హిహారావలిమ్।**
**వామాఙ్గే హిమశైలజాం కరయుగే శూలం మృగం చోద్వహన్**
**మౌనీన్ద్రైః పరితోఽర్చితః పశుపతిర్యోగీశ్వరో రాజతే॥ 14**

**ప్రతిపదార్థము :–** మస్తే = శిరమున, చన్ద్రకలా కిరీటమ్ = చన్ద్ర కలయును కిరీటము, అలికే = ఫాలమున, భూతిత్రిపుణ్డ్రేక్షణే = భస్మత్రిపుణ్డ్రమును కన్నును, గ్రీవాయామ్ = కణ్ఠమునందు, కటుకాలకూటమ్ = చేదు కాలకూట విషమును, ఉరసి = ఱొమ్మున, స్ఫారాహిహారావలిమ్ = విశాలమైన సర్పముల వరుసలను, వామాఙ్గే = వామ శరీరమున, హిమశైలజామ్ = హైమవతిని, కరయుగే = హస్తద్వయమున, శూలమ్ = శూలమును, మృగఞ్చ = మృగమును కూడ, ఉద్వహన్ = మోయుచు, మౌనీన్ద్రైః = మౌనీంద్రులచే, పరితః = చుట్టు, అర్చితః = పూజింపఁబడు, పశుపతిః = పశుపతి, యోగీశ్వరః = యోగీశ్వరుడు, రాజతే = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :–** శిరమున చన్ద్రకలా కిరీటమును, ఫాలమున భూతి త్రిపుణ్డ్రమును (అగ్ని) నేత్రమును, వక్షమున పెద్దపెద్ద సర్పహారాదుల సమూహమును, కణ్ఠమున చేదైన విషమును, శరీర వామభాగమున హైమవతిని, రెండు చేతులలో నొక దానియందు శూలమును మరొక దానిలో జింకను ధరించుచు, మౌనీన్ద్రులచే చుట్టుముట్టి అర్చింపఁ బడు పశుపతి యోగీశ్వరుడు నైన శివుడు ప్రకాశించుచున్నాడు.





**వివరణ :–** మౌనీన్ద్రులు చుట్టు శివనర్చించుట చెప్పఁబడుటచే ఆ శివుడు సర్వతోముఖుడని వ్యంగ్యమగుచున్నది. లేక శివలింగము చుట్టు చేరి మౌనీన్ద్రులు అర్చించుట వ్యంగ్యమగును. మౌనీన్ద్ర శబ్దమున వారి హృదయమున కలిగిన శివసాక్షాత్కారానందమున వారు మాటలు లేని మూగవారైనట్లున్నారనుట వ్యంగ్యమగును. పశుపతి యోగీశ్వర శబ్దములు శివుని సర్వాంతర్యామిత్వమును వ్యంజించును. ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని శిరఃకరాది బాహ్యశరీర భాగములు వర్ణింపఁ బడినవి. ఈ శ్లోకమున శివుని ఆంతరస్వరూపము సేవింపఁబడుచున్నది.

**శ్లో॥ శఙ్కరం పరమం కామమకామం లోకరక్షకమ్।**
**కన్దర్పదమనం శాన్తం సదానన్దం భజేఽనిశమ్॥ 15**

**ప్రతిపదార్థము :–** శఙ్కరమ్ = సుఖమును కలిగించు, పరమమ్ = సర్వోత్కృష్టుడైన, కామమ్ = కోరదగిన, అకామమ్ = కోరిక లేని, లోక రక్షకమ్ = లోకమును రక్షించు, కన్దర్పదమనమ్ = మన్మథుని అణచు, శాన్తమ్ = శాన్తుడైన, సదానన్దమ్ = ఎల్లప్పుడు ఆనందము కలవాడైన వానిని (శివుని), అనిశమ్ = ఎల్లప్పుడు, భజే = భజించెదము.

**తాత్పర్యము :–** సుఖకరుడు, అత్యుత్కృష్టుడు కోరదగిన కోరికలేని లోకమును రక్షించు మన్మథసంహారి, శాన్తుడు ఎల్లపుడు ఆనందమును కలిగియుండు శివునెల్లప్పుడు భజించెదను.

**వివరణ :–** శఙ్కర శబ్దమీ శ్లోకమున సదానన్ద శబ్దముండుట కారణముగా ఇహపరలోక సుఖముల బోధించును. సదానన్ద శబ్దము అలౌకిక నిత్య మోక్ష సుఖమును బోధించును. పరమశబ్దము శివునికంటె మరొక ఉత్కృష్టుడు లేడని బోధించును. కామాకామ శబ్దములు శివుడు సర్వులచే కోరఁదగిన పురుషార్థ స్వరూపుడని ఆయనకు మాత్రమే కోరిక లేదని బోధించును. మరొక విధముగా క+అ+మ అను కామ శబ్దావయవములు బ్రహ్మవిష్ణు రుద్రుల బోధించును. అవయవియైన కామశబ్దము త్రిగుణ సమష్టియగు ఈశ్వరుని బోధించును. అకామ శబ్దము నిర్గుణసదాశివుని బోధించుననుటకు సదాశబ్దము




శ్లోకం : 15 సశరధనుర్బన్ధము

స్ఫోరకము. లోకరక్షక శబ్దము శివునందలి విష్ణుభేదమును స్ఫురింపఁజేయును. శివుని శాన్తత్వ హేతువైన కామసంహారతను కన్దర్పదమన శబ్దము బోధించును. కామమే జీవుని అశాన్తికి కారణము. అశాన్తి దుఃఖహేతువు. దుఃఖహేతువు లేక పోవుటయే గాక జీవుల దుఃఖమునకు హేతువైన కాముని సంహరించుటచే వారికి సదానందము ననుగ్రహించునని బోధించును. ఈ పదములన్నియు కలిపి భజనీయమైన అనగా ప్రాప్యమైన శివుని ఆంతర స్వరూపమును బోధించును. తన పతనమునకు హేతువు అగు కామమును క్రోధమును కూడ దమింపఁజేయవలె ననుట క్రోధరాహిత్యార్థకమైన శాంత శబ్దము స్ఫురింపఁజేయును. లేక కామ నిరాసము చేతనే క్రోధనిరాసము సిద్ధమగును. కావున కామనిరాసమొక్కటే శాంతశబ్దముచే స్ఫురించుననవలెను. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. ఈ శ్లోకమున సశరధనుర్బంధము కలదు.

---

**అవతారిక :-** పై శ్లోకమున నిరవయవ సగుణ నిర్గుణ శివ స్వరూపము భజింపఁ బడినది. ఈ శ్లోకమున సావయవసగుణ శివ రూపము స్తుతింపఁబడుచున్నది.

**శ్లో॥ నారదాదిమునివన్దితపాదం - శారదాపతిముఖస్తుతకేలిమ్।**
**క్రూరవారణవిదారణదక్షం - నీరదాభగలమీశ్వరమీడే॥ 16**



**ప్రతిపదార్థము :-** నారదాది ముని వన్దిత పాదమ్ = నారదాది మునులచే నమస్కరింపబడిన పాదములు గల, శారదాపతి ముఖస్తుత కేలిమ్ = బ్రహ్మయొక్క ముఖముచే స్తుతింపఁబడిన లీలలు గల, క్రూర వారణ విదారణ దక్షమ్ = క్రూరుడైన గజాసురుని చీల్చుటలో సమర్థుడైన, నీరదాభగలమ్ = మేఘముతో సమానమైన కణ్ఠముగల, ఈశ్వరమ్ = ఈశ్వరుని, ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :-** నారదాది మునులచే నమస్కరింపఁబడిన పాదములు గల, బ్రహ్మచే స్తుతింపఁబడిన లీలలుగల, క్రూర గజాసుర సంహరించుటలో సమర్థుడైన మేఘముతో సమానమైన నల్లని కణ్ఠముగల ఈశ్వరుని స్తుతించెదను.

**వివరణ :-** 1. నాలుగు పాదములలో ప్రాసము రేఫావృత్తి 1,2,4 పాదములలో ద్వితీయ తృతీయాక్షరముల ద్విప్రాసము. చివరి పాదమున ఈకారావృత్తి, ప్రథమ పాదమున క్రూర వారణ విదారణ దక్షమ్ అను పదబన్ధమున దరణ వర్ణముల ఆ వృత్తిచే వృత్త్యనుప్రాస శోభను పద్యమున కలిగించుచున్నవి. ర-స-భ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము స్వాగతా వృత్త నిబన్ధనము.

2. ప్రథమపాదమున శివుని పాదముల వన్దనమొనర్చువారిలో బ్రహ్మపుత్రుడైన నారదుడు ప్రథమ గణనీయుడని, ద్వితీయ పాదమున ఆ నారదుని తండ్రియైన బ్రహ్మయే శివస్తోత్ర కర్తలలో ప్రథమ గణనీయుడని, శారదాపతి ముఖశబ్దము సపత్నీకముగా శివలీలల స్తుతించు పద్ధతికి శ్రీకారము చుట్టిన బ్రహ్మ, దంపతులందఱు అట్లు చేయవలెనను ఆదర్శమును స్థాపించిన వారిలో ప్రథముడనియు వ్యంజించును. నాల్గవ పాదమున నీరదము (ఉపమానము) ఆభ (ఉపమావాచకము) గలము (ఉపమేయము) చెప్పఁ బడినను సాధారణధర్మమైన నలుపు చెప్పఁబడకపోవుటచే లుప్తోపమాలంకార మేర్పడియున్నది.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివ దుష్టసంహారలీలలోని గజాసుర సంహారము ప్రస్తావించఁ బడినది. ఈ శ్లోకమున త్రిపురసంహారము ప్రస్తావింపఁబడుచున్నది.

**శ్లో॥ హర! శఙ్కర! సర్వేశ! త్రిపురారే! మహేప్రభో!।**
**పాహి పాహి భవార్తం మాం హరీష్ట! జితమన్మథ!॥ 17**

**ప్రతిపదార్థము** :- హర! = (జగమును) సంహరించువాడా, శఙ్కర! = (శిష్టులకు) సుఖము కలిగించువాడా, త్రిపురారే! = దుష్టులైన త్రిపురు (రాక్షసుల)లకు శత్రువైన వాడా, సర్వేశ! = సర్వులకు ప్రభువైనవాడా, మహాప్రభో! = ప్రభువులలో గొప్పనైనవాడా,

హరీష్ట! = ఇంద్రు/విష్ణు/నందిష్టము గలవాడా, జితమన్మథ! = జయింపబడిన మన్మథుడు గలవాడా, భవార్తమ్ = సంసారమునందార్తుడనైన, మామ్ = నన్ను, పాహి = రక్షించుము, పాహి = రక్షింపుము.

**తాత్పర్యము :-** త్రిపురులను మన్మథుని సంహరించిన హరా! ఇష్టులు శిష్టులునైన ఇంద్రోపేన్ద్రాదులకు సుఖము కలిగించు శఙ్కరా! సంసార పీడితుడవైన నన్ను కాపాడుము. (కాపాడకుండ ఉపేక్షింపకుము).

**వివరణ :-** ప్రథమపాదమున బహువార రేఫావృత్తి వృత్త్యనుప్రాసశోభను పద్యమున కలిగించుచున్నది. పాహి అను క్రియయొక్క ద్విరావృత్తి కాపాడువాడు శివుడు తప్ప మరొకనిచే నివారింపఁబడజాలని కవి సంసారార్తిని వ్యంజించును. దుర్మార్గుడైనచో ఇష్టుడైన వాని కుమారుని కూడ సంహరించుటకు వెనుదీయని శివుని ప్రభుధర్మమైన అధర్మనివారణ ప్రవృత్తిని మహాప్రభో, హరీష్ట, జితమన్మథ అను పదములు వ్యంజించును. ఈ శ్లోకము అనుష్టుప్ఛందో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకము భవార్తి నివారణ పూర్వక రక్షణ మర్థింపబడినది. ఈ శ్లోకమున తత్సాధన శివభజనము మనసున కుపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ విలసమానసమానయుతాకృతిం**
**సురవిరాజివిరాజితతేజసమ్।**
**విహితమోహతమోహతిమీశ్వరం**
**భజ మనో మమ నో మతిరన్యథా॥ 18**

**ప్రతిపదార్థము :-** విలసమాన సమాన యుతాకృతిమ్ = ప్రకాశించుచున్న పూజతో కూడిన ఆకృతితో కూడిన, సురవిరాజి విరాజిత తేజసమ్ = దేవ శిష్టసమూహముచే ప్రకాశింపఁజేయఁబడిన తేజముగల, విహిత మోహ తమోహతిమ్ = చేయఁబడిన మోహాన్ధకార నాశముగల, ఈశ్వరమ్ = ఈశ్వరుని, మమ = నాయొక్క, మనః = ఓ మనమా, భజ = సేవింపుము, అన్యథా = మరొకవిధముగా, మతిః = నిశ్చయము, నో = లేదు.

**తాత్పర్యము :-** శివుని ఆకృతి విలసిల్లునట్టిది మరియు పూజార్హమైనట్టిది. ఆయన తేజము దేవతల విశిష్టసమూహముచే ప్రకాశింపఁబడునట్టిది. ఆయన మోహాన్ధ కారమును నివారించును. కావున ఓ మనసా! ఆయనను సేవించుము. సేవేతర కృత్యమును నిశ్చయింపకుము.





**వివరణ :-** 1. మనస్సు సంశయాత్మకము. మతి నిశ్చయాత్మకము. అని సాధారణముగా వేదాంతులచే చెప్పఁబడును. ఈ శ్లోకమున మనస్సు సంబోధింపబడినది. దానికి సహజమైన సంశయాత్మకతను వీడి శివభజన నిశ్చయరూపమును పొందుమను ఉపదేశమును నిశ్చయముగా పాటింపవలెనని మరొక విధమైన శివేతర భజనమును నిశ్చయించుకొన్న మతి మతియే కాదని శివభజన నిశ్చయమే మనసున సంపాదింపఁ దగినదని అట్టి నిశ్చయము సంపాదించుకొన్నచో మనసు మతియగునని కవి తాత్పర్యమని భావింపవలెను.

2. ఈ శ్లోకమున ప్రతిపాదమున ముక్తపదగ్రస్తాలంకార మున్నదని కొందఱు చెప్పెదరు. సాధారణముగా సమాసాన్తపదమో పాదాన్తపదమో మరొక సమాసారంభమునందో పాదారంభమునందో ప్రయోగించుట ముక్తపదగ్రస్తాలంకార మనుట రూఢిగా నున్నది. ఈ శ్లోకమున ప్రథమపాదమున విలసమాన శబ్ద ప్రయోగమున సమాన పదము గ్రస్తమైనది. అనగా ఆ సమాసమున పదత్వమును కోల్పోయియున్నది. తరువాత సమాసము నుండి ముక్తమైన ఆ పదము మరొక సమాసమున గ్రస్తమైనది. మరల పృథక్పదత్వమును కోల్పోయినది. ఈ అర్థమున ముక్తపదగ్రస్తమనునలంకారము ఈ శ్లోకమున నున్నది. అన్న వారి తాత్పర్యమునూహించి ముక్తపదగ్రస్త శబ్దార్థము వివరింపఁబడినది. విలసమాన లోని లసమానగాని, సమానగాని, మానగాని సమాసముక్తము లైనప్పుడు పదములైనను గ్రస్తములే. అట్లే రెండవ పాదమైన సురవిరాజి విరాజిత తేజసమ్ అను సమాసమున విరాజి అను ముక్తపదము విరాజితలో నున్నను పదత్వము గోల్పోయి గ్రస్తమైనది. మూడవ పాదమునందలి విహిత మోహ తమో హతిమ్ అను సమాసమున మోహ, తమో అను అక్షరము జంట తమో అను పదములుగా ఆవృత్తమైనవి. నాల్గవపాదమున 'మనో' అను శబ్దముయొక్క ఆవృత్తియున్నది. వారి అభిప్రాయము ననుసరించి నాలుగు పాదములలో ముక్తపదగ్రస్తాలంకారమున్నదని చెప్పవచ్చును. ఇందు ఆవృత్తి సంబద్ధచమత్కారమే ఉండుటచే అర్థభేదకృత చమత్కారమంతగా కానరాకపోవుటచే నిట వృత్త్యనుప్రాసమున్నదనుటలో విప్రతిపత్తి యుండనక్కరలేదు. ప్రతిపాదమున న-భ-భ-ర అను గణములుండుటచే నీ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున పద (అక్షర -శబ్ద)ము ఆవృత్తి భజనానుకూలముగా చేయఁబడినది. ఈ శ్లోకమున ఈడనా (స్తుత్య) నుకూలముగా చేయఁబడుచున్నది. (రూఢిననుసరించి భజనమున స్తుతియందును ఆవృత్తి ఉండుననుట లోక ప్రసిద్ధము.)

**శ్లో॥ మదనమదనదీనం మానితామర్త్యమేవం**
**శమనశమనధీరం శాశ్వతం దేవదేవమ్।**
**జననజననదానే జాతభవ్యస్వభావం**
**సదనసదనమీడే సాధుసంసారదావమ్॥** **19**

**ప్రతిపదార్థము :–** మదన మదన దీనమ్ = మదింపఁజేయు మదనుడు దీనుడుగా గలవాడు, మానితామర్త్యమ్ = దేవతల సేవను స్వీకరించినవాడు, ఏవమ్ = ఇట్లే, శమన శమన ధీరమ్ = యముని శమింపఁజేయుటచేత ధీరుడైన, శాశ్వతమ్ = నిత్యుడైన, దేవదేవమ్ = దేవతలకు దేవుడైన, జన + న జనన = జనులకు జననము లేకపోవుట (మోక్షమును), దానే = ఇచ్చుటయందు, జాతభవ్యస్వభావమ్ = కలిగిన మంచి స్వభావముగల, సదన సదనమ్ = (జీవుల) ఇండ్లకు ఇల్లు అనగా ఆధారము ఐన బ్రహ్మాండము ఇల్లుగాగల, సాధుసంసారదావమ్ = సజ్జనుల సంసారము (అను వనము)నకు దావాగ్నియైన వాని (శివుని), ఈడే = స్తుతించెదను.

**తాత్పర్యము :–**మదింపఁజేయు మదనుని దీనుగా నొనర్చినవాడు. దేవతల సేవల నంగీకరించినవాడును, యముని శమింపఁజేయుటలో ధీరుడైనవాడు, శాశ్వతుడును, దేవదేవుడును జనములకు నజననము (మోక్షము) నిచ్చుట యను మంచి స్వభావము కలిగిన వాడును, జీవుల ఇండ్లకు ఇల్లైన బ్రహ్మాండము ఇల్లుగాగల సాధువుల సంసార దుఃఖమును నశింపఁజేయువాడును నైన శివుని స్తుతించెదను.

**వివరణ :–** జీవుల నందఱను కామసుఖకల్పనద్వారమున మదింపఁజేయు మన్మథునంతటి వానిని తన మనసునకు పార్వతీదేవి యందాసక్తముగా నొనరించు (బూనుకొను) చుండగా శివుడు వానిని తన మూడు కన్నులఁదెఱచి చూడగా వాడు భయపడి దీనుడై పోయెను. వెనువెంటనే కాలి బూడిదయయ్యెను. తాటి చెట్టెక్కినవాని తలదన్ను వాడుండునట్లు నేనే అందఱ మదింపఁజేయుదు. వైరాగ్య శూన్యుల నొనరించెదను. అని గర్వించిన మన్మథుని నిర్వీర్యునిగా దీనునిగా నొనర్చినవాడనగుటచే శివుడు మదన మదనుడని చెప్పఁబడెను. యముని చూచిన నందఱును భీరులగుదురు. యముడు ఆకారమున తాను ఇతరుల బెదిరించుచు తనను తాను ధీరుడ ననుకొను చుండును. అట్టి యముడు శివభక్తుడైన మార్కండేయుని కాల (మృత్యు) పాశమున బంధించి నప్పుడు శివుడు ఆతని ఔద్ధత్యమును ఔమ్మున తన్ని శమింపఁజేసెను. ఆ కారణమున అందఱికి మృత్యురూపమున శమనుడైన యముని (ఔద్ధత్యమును) శమింపఁ జేసినందున శివుడు శమన శమన ధీరుడయ్యెను. దేవతలు ప్రకాశింపఁజేయువారు.





వారిని కూడ ప్రకాశింపఁజేయు శివుడు దేవదేవుడని చెప్పఁబడినాడు. జనన మనగా పుట్టుక. అనగా సంసారమున పునరావృత్తి. అపునరావృత్తి అనగా జనన రాహిత్యము. నజననము. భక్తజననమునకు నజననము అనగా పునరావృత్తి రహిత మోక్షము యొక్క దానము(ఇచ్చుట)నందు భవ్య స్వభావముకల శివుడు మూడవ పాదమున చెప్పఁబడెను.

సదనమనగా (కొంతమంది) కూర్చొను చోటు. అనగా ఇల్లు. జీవునకు శరీరము నివాసము. కావున అది (జీవ) సదనము. ఒక జీవుని సదనము ఇల్లు. జీవులందఱి సమష్టి గృహము బ్రహ్మాండము. అది జీవ సమష్టి రూపుడైన ఈశ్వరునకు ఇల్లు. బ్రహ్మాండము సమష్టి జీవ గృహము. వ్యష్టి శరీరములు సదనములని ఇట చెప్పఁ బడినవి.

సాధువులనగా సజ్జనులు. వారు సంసారమున విరక్తులై యుందురు. అయినను చిరకాల సహవాసమున భార్యాపుత్రాదులందు మమకారమును వీడజాలకుందురు. వారి వైరాగ్యమును తీవ్ర మొనర్చి వారియందు మమకారమును దహింపఁజేసి శివుడు సాధు సంసారవనదావాగ్ని అగుచున్నాడు. సంసారము అడవి వంటిది. దానియందు భ్రమించినవాడు. అందు భ్రమించుచునే యుండును. జ్ఞానాగ్నిచేత అది కాలిపోయినప్పుడు మాత్రమే వారికి సంసారభ్రమణ మాగిపోవును. అందుచేతనే శివుడు తన భక్తులైన సాధువులకు జ్ఞానాగ్నిని కలిగించి దానిచేత వారి సంసారమును కాల్చివేయును. అనగా వారి యా సంసార వనము కాలిపోవును. అట్లు సంసారమును కాల్చు జ్ఞానము శివస్వరూపము.

కావున శివుడీ శ్లోకాంతమున సాధు సంసారదావముగా చెప్పబడినాడు. ఈ శ్లోకమున నాలుగు పాదములందును ఆది యమకమున్నది. అది అన్ని పాదములందును సమాసగతముగానే చిత్రింపఁబడినది. అన్ని పాదముల అంతమున ప్రాసము కూడ నున్నది. ద్వితీయ పాదాంతమును యమకమున్నది. ఇందలి యమకమును కొందఱు నిఘణ్ణన యమకమని పేర్కొనిరి. అట్లేల పేర్కొనిరో తెలియరాదు. ఈ శ్లోకము మాలినీ వృత్తనిబద్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునకు మోక్షమిచ్చు స్వభావము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ స్వభావము దయ అని పేర్కొనఁబడినది.

**శ్లో॥ కనద్జ్ఞానవిభో! శఙ్కా – కా శమ్భో! వినతస్య తే।**
**మమ దీనదయాసిన్ధో! – నవనాఘ ఘనావన॥** **20**

**ప్రతిపదార్థము :–** కనద్జ్ఞానవిభో = ప్రకాశించుజ్ఞాన (ము స్వరూపముగాగల), ప్రభూ! దీనదయాసిన్ధో = దీనులందు సముద్రము వంటి దయగలవాడా!, నవనాఘ ఘనావన! = నూతనులైన పాపములేని ఘనుల రక్షించువాడా!, శమ్భో= శంభూ!, తే = నీకు, వినతస్య = విశేషముగా నమస్కరించిన వానికి, కా శఙ్కా = భయమేది?

**తాత్పర్యము :–** జ్ఞానప్రకాశ ప్రభూ!, దీనదయా సముద్రా! నూతనులైన పాప రహితులైన గొప్పవారిని రక్షించువాడా, శమ్భూ!నీకు విశేషముగా నమస్కరించిన వానికి భయమేమి?

**వివరణ :–** ప్రథమపాదమందలి మొదటి మూడు, ద్వితీయ పాదమందలి చివటి మూడు అక్షరములు తప్ప మిగిలిన పది అక్షరములు పూర్వపాదాంతము వఱకు గల



శ్లోకం : 20 హలబంధము



అయిదక్షరములయొక్క విలోమ భావమునే మిగిలిన అయిదక్షరములు కలిగియున్నవి. పై అయిదుక్షరములు కాడినానుకొని యున్న భాగమున వ్రాసి పూర్వార్ధముయొక్క ఆద్యంతము లందలి మూడేసి అక్షరముల భూమినానుకొనియున్న భాగమున వ్రాయవలెను. ఉత్తరార్ధము యొక్క చివటి పాదమున నాలుగక్షరములు విలోమముగా కూడి గ్రథింపఁబడి మొత్తము ఎనిమిదక్షరముల పాదముగా నున్నది. అవి నాగటి పై భాగమున వ్రాయవలెను. ఆ విధముగా వ్రాసిన అక్షరములకు హలాకృతి యేర్పడు కారణమున ఇట్టి శబ్ద చిత్రణమునకు హల బన్ధమని పేర్కొనఁబడును. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. నకార బహువారావృత్తిచే నీ శ్లోకమున వృత్త్యనుప్రాస మేర్పడును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివనమస్కృతి శఙ్కారాహిత్యహేతువుగా చెప్పఁబడినది. ఈ శ్లోకము లౌకికముగా కొంతవఱకు భయ రాహిత్యమునకు హేతువైన శ్రీ (సంపత్తి) అర్థింపఁబడుచున్నది.

**శ్లో॥ ధీర! మారహర! శ్రీదః వేదసాదర! భో విభో!।**
**శమ్భో! సోమ! మమ శ్యామగ్రీవ! దేవ! భవ ప్రభో!॥ 21**

**ప్రతిపదార్థము :–** ధీర! = ఓ ధీరుడా!, మారహర! = మన్మథుని చంపినవాడా! వేదసాదర = వేదములందు ఆదరముతో కూడినవాడా!, భో విభో! = ఓ ప్రభూ!, శమ్భో! = ఓ శమ్భూ! , సోమ! = ఉమతో కూడినవాడా!, శ్యామగ్రీవ! = నల్లని కంఠము గలవాడా, దేవ! = ఓ దేవా, మమ = నాకు, శ్రీద = సంపత్తి నొసగు వాడవు, భవ = అగుము.

**తాత్పర్యము :–** ధీరా! మన్మథ సంహారా! వేదములందాదరము కలవాడా! ఉమాదేవితో కూడిన దేవా! నీలకణ్ఠా! ఓ ప్రభూ! నాకు సంపత్తి నొసగు వాడవగుము.

**వివరణ :–** ఈ శ్లోకమొక సువర్ణ పుష్పగుచ్ఛము. ఇందు అయిదు పుష్పములున్నవి. మొదటి పుష్పదలముల మూడింటిలో 'ధీమాహ' అను అక్షరములు వ్రాయవలెను. పుష్పమూలమున 'ర' వ్రాయవలెను. అట్లే రెండవ పుష్పము నందలి మూడు దళములలో 'శ్రీ వే సా' అను అక్షరముల వ్రాయవలెను. మూలమున 'ద' వ్రాయవలెను. మూడవ పుష్పము నందలి మూడు దలములలో 'ర వి శం' అను అక్షరముల వ్రాయవలెను. మూలమున భో అని వ్రాయవలెను. పుష్పమునందలి మూలలో, తరువాత నాల్గవ త్రిదల పుష్పదలముల మూడింటిలో 'సోమ శ్యా' అని వ్రాయవలెను. దలమూలమున 'మ' వ్రాయవలెను. తరువాత ఐదవ త్రిదలపుష్ప దలములలో 'గ్రీ దే భ' అని వ్రాయవలెను.




**శ్లోకం : 21 గుచ్ఛబన్ధము**

దలమూలమున 'వ' వ్రాయవలెను. సర్వపుష్ప మూలమున 'ప్ర' వ్రాయవలెను. చివరి 'భో' అనునది మధ్య పుష్పమూలమందలి 'భో' తో ఐక్యమును భావింపఁవలెను. ఇది గుచ్ఛబన్ధము. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. ఈ శ్లోకము ఛురికా బన్ధమున నిబన్ధింపఁబడినదనియు చెప్పవచ్చును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు శ్రీదుడు కావలెనని ప్రార్థింపఁబడినాడు. ఈ శ్లోకమున ఆతనిని కవి సేవించుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ గఙ్గాతుఙ్గతరఙ్గసఙ్గతిలసన్మస్తం సమస్తామరీ –**
**హస్తస్వస్తరుసూనసంస్తవఘనప్రస్తావనిస్తారితమ్।**
**భావే బమ్భరదమ్భగుమ్భితవిభాసమ్భావితగ్రీవకం**
**సేవే సేవకభావకప్రదకృపాపూరం పరం దైవతమ్॥ 22**

**ప్రతిపదార్థము :–** గఙ్గా తుఙ్గ తరఙ్గ సఙ్గతిలసన్మస్తమ్ = గంగయొక్క ఎత్తైన తరంగముల కలయిక చేత ప్రకాశించు శిరముగల, సమస్తామరీ హస్త స్వస్తరు సూన సంస్తవ ఘన ప్రస్తావ నిస్తారితమ్ = సర్వదేవతా స్త్రీల హస్తములందలి దేవ వృక్ష పుష్పముల స్తోత్రములయొక్క గొప్ప ప్రస్తావము చేత తేల్చఁబడిన, బమ్భర దమ్భ గుమ్భిత





విభాసమ్భావిత గ్రీవకమ్ = తుమ్మెదల దమ్భముతో గ్రుచ్ఛబడిన కాంతిచే గౌరవించఁబడిన కణ్ఠముగల, సేవక భావకప్రద కృపాపూరమ్ = సేవకులకు భావసుఖమును ఒసగు దయయొక్క ప్రవాహముగల, పరమ్ = ఉత్కృష్టుడైన, దైవతమ్ = దేవుని, భావే = చిత్తమున, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :–** ఎత్తైన గంగా తరంగముల సంపర్కమున ప్రకాశించు శిరముగల, సమస్త దేవతా స్త్రీల చేతులలోని దేవ వృక్ష పుష్పముల స్తోత్రముల ప్రస్తావనచేత తేల్చఁబడిన తుమ్మెదల, దమ్భమును గుప్పించు కాంతిలో గౌరవింపబడిన కణ్ఠముగల, సేవకులకు భావసుఖమును కలిగించు దయాప్రవాహము గల, పరదైవతమైన శివుని చిత్తమున సేవించెదను.

**వివరణ :–** 1. మొదటి మూడు విశేషణములలో హల్లుల జంటల ఆవృత్తి నాల్గవ విశేషణమున వకారావృత్తి ఉండుటచే నిందు వృత్త్యనుప్రాసాలంకారమున్నది. ఉత్తరార్ధమున రెండు పాదములలో వకార ప్రాసమున్నది. చవర్గ శకారములు లేకపోవుటచే నీ శ్లోకము నిస్తాలవ్యము అని కొందఱచే భావింపబడినది. ఇదియొక శబ్ద చమత్కారమే. ఈ శ్లోకమున తాలవ్య హల్లులు లేవనుటచే మాత్రమే నిస్తాలవ్యమని కొందఱచేత భావింపఁబడిన దనుకొనవలెను. కాని తాలవ్యాచ్చైవ ఇకారమిందు బహువారా వృత్తమగుటచే సంపూర్ణముగా నిస్తాలవ్యము అని చెప్పరాదు. 2. ఈ శ్లోకమున తుమ్మెదల కాంతివంటి కాంతిగల శివుని గ్రీవము శివుని గంగాధర మస్తకము సమస్త దేవతా స్త్రీ కృత పుష్పపూజ చెప్పఁబడినవి. పూజా శబ్దముచే శివుని కృప సింధువంతటిదని వ్యంగ్యమగుచున్నది. మూడవపాదమున ఉపమాలంకార స్ఫూర్తి ఉన్నది. ప్రథమపాదమున మస్తం సమస్తామరీ అనుచోట ముక్తపదగ్రస్తాలంకార మున్నది. ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–**పూర్వశ్లోకము నందువలె ఈ శ్లోకమునందును పరశివ సేవనమే చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నన్దివాహం నతాశేషం దేవం దేవేశ్వరం పరమ్।**
**నిన్దితాహంకృతాశ్లేషం శివం సేవే నిరన్తరమ్॥ 23**

**ప్రతిపదార్థము :–** నన్దివాహమ్ = నంది వాహనముగాగల, నతాశేషమ్ = నమస్కరింపబడిన శేషుడు (సర్పరాజు) మొదలుగాగల (లేక) అందరచే నమస్కరింపఁబడిన, దేవేశ్వరమ్




## శ్లోకం : 23 గోమూత్రికాబన్ధము

= దేవతా ప్రభువైన, పరమ్ = ఉత్కృష్టమైన, దేవమ్ = దేవుడైన, నిన్దిత + అహంకృతాశ్లేషమ్ = నిన్దింపఁబడిన అహంకృతియైన కౌగిలింతగల, శివమ్ = శివుని, నిరన్తరమ్ = ఎల్లప్పుడు, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :–** నన్దివాహనుడు శేష నామక సర్పరాజాదులచే నమస్కరింపఁబడిన లేక అందఱచే నమస్కరింపఁబడిన దేవేశ్వరుడు పరదైవతమునైన, అహంకారాశ్లేషము కలవారిని నిందించు శివుని సేవించెదను.

**వివరణ :–** రెండు విషమ పాదములలో సమపాదములలో ద్వితీయ చతుర్థషష్ఠాష్టమాక్షర ప్రాసములున్నవి. రం నం షం హం అను బీజాక్షరముల న్యాసమున్నది. రం (నాల్గుసార్లు) వం (రెండుసార్లు) షం (రెండుసార్లు) హం (రెండుసార్లు) అను బీజాక్షరముల ఆవృత్తియున్నది. ఈ శ్లోకమున ది హం తా షం వం వే రం అను ఆవృత్తాక్షరముల మధ్యలో వ్రాసి మిగిలిన పూర్వాక్షరముల నెడమవైపు కొంచెము క్రిందుగా ఉత్తరార్ధక్షరముల కుడివైపు కొంచెము క్రిందుగా వ్రాసిన గో మూత్రికా బన్ధ మేర్పడును.

---

**అవతారిక :–** పై శ్లోకమున కవిచే చేయఁబడిన శివుని సేవనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున తత్ఫలముగా ఆశ్రితులందఱకు సుఖము ప్రసాదించుము అను ఆతని వాంఛ చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఇన్దుచన్దనకున్దసున్దరగాత్ర! గోత్ర సుతారతే!**
**నన్ద నన్దననన్దితాధికజైత్రయాత్ర! హతక్రతో!॥**
**కన్దనిన్దకకాన్తికన్దర! కాలకాల! దయానిధే!**
**చన్ద్రశేఖర! శఙ్కరాలఘు శం కురు శ్రితసన్తతేః॥ 24**

**ప్రతిపదార్థము :–** ఇన్దు చన్దన కున్దసున్దర గాత్ర! = చంద్రునివలె చన్దనమువలె మొల్లమొగ్గవలె అన్దమైన దేహము గలవాడా!, గోత్ర సుతారతే! = పార్వతియందు ప్రేమగలవాడా!, నన్ద నన్దన నన్దితాధిక జైత్రయాత్ర! = కృష్ణునిచే అభినందింపఁబడిన గొప్ప విజయయాత్ర గలవాడా!, హతక్రతో! = హతమైన క్రతువు గలవాడా!, కన్దనిన్దక





కాన్తి కన్దర = మేఘమును నిందించు కాంతిగల కణ్ఠము కలవాడా!, కాలకాల! = యమునకు యముడైనవాడా!, దయానిధే! = దయకునిధియైనవాడా!, చన్ద్రశేఖర! = చంద్రుడు శిరోభూషణముగా గలవాడా, అలఘు = గొప్పవాడైన, శఙ్కర = శఙ్కరా!, శ్రితసన్తతేః = ఆశ్రితుల సమూహమునకు, శమ్ = సుఖమును, కురు = చేయుము.

**తాత్పర్యము :–** చన్ద్రునివలె చన్దనమువలె మొల్లమొగ్గవలె, అందమైన దేహము గలవాడా!, పార్వతియందు ప్రేమగలవాడా! కృష్ణునిచే అభినందింపఁబడిన గొప్ప జైత్రయాత్ర గలవాడా! యమునకు యముడైన వాడా! దయకు నిధియైన వాడా! క్రతుహనన మొనర్చిన వాడా! చన్ద్రశేఖరా! శఙ్కరా! నావంటి ఆశ్రితుల సమూహమునకు సుఖమును కలిగింపుము.

**వివరణ :–** మొదటి మూడు పాదములయొక్క పూర్వార్ధములలో మూడవ పాదముయొక్క ఉత్తరార్ధమున నాల్గవ పాదముయొక్క చివఱను వృత్త్యనుప్రాసములన్నవి. నాల్గవ పాదమున శఙ్కర శం కురు అనుచోట నీవు సుఖమును కలుగఁజేయుము. లేనిచో నీ శంకరనామము నిరర్థక మగునను వ్యంగ్యమున్నది. ప్రతిపాదమున ర–స–జ–జ–భ–ర అను గణములుండుటచే నీ శ్లోకము మత్తకోకిల వృత్తనిబన్ధనము. ఈ శ్లోకమున అయిదారు ఓష్ఠ్య స్వరములున్నను ఓష్ఠ్యములైన హల్లులు లేకపోవుటచే దాదాపు నిరోష్ఠ్యమని చెప్పఁదగియున్నది. అట్లు కొందఱచే చెప్పబడినది.

---

**అవతారిక :–** పై శ్లోకము సుఖప్రధాన మర్థింపఁబడినది. ఈ శ్లోకమున రక్షణ మర్థింపబడుచున్నది.

**శ్లో॥ భీతకామ! దమస్ఫార! పరాపర! సురాసుర!॥**
**రక్ష మామవిదజ్ఞేయ! యజ్ఞేద! విమమాక్షర!॥ 25**

**ప్రతిపదార్థము :–** భీతకామ! = భయమునొందిన కాముడు కలవాడా!, దమస్ఫార! = ఇంద్రియ నిగ్రహాధిక్యము కలవాడా!, పరాపర! = పర(శక్తి)కు అభిన్నుడైన వాడా!, సురాసుర! = దేవతలకు ప్రాణములనిచ్చువాడా!, అవిదజ్ఞేయ! = అజ్ఞానులచే తెలియరాని వాడా!, విమమ = మమకారములేనివాడా!, అక్షర = నాశము లేనివాడా!, యజ్ఞేద! = యజ్ఞమునందు భక్షించువాడా!, ఇచ్చువాడా!, ఖండించువాడా!, మామ్ = నన్ను, రక్ష = రక్షింపుము.

**తాత్పర్యము :–** కాముని భీతుని చేయువాడా! అధికేన్ద్రియ నిగ్రహము కలవాడా, పరాశక్త్యభిన్నుడా, దేవతలకు ప్రాణములనొసగువాడా!, అజ్ఞానులకు తెలియరాని వాడా,

యజ్ఞమునందు భక్షింపువాడా, లేక ఇచ్చువాడా! లేక ఖండించువాడా!, మమకారములు లేనివాడా! నన్ను రక్షింపుము.

**వివరణ :–** శి వునిఁజూచిన కాముడు భయపడి పారిపోవును. శివభక్తులఁ జూచియే కాముడు పారిపోవును. ఇక శివుని జూచి భయపడు ననుటలో సంశయముండరాదు. శివస్మరణమొనర్చినను మనలోని కామము నశించును. లేక కామములు తీరి నిష్కాముల మగుదుము. ఎట్టైనను కామ బాధ శివ భక్తులకుండదు. ఇది ప్రథమ సంబోధన వ్యంగ్యము.

శివుడు శమ దమములు కలవాడు. అంతరింద్రియ నిగ్రహమైన శమము గలవారికి బాహ్యేంద్రియ నిగ్రహాధిక్యత యుండును. శమము లేనివారికి బాహ్యేంద్రియ నిగ్రహము కలవాడు మిథ్యాచారుడని భగవద్గీత పేర్కొనుచున్నది. ఇది ద్వితీయ విశ్లేషణ వివరణము. పరాపర సురాసుర అను పదముల జంటలు శివునియందలి విరుద్ధగుణ సమావేశమును వ్యంజించును. సర్వము శివ స్వరూపమే కావున పరుడే అని అపరుడు కాదనిగాని అపరుడే కాని పరుడుకాడని చెప్పఁజాలము. **“యస్మాత్పరమ్ నా పరమస్తి కించిత్”** అను ఉపనిషత్తుయొక్క తాత్పర్యమునే పరాపర అను సంబోధనము బోధించును. సుఖము నిచ్చువాడు సురనామధేయుడు. సుఖమునీయని వాడు అసుర నామధేయుడు. సుఖమును ఇచ్చినను ఈయకున్నను దుఃఖము నిచ్చినను ఈయకున్నను మనకాయన తప్ప మరొక గతిలేదు. అని **సురాసుర** అను సంబోధనము వ్యంజించును. విరోధాభాసాలంకారమును కూడ వ్యంజించును. జ్ఞానులు తప్ప మనవంటి అజ్ఞానుల మా శివునెఱుగని వారమగుటచే శివుని ఉనికినే సంశయించుచుందుము. నిరాకరించు చుందుము. అజ్ఞాన ప్రభావమేమని చెప్పఁగలము. అని **అవిదజ్ఞేయ** అను సంబోధనము వ్యంజించును. ఆకలిగొన్న వాని రూపమున యజ్ఞమును భుజించువాడా శివుడే కావున యజ్ఞే + అద అని కాని, యజ్ఞమునందు యజమానునకు ఫలము నొసగువాడు శివుడే కావున యజ్ఞే + ద




**శ్లోకము : 25 ఛురికాబన్ధము**



అనికాని ‘ద’ అను పదము ‘దో అవఖణ్డనే’ అను ధాతువునుండి నిష్పన్నమైన దానినిగా భావించి దక్షయజ్ఞమున శివనిందకు లందఱి పూషాదులు దంతాదులు ఖండించినవాడు అని అర్థములు చెప్పుకొనవచ్చును. జీవులు సమములు. అనగా మమకారములు కలవారు క్షరులు (క్షర పురుషులు). శివుడు విమముడు. అనగా మమకారము లేనివాడు. నాశములేని వాడగుటచే అక్షరుడును అని, విమమాక్షర సంబోధనములు బోధించును.

ఈశ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున కవిచే శివరక్ష అర్థింపఁబడినది. ఈ శ్లోకమున ఆతని శివ భావనము గోరఁబడుచున్నది.

**శ్లో॥ భూతేశ! భూతిధవలాఙ్గ! సభూతిసంఘ!**
**నాగాజినాంశుక! నగాలయ! నాగశాలిన్!**
**పఞ్చాస్య! పఞ్చవిశిఖాహత! పఞ్చతాద!**
**భావే భవా! భవ! భవాభవ! భావితాశు॥ 26**

**ప్రతిపదార్థము :–** భూతేశ! = ఓ భూతపతీ!, భూతిధవలాఙ్గ! = విభూతి చేత లేక విభూతి వలె తెల్లని శరీరముగలవాడా!, సభూతి సంఘ! = ఐశ్వర్యసమూహముతో కూడినవాడా, నాగాజినాంశుక! = గజచర్మము వస్త్రముగా గలవాడా!, నగాలయ! = (కైలాస) పర్వతము ఇల్లుగా గలవాడా!, నాగశాలిన్! = సర్పములతో ఒప్పువాడా, పఞ్చాస్య = ఐదు ముఖములు గలవాడా!, పఞ్చవిశిఖాహత = మన్మథునిచే కొట్టఁ బడినవాడా, పఞ్చతాద = మృత్యువును భక్షించినవాడా, లేక మృత్యువు నొసంగువాడా!, భవా! = (స్వయముగా), జన్మమును కల్పించుకొనిన వాడా!, అభవ = (వాస్తవముగా) జన్మము లేనివాడా!, అభవ = (జ్ఞానరూపుడు అగుటచే అజ్ఞాన రూపమైన) సంసారము లేనివాడా!, అశు = శీఘ్రముగా, భావే = మనస్సు నందు, భావితా = ఉండు (లేక సంతోషింపఁజేయు) వాడవు, భవ = అగుము.

**తాత్పర్యము :–** భూతేశ్వరుడా!, భూతిచేత లేక భూతివలె తెల్లనైన వాడా!, ఐశ్వర్యముల సంఘముతో కూడినవాడా!, గజచర్మము వస్త్రముగా గలవాడా!, (కైలాస) పర్వతము ఇల్లుగా గలవాడా!, సర్పములతో ఒప్పినవాడా!, అయిదు ముఖములు గలవాడా!, మన్మథునిచే కొట్టబడినవాడా!, మృత్యువును భక్షించిన వాడా, స్వయముగా పుట్టినవాడా, పుట్టుకలేనివాడా, సంసారము లేని వాడా!, శివా! మనస్సున శీఘ్రముగా నన్ను భావించు వాడవు కమ్ము.

**వివరణ :–** పిశాచాది భూతములకు లేక పఞ్చభూతములకు తన్నిర్మిత బ్రహ్మాండమునకు దానియందు నివసించు సమస్త జీవులకును ప్రభువగుటచే శివుడు భూతేశుడని సంబోధింపఁబడినాడు.

2. విభూతి అను అర్థము నందొకసారి ఐశ్వర్యము అనునర్థమునందు మరొకసారి భూత శబ్దము అర్థభేదమున ద్విరుక్తమగుటచే ప్రథమపాదమున యమకాలంకార మేర్పడియున్నది. రెండవపాదమునను నాగశబ్దము గజ సర్పముల అర్థములలో ద్విరుక్తమగుటచేతను, మూడవపాదమునను విస్తృతము అను అర్థమున, అయిదు అను అర్థమున పఞ్చ శబ్దము ద్విరుక్తమగుట చేతను, నాల్గవ పాదమున భావభావ శబ్దములు జన్మ (లేనివాడు), సంసార (ములేని వాడు) అను రెండు అర్థములు గల అభవశబ్దము ద్విరుక్తమగుట చేతను, శివ అను రూఢ్యర్థమున అగుము అను మరొక అర్థమున భవ శబ్దముయొక్క ద్విరుక్తి చేతను ఈ యమకాలంకారములే యేర్పడియున్నవి.

3. పఞ్చాస్య అను సంబోధనము శివుడు జీవులందరి బుద్ధిగుహలలో వర్తించు లక్షణము గలవాడగుట చేత సింహసదృశుడను అర్థమును వ్యంజింపఁజేయును. సద్యోజాత వామదేవ తత్పురుష అఘోర ఈశాన అను పంచముఖములు గలవాడను అర్థమును ఆ సంబోధనము తెలుపును.

4. పఞ్చ విశిఖాహత అను సంబోధనము మన్మథుడు ఒకేసారి అయిదు బాణములతో శివుని కొట్టి శివునకు శత్రువైన వాడను అర్థమును మరియు అట్లు కొట్టఁబడిన శివుడు మన్మథునే శత్రువువలె చంపినాడు అనియు మరల పార్వతినే సప్తర్షులను అరుంధతిని పెండ్లి కుదుర్చుటకు హిమవంతు కడకు పంపి స్వయముగా ఆమెను వివాహమాడు యత్నము నాచరించినందున మన్మథుని బాణముల కలిగిన కామము అను గాయము శివుని చిత్తమున మానలేదనియు వ్యంజించును. పఞ్చతాద శబ్దము శివుడు మృత్యు మృత్యువని వ్యంజించును. అయిదు భూతములు కలిసి ఒకటైన శరీరము మరల పంచత్వమును అనగా అయిదుగా అగుటను అందుచేతనే పంచతాద శబ్దము మృత్యువును బోధించునని గమనింపవలెను.

చతుర్థ పాదమున భావేభవ అను విభాగము మన్మథుని వలె శివుడు అందటి భావ (చిత్త)ముగనుండుట సమానమైనను మన్మథుడు అట్లుండి సంసారాభిముఖ్యమును శివుడు అట్లుండి మోక్షాభి ముఖ్యమును కలిగించుననుట వ్యంజించును. మరియు నా చిత్తము నందుండియు సంసారము లేని వాడవుగానే ఉందువని భావే + అభవ అను విభాగము వ్యంజించును. "భవాభవ" శబ్దముల ఆవృత్తి యమకమను శబ్దాలంకారమును





కలిగించుటతో పాటు విరోధాభాసమను అర్థాలంకారమును కూడ స్ఫురింపఁజేయును. ఇందు మూర్ధన్యాక్షరములు లేకపోవుటచే నిర్మూర్ధన్యమని చెప్పఁబడును. ప్రతిపాదమున త–భ–జ–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము ఇంద్రవంశా వృత్త నిబన్ధనము.

5. ఈ శ్లోకమునందలి మొదటి మూడు పాదములలో విశేషణములు మూడేసి ఉన్నవి. దాదాపు ఏకాక్షరారంభముగలవై నాల్గవపాదమందలి పదములన్నియు అట్లే ఏకాక్షరారంభముగలవై శబ్దరమణీయకమును కలిగించునవై యున్నవి.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివభావనము కోరఁబడినది. ఈ శ్లోకమున తన ప్రతిభ శివగుణస్తుతిచే విలసిల్లవలెనని కోరఁబడుచున్నది.

**శ్లో॥ సదా విభాతు ప్రతిభా – మదీయా తేఽద్రిజాపతే।**
**గుణస్తుత్యా మహితయా – బ్రహ్మాదిసురకామ్యయా॥ 27**



**శ్లోకం : 27 శ్రీబన్ధము**

**ప్రతిపదార్థము :–** అద్రిజాపతే = ఓ పార్వతీపతీ!, మదీయా = నా(కు సంబంధించిన), ప్రతిభా = ప్రతిభ, తే = నీయొక్క, బ్రహ్మాదిసుర కామ్యయా = బ్రహ్మాది దేవతల చేత కోరఁదగినది, మహితయా = గొప్పనైన, తే = నీయొక్క, గుణస్తుత్యా = గుణములయొక్క స్తోత్రముచేత, సదా = ఎల్లప్పుడు, విభాతు = ప్రకాశించుగాక!

**తాత్పర్యము :–** ఓ పార్వతీపతీ! నా ప్రతిభ బ్రహ్మాది దేవతలచేత కోరఁదగిన గొప్పనైన నీ గుణముల స్తుతిచేత ఎల్లప్పుడు ప్రకాశించుగాక!

**వివరణ :–** బ్రహ్మాది దేవతా స్తుత్యత్వము హేతువుగా తనకు వారివలె శివగుణ స్తుతి చేయగల ప్రతిభ కలుగవలెనను వాంఛ నా అత్యాశగా భావింపకుము అను ప్రార్థన మిందు వ్యంగ్యమగుచున్నది.

2. ఈ శ్లోకమున ప్రథమపాదముయొక్క మరియు ద్వితీయపాదముయొక్క తృతీయ పాదముయొక్కయు పూర్వార్ధోత్తరార్ధములు ఏకాక్షరము తోడనే ముగియుచున్నందున పాద మధ్యాంత ప్రాసమేర్పడియున్నవి. ఉత్తరార్ధమున పాదాంతప్రాసమున్నది.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివగుణస్తుతి చేయగల ప్రతిభ అర్థింపఁబడినది. ఈ శ్లోకమున అది కలుగుటకు చేయవలసిన శివసేవనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ దివ్యాకారం దీనాధారం – భవ్యామోదం భక్తశ్రీదమ్।**
**నవ్యానన్దం నాథం భావే – శ్రవ్యాలాపం శమ్భుం సేవే॥ 28**

**ప్రతిపదార్థము :–** దివ్యాకారమ్ = దివ్యమైన ఆకృతిగల, దీనాధారమ్ = దీనులకు ఆధారమైన, భవ్యామోదమ్ = గొప్ప సంతోషముగల, భక్త శ్రీదమ్ = భక్తులకైశ్వర్య మొసగు, నవ్యానన్దమ్ = కొత్త ఆనందముగల, శ్రవ్యాలాపమ్ = వినఁదగిన మాటలు గల, నాథమ్ = ప్రభువైన, శమ్భుమ్ = శమ్భుని (శివుని), భావే = మనసున, సేవే = సేవించెదను.

**తాత్పర్యము :–** దీనులకాధారమైన దివ్యాకృతి ధరించిన భక్తుల కైశ్వర్యములతో పాటు ఆనన్ద మొసగునట్టి వినఁదగిన నామములుగల, ప్రభువును మనసున సేవించెదను.

**వివరణ :–** ఈ శ్లోకమున దాక్షిణాత్యప్రియమైన ప్రాసమున్నది. ప్రతిపాదమున మ–మ–గ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోకము అనుష్టుప్ఛన్దమునకు చెందిన విద్యున్మాలా వృత్తనిబన్ధనము.

పూర్వశ్లోకమునందువలె పూర్వార్ధమున పాద మధ్యాంతప్రాసమున్నది.








**శ్లోకం : 28 శ్రీబన్ధము**

---

**అవతారిక :–** పై శ్లోకమున భావమున శివుని సేవనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున తన సేవనమునకు శివుని యందలి బ్రహ్మవిష్ణుసేవ్యత యను హేతువు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ రాజహీరరమణీయవిగ్రహం భూరిభవ్యభుజగేశభూషణమ్।**
**బ్రహ్మవిష్ణుపరిసేవ్యమీశ్వరమ్ భావయామి పరమం హి శఙ్కరమ్॥ 29**

**ప్రతిపదార్థము :–** రాజహీర రమణీయ విగ్రహమ్ = చంద్రకాంతమణివంటి అందమైన శరీరముగల, భూరి భవ్య భుజగేశ భూషణమ్ = గొప్ప సర్పరాజు భూషణముగాగల, బ్రహ్మవిష్ణుపరిసేవ్యమ్ = బ్రహ్మవిష్ణువులచే బాగుగా సేవింపఁదగిన, పరమమ్ = ఉత్కృష్టమైన, ఈశ్వరమ్ = ప్రభువైన, శఙ్కరమ్ = శఙ్కరుని, భావయామి = భావించెదను.

**తాత్పర్యము :–** చంద్రకాంతమణి వలె తెల్లనైన శరీరముగల, గొప్ప సర్పరాజుల (శేష వాసుక్యాదుల) చే అలంకరింపఁబడిన, బ్రహ్మవిష్ణువులచే (నిరుప్రక్కల) సేవింపఁదగిన, పరమేశ్వరుడైన శఙ్కరుని భావించెదను.

**వివరణ :–** కొందఱీ శ్లోకము నిర్దన్త్యము అని దన్త్యాక్షరములైన ఞ తు లసలు లేనిదని చెప్పిరి. కాని ఇందు సేవ్య శబ్దమున సకారము కనఁబడుటచే వారు పొరఁబడినారని చెప్పవలెను. **పరిసేవ్యమ్** పాఠమునకు మాఱు **పరిభావ్యమ్** అను పాఠము నంగీకరించినచో నీ శ్లోకము నిర్దన్త్యమగుట కభ్యంతర ముండదు.

---

**అవతారిక :–** పూర్వశ్లోకమున పాఠకుల సంబోధ్యత అర్థ సిద్ధమైనది. ఈ శ్లోకమున శివుడనులోమముగా నాలుగేసి అక్షరముల క్రమముననను, దానికి విలోమమైన క్రమముననను సంబోధింపఁబడుచున్నాడు.

**శ్లో॥ రమారాజ! జరామార రహితాగ గతాహిర।**
**రవధీర! మతాభాస! సభాతామర! ధీవర॥ 30**

**ప్రతిపదార్థము :–** రమా రాజ! = లక్ష్మి (సంపత్తి)కి ప్రభువైన వాడా!, జరామార రహిత! = ముసలితనము మృత్యువులేనివాడా!, అగగత! = పర్వతమునందుండు వాడా, అహిర = సర్పమును గ్రహించువాడా, రవధీర! = ధీరమైన ధ్వనిగలవాడా, మతాభాస = తెలియఁబడినట్లు అభాసించువాడా, సభాతామర = జ్ఞానయుక్తులైన అమరులతో కూడినవాడా, ధీవర = బుద్ధితో శ్రేష్ఠుడైనవాడా!

**తాత్పర్యము :–** సంపత్తికి ప్రభువైనవాడా! సర్పములను (భూషణములుగ) స్వీకరించిన వాడా! ధీరస్వరముగలవాడా!, తెలియఁబడినట్లు అభాసించువాడా!, జ్ఞానులైన అమరులతో కూడినవాడా!

**వివరణ :–** ఈ శ్లోకమున అన్ని పాదములు సంబోధనములతోడనే కూడి యున్నవి. అష్టాక్షరములైనందున అనుష్టుప్ఛన్దోనిబన్ధనములు. అన్ని పాదములలోని పూర్వార్థము (తొలినాలుగక్షరములు) విలోమాక్షర క్రమమున పునరావృత్తములైనవి. మూడవ పాదముయొక్క అక్షర క్రమమునకు విలోమాక్షర క్రమముగా నాలుగవ పాదము నిబంధింపఁబడినది. ఛత్రాకారము కల్పించి ఛత్రాకారముగా (గొడుగుపై కప్పుగా 'ర' మధ్యముగా రెండు వైపులలో నొకవైపున జరామా మరొకవైపున హితాగ అను మూడేసి అక్షరములు వ్రాయవలెను. వాని అనులోమ విలోమాక్షర పఠనక్రమమున పూర్వార్ధ మేర్పడును. మధ్యరేఫముతో మొదలై ఛత్రదండాకారముగా క్రిందుగా రేఫము ఆదికాగా






**శ్లోకం : 30 ఛత్రబన్ధము**



వధీర మతాభాస అను మూడవ పాదములోని ఏడక్షరములు వ్రాయవలెను. అవి యే ఉత్క్రమమున నాల్గవపాదముగా ఏర్పడును. ఇట్టి శబ్ద (అక్షర) నిబన్ధనము ఛత్రబంధమని పేర్కొనఁబడును.

---

**అవతారిక :–** పై శ్లోకము సంబుద్ధ్యన్త పదనిర్మితమైనట్లు ఈ క్రింది శ్లోకము తృతీయా విభక్త్యాంతముగా భజన క్రియగల వాక్యముగా నిర్మితమైనది.

**శ్లో॥ భజేఽహివలయం లయఙ్గతనయం నయన్తమకలం కలఙ్కరహితమ్।**
**హితం సుహసితం జితపురం పురన్దరమతమ్మతఙ్గజపరమ్॥ 31**

**ప్రతిపదార్థము :–** అహి వలయమ్ = సర్పకంకణములుగల, లయంగతనయమ్ = లయమునొందిన వ్యవహారముగల, నయన్తమ్ = కొనిపోవు, అకలమ్ = అంశములు లేని, కలఙ్కరహితమ్ = కలఙ్కహీనుడైన, హితమ్ = హితుడైన, సుహసితమ్ = చక్కని నవ్వుగల, జితపురమ్ = జయించఁబడిన పురములు గల, పురన్దరమతమ్ = ఇంద్రునికిష్టుడైన, మతఙ్గజపరమ్ = గజమునందాసక్తుడైన (శివుని) భజే = సేవించెదను.

**తాత్పర్యము :–** సర్పకంకణముల ధరించు, వ్యవహారముగాని, కలఙ్కములు విభాగములుగాని లేని సర్వమును తనవైపు కొనిపోవు హితుడైన చక్కని నవ్వుగల

తెల్లనివాడైన త్రిపురముల జయించి ఇంద్రునికిష్టుడైన గజ చర్మము ధరించి, గజము నందాసక్తిని ప్రదర్శించు శివుని సేవించెదను.

**వివరణ :–** ఈ శ్లోకము ప్రతిపాదమునందున మొత్తము శ్లోకమున ఏడుసార్లు ఆవృత్తియున్న ముక్తపదగ్రస్తత మిక్కిలి రమణీయమై యున్నది. ఈ శ్లోకమున ప్రతిపాదమున జ–స–జ–స అను గణములు ఆఱు అక్షరముల తరువాత (పద) విశ్రాంతి లేక పదాన్తతయు నుండుటచే నీ శ్లోకము జలోద్ధతగతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకము ముక్తపదగ్రస్తతా శోభితము కాగా ఈ శ్లోకము ఏకాక్షర నిర్మిత శోభితమై అందగించుచున్నది.

**శ్లో॥ తతాతీతి తతాతీత! తాతతాత – తతోతతిః।**
**తాతితాం తాంత తుత్తాతాం తాం తాం తత్తా తతే తతాత్॥ 32**

**ప్రతిపదార్థము :–** తతాతీతి తతాతీత! = విస్తృతమైన అతిక్రమణముగల, వాయువును అతిక్రమించిన (ఆకాశ) స్వరూపము కలవాడా!, (తే = నీయొక్క), తతాత్ = వాద్యమునుండి, తాతతాత తతోతతిః = తాతతాత తతోతతి యను (ధ్వని), తాతితాం తాంత తుత్తాతాం తాం తాం తత్తా = తాతితాం తాం తతుత్తాతాం తాం తత్త యను ధ్వనించు, తతే = విస్తృతములైనవి.

**తాత్పర్యము :–** వాయువు నతిక్రమించు ఆకాశస్వరూపము గలవాడా!, నీ వాద్యము నుండి తాతతాత తతోతతి తాతితాంతాం తతుత్తా తాతాం అను మృదంగాది ధ్వనులు విస్తృతములై యొప్పుచున్నవి.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ నాట్యాంగమైన మృదంగాది వాద్యధ్వని శివుని ఆకాశమయత్వము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆకాశోన్నతమైన కైలాసమునందలి శివరూపము వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ క్షీరామ్భోనిధివన్నితాన్తధవలే కైలాసభూమీధరే**
**శమ్భుస్సాధు విభాతి నైకవదనః శేషో యథా శ్వేతభాః।**
**తత్కణ్ఠే గరలం పురన్దరమణిస్తోమాభిరామప్రభం**
**శేషాఙ్గే శయితస్య గాత్రమివ వైకుణ్ఠస్య సంశోభతే॥ 33**

**ప్రతిపదార్థము :–** క్షీరామ్భోనిధివత్ = పాలసముద్రమువలె, నితాన్తధవలే = మిక్కిలి తెల్లనైన, కైలాసభూమీధరే = కైలాస పర్వతమున, శమ్భుః = శివుడు, నైకవదనః = అనేక ముఖములుగల, శేషః యథా = శేషునివలె, శ్వేతభాః = తెల్లని కాంతిగలవాడుగా, విభాతి తత్కణ్ఠే = ఆతని కంఠమునందు, పురన్దరమణి స్తోమాభిరామ ప్రభమ్ = ఇంద్రనీల మణి సమూహమువలె అందమైన కాంతిగల, గరలమ్ = విషము, శేషాఙ్గే = శేషుని శరీరమునందు, శయితస్య = పడుకొనియున్న, వైకుణ్ఠస్య = విష్ణువుయొక్క, గాత్రమివ = శరీరమువలె, సంశోభతే = మిక్కిలి ప్రకాశించుచున్నది.





**తాత్పర్యము :–** పాల సముద్రమువలె కైలాసము తెల్లనైనది. పాల సముద్రమున శేషునివలె కైలాసమున శివుడు తెల్లనికాంతి గలవాడైయున్నాడు. ఆ శేషునియందు పడుకొనియున్న విష్ణువుయొక్క శరీరమువలె ఇంద్రనీలమణి సమూహమువలె అందమైన కాంతి గల శివకణ్ఠగత విషము మిక్కిలి ప్రకాశించుచున్నది.

**వివరణ :–** ఈ శ్లోకమున సావయవ పూర్ణోపమాలంకారమున్నది. విష్ణు శరీరము గరలము. ఇంద్రనీల సమూహకాంతివలె నల్లనిది. అట్లే శివుని కణ్ఠగత గరలమును నల్లనైనది. పాలసముద్రమువలె కైలాసము తెల్లనిది. కైలాసము నందలి శివుడు పాల సముద్రము నందలి శేషునివలె తెల్లనైనవాడు. శేషునందలి విష్ణుశరీరముతో శివకణ్ఠగత గరలము నుపమింపఁబడినది. శేషునితో శివుడు, పాలసముద్రముతో కైలాసము నుపమింపఁబడినవి. పరమేశ్వరకరుణ పాలసముద్రమువలె పలుచగా, గడ్డకట్టి కైలాసమువలె గట్టిగా నుండవచ్చును. పలుచగా నున్నను గట్టిగా నున్నను కరుణ కరుణయే కదా! కరుణ పలుచఁబడి పాలసముద్రమైనది. గడ్డకట్టి కైలాసమైనది. పాపులను చూచి ఆయన దయ గట్టిపడి కైలాసమై ప్రలయహేతు శివున కాశ్రయమైనది.

పుణ్యాత్ములు దుష్టుల దౌష్ట్యముచే కష్టపడుచుండఁజూచి ఆ గడ్డకట్టిన దయ కఱగి పాలసముద్రమై పాలక విష్ణువున కాశ్రయమైనది. కరుణ సద్గుణము. సద్గుణము సాత్త్వికము తెల్లనిది. అది కఱగి పాలసముద్రముగా, గడ్డకట్టుచు కైలాసముగా మారుచుండును. ఈ శ్లోకమున శివ విష్ణువుల నివాసముల ఔపమ్యమున పై అంశము వ్యంగ్యమఁగును. గడ్డకట్టి పాపులకు దుఃఖమును కలిగించుట ద్వారా పాపము తొలగించి వారి ననుగ్రహించుటచే గడ్డకట్టినప్పుడును కారుణ్యమునకు కొఱత యుండదు.

ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణములుండుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకము శివుడు కైలాసమున శోభించుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుడు దుఃఖనాశకుడుగా స్తుతింపఁబడుచున్నాడు.

**శ్లో॥ గోగ! గోగాంగగోంగాంగ! - మాముమామీమమామమ।**
**హే హ హేహే హహాహోహ - వివోవావా! వివావవ॥ 34**

**ప్రతిపదార్థము :-** హే గోగ! = ఇంద్రియములందుండు వాడా!, హేగోగ! = ఎద్దుపై పోవువాడా!, హే అంగగ! = శరీరములందుండు వాడా, ఓంగాంగ! = ఓంకారము నందుండు శరీరము గలవాడా!, మామ్ = నన్ను, ఉమామ్ = పార్వతినిగా, ఈమ్ = లక్ష్మినిగా, అమామ్ = కాళినిగా, అమ = తెలియుము, హహ = చంపు వారిని చంపువాడా!, అహ = చంపనివాడా!, అహ = తెలియరానివాడా!, వివోవావా! = విహాయ సాద్యహంకారాంతము లైన అష్టమూర్తులు గలవాడా, వివౌ = పక్షివాహనులైన, వైశ్వారన హిరణ్యా గర్భులను నామాంతరములు గల స్థూలసూక్ష్మ శరీర సమష్ట్యభిమానులైన బ్రహ్మవిష్ణువులను, అవ = కాపాడుము.

**తాత్పర్యము :-** ఇంద్రియములందుండు వాడా, ఎద్దువాహనముగా గలవాడా, అష్టమూర్తీ! స్థూల సూక్ష్మ శరీర సమష్ట్యభిమానులైన బ్రహ్మవిష్ణువులను అనగా తదంతర్గతుడైన నానా విశ్వతైజసులను దుఃఖానుభవమును నశింపఁజేసి రక్షింపుము.

**వివరణ :-** ఈ శ్లోకమునందలి నాలుగు పాదములు ఏకాక్షర నిర్మితములు. ప్రథమపాదమున గోగగోగ, అంగగ, ఓంగాంగ అని విడదీసి అర్థము చెప్పఁబడినది. మరొకవిధముగా విడదీసి అర్థమును చెప్పుటకవకాశమున్నది.

రెండవ పాదమున మామ్ అను పదము రచయితకు బోధించు దానినిగా భావింపవలెను. ప్రకృతి స్వరూపములైన లక్ష్మీపార్వతీ సరస్వతుల శక్తులయొక్క అంశమైన తనను తద్రూపముగానే భావించి వారిని చెట్టఁబట్టినట్లు తనను కూడ చెట్ట బట్టుమను అంశము రెండవ పాదము తెలుపును. మూడు పాదములను నాలుగు హే అను సంబోధనములకు ముందుఁజేర్చి అన్వయింపవలెను.

నాల్గవ పాదమున **నామైకదేశీ నామనిర్దేశః** అను నియమము ననుసరించి వివిహాయసమును వ వాయువును తదుత్తరపదమైన ఉకారము ఉదకమును వ వహ్నిని తత్ప్రశ్లిష్టమైన అ అవనిని తదుత్తరమున నున్న 'వా' అను అక్షరమును ఉ అ అ అను మూడు అక్షరముల సంధివలన నేర్పడిన దానినిగా భావించి ఉ ఉడుపతి (చంద్రు)ని అ అగ్నిని అ అహంకృతిని బోధించునని భావింపవలెను.

ఆ తరువాతనున్న వివౌ అను పదములోని వి పక్షిని వ వాహనమును బోధించగా హంస గరుడ రూప పక్షి వాహనులగుటచే బ్రహ్మవిష్ణువులను ఆ రెండు అక్షరములు బోధించును. బ్రహ్మ విష్ణువులచ్చట సమష్టి స్థూలసూక్ష్మశరీరాభిమానులుగా



భావింపవలెను. శివుడు అవ్యాకృతుడు. ఈశ్వరుడు కారణరూపుడు. కార్య బ్రహ్మములైన జాగ్రత్స్వప్నావస్థా సమష్ట్యభిమానులైన హిరణ్యగర్భ వైశ్వానర నామాంతరములుగల విష్ణుబ్రహ్మలను కాపాడుమని వేడుకొనుటను 'అవ' అను క్రియ బోధించును. వారిని కాపాడుటలో వారిలో వ్యష్టి జాగ్రత్స్వప్నావస్థలందలి దుఃఖానుభవమును దూరముచేసి తనను రక్షించుమను ప్రార్థనము తాత్పర్యార్థముగా సిద్ధించును.

వివోవావా అను అష్టమూర్త్యర్థక పదము విరాడ్రూపవైశ్వానరావ్యాకృతా భేదమును సూచించును. అద్వైత జ్ఞానప్రదాన రూపమున మూలజ్ఞానమును కూడ నశింపఁజేసి తురీయ శివైక్యము నిచ్చి రక్షించుమను తాత్పర్యము కూడ అవ అను క్రియవలన లభించును. శబ్దచమత్కార ప్రధానమైన ఏకాక్షర పాదత్వమును నిర్మించు చాతుర్యము చేతనే ఈ శ్లోకము ప్రశంసనీయమగును. కావున ఇట్లు క్లిష్టార్థ కల్పనము తప్పదు. ఈ శ్లోకము అనుష్టుప్ఛందో నిబద్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున జీవైశ్వరైక్య జ్ఞానామృత ప్రధానరూపమైన అవనము అర్థింపఁ బడినది. ఈ శ్లోకమున శివ రూపామృతము మనశ్చషక స్థాపితమైనచో మర్త్యున కమర్త్యత సిద్ధించునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మనసి చషకతుల్యే స్థాపితం శుద్ధశుద్ధే**
**బహురుచిమమృతేన స్ఫారహారామలేన।**
**సదృశమసమదృష్టేర్దేహమాత్తాతితృప్తి -**
**ర్జయతి సమనుభూయామర్త్యవత్సాధుమర్త్యః॥ 35**

**ప్రతిపదార్థము :-** శుద్ధ శుద్ధే = మిక్కిలి శుద్ధమైన, చషకతుల్యే = గిన్నెవంటి, మనసి = మనసునందు, స్థాపితమ్ = ఉంచబడిన, స్ఫారహారామలేన = విస్తారము, మనోహరము స్వచ్ఛమునైన, అమృతేన = అమృతముతో, సదృశమ్ = సమానమైన, బహురుచిమ్ = ఎక్కువ రుచి (రసము - కాంతి)గల, అసమదృష్టేః = బేసి కన్నులుగల , దేహమ్ = దేహమును, ఆత్త = పొందబడిన, అతితృప్తిః = మిక్కిలి సంతోషము, అనుభూయ = అనుభవించి, సాధుమర్త్యః = సజ్జనుడు, అమర్త్యవత్ = అమరునివలె, జయతి = సర్వోత్కృష్టముగా వర్ధిల్లును.

**తాత్పర్యము :-** మిక్కిలి మనోహరమైన స్వచ్ఛమైన అమృతమువంటి శివదేహము గిన్నె వంటి మనసులో స్థాపితము కాగా దాని ననుభవించునప్పుడు అమరుని వలె సజ్జనుడు సర్వోత్కర్షముగా వర్ధిల్లును.

**వివరణ :–** శివదేహమమృతము గిన్నెతో మనసు పోల్చఁబడుటచే నీ శ్లోకమున పూర్ణోపమాలంకార మేర్పడియున్నది. సదృశ శబ్దమిందు ఔపమ్య వాచకముగా నున్నది. ఉపమేయము శివదేహము, ఉపమానము అమృతము, అట్లే చషకముపమానము. మనసు ఉపమేయము. దేహామృతములు సాధారణ ధర్మము. బహు రుచిత్వము. రుచి శబ్దము శ్లేషచే కాంతిని రసమును బోధించును. ఏక శబ్దబోధితములై అభేదభావమును పొందిన ఆ రెండు సాధారణ ధర్మమును సంపాదించుచున్నవి. ఉపమాలంకారమున భేదాభేద ప్రధాన సాదృశ్యమే ఉండవలసి ఉన్నను పై శ్లేషమభేద ప్రాధాన్యమున నభేదము వైపు మొగ్గను చూపుచున్నది. సాధారణముగా రూపకాలంకారమున సాదృశ్యస్ఫూర్తి ఉండును. ఇచట సాదృశ్య మభేదమును రుచి శబ్ద శ్లేష బలమున రస కాంతులకే గాక అవి ధర్మములుగా గల దేహామృతములకును అభేదమును స్ఫురింపజేయుటద్వారా దేహమందామృతరోపణ రూపమైన రూపకాలంకారము యొక్క స్ఫూర్తి కలుగుచున్నది. దృశ్యమందు భేదస్ఫూర్తితో పాటు అభేదస్ఫూర్తి కూడ ఎట్లును ఉండును. ఈ శ్లేషబలము అభేద ప్రధాన సాదృశ్యము వైపు మొగ్గను స్ఫురింపఁజేయును. భేద ప్రధాన సాదృశ్య ప్రధానములైన ప్రతివస్తూపమాద్యలంకారములలో సాధారణ ధర్మము భిన్న శబ్దబోధ్యమై యుండును. ఇచట భిన్నములైన రసకాంతు లేకశబ్దప్రతిపాద్యములై అభిన్నముగా స్ఫురించు సాధారణ ధర్మమునకు సంపాదకములై యున్నవి. అస్తు.

శివ దేహమునందలి అసమదృష్టి లక్షణ మీ శ్లోకము తెలుపుచున్నది. అది శివ దేహము. చంద్ర సూర్యాగ్ని రూపతేజ స్త్రితయముగల బ్రహ్మాండము యొక్క ప్రతీకమని ఆ లక్షణము స్ఫురింపఁజేయును. తద్వారా జీవుని పిండాండదేహాభేదము జీవ దేహమందు భావింపఁబడవలెను అనుట స్ఫురించుచున్నది. తద్వారా తద్బ్రహ్మాండ పిండాండ దేహోపాధికులైన కవి శివుల ఆత్మైక్యస్ఫురణము పరంపరగా సిద్ధింపఁజేయుట కా శ్లేషము సహకరించుచున్నది.

2. అమృతపానమున దేవత లమరులైనారనుట పురాణము చెప్పును. మనుష్యులా శివ దేహామృతమును మనఃపాత్రస్థితము నొనర్చుకొని ఆస్వాదించిన మర్త్య (మనుష్య) నకు అమర్త్యత సిద్ధించును. ఈ అమర్త్యత దేవతలమృతము త్రాగుట వలన కలిగిన అమర్త్యతకంటె ఉత్కృష్టమైనదని జయతి శబ్దము వ్యంజించును. దేవతల అమృతత్వము ప్రలయ కాలమున ఉండునది కాదు. కాని శివదేహామృతపానమున మనుష్యునకు లభించిన అమృతత్వమును ప్రలయకాలముననను తొలగిపోదు. అందుచేతనే క్షీరాబ్ధిజాతా





మృతము కన్న ఈ శివదేహామృతపాన లబ్ధామృత ముత్కృష్టము. ప్రతి పాదమున న–న–మ–య–య అను గణములుండుటచే నీ శ్లోకము మాలినీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకము చెప్పఁబడిన అమృతతుల్యమైన దేహముగల శివునకీ శ్లోకమున వందనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వన్దే దేవం వేదవిదం – దేవదేవం వదావదమ్**
**దివి వాదవదావిద్ధా – వివిదావ వివిద్దవమ్॥ 36**

**ప్రతిపదార్థము :–** దివి వాదవదావిద్ధా వివిదావ వివిద్దవమ్ = స్వర్గమునందు వాదము చెప్పు అజ్ఞానుల ఖండించువాడును గొఱ్ఱెల పక్షుల అడవిని విశేషముగా తెలియు కార్చిచ్చైన, వదావదమ్ = మాటల కందియు నందని, దేవదేవమ్ = దేవతలకును దేవుడైన, వేద విదమ్ = వేదమునెఱుగు, దేవమ్ = ప్రభువును గూర్చి, వన్దే = నమస్కరించెదను.

**తాత్పర్యము :–** అడవి యందలి గొఱ్ఱెల పక్షుల వలె స్వర్గవిషయమున వాదము చెప్పు అజ్ఞానుల ఖండించు విశేషజ్ఞుడైన దావాగ్ని వంటివాడైన మాటల కందియు నందని దేవదేవుడై వేదముల నెఱుంగు దేవునకు నమస్కరించెదను.

**వివరణ :– దవ** అను అక్షరములతో నిర్మితమైన ఈ శ్లోకము ద్వ్యక్షరము. ఇది అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడు కార్చిచ్చులో రూపింపఁబడినాడు. ఈ శ్లోకమున శివుని జటలు నిటలాగ్ని చ్ఛటలుగా సంభావింపఁబడుచున్నవి.

**శ్లో॥ జటాస్తటిత్పిఙ్గలతుఙ్గభాసో – బభాసిరేభావజదేహదగ్ధుః।**
**లలాటమధ్యస్థితలోచనాగ్నేః – ప్రభా ఇవోర్ధ్వప్రసృతాస్సమన్తాత్॥ 37**

**ప్రతిపదార్థము :–** తటిత్పిఙ్గల తుఙ్గభాసః = మెఱుపువలె ఎత్తైన కాంతులుగల, భావజదేహదగ్ధుః = మన్మథునియొక్క దేహమును కాల్చిన వాని (శివుని)యొక్క, జటాః = జటలు, లలాట మధ్యస్థితలోచనాగ్నేః = నుదుటి నడుమనున్న కంటి మంట నుండి, సమన్తాత్ = అంతట, ఊర్ధ్వప్రసృతాః = పైకి వ్యాపించిన, ప్రభా ఇవ = కాంతులో యనునట్లు, బభాసిరే = ప్రకాశించుచున్నవి.

**తాత్పర్యము :–** మెఱుపుల వలె పైకి ప్రకాశించు కాంతులుగల, శివుని జటలు మన్మథుని దేహమును దహించు నుదుటి నడుమనున్న కంటి మంట నుండి పైకి ప్రసరించని కాంతులో యన్నట్లు ప్రకాశించుచున్నవి.

**వివరణ :–** ఈ శ్లోకము శివుని ఎఱ్ఱని జడలు మన్మథుని దేహమును దహించు లలాటాగ్ని యొక్క పైకెగిసిన కాంతులోయన్నట్లు సంభావింపఁబడుటచే నీ శ్లోకమున ఉత్ప్రేక్షాలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున జ–త–జ–గ–గ అను గణము లుండుటచే నీ శ్లోకము ఉపేన్ద్రవజ్రా వృత్త నిబన్ధనము. జటాస్తటిత్, పిఙ్గలతుఙ్గ, బభాసిరే భావజ దేహదగ్ధుః, ప్రసృతాస్సమన్తాత్ అను పదబన్ధములు వృత్త్యనుప్రాసాలంకారములై యున్నవి.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని జటలకాంతి వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున శివకాంతి వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ భావితా దివి దేవే – శాశా వేదే విదితా విభా।**
**దాసదార ప్రమకరీ – రీకమ ప్రర దాసదా।**
**దాసదాప్రమకారీహా – హారీ కామప్రదా సదా॥ 38**

**ప్రతిపదార్థము :–** దేవేశ = ఓ దేవేశ్వరా!, దివి = స్వర్గమునందలి, ఆశా = కోరిక, భావితా = భావింపఁబడినది. ఈహా = కోరిక (నది) దాసదారప్రమకరీ = దాసులు భార్యలు అను గొప్ప మొసళ్ళు గలది, (నీ (శివ) కాంతి) ఋషభస్వరమును కామించు గొప్ప దంతములుగల దానియందు (వృషభమునందు) కూర్చొని యుండి ఇచ్చునది. (నీ(శివ)కాంతి) దాసదాప్రమకారీ = దాసులను చంపువారి నజ్ఞానులుగా నొనర్చునది. హారీ = మనోహరమైనది, సదా = ఎల్లప్పుడు, కామప్రదా = కోరికల నిచ్చునదియునైన, (తే = నీయొక్క), విభా = కాంతి, వేదే = వేదమునందు, విదితా = తెలియఁబడునది.

**తాత్పర్యము :–** ఓ దేవేశ! స్వర్గవిషయకమైన ఆశ భావింపఁబడినది. అది నదివలె దాసులు భార్యలు అను మొసళ్ళుగలదైయుండును. నీ కాంతి (రీ) అను స్వరమును కామించు గొప్ప దంతములుగల దాని (వృషభము) యందు కూర్చొని యుండి అర్థులకు కోరిన దాని నిచ్చునదియు నీ దాసులను ఖండించు వారి నజ్ఞులుగా భావించునదియు, మనోహరమైనదై ఎల్లప్పుడు కోరికల నొసగు నదియునైన నీ కాంతి వేదమునందు తెలియఁబడునది.

**వివరణ :–**ఈ అనుష్టుప్శ్లోకమున ఆఱు పాదములున్నవి. బేసిపాదములలోని అక్షరక్రమమే సరిపాదములలో విలోమక్రమము ననుసరించినది. అయిదవ పాదమున మూడవ





పాదమునందలి 'ర' అను నాల్గవ అక్షరము తొలగింపఁబడి ఏడవ అక్షరము క ఆఱవదిగా దీర్ఘముగా మార్చఁబడినది. ఎనిమిదవ అక్షరముగా 'హా' అనునది కొత్తగా చేర్చఁబడినది. ఇట్టి రచనము పాదావరోహణముగా కొందఱచే పేర్కొనఁబడినది. మూడవ పాదమునందలి 'ర' అక్షరము ఐదవపాదమున తొలగింపఁబడుటయే పాదావరోహణము గా వారిచే భావింపఁబడియుండవచ్చును. ఈ నిమిత్తముగానే ఈ శ్లోకము షట్పదముగా రచింపఁబడినదై యుండువచ్చును.

బేసిపాదముల అక్షరక్రమమునకు విలోమముగా సరిపాదముల కూర్చునిట్టి శ్లోకమున అర్థగాంభీర్యమునకంటె ఏదో అర్థము వచ్చునట్లు విలోమక్రమమున సాధించుటయే రచయిత గొప్పతనముగా భావింపవలసియుండును. గ్రంథము నందలి శివరతి స్థాయికమైన భక్తిరససముద్రమున లీనములగుటచే సహృదయ రంజకము కాకపోయినను దోషముగా చెప్పఁబడదు.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివపాదపద్మ మకరందము షట్పదాకృతి లులితమైనది. ఈ శ్లోకమున గౌరీమనఃపద్మరవిగా శివుడు రూపింపఁబడుచున్నాడు.

**శ్లో॥ స్థిరం శిరోధౌ గరలం వినీలం – గౌరీమనఃపద్మరవేశ్శివస్య।**
**స్రస్తం శిరస్సంస్థసురాపగాయా– విభాతి శైవాలమివాభిలగ్నమ్॥ 39**

**ప్రతిపదార్థము :–** గౌరీ మనః పద్మరవేః = గౌరియొక్క మనస్సు అను పద్మమునకు సూర్యుడైన, శివస్య = శివునియొక్క, శిరోధౌ = కణ్ఠమందు, స్థిరమ్ = స్థిరమైన, వినీలమ్ = మిక్కిలి నీలమైన, గరలమ్ = విషము, శిరస్సంస్థ సురాపగాయాః = శిరస్సునందున్న గంగానది నుండి, స్రస్తమ్ = జారినదై, అభిలగ్నమ్ = అంటుకొన్న, శైవాలమ్ ఇవ = నాచో యన్నట్లు, విభాతి = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము :–** శివుని కంఠమందున్న స్థిరమైన నల్లని విషము ఆతని శిరమందలి గంగనుండి జారి అంటుకొన్న నాచో యనునట్లు ప్రకాశించుచున్నది.

**వివరణ :–** ఈ శ్లోకమున శివుని కంఠమందలి నల్లని విషము ఆతని శిరముననున్న ఆకాశగంగనుండి జారి అంటుకొన్న నాచో యన్నట్లు సంభావింపబడుటచే నుత్ప్రేక్షాలంకార మేర్పడియున్నది. రేఫసకార వకారములు బహువారావృత్తిచే వృత్త్యనుప్రాసమను శబ్దాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము 1–4 పాదములు ఉపేన్ద్రవజ్రాలక్షణము (త–త–జ–గ–గ)ను 2,3 పాదము లింద్రవజ్రా లక్షణమును గలిగియుండుటచే ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనమై యున్నది.

**అవతారిక :-** పై శ్లోకమున శివకణ్ఠ గత విషమునందు శివ శిరస్సురాపగా ప్రస్తశైవాల సంభావనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున మారసంహార వహ్న్యక్షుడైన మహేశ్వర భావనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శశిభాస్కరవహ్న్యక్షం - యాజకామితసమ్మదమ్।**
**సహేలమశ్వసన్మారం - భావయామి మహేశ్వరమ్॥ 40**

**ప్రతిపదార్థము :-** శశి భాస్కర వహ్న్యక్షమ్ = చంద్రార్కాగ్నినేత్రుడైన, యాజకామిత సమ్మదమ్ = యజించు వారి కమితానందరూపుడైన, సహేలమ్ = విలాసముగా, అశ్వసన్మారమ్ = శ్వసించుకన్న మన్మథుడు గల (మన్మథుని శ్వసించని వానినిగా నొనర్చిన), మహేశ్వరమ్ = శివుని, భావయామి = భావించెదను.

**తాత్పర్యము:-** చంద్రార్కాగ్నులు కన్నులుగా గలిగి పూజించువారి కానందమును కలిగించు విలాసముగా మన్మథుని సంహరించిన మహేశ్వరుని భావించెదను.

**వివరణ:-** మార శబ్దమునకు చంపువాడు అనునది వ్యుత్పత్త్యర్థము. చంపువానిని శ్వసింపని వానినిగా చేసిన అనగా చచ్చునట్లొనరించిన వానినిగా మహేశ్వరుని వర్ణించుటచే చంపువాడైన యముని సంహరించిన వాడు శివుడు అను అర్థము వ్యంగ్యమగును. ప్రథమపాదమున వహ్న్యక్ష పేర్కొనఁబడుటచే మన్మథుడు ఫాలాక్షముచే దహించఁబడి శ్వసించని వాడైనాడనియు వ్యంగ్యమగును. **భావయామి మహేశ్వరమ్** అను అనుష్టుప్పాదము గూఢముగా నుండుటచే నీ శ్లోకము గూఢపాదము. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్దనము.

---

| శ | స్క | హ్న్య | జ | త | దం | ల | స |
|---|---|---|---|---|---|---|---|
| శి | ర | క్షం | కా | సం | స | మ | న్మా |
| భా | వ | యా | మి | మ | హే | శ్వ | రమ్ |

**శ్లోకం : 40 గూఢపాదము**



**అవతారిక:-** పై శ్లోకమున శివభావము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివవన్దనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ లక్ష్మీవన్ద్యాఙ్ఘ్రిం దేవేశం నిత్యాపత్యం ముక్తాగౌరమ్।**
**శౌరీడ్యం తం నాగక్రోధం వన్దే నిత్యం గౌరీనాథమ్॥ 41**

**ప్రతిపదార్థము:-** లక్ష్మీవన్ద్యాంఘ్రిమ్ = లక్ష్మీ దేవిచే నమస్కరింపఁదగిన, పాదములు గల, దేవేశమ్ = దేవప్రభువైన, నిత్యాపత్యమ్ = నిత్యులు సంతానముగా గల, ముక్తాగౌరమ్ = ముత్తెములవలె తెల్లనైన, శౌరీడ్యమ్ = విష్ణువుచే స్తుతింపఁదగిన నాగక్రోధమ్ = కొండయందు కోపము లేని, తమ్ = ఆ, గౌరీనాథమ్ = పార్వతీపతిని గూర్చి, నిత్యమ్ = నిత్యము, వన్దే = నమస్కరించెదను.

**తాత్పర్యము:-** లక్ష్మీచేత నమస్కరించఁదగిన పాదములు గల, నిత్యులు సంతానముగా గల, దేవేశ్వరుడైన, ముత్తెముల వంటి తెలుపుగల, విష్ణువుచే స్తుతింపఁదగిన పార్వతీపతిని గూర్చి నిత్యము నమస్కరించెదను.

**వివరణ:-** (1) లక్ష్మీనారాయణులు శివుని పాదముల సన్నిధినుండి వారికి నమస్కరించుచు స్తుతించెదరు. లేక స్తుతించుచు నమస్కరించెదరు. అని ప్రథమ తృతీయపాదాది విశేషణములైన లక్ష్మీవన్ద్యాంఘ్రిమ్, శౌరీడ్యమ్ అను సమాసములు వ్యంజించును. ప్రథమ తృతీయ పాదాంత విశేషణములైన దేవేశమ్ నాగక్రోధమ్ అను విశేషణములు ఇంద్రుడయ్యు కొండల మీద కోపము లేకపోవుట అను విరోధమును తద్వారా విరోధా (భాసా) లంకారమును వ్యంజించును.

(2) ఆపత్యము అనగా తననుండి జనించిన సంతానము అను అర్థము నిచ్చును. వారెవ్వరు? పురాణ వ్యవహారము ననుసరించి కుమార గణనాథులు. వారును శివుని వలె కైలాసమున నిత్యజీవులై యుండుటయే గాక శివునితో సమానముగా సర్వదేవతా పారమ్యము గలవారను భక్తకోటి కలిగియున్నారు. వాస్తవమునకు కుమారస్వామి శివవీర్య సంభవుడని యొప్పుకున్నను పార్వతీ గర్భమున నుండలేదు. కావున పార్వతి నుండి జన్మించిన సంతానము కాదు. ఆమె జగన్మాతృత్వమును పురస్కరించుకొని కుమారునందు సర్వజీవ సాధారణమైన అపత్యతమే ఉండును. ఇక గణాధిపతి విషయమును విచారింతము. ఆయన గౌరీ దేహ సంభూతుడు కావలెనని గౌరి ముందుగానే సంకల్పించినదేమో! స్నానార్థము నలుగు పెట్టుకొన్నదేమో? ఆ నలుగును మరల శరీరమును ఘర్షించి తొలగించి దానిని మరల ముద్దగా జేసి దానికి కరపాదాద్య వయవములు కల్పించి ప్రాణము పోసినది. కాని గర్భమున ధరింపఁలేదు. అయినను

| ల | ద్యాం | వే | త్యా | ము | రం | డ్యం | గ |
|---|---|---|---|---|---|---|---|
| క్ష్మీ | ఫ్రిం | శం | వ | క్తా | శౌ | తం | క్రో |
| వం | దే | ని | త్యం | గౌ | రీ | నా | థం |

**శ్లోకం : 41 గూఢపాదము**

గౌర్య పత్యత్వమే ఆయన యందు అధికము. శివాపత్యత్వము శివుని జగత్పితృత్వమును పురస్కరించుకృని యేర్పడినదిగానే చెప్పఁదగినది. కాని శివ వీర్య సంభవత్వము అతని యందు లేదు. ఏమైనను వారిరువురిని చంక నెక్కించుకొని వీడకయే పార్వతీపరమేశ్వరులున్నందున కుమార గణనాథులు నిత్యాపత్యులని పేర్కొనఁబడినారు. ద్వితీయ చతుర్థపాద నిత్యాపత్య శబ్దములోని విశేషణములైన నిత్య శబ్ద మీ యర్థమును వ్యంజించును. ఈ శ్లోకము త్యావృత్తిచే వృత్త్యనుప్రాసశోభితమైనది. పూర్వార్థోత్తరార్థాన్య విశేషణములైన ముక్తాగౌర గౌరీనాథ శబ్దములు పార్వతీపరమేశ్వరు లిరువురు గౌరవర్ణులని బోధించుచున్నవి. ముక్తాగౌర శబ్దమునకు ముత్తెములతో గౌరవర్ణము కలవాడు అను అర్థము చెప్పుకొన్నచో శివుని కంఠమునందలి ముత్తెముల హారము ఆ శివుని కంఠనీలిమను కనఁబడనీయక యున్నదని వ్యంజించును. "వందే నిత్యం గౌరీనాథమ్" అను పాదము గూఢముగా నిందుండుటచే నీ శ్లోకము కొందఱచే గూఢపాదముగా బోధింపఁబడినది. అనుష్టుప్ఛందమునకు సంబంధించిన విద్యున్మాలావృత్త లక్షణము గలదీ శ్లోకము. ప్రతిపాదమున మ-మ-గ-గ అను గణములుండును.

---

**అవతారిక:-** పై శ్లోకమున శివ వన్దనము చెప్పబడినది. ఈ శ్లోకమునను శివవన్దనమే చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నిజాశివదవం మౌని - వన్ద్యం తం దేవతానిధిమ్॥**
**ధీరం పరతరం వీరం - శివం వన్దే నిరన్తరమ్॥ 42**

**ప్రతిపదార్థము:-** నిజాశివదవమ్ = తన (నా) అమంగళము (అరణ్యము)నకు దావాగ్నియైన, మౌని వన్ద్యమ్ = మౌనులచే నమస్కరింపఁదగిన, దేవతానిధిమ్ = దేవతలకు నిధియైన, ధీరమ్ = ధీరుడైన, పరతరమ్ = మిక్కిలి ఉత్కృష్టుడైన, వీరమ్ = వీరుడైన, తమ్ = ఆ, శివమ్ = శివుని గూర్చి, నిరన్తరమ్ = ఎల్లప్పుడు, వన్దే = నమస్కరించెదను.

163



| ని | వ | మౌ | ద్యం | వ | ధిం | వ | రం |
|---|---|---|---|---|---|---|---|
| జా | ద | ని | తం | తా | ధీ | ర | వీ |
| శి | వం | వం | దే | ని | రం | త | రం |

**శ్లోకం : 42 గూఢపాదము**

**తాత్పర్యము:-** భక్తుల అమంగలములను కాల్చివేచు మునులచే నమస్కరింపఁదగిన, దేవతలకు నిధియైన, వీరుడు ధీరుడునైన మిక్కిలి ఉత్కృష్టుడైన ఆ శివుని గూర్చి ఎల్లప్పుడు నమస్కరించెదను.

**వివరణ :-** ఇందు శివం వందే నిరంతరం అను పాదము గూఢముగా నున్నందున ఈ శ్లోకము కూడ గూఢపాదమని చెప్పఁబడియున్నది. ఈ శ్లోకమున రేఫవకారాధిక్యముచే వృత్త్యనుప్రాసాలంకార యేర్పడి యున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిజద్దము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివవన్దనము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని వంటివాడు మరొకడు లేకపోవుట అను వన్దనహేతువు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సురాణామసురాణాం చ - భక్తానాం సర్వసమ్పదామ్।**
**విశ్రాణనేఽధికే తూర్ణం - శివేన సదృశః శివః॥ 43**

**ప్రతిపదార్థము:-** భక్తానామ్ = భక్తులైన, సురాణామ్ = దేవతలకు, అసురాణాం చ = రాక్షసులకును, సర్వసంపదామ్ = అన్ని సంపదల యొక్క, తూర్ణమ్ = శీఘ్రముగా, అధికే = అధికమైన, విశ్రాణనే = దానమందు, శివేన = శివునితో, శివః = శివుడు, సదృశః = పోలినవాడు.

**తాత్పర్యము:-** దేవతలుకాని, రాక్షసులుకాని భక్తులైనచో వారికి సర్వసంపదలను శీఘ్రముగా అధికముగా ఇచ్చుటలో శివునకు శివుడే సాటి. ఆ విషయమున మరొకడెవడును శివునకు సమానుడైనవాడు ఏ లోకమునను లేదు.

**వివరణ:-** ఉపమానత్వము ఉపమేయత్వమును శివున కొక్కనికే ఈ శ్లోకమున చెప్పఁబడుటచే అనన్వయాలంకార మేర్పడి యున్నది. ఈ అలంకారము ద్వితీయ సదృశ వ్యవచ్ఛేదఫలకము. ఒక శివునకే ఉపమానత్వము ఉపమేయత్వము రెండును ఎట్లు కుదురును? ఉపమానము అధికమై ఉపమేయము అల్పమై యుండుట లోక ప్రసిద్ధము

కదా! ఒకని యందు ఉపమానత్వమున్నచో ఉపమేయత్వముండదు. ఉపమేయత్వమున్నచో ఉపమానత్వముండదు. ఒక చోట ఉండని అనగా అన్వయింపని ఏకమునందలి ఉపమానత్వము ఉపమేయత్వము చెప్పఁబడినందున ఈ అలంకారము అనన్వయమని పేర్కొనఁబడినది. కుదరని విషయము చెప్పుటకు ప్రయోజనము మరొకడెవడు సదృశుడు లేడనుట. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున శివ వన్దనహేతు (శివుని వంటివాడు మరొకడు లేకపోవుట) చెప్పఁబడినది. ఈ శ్లోకమున వన్దన ప్రయోజనము (తనను రక్షించుట) అర్థింపఁబడుచున్నది.

**శ్లో॥ సమస్తజగదాధార! – దాసరక్షాధురన్ధర!।**
**శిరఃస్థచన్ద్ర! మాం పాహి – వహ్నీన్దురవిలోచన!॥ 44**

**ప్రతిపదార్థము :–** సమస్త జగదాధార! = అన్ని లోకములకు ఆధారమైన వాడా!, దాసరక్షాధురంధర! = దాసులను రక్షించు భారము మోయువాడా!, శిరఃస్థ చన్ద్ర! = శిరసున చన్ద్రుడు కలవాడా!, వహ్నీన్దురవిలోచన! = అగ్నీందు సూర్యులు నేత్రములుగా గలవాడా!, మామ్ = నన్ను, పాహి = కాపాడుము.

**తాత్పర్యము :–** సమస్త లోకములకు ఆధారమైన దాసులరక్షించు, భారము మోయువారిలో ముందుండు వాడా! శిరమున చన్ద్రుని ధరించినవాడా!, సూర్య చంద్రాగ్నులు నేత్రములుగా గలవాడా! సదాశివా! నన్ను కాపాడుము.

**వివరణ :–** ఈ శ్లోకమున పాదముల మొదట అక్షరములను వరుసగా పేర్చినచో **'సదాశివ'**అని యగును. 'సదాశివ' అను నామమీ శ్లోకమున గోపనము చేయఁబడినది. అనగా పాదారంభాక్షరములలో దాచఁబడినది. కావున ఈ శ్లోకమున నామగోపనము అను అలంకారమేర్పడియున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శబ్దరచనాగతాద్భుతములలో నొకటి (నామ గోపనము) చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివకృత్యము (సృష్టి, స్థితి, లయములు అను అర్థములు) అద్భుతమని చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ సృష్టిః స్థితిరివాశ్చర్యం స్థితిఃసృష్టిరివాద్భుతా।**
**లయస్తద్వత్తౌల్యవత్ హి జగతాం పరమేశితుః॥ 45**





**ప్రతిపదార్థము :–** పరమేశితుః = పరమేశ్వరునియొక్క, జగతామ్ = జగములయొక్క, సృష్టిః = సృష్టి, స్థితిః ఇవ = స్థితివలె, ఆశ్చర్యమ్ = అద్భుతము, స్థితిః = స్థితి, సృష్టిః ఇవ = సృష్టివలె, అద్భుతా = అద్భుతము, లయః = లయము, తద్వత్ = వానివలె, తౌల్యవత్ = పోలికగలదై, హి = ఆశ్చర్యము.

**తాత్పర్యము :–** పరమేశ్వరుని జగమున సృష్టి వానిస్థితివలె, వాని స్థితి సృష్టివలె వాని లయము వాని సృష్టి స్థితి వలె అద్భుతమై యున్నది.

**వివరణ :–** మొదటి వాక్యమునందలి ఉపమానోపమేయములు రెండవ వాక్యమున ఉపమేయోపమానములుగా మార్చఁబడినవి. ఇట్లు చెప్పిన ఈ శ్లోకమున ఉపమేయోపమాలంకార మేర్పడియున్నది. ఉపమేయముతో ఉపమ అనగా ఉపమేయమునకు ఉపమానత్వము చెప్పఁబడుట కావున ఆ పేరు ఆ అలంకారమునకు సముచితము. ఈ అలంకారమునకు తృతీయ సదృశవ్యవచ్ఛేదము ఫలము. సాధారణ దృష్టితో ఉపమేయమునుపమానముగా మార్చుట తగనిదే. అయినను తృతీయ (శ్లోకోక్తభిన్న) సదృశ వ్యవచ్ఛేదము అనగా మూడవ పోలినది లేదని చెప్పుట అను ప్రయోజనమట్లు చెప్పుటకున్నందున ఆ చెప్పుట తగినదే. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని సృష్టి స్థితి లయకృత్యములతో సాటియైన కృత్యము మరొకటి లేదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున కర్తృపదమును దాచుట అను రచనా విశేషము కూర్చఁబడినది.

**శ్లో॥ బ్రహ్మాదికామ్యయా నిత్యం – దయయా పరిపూర్ణయా।**
**క్రియాన్మఙ్గలమస్మాకం – గౌరీనేతారమవ్యయమ్॥ 46**

**ప్రతిపదార్థము :–** బ్రహ్మాదికామ్యయా = బ్రహ్మాదులచే కోరఁదగిన, పరిపూర్ణయా = పరిపూర్ణమైన, దయయా = కృపచేత, గౌరీనేత = గౌరీ నాయకుడు, అరమ్ = శీఘ్రముగా, అస్మాకమ్ = మాకు, అవ్యయమ్ = నాశములేని, మఙ్గలమ్ = శుభమును, క్రియాత్ = చేయుగాక!

**తాత్పర్యము :–** బ్రహ్మాదులచే కోరఁబడదగిన పరిపూర్ణకృపతో గౌరీనాయకుడు శీఘ్రముగా నాశములేని మఙ్గలమును అనగా మోక్షమును మాకు కలిగించుగాక!

**వివరణ :–** ఈ శ్లోకము గౌరీనేతారమవ్యయమ్ అను నాల్గవపాదములోని ద్వితీయాంతములు నాశములేని గౌరీనేత యొక్క కర్మత్వమును బోధించును. సూక్ష్మముగా

విచారించి అవ్యయమ్ అను పదమును మఙ్గలమ్ అను పదమునకు విశేషణముగా చేసి గౌరీ నేతారమ్ అను పదమును గౌరీనేతా + అరమ్ అను రెండు పదములుగా విభజించినచో, పై అర్థము సిద్ధించును. స్థూలముగా శివుని కర్మత బోధింపఁబడగా ఈ శ్లోకమున కర్తయేది? అని విచారింపక తప్పదు. కర్తలేని వాక్యముండదు గదా! అట్లు విచారించి నాల్గవపాదముయొక్క పదవిభాగమును అన్వయమును మార్చినచో పై ప్రతిపదార్థము సిద్ధించును. విచారించినచో కర్త గుప్తముగా నుండి కనఁబడనందున ఈ శ్లోకమున **కర్తృగోపనము** అను అలంకారమేర్పడినది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున కవిచే మోక్షమర్థింపఁబడినది. ఈ శ్లోకమున విద్వాంసు లందఱును శివుని మోక్షస్వరూపునిగా తెలిసికొందురని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యోగమ్మూర్తిధరం విదన్తి పరమం యోగీశ్వరాః కాముకాః**
**శృఙ్గారాఖ్యరసం సకామహృదయాః కల్పద్రుమం కేవలమ్।**
**వహ్నిం శుద్ధతరాః సమూఢమభితః సౌన్దర్యవత్తాం బుధాః**
**విద్యామోక్షమవిద్భిదః పరతరం శమ్భుం భవానీపతిమ్॥ 47**

**ప్రతిపదార్థము :–** యోగీశ్వరాః = యోగీశ్వరులు, మూర్తిధరమ్ = ఆకృతిని ధరించిన, పరమమ్ = అత్యుత్కృష్టమైన, యోగమ్ = యోగమునుగా, కాముకాః = కాముకులు, శృఙ్గారాఖ్యరసమ్ = శృఙ్గారమను పేరుగల రసమునుగా, సకామహృదయాః = కోరికలతో కూడిన మనసుగలవారు, కేవలమ్ = ఒకటైన, కల్పద్రుమమ్ = కల్పవృక్షముగా, శుద్ధతరాః = మిక్కిలి శుద్ధులు, అభితః = అంతట, సమూఢమ్ = బాగుగా రగిలింపఁబడిన, వహ్నిమ్ = అగ్నినిగా, బుధాః = దేవతలు, సౌన్దర్యవత్తామ్ = సౌన్దర్యము కలిగి యుండుటనుగా, అవిద్భిదః = అజ్ఞానులు కానివారు, విద్యామోక్షమ్ = జ్ఞానరూప మోక్షమునుగా, పరతరమ్ = పరమోత్కృష్టుడైన, భవానీపతిమ్ = భవాని భర్తయైన, శమ్భుమ్ = శివుని, విదన్తి = తెలుసుకొనుచున్నారు.

**తాత్పర్యము :–** యోగీశ్వరులు ఆకృతి సాధించిన గొప్ప యోగమునుగా, సంభోగ కాములు శృంగారరసమునుగా, కోరికలు గలవారు కల్పవృక్షమునుగా, పవిత్రులు అంతట మండుచున్న అగ్నినిగా, దేవతలు సౌందర్యమునుగా, విద్వాంసులు జ్ఞానరూప మోక్షమునుగా భవానీపతి పరమేశ్వరుడైన శివునెఱుగుచున్నారు.





**వివరణ :–** ఈ శ్లోకమున యోగీశ్వరాద్యనేకులు యోగాది బహువిధముగా శివుని తెలిసికొనుచున్నారని చెప్పఁబడినందున ఉల్లేఖాలంకార మేర్పడియున్నది.

ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణమలుండుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున జ్ఞానులు శివుని జ్ఞానరూప మోక్షముగా భావించుట చెప్పఁ బడినది. ఈ శ్లోకమున మోక్ష నామాంతరముగా గల సుఖము కవిచే కోరఁబడుచున్నది.

**శ్లో॥ పఞ్చవక్త్రః పురహరః – కం దర్పదమనో బుధః।**
**దదాతు మే మహాదేవః – పార్వతీప్రాణవల్లభః॥ 48**

**ప్రతిపదార్థము :–** పఞ్చవక్త్రః = అయిదు ముఖములుగల, పురహరః = పురముల నశింపఁజేసిన, దర్పదమనః = గర్వమునణచు, బుధః = దేవుడైన, పార్వతీప్రాణవల్లభః = పార్వతీ ప్రాణనాథుడైన, మహాదేవః = మహాదేవుడు, కమ్ = సుఖమును, దదాతు = ఇచ్చుగాక!

**తాత్పర్యము :–** ఈ శ్లోకమున కందర్పదమనః అను శబ్దము మన్మథుని చంపినట్టి అను అర్థమును స్థూలముగా బోధించును. కర్మలేకపోవుటచే సకర్మక క్రియ (దదాతు) ప్రయోగింపబడుటచే కర్మ ఏది? అను సందేహము కలిగి మరల సూక్ష్మముగా పరిశీలింపగా కందర్పదమనః అను పదమును కమ్ అను కర్మవాచకపదము గుప్తమొనర్ప బడినదని తెలియును. ఇట్లు కర్మ గోపనము చేయబడినందున ఈ శ్లోకమున కర్మగోపనము అను అలంకారమేర్పడినది. కించిచ్ఛోభాతి శయ హేతువులగుటచే కర్మగోపన కర్తృగోపన నామగోపనాదులు అలంకారములుగా ప్రసిద్ధులైన ఆలంకారికులు పేర్కొనకబోయినను ఇవి అలంకారములుగానే పరిగణింపబడవలసియుండును. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున స్థూలదృష్టికి కలిగిన కర్మలేదను భ్రాంతి కలిగింపబడినది. ఈ శ్లోకమున చకోరములకు శివునందు చంద్రభ్రాంతి కలిగినట్లు చెప్పబడుచున్నది.

**శ్లో॥ అత్యన్తధవలే దేహే – శివస్యామృతవారిణి।**
**చన్ద్రమణ్డలవిభ్రాన్తి – శ్చకోరిణామభూదరమ్॥ 49**

**ప్రతిపదార్థము :–** అమృతవారిణి = అమృతము వంటి జలముగల, అత్యన్తధవలే = మిక్కిలి తెల్లనైన, శివస్య = శివునియొక్క, దేహే = దేహమున, చకోరిణామ్ = చకోరికలకు,

చన్ద్రమణ్డల విభ్రాన్తిః = చన్ద్రమణ్డలము అను (వి)భ్రమము, అరమ్ = శీఘ్రముగా, అభూత్ = కలిగెను.

**తాత్పర్యము :–** అమృతోదకముగల మిక్కిలి తెల్లనైన శివుని దేహమున చకోరికలకు చన్ద్రమణ్డల భ్రాంతి కలిగెను.

**వివరణ :–** ఈ శ్లోకమున శివుని తెల్లని దేహమును చూచిన చకోర పక్షులకు తెల్లని చన్ద్రమణ్డల భ్రాన్తి కలిగినట్లు చెప్పఁబడుటచే నీ శ్లోకమున భ్రాంతిమదలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున చకోర పక్షుల భ్రాంతి చెప్పఁబడినది. ఈ శ్లోకమున క్రియలేదను భ్రాంతి కలిగింపఁబడుచున్నది.

**శ్లో॥ శివావ్యయ! మహాదేవ! – గఙ్గాధర! కృపానిధే!**
**చన్ద్రశేఖర! గౌరీశ! కైలాసాచలవాస! మామ్॥ 50**

**ప్రతిపదార్థము :–** అవ్యయ = నాశములేనివాడా!, గఙ్గాధర! = గఙ్గను ధరించినవాడా!, కృపానిధే! = దయకు నిధియైనవాడా!, చన్ద్రశేఖర! = చన్ద్రుడు శిరోభూషణముగా కలవాఁడా!, గౌరీశ! = పార్వతీపతీ!, కైలాసాచలవాస! = కైలాస పర్వతమున నివసించువాడా!, మహాదేవ! = పూజను స్వీకరించువాడా!, శివ! = ఓ శివా!, మామ్ = నన్ను, అవ = కాపాడుము.

**తాత్పర్యము:–** నాశము లేనివాడా! గఙ్గను ధరించువాడా!, దయకు నిధియైన వాడా!, చన్ద్రుడు శిరోభూషణముగా గలవాడా, కైలాసపర్వతమునందు నివసించువాడా!, పూజను స్వీకరించువాడా!, పార్వతీపతీ! శివా! నన్ను కాపాడుము.

**వివరణ :–** మహాదేవ అను పదము స్థూలముగా గొప్పదేవుడా అను అర్థమును బోధించును. క్రియాపదములేని వాక్యముండదు. ఇందు క్రియాపదము లేదు గదా! అని ఆలోచించు సూక్ష్మదృష్టికి **మహాదే అవ** అని విభజించిన అవ అను క్రియా పదమున్నదని స్ఫురించును. **ఈ క్రియా గోపనమును** కర్తృకర్మగోపనముల వలె అలంకార విశేషముగా చెప్పవచ్చును. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని రక్షింపుమను ప్రార్థనము చేయఁబడినది. ఈ శ్లోకమున అభిలాషసస్యమును ఫలింపఁజేయుమను ప్రార్థనము చేయబడుచున్నది.

**శ్లో॥ కపాలమాలో విషకణ్ఠకాలో – జటాతటిద్భాగభిలాషసస్యమ్।**
**దయాభివృష్ట్యా ఫలితం కరోతు – మనోజజిచ్ఛారదనీరదో మే॥ 51**



**ప్రతిపదార్థము :–** కపాలమాలః = కపాలములయొక్క మాలగల (వరుణనకు పేరమైన), విషకణ్ఠకాలః = విషముయొక్క కంఠమునందలి నలుపుగల (జలము సమీపము నుండుటచే నల్లనైన) జటాతటిద్భాక్ = జటలను మెఱుపుల పొందిన, మనోజజిచ్ఛారద నీరదః = శివుడను శరత్కాల మేఘము, దయాభివృష్ట్యా = దయ అంతట వర్షించుటచేత, మే = నాయొక్క, అభిలాష సస్యమ్ కరోతు = కోరికల పంటను పండించుగాక !

**తాత్పర్యము :–** కపాలమాల ధరించిన (వరుణుని పీఠమైన) విషము ధరించుట చేత కంఠమందలి నలుపుగల (జలము సమీపమున నుండుటచే నల్లనైన) జటలను మెఱుపులుగల శివుడను శరత్కాల మేఘము నా కోరికలపంటను పండించుగాక!

**వివరణ :–** జటాతటిచ్ఛబ్దములయొక్క దయాభివృష్టి శబ్దములయొక్క మరియు అభిలాషసస్యశబ్దములయొక్క అవధారణ పూర్వపదకర్మధారయ సమాసముచేత అభిలాషసస్యమును శివశారద మేఘముల రూపణము నిరూపింపబడినందున నీ శ్లోకమున రూపకాలంకార మేర్పడియున్నది. మొదటి రెండు విశేషణములు శ్లేష శివశారద మేఘముల రూపణమును నిరూపించినవి.

కపాలమాలాబిసకణ్ఠకాలీ అను పాఠము నంగీకరించినచో కపాలముల మాలయును తామర తూండ్ల కంటెలు గలవాని (హంసల) వరుసగల అను అర్థము చెప్పుకొని కించిదస్వారస్యమును సహించి రూపణమును నిర్వహించుకొన వచ్చును. ఎట్లైనను ఈ శ్లోకమున రూపకాలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున జ–త–జ–గ–గ అను గణములుండుటచే నీ శ్లోక ముపేన్ద్రవజ్రా వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున తెల్లని శివుడు తెల్లని జలదానహీనమైన శరన్మేఘముతో రూపింపఁబడినాడు. ఈ శ్లోకమున ఆ శివుడు వరదానుడవు కమ్మని అర్థింపఁ బడుచున్నాడు.

**శ్లో॥ భవ స్వమతిపార! త్వం వరదాన స్థిరామల!।**
**స్వదాసనరభారాపా మనసః శ్రీకర! స్థితిః॥ 52**

**ప్రతిపదార్థము :–** శ్రీకర = సంపదను కలిగించువాడా!, స్థిర = స్థిరమైనవాడా!, అమల! = దోషరహితుడా!, స్వమతిపార = తన బుద్ధికి ఒడ్డైనవాడా!, త్వమ్ = నీవు, వరదాన = వరములయొక్క దానము కలవాడవు, భవ = అగుము, (తే = నీయొక్క), మనసః = మనస్సుయొక్క స్థితిః = స్థితి, స్వదాసనరభారాపా = తన దాసులైన జనుల భారమును పాలించునది కానట్టిది.

ర=ల

| | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|
| భ | వ | స్వ | మ | తి | పా | ల | త్వం |
| వ | ర | దా | న | స్థి | రా | మ | ల |
| స్వ | దా | స | న | ర | భా | రా | పా |
| మ | న | న | శ్రీ | క | ర | స్థి | తి |
| తి | స్థి | ర | క | శ్రీ | న | న | మ |
| పా | రా | భా | ర | న | స | దా | స్వ |
| ల | మ | రా | స్థి | న | దా | ర | వ |
| త్వం | ల | పా | తి | మ | స్వ | వ | భ |

స=న

## శ్లోకం : 52 అర్ధభ్రమకము

**తాత్పర్యము :–** సంపదనొసగు వాడా!, స్థిరుడా!, నిర్దోషుడా!, తన బుద్ధి కావలి ఒడ్డెనవాడా!, ఓ శివా!, నీ మనసుయొక్క స్థితి, నీ దాసులైన జనుల భారమును తొలగించునట్టిది.

**వివరణ :–** బుద్ధి సముద్రము వంటిది. శివుడాబుద్ధి సముద్రముయొక్క ఆవలి ఒడ్డెనవాడు. బుద్ధిని దాటినవానికే శివప్రాప్తి కలుగును. **"యో బుద్ధేః పరతస్తు సః"** అని భగవద్గీత చెప్పినది. బుద్ధిని దాటుట యనగా బుద్ధి వృత్త్యుపరమము. దాని వృత్తుల నిరోధించిన సమాధి స్థితిలో శివుడు గోచరించు ననుటను స్వమతిపార అను విశేషణము బోధించును.

స్థూలదృష్టికి కుదురునట్లున్న పూర్వోత్తరార్ధముల అన్వయము కుదురని భ్రమయున్నను సూక్ష్మదృష్టితో పైన చెప్పిన విధముగా అన్వయము కుదుర్చుకొని సరియైన అర్థమును పొందవచ్చును. దీని నర్ధభ్రమకముగా కొందఱు చెప్పినారు. అనులోమ విలోమ క్రమములలో నీ శ్లోకమా వృత్తము చేయఁబడవచ్చును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---



**అవతారిక :–** పై శ్లోకమున శివుని వరదాన మర్థింపఁబడినది. ఈ శ్లోకమున వరముల నిచ్చుట కావశ్యకమైన ఆతని కరుణాకటాక్షములయొక్క ప్రవృత్తులు వర్ణింపఁబడుచున్నవి.

**శ్లో॥ సంసారార్ణవమగ్నస్య – మమోన్మజ్జనరజ్జవః।**
**భవన్తి శమ్భోః కరుణా – కటాక్షాణాం ప్రవృత్తయః॥ 53**

**ప్రతిపదార్థము :–** సంసారార్ణవ మగస్య = సంసారమను సముద్రమున మునిగిన, మమ = నాయొక్క, ఉన్మజ్జన రజ్జవః = పైకి తేల్చుత్రాడులు, శమ్భోః = శివునియొక్క, కరుణాకటాక్షాణామ్ = దయాదృష్టులయొక్క, ప్రవృత్తయః = ప్రవృత్తులు, భవన్తి = అగుచున్నవి.

**తాత్పర్యము :–** శివుని కరుణా కటాక్ష ప్రవృత్తులు సంసారమున మునిగిన నన్ను పైకి తెచ్చు త్రాడులగుచున్నవి.

**వివరణ :–** శివుని కరుణా కటాక్ష ప్రవృత్తులయందు ఉన్మజ్జనరజ్జు రూపణము చేయఁబడినది. కావున ఇది రూపకాలంకారమనిపించును. కాని ఇచట ఆ రజ్జువులు కరుణా కటాక్షప్రవృత్తులుగా పరిణమించనిచో వానికి సంసారార్ణవమగ్నోన్మజ్జనత్వము సంభవింపదు. కావున సంసారార్ణవ మగ్నోన్మజ్జనత్వము సంభవమొనర్చుచో ఆ త్రాడులు కరుణాకటాక్ష ప్రవృత్తులుగా పరిణతములు కావలెను. అట్లు పరిణతములై సంసారార్ణవ మగ్నోన్మజ్జనములైనందున ఈ శ్లోకమున పరిణామాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కరుణాకటాక్షములు వర్ణింపఁబడినవి. ఈ శ్లోకమున సర్వతోభద్రము రచింపబడినది.

**శ్లో॥ గౌరీనాథ ధనారీగౌ రీశనాస్య స్యనాశరీ।**
**నానాతేవ వతేనానా థస్యవప్ర ప్రవస్యథ॥ 54**

**ప్రతిపదార్థము :–** ఈశ = శివా!, అస్య = ఈ నాయొక్క, గౌః = స్తుతివాక్కు, ఆశరీ = రాక్షసమయినది, న = కాదు, గౌరీనాథ = శివుడు అనే, ధన = ధనమును, ఆరీ = తెచ్చునది, కనుక, నస్య = దీనిని ధ్వంసము చేయకుము.

లేదా – అనాశరీ = రాక్షస లక్షణములేని, గౌః = నాయీ స్తోత్రవాక్కు, గౌరీనాధనారీ = శివుడు అనే ధనమును తెచ్చునది. కనుక దీనిని, నాస్యసి = పడద్రోయవు.

లేదా – అనాశరీ, గౌః, గౌరీనాథ ధనారీ, ఈశ = ఈశ్వరా! అసి = నీవు, నాస్య = పడద్రోయకుము.

అథ = తర్వాత, నానాతేవవతా = అనేక విలాసములు లేదా అనేక విజిగీషలు గల, ఇనా = మన్మథునిచేత, అనాథస్య = దిక్కుమాలిన వానికి, లేదా దిక్కుమాలిన నాకు, వప్ర = తీరమును, ప్రవసి = పొందించువాడవు అగుదవు.

లేదా – వప్ర = రక్షణప్రాకారమయినవాడా! లేదా, రక్షణ ప్రాకారముగా కమ్ము, ప్రవసి = పొందువాడు లేదా రలయో రభేదః అను న్యాయమునుబట్టి, ప్రవసి ప్లవసి, =ప్లవము అనగా తెప్ప, కనుక, తెప్పగా అగుచున్నావు.

**తాత్పర్యము :–** పరమేశ్వరా! నా వాక్కు తమోమయమయిన రాక్షసవాక్కు కాదు. శివుడు అనే ధనమును తెచ్చు నందివంటి కామధేనువు వంటిది. కనుక దీనిని నిరసింపకుము. అనేక విలాసములు విహారములుగాల మన్మథుని వలన నిన్ను మఱచి అనాథుడయిన వానికి (అనగా నాకు) నీవు రక్షణ ప్రాకారముగా నున్నావు. లేదా, తీరమును చేర్చు నౌకవు అగుచున్నావు.

| గౌ | రీ | నా | ధ | ధ | నా | రీ | గౌ |
|---|---|---|---|---|---|---|---|
| రీ | శ | నా | న్య | న్య | నా | శ | రీ |
| నా | నా | తే | వ | వ | తే | నా | నా |
| ధ | న్య | వ | ప్ర | ప్ర | వ | న్య | ధ |
| ధ | న్య | వ | ప్ర | ప్ర | వ | న్య | ధ |
| నా | నా | తే | వ | వ | తే | నా | నా |
| రీ | శ | నా | న్య | న్య | నా | శ | రీ |
| గౌ | రీ | నా | ధ | ధ | నా | రీ | గౌ |

**శ్లోకం : 54 సర్వతోభద్రము**





**అర్థప్రమాణములు**

1. ధనారీ – ధనం ఆరయతీతి – ఋధాతువు, ణిచ్ దానిమీద కర్మణ్యణ్, ఙీప్, ధనమును ఇప్పించునది.
2. అస్య/అస్యసి – అసుక్ క్షేపణే ధాతువు, లట్/ లోట్ – విసరివేయుట అని అర్థము.
3. అసి – 'త్వం' అనే అర్థములో అవ్యయము.
4. తేవః – తేవృ దేవనే – ఆత్మనేపదం – దీనిమీద ఘఞ్ = విలాసములు, క్రీడలు, జిగీషలు అని అర్థము.
5. ఇనా – 'ఇః' తృతీయ। ఇ ఖేదేచ రుషోక్తౌచ॥కామదేవే త్వనవ్యయమ్॥ – విశ్వ.
6. వప్రః – 1. వప్ర స్తాతే పుమా నస్త్రీ। రేణుక్షేత్రే చయే తటే॥ – మేదినీ
   2. పితృ కేదారయోః వప్రః।వప్రః ప్రాకార రోధసోః॥ – విశ్వ
   3. వప్రః ప్రాకార రోధసోః। క్షేత్రే తాతే చయే రేణౌ॥ – హే.

7. ప్రవసి – ప్రుఙ్గతౌ – ఆత్మనేపదము, ప్రవణ శబ్దమునకు ఇది మూలధాతువు. కనుక ఈ 'గతి' అర్థము ఏకలక్ష్యముగా తాత్పర్యముతో పొందుట అని చెప్పవచ్చును. ఈ ధాతువుకు కర్త్రర్థములో అంతర్భావితణ్యర్థముగా 'అచ్' ప్రత్యయము. ప్రవః = పొందువాడు, పొందించువాడు. దీనిపై ఆచార క్విప్. లట్ = ప్రవసి. పొందువాడవు అగుచున్నావు. అనగా, పొందుచున్నావు.

లేదా – రలయోరభేదః అనుకొన్నచో, ప్రవః = ప్లవః, అనగా తెప్ప. దానిపై ఆచార క్విప్ – తెప్పవలె అగుచున్నావు.

8. అథ – మంగళవాచకము, అనంతరారంభవాచకము.

"అథో అథన సంప్రశ్నే మంగలారంభయోరపి।
అనంతరే చ కార్త్స్న్యేచ సంశయే చ ప్రకీర్తితః॥ –విశ్వ.

---

**అవతారిక :–** పై శ్లోకమునందు సర్వతోభద్రము రచింపబడినది. ఈ శ్లోకమున శివుని ధవల తనువు వర్ణింపబడుచున్నది.

**శ్లో॥ కిం శారదామ్భోధరపఙ్క్తిరేషా**
**కిం చన్ద్రికా క్షీరపయోనిధిః కిమ్।**
**కర్పూరరాశిః కిమితీశ్వరస్య**
**ప్రభాం తనోస్సన్దిహతేఽ తి శుభ్రామ్॥ 55**

**ప్రతిపదార్థము :–** ఏషా = ఇది, శారదామ్భోధరపఙ్క్తిః కిమ్ = శరత్కాలమేఘపఙ్క్తియా, చన్ద్రికా కిమ్ = వెన్నెలయా, క్షీరపయోనిధిః కిమ్ = పాలసంద్రమా!, కర్పూర రాశిః

కిమ్ = కప్పురపు రాశియా, ఇతి = అని, ఈశ్వరస్య = శివునియొక్క, తనోః = శరీరముయొక్క, అతిశుభ్రామ్ = మిక్కిలి తెల్లని, ప్రభామ్ = కాంతిని, సందిహతే = సందేహించుచున్నారు.

**తాత్పర్యము :–** శివుని శరీరముయొక్క అతిధవలకాంతిని చూచి ఇది శరత్కాలమేఘ పంక్తియా, వెన్నెలయా, పాలసంద్రమా, కప్పురపు రాశియా అని సందేహించుచున్నారు.

**వివరణ :–** శివుని శరీరకాంతి శరత్కాల మేఘ పఙ్క్త్యాదులుగా సందేహించుట చెప్పఁ బడినందున ఈ శ్లోకము సందేహాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకమున మొదటి మూడు పాదములు త–త–జ–గ–గ అను గణములు గలిగి ఇంద్రవజ్రా లక్షణమును, చివరి పాదమున జ–త–జ–గ–గ అను గణములు గలిగి ఉపేన్ద్రవజ్రా లక్షణము కలిగియుండుటచే ఇది ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివతనువు శారదామ్భోధరాదిగా సందేహింపఁబడగా ఈ శ్లోకమున శివుడే సందేహింపఁబడుచున్నాడు.

**శ్లో॥ చన్ద్రః కిం స క్రమాత్ క్షీణః – సూర్యః కిం స నిశాపతిః।**
**వహ్నిః కిం స జటానద్ధ – ఇతి సన్దిహతే శివమ్॥ 56**

**ప్రతిపదార్థము :–** చన్ద్రః కిమ్ = చన్ద్రుడా!, సః = అతడు, క్రమాత్ = క్రమముగా, క్షీణః = క్షీణించువాడు, సూర్యః కిమ్ = సూర్యుడా, సః = అతడు, నిశాపతిః = రాత్రిని పతనమొనరించువాడు, వహ్నిః కిమ్ = అగ్నియా, సః = అతడు, జటానద్ధః = జటలతో బంధింపఁబడినవాడు, ఇతి = అని, శివమ్ = శివుని, సందిహతే = సందేహించు చున్నారు.

**తాత్పర్యము :–** ఆతడు చంద్రుడా!, ఆతడు క్రమముగా క్షీణించువాడు, శివుడట్లు క్షీణించడు. కావున ఈతడు చంద్రుడు కాదు. ఆతడు సూర్యుడా! ఆతడు రాత్రిని నశింపఁ జేయువాడు. శివుడట్లు రాత్రిని నశింపఁజేయువాడు కాదు. కావున సూర్యుడు కాదు. ఆతడు అగ్నియా? జటలు కలవాడు అగుటచే శివుడు అగ్నికాదు. అని శివుని గూర్చి సందేహించుచున్నారు?

**వివరణ :–** సందేహింపఁబడిన యొక కోటి నిషేధింపఁబడుటచే నీ సందేహాలంకారము నిశ్చయవ్యంజకమై యున్నది. సూర్యుడు నిశాపతి అని చెప్పఁబడిన విరోధము అర్థాంతరము చెప్పిన పరిహరింపబడు నవకాశమున్నందున ఇట విరోధాభాసా లంకారము యొక్క స్ఫూర్తి ఉన్నది.



**అవతారిక :–** పై శ్లోకమునందువలె ఈ శ్లోకమునను శివుడు సందేహింపఁబడు చున్నాడు.

**శ్లో॥ విష్ణుః కిమ్ న స సంసారీ – బ్రహ్మా కిం న స రాజసః।**
**వైరాగ్యసంయమస్ఫారః – శివోఽయమితి నిశ్చయః॥ 57**

**ప్రతిపదార్థము:–** విష్ణుః = విష్ణువా, సః = ఆతడు (శివుడు), న సంసారీ = సంసారికాడు, బ్రహ్మా కిమ్ = బ్రహ్మయా, సః = అతడు (శివుడు), రాజసః న = రాజసుడు కాడు, వైరాగ్యసంయమస్ఫారః = వైరాగ్యము యొక్క సంయమము యొక్క, అధిక్యముగ, ఆయమ్ = ఈతడు, శివః + ఇతి = శివుడనుట, నిశ్చయః = నిశ్చయము.

**తాత్పర్యము:–** సంసారికానందున ఈతడు విష్ణువుకాదు. రాజసుడు కానందున ఈతడు బ్రహ్మకాదు. వైరాగ్యము, సంయమము కలవాడైనందున శివుడనుటయే నిశ్చయము.

**వివరణ:–** ఈ శ్లోకము నిశ్చయాన్త సందేహాలంకారము. చివర నిశ్చయముండుటయే అందుకు కారణము. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున వైరాగ్య సంయమములను శివలక్షణములు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున శివుడు ఆవృత్త శబ్దములచే సంబోధింపఁబడుచున్నాడు.

**శ్లో॥ సమస్త గోపాలక బాల బాల! – సమస్త గోపాలకపాలబాల।**
**సమస్త గోపాలక బాల బాల! – సమస్త గోపాలకపాలబాల॥ 58**

**ప్రతిపదార్థము:–** సమస్త గోపాలక బాల బాల! = సమస్త (జీవులు) ఇంద్రియపతులు మూర్ఖబాలురుగా గలవాడా!, సమస్త గోపాలకపాలబాల! = అందఱు ఇంద్రవరుణులు బాలురుగా గలవాడా!, సమస్త గోపాలక బాలబాల = అందఱు గోవుల పాలించు అజ్ఞానులు బాలురుగా గలవాడా!, సమస్త గోపాలక పాలబాల = సమస్త జీవుల పాలించు కత్తి గలవాడా!

**తాత్పర్యము:–** స్పష్టము.

**వివరణ:–** సమ విషమ పాదములోకే విధముగానుండుటచే నీ శ్లోకమున అర్ధ యమకాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పూర్వ శ్లోకమున సాదృశ్యస్ఫోరక సందేహము చెప్పఁబడినది. ఈ శ్లోకమున అట్టి స్మరణము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ స్మేరగౌరీయుతాం శుభ్రాం – వీక్ష్య శమ్భుతనుమ్మునిః।**
**తటిద్రేఖాన్వితామ్మేఘ – రేఖాం స్మరతి శారదీమ్॥ 59**

**ప్రతిపదార్థము:–** స్మేరగౌరీయుతామ్ = చిఱునవ్వుగల గౌరితో కూడిన, శుభ్రామ్ = స్వచ్ఛమైన, శమ్భుతనుమ్ = శివుని శరీరమును, వీక్ష్య = చూచి, మునిః = ముని, తటిద్రేఖాన్వితామ్ = మెఱుపురేఖ (గీత)తో కూడిన, శారదీమ్ = శరత్కాలమునకు చెందిన, మేఘరేఖామ్ = మేఘరేఖ (గీత)ను, స్మరతి = స్మరించుచున్నాడు.

**తాత్పర్యము:–** చిఱునవ్వుగల గౌరితో కూడిన శివుని తనువును చూచి ముని మెఱుపు తీగతో కూడిన శివుని తనువును స్మరించుచున్నాడు.

**వివరణ:–** శివ తనువు అను వస్తువు యొక్క దర్శనమున సదృశవస్తు స్మరణచేత స్మరణాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున సాదృశ్యహేతుక స్మరణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున సాదృశ్యమే హేతువుగా అపహ్నవము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నాయం శివతనూచ్ఛాయా – నిచయః క్షీరసాగరః।**
**న కన్ధరా వినీలోఽసౌ – యోగనిద్రాం గతో హరిః॥ 60**

**ప్రతిపదార్థము:–** ఆయుమ్ = ఇది, శివతనూచ్ఛాయా నిచయః = శివ శరీర కాంతి యొక్క సమూహము, న=కాదు, క్షీరసాగరః = పాల సముద్రము, కన్ధరా = కణ్ఠము, న = కాదు, అసౌ = ఈతడు, యోగనిద్రామ్ = యోగనిద్రను, గతః = పొందిన, వినీలః = మిక్కిలి నల్లని, హరిః = విష్ణువు.

**తాత్పర్యము:–** ఇది శివతనుకాంతిసమూహము కాదు. పాల సముద్రము. ఇది శివుని కణ్ఠము కాదు. యోగనిద్రను పొందిన విష్ణువు.

**వివరణ:–** విషయమైన శివ శరీరమును చూచి శివ శరీరము కాదని, శివుని కణ్ఠమును చూచి శివుని కణ్ఠము కాదని అపహ్నవము చేసి పాల సముద్రమున అని అందు యోగ నిద్రను పొందిన విష్ణువు అని చెప్పుట సదృశవస్త్వంతరము (విషయి) తోడి ఆభేదాధ్యవసాయము హేతువుగా విషయము నపహ్నవ మొనరించుట ఈ శ్లోకము నందుండుటచే ఆపహ్నవాలంకారమేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమునందువలె ఈ శ్లోకమునందు సాదృశ్య హేతుకాభేదాధ్యవసాయము చేయఁబడుచున్నది.

**శ్లో॥ సమ్పూర్ణచన్ద్రదేహోఽయం – న గౌరీనాథవిగ్రహః।**
**మధ్యస్థం లాఞ్ఛనమిదం – న నీలం కన్ధరాతలమ్॥ 61**





**ప్రతిపదార్థము:–** అయమ్ = ఇది, సంపూర్ణ చంద్రదేహః = సంపూర్ణచంద్రశరీరము, గౌరీనాథ విగ్రహః = శివ విగ్రహము, న = కాదు, ఇదమ్ = ఇది, మధ్యస్థమ్ = నడుమ నున్న, లాంఛనమ్ = కళంకము, నీలమ్ = నల్లని, కన్ధరాతలమ్ = కణ్ఠతలము, న = కాదు.

**తాత్పర్యము:–** ఇది సంపూర్ణచంద్రదేహము. శివ విగ్రహము కాదు. చంద్ర మణ్డల మధ్య కలంకమిది. శివ కణ్ఠతలము కాదు.

**వివరణ:–** ఇందు విషయమైన సంపూర్ణ చంద్రదేహము తోడి అభేదాధ్యవసాయము ముందు చేసి అపహ్నవము తరువాత చేయఁబడినది. ఇదియు అపహ్నవాలంకార విశేషములలో నొకటి. ముఖ్యమైన విషయం (శివ విగ్రహ) నిగరణము (ఆపహ్నవము) అను అపహ్నవాలంకార లక్షణ మిందున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున ఇ ఇవ్ చేత విషయనిగరణము చేయఁబడినది. ఈ శ్లోకమున ఛద్మశబ్దముచే విషయ నిగరణము చేయఁబడుచున్నది.

**శ్లో॥ అసారే దుస్తరేఽగాధే – సంసారచ్ఛద్మసాగరే।**
**నిమగ్నమ్మామ్మహాదేవ – కృపారజ్జ్వా సముద్ధర॥ 62**

**ప్రతిపదార్థము :–** మహాదేవ! = ఓ మహాదేవా!, అసారే = సారములేని, దుస్తరే = దాటరాని, అగాధే = లోతైన, సంసారచ్ఛద్మసాగరే = సంసారపు మిషగల సముద్రమున, నిమగ్నమ్ = పూర్తిగా మునిగిన, మామ్ = నన్ను, కృపారజ్జ్వా = దయయను త్రాటితో, సముద్ధర = ఉద్ధరింపుము.

**తాత్పర్యము :–** ఓ మహాదేవా! సారములేని దాటరాని లోతైన సంసారమను మిష గల సముద్రమున పూర్తిగా మునిగిన నన్ను దయయను త్రాటితో ఉద్ధరింపుము.

**వివరణ :–** సారములేని దానిని సంసారమనుట విచిత్రము అని అసార శబ్దము వ్యంజించును. ఛద్మశబ్దముచే విషయమైన సంసారముయొక్క నిగరణము చేయఁ బడినందున నిందు అపహ్నవాలంకార మేర్పడియున్నది. పూర్వార్ధమున పదాన్తానుప్రాస మున్నది. ఉత్తరార్ధమున మకార బహువారావృత్తి చేతను వృత్త్యనుప్రాసమేర్పడియున్నది. 'ర' ఆవృత్తియు వృత్త్యనుప్రాసమును కలిగించుచున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున సంసారసాగరమున కభేదాధ్యవసాయము చేయcబడినది. ఈ శ్లోకమున వృషభచన్ద్రులకు శ్లేషచే అభేదాధ్యవసాయము చేయcబడుచున్నది.

**శ్లో॥ భవ్యపాదో లసచ్ఛృఙ్గో – ఘనాధ్వగతిరున్నతః।**
**అధికం ప్రాప్తసన్తానః – పాతు మామీశ్వరస్య గౌః॥ 63**

**ప్రతిపదార్థము :–** భవ్యపాదః = మంచిపాదములు / కిరణములుగల, లసచ్ఛృఙ్గః = ప్రకాశించు కొమ్ములుగల, ఘనాధ్వగతిః = గొప్పవైన / మేఘముల మార్గమున నడకగల, ఉన్నతః = ఎత్తైన, అధికమ్ = మిక్కిలి, ప్రాప్తసన్తానః = పొందcబడిన వంశముగల, ఈశ్వరస్య = ఈశ్వరునియొక్క, గౌః = ఎద్దు / చన్ద్రుడు, మామ్ = నన్ను, పాతు = కాపాడుగాక!

**తాత్పర్యము :–** మంచి పాదములు / కిరణములు గల ప్రకాశించు కొమ్ముల గల గొప్పనైన / లేక మేఘముల మార్గమున నడకగల, మిక్కిలిగా పొందిన వంశము గల శివునిఎద్దు లేక చంద్రుడు నన్ను కాపాడుగాక!

**వివరణ :–** శివుని ఎద్దు చన్ద్రుడు రెండును ప్రకృతములు. కావున ప్రకృత శ్లేషము పూర్వార్ధమందలి మొదటి విశేషణములు శ్లిష్టశబ్దయుతములైయున్నవి. ఏకశబ్ద బోధ్యములు అయిన రెండు వస్తువు లభిన్నముగ గోచరించుట శబ్దశ్లేషము. ఉన్నత శబ్దమున అర్థశ్లేషము అనగా ఎద్దు, చన్ద్రుడు ఇరువురిలోని ఔన్నత్యము నీ శబ్దము బోధించును.

పాద శబ్దమునకు అడుగులు, కిరణములు అను రెండర్థములున్నవి. గౌః అను శబ్దమునకు ఎద్దు, చన్ద్రుడు అను రెండర్థములున్నవి. కనుక శబ్ద శ్లేష ఇట్లు రెండర్థములుండుటచే నీ శ్లోకమున శ్లేషాలంకార మేర్పడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమునందువలె ఈ శ్లోకమునందును ప్రకృతశ్లేషము చెప్పc బడుచున్నది.

**శ్లో॥ బలసన్తోషదం శ్రీదం – గోపాలం బుధనాయకమ్।**
**హరిమ్మహాత్మాతిశేతే – నితరాం పార్వతీపతిః॥ 64**

**ప్రతిపదార్థము :–** బలసన్తోషదమ్ = బలరామునికి సంతోషమునిచ్చు లేక బలమును, సన్తోషమును ఇచ్చు, శ్రీదమ్ = సంపదనొసగు, గోపాలమ్ = గోవులను లేక దేవతలను పాలించు, బుధనాయకమ్ = దేవతలకు లేక విద్వాంసులకు నాయకుడైన, హరిమ్ = విష్ణువును లేక ఇన్ద్రుని, మహాత్మా = మహాత్ముడైన, పార్వతీపతిః = పార్వతీపతి, నితరామ్ =మిక్కిలి, అతిశేతే = అతిక్రమించును.

**తాత్పర్యము :–** బలరామునకు సంతోషము నొసగు లేక బలసంతోషముల నొసగు, సంపదలనొసగు పండితులకు లేక దేవతలకు నాయకుడైన హరిమ్ = విష్ణువు (కృష్ణు)ని లేక ఇంద్రుని మహాత్ముడైన శివుడు అతిక్రమించును.

**వివరణ :–** విష్ణ్వింద్రులేక హరి శబ్దబోధ్యులగుటచే శబ్దశ్లేషము. ఏక బల శబ్దము బలరామ బలములను బోధించుట శబ్దశ్లేషము. ఇన్ద్రోపేన్ద్రులిరువురు దేవతా నాయకులగుట అర్థశ్లేషము. ఇరువురు ప్రకృతులగుటచే నిది ప్రకృతశ్లేషము.

---

**అవతారిక :–** పూర్వ శ్లోకములలో విశేష్య శబ్దశ్లేషము కూర్పcబడినది. ఈ శ్లోకమున విశేషణ శబ్ద శ్లేషము కూర్పcబడుచున్నది.

**శ్లో॥ శ్రీకణ్ఠం స్ఫుటనీరసమ్భవదృశం వన్దారుకల్పద్రుమం**
**రత్నోద్భాస్వదహీనకఙ్కణధరం బ్రహ్మాదిభిః సంస్తుతమ్।**
**సత్యం చిత్తజవైరిసమ్భ్రమహరం తమ్ పార్వతీనాయకం**
**నిత్య మ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 65**

**ప్రతిపదార్థము :–** శ్రీకణ్ఠమ్ = విషము కణ్ఠమునందుగల, లక్ష్మి (సీత) సమీపమున గల, స్ఫుటనీర సమ్భవ దృశమ్ = వికసించిన కమలములవంటి కన్నులుగల, వన్దారు కల్పద్రువమ్ = నమస్కరించువారికి కల్పవృక్షమైన, రత్నోద్భాస్వదహీన కఙ్కణధరమ్ = రత్నములతో ప్రకాశించు గొప్ప లేక సర్ప రాజ కఙ్కణములు ధరించిన, బ్రహ్మాదిభిః = బ్రహ్మ మొదలగువారిచేత, సంస్తుతమ్ = బాగుగా స్తుతింపcబడిన, సత్యమ్ = శాశ్వతమైన, ఈశ్వరమ్ = ప్రభువైన, చిత్తజవైరి సమ్భ్రమహరమ్ = మనసునబుట్టిన శత్రువుల సంబరమును లేక మన్మథుడు అను శత్రువుయొక్క భయమును తొలగించు, మానసవాసమ్ = మనసున నివాసముగల, రామాకృతిమ్ = రాముని ఆకారముగల, లేక మనోహరమైన ఆకారముగల, పార్వతీనాయకమ్ = శివుని, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** విషము కంఠమందుగల లేక లక్ష్మి (అంశమైన సీత) సమీపమున గల, కమలముల వంటి కన్నులుగల, నమస్కరించువారి కోరికల దీర్చుటలో దేవవృక్షమువంటి వాడైన, రత్నములతో ప్రకాశించు గొప్ప కఙ్కణములుగల, బ్రహ్మాదులచే బాగుగా స్తుతింపc బడిన, ఈశ్వరుడైన, నిత్యుడైన, మనసునcబుట్టు (అంతః) శత్రువుల హరించు అందమైన ఆకారము లేక రాముని ఆకారము గల ఆ పార్వతీపతిని భావించెదను.

**వివరణ :–** శ్రీకణ్ఠ, రత్నోద్భావస్వదహీన కఙ్కణధర, చిత్తజవైరి సమ్భ్రమహర, రామాకృతి, అను విశేషణములు శబ్దశ్లేషగలవి, అనగా శ్లిష్టములైన శ్రీకణ్ఠ అహీన చిత్తజవైరి రామా అను శబ్దములతో గూడినవి. రామాకృతిమ్ అను శ్లిష్ట సమాసముచే మిగిలిన విశేషణములతో శ్లేషమాశ్రయింపవలసి వచ్చుటచే నిది శ్లిష్టవిశేషణ పురస్కృత శ్లేషాలంకార మైనది. రామ శివులిరువురును భావింపఁదగిన వారగుటచే నీ శ్లోకమున ప్రకృత శ్లేషము అని చెప్పవచ్చును. ఇచట రాముని ప్రసక్తి అనావశ్యక మగుటవలన ఆతడు అప్రకృతుడు అని భావించు పక్షమున నిట ప్రకృతా ప్రకృత శ్లేషమని చెప్పవచ్చును. కాని అలంకారికులలో కొందఱు ప్రకృతా ప్రకృత శ్లేషమున్నప్పు'డివ' శబ్దముండవలెనని అది ఉపమాలంకారముతో కూడి యుండునని చెప్పుదురు. ఇందు మానసవాస, స్ఫుటనీర సమ్భవదృశం, వన్దారు కల్పద్రుమ, సత్య, ఈశ్వర అను విశేషణముల అర్థము రామశివులిందు వర్తించుటచే ఆ విశేషణములు అర్థశ్లేషగలవి. "రామాకృతిమ్" అను విశేషణము వరుసగా కొన్ని శ్లోకములలో కూర్చుటచే నీ కవి దృష్టిలో రాముడు ప్రకృతుడే కావున ఈ శ్లోకములలో ప్రకృత శ్లేషమనియే చెప్పవలెను. ఉత్తరార్ధమున దక్షిణాత్యప్రాస మున్నది. ప్రతిపాదమున మ–స–జ–స–త–త–గ అను గణము లుండుటచే నీ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము. విశేషణ శ్లేషబలముననే శివుడు రామాకృతి యనియు చెప్పవచ్చును.

---

**అవతారిక :–** పై శ్లోకమున వలె ఈ శ్లోకమునందును శివరామ విశేషణముల శ్లేషము కూర్పఁబడినది.

**శ్లో॥ లోకేశం బహురాజరాజవినుతం పౌలస్త్యసన్తోషదం**
**సీతారమ్యపయోధరాధికలసచ్ఛ్రీకుఙ్కుమాలఙ్కృతమ్।**
**భవ్యం సాధ్వజజాతనన్దపరం కైలాసనాథం ప్రభుం**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 66**

**ప్రతిపదార్థము :–** లోకేశమ్ = లోకములయొక్క ప్రభువైన, బహురాజ రాజ వినుతమ్ = అధికముగా కుబేరునిచే స్తుతింపఁబడిన లేక పెక్కురు చక్రవర్తులచే బాగుగా స్తుతించబడిన, పౌలస్త్య సన్తోషదమ్ – రావణునకు/విభీషణునకు సంతోషము నొసగు, సీతారమ్యపయోధరాధికలసచ్ఛ్రీకుఙ్కుమాలఙ్కృతమ్ = నాగటిచాలునకు మనోహరమైన మేఘమున ప్రకాశించు కాంతియను కుంకుమముచే అలంకరింపఁబడిన లేక సీతాదేవియొక్క అందమైన స్తనములందు మిక్కిలి ప్రకాశించు ప్రశస్తమైన కుంకుమచే



అలంకరింపఁబడిన, భవ్యమ్ = మంచివాడైన, సాధ్వజజాతనన్దనపరమ్ = మంచివాడైన బ్రహ్మకుమారుల సంతోషింపఁజేయుట యందాసక్తుడైన లేక మంచివాడైన దశరథుని సంతోషింపజేయుట యందాసక్తుడైన, రామాకృతిమ్ = రాముని ఆకారముగల, మానసవాసమ్ = మనసున నివసించు, ఈశ్వరమ్ = ప్రభువైన, ప్రభుమ్ = సమర్థుడైన, కైలాసనాథమ్ = కైలాసనాథుడగు శివుని, నిత్యమ్ = నిత్యము, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** లోకేశ్వరుడు అధికముగా కుబేరునిచే బాగుగా స్తుతింపఁబడినాడు. పులస్త్య వంశీయుడైన రావణునికి లేక విభీషణునికి సంతోషమునొసగి నాగటి చాలునకు మనోహరమైన మేఘములందలి కాంతి (మెఱుపు) అను కుంకుమముచే అలంకరింపఁ బడిన లేక సీతాదేవియొక్క అందమైన కుచములందధికముగా ప్రకాశించు కుంకుమచే అలంకరింపఁబడిన, మంచివాడైన బ్రహ్మ కుమారుల కానందమును కలిగించుట యందాసక్తుడైన, మనసున నివసించు ప్రభువైన, సమర్థుడైన రాముని ఆకారముగల కైలాసనాథ ప్రభువును భావించెదను.

**వివరణ :–** ప్రథమపాదమందలి రాజ రాజ శబ్దము. ద్వితీయ పాదమందలి సీతాపయోధర శబ్దము తృతీయపాదమందలి అజజాత నన్దన శబ్దములు నాల్గవ పాదమందలి రామాకృతి శబ్దము శ్లిష్టములు. అనగా ఈ పదములుగల విశేషణములు అర్థము రామశివోభయ సాధారణమగుటచే అవి అర్థశ్లేషగలవి. రామాకృతి శబ్దము రామ ఆకృతియందు గలవాడు అను అర్థమున శివుని అర్ధనారీశ్వరత్వమును తెలుపును. ఈ శ్లోకమును శార్దూలవిక్రీడితచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునకు రామునకును సాధారణమైన పౌలస్త్యసంతోష ప్రదత్వము చెప్పఁబడినది. ఈ శ్లోకమున అట్టిదేయైన హంసాన్వ యోల్లాసకత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కౌసల్యావరనన్దనం గుణయుతం హంసాన్వయోల్లాసకం**
**కల్యాణం వరరాజశేఖరమతిప్రాలేయశైలాశ్రయమ్।**
**బాణోత్ఖాతమహాగజాసురశిరోభారమ్మునీన్ద్రస్తుతం**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 67**

**ప్రతిపదార్థము :–** కౌసల్యావరనన్దనమ్ = కౌసల్యకు వరముతో సంతోషకుడైన కౌసల్య యొక్క శ్రేష్ఠపుత్రుడైన, గుణయుతమ్ = గుణములతో కూడిన, హంసాన్వయోల్లాసకమ్ = జ్ఞానుల కులము నుల్లసింపఁజేయునట్టి, వరరాజశేఖరమ్ = శ్రేష్ఠుడైన చంద్రుడు

శిరోభూషణముగా గల / గొప్ప రాజులలో శిరోభూషణము వంటి వా(శ్రేష్ఠుడైన)డైన, అతిప్రాలేయశైలాశ్రయమ్ = ఎక్కువ మంచుగల కొండ ఆశ్రయముగా గల/మంచు కొండను దాటిన పిదప ఉత్తరమునుండి దక్షిణమునకు వచ్చునప్పుడున్న నగరము (అయోధ్య) ఆశ్రయముగాగల, బాణోత్ఖాత మహాగజాసుర శిరోభారమ్ = బాణముచే పెకిలింపఁబడిన గొప్ప పార్వతియొక్క దేవతల యొక్కయు శిరోభారముగల, మునీన్ద్ర స్తుతమ్ = మునీన్ద్రులచే స్తుతింపఁబడిన, నిత్యమ్ = నిత్యమూ, మానసవాసమ్ = మానసము వాసనముగా గల, రామాకృతిమ్ = రామ ఆకృతియందుగల /రామ యొక్క ఆకృతిగల, ఈశ్వరమ్ = ప్రభువును, భావయే = ఉపాసించెదను.

**తాత్పర్యము :-** కౌసల్యకు వరమునిచ్చి సంతోషింపఁజేసిన లేక కౌసల్యయొక్క శ్రేష్ఠపుత్రుడైన, గుణములతో కూడిన, జ్ఞానుల కులమునుల్లసింపఁజేయు, లేక సూర్యకులము నుల్లసింపఁజేసిన, మాంగల్య స్వరూపుడైన గొప్ప చంద్రుడు శిరోభూషణముగా గల / లేక గొప్ప రాజులకు శిరోభూషణము వంటి అనగా శ్రేష్ఠుడైన ఎక్కువ మంచు గల కొండయైన కైలాసము ఆశ్రయముగాగల / దక్షిణమువైపు ఉత్తర ధృవము నుంచి వచ్చునపుడు మంచుకొండను దాటిన పిదపవచ్చు నగరమైన అయోధ్య ఆశ్రయముగాగల, బాణముచే గొప్ప గజాసురుని బరువైన పెద్దతలను తొలగించిన బాణముచే రావణుని చంపి పార్వతియొక్క దేవతల యొక్కయు తలనొప్పిగల మునీన్ద్రులచే స్తుతింపఁబడిన సుందరుడైన మనసు నివాసముగాగల, రామ ఆకారమందుగల / రామయొక్క ఆకారముగల రాముని ఆకారమువంటి ఆకారముగల ఈశ్వరుని ఉపాసించెదను.

**వివరణ :-** 1. శివునుపాసించిన కౌసల్యకు వరముగా రాముని కుమారునిగా ఆతడనుగ్రహించిన పురాణగాథ అనుసన్ధేయము. 2. వింటనారిగల లేక దయాదిగుణములు గల శివుడు లేక రాముడు గుణయుతుడు, ఉభయసాధారణమైన ఈ విశేషణము అర్థశ్లేషగలది. 3. హంసాన్వయ మనగా జ్ఞానుల సమూహమని శివపక్షమున, సూర్య వంశమని రాముని పక్షమున అర్థమును చెప్పుకొనునవకాశము గల హంసాన్వ యోల్లాసకమ్ అను విశేషణము శ్లిష్టము అనగా శబ్దశ్లేషగలది. 4. ఉభయసాధారణమైన కల్యాణమ్ అను విశేషణము అర్థశ్లేషగలది. 5. వరరాజశేఖరమ్ అను విశేషణమునకు రెండర్థములు (ప్రతిపదార్థమున చెప్పఁబడినట్లు) న్నందున శ్లిష్టము అనగా శబ్దశ్లేషగలది. 6. అతిప్రాలేయశైలమ్ అను శబ్దము ఉత్తరమున మంచుకొండను దాటిన పిదపనున్న కైలాసమును శివుని పక్షమున ఉత్తరధ్రువమునుండి దక్షిణమునకు





వచ్చునప్పుడు హిమాలయపర్వతమును దాటిన పిదప ఆ కాలమునందలి పెద్ద నగరము అయోధ్య ఆశ్రయముగా గలవాడు అని రాముని పక్షమున అర్థములు బోధించుటచే శ్లిష్ట విశేషణము అనగా శబ్ద శ్లేషగలది. 7. మహా + గజ + ఆసుర అని శివ పక్షమున, మహా + అగజా + సుర అని విభజించి శివరామోభయార్థములు వేరుగా చెప్పఁ బడినవి గాన ఇది శ్లిష్ట విశేషణము. అనగా శబ్దశ్లేషగలది. గజాసురుని శిరము పెద్దదగుటచే దానిని శివుడు తొలగించి వాని తల బరువును తగ్గించి వాని కుపకారము చేసినాడు లేక వాని శిరమును తన కొడుకు శిరమున కతికించి అపకీర్తి అను శిరోభారము గజాసురునకు లేకుండ జేసి ఉపకరించినాడు. గజాసురుని తల తీసివేసి వాని చర్మమును కప్పుకొని వాని కొక విధమైన శాశ్వతకీర్తిని కలిగించి శివుడు వాని కుపకారము నొనర్చినాడు. రాముని పక్షమున శివభక్తుడయ్యు పార్వతీదేవిని కామించిన రావణుని ఏమి చేయలేని పార్వతికి స్వర్గము నపహరించి సురులకు శిరోభారము కలిగించిన రావణునికి పది తలల బరువును తొలగించి వానికి జయ విజయ శాపమును దీర్చి ఉపకరించిన రాముడు రావణుని కుపకారము చేసినాడు, అని శిరోభార శబ్దము అనేక విధములైన అర్థముల వ్యంజించును. 8. మునీన్ద్రస్తుతమ్ రమ్యమ్ మానసవాసమ్ అను విశేషణములు శివ రామోభయ సాధారణ మగుటచే అర్థశ్లేషగలవి. 9. రామాకృతిమ్ అను శబ్దమునకు వేరు వేరు అర్థములు శివరామ పక్షములలో చెప్పఁబడినవి. కావున శ్లేష విశేషణము అనగా శబ్దశ్లేషగలది. **శ్రీరామః శ్యామలాదేవీ** అను తాంత్రికవచనము ననుసరించి శ్రీరాముడు శక్తియొక్క అవతారమైనందున శివుని హరిహరావతారమున శివుని వామభాగముననున్నందున, మోహినిగా అవతరించి శివుని కామించినందున **'హరిం పరం తమనుయంతి దేవాః'** అను వేదవచనము ననుసరించి విష్ణువు రామ అనగా స్త్రీయే. కావుననే ఆతని కా స్త్రీ సాధారణమైన కమలనేత్రాది శబ్దములు వర్తించును. స్త్రీ సహజమైన అలంకార ప్రియత్వమును ఆతడు రామయని వ్యంజించును. అట్టి రామ తన అర్ధనారీశ్వరాకృతియందు వామభాగమున కలవాడగుటచే ఈశ్వరుడు రామాకృతియైనాడని రామాకృతి శబ్దము వ్యంజించును. ఇందు శ్లేషాలంకారమున్నది. 10. రాముని యందును, శివునందును అభేదభావముగల శివకర్ణామృత స్తోత్రకర్త ఎనిమిది శ్లోకములను "**మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే**" అను మకుటముతో ఏకవృత్తమున రచించియుండుటచే నీ ఎనిమిదిశ్లోకములకు రామాకృతీశ్వరాష్టకమని పేరు పెట్టుటకు తగినవిధముగా నున్నవని చెప్పవచ్చును. ఈ శ్లోకము శార్దూలవిక్రీడిత నిబన్ధనము.

---

**అవతారిక :–** అమ్ము అను ఏకార్థమున పై శ్లోకమున ప్రయోగింపఁబడిన బాణశబ్ద మీ శ్లోకమున బాణాసురుడు అమ్ము అను రెండర్థములలో ప్రయోగింపఁబడుచున్నది.

**శ్లో॥ హస్తస్వీకృతబాణముజ్జ్వలతనుం భాస్వద్విభూతేర్దధమ్**
**నిత్యం సద్వృషవాహమన్ధకరిపుం రుద్రాక్షమాలాధరమ్।**
**నానాశేషశిరః కిరీటవిలసన్మాణిక్యశోభోజ్జ్వలం**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 68**

**ప్రతిపదార్థము :–** హస్తస్వీకృతబాణమ్ = చేత స్వీకరింపఁబడిన బాణాసురుడు గల / చేత స్వీకరింపఁబడిన అమ్ముగల, ఉజ్జ్వలతనుమ్ = ప్రకాశించు శరీరముగల, భాస్వద్విభూతేః = ప్రకాశించు విభూతియొక్క, సూర్యుని ఐశ్వర్యముయొక్క, దధమ్ = ధారకుడైన, నిత్యమ్ = నిత్యుడైన, సద్వృషవాహమ్ = మంచి ఎద్దువాహనముగాగల / మంచి ధర్మమును ధరించిన, అన్ధకరిపుమ్ = అన్ధకునకు శత్రువైన / గుడ్డివాని (ధృతరాష్ట్రుని)కి శత్రువైన, రుద్రాక్షమాలాధరమ్ = రుద్రాక్ష మాలలు ధరించు / దుఃఖములను పోగొట్టు జపమాలను ధరించు, నానాశేషశిరః కిరీట విలసన్మాణిక్య శోభోజ్జ్వలమ్ = వివిధములైన అందఱి కిరీటములలో ప్రకాశించుచున్న రత్న భూషణములతో ప్రకాశించు, నిత్యమ్ = నిత్యుడైన, మానసవాసమ్ = మనసు వాసముగాగల, రామాకృతిమ్ = రామ ఆకారమందుగల /లేక రామవంటి ఆకారముగల, ఈశ్వరమ్ = ప్రభువును, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** బాణాసురుని చేపట్టిన లేక బాణమును చేత ధరించిన, ప్రకాశించు శరీరముగల, ప్రకాశించు బూడిదను ధరించు లేక సూర్యుని ఐశ్వర్యము (కాంతి) ధరించిన, ఎల్లప్పుడు మంచి ఎద్దు వాహనముగాగల / లేక మంచి ధర్మమును ధరించిన అన్ధకాసురునకు శత్రువయిన లేక గుడ్డివాడైన ధృతరాష్ట్రునకు శత్రువైన, రుద్రాక్షమాలను ధరించు, దుఃఖమును బోగొట్టు జపమాలను ధరించిన వివిధములైన అనేకుల శిరములలోని కిరీటములలోని మణిభూషణములతో ప్రకాశించు నిత్యుడైన మనసు వాసముగాగల, రామ ఆకృతియందు గల లేక రామవంటి ఆకృతిగల ప్రభువును భావించెదను.

**వివరణ :–** 1. బాణమనగా అమ్ము లేక బాణాసురుడు. స్నేహమున లేక వాత్సల్యమున బాణుని చేపట్టినవాడు (శివుడు), ఋషుల రక్షణమునకై రాక్షసుల శిక్షణమునకై బాణము ధరించినవాడు (రాముడు) అను రెండర్థములనిచ్చు మొదటి విశేషణము శబ్దశ్లేష గలది. బాణశబ్దము నారాయణుని బాణత్వమును బోధించునప్పుడది అర్థశ్లేషగలది. ఉజ్జ్వల





తనుమ్ అను విశేషణము మూడవపాదముగా నున్న విశేషణము మానసవాసమ్ ఈశ్వరమ్ అను విశేషణములు శివరామోభయ సాధారణములు కావున అర్థశ్లేష గలవి. 2. సద్వృషము అనగా మంచి ఎద్దు లేక మంచి ధర్మము. వాహము అనగా వాహనము లేక ధరించువాడు. అను భిన్నార్థపదములుండుట, సద్వృషవాహమ్ అను విశేషణములు శబ్దశ్లేష గలవి. రుద్రాక్షమాలాధరమ్ అను విశేషణము రుద్రాక్ష అను వృక్షముయొక్క కాయలు అవి గ్రుచ్చియున్న మాలలను శివుడు ధరించి, శివుని రు + ద్రా + అక్ష మాలా అను విభాగమున దుఃఖముల బోగొట్టు జపమాలను ధరించు, అరణ్యవాస నిరతమ్ అని బోధించుటచే నీ విశేషణములు శబ్దశ్లేష గలవి. “భాస్వద్విభూతేర్దధమ్” పదములుగల విశేషణమున శివపక్షమున బూడిదను ధరించు అను అర్థము, రామ పక్షమున సూర్యుని ఐశ్వర్యమును లేక కాంతిని ధరించునను అర్థము అను రెండర్థములు సూర్యుని ఐశ్వర్యమును లేక కాంతిని ధరించునను అర్థము అను రెండర్థములు గలదగుటచే శబ్ద శ్లేషగలది. అన్ధకరిపు శబ్దము శివుని పక్షమున అన్ధకాసుర శత్రువు. పాండవ, ద్వారమున చేయించుటచే శత్రువు అను అర్థముల నొసగుటచే శబ్దశ్లేష గలది. 3. రామాకృతి అను విశేషణము రాముని వంటి ఆకారముగల వాడు అను అర్థమును శబ్దశ్లేష గలది. ఔపమ్యవాచకము లేకయు ఔపమ్యమును స్ఫురింపఁజేయుటచే లుప్తోపమాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున సద్వృషవాహమ్ అను విశేషణమువలె ఈ శ్లోకమున సద్ధర్మమార్గాకరమ్ అను విశేషణమును శివరామోభయసాధారణమై అర్థశ్లేష గలిగి వారిరువురి ధర్మాచరణ పరాయణతను బోధించు విశేషణమును కవి ప్రయోగించు చున్నాడు.

**శ్లో॥ అత్యన్తానిలసూనువన్దితపదం శ్రీచన్దనాలఙ్కృతం**
**కాన్తమ్మోహనవాలినాశకరం సద్ధర్మమార్గాకరమ్।**
**విశ్వామిత్రసుయోగవర్ధనమహోత్కృష్టప్రభాదర్శకం**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 69**

**ప్రతిపదార్థము :–** అత్యన్తానిలసూను వన్దితపదమ్ = అధికముగా వాయుసూనుడైన ఆంజనేయుని చేత లేక భీముని చేతను నమస్కరింపఁదగిన పాదములు గల, శ్రీ చన్దనాలఙ్కృతమ్ = శ్రీ చన్దనముచే అలంకరింపఁబడిన, కాన్తమ్ = మనోహరుడైన, మోహనవాలి నాశనకరమ్ = మోహింపఁజేయు వాలి లేక గజాసురునియొక్క

నాశమునొనర్చు, సద్ధర్మ మార్గాకరమ్ = మంచి ధర్మ మార్గమునకు నిధియైన, విశ్వామిత్ర సుయాగ వర్ధన మహోత్కృష్ట ప్రభాదర్శకమ్ = విశ్వామిత్రుని మంచి యాగమును వర్ధిల్లఁజేయు లేక విశ్వమున కమిత్రుడైన (దక్షుని) గొప్ప యాగమును నశింపఁజేయు మహోత్కృష్టమైన కాంతిని చూపించు, నిత్యమ్ = నాశములేని, మానసవాసమ్ = మానసము వాసముగాగల, రామాకృతిమ్ = రామరూపుడైన, ఈశ్వరమ్ = శివుని, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** అధికముగా ఆంజనేయుని చేత లేక భీముని చేత నమస్కరింపఁబడిన పాదములుగల, శ్రీ చన్దనముచే అలంకరింపఁబడిన, సున్దరుడైన మోహమును కలిగించు వాలి లేక గజాసురునియొక్క నాశము నొనర్చు, విశ్వామిత్రుని మంచి యాగమును కాపాడు లేక విశ్వమునకు శత్రువైన దక్షుని గొప్ప యాగమును నశింపజేయు మహోత్కృష్టమైన ప్రభను (ప్రభావము) ను దర్శింపఁజేయు నాశములేని మానసము వాసముగాగల రామాకారము ధరించిన శివుని భావించెదను.

**వివరణ :–** 1. శివునకు భీముడను పేరున్నది. లయకారకుడగు శివునందు భయంకరార్థమైన భీమశబ్దము సార్థకము. కున్తీదేవి భీమనామ శివునారాధించి తద్వారమున పొందిన పుత్రునకు భీమనామకరణ మొనర్చినది. అందుచేత అనిలసూను శబ్దము, కున్తీపుత్రుడైన భీముని బోధించును. అనిలుడు అనగా వాయువు. ఆతడు శివుడు అష్టమూర్తులలో నొకడైన వాయువువలన కున్తికి భీమనామ శివానుగ్రహమున జనించిన భీముని బోధించును. అనిలపుత్రులే అయిన భీమాంజనేయులలో భీముడు శివుని పాదముల కధికముగా నమస్కరించును. శివావతారమని భావించు ఆంజనేయుడు రాముని పాదములను విడువక వన్దన మొనర్చుచునే యుండును. కావున 'అత్యన్తానిల సూను వన్దిత పదమ్' అను విశేషణము శివరామోభయుల నవిశేషముగానే బోధించును.

2. వన జాతీయుడైనందున సార్థకనాముడైన ఇంద్రపుత్రుడై వాలి తన పరాక్రమముచే యుద్ధమున శత్రువును మోహింపఁజేయు వాడగుట చేతను తోకగల గజముయొక్క రూపముగల గజాసురుడు మాయావియై ఇతరులకు మోహము కలిగించువాడగుటచే వాలి గజాసురు లిరువురి యెడ మోహనత్వము సాధారణము. కావున 'మోహనవాలి నాశనకరమ్' అను విశేషణము శివరాముల నిరువురు నవిశేషముగా బోధించును.

3. 'మిత్రే చర్షే' అను పాణినిసూత్రముచే ఋషివాచకమిత్ర శబ్దము పరముగా నున్నందున విశ్వశబ్దమునకు దీర్ఘమురాగా నేర్పడిన **విశ్వామిత్ర** శబ్దము విశ్వమునకు మిత్రుడైన గాధి నందనుడైన ఋషినే బోధించును. ఆ విశ్వామిత్రుడో లోక కల్యాణార్థము





చేయుయాగము సుయాగము. దానిని వర్ధిల్లఁజేసినవాడు శ్రీరాముడు. విశ్వామిత్ర సుయాగవర్ధనమైన మహోత్కృష్ట ప్రభను అనగా ప్రభావమును ప్రదర్శించిన వాడగుటచే విశ్వామిత్రసుయాగవర్ధన మహోత్కృష్ట ప్రభాదర్శకమ్" అను విశేషణము రాముని విశేషమును బోధించును. అట్లే విశ్వనాథుడైన శివునికి భాగమునీయక పోవుటచే అభిచారముగా పరిణమించిన యాగమొనర్చిన దక్షుడు విశ్వమున కమిత్రుడే యగును. దక్షుడు ప్రజాపతిగా ప్రసిద్ధుడు. ఋషిగాక పోవుటచే ఆ దక్షుని బోధించునప్పుడు మిత్రశబ్దము పరమైయున్నను విశ్వ శబ్దమునకు దీర్ఘమురాదు కావున దక్షుడు విశ్వమునకు అమిత్రుడనియే గ్రహింపవలెను. అట్టి దక్షుడు చేసిన యాగము గొప్పది. గావున సుయాగ మనబడినదే కాని మంచి దగుటచే సుయాగమనఁబడలేదు. ఇట సుశబ్దము విరోధ లక్షణచే మంచికి విరోధమైన చెడు అను అర్థమునే బోధించును. వర్ధన శబ్ద నిష్పాదక్ ధాతువు వృద్ధ్యర్థకమ్ గాక ఛేదనార్థకము గూడ నగుటచే దక్షయాగ విచ్ఛేదక మొనర్చుటలో మహోత్కృష్ట ప్రభను అనగా ప్రభావమును దర్శింపఁజేసిన శివుని గూడ నీ విశేషణము బోధించును. పై విశేషణములు గాక మిగిలిన శ్రీ చన్దనాలంకృత, నిత్యకాంత, సద్ధర్మ మార్గాకరేత్యాది విశేషణము లుభయసాధారణములు. శివుడెల్లప్పుడు, భక్తులచే శ్రీచన్దనముతో నలంకరింపఁబడుచుండును. శ్రీరాముడు మాత్రము వనవాసేతర కాలమున శ్రీచన్దనాలంకృతుడై యుండును. ఈ శ్లోకము శార్దూలవిక్రీడిత వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున మోహన వాలి నాశనకరమ్ అను శ్లిష్ట విశేషణముచే శివరాముల దుష్ట శిక్షణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున 'నిజజనాధారమ్' కృపాసాగరమ్ అను రెండు శ్లిష్ట విశేషణముల చేత వారి శిష్ట రక్షణము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ దీవ్యద్రశ్మితమోనుదర్ధవిలసత్సద్భానుపట్టం విభుం**
**శాన్తం పూర్ణనభోఽంశుకం నిజజనాధారం కృపాసాగరమ్।**
**దేవేశం గుహమానసామ్బుజ దినాధీశమ్ ప్రియం శఙ్కరమ్**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిమ్ భావయే॥ 70**

**ప్రతిపదార్థము :–** దీవ్యద్రశ్మి తమోను దర్ధ విలసత్సద్భాను పట్టమ్ = ప్రకాశించు కిరణములతో చీకటిని పోగొట్టు అర్ధభాగము ప్రకాశించు చంద్రపట్టముగల, లేక అర్ధచంద్రుని వంటి ఫాలమున కట్టబడిన పట్టముగల, విభుమ్ = ప్రభువైన, శాన్తమ్ = శాన్తుడైన, పూర్ణనభోఽంశుకమ్ = పూర్ణమైన ఆకాశమే వస్త్రముగాగల, లేక పూర్ణమైన ఆకాశము వంటి (నీల) కాంతిగల, నిజ జనాధారమ్ = తన జనులకు ఆధారమైన,

కృపాసాగరమ్ = దయ అను జలమునకు సముద్రుడైన, దేవేశమ్ = దేవతలకు ప్రభువైన, గుహమానసామ్బుజ దినాధీశమ్ = కుమారస్వామి లేక భిల్లరాజుయొక్క మనస్సను కమలమునకు సూర్యుడైన, మానసవాసమ్ = మనస్సు వాసముగాగల, రామాకృతిమ్ = బలరామునియొక్క ఆకృతి వంటి ఆకృతిగల రామయొక్క / రామవంటి ఆకృతిగల, ఈశ్వరమ్ = శివుని, అహమ్ = నేను, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** ప్రకాశించు కిరణములతో చీకటినిఁబోగొట్టు లేక చంద్రార్ధము వంటి ఫాలము గల / సూర్యుడు కట్టుకొన్న పట్టముగల / ప్రకాశించు చంద్ర పట్టముగల ప్రభువైన, శాన్తుడైన, పూర్ణాకాశమే వస్త్రముగాగల లేక పూర్ణాకాశము వంటి నీలకాంతి గల తనవారి కాధారమైన, దయాసముద్రుడైన, దేవతలకు ప్రభువైన కుమారస్వామి లేక భిల్లరాజు గుహుని మనస్సను కమలమునకు సూర్యుడైన, ప్రేమగల సుఖమును కలిగించు శాశ్వతుడైన, మనసు నివాసముగా గల రాముని ఆకృతి వంటి ఆకృతిగల, శివుని భావించెదను.

**వివరణ :–** రాజ్యాభిషేక సమయమున ఫాలమున కట్టఁబడు పట్టు వస్త్రము పట్టమనఁ బడును. శివునకు చన్ద్రుడే అట్టి పట్టముగా నున్నాడు. ఆతడు అర్ధచన్ద్రుడే కావున 'అర్ధ విలసత్' అని చెప్పఁబడినాడు. ప్రకాశించు కిరణములు గలవాడగుటచే 'దీవ్యద్రశ్మి' అని చెప్పఁబడినాడు. మొత్తము మీద శివుని పక్షమున సూర్యవంశాదియైన సూర్యుడు రాజ్యమునకు అభిషిక్తుడైనప్పుడు కట్టుకొన్న పట్టమే రాముడు కట్టుకున్నాడని అర్థము. ఇందు "దీవ్యద్రశ్మి తమోనుదర్ధ విలసత్పద్టాను" శబ్దము అర్ధచన్ద్రుని వంటి రాముని ఫాలమును అపహ్నవచ్ఛాయతో బోధించును. "పూర్ణనభోంశుక" శబ్దము శివుని పక్షమున శివుని వస్త్రశూన్యతను అనగా దిగంబరత్వమును బోధించును. నభము శూన్యపద బోధ్యమైన ఆకాశమును బోధించును.

గుహమాన సామ్బుజ దినాధీశమ్ అను సమాసములోని గుహ శబ్దము శివుని పక్షమున కుమారస్వామి, రాముని పక్షమున భిల్లరాజును బోధించును. ఈ మూడు విశేషణములును శబ్దశ్లేష గలవి. రామాకృతి శబ్దము శివుని పక్షమున బలరామునివంటి తెల్లని ఆకారముగలవాడు అను అర్థమును, రాముని పక్షమున పద్మనేత్రాది రామ సంబంధి ఆకృతి గలవాడని బోధించును. ఈ విశేషణమును శబ్దశ్లేష గలదియే. మిగిలిన విశేషణములన్నియు శివరామోభయసాధారణము లగుటచే అర్థశ్లేషయుక్తములు. "గుహమానసామ్బుజదినాధీశమ్" అను విశేషణమున, 'కృపాసాగరమ్' అను విశేషణమునను రూపకాలంకారము లున్నవి. విలసత్ సత్ అను శబ్దమున



యమకాలంకారమున్నది. 'పూర్ణనభోంశుకమ్' అను విశేషణము ఆకాశమున నున్న నీలిమవంటి నీలిమ రామునందుండుటచే పూర్ణనభము వంటి కాంతిగల అను అర్థమున లుప్తోపమాలంకార మేర్పడియున్నది.

ఈ శ్లోకమును శార్దూలవిక్రీడిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున రామాయణములోని పాత్రయైన గుహుని బోధించును. గుహశబ్దము శివపరముగా కుమారస్వామ్యర్థమున ప్రయోగింపఁబడినది. ఈ శ్లోకమున రామాయణములోని పాత్రలైన భరత లక్ష్మణాదుల బోధించు శబ్దములు శివపరముగా ప్రయోగింపఁబడుచున్నవి.

**శ్లో॥ కామం లక్ష్మణహస్తపఙ్కజకృతప్రేమాదిపూజాదృతం**
**సానన్దం భరతప్రమోదనిలయం ధీరం సుమన్త్రాధిపమ్।**
**హర్తారం ఖరదూషణాహృతిపదం సాకేతవాసాదరం**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 71**

**ప్రతిపదార్థము :–** కామమ్ = కోరదగిన, లక్ష్మణహస్త పఙ్కజకృత ప్రేమాది పూజా దృతమ్ = లక్ష్మణుని హస్తకమలములచే చేయఁబడిన ప్రేమ మొదటగల పూజయందు ఆదరము నొందిన, సానన్దమ్ = ఆనన్దముతో కూడిన, భరత ప్రమోద నిలయమ్ = భరతుడను వాని సంతోషమునకు నివాసమైన, ధీరమ్ = ధీరుడైన, సుమన్త్రాధిపమ్ = మంచి మన్త్రములకు ప్రభువైన సుమన్త్రుడను వానికి ప్రభువైన, హర్తారమ్ = చంపువాడైన, ఖరదూషణా హృతి పదమ్ = తీక్ష్ణములైన నిందలను స్వీకరించుటకు స్థానమైన, సాకేతవాసాదరమ్ = సంపూర్ణ జ్ఞానముతో కూడిన నివాసమునందు ఆదరముగల / సాకేతమున నివసించుట యందు ఆదరముగల, నిత్యమ్= శాశ్వతుడైన, మానసవాసమ్ = మనస్సు ఆవాసముగాగల, రామాకృతిమ్ = రాముని ఆకృతిగల, ఈశ్వరమ్ = ఈశ్వరుని, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** కోరదగిన లక్ష్మణుని హస్తకమలములచే చేయఁబడిన ప్రేమాది పూజలందు ఆదరముగల, ఆనన్దముతో కూడిన భరతుని సంతోషమునకు స్థానమైన, ధీరుడైన మంచి మన్త్రములకు ప్రభువైన లేక సుమన్త్రునికి ప్రభువైన, సంహారకుడైన, కఠినములైన నిందలను స్వీకరించుటకు స్థానమైన లేక ఖర దూషణాది రాక్షసుల సంహరించుటకు స్థానమైన, జ్ఞానముతో కూడిన, నివాసమునం దాదరముగల ప్రభువైన శివుని భావించెదను.

**వివరణ :-** 1. శివుడు పరమానందస్వరూపుడు. కావున కోరదగినవాడు. సకలలోక సౌందర్యసార సర్వస్వరూపుడు కావున మన్మథుడని చెప్పఁదగినవాడు. రాముడును ఇట్టివాడే కావున ఆయనయు కామ పదముచే బోధింపఁదగినవాడే. ఆయన పురుషుడయ్యు పురుషోత్తముడయ్యు పురుషులు కూడా ఆయనను చూచి స్త్రీ భావమునొంది ఆయన తన భర్తయైనచో బాగుండునని ఆశపడి పురుషులుగా ఉండియు ఆతని కౌగిలింప గోరినారను అంశమును **'పుంసామ్మోహన రూపాయ'** అని రామభక్తులు ఆతని స్తుతించుచుందురు. శివుడును అట్టి సౌందర్యమును గలవాడే. కావున ఆయనకును **పుంసామ్మోహనరూపాయ** అనుమాట వర్తించును. కావున విష్ణువు పురుషుడయ్యు స్త్రీ భావమున మోహనత్వము నొందిన శివుని సంభోగమున భైరవుని కనినాడు. 'క' అనగా బ్రహ్మ 'అ' అనగా విష్ణువు. 'మ' అనగా రుద్రుడు. శివుడు బ్రహ్మవిష్ణురుద్రాత్మక పరబ్రహ్మ యగుటచేతను రాముడును అట్టివాడే. అనగా పరబ్రహ్మమూర్తి అగుటచే రాముడు కాముడై యున్నాడు. 2. లక్ష్మణ హస్త పఙ్కజ కృత ప్రేమాది పూజాదృతమ్ అను విశేషణము శివునియందును, రామునియందును సమానముగానే వర్తించును. తనకు అగ్రజుడైన రాముని సేవ తన కమలములవంటి మృదువైన చేతులచే పూజించినట్లే శ్రీరాముడు శివలింగస్థాపనము చేసి పూజించినాడనుట నా విశేషణము బోధించును. పూజ ప్రేమతో చేయఁదగినది. కావున పూజకు ఆదినుండి అంతము వరకు ప్రేమ ఉండవలసినది. బాహ్యపూజ చేయకపోయినను మనసున ప్రేమ ఉన్నచో మానసికముగ పూజించినట్లే అగును. మానసిక ప్రేమయే ముఖ్యము. ఈ ప్రేమయును మానసిక పూజయే మిగిలిన వాచిక కాయక పూజలకాది. అందుచేతనే అనగా ఆ ప్రేమ చేతనే వాచిక కాయక పూజలు చేయఁదగినవి. కావున ప్రేమాది త్రివిధ పూజల యందాదరము గలవాడు లక్ష్మణుడని, లక్ష్మణుని ఈ త్రివిధపూజలందు శివుడు, రాముడును ఆదరము గలవారనియు నీ విశేషణము బోధించును. పరబ్రహ్మమూర్తి యగు శివుడుగాని, రాముడుగాని ఆనన్ద స్వరూపముగలవారే. కావున ఆనన్దముతో కూడినవారు అను అర్థమున 'సానన్దమ్' అని చెప్పనక్కఱలేదు. అయినను నిర్గుణానంద స్వరూపమును వదలకయే సగుణరూపధారులైనందున వారు సానన్దులనుటయు దోషము కాదు. 3. భరతుడు నాట్యాచార్యుడు. శివుని తాండవమును లక్ష్యముగా చేసికొనియే అనగా దానిని దర్శించి ప్రమోదమును పొందిన పిదపనే నాట్యమును రచించినాడు. కావున భరత ప్రమోదమునకు శివుడు నిలయమని చెప్పఁబడినాడు. రాముని పక్షమున అనుజులలో





మొదటివాడైన భరతుని 14 సంవత్సరముల వనవాసము ముగిసిన వెంటనే వచ్చి కౌగలించుకొనెనను. అట్లు రాముడు భరత ప్రమోద నిలయుడయినాడు అని చెప్పవలెను. సుమన్త్రములనగా మంచి మంత్రములు. శబ్దప్రపంచము అనగా వాక్ప్రపంచము అంతటికిని శివుడు అధిపతి. అందుచేత వాగ్రూపిణి అని శివుని భార్య పార్వతి చెప్పఁబడినది. పరమేశ్వరుడు వాక్స్వరూపిణియైన పార్వతికి భర్తయని కాళిదాసుచే చెప్పఁబడినాడు. మంత్రములన్నియు వాగ్రూపములే. వానిలోనను మంచి మన్త్రములే జప్యములు. కావున శివుడు సుమంత్రాధిపుడు అని చెప్పఁబడినాడు. రాముని పక్షమున రామునికి ఎంతో ప్రాచీనకాలము నుండి ఆయన పూర్వులకు మంత్రిగానున్న సుమన్త్రుడే రామునికిని మంత్రిగానున్నాడు. అందుచే రాముడు ఆ సుమన్త్రునికి ప్రస్తుత కాలమున అధిపతి. కావున రాముడు సుమన్త్రాధిపతి అని చెప్పవలెను. లయ కారకుడైన శివుడు రావణాది దుష్టసంహర్తయైన రాముడును హర్త అని చెప్పఁదగినవారే. కావున హర్తారమ్ అను విశేషణము భయములకును చెల్లును. శివుడు సర్వసముడు రాగద్వేషరహితుడు. ఆయనను ద్వేషించి తీవ్రములైన నిందల నొనర్చినప్పుడు వారి నిందలను చిరునవ్వుతో స్వీకరించును. ఆయన ఖరదూషణముల ఆహృతి యందనగా స్వీకరించుటకు పదమైన వాడు అను అర్థమున ఖరదూషాణాహృతి పదమ్ అను విశేషణము శివుని బోధించును. ఖరదూషణాదుల ఆహృతి అనగా సంహారము అని ఆహృత్యర్థముగా రాముని పక్షమున అర్థము చెప్పినచో రామునీ విశేషణము బోధించును. కిత ధాతువు జ్ఞానార్థకము. తజ్జన్యమైన కేతశబ్దము ఆజ్ పూర్వకమైన సంపూర్ణ జ్ఞానమును బోధించును. అట్టి జ్ఞానముతో కూడినదే శివవాసము కావున శివుని సాకేత వాసాదరమ్ అను విశేషణము బోధించును. రామ పారమ్య మంగీకరించువారు రాముని విష్ణ్వవతారముగా నంగీకరించరు. ఆయన లోకము విష్ణులోకమైన వైకుణ్ఠము కాదు. శివునకు కైలాసమువలె రామునికి **సాకేత**మని చెప్పఁబడును. అట్టి సాకేతమను పేరుగల తన లోకమునందు ఆదరముగల రాముడు సాకేత వాసాదరుడని పై సాకేతవాసాదరమ్ అను విశేషణము బోధించును. కామ, సానన్ద, హర్త, ధీర, నిత్యాది విశేషణములు అర్థశ్లేష గలవై శివరామోభయ సాధారణార్థబోధకరములు సాధారణముగా విష్ణుపారమ్యము నంగీకిరంచువారు రామోపాసకులు. దేహాంతమున రాముడు విష్ణ్వవతారము కావున విష్ణులోకము (వైకుంఠము)నే చేరుతారని చెప్పుదురు. ఈ శ్లోకమున సాకేత వాసాదరము రామునందు చెప్పఁబడినందున రాముని అవతారమై విష్ణువుయొక్క లోకమైన వైకుంఠము నందాదరము చెప్పఁబడక రామునకు సాకేతవాసాదరమే చెప్పఁబడినది.

అయోధ్యానగరమునకే సాకేతమను నామాంతరము కలదని ఆ నగరము నందు నివసించుట యందాదరము కలవాడని చెప్పినచో విష్ణుపారమ్యవాదులకు గాని, రామపారమ్యవాదులకుగాని అభ్యంతరముండదు. శివునివలె శ్రీరాముడును మానసవాసుడు. మానసమను సరోవరము హిమాలయములందు ప్రసిద్ధమై యున్నది. మన మనస్సునకు ఆ సరోవరమునకు అభేదాధ్యవసాయము చేసి శివరాముల కిరువురకు మానసవాస శబ్దము వర్తించును. తులసీదాసీ భావము తోడనే రామచరితమానస్, అని తాను రచించిన రామాయణమునకు పేరుపెట్టుట జరిగియుండవచ్చును. మానసమున రాముడు ఎట్లుండాలో తన కావ్యమునను రాముడట్లే ఉండును. అని మరియు తన రామచరిత పఠనము మానస సరోవహగాహన పుణ్యము కలిగించుననియు నాతని అభిప్రాయము కావచ్చును. ఈ శ్లోకమును శార్దూలవిక్రీడిత వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున రామాయణ ప్రధాన పాత్రలైన రామ సోదరులైన లక్ష్మణ భరతులను బోధించు లక్ష్మణ భరత శబ్దములే కాక రామునిచే చంపఁబడిన అప్రధాన రామాయణ పాత్రలైన ఖరదూషణల బోధించు ఖరదూషణ శబ్దములును శివపరముగా ప్రయోగింపఁబడినవి. ఈ శ్లోకమున అప్రధాన రామాయణపాత్రలైన విభీషణ బోధక విభీషణ శబ్దముతో పాటు భారత పాత్రమైన భీమ ధనంజయుల బోధించుభీమ శబ్దమును శివపరముగా ప్రయోగింపఁబడుచున్నవి.

**శ్లో॥ పాదాక్రాన్తవిభీషణం రణముఖే సద్రత్నసింహాసనా–**
**రూఢం భీమధనుఃప్రభఞ్జనవరశ్రీకీర్తిమాలాధరమ్।**
**కున్దానన్దనమన్దహాసమతులం శ్రీరామచన్ద్రం సదా**
**నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే॥ 72**

**ప్రతిపదార్థము :–** రణముఖే = యుద్ధరంగమున, పాదాక్రాన్త విభీషణమ్ = పాదాక్రాన్తులకు భయంకరుడు కాని లేక పాదాక్రాన్తుడైన విభీషణుడు కల, సద్రత్న సింహాసనారూఢమ్ = మంచి రత్నములుగల సింహాసనము నధిరోహించిన, భీమధనుః ప్రభఞ్జన వరశ్రీకీర్తి మాలాధరమ్ = భయంకర ధనువును విఱచిన గొప్ప శక్తిమాలను / శివధనువును భంజించిన వరశ్రీతో పాటు కీర్తిమాలను ధరించిన, కున్దానన్దన మన్దహాసమ్ = మల్లెమొగ్గలవలె ఆనందింపఁజేయు నవ్వుగల, అతులమ్ = సాటిలేని, శ్రీరామచన్ద్రమ్ = కాంతితో మనోహరుడైన చంద్రుడు గల/ మనోహరుడు ఆహ్లాదకరుడైన, నిత్యమ్ = శాశ్వతుడైన, మానసవాసమ్ = మానసము ఆవరణవస్త్రముగాగల,





రామాకృతిమ్ = మనోహరమైన ఆకృతిగల / పరబ్రహ్మ రామునివలె క్రియారహితుడైన, ఈశ్వరమ్ = శివుని, అహమ్ = నేను, భావయే = భావించెదను.

**తాత్పర్యము :–** యుద్ధరంగమున నమస్కరించువారి కభయంకరుడైన లేక యుద్ధ రంగమున నమస్కరించి శరణాగతు(డైన) విభీషణుడుగల, మంచి రత్నములు పొదిగిన సింహాసనము నధిరోహించిన భయంకరుడైన (అర్జునుని) ధనువును ఛేదించి ఆతనికి వరశ్రీని, కీర్తిమాలను ధరింపఁజేసిన లేక శివధనువును భంజించి శ్రేష్ఠుడైన లక్ష్మిని (సీతను) కీర్తి (సీతవేసిన) మాలను ధరించిన మొల్లమొగ్గలవలె ఆనందమును కలిగించు నవ్వుగల సాటిలేని కాంతితో మనోహరుడైన చంద్రుడు (శిరమున)గల కాంతి మనోహరుడైన చంద్రునివలె ఆహ్లాదకరుడైన మానసావరణముగల ప్రభువైన (పరబ్రహ్మ) రామునివలె క్రియారహితుడైన శివుని భావించెదను.

**వివరణ :–** శివుడు కొందఱు రాక్షసులను యుద్ధమున చంపినట్లు పురాణ కథలున్నవి. ఆ శివునిచేత ఆ రాక్షసులు చావదలచుకున్నారేమో యుద్ధారంభమున చావునకు భయపడి కాని మరొక కారణము పురస్కరించుకొని కాని శరణాగతులైన రాక్షసుల వృత్తాంతము పురాణములలో నా దృష్టికిరాలేదు. కాని అట్లు వచ్చినచో వారికభయ మొసగుటకు రామునివలె శివుడును వెనుదీయడని 'రణముఖే పాదాక్రాన్త విభీషణమ్' అను విశేషణము బోధించును. శ్రీరాముడు యుద్ధారంభమున విభీషణునకు లంకారాజ్యమొసగి నందున శ్రీరామునకా విశేషణ మెట్లును వర్తించును.

ఆ సమయమున రావణుడు శరణుజొచ్చిన ఏమి చేయుదురను ప్రశ్నమునకు అయోధ్యారాజ్యము నిచ్చెదనని చెప్పెను. పాదాక్రాన్తాభయప్రదానమున శ్రీరాముని సంసిద్ధత అట్టిది. అట్టిదే శివునందును కలదు. పాశుపతాస్త్రమును కోరి శివునకై అర్జునుడు తప మొనరించు సమయమున శివుడు అర్జునుని పరాక్రమమును పరీక్షింపఁగోరి ఆతనితో యుద్ధమును చేయుచుండగా అర్జునుడు ధనుర్విహీనుడయ్యెను. అర్జునుని గాండీవ ధనువు భయంకరమైనది గావున అది భీమము. అట్టి భీమమైన ధనువును భంజించినను అర్జునుడు భయపడక, పరాక్రమము వీడక శివునితో మల్లయుద్ధ మొనరించెను. అర్జునుని పరాక్రమమునకు మెచ్చి వరముగా పాశుపతాస్త్రమును నొసగెను. ఆ వరమే వరశ్రీ. దానివలన అర్జునునకు ముక్కంటిని గెలిచిన జోదు అను కీర్తిమాల లభించెను. అట్టి వరమును కీర్తులమాలను అర్జునునకు ధరింపజేసినందున శివునకును భీమధనుః ప్రభంజన వరశ్రీ కీర్తిమాలాధరమ్ అను విశేషణము చెల్లును. శివుడును శ్రేష్ఠశోభను అర్జుననునుగ్రహించినాఁడను కీర్తిమాలను ధరించెను. శ్రీరాముడు శివధనువును విఱచి

వరశ్రీని అనగా సీతకు భర్తగా వరింపఁబడు శ్రీని పొందెను. అంతేకాదు ఇతర వీరులెవ్వరును విఱువలేని శివధనువును విఱిచినాడన్న కీర్తి మాలను ధరించెను.

శివరాము లిరువురు మొల్లమొగ్గలవలె ఆనందింపఁజేయు నవ్వుగల వారను అర్థమును 'కున్దానన్దన మన్దహాసమ్' అను విశేషణముతో విశేషింపఁబడుటకు ఇరువురు సాటిలేనివారే. 'నతత్సమః' అను సూక్తి ననుసరించి అతులమ్ అను విశేషణముచే విశేషింపఁబడుటకును తగియున్నారు. కాంతితో మనోహరుడైన చన్ద్రుడు (శిరమున) కలవాడగుటచే శివుడు శ్రీరామచన్ద్రుడు. శ్రీరాముడు చన్ద్రునివలె సర్వజనాహ్లాదకుడు. కావున అతనికి శ్రీరామచన్ద్రుడను ప్రసిద్ధి యేర్పడియున్నది.

ఒక విధముగా ఈ శ్లోకముతో ముగిసిన ఎనిమిది శ్లోకములు రామాకృతీశ్వరాష్టక మని పిలువఁబడఁదగినవి. అన్ని శ్లోకములందును **"నిత్యమ్మానసవాసమీశ్వరమహం రామాకృతిం భావయే"** అను పాదము అన్ని శ్లోకములలోను చతుర్థ పాదముగా నుండుటచే మకుటము అని చెప్పఁదగినదిగా నున్నది. అన్నియు శార్దూలవిక్రీడిత వృత్తములే.

అన్నింటియందును శబ్దశ్లేషము, అర్థశ్లేషము నుండుటచే శ్లేషాలంకారమున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకాష్టకమున రామునికి శివునకు శ్లేషద్వారమున అభేదము చెప్పబడినది. ఈ శ్లోకమున చంద్రునితో అభేదము ఆ విధముగానే చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ధరాధరసుతానాథ – శ్చన్ద్రమాశ్చ శుచిస్సదా।**
**ప్రభాసతేఽ మృతకరః– పరమానన్దదాయకః॥ 73**

**ప్రతిపదార్థము :–** ధరాధరసుతానాథః = పర్వత పుత్రికయైన ఉమకు నాథుడు, చన్ద్రమాః చ = చన్ద్రుడును, సదా = ఎల్లప్పుడు, శుచిః = పవిత్రులు, అమృతకరః = మోక్షమును కలిగించు లేక అమృతకిరణములందు గలవాడు, పరమానందదాయకః= పరమానన్దము నిచ్చువాడునై, ప్రభాసతే = మిక్కిలి ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :–** పర్వతపుత్రికయైన ఉమకు నాథుడును, చన్ద్రుడును ఎల్లప్పుడు పవిత్రులుగా శుభ్రముగా తెల్లగా నుందురు. చన్ద్రుడమృతమును కిరణముల ద్వారా వెదజల్లుచుండును. శివుడు అమృతమును నామాన్తరము గల మోక్షమును కలిగించును. చన్ద్రుడధికమైన ఆనన్దము నొసగును. శివుడు సర్వోత్కృష్టమైన ఆనన్దము నొసగును. ఈ శివ చన్ద్రులిరువురును ఒకవిధముగా లేక ఒక్కరే అన్నట్లు ప్రకాశించుచున్నారు.

**వివరణ :–** పార్వతి తపమునకు బయలు దేరుచున్నప్పుడు తల్లి ఉ = ఓ అమ్మాయీ, మా = (తపమునకు వెళ్ళ)వద్దు అని చెప్పబడుటచే ఆమెకు ఉమయని పేరు కలిగినది.





ఆ ఉమకు నాథుడు శివుడు. చన్ద్రునకును సోమ అను నామమున్నది. ఆయనకు అధిదేవతగా ఉమ గ్రహారాధన ప్రకరణమున పేర్కొనఁబడినది. కావున కొంచెము పరోక్షముగ ధరా ధరసుతానాథ శబ్దము చన్ద్రుని కూడ బోధించును. అట్లే ఆహ్లాదార్థమైన చ ధాతువునుండి క్రీడార్థక 'రమ్' అను ధాతువునుండి ఏర్పడిన చన్ద్రమః శబ్దము శివుని కూడ బోధించును. కాని విశేష్యములు శ్లిష్టములు కాకపోయినను శ్లేషాలంకారము నంగీకరింపవచ్చును. శ్లోకములోని చకారము సముచ్చయార్థకము కాక పాద పూరణార్థకముగా భావించినచో ఈ శ్లోకమున వ్యస్త రూపకాలంకారమును చెప్పఁ వచ్చును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున వలె ఈ శ్లోకమున విశేష్యశ్లేషలేని విశేషణ శ్లేషము చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ పరిశుద్ధామృతమయీ– శీతలా శిరసి స్థితా।**
**శఙ్కరం స్వర్ణదీ చన్ద్ర – కలా చాలఙ్కరోత్వలమ్॥ 74**

**ప్రతిపదార్థము :–** పరిశుద్ధా = మిక్కిలి పవిత్రమైన, అమృతమయీ = అమృత లేక జలము ప్రచురముగాగల, శీతలా = చల్లని, శిరసి = శిరమునందు, స్థితా = ఉన్నట్టి, స్వర్ణదీ = గంగ, చన్ద్రకలా చ = చన్ద్రునకు సంబంధించిన కలయు, అలమ్ = పూర్తిగా, శఙ్కరమ్ = శివుని, అలంకరోతు = అలంకరించుగాక!

**తాత్పర్యము :–** పరిశుద్ధమైన, అమృత (జల) ప్రాచుర్యముగల, చల్లని శిరము నందున్నట్టి, గంగయు, చన్ద్రకలయు శివుని బాగుగా అలంకరించుగాక!

**వివరణ :–** శివుని శిరమున వెనుక భాగమున గంగ, ముందు భాగమున చన్ద్రకలయు నున్నవి. అవి రెండును శివ శిరోలంకారములు అనుట ప్రసిద్ధము. చన్ద్రుని పదారవ కలకు అమృత అని పేరు అని అమృతమ్ ఆత్మనః (ఆత్మరూపుడైన శివునియొక్క) కలామ్ అని భవభూతి మహాకవి చెప్పినాడు. ఆ అమృత కలయే వాణి అని చెప్పినాడు. కాలిదాసు రఘువంశ మహాకావ్యమంగళాచరణమున పార్వతి వాణీరూపిణి అనియే చెప్పినాడు. ఉమావాణుల యైక్యమిట్లు సిద్ధించును. ఈ ఉమయే అమృతనామకమైన చన్ద్రకల. అది కలవాడగుటచే శివుడు చన్ద్రుడను, సోమ నామకులై ఉన్నారు. ఉమ (చన్ద్రకల)తో పాటు ఆకాశగంగయు శివుని శిరముననే ఉండును. ఆ యిరువురును ఈ శ్లోకమున అమృతమయిత్వ పరిశుద్ధత్వ ఏకాదేశ (శివశిర) స్థితత్వ శీతలతల చేతను అబేధమును పొందియున్నారు. గౌరి, వాణి, చన్ద్రకల ఈ త్రయము శ్వేతవర్ణము

శ్వేతవర్ణుడైన శివుని యందైక్యమును పొందిన దృశ్యము ఈ రెండు అనుష్టుప్ శ్లోకములలో దర్శింపఁజేయఁబడినది.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకములలో ఆకాశగంగా చన్ద్రకలా పార్వతులు తనలో నేకముగా నున్న శివు మహిమ వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున ఆ శివుని ఈ మహిమను చూచి బ్రహ్మవిష్ణింద్రత్రయము సిగ్గుపడుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సమ్ప్రేక్ష్య లజ్జితాః శమ్భో – ర్మహిమానమ్మహోన్నతమ్।**
**సమ్ప్రాప్తముఖవైవర్ణ్యా – బ్రహ్మవిష్ణుపురన్దరాః॥ 75**

**ప్రతిపదార్థము :–** శమ్భోః = శివునియొక్క, మహోన్నతమ్ = మిక్కిలి గొప్పనైన, మహిమానమ్ = మహిమను, సమ్ప్రేక్ష్య = చూచి, లజ్జితాః = సిగ్గిలిన, బ్రహ్మవిష్ణు పురన్దరాః = బ్రహ్మ విష్ణువు, ఇంద్రులు, సమ్ప్రాప్త ముఖవైవర్ణ్యాః = ముఖములందు వైవర్ణ్యమును పొందినవారై (యున్నారు).

**తాత్పర్యము :–** శివునియొక్క మహోన్నత మహిమను చూచి బ్రహ్మ విష్ణింద్రులు సిగ్గుతో పాలిపోయిన ముఖములు కలవారై యున్నారు.

**వివరణ :–** సిగ్గు అను భావము ఉద్రిక్తమైనప్పుడు నెత్తురు చుక్క లేని ముఖములలో వైవర్ణ్యము (పాలిపోవుట) ఏర్పడు చుండును. తెల్లని శివుని చూచి తెల్లని ఇంద్రుడు, ఎఱ్ఱని బ్రహ్మ, నల్లని విష్ణువును తెల్లఁబడి శివైక్యము చెందినట్లున్న దృశ్యమీ శ్లోకమున వ్యంగ్యమగును. ఈ శ్లోకమున తుల్యయోగితాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున బ్రహ్మవిష్ణింద్రులు తెల్లఁబడుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని తెల్లనికాంతి తన మనసున నుండుట కవిచేత అర్థింపఁబడుచున్నది.

**శ్లో॥ ఉత్ఫుల్లమల్లీకుసుమ – నికురుమ్బప్రభాయుతా।**
**మూర్తిర్మమ మనస్యష్ట – మూర్తేస్తిష్ఠతు సామ్ప్రతమ్॥ 76**

**ప్రతిపదార్థము :–** ఉత్ఫుల్ల మల్లీ కుసుమ నికురుమ్బ ప్రభాయుతా = వికసించిన మల్లెపూల సమూహముయొక్క కాంతితో కూడిన, అష్టమూర్తేః = శివునియొక్క, మూర్తిః = ఆకృతి, మమ =నాయొక్క, మనసి = మనసునందు, సామ్ప్రతమ్ = ఇప్పుడు, తిష్ఠతు = నిలచి ఉండుగాక!



**తాత్పర్యము :–** వికసించిన మల్లెపూల గుంపువలె తెల్లనైన కాంతితో కూడిన శివుని మూర్తి ఇప్పుడు నా మనసునందు నిలచియుండుగాక!

**వివరణ :–** శివుని కెనిమిది (పంచభూతములు, సూర్యచంద్రులు, యజ్వ మూర్తులున్నవి. వానిలో తెల్లనిమూర్తి చన్ద్రమూర్తి, జలమూర్తియు తెల్లనిదే. కాని చన్ద్రునంత తెల్లని మూర్తి జలమూర్తి కాదు. కావున పూర్వశ్లోకమున వాచ్యమైన శివుని చన్ద్రమూర్తి ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది. పూర్వార్ధమున మల్లెపూల గుంపుతో పోలిక చెప్పఁ బడుటచే నీ శ్లోకమున లుప్తోపమాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివమూర్తి వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున శివమాహాత్మ్యము కథనీయత చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ప్రవదన్తి వృథా కథా స్సదా – శివ మాహాత్మ్యమపాస్య యే జనాః।**
**అమృతం ప్రవిహాయ జిహ్వయా – భువనే మూత్రజలమ్ పిబన్తి తే॥77**

**ప్రతిపదార్థము :–** యే = ఏ, జనాః = జనులు, శివమాహాత్మ్యమ్ = శివుని మహాత్మ్యమును, అపాస్య =విడచి, వృథా = వ్యర్థములైన, కథా = కథలను, సదా = ఎల్లప్పుడు, ప్రవదన్తి = చెప్పుదురో, తే = వారు, భువనే = లోకమునందు, జిహ్వయా = నాలుకచేత, అమృతమ్ = అమృతమును, ప్రవిహాయ = వదలి, మూత్రజలమ్ = మూత్రజలమును త్రాగుచున్నారు.

**వివరణ :–** ఈ శ్లోకమున యత్తదారబ్ధ వాక్యమున అర్థముల రూపణము లుండుటచే నిదర్శనాలంకార మేర్పడియున్నది. మూత్రశబ్ద ప్రయోగముచే నిందు జుగుప్సా హేతుకమైన అశ్లీలమను కావ్యదోషమున్నది. అది శివభక్త్యుద్రేకహేతుకమగుటచే అదోషమని చెప్పవచ్చును. ఈ శ్లోకమున బేసిపాదమున స–స–జ–గ, సరిపాదమున స–భ–ర–ల–గ అను గణములున్నవి. ఇది అర్ధసమము. దీనిపేరు వృత్తరత్నాకరమున పేర్కొనఁబడలేదు.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ మాహాత్మ్య కథేతర కథల వైయర్థ్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివభక్తిలేనివారికి చిన్తామణి కామధేను కల్పవృక్షముల ఉనికియొక్క వైయర్థ్యము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సత్యాం సధర్మాదిసమస్తకామ – ప్రధానశక్తౌ పరమేశభక్తౌ।**
**వృథైవ చిన్తామణికామధేను – సురద్రుమాణాం భువనే ప్రతిష్ఠాః॥ 78**

**ప్రతిపదార్థము :–** సధర్మాది సమస్త కామ ప్రధానశక్తౌ = ధర్మము మొదలైన సర్వవాంఛల నొసగుశక్తికల, పరమేశ భక్తౌ = పరమేశ్వరని యందలి భక్తి, సత్యామ్ = ఉండగా, భువనే = లోకమున, చిన్తామణి కామధేను సురద్రుమాణామ్ = చిన్తామణి, కామధేను, కల్పవృక్షములయొక్క, ప్రతిష్ఠాః = ఉనుకులు, వృథైవ = వ్యర్థమే.

**తాత్పర్యము :–** ధర్మాది సమస్త కామముల నొసగు శక్తిగల పరమేశ్వర భక్తి ఉండగా ఈ లోకమున కామధేనువుగాని, చిన్తామణిగాని, కల్పవృక్షముగాని ఉండుట ఎందులకు?

**వివరణ :–** ఇంద్రుని కడ కోరికలనిచ్చు చిన్తామణి కామధేను కల్పవృక్షములున్నవి. అవి మోక్షేతరములైన అశాశ్వత సుఖములను, కామములను ఈయగలవే కాని శాశ్వత మోక్షసుఖము నొసగఁజాలవు. పరమేశ్వరభక్తి మాత్రము ఇవి ఇచ్చు అశాశ్వత సుఖరూప కామములను మోక్షము అనఁబడు శాశ్వతసుఖరూప కామమును ఒసఁగ గలదు. అని ప్రథమపాదమందలి సమస్తశబ్దము బోధించును. ధర్మము, అర్థము, కామము, మోక్షము అను నాలుగు పురుషార్థములని వ్యవహరింపఁబడును. పురుషార్థశబ్దమందలి అర్థశబ్దము అర్థింపఁబడునది అను వ్యుత్పత్తి ననుసరించి కామింపఁబడినది అను వ్యుత్పత్త్యర్థముగల కామ శబ్దమునకు పర్యాయమే అనఁదగును. రెండు పదములకును కోరఁబడునది అను ఒకే అర్థము గలదుకదా! అందుచేత ప్రథమపాదము చివఱనున్న కామశబ్ద కోరిక అను సామాన్యమైన అర్థము గలదిగా భావింపఁబడ దగినదే గాని తృతీయ పురుషార్థమైన పురుష స్త్రీ పరస్పర వాంఛ అను అర్థము కలదికాదు. ఆ కామ శబ్దము సామాన్య వాంఛార్థకము అయినందున అది మోక్షవాంఛను గూడ తనలో కలుపుకొని యున్నది. శాశ్వతాశాశ్వత కామసుఖములను కలుపుకొన్నప్పుడే దానికి గల సమస్త అను విశేషణము ఉచితమగును. పురుషార్థములని పేరున్నను ధర్మార్థకామ మోక్షములకన్న సుఖమే సర్వులచే కామింపఁబడును. అర్థింపఁబడును. కావున అదియే ప్రధానముగ పురుషార్థ శబ్దముచే గాని, అర్థశబ్దముచే గాని, కామ శబ్దముచే గాని, ప్రధానముగా వాచ్యమగును. కావున సుఖమే కామము. అర్థము. పురుషార్థము అని చెప్పఁదగినది. కామేశ్వరభక్తి శాశ్వతమైన మోక్షసుఖమును లేక మోక్ష కామమును ఇచ్చు శక్తిగలదై ఒకనిలో నున్నప్పుడు వానికి చిన్తామణి, కామధేను పురద్రుమములతో పనిలేదు. అవి వ్యర్థములే అవి ఉపమేయమని చెప్పఁదగిన భక్తికి ఉపమానములని చెప్పఁదగిన కామధేను చిన్తామణి సురద్రుమముల వైయర్థ్యము శ్లోకమున చెప్పఁబడినందున ఉపమాన తిరస్కారము ప్రధానముగ వ్యక్తమగుచున్నందున ప్రతీపాలంకార మేర్పడియున్నది. కామధేను చిన్తామణి సురద్రుమములను ఉపమానములందును వైయర్థ్యము అను ధర్మము తుల్యముగా





నున్నందున ఈ శ్లోకమున తుల్యయోగితాలంకార మేర్పడినదనియు చెప్పవచ్చును. చిన్తామణి, కామధేను, సురద్రుమములు శివభక్తి యున్నప్పుడు వ్యర్థములను శ్లోకార్థము వివరింపఁబడినది. ఇది కాక చిన్తామణి కామధేను సురద్రుమములు అశాశ్వతసుఖ రూపకామములనే యొసగుటచే చిన్తామణి ఉన్నప్పుడు కామధేను సురద్రుమముల వైయర్థ్యము, కామధేనువున్నప్పుడు చిన్తామణి సురద్రుమముల వైయర్థ్యము, సురద్రుమమున్నప్పుడు చిన్తామణి కామధేనువుల వైయర్థ్యము, ఈ శ్లోకమున వ్యంగ్యము అగుచున్నది. ఇదిగాక సురద్రుమములన్నియు అశాశ్వత సుఖరూప కామ ప్రధాన సమర్థములగుటచే ఒక సురద్రుమము పారిజాతమో, సంతానమో, మందారమో, మరొకటో ఉన్నప్పుడు మిగిలిన సురద్రుమముల వైయర్థ్యము కూడ వ్యంగ్యమగుచున్నది. అదిగాక ఇవి స్వాధీనములుగా గల ఇంద్రునకే దేవాధిపతిత్వ హేతువైన పై అశాశ్వత సుఖరూప కామ ప్రధాన శక్తి కూడ అవి ఇంద్రుని దగ్గర ఉండుట కూడ వ్యర్థమే అను అర్థాంతరము కూడ ఇట వ్యంగ్యమగుచున్నది. ఇదంతయు వైయర్థ్యపరంపర. ఇది శివభక్తి ప్రాధాన్యమును ఆవశ్యకతను వ్యంజించుటకు హేతువగుచున్నది. ప్రథమ పాదమున సకారావృత్తి రూప వృత్త్యనుప్రాసాలంకారమున్నది. ద్వితీయపాదమున 1–6 వర్ణముల (దాక్షిణాత్యులకిష్టమైన) వర్ణమైత్రి ఉన్నది.

ఈ శ్లోకము మొదటిపాదమున ఇంద్రవజ్రా లక్షణము మిగిలిన మూడు పాదములలో ఉపేన్ద్రవజ్రా లక్షణముండుటచే ఉపజాతి ఛ్ఛందమునకు చెందినది.

---

**అవతారిక :–** పై శ్లోకమున చిన్తామణి తిరస్కారము వ్యంజింపఁబడినది. ఈ శ్లోకమున శివ చూడామణియైన చన్ద్రుని తిరస్కారము వ్యంజింపఁబడుచున్నది.

**శ్లో॥ శఙ్కరస్య శరీరేణ – సామ్యం ప్రాప్తుం సుధాకరః।**
**అసమర్థస్సేవతే తం – భూత్వా చూడామణిః సదా॥ 79**

**ప్రతిపదార్థము :–** శఙ్కరస్య = శివునియొక్క, శరీరేణ = శరీరముతో, సామ్యమ్ = పోలికను, ప్రాప్తుమ్ = పొందుటకు, అసమర్థః = సమర్థుడు కాని, సుధాకరః = చన్ద్రుడు, చూడామణిః = కేశపాశమందలి చూడామణియై, సదా = ఎల్లప్పుడు, తమ్ = అతనిని, సేవతే = సేవించుచున్నాడు.

**తాత్పర్యము :–** శివుని శరీరముతోడి పోలికను పొందుటకు అసమర్థుడైన చన్ద్రుడు కేశపాశమందలి మణియై అతని నెల్లప్పుడు సేవించుచున్నాడు.

**వివరణ :–** శివుని శరీరము తెల్లనిది. అంతటి తెలుపు మరెక్కడను కానరాదు. అంతటి తెలుపును పొందుటకును చన్ద్రుడమృతము నొంటికి, చేతులకు పూసుకొని సుధాకరు డైనాడు. శివుని కణ్ఠమున విషమున్నది. తత్కారణమై నలుపును ఉన్నది. అయినను భువన భయ భఙ్గి వ్యసనియై తెచ్చుకొన్న ఆ నలుపు ఆయనకు కలఙ్కము కాలేదు. కలఙ్కియైన చన్ద్రుడు శివునితో తెల్లదనమున పోటీపడలేక ఓడి అతనిని సేవించుటకు పూనుకున్నాడు. ఆ సేవించువారు పాదములపైఁబడుదురు. చన్ద్రుడును తన శరీరము యొక్క ధావల్యముతో నాధావల్యమును సమమైన దానినిగా చేయుటకు, పాలసముద్రము యొక్క గర్భమునుండి పుట్టిన నేను తిరిగి తద్గర్భమునుఁజేరి నా చేతులతో అందలి అమృతమును ఒంటికి పూసుకున్నాను. దాచికొన్నాను. ఎంత దాచుకున్నాననగా ఇతరుల కవసరమైనచో ఈయగలిగినంత దాచుకొన్నాను. దేవతల కమృతపు విందునే చేయుచున్నాను. ఏమి చేసిన ఏమి ఫలము! నా తెల్లదనము నీ తెల్లదనముతో పోలికను పొందలేకపోయినది. అసలు అట్లు యత్నించుటయే నేరమని ఇప్పుడే తెలిసినది. అని పాదములపై పడవలెను. కాని అలంకారరూపమున కేశపాశమునుఁజేరి సేవించు చున్నాననుకొన్నను పాదముల పట్టుకొని కాక జుట్టున కట్టుకొని సేవించుట నాకు దోషమునే కలిగించినది. అందుకే నా ప్రయత్నము ఫలింపలేదు. జ్ఞానములేక ఆ కేశపాశముననే నిలిచి ఇప్పటికిని చన్ద్రుడు సేవించుచున్నాడు అను చన్ద్ర హృదయము వ్యంగ్యమగును. ఉపమాన చన్ద్రుని తిరస్కార మీ శ్లోకమున నుండుటచే ప్రతీపాలంకార మేర్పడియున్నది. అనుట అలంకార దృష్టి ప్రదర్శనమాత్రమే. శివుడే సర్వోత్కృష్ట సర్వగుణములతో ఉపమానము కాదగియుండగా చన్ద్ర తిరస్కార ముపమాన తిరస్కార మెట్లగును? ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. శకారము యొక్క ద్వివారావృత్తి, సకారముయొక్క బహురావృత్తి వృత్త్యనుప్రాసాలంకృతి నీ శ్లోకమున నేర్పఱచుచున్నవి.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివ శరీరమందలి శఙ్కరసమ్మత భాసితాతి ధావల్యము ప్రశంసింపఁబడినది. ఈ శ్లోకమున భసిత సహచర రుద్రాక్షధారణము ప్రశంసింపఁ బడుచున్నది.

**శ్లో॥ స్వాఙ్గేషు మస్తప్రముఖేషు నిత్యం – యే పూరుషాః శఙ్కరసమ్మతాని।**
**బధ్నన్తి రుద్రాక్ష విభూషణాని – ప్రారబ్ధబన్ధా న భవన్త్యమీషామ్॥ 80**

**ప్రతిపదార్థము :–** యే = ఏ, పూరుషాః = పురుషులు, మస్తప్రముఖేషు = శిరము మొదలైన, స్వాఙ్గేషు = తమ అవయవములందు, శఙ్కర సమ్మతాని = శఙ్కరున కిష్టములైన,





రుద్రాక్ష విభూషణాని = రుద్రాక్షాభరణములను, బధ్నన్తి = బంధించు కొందురో, అమీషామ్ = వీరికి, ప్రారబ్ధబన్ధాః = ప్రారబ్ధకర్మ బన్ధములు, న భవన్తి = ఉండవు.

**తాత్పర్యము :–** ఏ పురుషులు తల మొదలగు తమ అవయవములందు శివ సమ్మతములైన రుద్రాక్షాభరణములు బన్ధించుకొందురో వారిని ప్రారబ్ధ కర్మలు బన్ధింపవు.

**వివరణ :–** శైవులు శిరసు మొదలుకొని ఉరోహస్తముల వఱకున్న శిఖ ఫాలము చెవులు కంఠము మొదలగు అవయవములలో రుద్రాక్షలు ధరించెదరు. అనగా అవయవములకు రుద్రాక్షల బంధించెదరు. రుద్రాక్షలను బంగారు, వెండి, రాగి మొదలగు తీగలతో గాని, దారముతో గాని గ్రుచ్చి మాలలుగా చేసి ఆయా అవయవములకు కట్టుకొందురు. అవి శరీరములోని అవయవములకు శోభను గూడ కలిగించుటచే వానిని భూషణములు గా కూడ భావించుట కలదు. ఆ రుద్రాక్షల మధ్య మధ్య పగడములను స్ఫటికములను కలిపియు రుద్రాక్షమాలల గ్రుచ్చెదరు. రుద్రాక్షల విభూషణత ఇంకను హెచ్చును. ఇట్టి రుద్రాక్ష విభూషణములను బంధించుకొన్న శైవులకు కైలాసప్రాప్తి నొందెదరని శైవగ్రంథములు చెప్పుచున్నవి. వానిని బంధించు కొనుటవలన ప్రారబ్ధ కర్మబంధము తొలగుట అనునది ఈ శ్లోకములోని విశేషము. సాధారణముగా బన్ధము తొలగుటకు బన్ధము హేతువు కాజాలదు. అట్లు బన్ధ విముక్తికి హేతువు కాకున్నను రుద్రాక్షబన్ధము ప్రారబ్ధకర్మ బన్ధ విముక్తికి హేతువుగా చెప్పుట వలన ఈ శ్లోకమున అతిశయోక్త్యాలంకార మేర్పడినదని చెప్పవచ్చును. ఈ శ్లోకములోని విశేషము హేతువుగాని దానిని హేతువుగా చెప్పుట మాత్రమే కాదు, బన్ధవిముక్తికి బన్ధము హేతువు అగుట అనునదే ఇందలి ముఖ్యమైన విశేషము ఇట్టి విశేషము కలచోట విచిత్రాలంకారమని చెప్పుట సరియైనదని తోచును.

2. **ప్రారబ్ధం భోగతో నశ్యేత్** అను సూక్తి ననుసరించి ప్రారబ్ధము జీవన్ముక్తుల కైనను అనుభవింపఁదగినదే. ఆ ప్రారబ్ధానుభవము జీవైశ్వరైక్యజ్ఞానము చేతను తొలగదు. ఆ జీవైశ్వర్యజ్ఞానము రుద్రాక్షబన్ధము మొదలగు శైవధర్మముల అనుష్ఠానమున చిత్తశుద్ధి ద్వారమున కలుగును. ఆ జ్ఞానముచేతనే కైవల్యము కలుగును. అట్టి జ్ఞానము కలిగిన వానికి శరీర పాత పూర్వస్థితి కలవానికి ప్రారబ్ధకర్మయొక్క ఫలము ననుభవింపక తీరదనుట సత్యమే. కాని అది ఇతరులనువలె సంచితాగామి కర్మలవలె జీవన్ముక్తుని బన్ధరాహిత్యస్థితిని తొలగించి బన్ధము కలిగించఁజాలదు. ఆ సంచితాగామి కర్మలు జీవైశ్వరైక్య జ్ఞానాగ్నిచే పూర్తిగా భస్మము అగును. కావున ప్రారబ్ధమును జీవన్ముక్తునికి శరీర పాతానంతరము జన్మజరాదిసంసారబన్ధమును కలిగింపజాలదు. ఆ సంచితాగామి

కర్మలు జీవేశ్వరైక్యజ్ఞానాగ్నిచే పూర్తిగా భస్మము అగును. కావున ప్రారబ్ధమును జీవన్ముక్తునికి శరీరపాతానంతరము జన్మజరాదిసంసారబన్ధమును కలిగింపజాలదు. ప్రారబ్ధకర్మము, ఫలానుభవానంతర మెట్లును నశించును. ఈ శ్లోకము ప్రతిపాదమన త–త–జ–గ–గ అను గణములుండుటచే ఇన్ద్రవజ్రా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివభక్తుని రుద్రాక్షధారణము జీవన్ముక్తి పరమ్పరా హేతువుగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివభక్తుని వచన శ్రవణము యముని హృదయమును భిన్న మొనర్చునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ దూరతః శివభక్తస్య – వచన శ్రవణేన చ।**
**యమస్య హృదయం భిన్నం – భవత్యత్యన్త కమ్పితమ్॥ 81**

**ప్రతిపదార్థము :–** దూరతః = దూరమునుండి, శివభక్తస్య = శివభక్తునియొక్క, వచన శ్రవణేన = మాట వినుటచేతనే, యమస్య = యమునియొక్క, హృదయమ్ = మనసు, అత్యంత కమ్పితమ్ = మిక్కిలి వణికినదై, భిన్నమ్ = విరిగినది, భవతి = అగును.

**తాత్పర్యము :–** దూరమునుండి శివభక్తుని మాట విన్నంతనే యముని హృదయము మిక్కిలి కంపించి ముక్కలగును.

**వివరణ :–** శివభక్తుడు పవిత్రుడు. ఆతని దర్శనము పుణ్యహేతువు. దర్శనము కావలెనన్న శివభక్తుని దగ్గఱకు వెళ్ళవలసి యుండును. కన్నులు విప్పి ఆతనిని చూడవలసి యుండును. అప్రయత్నముగా శివభక్తుని మాల వినఁబడినను పుణ్యము కలుగును. నిరన్తరము పాపులను భయకమ్పితుల నొనర్చు యముడు పుణ్యాత్ముల దగ్గఱకు రానేరాడు. ఎప్పుడైన ఆ యముని చెవులలో శివభక్తుని వచనము వినఁబడెనేని మార్కండేయుని బ్రోచి తనను శిక్షించిన శివుని భయంకరాకారము యముని స్మృతికి వచ్చును. వెంటనే ఆతని హృదయము మరల ఆ సంఘటనము జరుగునేమో యను భయమున మిక్కిలి కమ్పితమై ముక్కలగును. అను అర్థము ఈ శ్లోకమున వ్యంగ్యము.

అపాతముగా ఈ శ్లోకమును భావించిన వారికీ శ్లోకార్థము అత్యుక్తిగానో, అతిశయోక్తిగానో తోచవచ్చును. అట్లు తోచిన వారీ శ్లోకమున అతిశయోక్త్యాలంకార మున్నదని భావించినారు. కాని శివభక్తితత్త్వమును, శివభక్తిమహిమను లేశ మనుభవించిన వారికీ శ్లోకమున అతిశయోక్తి కన్పించదు. అత్యుక్తియు కన్పించదు. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---



**అవతారిక :–** పై శ్లోకమున శివభక్తి మహిమను చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని స్వభక్తానుగ్రహము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యః శ్రీకరం బాలమమన్త్రతన్త్రం**
**క్రీడాదరాత్ స్వం పరిపూజయన్తమ్।**
**శివః కృతార్థం కృతవాంస్తథైన**
**మయం కిమాత్మీయ ముపేక్షతే మామ్॥ 82**

**ప్రతిపదార్థము :–** యః = ఎవడు, శ్రీకరమ్ = శ్రీకరుడను నామముకల, అమన్త్ర తన్త్రమ్ = మన్త్రతన్త్రములు లేని, క్రీడాదరాత్ = ఆటయందలి ఆదరమున, స్వమ్ = తనను, పరిపూజయన్తమ్ = పూజించుచున్న, బాలమ్ = బాలుని, కృతార్థమ్ = ధన్యునిగా, కృతవాన్ = చేసినాడో, తథా = ఆవిధముగా, అయమ్ = ఈ శివుడు, ఏనమ్ = ఈ, ఆత్మీయమ్ = తనవాడనైన, మామ్ = నన్ను, కిమ్ = ఎందుకు, ఉపేక్షతే = ఉపేక్షించుచున్నాడు?

**తాత్పర్యము :–** ఏ శివుడు మన్త్ర, తన్త్రములెఱుగని, ఆటపై ఆదరమున తనను పూజించు శ్రీకరుడను బాలునెట్లు, కృతార్థునొనర్చెనో ఆవిధముగా తనవాడైన నన్ను కృతార్థు నొనర్చక ఎందు కుపేక్షించుచున్నాడు.

**వివరణ :–** శ్రీకరుడను బాలుడు తోడి బాలురతో కూడి పూజ ఆట ఆడుకొన్నాడు. భక్తి అనగానేమో, పూజ అనగానేమియో, పూజలో ఉపయోగింపఁబడు, మన్త్ర తన్త్రములేవో తెలియని బాలుడు పూజ నాటగా మాత్రమే చేసినను వానిని కృతార్థు నొనరించిన శివుడు నేను శివుని వాడను అను శివాత్మీయజ్ఞానముగల నన్నేల ఉపేక్షించుచున్నాడని కవి శివుని ప్రశ్నించుట ఈ శ్లోకములోని భావము. ఈ శ్లోకములోని పూర్వార్ధము ఇంద్రవజ్రా లక్షణ పాదములను, ఉత్తరార్ధములోని పాదము లుపేన్ద్రవజ్రా లక్షణముల గలిగియుండుటచే నిది ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున మన్త్ర తన్త్రములెఱుగుని బాలుని క్రీడామయ పూజను శివుడు స్వీకరించుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివకథాకీర్తన శ్రవణముల శివుడు స్వీకరించుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యో జనః శివకథామృతం సదా–జిహ్వయా శ్రుతియుగేన వా ముహుః।**
**వేదవేదశిరసాం గణాచ్చ్యుతం – స్వీకరోతి శివ ఏవ స ధ్రువమ్॥ 83**

**ప్రతిపదార్థము :–** వేద వేదశిరసామ్ = వేద వేదాంతములయొక్క, గణాత్ = గుంపునుండి, యః = ఏ, జనః = జనుడు, చ్యుతమ్ = జారిన, శివకథామృతమ్ = శివకథయనెడి

అమృతమును, జిహ్వయా వా = నాలుకతో గాని, శ్రుతియుగేన వా = చెవుల జంటతో గాని, సదా = ఎల్లప్పుడు, ముహుః = మాటిమాటికి, స్వీకరోతి = స్వీకరించునో, సః = అతడు, ధ్రువమ్ = నిశ్చయముగా, శివ ఏవ = శివుడే.

**తాత్పర్యము :–** వేదవేదాంతములనుండి లౌకిక వాఙ్మయమున జారిపడిన శివకథామృతమును నాలుకతో గాని, చెవులతో గాని, ఎవడు స్వీకరించునో ఆతడు నిశ్చయముగా శివుడనియే చెప్పఁదగును.

**వివరణ :–** శివ కథయందు అమృతత్వారోపమున్నందున ఈ సమాసమున రూపకాలంకారమున్నది. ఈ కథామృతమును చెవులతో స్వీకరించుట అనగా వినుట, నాలుకతో స్వీకరించుట అనగా కీర్తించుట. ఈ రెండు ఇంద్రియముల కర్మల వలన సంతోషము మనస్సునందే కలుగును. ఈ కర్మల వలన సంతోషము విషయానందకరమే. అయినను ఈ కర్మలవలన మనసులోని పాపక్షయము సంభవించును. అప్పుడా మనస్సు శివాభేద జ్ఞానమును పొందుట కర్హమగును. ఆ జ్ఞానము కలిగిన వెంటనే ఆ భక్తుడు జీవన్ముక్తుడగును. దేహ పాతానంతరము శివునియందే కైవల్యము నందును, అందుచే ఈ శ్లోకమున శివాభేదమును సాధకుడు పొందుటకు పరంపరా హేతువులైన శివకథా శ్రవణకీర్తనల ప్రాధాన్యము చెప్పఁబడినది. సంస్కృతాది వాఙ్మయమునందలి శివకథకు మూలము వేద వేదాంతములలోనే ఉన్నది. వాని నధ్యయనము చేసినవారి నోళ్ళలో నుండి పరంపరగా అన్ని వాఙ్మయములందు విస్తరించి నేటి భక్తుల చెవులలోనికి చేరి మరల నాలుక నుండి కీర్తన రూపమున మరొకరి చెవులకు విస్తరించుచున్నది. రాబోవు కాలము నందున ఇట్లు జరుగునవకాశమున్నది. వేదవేదాంతములు సముద్రముల వంటివి. వానిని మంథిచిన వేదవేదాంతవేత్తలు శివకథామృతమును వెలువరించి త్రాగినంత త్రావి లోకుల చెవులలోనికి తమ నాలుక ద్వారమున చొప్పించినారు. దాని పరిణామముగా లోకమున శివకథా వ్యాప్తి జరిగినది. తత్ఫలితముగా భక్తుల కెందఱకో శివత్వము సిద్ధించినది. ప్రతిపాదమున ర–న–ర–ల–గ అను గణములుండుటచే నీ శ్లోకము రథోద్ధతా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–**పై శ్లోకమున శివ కీర్తన శ్రవణముల ప్రభావము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివపఞ్చాక్షరీ మన్త్రప్రభావము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యదోపదిష్టా శ్రవణే శివస్య – పఞ్చాక్షరీ గర్గమునీశ్వరేణ।**
**నిర్యాయ భూపస్య తథైవ గాత్రాత్–కాకాత్మనా పాపచయః ప్రదగ్ధః॥ 84**



**ప్రతిపదార్థము :–** యదా = ఎప్పుడు, భూపస్య = రాజుయొక్క, శ్రవణే = చెవియందు, గర్గమునీశ్వరేణ = గర్గమునీన్ద్రునిచేత, శివస్య = శివునియొక్క, పఞ్చాక్షరీ = పంచాక్షరీ మన్త్రము, ఉపదిష్టా = ఉపదేశింపఁబడినదో, తథైవ =అప్పుడే, గాత్రాత్ = శరీరమునుండి, కాకాత్మనా = కాకిరూపమున, పాపచయః = పాపసమూహము, నిర్యాయ = బయల్వెడలి, ప్రదగ్ధః = కాలిపోయినది.

**తాత్పర్యము :–** రాజు చెవిలో గర్గుడు అను మునీశ్వరుడు శివపంచాక్షర మన్త్ర ముపదేశించగానే ఆతని శరీరమునుండి కాకి రూపమున బయల్వెడలిన ఆతని పాపసమూహము కాలిపోయినది.

**వివరణ :–** కాక జన్మము బహుపాపఫలముగా కలుగునని పురాణములు చెప్పుచున్నవి. ఆ కారణముగా **కాకోపి జీవతి చిరాయ బలిం చ భుక్తే. పాపీ చిరాయచిరజీవ కాకః** వంటి వాక్యములు ప్రచారము లోనికి వచ్చినవి. కావున ఈ శ్లోకమున మరొక అడుగు ముందుకు వేసిన కవి పాపమే కాక రూపమున రాజుయొక్క పాప సమూహమే ఆతని శరీరమునుండి బయల్వెడలి కాలిపోయినదని చెప్పినాడు. పాపము నల్లనిదని భారతీయ సంప్రదాయమున భావింపబడును. కాకవర్ణము కూడ నలుపే కావున కాకము పాప సమూహముగా పురాణకథలో పేర్కొనబడుటలో ఔచిత్యమున్నదేమో! ఆ పురాణ కథనే కవి ఈ శ్లోకమున ప్రస్తావించినాడు.

శివుడు తనను పొందుటకు సాధన భూతమైన **'నమఃశివాయ'** అను పంచాక్షరీ మంత్రప్రభావమున లోకమునకు ప్రత్యక్షముగా చూపించదలచి ఈ కథను నడిపించి యుండవచ్చును. గర్గు డొకరాజు చెవులలోనికి శివపఞ్చాక్షరీ మన్త్రమును జొనిపినంతనే అనగా నుచ్చరించిన తోడనే ఆ రాజు శరీరమునుండి కాకి రూపమున పాపసమూహము బయటకువచ్చి కాలిపోయినది అను కథ ఉపదేశ మాత్రముననే పాపసమూహమును దహించగల శివ పఞ్చాక్షరీ మంత్రము జపింపఁబడినచో కలుగఁబోవు ఫలము ఇంకను గొప్పది. బహుశః కైలాసప్రాప్తి వంటిది. త్రయి అనగా మూడు వేదములలో యజుర్వేదము మధ్యమము. అందలి మధ్యభాగము శతురుద్రీయమను నామాంతరముగల నమకము పదునొకండనువాకములు గల ఆ నమకమున ఆఱవ అనువాకమున 'నమఃశివాయ' అను వాక్యమున్నది. ఆ వాక్యమే శివపఞ్చాక్షరీ మన్త్రముగా లోకమున సుప్రసిద్ధము. ప్రాణికి హృదయ మధ్యభాగము ముఖ్యమైనట్లు వేదహృదయ మీ మంత్రమని శైవ సంప్రదాయ జ్ఞానులు చెప్పెదరు. వృత్త మిన్ద్రవజ్రా.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివపఞ్చాక్షరీ మంత్రోపదేశ ఫలము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివస్మరణ ఫలము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పురుషస్య ప్రణశ్యన్తి - మహాపాతకకోటయః।**
**వాక్పాదపద్మయుగ్మస్య - స్మరణాత్ పార్వతీపతేః॥ 85**

**ప్రతిపదార్థము :-** వాక్పాదపద్మయుగ్మస్య = శబ్దార్థములు పాదపద్మములుగాగల, పార్వతీపతేః = శివునియొక్క, స్మరణాత్ = స్మరణమువలన, పురుషస్య = పురుషునియొక్క, మహాపాతక కోటయః = కోట్లకొలది మహాపాపములు, ప్రణశ్యన్తి = నశించును.

**తాత్పర్యము :-** శబ్దార్థములు పాదపద్మములుగాగల శివుని స్మరించుట వలన మనుష్యుని మహాపాతకము కోట్లకొలది సంఖ్య కలవైనను నశించును.

**వివరణ :-** కేవల శబ్దమే వాక్కని కొందఱు చెప్పుట కలదు. కాని శబ్దార్థములు కలసియే వాక్యము అని చెప్పఁదగినది. వాక్యమునందు సాకాంక్షములైన శబ్దములు అర్థములు కలిగి యున్నప్పుడే ఆకాంక్షానివర్తకములగును. బ్రహ్మమునకు పాదములైదు అని లేక నాలుగు అని చెప్పఁబడినవి. బ్రహ్మమున సత్యజ్ఞానానందములు అను పాదత్రయము ప్రపంచాతీతముగా నున్నది. నామరూపములు లేక ప్రపంచరూపములై యున్నవి. ఈ రెండు పాదముల నొకటిగా చేసి **పాదోఽస్య విశ్వా భూతాని** అని పురుష సూక్తము చెప్పినది. శ్లోకమునందలి వాక్పాదపద్మయుగ్మస్య అను శివ విశేషణమందలి వాక్ఛబ్దము శివుని శబ్దార్థరూప పాదద్వయము పద్మమువంటిదని వ్యంజింపఁజేయుటచే ఈ శ్లోకమున ఉపమాలంకారము వ్యంగ్యముగా రూపకాలంకారము వాచ్యముగా నున్నవి. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివస్మరణ ఫలము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివపాద పూజాఫలము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యే పూజయన్తి శివపాదయుగం భవన్తి**
**తేషాం గృహేషు నవరత్నచయాస్సధాన్యాః।**
**రౌప్యం సువర్ణమమితం చ గజా హయాశ్చ**
**భవ్యామ్బరాణి చ బహుశ్రుత పుత్రపౌత్రాః॥ 86**

**ప్రతిపదార్థము :-** యే = ఎవరు, శివపాదయుగమ్ = శివునియొక్క పాదముల జంటను, పూజయన్తి = పూజించెదరో, తేషామ్ = వారియొక్క, గృహేషు = గృహములందు, సధాన్యాః = ధాన్యములతో కూడిన, నవరత్నచయాః = నవవిధరత్నములయొక్క రాసులు, అమితమ్ = అపరిమితమైన, రౌప్యమ్ = వెండి, సువర్ణమ్ = బంగారము, గజాః చ = ఏనుగులును, హయాః చ = గుఱ్ఱములను, భవ్యామ్బరాణి చ = మంచి మవ్రములును, బహుశ్రుత పుత్రపౌత్రాః = విద్వాంసులైన కొడుకులు మనుమలును, భవన్తి = ఉందురు.

**తాత్పర్యము :-** ఎవరు శివుని పాదముల జంటను పూజించెదరో వారి యిండ్లలోనే నవరత్నరాసులు, ధాన్యములు, వెండి, బంగారము, ఏనుగులు, గుఱ్ఱములు, మంచి వస్త్రములు, విద్వాంసులైన కొడుకులు మనుమలు ఉందురు.

**వివరణ :-** శివపూజయొక్క లౌకికఫలము బహువిధములైన ఐహికసంపదలని ఈ శ్లోకమున చెప్పఁబడినది. విద్వాంసులైన కొడుకులు మనుమలుందురని చెప్పుట చేత వారి ఐహికసంపదలు తరతరముల దాక పుత్రపౌత్రాదులచే అనుభవింపఁబడుచుండునని వ్యంజింపజేయఁబడినది. ఆ విద్వాంసుల విద్వత్త ఆత్మజ్ఞాత రూపమే అగునేని ఆ యింటిలోని వారికి మోక్షము అను అలౌకిక ఫలముకూడ వ్యంజితమగుచున్నది. కొందఱు కొన్ని శాస్త్రములనే ఒక గురువునుండి అధ్యయనము చేయగలరు. ఈ శ్లోకములోని బహుశ్రుత శబ్దము పెక్కుఱ నుండి సంపాదించిన బహుశాస్త్ర జ్ఞానము కలవారగుదురని బోధించును. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము ఇంద్రవంశా వృత్త నిబన్ధనము. ఈ శ్లోకమున ముఖ్యములైన అలంకార గ్రంథములలో పేర్కొనఁబడని ఉదాహరణాలంకార మున్నదని కొందఱు చెప్పినారు.

---

**అవతారిక :-** పై శ్లోకమున ప్రలయమున నశించు విష్ణువును అనుగ్రహించగల లౌకికఫలము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ప్రలయమున నశించకపోవుట వలన సిద్ధించుట విష్ణ్వాధిక్యము శివునందు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నీచేషు దేహేష్వగృహీతజన్మా- ముహుః పరస్త్రీష్వవిలోలచిత్తః।**
**అధేనుపాలః ప్రలయేఽప్యనాశో- విభాతి విష్ణోరధికో మహేశః॥ 87**

**ప్రతిపదార్థము :-** నీచేషు = నీచములైన, దేహేషు = దేహములందు, అగృహీత జన్మా = జన్మననుగ్రహించని, ముహుః = మాటిమాటికి, పరస్త్రీషు = పరస్త్రీలయందు, అవిలోల చిత్తః = చలించని మనసుగల, అధేనుపాలః = ఆవులను పాలించని, ప్రలయే అపి = ప్రలయమునందును, అనాశః = నాశములేని, మహేశః = శివుడు, విష్ణోః = విష్ణువునుకన్న, అధికః = అధికుడై, విభాతి = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :-** నీచదేహ జన్మముల స్వీకరింపనందుచేత, పరస్త్రీలయందు మాటిమాటికి చలించు చిత్తములేనందుచేత ఆవులను పాలింపక పోవుటచేత, ప్రలయకాలమున నాశమున లేకపోవుటచేత ఇవి కలిగిన విష్ణువున కన్న శివుని ఆధిక్యము స్పష్టముగా ప్రకాశించుచున్నది.

**వివరణ :-** నీచములైన మత్స్యకూర్మాది దేహములను విష్ణువు స్వీకరించినాడే కాని శివుడట్లు చేయలేదు. విష్ణువు కృష్ణావతారమున పరస్త్రీలైన గోపికలందు మాటిమాటికి చిత్తము చలించి వారితో రాసక్రీడాదులందు ప్రవర్తించినాడు. శివుడట్లు చేయలేదు. క్షత్రియజాతి యందు కృష్ణుడుగా జన్మించిన విష్ణువు ఆవులను మేపినాడు. ఆవులను మేపుట వైశ్యవృత్తి. ఆపద లేనప్పుడు క్షత్రియుడు వైశ్యవృత్తిని చేపట్టుట అధర్మము. శివుడట్టి అధర్మము నాచరింపలేదు. విష్ణువు శివుని వామాంగమునందు జన్మించినందున మహాప్రలయము నందవశ్యముగా మరణించవలసినవాడే. పై నాలుగు హేతువుల వలన విష్ణువుకన్న శివుడధికుడు. విష్ణువు శివునకు అల్పుడు. పై హేతువులలో నేదైనను శివునందు విష్ణ్వాధిక్యము అను సాధ్యమును సాధించగలదు. వ్యతిరేకవ్యాప్తికి ఇంద్రాదులను ఉదాహరణముగా చూపవచ్చును. కాని శ్లోకమున చూపఁబడలేదు. కేవలము హేతుగర్భములైన విశేషణములు కూర్చఁబడినవి. అయినను ఈ శ్లోకమున అనుమానాలంకార మేర్పడి యున్నదని చెప్పవచ్చును. విష్ణ్వాధిక్యములేని ఇంద్రాదులు వ్యతిరేకవ్యక్తి కుదాహరణములుగా చూపి విష్ణ్వాధిక్యమును అనుసాధ్యమును ప్రలయానాశము అను హేతువువలన సాధింపవచ్చును. ఈ అనుమానమును పదార్థానుమానముగా భావించి ఈ క్రింది న్యాయావయవముల చూపవచ్చును.

ప్రతిజ్ఞ = శివుడు విష్ణ్వధికుడు

హేతువు = ప్రలయనాశము లేనందువలన

ఉదాహరణము = ప్రలయనాశనము కలచోట విష్ణ్వాధిక్యము లేదు.

ఇంద్రాదులవలె – పై మూడు న్యాయావయవములలో ఈ శ్లోకమున ఉదాహరణ లేకున్నను ఊహించుకొను నవకాశము కలదు. ఉత్తరార్ధమున పాదాన్తానుప్రాసమున్నది. మహేశ శబ్దము విష్ణువుయొక్క అతాదృశ్యత్వమును అనగా అల్పతమత్వమును సూచించును.

2. ఈ శ్లోకమున వ్యతిరేకాలంకారమున్నదని కొందఱు చెప్పినారు. కాని శివకేశవుల కీ శ్లోకమున ఉపమాన ఉపమేయభావము లేనందున ఉపమానోపమేయములలోని ఒకదానిలోని విశేషము చెప్పు ప్రసక్తియే ఇట లేకపోవుటచే వ్యతిరేకాలంకారమనుట సరికాదు. 3. విష్ణువునకు కృష్ణావతారమున మాటిమాటికి పరస్త్రీలయందు విలోల చిత్తమున్నదనుట సరియైనదే. కాని ముహుఃశబ్దప్రయోగము శివునకు మాటిమాటికి ఇట్లు విలోల చిత్తమున్నదనుట సరియైనదే. కాని ముహుః శబ్దప్రయోగము శివునకు మాటిమాటికి అట్లు విలోలమగు చిత్తము లేదనుమాట ఒకటి రెండు సార్లైనను ఉన్నదేమో





అను అర్థాంతరము తదనుగుణముగా గంగను నెత్తికెక్కించుకొనుటను స్మరింపఁజేయుటచే శివుడు విరక్తుఁడని ప్రశంసించు కవి హృదయమునకు విరుద్ధార్థమును స్ఫురింపఁ జేయుటచే ముహుఃశబ్దప్రయోగము అనుచితమని తోచుచున్నది. అట్లే అధేను పాల శబ్దము శివుని పశుపతిత్వమునకు కించిద్భంగమును కావింపఁజేయుచున్నది. ప్రథమపాదమున ఇంద్రవజ్రాలక్షణమును మిగిలిన మూడు పాదములలో ఉపేన్ద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోకముపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున మహేశునందు విష్ణ్వాధిక్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివునకు సాష్టాంగ ప్రణామ మొనరించు వారి దురితముల పతనము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అహో మహద్భిర్దురితైరనేక – జన్మార్జితైః సాకమనేకవారమ్।**
**సాష్టాఙ్గమీశం నమతాం నరాణాం –పతన్త్యధః స్వేదలవాస్తమభ్యః॥ 88**

**ప్రతిపదార్థము :-** అహో = ఆహా!, అనేక జన్మార్జితైః = అనేక జన్మలందు సంపాదింపఁ బడిన, మహద్భిః = గొప్పనైన, దురితైఃసాకమ్ = పాపములతో బాటు, అనేక వారమ్ = పెక్కుసార్లు, ఈశమ్ = శివునికి, సాష్టాఙ్గమ్ = నమస్కరించు, నరాణామ్ = మనుష్యులయొక్క, తనుభ్యః = శరీరములనుండి, స్వేదలవాః = చెమట బిందువులు, అధః = క్రింద, పతన్తి = పడుచున్నవి.

**తాత్పర్యము :-** శివునకు సాష్టాంగనమస్కార మొనరించువారి అనేక జన్మార్జిత మహాపాపములతో పాటు వారి శరీరముల నుండి చెమట బిందువులు కూడ క్రిందఁ పడుచున్నవి.

**వివరణ :-** 1. శిరస్సు, దృష్టులు, వాక్కు, మనస్సు, చెవులు, ఱొమ్ము, చేతులు, పాదములు అను ఎనిమిది అంగములతో నమస్కరించుట **సాష్టాంగనమస్కారము** అని చెప్పఁబడును. పెక్కుమార్లు అట్లు నమస్కరించుటలో శ్రమయున్నది. దానివలన చెమట బిందువులు క్రిందపడును. అట్లు నమస్కరించుట చేత నమస్కరించువారి అనేక జన్మార్జిత మహాపాపములు కూడ క్రింది పడిపోవును అని చెమట బిందువుల పాటునకు పూర్వార్జితమహాపాపముల పతనమునకు సహభావము సాకమ్ అను శబ్దముచేత చెప్పఁ బడుటచేత ఈ శ్లోకమున సహోక్త్యలంకార మేర్పడియున్నది. 2. శరీరముతో శ్రమించినప్పుడు బాధ మనసుననే కలుగును. శరీర వ్యాధియు మనస్సునకే బాధ కలిగించును. మనస్సునకీ బాధ పూర్వార్జితపాపఫలముగా కలుగును. సాష్టాంగ నమస్కారము మాటిమాటికి చేయుట వలన శరీరమునందలి ఏడంగములకు శ్రమ

కలుగును. ఆ కారణమున చెమట బిందువుల రూపమున శరీరాంతర్గతమలము బయటకు వెడలి క్రింద పడిపోవును. అట్లే మనస్సున బాధ కలుగుట వలన పూర్వసంచిత మహాపాపములు ఈ భోగము వలనను శివునకు నమస్కరించుట అను ధర్మములయొక్క ఆచరణముననను నశించును. **ధర్మేణ పాపమపనుదతి** అను వాక్యమిట స్మరణీయము.

ఆద్యంత పాదములలో నుపేంద్రవజ్రాలక్షణము మధ్య పాదముల ఇంద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోకము ఉపజాతి చన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునకై చేయఁబడిన బహువారసాష్టాంగ నమస్కారముల యొక్క ఫలము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివాశ్రయణ ఫలము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వినా స్నానం సన్ధ్యాం జపమపి హుతం తర్పణవిధిం**
**పితౄణాం స్వాధ్యాయం నియతమపి నైమిత్తికమపి।**
**స్థితిం క్షేత్రే దానం శ్రవణమననే కారణమహో**
**శ్రితశ్రీకణ్ఠానామ్భవతి ఫలమేషాం సముదితమ్॥ 89**

**ప్రతిపదార్థము :–** స్నానమ్ = స్నానమును, సన్ధ్యామ్ = సన్ధ్యను, జపమ్ అపి = జపమును, పితౄణామ్ = పితరులయొక్క, తర్పణవిధిమ్ = తర్పణ విధానమును, స్వాధ్యాయమ్ = వేదాధ్యయనమును, నియతమ్ అపి = నిత్యకర్మను గాని, నైమిత్తికమ్ అపి = నైమిత్తికకర్మనుగాని, క్షేత్రే = క్షేత్రమున, స్థితిమ్ = ఉనికిని, దానమ్ అపి = దానమును, శ్రవణమననే = శ్రవనమననములను, అహో = ఆహా, కారణమ్ = కారణములు, వినా = లేక (విడచియే)యే, శ్రితశ్రీకణ్ఠానామ్ = శివునాశ్రయించిన, ఏషామ్ = వీరికి, సముదితమ్ = మొత్తమైన, ఫలమ్ = ఫలము, భవతి = కలుగును.

**తాత్పర్యము :–** స్నానసన్ధ్యలు, జపతర్పణములు, వేదాధ్యయనము, నిత్యనైమిత్తికకర్మలు క్షేత్రమున నివాసము, దానమును, శ్రవణమననములును, అను కారణము లేకయే వీనన్నింటి ఫలము శివునాశ్రయించు వారికి కలుగును.

**వివరణ :–** స్నానసన్ధ్యాజపతర్పణ స్వాధ్యాయములు నిత్యకర్మలు. నియతమ్ అను శబ్దము పై కర్మల నిత్యత్వమును తెలుపును. క్షేత్రము అనగా పుణ్యక్షేత్రము అచట నివాసము దానము ఇతర స్థలముల నివాస దానముల కన్న ఎంతో అధికమైన పుణ్యమును కలిగించును. అట్లే క్షేత్రశ్రాద్ధాదులు క్షేత్ర స్థితి నిమిత్తములు. కావున అవి నైమిత్తికములు. అట్లే గ్రహణకాల నిమిత్త దానములు నైమిత్తిక కర్మములు. పురాణగ్రన్థ శ్రవణమననములును తచ్ఛ్రావక విద్వదుపలబ్ధి నిమిత్తములు. కావున అవియు





నైమిత్తికములని కాని లేక అవి చేయనిచో ప్రత్యావాయము శ్రుతము కాదు. కావున స్వర్గాదికామదాయకములు కావునను అవి కామ్యములు మోక్ష హేతుకములైన వేదాంత వాక్యశ్రవణ మననములు (అనియు చెప్పవచ్చును.) వివేకులైన వారందఱకును కర్తవ్యములు. ఏమైనను ఇవి అన్నియు పాపనివర్తకములు. పుణ్యదాయకములును, వీనన్నింటి కన్న శివాశ్రయణము లేక శివప్రపదనము వీనన్నింటి ఫలమును మొత్తమును కలిగించునదని సముదిత శబ్దము తెలుపును.

స్నానసన్ధ్యాదుల ఫలము తత్కారణములైన స్నానసంధ్యాదులు లేకనే కలుగునని చెప్పఁబడుటచే నీ శ్లోకమున విభావనాలంకార మేర్పడియున్నది.

ఈ శ్లోకమున ప్రతిపాదమున య–మ–న–స–భ–ల–గ అను గణములుండుటచే నిది శిఖరిణీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివాశ్రయణ సర్వనిత్యనైమిత్తిక ఫలప్రదాన హేతువని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివపాదపద్మయుగళాశ్రయము సర్వభయనివృత్తి హేతువు అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అతితరే యమభీషణభాషణేఽ – ప్యరిషు కామముఖేషు దృఢేష్వపి।**
**భయముపైతి న కిఞ్చిదపి స్ఫురత్–పురజిదంఘ్రిసరోజయుగాశ్రితః॥ 90**

**ప్రతిపదార్థము :–** అతితరే = మిక్కిలి, యమభీషణభాషణే = యమునియొక్క భయంకరమైన భాషణము, అతితరే = ఎక్కువగా నున్నను, కామముఖేషు = కామాదులైన, దృఢేషు = దృఢులైన, అరిషు = శత్రువులున్నను, స్ఫురత్ పురజిదంఘ్రి సరోజయుగాశ్రితః = ప్రకాశించు శివపాద పద్మయుగాశ్రితుడైనవాడు, కిఞ్చిదపి = కొంచెమైనను, భయమ్ = భయమును, న ఉపైతి = పొందదు.

**తాత్పర్యము :–** యముని భయంకరమైన సంభాషణమెక్కువగానే వినఁబడుచున్నను, కామాది శత్రువులు దృఢులై తోచుచున్నను ప్రకాశించు శివపాదపద్మయుగము నాశ్రయించిన వాడు కొంచెమైనను భయము నొందదు.

**వివరణ :–** భయహేతువులై యముని భాషణము కామాది శత్రువులున్నప్పుడు భయము కలుగుకపోవుట చెప్పఁబడినందున ఈ శ్లోకమున విశేషోక్త్యలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున న–భ–భ–ర అను గణములుండుటచే నీ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివపాదముల నాశ్రయించిన వానికి భయములేదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివభక్తి లేనివాని జన్మ వ్యర్థమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పతిభక్త్యా వినా యోషిత్ – సౌన్దర్యం న విరాజతే।**
**జన్మ పుంసో వినా భక్త్యా – పార్వతీహృదయేశితుః॥ 91**

**ప్రతిపదార్థము :–** పతిభక్త్యావినా = పతిభక్తిలేక, యోషిత్సౌన్దర్యమ్ = స్త్రీయొక్క అందము, న విరాజతే = ప్రకాశించదు, పార్వతీహృదయేశితుః = శివునియొక్క, భక్త్యావినా = భక్తిలేక, పుంసః = పురుషునియొక్క, జన్మ = పుట్టుక, న విరాజతే = ప్రకాశించదు.

**తాత్పర్యము :–** పతిభక్తిలేని స్త్రీ సౌందర్యము, శివభక్తిలేని పురుషుని పుట్టుక ప్రకాశింపవు.

**వివరణ :–** అవర్ణ్యమైనది పతిభక్తిలేని స్త్రీ సౌన్దర్యమున వర్ణ్యమైన శివభక్తిలేని పురుష జన్మము వానికి విరాజిల్లకపోవుట (ప్రకాశింపలేకపోవుట) అను ధర్మైక్యము చెప్పబడినందున ఈ శ్లోకమున దీపకాలంకార మేర్పడియున్నది. రెండు పాదములందును వినా అను శబ్దము ప్రయోగింపఁబడినందున వినోక్త్యలంకారమున్నదని కొందఱు చెప్పిరి. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివభక్తిలేని జన్మ వ్యర్థమని చెప్పబడినది. ఈ శ్లోకమున శివునివలన శాన్తి కలుగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ తామసాల్లోకసంహార – హేతోరుగ్రాత్ప్రజాయతే।**
**శాన్తిర్విచిత్రం మహతీ – జగత్పాలనశాలినీ॥ 92**

**ప్రతిపదార్థము :–** తామసాత్ = తమోగుణ ప్రధానుడైన, లోకసంహారహేతోః = లోకములను సంహరించుటకు కారణమైన, ఉగ్రాత్ = శివునినుండి, జగత్పాలన శాలినీ = లోకముల కాపాడు స్వభావముగల, శాంతిః = శాంతి, ప్రజాయతే = కలుగుచున్నది, విచిత్రమ్ = వింత (కదా)!

**తాత్పర్యము :–** తమోగుణ ప్రధానుడై లోకముల సంహరించుటకు హేతువై ఉగ్రుడను పేరుగల శివుని నుండి లోకముల పాలనతో ఒప్పునట్టి శాంతి కలుగుట విచిత్రముగదా!

**వివరణ :–** ఉగ్రు నుండి విరూపమైన శాంతి కలుగునని చెప్పఁబడుటచే నీ శ్లోకమున విషమాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమునందువలె ఈ శ్లోకమునందును విరూపకార్యోత్పత్తియే చెప్పఁబడుచున్నది.



**శ్లో॥ నామామృతరసైః పుంసః – శాఙ్కరైః కర్ణసఙ్గతైః।**
**తూలవత్పరిదహ్యన్తే – పాతకాని బహూన్యపి॥ 93**

**ప్రతిపదార్థము :–** కర్ణ సంగతైః = చెవిఁజేరిన, శాఙ్కరైః = శివసంబంధములైన, నామామృతరసైః = నామామృత రసములచేత, బహూని + అపి = పెక్కులైనను, పాతకాని = పాపములు, తూలవత్ = దూదివలె, పరిదహ్యన్తే = కాలిపోవును.

**తాత్పర్యము :–** చెవిఁజేరిన శివనామామృతరసములు పాపములెన్ని యున్నను వానినన్నింటిని దూదివలె కాల్చివేయును.

**వివరణ :–** దహనము అను విరూపక్రియ నామామృతరసములవలన కలుగునని చెప్పఁబడుటచే నీ శ్లోకమునను విరూపకార్యోత్పత్తిరూప విషమాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని వలన పాపదాహము చెప్పఁబడినది. ఈ శ్లోకమున కామదాహము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ప్రమదేన వఞ్చయితుమేత్య సత్వరం**
**పరమం శివం సశరచాపభీషణః।**
**స్వయమేవ తన్నిటలనేత్రవహ్నినా**
**భవదాశు దగ్ధవపురిన్దిరాసుతః॥ 94**

**ప్రతిపదార్థము:–**ప్రమదేన = అధికమదమున, పరమమ్ = గొప్పనైన, శివమ్ = సివుని, వంచయితుమ్ = వంచించుటకు, సత్వరమ్ = శీఘ్రముగా, ఏత్య = వచ్చి, సశరచాప భీషణః = ధనుర్బాణములతో కూడిన ధనువుతో భయంకరుడైన, ఇన్దిరాసుతః = లక్ష్మీ సుతుడు (మన్మథుడు), తన్నిటలనేత్ర వహ్నినా = వాని (శివుని) ఫాలమునందలి కంటిలోని అగ్నిచేత, ఆశుదగ్ధ వపుః = శీఘ్రముగా కాలిన శరీరము కలవాడు, అభవత్ = ఆయెను.

**తాత్పర్యము :–** మన్మథుడు అధికమదమున పరమశివుని వంచించుటకు శీఘ్రముగా వచ్చి ఆతని నుదుటనున్న కంటిలోని అగ్నిచేత శరీరము కాలినవాడై పోయెను.

**వివరణ :–** శివుని వంచించుటకు వచ్చిన మన్మథుడు ఆ పని చేయలేకపోగా ఆ శివుని ఫాలనేత్రాగ్ని దగ్ధుడగుట (ఇష్టమును పొందక పోవుటయే గాక అనిష్టప్రాప్తిని పొందినవాడగుట) చెప్పఁబడినందున ఈ శ్లోకము విషమాలంకారముయొక్క భేదమే ఏర్పడియున్నది. ఈ శ్లోకమున ప్రతిపాదమున స–జ–స–జ–గ అను గణములుండుటచే నిది మఞ్జులభాషిణీ వృత్త నిబన్ధనము.

**అవతారిక :–** పై శ్లోకమున శివుని వంచించుటకు వచ్చినవాని చావు చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆతని సేవించు కోర్కె చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సమస్తలోకాధిపతిర్మహాత్మా**
**క్వ త్వం క్వ చాహం కుమతిః కుమర్త్యః।**
**ఇదం మహద్వాఞ్ఛిత మీశ! మే యత్**
**ప్రకామయే త్వత్పదపద్మసేవామ్॥ 95**

**ప్రతిపదార్థము :–** సమస్తలోకాధిపతిః = సమస్త లోకమునకు ప్రభుడవైన, మహాత్మా = మహాత్ముడవైన, త్వమ్ = నీవు, క్వ = ఎక్కడ? కుమతిః = చెడ్డబుద్ధికల, కుమర్త్యః = అల్ప మనుష్యుడవైన, అహమ్ = నేను, క్వ చ = ఎక్కడ, ఈశ! = ఈశ్వరుడా, త్వత్పదపద్మసేవామ్ = నీ పాదపద్మములయొక్క సేవను, ప్రకామయే (ఇతి) యత్ = కోరుచున్నాననుట ఏదిగలదో, మే = నాయొక్క, వాఞ్ఛితమ్ = కోరిక, మహత్ = చాలాగొప్పది.

**తాత్పర్యము :–** సర్వలోక ప్రభువుడవు మహాత్ముడవైన నీవెక్కడ? అల్పుడనై చచ్చు స్వభావముగల నేనెక్కడ? నీ పాదపద్మముల సేవించెదను నాయీ కోర్కె నాకు అందరానంత పెద్దదిగదా!

**వివరణ :–** ఈ శ్లోకము శివునకు తనకు గల అననురూపత క్వశబ్దావృత్తిచే చెప్పఁబడినందున విషమాలంకార మేర్పడియున్నది. రెండవ పాదమున ఇంద్రవజ్రా లక్షణము మిగిలిన పాదములలో ఉపేన్ద్రవజ్రా లక్షణ మున్నందువలన ఈ శ్లోకముపజాతిఛ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున కవి తన అల్పతను చెప్పినాడు. ఈ శ్లోకమున తనవంటి భక్తులందఱ మనస్సును పరమాల్పమే యని చెప్పుచున్నాడు.

**శ్లో॥ పరమాల్పస్వరూపేఽపి – నిజభక్తస్య మానసే।**
**వర్తతే సతతం దేవో – మహీయానమ్బికాపతిః॥ 96**

**ప్రతిపదార్థము :–** నిజభక్తస్య = తన భక్తునియొక్క, పరమాల్ప స్వరూపే = మిక్కిలి అల్ప స్వరూపముగలదైన, మానసే అపి = మనసునందైనను, మహీయాన్ = మిక్కిలి గొప్పవాడైన, అమ్బికాపతిః = పార్వతీపతియైన, దేవః =దేవుడు, సతతమ్ = ఎల్లప్పుడు, వర్తతే = నిలచియున్నాడు.

**తాత్పర్యము :–** నిజభక్తుని మిక్కిలి చిన్న మనసున మిక్కిలి పెద్దవాడైన పార్వతీ పతియైన శివదేవుడు ఎల్లప్పుడు వసించియే యుండును.





**వివరణ :–** మనస్సు అణుపరిమాణమని తార్కికులు చెప్పెదరు. అట్టి మనసు అను ఆధారమునందు మిక్కిలి పెద్దవాడైన శివుడు ఆధేయమై ఉన్నాడని చెప్పుటచే నీ శ్లోకమున అధికాలంకార మేర్పడియున్నది.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున అల్పమనసున అధికుడైన శివుని ఉనికి చెప్పఁబడినది. ఈ శ్లోకమున అతివిస్తృతమైన లోకమున అత్యల్పుడైన కవి ఉనికి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మర్త్యలోకేఽతివిస్తారే – వర్తమానే భయాకులమ్।**
**మామల్పమేకం హే శమ్భో – సముద్ధర కృపా (నిధే) రసాత్॥ 97**

**ప్రతిపదార్థము :–** అతివిస్తారే = మిక్కిలి విస్తృతిగల, మర్త్యలోకే = మనుష్యలోకమున, ఏకమ్ = ఒంటరివాడైన, భయాకులమ్ = భయముచే వ్యాకులుడైన, అల్పమ్ = అల్పుడైన, మామ్ = నన్ను, కృపారసాత్ = దయారసము వలన, సముద్ధర = ఉద్ధరింపుము.

**తాత్పర్యము :–** మిక్కిలి విస్తరించియున్న ఈ మనుష్యలోకమున ఒంటరివాడవై అల్పుడనై భీతుడనై నివసించుచున్న నన్ను దయతో సముద్ధరింపుము.

**వివరణ :–** 1. ఆధారమైన మర్త్యలోకము అధిక విస్తృతమైనది. అందరు అల్పుడై యున్నట్లు ఈ శ్లోకమున చెప్పఁబడినది. ఇట్లు చెప్పుట అధికాలంకారభేదమేమో? అధికత్వ సంబంధమాధారాధేయులలో నొకదాని కున్నదిగదా! 2. మిక్కిలి విస్తృతమైన లోకమున అత్యల్ప కీటకమువలె నున్నాడను. ఒంటరిగా ఉన్నాడను అనుభవములు కలుగుటతోడనే భయము కలుగునను విషయము సహజసుందరముగా చెప్పఁబడినది. కృపారసాత్ అను ప్రయోగము ననుసరించి అల్పునియందు సంసారరోగము నూహించుకొనవలసి ఉన్నది. కృపానిధే అను పాఠము మరింత సమంజసము. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున మర్త్యలోకే అను శబ్దము ద్వారమున **మృత్యోర్మామృతం గమయ** అను సూక్తి తాత్పర్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివునికి చేసిన అమృతా (జలా)భిషేకముయొక్క బిన్దువుల సేచనమున కవిచేత శరీరము నాశ్రయించిన పాతకముల దాహము కోరఁబడుచున్నది.

**శ్లో॥ దేహాశ్రితాన్యశేషాణి – నిర్దగ్ధుం పాతకాని మే।**
**దేహం సిఞ్చామ్యహం శమ్భో – రభిషేకోదబిన్దుభిః॥ 98**

**ప్రతిపదార్థము :–** మే = నాయొక్క, దేహాశ్రితాని = దేహము నాశ్రయించిన, అశేషాణి = అన్ని, పాతకాని = పాపములను, నిర్దగ్ధుమ్ = పూర్తిగా కాల్చుటకు, శమ్భోః = శివునియొక్క, అభిషేకోదబిన్దుభిః = అభిషేక జల బిన్దువులతో, దేహమ్ = శరీరమును, సించామి = తడిపెదను.

**తాత్పర్యము :–** నా శరీరము నాశ్రయించిన అన్ని పాపములను పూర్తిగా కాల్చివేయుటకు దానిని శివాభిషేకజలబిన్దువులతో తడిపెదను.

**వివరణ :–** దాహము అను ఫలమును కోరువాడు అగ్నినాశ్రయించవలసి యుండగా విచిత్రముగా జలబిన్దువుల సేచనమును చేయుట చెప్పఁబడి యున్నందున విచిత్రాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివదేహజలాభిషేకము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ దేహమున ప్రధానమైన శిరము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ శైవం శిరః కాన్తిముపైతి పూర్ణ –**
**చన్ద్రస్య నిత్యం కలయా సమేతమ్।**
**చాన్ద్రీకలా శైవశిరఃప్రతిష్ఠామ్**
**ప్రపద్య సంయాతి నితాన్తశోభామ్॥ 99**

**ప్రతిపదార్థము :–** శైవమ్ = శివునకు సంబంధించిన, శిరః = తల, పూర్ణచన్ద్రస్య = పూర్ణచంద్రునియొక్క, కలయా = పదునాఱవభాగములో, సమేతమ్ = కూరినదై, నిత్యమ్ = ఎల్లప్పుడు, కాన్తిమ్ = కాన్తిని, ఉపైతి = పొందుచున్నది, చాన్ద్రీ = చన్ద్రునకు చెందిన, కలా అపి = పదునాఱవ భాగము కూడ, శైవశిరః ప్రతిష్ఠామ్ = శివునకు చెందిన తలయందు గొప్ప (చిరకాల) స్థితిని, ప్రపద్య = పొంది, నితాన్త శోభామ్ = ఎడతెగని కాన్తిని, సంయాతి = పొందుచున్నది.

**తాత్పర్యము :–** పూర్ణచన్ద్రుని పదాఱవకలతో కూడిన శివుని శిరస్సు నిత్యము కాంతిని పొందుచున్నది. ఆతని శిరస్సున స్థిరమైన ఉనికిని పొందిన **చన్ద్రకల** కూడ ఎడతెగని శోభను పొందుచున్నది.

**వివరణ :–** ఈ శ్లోకమున శివుని శిరము చన్ద్రకల పరస్పర (అన్యోన్య) ముపకరించుకొని శోభించుచున్నట్లు శివుని శిరము చన్ద్రకల పరస్పరము సహకరించుకొనట్లు చెప్పబడుటచే అన్యోన్యాలంకార మేర్పడియున్నది. మొదటి మూడు పాదములలో ఇంద్రవజ్రా లక్షణము చివఱిపాదమున ఉపేన్ద్రవజ్రా లక్షణముండుటచే నిది ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనము.



**అవతారిక :–** పై శ్లోకమున శివుని ఉత్తమాఙ్గముయొక్క సంబంధముచే చన్ద్రకలకు నిరన్తర శోభ కలిగినట్లు చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివాభిషేక జలసంబంధమున బహిరఙ్గముతో పాటు అంతరఙ్గ శుద్ధి కూడ భక్తులలో కలుగునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ప్రోక్షితం శుచికణైర్బహిరఙ్గే – భూతభర్తురభిషేకజలస్య।**
**అన్తరఙ్గమచిరాయ జనానాం – నిర్మలం భవతి సాధు విచిత్రమ్॥ 100**

**ప్రతిపదార్థము :–** భూతభర్తుః = శివునియొక్క, అభిషేక జలస్య = అభిషేక జలముయొక్క, శుచికణైః = పవిత్రములైన అణువులచేత, జనానామ్ = జనులయొక్క, బహిరఙ్గే = బాహ్యశరీరమున, ప్రోక్షితమ్ = చల్లఁబడినది. అచిరాయ = శీఘ్రముగా, అన్తరఙ్గమ్ = లోని అఙ్గము (మనస్సు), సాధు = బాగుగా, నిర్మలమ్ = మలరహితము, భవతి = అగుచున్నది, విచిత్రమ్ = వింత (కదా!)

**తాత్పర్యము :–** శివాభిషేకజలకణములను బహిరఙ్గమున చల్లుకొన్న భక్తుల అంతరఙ్గము నిర్మలమగుట విచిత్రముకదా!

**వివరణ :–** కార్యకారణముల ఏకదేశస్థితి లోకసిద్ధము. వాని భిన్నదేశస్థితి చెప్పఁబడుటచే అసంగత్యాలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున ర–స–భ–గ–గ అను గణము లుండుటచే నీ శ్లోకము స్వాగతా వృత్తనిబన్ధనము.

అంతరఙ్గశుద్ధికై జనులు శివాభిషేకజలమును బహిరఙ్గమున జల్లుకొను చున్నారను వ్యంగ్యార్థము నాశ్రయించి ఇట విచిత్రాలంకారస్ఫూర్తి యున్నదని చెప్పవచ్చును. అప్పుడు శ్లోకములోని విచిత్రమ్ అను శబ్దము వ్యంజ్యమైన ఈ విచిత్రాలంకారమును సూచించునని చెప్పి విచిత్రమ్ అను శబ్దముయొక్క సార్థకతను చెప్పవచ్చును.

---

**అవతారిక :–** పై శ్లోకమున బహిరంగమున శివాభిషేక జల ప్రోక్షణము అంతరఙ్గము యొక్క శుద్ధిహేతువును శివుని విచిత్రగుణ విశేషణము శివ ప్రశంసనమునకై చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని నిర్గుణత్వాది దోషములు చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ మూలప్రమాణరహితో – నిర్గుణో నిష్కలో విభుః।**
**అనాథో భోగవిధురో – నావాచ్యం దైవతం శివః॥ 101**

**ప్రతిపదార్థము :–** శివః = శివుడు, మూల ప్రమాణ రహితః = మూలము ప్రమాణమును లేనివాడు, నిర్గుణః = గుణములు లేనివాడు, విభుః = సర్వ వ్యాపకుడు (లేక) ప్రభువునై, అనాథః = అనాథుడు, భోగవిధురః = భోగములఁ బోగొట్టు కొన్నవాఁడు (అయినను), అవాచ్యమ్ = చెప్పరానివాడు, న = కాదు, దైవతమ్ = దైవము (కదా!)

**తాత్పర్యము :–** మూలము ప్రమాణమును గుణములును లేని యీ శివుడు ప్రభువైనను దిక్కులేనివాడు భోగములంబోగొట్టు కొన్నవాడునైనను అట్లు నిందించగూడని దైవమాతడు గదా!

**వివరణ :–** జగమంతయు శివ మూలకము. శివునకు మూలమేది? లేదు అన్ని ప్రమాణములకు ప్రమాణత్వము కలిగించువాడు శివుడే. ఆయన స్వయం ప్రమాణ రూపుడు.కావున ఆయన కితర ప్రమాణము లేదు. కావున ఆయన మూల ప్రమాణ రహితుడని చెప్పంబడినాడు. అట్లే గుణమయమాయాతీతుడగు శివుడు నిర్గుణుడని చెప్పం బడినాడు. విభుశబ్దము ఆయన సర్వవ్యాపకత్వముతో పాటు ఆయన ప్రభువు అను అర్థమును కూడ బోధించును. ఇట్లు విభువని చెప్పుట ప్రశంశయా? కాదేమో! ఏలననగా ఆతడు అనాథునివలె భిక్షమెత్తుకొనుచున్నాడు. దిగమ్బరుడై ఉన్నాడు. ఏ భోగమును లేనివాడై యున్నాడు. ఇట్లు చెప్పుట నిందయా? కాదు. శివునందు గల మూల ప్రమాణ రాహిత్యము నిర్గుణత్వము. అనాథత్వము. కొందఱు ప్రశంసనీయములుగా భావించిన ఈ లక్షణములే కొందఱచే దోషములుగా అనగా నింద్యములుగా భావింపంబడినందున ఈ శ్లోకమున వ్యాఘాతాలంకారమేర్పడి యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పూర్వశ్లోకమున శివుని నిర్గుణత్వాదిదోషములు వర్ణింపంబడినది. ఈ శ్లోకమున ఆతని శిరమునందలి గంగానది వర్ణింపంబడుచున్నది.

**శ్లో॥ తటిన్నిభజటాకాన్తి – గ్రహణాత్ స్వర్ణదీ పితా।**
**సరస్వతీవ సంరేజే – శఙ్కరస్య శిరోగతా॥ 102**

**ప్రతిపదార్థము :–** తటిన్నిభ జటా కాన్తి గ్రహణాత్ = మెఱుపులవంటి జటల కాంతిని గ్రహించుట వలన, శఙ్కరస్య = శివునియొక్క, శిరోగతా = శిరమునందున్నదైన, స్వర్ణదీ = ఆకాశగంగ, సరస్వతీ ఇవ = సరస్వతీనదివలె, సంరేజే = ప్రకాశించుచున్నది.

**తాత్పర్యము :–** శివుని శిరమునందలి జటలు మెఱుపులవలె తెల్లగా ప్రకాశించుచుండగా వాని తెలుపుచేత ఆ శిరమునందలి ఆకాశగంగానది తెల్లని సరస్వతీ నదివలె ప్రకాశించినది.

**వివరణ :–** సాధారణముగా శివుని జటలెఱ్ఱనివిగా వర్ణింపంబడుచుండును. ఈ శ్లోకమున అవి తెల్లనివిగా చెప్పబడినవి. శివుని శరీరము తెల్లనిదైనందున ఆ శరీరమునందలి తెలుపు జటలకు సంక్రమించినదేమో? అంతేగాక ఆ జటలకు సంక్రమించిన తెలుపు జటల ఎఱుపుచేత ఎఱ్ఱనిదైన గంగానదిని సైతము తెల్లంబఱచి సరస్వతీనదివలె తెల్లనిదిగా





నున్నట్లు చేసినదేమో? ఇట్లు (ఒక చోటనున్న గుణము మరొక చోట సంక్రమించుట చెప్పంబడినందున) తన గుణమును వీడి మరొకచోటి గుణమును స్వీకరించుట చెప్పం బడినందున ఈ శ్లోకమున తద్గుణాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

గంగకు తెలుపు సహజగుణము. కావున తెల్లని గంగానదిని జటల ఎఱుపుచే ఎఱ్ఱంబడి శివుని శరీరకాంతిచే తెల్లంబడినట్లు భావించు నవకాశమున్నందున ఈ శ్లోకమున పూర్వరూపాలంకార మేర్పడినదనుట ఎక్కువ సమంజసముగా నుండును.

---

**అవతారిక :–** పై శ్లోకమున గంగ శంకర శిరోగతగా చెప్పంబడినది. ఈ శ్లోకమున శఙ్కరుడెక్కడనుండునను ప్రశ్నమునకు ఉత్తరము (సమాధానము) చెప్పంబడుచున్నది.

**శ్లో॥ కుత్రాస్తే శఙ్కరో నిత్యం – కైలాసే భక్తహృద్యపి।**
**కుత్రాస్తే పార్వతీ నిత్యం – వామాఙ్గేఽనఙ్గవైరిణః॥ 103**

**ప్రతిపదార్థము :–** శంకరః = శివుడు, కుత్ర = ఎచట, ఆస్తే = ఉండును. నిత్యమ్ = ఎల్లప్పుడు, కైలాసే = కైలాస పర్వతమునందు, భక్తహృది + అపి = భక్తులయొక్క హృదయములందును, ఆస్తే = ఉండును. పార్వతీ కుత్ర = పార్వతి ఎక్కడ. నిత్యమ్ = ఎల్లప్పుడు, ఆస్తే = ఉండును. అనఙ్గవైరిణః = శివునియొక్క, వామాఙ్గే = ఎడమ శరీరమున, ఆస్తే = ఉండును.

**తాత్పర్యము :–** శివుడెక్కడ నుండును? కైలాస పర్వతమునందు, భక్తుల హృదయములం దుండును. పార్వతి ఎక్కడనుండును? మన్మథునకు శత్రువైన శివుని శరీరమునం దెడమ భాగమున నుండును.

**వివరణ :–** ప్రశ్నము దానికి సమాధానము నుండుటచే నీ శ్లోకమున ఉత్తరాలంకార మేర్పడియున్నది. ఏనాడు తన శరీరముయొక్క ఎడమభాగమున పార్వతిని నిలుపు కొన్నాడో ఆనాటినుండి దానికి వామాఙ్గమని పేరు వచ్చినది. ఆ అంగము వామదిగదా! సాధారణమనుష్యుల శరీరములందెడమ భాగమందు వామ ఉండకపోయినను దానికి వామాఙ్గమనియే పేరు ఏర్పడినది. అస్తు. పార్వతి అనఙ్గ పక్షపాతిని, శివుడు అనఙ్గవైరి. శివునెడమ భాగము (బలహీన భాగము) జేరి అనఙ్గవైరి శరీరమునందే అనఙ్గుని పాగ వేయించినది. ఇది యంతయు చతుర్థ పాద వ్యంగ్యము. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివుని నివాసము కైలాసము భక్తహృదయము అని ప్రశ్నమునకు ఉత్తరము చెప్పఁబడినది. ఈ శ్లోకమున ప్రశ్నోత్తరరూపములై జిజ్ఞాసాకాంక్షయొక్క నివారకములైన సర్వశాస్త్రపురాణేతిహాసముల తాత్పర్యము శంకరునందేయని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వేదశాస్త్రపురాణాని - సేతిహాస స్మృతీన్యహమ్।**
**జానామి సద్భ్యః సర్వేషాం - తాత్పర్యం సామ్బశఙ్కరే॥ 104**

**ప్రతిపదార్థము :-** సద్భ్యః = సత్పురుషులనుండి, సేతిహాస స్మృతీని = ఇతిహాస స్మృతులతో కూడిన, వేదశాస్త్ర పురాణాని = వేదశాస్త్ర పురాణములను, అహమ్ = నేను, జానామి = ఎఱుగుదును, సర్వేషామ్ = అన్నింటికి, సామ్బశఙ్కరే = పార్వతితో కూడిన శివునందే, తాత్పర్యమ్ = తాత్పర్యము, అస్తి = ఉన్నది.

**తాత్పర్యము :-** ఇతిహాసములు స్మృతులు. వేదములు శాస్త్రములు. పురాణములు వీనినన్నింటియొక్క తాత్పర్యము పార్వతితో కూడిన శివునందే కలదు.

**వివరణ :-** 1. రామాయణ భారతములు ఇతిహాసములు. పరాశరాది ముని విరచిత ధర్మగ్రన్థములు స్మృతులు. తర్కమీమాంసాదులు శాస్త్రములు. ఋగాదులు వేదములు. వాని నన్నింటిలో వేదములకు పరమ ప్రామాణ్యము. మిగిలినవి తన్మూలకములైనందున ప్రమాణములు. ఇవి యన్నియు శివుని తత్త్వము బోధించుట యందే **తాత్పర్యము** కలవి.

**తాత్పర్యము :-**1. ఉపక్రమోపసంహారములు 2. అభ్యాసము 3. అపూర్వత 4. ఫలము 5. అర్థవాదము 6. ఉపపత్తి అను ఈ ఆఱు అంగములచే నిర్ణయింపఁబడినది. సాధారణముగా వక్తయొక్క ఇచ్ఛ తాత్పర్యమని చెప్పఁబడును. వేదములకు కర్త లేకపోవుటచే ఏకవాక్యతానుసన్ధానము వలన ఏర్పడిన అర్థమే తాత్పర్యార్థమని మీమాంసా శాస్త్రమున నిర్ణయింపఁబడినది. పైన చెప్పఁబడిన వేదవైదిక పురాణాది గ్రంథముల తాత్పర్యము విష్ణునందే అని వైష్ణవులు. శక్తియందే అని శాక్తులు చెప్పుచుండగా నీ గ్రంథకర్త శివునందే వాని తాత్పర్యమని చెప్పినాడు. ఇది శివపారమ్యము నంగీకరించు వారందఱకును అంగీకార్యమే. సమస్త వైదిక వాఙ్మయ తాత్పర్యమేమియను ప్రశ్నమును కల్పించుకొని దానికేది ఉత్తరమని పై శ్లోకమునందువలె భావించినచో ఈ శ్లోకమునందును ఉత్తరాలంకారమున్నదని చెప్పుట చమత్కారము లేనందున అంత ఉచితము కాదేమో? చమత్కారమే అలంకారజీవము గదా!

---





**అవతారిక :-** పూర్వశ్లోకమున ఉత్తరము ప్రశ్నానుసారముగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఒకే వాక్యమున ప్రశ్నము ఉత్తరమును చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ కం దర్పదమనం వక్తి - పురాణా మమరద్విషామ్।**
**కామాశాం కృతవాన్ వ్యర్థాం - క్షణాత్ కోపేన శఙ్కరః॥ 105**

**ప్రతిపదార్థము :-** కమ్ = ఎవరిని, పురాణామ్ = పుర అను పేరు గల, అమరద్విషామ్ = రాక్షసులయొక్క, దర్పదమనమ్ = గర్వమును దమింపఁజేసిన వానినిగా, వక్తి = చెప్పును? కందర్పదమనమ్ = మన్మథుని దమించిన వానిని, వక్తి = చెప్పును, శఙ్కర = శివుడు, క్షణాత్ = క్షణకాలమున, కోపేన = కోపమున, కామ్ = ఏ, ఆశామ్ = ఆశను, వ్యర్థామ్ = వ్యర్థమైన దానినిగా, కృతవాన్ = చేసెను? కామాశామ్ = మన్మథుని ఆశను, వ్యర్థామ్ = వ్యర్థమయిన దానినిగా, శఙ్కరః = శివుడు, కృతవాన్ = చేసెను.

**తాత్పర్యము :-** పురాణము పురనామక రాక్షసుల దర్పమును దమింపఁజేసిన వానినిగా ఎవనిని పేర్కొనును? కందర్పదమనుని, పురనామక రాక్షసుల దర్పమును దమింపఁజేసిన వానినిగా చెప్పును. శివుడే ఆశను వ్యర్థముగా క్షణకాలమున కోపమున చేసినవాడయ్యెను? కాముని ఆశను వ్యర్థముగా శివుడు క్షణకాలమున కోపమున చేసెను.

**వివరణ :-** పురాణామ్ అమరద్విషాం దర్పదమనం కం వక్తి అనునది ప్రశ్నము. కందర్పదమనమ్ అను శబ్దమును కం - దర్పమదనమ్ అని రెండు పదములుగా విభజించినచో పురనామక రాక్షసుల దర్పమును దమించిన వానినిగా నెవనిని చెప్పును? అను ప్రశ్నమేర్పడును? కన్దర్పదమనమ్ అను ఆ శబ్దమునే కందర్ప - దమనమ్ అను విధముగా విడదీసి మన్మథుని దమించిన వానినే (పురనామక రాక్షసుల దర్పదమునిగా) చెప్పును. అనునది దానికి ఉత్తరము. పూర్వార్థమున ఈ ప్రశ్నోత్తరములు ఒకే వాక్యమునుండి పదవిభాగ భేదమున నేర్పడును. కర్తృపదమీ పూర్వార్ధమున పేర్కొనఁ బడలేదు. కావున ఎవనినో ఒక జిజ్ఞాసువును కల్పించుకొనవలెను. వక్తి అను క్రియలోని తి అను ప్రత్యయమును కర్తను సామాన్యముగా చెప్పినను ఆ కర్త ఎవడు? అను విశేషజిజ్ఞాసను నివారించుటకు కర్త విశేష రూపుడైన పృచ్ఛకుని కల్పించుకొనవలెను. అట్లే ఉత్తరార్ధమున కామాశామ్ అను శబ్దమును కామ్ ఆశామ్ అను రెండు పదములుగా విభజించుకొని శివుడు క్షణమున కోపమున ఏ ఆవేశము వ్యర్థముగాఁజేసెను. అను ప్రశ్నకు కామాశామ్ అను శబ్దమున కామ + ఆశామ్ అను పదవిభాగమును చేసి కాముని ఆశను శబ్దమును క్షణకాలమున కోపమున వ్యర్థమైన దానినిగా చేసెను. అను ఉత్తరమును చెప్పుకొనవచ్చును. ఇట్లేకవాక్యమునే ప్రశ్నముగా ఉత్తరముగాను పదవిభాగ

శ్లేష సహకారమున చెప్పుట **ప్రహేళిక** అనఁబడును. ఇట్టి ప్రశ్నోత్తరైక వాక్యమును చిత్రోత్తరాలంకారమని ఉత్తరాలంకారభేదముగా అలంకారశాస్త్రజ్ఞులు చెప్పినారు. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున ప్రశ్నోత్తరములు శ్లేషమున అభిన్నమొనర్చిన ఏకవాక్యమున పురమథనుడు కామారియైన శివుడు వర్ణింపఁబడినాడు. ఈ శ్లోకమున భిన్న ప్రశ్నోత్తర వాక్యములలో శివుని సర్వేశ్వరత శివభక్తియొక్క శీఘ్రభుక్తి ముక్తి ప్రదత్వమును చెప్పఁబడుచున్నవి.

**శ్లో॥ కః సర్వేశః పార్వతీశో – న బ్రహ్మా న హరిస్తథా।**
**భుక్తిముక్తిప్రదా శీఘ్రం – కా భక్తిః సామ్బశఙ్కరే॥ 106**

**ప్రతిపదార్థము :–** సర్వేశః = సర్వేశ్వరుడు, కః = ఎవడు? పార్వతీశః = పార్వతీశుడు, హరిః = హరి, న (సర్వేశ్వరుడు) = కాడు, తథా = అట్లు, బ్రహ్మా = బ్రహ్మ, న (సర్వేశ్వరుడు) = కాడు, శీఘ్రమ్ = త్వరగా, భుక్తి ముక్తిప్రదా = భుక్తి ముక్తుల నొసగునది, కా = ఏది?, సామ్బశఙ్కరే = పార్వతమ్మతో గూడిన శివుని యందలి, భక్తిః = భక్తి.

**తాత్పర్యము :–** ప్ర. సర్వేశ్వరుడెవరు?

స: పార్వతీశుడు. బ్రహ్మకాని విష్ణువు కాని సర్వేశ్వరుడు అని చెప్పదగినవారు కారు.

ప్ర : శీఘ్రముగా భుక్తి ముక్తుల నొసగు సాధనమేది?

స: పార్వతమ్మతో కూడిన శివుని యందలి భక్తియే.

**వివరణ :–** మీమాంసా శాస్త్రమున పరిసంఖ్యావిధియను నొక విధి కలదు. దానికి విధించుట యందు కంటె నిషేధించుట యందే ఎక్కువ తాత్పర్యముండును. పంచపంచనఖాభక్ష్యాః అను విధి వాక్యము పరిసంఖ్యావిధి కుదాహరణము. దీనికి పంచనఖమృగములలో నైదు పంచనఖమృగములు మాత్రమే మాంసాహారులు. తినదగినవి అని అర్థము. దీని తాత్పర్యము పంచనఖ మృగములలో తినదగినవిగా పేర్కొనఁబడిన ఐదుమృగములు తప్ప మిగిలిన పంచనఖ మృగముల తినరాదని చెప్పుట లోనే ఎక్కువ తాత్పర్యమున్నది. కాని పేర్కొనఁబడిన వానిని తప్పక తినవలెననుటలో యీ తాత్పర్యము లేదు. ఇష్టమైనచో పేర్కొనఁబడిన వానినే తినవలెను. కాని పేర్కొనఁబడని వానిని తినరాదని చెప్పుటలోనే ఆ విధి వాక్యమునకు తాత్పర్యము.

ఉత్పత్తివిధి యందు విధింపఁబడిన కర్మచేయఁబడనిచో ప్రత్యవాయము (పాపము) కలుగును. ఉదాహరణమునకు **అహరహస్సన్ధ్యాముపాసీత** ప్రతిదినము సంధ్యోపాసన





మొనర్పవలెను. సంధ్యోపాసన మొనర్చనివాడు పాపియగునని ఆ ఉత్పత్తి విధి వాక్యమునకు తాత్పర్యము. అట్లే నియమవిధియైన **వ్రీహీ న వహన్తి** అను వాక్యమున వరిధాన్యమును దంచవలెను అని విధింపఁబడినది. ఈ వాక్యము గోళ్ళతో వరిధాన్యము పొట్లు తీయుట ఒక పక్షమున ప్రాప్తింపగా మరొక పక్షమున దంచుట ప్రాప్తించగా దంచియే వరి ధాన్యము యొక్క పొట్లు తీయవలెనని నియమించుటయే పై విధి యొక్క అర్థము. గోళ్లతో పొట్టుతీసి సిద్ధపరచిన బియ్యమును పయోగించి సిద్ధపఱుపఁబడిన హవిస్సును అగ్నిలో హుత మొనర్చినచో ఆ హోమము వలన పుట్టవలసిన పుణ్యాపూర్వము (పుణ్యము) పుట్టదు అని తాత్పర్యము.

ఈ శ్లోకమునందు పైని పరిసంఖ్యావిధిని పోలిన వాక్యమున్నది. దానికి శివుని యందు సర్వేశ్వరత్వము విధించుట ఎంత తాత్పర్యవిషయమో బ్రహ్మ విష్ణువులలో సర్వేశ్వరత్వము లేదని నిషేధించుటలో నంతే తాత్పర్యమున్నది. ఐనను ఈ శ్లోకమున పరిసంఖ్యాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమునందు వలెనే ఈ క్రింది శ్లోకమునందు నిషేధము విధియు చెప్పఁబడినవి.

**శ్లో॥ సర్వస్య సత్సర్వమనోరథానాం దాతా మహేశో న సురద్రుమౌఘః।**
**మహీధరాధీశసుతాధినాథో దీనేషు సర్వేషు సదా దయావాన్॥ 107**

**ప్రతిపదార్థము :–** సర్వస్య = సర్వజీవసమూహముయొక్క, సత్సర్వ మనోరథానామ్ = మంచివైన అన్ని కోరికలయొక్క, దాతా = ఇచ్చువాడు, మహేశః = శివుడు, సురద్రుమౌఘః = కల్పవృక్ష సముహము, న = కాదు. మహీధరాధీశ సుతాధినాథః = పర్వతపతి కూతురియొక్క భర్త (శివుడు), సర్వేషు = సర్వులైన, దీనేషు = దీనులయందు, సదా = ఎల్లప్పుడు, దయావాన్ = దయ కలిగినవాడు.

**తాత్పర్యము :–** అందఱి అన్ని మంచి కోరికల నొసగువాడు సర్వేశ్వరుడైన మహేశ్వరుడే. కాని కల్పవృక్షసమూహమట్లు అందఱి జీవుల అన్ని మంచి కోరికలనిచ్చు నట్టిది కాదు. పర్వతరాజకుమారీపతియైన ఆ శివుడు దీనులందఱ యందును దయ కలిగినవాడు.

**వివరణ :–** ఈ శ్లోకమున ప్రశ్నము లేకున్నను సమాధానము ననుసరించి ప్రశ్న మూహ్యమైయున్నది. కల్పవృక్ష సమూహమునందు సర్వసద్వాంఛాప్రదత్వము నిషేధింపఁబడుటచే ఈ శ్లోకమున పరిసంఖ్యాలంకార మేర్పడియున్నది. శివునందు సర్వసద్వాంఛా ప్రదత్వము విదింపఁబడినను శివునకు దుర్వాంఛా ప్రదానశక్తి నిషేధింపఁబడలేదు.

దుర్వాంఛలు పతన హేతువులు. కావున సద్వాంఛా ప్రదత్వమే శివునందు విధింపఁబడినది. అని సర్వ మనోరథములకు కూర్పఁబడిన సత్ విశేషణము వ్యంజించుచున్నది. ఉత్తరార్థము కల్పవృక్షము జడము కావున జీవులందు దయలేనిదని ఒకవేళ జీవులు తమకు హానికరములైన దుష్టమనోర్థములను కోరినచో సదసద్వివేకము దయయులేని ఆ కల్పవృక్షసమూహము ఆ జీవులకు హాని కలిగించు కోరికలను గూడ గుడ్డిగా నిచ్చునను అర్థమును వ్యంజించుచున్నది. ఈ శ్లోకమున 1,2,4 పాదములలో ఇంద్రవజ్రాలక్షణము 3వ పాదమున ఉపేన్ద్ర వజ్రా లక్షణముండుటచే ఉపజాతి వృత్త మేర్పడియున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమునందువలె ఈ క్రింది శ్లోకమునందు ప్రశ్నమూహ్యమైన సమాధానము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అభక్తతా మూర్ఖజనే – అభానం స్యాద్దివావిధౌ।**
**గదాహతిర్యుద్ధతలే – నేషద్దీనే శివం శ్రితే॥ 108**

**ప్రతిపదార్థము :–** మూర్ఖజనే = మూర్ఖమైన జనమునందు, అభక్తతా = భక్తత్వము లేకపోవుట, దివావిధౌ = పగటి చన్ద్రునియందు, అభానమ్ = ప్రకాశము లేకపోవుట, యుద్ధతలే = యుద్ధ స్థలమున, గదాహతిః = గదల దెబ్బ (ఉండును), శివమ్ = శివుని, శ్రితే = ఆశ్రయించిన, దీనే = దీనునందు, ఈషత్ = కొంచెము, న = ఉండదు.

**తాత్పర్యము :–** మూర్ఖులకు మాత్రమే భక్తి ఉండదు. పగటి చంద్రుడు మాత్రమే ప్రకాశముండడు. యుద్ధస్థలమునందు గదదెబ్బ ఉండును. కాని శివునాశ్రయించిన వాడు దీనుఁడైనను ఆతని యందు కొంచెము కూడ భక్తి ప్రకాశహీనత్వములు గాని దెబ్బతినుటగాని ఉండవు.

**వివరణ :–** బుద్ధిమంతులు భక్తులైయుందురని రాత్రి చంద్రుడు ప్రకాశవంతుడై యుండునని పూర్వార్ధమునందు క్షిప్తార్థము జ్ఞేయమైయున్నది. యుద్ధభూమి యందున్న వాడు గదాఘాతము నొందు నవకాశమున్నది. ఈ భక్తి ప్రకాశరాహిత్యములు గదాఘాతములు శివునాశ్రయించిన వారి కుండవు అని ఉత్తరార్ధక్షిప్తార్థము. గదమనగా రోగము. అహతి అనగా సంపూర్ణతనము. (మృత్యువు) శివునాశ్రయించిన దీనునకును రోగమృత్యువులుండవు. ఇక ఈ శివునాశ్రయించిన దీనుని విషయమున ఇవి ఉండవని చెప్పనక్కర లేదు. యుద్ధరంగమున గదవంటి ఇతరములైన ఆయుధముల చేతగాని, నిమిత్తాంతరముల చేతగాని మృత్యువుండదను అర్థము ఈ శ్లోకమున వ్యంగ్యమగుచున్నది.





ఈ శ్లోకమునందును అభక్తతా అభావము నిషేధింపఁబడుటచే పరిసంఖ్యాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని శిరమున నిత్యము ప్రకాశించు చంద్రుడు ప్రస్తావించఁబడినాడు. ఈ శ్లోకమున ఆ శివుని శిరమందలి గంగ ప్రస్తావింపఁబడుచున్నది.

**శ్లో॥ మూర్ధన్యలీకే చ గలే చ గఙ్గాం**
**వహ్నిం విషం శమ్భురహో దధాతి।**
**హితాహితానాం సతతం జనానా –**
**మానన్దదుఃఖే విదధాతి నిత్యమ్॥ 109**

**ప్రతిపదార్థము :–** మూర్ధని = శిరమున, అలీకే చ = నుదుటను, గలే = కంఠమునందు, గఙ్గామ్ = గఙ్గను, వహ్నిమ్ = అగ్నిని, విషంచ = విషమును, శమ్భుః = శివుడు, నిత్యమ్ = ఎల్లప్పుడు, దధాతి = ధరించుచున్నాడు, అహో = ఆహా! సతతమ్ = ఎల్లప్పుడు, హితాహితానామ్ = హితులు అహితులునైన, జనానామ్ = జనులకు, ఆనన్దదుఃఖే = ఆనన్ద దుఃఖములను, విదధాతి = కలిగించుచున్నాడు.

**తాత్పర్యము :–** శివుడు శిరమందు గఙ్గను, నుదుట అగ్నిని, కంఠమున విషము నెల్లప్పుడు ధరించుచున్నట్లు తనకు హితులైన జనులకు ఆనందమును, అహితులైన జనులకు దుఃఖమును ఎల్లప్పుడు కలిగించుచుండును.

**వివరణ :–** ఆధారములైన మూర్ధాలికగలములలో ఆధేయములైన గంగా వహ్ని విషములస్థితి మరియు హితాహితులకు ఆనంద దుఃఖముల నిచ్చుట క్రమముగా చెప్పఁబడుటచే క్రమాలంకార మేర్పడియున్నది. **'అపి మాషం మషం కుర్యాచ్ఛన్దో భంగం నకారయేత్'** అను సూక్తి ననుసరించి అలిక శబ్దము ఛన్దోనుగుణత కొఱకై అలీకగా ప్రథమ పాదమున కూర్చఁబడినది. 1,2,4 పాదములలో ఇంద్ర వజ్రా లక్షణము, 3వ పాదమున ఉపేన్ద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోకము ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున హితులకు శివుడానందము కలిగించునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ ఆనందము అనగా హిరణ్యాగర్భాదులచే తను కోరదగిన ముక్తిని బుద్ధిమంతుడు శివుని పొందవచ్చునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ యదృచ్ఛయా బిల్వదలం సమర్ప్య**
**పుమాన్ సుబుద్ధిః పరమేశ్వరాయ।**

**గృహ్ణాతి ముక్తిం పరమాం హిరణ్య-**
**గర్భాదికామ్యామచిరాయ తస్మాత్॥ 110**

**ప్రతిపదార్థము :-** సుబుద్ధిః = మంచి బుద్ధిగల, పుమాన్ = పురుషుడు, యదృచ్ఛయా = ఆకస్మికావకాశముచేత, పరమేశ్వరాయ = శివునికొఱకు, బిల్వదలమ్ = మారేడు పత్రమును, సమర్ప్య = సమర్పించి, తస్మాత్ = ఆతని (శివుని)నుండి, అచిరాయ = శీఘ్రముగా, హిరణ్యగర్భాది కామ్యామ్ = బ్రహ్మాదులచే కోరఁదగిన, పరమామ్ = ఉత్కృష్టమైన, ముక్తిమ్ = కైవల్యమును, గృహ్ణాతి = స్వీకరించును.

**తాత్పర్యము :-** దైవికముగా లభించిన మారేడు పత్రమును శివునకు సమర్పించి ఆ శివునుండి గొప్పముక్తిని బుద్ధిమంతుడు పొందుచున్నాడు.

**వివరణ :-** ఒక వస్తువ నొకనికిచ్చి ఆతని నుండి మరొక వస్తువును పొందినట్లు చెప్పఁ బడుటచే నీ శ్లోకమున పరివృత్త్యలంకార మేర్పడియున్నది. పూర్వార్ధమున ఉపేన్ద్రవజ్రా లక్షణము ఉత్తరార్ధమున ఇంద్రవజ్రా లక్షణముండుటచే నీ శ్లోక ముపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున పరమానంద రూపముక్తిని బుద్ధిమంతుడు శివునుండి పొందవచ్చునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున బుద్ధిహీనుడైన రావణుడట్టి ముక్తిని గాక సురాసురాద్యవధ్యతను పొందుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నవోత్తమాఙ్గాని సమర్ప్య భక్త్యా**
**పురారయే స్వాని సురాసురాద్యైః।**
**అవధ్యతాం తామవమాం యయాచే**
**తం ముక్తిదం రావణనామరక్షః॥ 111**

**ప్రతిపదార్థము :-** రావణనామ రక్షః = రావణుడను రాక్షసుడు, పురారయే = త్రిపుర హరున(శివున)కు, స్వాని = తనవియైన, నవోత్తమాఙ్గాని = తొమ్మిది తలలను, భక్త్యా = భక్తితో, సమర్ప్య = సమర్పించి, అవమామ్ = అల్పమైన, తామ్ = ఆ, సురాసురాద్యైః = దేవరాక్షసాదులచే, అవధ్యతామ్ = చంపఁదగియుండకపోవుటను, ముక్తిదమ్ = ముక్తినొసగు, తమ్ = ఆతని(శివు)ని, యయాచే = అడుగుకొనెను.

**తాత్పర్యము :-** రావణాసురుడు తన తొమ్మిది తలలను శివునకు సమర్పించి దేవాసురాదులచే చావురాకుండు వరమును కోరుకొనెనే గాని మోక్షమును గోరికొనలేదు.

**వివరణ :-** అల్పము నర్పించి అనల్పమును స్వీకరించుట బుద్ధిమంతుని లక్షణము. ఒక బుద్ధిమంతుడు సులభమైన బిల్వము నర్పించి బ్రహ్మాది దుర్లభమైన మోక్షమును





శివుని నుండి పొందెను. రావణాసురుడు బుద్ధిమంతుడు కాడు. పైగా రావణాసురుడు తలలను సమర్పించియు దేవాసురాదులచే అవధ్యత్వమును కోరుకొనెను. బలహీనులైన నరవానరాదులు తనను చంపలేరని భ్రమించి అట్లు కోరుకొనెనను. తన తొమ్మిదితలలను సమర్పించి, సర్వావధ్యతను గాకుండ కొందఱ (దేవాసురాదుల) నుండి మాత్రమే. అవధ్యతను కోరుకొనెను. అర్పించిన దధికము తలలు ఉత్తమాంగములు కదా. పొందినది సర్వావధ్యత కాకుండ కతిపయావధ్యత మాత్రమే. అధికమునర్పించి అల్పమునే కోరుకొనుట రావణుని అల్పబుద్ధితను జాడ్యమును సూచించును. ఈ శ్లోకమునందును తలలనిచ్చి దేవాసురాద్యవధ్యత్వ స్వీకరణము చెప్పఁబడినందున పరివృత్త్యలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకమునందును మొదటి మూడు పాదములు ఉపేన్ద్రవజ్రా లక్షణము. నాల్గవపాద మింద్రవజ్రా లక్షణమును అగుటచే నుపజాతి వృత్తనిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున రావణుడు తలల నర్పించి దేవాసురాద్యవధ్యత్వ స్వీకరణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున గౌరీదేవి శివునకు తపమును సమర్పించి శివవాల్లభ్యమును పొందుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ లోకాతీతం భక్తిపూర్వం తపః స్వం**
**గౌరీదేవీ భూతభర్త్రే సమర్ప్య।**
**తద్వాల్లభ్యం స్వీచకారాద్వయం శ్రీ-**
**వాణీముఖ్యస్త్రీకదమ్బాభినుత్యమ్॥ 112**

**ప్రతిపదార్థము :-** లోకాతీతమ్ = లోకాతీతమైన, స్వమ్ = తనదైన, తపః = తపమును, భక్తిపూర్వమ్ = భక్తిపూర్వకముగా, భూతభర్త్రే = శివునకై, సమర్ప్య = సమర్పించి, శ్రీవాణీ ముఖ్యస్త్రీ కదమ్బాభినుత్యమ్ = లక్ష్మి సరస్వతి మొదలైన స్త్రీల సమూహములచేత మిక్కిలి స్తుతింపబడిన, అద్వయమ్ = రెండులేని, తద్వాల్లభ్యమ్ = ఆ శివపత్నీత్వమును, గౌరీదేవి = గౌరీదేవీ, స్వీచకార = స్వీకరించెను.

**తాత్పర్యము :-** లోకోత్తరమైన తన తపమును శివునకు సమర్పించి గౌరీదేవి లక్ష్మి సరస్వతి మొదలగు స్త్రీల సమూహములచేఁ బొగడఁదగిన శివపత్నీత్వమును పొందెను.

**వివరణ :-** ఈ శ్లోకమున ఒకటి ఇచ్చి మరొక దానిని స్వీకరించునట్లు చెప్పఁబడినందును పరివృత్త్యలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున మ-త-త-గ-గ అను గణములుండుటచే నీ శ్లోకము శాలినీ వృత్త నిబన్ధనము.

**అవతారిక :–** పై శ్లోకమున సృష్ట్యాదికృతిహేతు గౌరి శివువల్లభగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆమె వలన శివునికి సంక్రమించిన సృష్ట్యాది హేతుత్వము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సృజతి రక్షతి నాశయతి స్ఫుటం**
**భువనజాలమభీప్సితమైహికమ్।**
**దిశతి ముక్తిమపి స్మరతామఘం**
**హరతి భాతి జయత్యపి శఙ్కరః॥ 113**

**ప్రతిపదార్థము :–** శఙ్కరః = శివుడు, భువనజాలమ్ = లోకసమూహమును, స్ఫుటమ్ = స్పష్టముగా, సృజతి = సృజించును, రక్షతి = రక్షించును, నాశయతి = నశింపఁజేయును. ఐహికమ్ = ఈ లోకమునకు సంబంధించిన, అభీప్సితమ్ = కోరికను, ముక్తిమ్ అపి = ముక్తిని గూడ, దిశతి = ఇచ్చును, స్మరతామ్ = స్మరించువారియొక్క అఘమ్ = పాపమును, హరతి = పోగొట్టును, భాతి = ప్రకాశించును, జయతి = సర్వోత్కర్షముగా వర్ధిల్లును.

**తాత్పర్యము :–** లోకముల సృష్టి స్థితి లయములను శివుడు చేయును. ఈ లోకము నందలి కోరికను ముక్తిని స్మరించువారి కొసగును. వారి పాపమును కూడ హరించును. సర్వోత్కృష్టత ప్రకాశమును కలిగియుండును.

**వివరణ :–** లోక సృష్టి స్థితి లయము లొనర్చుట ఈశ్వరుని తటస్థ లక్షణము. దానివలన ఆయనకు సర్వోత్కర్షత కలుగును. వీనివలన ఆయన నిరంతర ధ్యానము ఉపాసకుల హృదయములలో కలుగుచుండును. జ్ఞానులైనచో వారికి శివుడభిన్నముగానే భాసించును. అనుభవభావరూపత అను స్వరూప లక్షణములు శివుని వీడవు. శ్లోకమున సృజత్యాది క్రియలు పెక్కులు సముచ్చితములై ఉండుటచే నీ శ్లోకమున సముచ్చయాలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున న–భ–భ–ర అను గణములుండుటచే నీ శ్లోకము ద్రుతవిలమ్బిత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునియందు సృజత్యాది క్రియల సముచ్చయము చెప్పఁబడినవి. ఈ శ్లోకమున ఆతనియందు శమదమాది గుణముల సముచ్చయము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శమం దమం చ వైరాగ్య – మైశ్వర్యం కరుణాధియమ్।**
**శౌర్యం ధైర్యం చ గామ్భీర్యం – సదా వహతి శఙ్కరః॥ 114**

**ప్రతిపదార్థము :–** శఙ్కరః = శివుడు, సదా = ఎల్లప్పుడు, శమమ్ = అంతరింద్రియ నిగ్రహమును, దమమ్ = బహిరింద్రియ నిగ్రహమును, వైరాగ్యమ్ = వైరాగ్యమును, కరుణాధియమ్ = దయాబుద్ధిని, శౌర్యమ్ = శూరత్వమును, ధైర్యమ్ = ధీరత్వమును, గామ్భీర్యమ్ = గామ్భీర్యతను, వహతి = ధరించును.

**తాత్పర్యము :–** శివుడు అంతర్బహిరింద్రియనిగ్రహమును వైరాగ్యకారుణ్యములను శౌర్యధైర్యగాంభీర్యములను నిరంతరము ధరించియుండును.

**వివరణ :–** శమదమాది గుణముల సముచ్చయమీ శ్లోకమున చెప్పఁబడుటచే సముచ్చయాలంకార మేర్పడియున్నది. ఇది అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకములలో శివనుండి సంక్రమించిన శివుని కర్మ గుణములు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున శివ శివునితో సమకక్షముగా సర్వలోకరక్షణ మొనర్చునని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శివోఽథవా శివా సర్వ – లోకానామ్ పరిరక్షణమ్।**
**విధాతుం కల్పతే నిత్యం – దయయా పరిపూర్ణయా॥ 115**

**ప్రతిపదార్థము :–** శివః = శివుడు, అథవా = లేక, శివా =శివ, పరిపూర్ణయా = బాగుగా నిండిన, దయయా =దయతో, సర్వలోకానామ్ = అన్ని లోకములయొక్క, పరిరక్షణమ్ = సర్వవిధ రక్షణమును, విధాతుమ్ = చేయుటకు, కల్పతే = సామర్థ్యము కలిగియున్నది.

**తాత్పర్యము :–** శివుడు లేక శివ పరిపూర్ణమైన దయతో సర్వలోకరక్షణము చేయుటకు చాలును.

**వివరణ :–** ఒక వస్తువు ఒక క్రియలో ఉపయోగింపఁబడుట కల్పమనఁబడును. ఆ వస్తువునకు బదులుగా మరొక వస్తువు నుపయోగించుట అనుకల్ప మనఁబడును. లోక రక్షణ క్రియలో శివుడుపయోగింపఁబడుట కల్పము. శివుడు కాని పక్షమున శివ ఆ క్రియ యందుపయోగించినట్లు చెప్పఁబడుటచే ఈ శ్లోకమున అనుకల్ప మేర్పడియున్నది. దీనిని అలంకారగ్రంథమున అలంకారముగా అనుకల్పము పేర్కొనఁబడియుండవచ్చును.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కనుకల్పముగా శివ చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివునుపాసించువారి సర్వోత్కృష్టత చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మనుష్యా జన్తుషూత్కృష్టా – బ్రాహ్మణాస్తేషు తేష్వపి।**
**దేవతోపాసకాస్తేషు – శివోపాస్తిపరాయణాః॥ 116**

**ప్రతిపదార్థము :–** జన్తుషు = ప్రాణులందు, మనుష్యాః = మానవులు, ఉత్కృష్టాః = ఉత్కృష్టులు, తేషు = వారియందు, బ్రాహ్మణాః = బ్రాహ్మణులు, తేషు అపి = వారి యందును, దేవతోపాసకాః = దేవతలయొక్క ఉపాసకులు, తేషు అపి = వారి యందును, శివోపాస్తి పరాయణాః = శివోపాసన యందాసక్తి గలవారు, ఉత్కృష్టాః = ఉత్కృష్టులు.
**తాత్పర్యము :–** ప్రాణులలో మనుష్యులు, వారిలో బ్రాహ్మణులు, వారిలో దేవతోపాసకులు వారిలో శివోపాసకులు ఉత్కృష్టులు.
**వివరణ :–** ఈ శ్లోకమున ఒకరికంటే ఒకరు వారికంటే మరొకరు ఉత్కృష్టులు సారభూతముగా గ్రహింపఁదగినవారు అని చెప్పుటచే సారాలంకార మేర్పడియున్నది. ఇది అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున సర్వలోకముల సారము శివుడని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ శివుని తాణ్డవమున నేర్పడిన విశేష మొకటి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ తాణ్డవాయాససఞ్జాతాః – శివాఙ్గే స్వేదబిన్దవః।**
**శిరస్తః స్రస్తగఙ్గామ్భో – బిన్దుజాలైస్తిరోహితాః॥ 117**

**ప్రతిపదార్థము :–** తాణ్డవాయాస సంజాతాః = తాణ్డవముయొక్క ఆయాసము చేత కలిగిన, శివాఙ్గే = శివునియొక్క శరీరమున, స్వేదబిన్దవః = చెమట బిందువులు, శిరస్తః = శిరమునుండి, స్రస్తగఙ్గామ్భోబిన్దుజాలైః = జారిన గంగాజల బిందువులయొక్క సమూహముల చేత, తిరోహితాః = గుర్తుపట్టరానివిగా చేయఁబడినవి.
**తాత్పర్యము :–** తాణ్డవనృత్య మొనర్చునప్పుడు ఆయాసముచే శివుని శరీరము నందేర్పడిన చెమట బిందువులు ఆయన తల నుండి జారిపడిన గంగాజల బిందువులతో కలిసిపోయి గుర్తింపరానివిగా చేయఁబడినవి.
**వివరణ :–** ఈ శ్లోకమున చెమట బిందువులు గంగాజల బిన్దువులచే తిరోహితములైనట్లు అనగా మీలితమైనట్లు చెప్పఁబడుటచే మీలనాలంకార మేర్పడియున్నది. ఇది అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున చెమట బిందువుల మరియు గంగాజల బిన్దువుల యోగము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివపార్వతుల యోగము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పరయోః సున్దరతరయోః సురశుభకరయో రుమామహేశ్వరయోః।**
**అనురూపతమం యోగం మన్యే త్రిభువనతలశ్లాఘ్యమ్॥ 118**





**ప్రతిపదార్థము :–** పరయోః = ఉత్కృష్టులైన, సున్దరతరయోః = మిక్కిలి అందముకలవారైన, సురశుభకరయోః = దేవతలకు శుభముల కలిగించువాడైన, ఉమామహేశ్వరయోః = పార్వతీపరమేశ్వరులయొక్క, అనురూపతమమ్ = మిక్కిలి తగియున్న, యోగమ్ = యోగమును, త్రిభువనతలశ్లాఘ్యమ్ = ముజ్జగపు తావులలో మెచ్చుకొనఁదగిన దానినిగా, మన్యే = తలచెదను.
**తాత్పర్యము :–** ఉత్కృష్టులైన, మిక్కిలి అందము కలవారై దేవతలకు శుభముల కలిగించు వారైన పార్వతీపరమేశ్వరుల పరస్పరము తగియున్న కలయికను త్రిభువన స్థలములలో మెచ్చదగినదిగా భావించెదను.
**వివరణ :–** పార్వతీపరమేశ్వరులు ఒకరికొకరు తగియున్నవారు. వారు మిక్కిలి సున్దరులు. అందమైన భార్యకు అన్దముగాలేని భర్త అనురూపుడు కాడు. సుందరాసుందర భార్యాభర్తల యోగము అనురూపము కాదు. అట్లే ఇతరులకు శుభములను కలిగించు వారొకరు మరొకరు అశుభముల కలిగించువారైనచో వారిరువురికి యోగము అనుగుణము కాదు. ఇట్లు అనురూపము అనుగుణమునైన స్త్రీపురుషయోగము గొప్ప కలయిక అని చెప్పఁబడును. పార్వతికి పరమేశ్వరుడు రూపమున గుణములందును సమానుడు. అట్లే పరమేశ్వరునకు పార్వతి రూపగుణములలో సమానురాలు. కావున వారిరువురి యోగము సమయోగము. ఇట్టి స్త్రీ పురుషులు వివాహము ద్వారా కలిసి యొకటైనప్పుడు ఆ దాంపత్యము అనురూపత యోగము. ఇట్టి అనురూపము యోగము కోటిదంపతులలో నొకటి ఉండునేమో. కావున త్రిభువనవాసులందరు పార్వతీ పరమేశ్వరులయోగ మనురూపతమమని శ్లాఘించినారు అని అనురూప యోగము శివపార్వతులకు చెప్పఁబడుటచే నీ శ్లోకమున సమానాలంకారమేర్పడియున్నది. పూర్వార్ధమున ఏడు మాత్రా గణములు చివర గురువు ఉండుట చేత ఉత్తరార్ధమున ఆరవ గణముగా లఘువొకటే ఉన్నందున ఈ శ్లోకము **ఆర్యా** అను మాత్రాఛన్దమున నిబన్ధింపబడినదనుట స్పష్టము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివపార్వతులయోగము త్రిభువనజనశ్లాఘ్యమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున జనులకు శివానుగ్రహమెట్లు కలుగునో చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ స్నానేన దానేన జపేన భక్త్యా – విభూతిరుద్రాక్షధృతేశ్చ నిత్యమ్।**
**ప్రదోషపూజాస్తుతిభావనాభిః – శివః ప్రసాదం కురుతే జనే స్వమ్॥ 119**

**ప్రతిపదార్థము :–** నిత్యమ్ = ప్రతిదినము, స్నానేన = స్నానమున, దానేన = దానమున, జపేన = జపమున, భక్త్యా = భక్తితో, విభూతి రుద్రాక్షధృతేః చ= విభూతి రుద్రాక్షల

ధరించుట వలనను, ప్రదోష పూజాస్తుతి భావనాభిః = ప్రదోషపూజతో స్తుతితో భావనతో, శివః = శివుడు, జనే = జనమున, స్వమ్ = తన, ప్రసాదమ్ = అనుగ్రహమును, కురుతే = చేయును.

**తాత్పర్యము :–** స్నానదానజపములతో భక్తితో ప్రదోషపూజలతో స్తోత్రములతో భావనలతో అనగా ఉపాసనలతో కూడిన జనుని శివుడనుగ్రహించును.

**వివరణ :–** ఈ శ్లోకము తృతీయాంతపదములచే శివానుగ్రహహేతువులు చెప్పఁబడినవి. ఈ శ్లోకమున మొదటి పాదము ఇంద్రవజ్రా లక్షణము. మిగిలిన మూడు పాదము లుపేన్ద్రవజ్రా లక్షణము కలవగుటచే నీ శ్లోకము ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివానుగ్రహహేతువుల నడుమ భక్తి చేర్చబడినది. ఈ శ్లోకమున ఆ మిగిలిన హేతువులన్నింటికన్న భక్తి ఉత్కృష్టమని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ జన్మాలఙ్కురుతే సమ్పత్ – తాం పాత్ర ప్రతిపాదనమ్।**
**తచ్ఛివార్పితతా బుద్ధిః – తాం భక్తిర్భువనత్రయే॥ 120**

**ప్రతిపదార్థము :–** భువనత్రయే = ముజ్జగమున, సంపత్ = సంపద, జన్మ = జన్మము, తామ్ = దానిని (సంపదను), పాత్రప్రతిపాదనమ్ = యోగ్యులకిచ్చుట, తత్ = దానిని, శివార్పితతా బుద్ధిః = శివునకర్పించిన బుద్ధి, తామ్ = దానిని, భక్తిః = భక్తి, అలంకురుతే = అలంకరించును.

**తాత్పర్యము :–** ముజ్జగమున సంపద జన్మను, సంపదను సత్పాత్రులకొసగుట సత్పాత్ర దానమును శివార్పణబుద్ధి, శివార్పణబుద్ధిని, భక్తి అలంకరించును.

**వివరణ :–** ఏ లోకమునైనను సంపదలేని జన్మము అలంకారములేని మనుష్యశరీరము వలె శోభాహీనము. సంపదలేనివాని నెవరును గుర్తింపరు. వానికే సుఖమును ఉండదు. వాని జన్మము దాదాపు నిష్ఫలము. ఒకవేళ సంపదయున్నచో వాని జన్మము శ్లాఘ్య మగును. సుఖపూర్ణమగును. సంపద భోగముల కొఱకు తన శరీరమున అలంకారముల ధరించుటకొఱకు మాత్రమే ఉపయోగించుట పురుషార్థహేతువు కాదు. తన కొఱకే సంపద నుపయోగించిన వారు లోకమున నెందరు పుట్టలేదు? ఎందఱు గిట్టలేదు. వారినెవరు తలచుకొందురు? వారికేమి కీర్తి కలిగినది? సంపదకు సత్పాత్ర దానమే తగిన వినియోగము సద్వినియోగము. సత్పాత్రదానము చేయునప్పుడు దానము స్వీకరించు వానిని శివుడుగా భావించుట తన కీశ్వరుడొసగిన సంపద ఆ ఈశ్వరునకే చెందుచున్నదను భావనతో అర్పణచేయుట శివార్పణ బుద్ధి. జన్మకు సంపద



అలంకారము. సంపదకు సత్పాత్రదాన మలంకారము. అనగా సంపదకు సత్పాత్రదానమే శోభ. ఆ సత్పాత్ర యందు శివబుద్ధిచేసి దత్తమైన దానియందు శివార్పిత మనుబుద్ధి కలుగుట సత్పాత్రదానమున కలంకారము. ఆ శివార్పితబుద్ధికి భక్తి అలంకారము. భక్తిలేనిచో శివార్పితబుద్ధి అలంకరింపఁబడదు. శివార్పితబుద్ధి లేనిచో సత్పాత్రదాన మనలంకృతమే అగును. అనగా శోభాహీనమగును. అట్లే సత్పాత్రదత్తము కాని ధనము (సంపద) శోభాహీనము. ఇట్లు వరుసగా సంపదలకు సత్పాత్రదానాదులు అలంకరించునని చెప్పుటచే నీ శ్లోకమున ఏకావల్యలంకార మేర్పడియున్నది.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివభక్తులందు శివబుద్ధి యుండవలెనని ఆ బుద్ధితో పాటు శివభక్తి ఉండవలెనని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివునకు గల నీలకంఠ నామము గూఢముగా సూచింపబడుచున్నది.

**శ్లో॥ కిం పత్యుస్తవ నామేతి – పృష్టా సఖ్యాగనన్దనా।**
**హస్తేన స్తనకస్తూరీం – తస్యా లిప్తవతీ గలే॥ 121**

**ప్రతిపదార్థము :–** తవ = నీయొక్క, పత్యుః = భర్తయొక్క, నామ = పేరు, కిమ్ = ఏమి, ఇతి = అని, పృష్టా = అడిగిన, సఖ్యా = చెలికత్తె చేత, అగనన్దనా = పార్వతీదేవి, హస్తేన = చేతితో, స్తనకస్తూరీమ్ = స్తనములందలి కస్తూరిని, తస్యాః = ఆమె (చెలికత్తె)యొక్క, గలే = కంఠమునందు, లిప్తవతీ = పూసినది (అయ్యెను).

**తాత్పర్యము :–** నీ భర్త పేరేమని అడిగిన చెలికత్తె మెడకు పార్వతి తన స్తనములకు పూసికొన్న కస్తూరిని చేతికంటించుకొని పూసినది.

**వివరణ :–** చెలికత్తె మెడకు కస్తూరిని పూసి పార్వతి ఆమె మెడను నీలముగా నొనరించుటచే గూఢముగా తన భర్తపేరు నీలకంఠుడని సూచించినది. విషయము మిక్కిలి సూక్ష్మబుద్ధికి చిహ్నమగుటచే సూక్ష్మబుద్ధులకే ఆ చర్య లేక చేష్ట ఆ పేరును సూచించుటచే ఈ శ్లోకమందలి **అలంకారము సూక్ష్మమను** పేరుగలది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున గౌరి చెలికత్తెకంఠమున కస్తూరిని పూసినట్లు చెప్పఁబడినది. ఈ శ్లోకమున నీలకంఠుని కంఠముననే కస్తూరి పూసినట్లు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ నీలకణ్ఠస్య సంలిప్తా కణ్ఠే గౌర్యా రహస్యలమ్।**
**కస్తూరీ సంవృతా జ్ఞాతా గన్ధతః ప్రమథాదిభిః॥ 122**

**ప్రతిపదార్థము :–** గౌర్యా = గౌరీదేవిచేత, నీలకంఠస్య = శివునియొక్క, కంఠే = కంఠమునందు, రహసి = రహస్యస్థలమున, సంలిప్తా = బాగుగా పూయcబడిన, కస్తూరీ = కస్తూరి, సంవృతా = (అపి) = కప్పబడినదైనను, ప్రమథాదిభిః = ప్రమథులు మొదలగువారిచేత, గన్ధతః = గన్ధమువలన, అర(ల)మ్ = వెంటనే, జ్ఞాతా = తెలియ బడినది.

**తాత్పర్యము :–** గౌరీదేవి రహస్యముగా శివుని నీలకంఠమున బూసిన కస్తూరి శివుని కంఠముయొక్క నలుపుదనముచే దాచబడినను దాని వాసనచే ఆ విషయము ప్రమథాది శివభక్తులకు తెలిసిపోయినది.

**వివరణ :–** శివుని కంఠమునకు కస్తూరి సదృశము. ఆ సాదృశము వలన కస్తూరి (విశేషము) కనcబడకపోవుటచే నలుపుగుణ (సామాన్య)మే స్ఫురించుటచేత అది శివుని నీలకంఠమున కనcబడలేదని చెప్పుటచే నీ శ్లోకమున సామాన్యాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమును అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కంఠమున గౌరిపూసిన కస్తూరి వర్ణింపcబడినది. ఈ శ్లోకమున దానియందలి కాలకూటవిషము వర్ణింపcబడుచున్నది.

**శ్లో॥ మహాత్మా సహతే కష్టం – పరేషాం హితకారణాత్।**
**పార్వతీరమణః కణ్ఠే – కాలకూటం బిభర్తి హి॥ 123**

**ప్రతిపదార్థము :–** మహాత్మా = మహాత్ముడు, పరేషామ్ = ఇతరులయొక్క, హిత కారణాత్ = హితము హేతువుగా, కష్టమ్ = కష్టమును, సహతే = సహించును, పార్వతీ రమణః = శివుడు, కణ్ఠే = కణ్ఠమున, కాలకూటమ్ = కాలకూటమను విషమును, బిభర్తి హి = భరించును గదా!

**తాత్పర్యము :–** మహాత్ముడు ఇతరుల హితమునకై కష్టమును సహించును. శివుడు కాలకూట విషమును ధరించుటయే దీనికి దృష్టాంతము.

**వివరణ :–** మహాత్ముడు ఇతరులకొఱకు కష్టముల సహించుట అను సామాన్యమున శివుడు కాలకూటమును భరించుట అను విశేషముతో సమర్థింపcబడినందున ఈ శ్లోకమున అర్థాంతరన్యాసాలంకార మేర్పడియున్నది.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.





**అవతారిక :–** పై శ్లోకమున శివుని కాలకూట విషధారణము చెప్పcబడినది. ఈ శ్లోకమున ఆతడు పార్వతిని వరించుట చెప్పబడుచున్నది.

**శ్లో॥ తపసా పరితోషితః శివోఽ –**
**వృత తాదృఙ్నియమేఽపి పార్వతీమ్**
**భువనేషు మహాజనా నృణాం**
**సుగుణైరాశు వశంవదాస్సదా॥ 124**

**ప్రతిపదార్థము :–** శివః = శివుడు, తాదృఙ్నియమే + అపి = అటువంటి నియమము కలవాడైనను, తపసా = తపస్సుచే, పరితోషితః = బాగుగ సంతోషింపజేయcబడినవాడై, పార్వతీమ్ = పార్వతీదేవిని, అవృత = వరించెను, భువనేషు = లోకములయందు, మహాజనాః = గొప్పవారు, నృణామ్ = మనుష్యుల, సుగుణైః = మంచి గుణములచేత, సదా =ఎల్లప్పుడు, వశంవదాః = అనుకూలముగా మాట్లాడువారైయుందురు.

**తాత్పర్యము :–** స్త్రీ పరాఙ్ముఖత్వనియమము కలవాడైనను పార్వతీదేవిని ఆమె తపస్సునకు సంతోషించి శివుడు పెండ్లాడినాడు. మహాజనులు మనుష్యుల మంచి గుణములచే వారికి వశులై అనుకూలురగుచుందురు.

**వివరణ :–** పార్వతీదేవికి తపస్సునకు సంతోషించిన శివుని వరించుట అను విశేషము మహాత్ములు మనుష్యులకు గుణములవలన వశంవదులగుదురు అను సామాన్యముచే సమర్థింపcబడినందున అర్థాంతరన్యాసాలంకార మేర్పడియున్నది. వశంవద శబ్దము తనను మరొకరికి వశుడనని చెప్పువాడను అర్థము నొసగును.

బేసిపాదముల స–స–జ–గ అను గణయుక్తములై, సరిపాదములు స–భ–ర–ల–గ గణయుక్తములై యుండుటచే నీ శ్లోకము అర్ధసమ వియోగినీ వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున మాయ, అవిద్య మున్నగు పదములచే చెప్పcబడు పార్వతీదేవిని శివుడు వరించుట చెప్పcబడినది. ఈ శ్లోకమున అవిద్యను కౌగలించు కొన్నను శివుని అమలినతకు భంగము కలుగలేదని చెప్పcబడుచున్నది.

**శ్లో॥ అవిద్యాం మలినాం నిత్యం – శ్లిష్యన్నపి పరః శివః।**
**అగృహ్ణం స్తన్మలినతాం – భాతి శుద్ధతరః స్వయమ్॥ 125**

**ప్రతిపదార్థము :–** మలినామ్ = మలినమైన, అవిద్యామ్ = అవిద్యను, నిత్యమ్ = ఎల్లప్పుడు, శ్లిష్యన్ అపి =కౌగలించుకొనుచున్నను, పరః = ఉత్కృష్టుడైన, శివః = శివుడు, తన్మలినతామ్ = దాని (అవిద్య)యొక్క మలినతను, అగృహ్ణన్ = గ్రహించక

యుండుచు, స్వయమ్ = స్వయముగా, శుద్ధతరః = మిక్కిలి శుద్ధుడుగా, భాతి = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము :–** మలినమైన అవిద్యను కౌగలించుకొనుచున్న శివుడు తన్మాలిన్యమును స్వీకరింపక మిక్కిలి శుద్ధముగా ప్రకాశించుచున్నాడు.

**వివరణ :–** సాధారణముగా వేదాంతమున మాయ ఈశ్వరు(శివున)న కుపాధియని, జీవునకు అవిద్య ఉపాధియని చెప్పఁబడుట కలదు. జీవేశ్వరులలో జీవుడు వ్యష్టి. ఈశ్వరుడు సమష్టి. వ్యష్టి సమష్టుల కభేదమే చెప్పఁబడును. కావున ఇట వ్యష్టివాచకమైన అవిద్యా శబ్దము సమష్టి మాయావాచకముగా గ్రహింపవలసియున్నది. మాయ శుద్ధ సత్త్వ ప్రధానము. అవిద్య మలిన సత్త్వప్రధానము కావున అవిద్య మలిన అని చెప్పఁబడినది. జీవాభిన్నుడు లేక జీవునిలో అంతర్యామిగా నున్న శివుడు జీవునితోపాటు అవిద్యను కౌగలించుకొనుచునే యుండును. తామరాకు నీటిలోనున్నను నీటి తడినంటక యున్నట్లు మలినావిద్యతో కలిసియున్న పరమశివుడు అవిద్యాగత మాలిన్యము నంటకుండును. అంతేగాక మిక్కిలి పరిశుద్ధుడుగా శివుడు ప్రకాశించుట చెప్పఁబడుటచే నీ శ్లోకమున విరోధాభాసాలంకారస్ఫూర్తి యున్నది. శివునియందు అవిద్యా శ్లేషమను హేతువున్నను శివునియందు మాలిన్య మంటుట అను కార్యము పుట్టినట్లు చెప్పఁబడుటచే నీ శ్లోకమున విశేషోక్త్యలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునియందు పరిశుద్ధతయొక్క అనపనీయత్వము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివభక్తునియందు కృతార్థతయొక్క అసందిగ్ధత చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ త్వద్దాసదాసస్య పదం కదాచిత్**
**స్పృష్ట్వా భవత్యాశు పుమాన్ కృతార్థః।**
**అయే పురారే! కిముత త్రిసన్ధ్యం**
**భవత్పదామ్భోరుహయుగ్మసేవీ॥ 126**

**ప్రతిపదార్థము :–** అయే = ఓయీ, పురారే = ఓశివా! త్వద్దాస దాసస్య = నీ దాసుని దాసునియొక్క, పదమ్ = పాదమును, కదాచిత్ = ఎప్పుడేని, స్పృష్ట్వా = తాకి, పుమాన్ = పురుషుడు, ఆశు =శీఘ్రముగా, కృతార్థః = ధన్యుడు, భవతి = అగును. త్రిసన్ధ్యమ్ =మూడుసన్ధ్యలలో, భవత్పదామ్భోరుహయుగ్మసేవీ = నీ పాదముల జంటను సేవించువాడు (వాని విషయమున), కిముత = చెప్పునదేమి?



**తాత్పర్యము :–** ఆకస్మికముగ ఎప్పుడో ఒకప్పుడు నీ భక్తుని పాదమును తాకిన వాడు శీఘ్రముగా కృతార్థుడగునన్నచో మూడు సంధ్యల నీపాద కమలముల జంటను సేవించువాని విషయమున చెప్పునదేమి?

**వివరణ :–** ఈ శ్లోకమున కైముత్యన్యాయసిద్ధమైన శివపాదపద్మముల త్రిసన్ధ్యలలో సేవించువాని కృతార్థత చెప్పబడినందున అర్థాపత్త్యలంకారమేర్పడియున్నది. పూర్వార్ధమున ఇంద్రవజ్రాలక్షణము, ఉత్తరార్ధమున ఉపేన్ద్రవజ్రాలక్షణముండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున మూడు సన్ధ్యలలో శివపాదముల సేవించు వాని కృతార్థత కైముత్య న్యాయసిద్ధమని చెప్పఁబడినది. ఈ శ్లోకమున తాను అట్లు చేయలేకపోవుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ అపారసంసారసముద్రమగ్నః – కఠోరతాపత్రయపీడితోఽహమ్।**
**చలేన్ద్రియాకృష్టమనా మహేశ! – శమ్భో! భవన్తం హృది విస్మరామి॥ 127**

**ప్రతిపదార్థము :–** అపార సంసార సముద్ర మగ్నః = పారములేని సంసారకము అను సముద్రమున మునిగియున్న వాడనైనను, మహేశ! = ఓ మహేశ!, శమ్భో = ఓ శివా!, కఠోరతాపత్రయ పీడితః = కఠోరములైన మూడు తాపములచేత పీడింపఁబడిన వాడనైనను, అహమ్ = నేను, చలేన్ద్రియాకృష్టమనాః = చంచలములైన ఇంద్రియములచే ఆకర్షింపబడిన మనస్సు గలవాడనై, హృది = హృదయమునందలి, భవన్తమ్ = నిన్ను, విస్మరామి = మఱచియున్నాను.

**తాత్పర్యము :–** అంతులేని సంసారమను సముద్రమున మునిగి కఠోరమైన మూడు తాపములచేత పీడింపఁబడుచున్నను, నా మనస్సును బాహ్యేంద్రియము లాకర్షించు చున్న కారణముచేత నా హృదయమునందే సన్నిహితముగానున్న నిన్ను మఱచి యున్నాను.

**వివరణ :–** సముద్రమున మునిగినవాడు ఒడ్డుకు చేర్చుమని ఆ సమయమున కనఁబడిన వాని నెవని నైనను కోరును. ఏ గడ్డిపోచవంటి ఆధారమునైనను నిస్సహాయముగా ఆశ్రయించును. ఈ కవి చంచలములైన బాహ్యేంద్రియవిషయముల ఆకర్షమునకులోనై మనస్సు నాయింద్రియముల వెంటనే పరుగెత్తింపజేయుచు తనను మూడు తాపములు తీవ్రముగా పీడించుచున్నను ఆ తాపముల తీర్చగల ఆ సంసారసముద్రమునుండి ఉద్ధరించగల స్వామివైన నిన్ను తన హృదయమునందే సన్నిహితముగా నున్న శివునే మఱచుచున్నాడనుట ఈ శ్లోకమున చెప్పఁబడిన అర్థము. ఈ శ్లోకమున శివ

విస్మరణమునకు ఇంద్రియములు మనసు నాకర్షించుట హేతువుగా చెప్పఁబడి నందున కావ్యలింగాలంకార మేర్పడియున్నది. పూర్వార్ధము నందలి విశేషణములు స్మరణ హేతువులుగా నున్నను స్మరణము సంభవింపకపోవుటచే నేర్పడిన విశేషోక్త్యలంకార మంగముగా నున్నది. మూడు పాదములలో ఉపేన్ద్రవజ్రా లక్షణము చివఱి పాదమున ఇంద్రవజ్రా లక్షణము నుండుటచే నీ శ్లోకము ఉపజాతిచ్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున కవికృత శివ విస్మరణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున తాను శివనామము నుచ్చరించుటచే తనకు యమభయము లేదని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ న బిభేమి యమాదతిభీషణవాక్-**
**పటుహుఙ్కృతికిఙ్కరకోటియుతాత్।**
**యమశాసన నామ వదామి కదా-**
**ప్యవశాదపి భక్తభయోన్మథనమ్॥** **128**

**ప్రతిపదార్థము :-** అతిభీషణవాక్పటుహుఙ్కృతి కిఙ్కర కోటి యుతాత్ = మిక్కిలి భయంకరమైన వాక్కులుగల గొప్ప హుంకారములు గల కోటి కిఙ్కరులతో కూడిన, యమాదపి = యమునినుండియు, న బిభేమి = భయపడుట లేదు. అవశాత్ + అపి = వశమున లేనివాని నుండియైనను (ఉచ్చరింపఁబడిన), భక్త భయోన్మథనమ్ = భక్తుల భయమును తొలగించుచు, యమశాసన నామ = శివనామమును, కదా + అపి = ఎప్పుడైనను, వదామి = పలికెదను.

**తాత్పర్యము :-** అవకాశముగా నైనను ఉచ్చరింపఁబడి భక్తుల భయమును పోగొట్టు శివనామమును చెప్పెదను. కావున మిక్కిలి భయంకరము గల వాక్కులు గల తీవ్రముగా హుంకరించు కోట్లకొలది కింకరులు గల యముని నుండియు నేను భయపడుట లేదు.

**వివరణ :-** ఎప్పుడో అవకాశముగా శివనామ ముచ్చరింపఁబడి భక్తుల భయమును తొలగించు శివనామము ప్రయత్నించి యుచ్చరించిన నన్ను యముని నుండి కాపాడుటలో సందేహము లేదను అర్థము ఈ శ్లోకమున వ్యంగ్యము. యమశాసనశబ్దము సాభిప్రాయముగా శివునందు ప్రయోగింపఁబడుటచే నీ శ్లోకమున పరికరాంకురాలంకార మేర్పడియున్నది. శివునికి భయపడియే శివభక్తులు జోలికి శివనామము నుచ్చరించు వారి జోలికిని రాడను కవికి గల నిశ్చయము ఈ శ్లోకమున యమశాసన శబ్దశక్తిచేత స్ఫురించుచున్నది. ఈ శ్లోకమునందలి పాదములు నాలుగు సగుణములతో కూడియున్నందున తోటకవృత్త నిబన్ధనము.



**అవతారిక :-** పై శ్లోకమున శివభక్తులకు యమభయముండదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివపూజాతత్పరుల భవనముల సంపన్నత వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ శ్రీపార్వతీరమణపూజనతత్పరాణాం**
**నిత్యం భవన్తి భవనాని మహోజ్జ్వలాని।**
**రఙ్గన్మతఙ్గజతురఙ్గమపుఙ్గవాలీ-**
**వ్యాప్తాజిరాణి ధనధాన్యసమన్వితాని॥** **129**

**ప్రతిపదార్థము :-** శ్రీ పార్వతీ రమణ పూజన తత్పరాణామ్ = శివపూజాసక్తులైన వారియొక్క, భవనాని = గృహములు, ధనధాన్య = ధనధాన్యములతో, నిత్యమ్ = ఎల్లప్పుడు, మహోజ్జ్వలాని = మిక్కిలి ప్రకాశించునవి, రఙ్గన్మతఙ్గజ తురఙ్గమ పుఙ్గవలీ వ్యాప్తాజిరాణి = ప్రకాశించు గజ తురగ గోవులచే వ్యాపించిన ముంగిళులు గలవివై, సమన్వితాని = నిండినవై ఉండును, భవన్తి = అగును.

**తాత్పర్యము :-** శివపూజాసక్తుల ఇండ్లు ధనధాన్యములతో ప్రకాశించుచుండును. వారి ఇండ్ల ముంగిళ్ళలో ఏనుగులు, గుఱ్ఱములు, ఎద్దులు, నిండియుండును.

**వివరణ :-** శివపూజాతత్పరులు రాజ్యాధిపతులగుదురను గమ్యార్థమే భంగ్యంతరము నాశ్రయించి వారి ఇండ్ల ముంగిళ్ళు గజతురగగోవ్యాప్తములని చెప్పఁబడుటచే నీ శ్లోకమున పర్యాయోక్త్యాలంకార మేర్పడియున్నది. ప్రతిపాదమున త-భ-జ-జ-గ-గ అను గణములుండుటచే ఈ శ్లోకము ఇంద్రవంశా వృత్త నిబన్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున శివభక్తుల రాజ్యాధికార ప్రాప్తి వర్ణింపబడినది. ఈ శ్లోకమున శివగుణము వర్ణింపఁబడుచున్నది.

**శ్లో॥ వర్ణయన్తి పరం శమ్భో - ర్గణా గుణకదమ్బకమ్।**
**పిబన్తి మధురం క్షీరం - పయోధేరమృతం సురాః॥** **130**

**ప్రతిపదార్థము :-** శమ్భోః = శివునియొక్క, గణాః = గణములు, పరమ్ = శ్రేష్ఠమైన, గుణకదమ్బకమ్ = గుణముల సమూహమును, వర్ణయన్తి = వర్ణించెదరు, సురాః = దేవతలు, పయోధేః = సముద్రముయొక్క, మధురమ్ = తీయని, క్షీరమ్ = పాలైన, అమృతమ్ = అమృతమును, పిబన్తి = త్రావెదరు.

**తాత్పర్యము :-** శివ గణములు శివుని గుణ సమూహమును వర్ణించెదరు. దేవతలు సముద్రముయొక్క మధురమైన పాలనఁబడు అమృతమును త్రావెదరు.

**వివరణ :–** శమ్భు ధర్మమైన గుణసమూహమునకు, సముద్ర ధర్మమైన అమృతమునకు బింబ ప్రతిబింబభావముండుటచే నీ శ్లోకమున దృష్టాంతాలంకార మేర్పడియున్నది. పయోధి శబ్దము పాలసముద్రమును బోధించును. ఆ పాలసముద్రమున మధించగా అమృత మేర్పడినదను పురాణకథ ప్రసిద్ధము. పాలనుండి ఏర్పడిన మధురమైన అమృతము కార్యాకారణాభేదము ననుసరించి మధుర క్షీరముగా చెప్పఁబడినది. అమృతమ్ అను శబ్దము చివర మకారముండుటచే నదియు మధురమనఁదగును. లేక గుణ కదమ్బకం అను పాఠమును గుణచయం నరాః అని పఠించి నరులు పాలను దేవతలు అమృతమును త్రావినట్లు శమ్భుగణములు శివగుణ సమూహమును వర్ణించెదరనున్నట్లు అర్థము చెప్పుకొనవచ్చును. లేక మధురమ్ అను పాఠమును సురభేః అని పఠించి దేవతల కామధేనువునుండి క్షీరమును, పయోధినుండి అమృతమును సంపాదించుకొని త్రావి యానందము ననుభవించినట్లు శమ్భుగణములు శివగుణవర్ణనమున ఆనందము ననుభవించుదురను అర్థము చెప్పుకొనవచ్చును. ధర్మము బింబ ప్రతిబింబ భావముచే ధర్మిలైన సముద్ర శమ్భుల కుపమేపమేయ భావము స్ఫురించును. ఉత్తరార్థమున మధుర క్షీరముగా, అమృతము రూపింపఁబడుటచే రూపకాలంకారము, దృష్టాంతాలంకారముతో సహభావమునందు చున్నవి.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివగుణ కదమ్బమే వాస్తవమైన అమృత (నాశరహిత)మని స్ఫురింపఁజేయఁబడినది. ఈ శ్లోకమున శఙ్కర నామము పాపవిధ్వంసకమని చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ సమర్థం శాఙ్కరం నామ – పాపానాం నాశనే నృణామ్।**
**శక్తం ప్రాభాకరం బిమ్బం – విధ్వంసే తమసాం దిశామ్॥ 131**

**ప్రతిపదార్థము :–** నృణామ్ = నరులయొక్క, పాపానామ్ = పాపములయొక్క, నాశనే = నశింపఁజేయుట యందు, శాఙ్కరమ్ = శఙ్కరమునకు సంబంధించిన, నామ = నామము, సమర్థమ్ = సమర్థమైది, దిశామ్ = దిక్కులయొక్క, తమసామ్ = చీకట్లయొక్క, విధ్వంసే = నశింపఁజేయుట యందు, ప్రాభాకరమ్ = సూర్యునకు సంబంధించిన, బిమ్బమ్ = బిమ్బము, శక్తమ్ = సమర్థమైనది.

**తాత్పర్యము :–** మనుష్య పాపముల నాశమున శివనామము సమర్థము. దిక్కుల వ్యాపించిన చీకట్లు బోద్రోచుట యందు సూర్యబింబము సమర్థము.





**వివరణ :–** భిన్న వాక్యములందలి సమర్థమ్, శక్తమ్, నాశనే, విధ్వంసే అను ఏకార్థక భిన్న శబ్దములచే ప్రస్తుత శివునియొక్క పాపనాశముయొక్క అప్రస్తుత సూర్యుని తమోనాశము యొక్క సామర్థ్యము చెప్పఁబడుటచే శ్లోకమున ప్రతివస్తూపమాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివునియొక్క పాపవినాశ సామర్థ్యము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని కామ వినాశము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కామః స్వదేహం దహతః శివస్య**
**తిరస్కృతౌ శక్త్యయుతోఽగ్నికీలైః।**
**వాహోద్భవైర్మ్లాని బలైః స్వకీయైః**
**ఫలద్రుమం తస్య వనం చకార॥ 132**

**ప్రతిపదార్థము :–** కామః = మన్మథుడు, స్వదేహమ్ = తన శరీరమును, అగ్నికీలైః = అగ్నిజ్వాలలతో, దహతః = కాల్చుచున్న, శివస్య = శివునియొక్క తిరస్కృతౌ = తిరస్కరించుటయందు, శక్త్యయుతః = శక్తితో కూడని (అశక్తుడై) వాడై, తస్య = ఆతని (శివుని)యొక్క, ఫలద్రుమమ్ = పండ్ల చెట్లుగల, వనమ్ = వనమును, వాహోద్భవైః = వాహనము (చిలుక)నుండి పుట్టిన, బలైః = సైన్యములచేత, మ్లాని = వాడిపోవు దానినిగా, చకార = చేసెను.

**తాత్పర్యము :–** తన దేహమును అగ్నిజ్వాలలతో కాల్చు శివుని వారింపలేని మన్మథుడు తన వాహనమైన చిలుకయొక్క సంతానములైన చిలుకలచే ఆ శివుని ఫలవృక్షవనమును వాడిపోవునట్లు ఒనర్చెను.

**వివరణ :–** బలవద్విరోధియైన శివునేమి చేయఁజాలక ఆతని దుర్బల స్థావర ఫలవృక్షపూర్ణమైన వనమున తన వాహనమైన చిలుకకు సంబంధించిన చిలుకల గుంపులచే నశింపఁజేయుట చెప్పఁబడినందున నీ శ్లోకము ప్రత్యనీలంకార మేర్పడినది. చిలుకల దండు ఫలవృక్షమునందలి ఫలములను తినినంత తిని వానిలోని రసమును నేలమీద పారునట్లొనరించుటచే శివుని ఫలవృక్షవనము మ్లానమైనది. (వాడిపోయినది). ఆద్యంత పాదములలో ఇంద్రవజ్రా లక్షణము, మధ్య పాదద్వయమున ఉపేన్ద్రవజ్రా లక్షణము నుండుటచే నీ శ్లోకముపజాతి వృత్త నిబన్ధనము.

శివుడు స్థాణువు కావున స్థాణువులైన ఆతని వనమందలి ఫలవృక్షములపై తనను ఫాలనేత్రాగ్ని కీలలతో దహించుచున్న శివునేమి చేయఁజాలని మన్మథుడు తన బలములైన

చిలుకలతో పాడుచేయు ప్రతీకారమును తీర్చుకొంటిననుకొనుటకు సైతమాతని శరీరము మిగులలేదు అను విషాదము పై ప్రత్యనీలంకారముచే స్ఫురించు చున్నది.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని కామదహనము వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున శివుని దయ ఆవిర్భావము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ వ్యాపృతే పురుషే పుణ్యై – ర్భవబన్ధవిమోచనే।**
**దీనబన్ధో ర్మహేశస్య – ప్రససార దయా హఠాత్॥ 133**

**ప్రతిపదార్థము :–** పురుషే = పురుషుడు, భవబన్ధ విమోచనే = సంసారబన్ధమును విడిపించుకొనుటయందు, పుణ్యైః = పుణ్యములతో, వ్యాపృతే = పూనుకొనగా, దీనబన్ధోః =దీనబన్ధువైన, మహేశస్య = శివునియొక్క, దయా = కృప, హఠాత్ = ఆకస్మికముగా, ప్రససార = ప్రసరించెను.

**తాత్పర్యము :–** జీవుడు సంసారబన్ధమునుండి విడిపోగోరి పుణ్యకర్మము లొనర్చు చుండగా హఠాత్తుగా శివునకు దయ కలుగుటచే ఆతని ప్రయత్నము సులభముగా ఫలించెను. ఆతని సంసారబన్ధము తొలగెను.

**వివరణ :–** పుణ్యకర్మలు గూడ శివానుగ్రహముననే జీవుల మోక్ష ప్రయత్నమును ఫలించుటలో తోడ్పాటు మాత్రమే అందించును. వాస్తవమైన భవ బంధ విమోచనము శివకృపాసాధ్యమే. పుణ్యకర్మలు శివాజ్ఞారూప శ్రుతి స్మృత్యుక్తము లౌట చేతను ఆజ్ఞలను నిర్వర్తించుచున్నాడని, బహుజన్మానంతరము జీవులందు శివునకు దయ కలుగువచ్చును. కాని ఆ పుణ్యకర్మలన్నియు శివుడిచ్చిన బుద్ధి, శరీరావయవములచేతనే జీవులచే చేయఁబడున వగుటచే శివునకు వీరి పుణ్యకర్మలకు ఫలమొసగవలసిన ఆవశ్యకత లేదు. అయినను ఆతనికి దయకలిగినదిగా అది ఆకస్మికము మాత్రమే. ఆ అనుగ్రహము శివుని నిర్వ్యాజకృపయే. శివుని ఆజ్ఞల పాటించినందుకు జీవులకాతడేమియు ఋణపడి యుండలేదు. అని ఈ శ్లోకము హఠాచ్ఛబ్ద బలమును స్ఫురింపఁజేయుచున్నది.

ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున భవబన్ధవిమోచనమునకై పుణ్యకర్మల నొనర్చు పురుషునిపై శివకృప హఠాత్తుగా ప్రసరించునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ శివుడు దయతో చేసిన పురత్రయదహనము చెప్పఁబడుచున్నది.



**శ్లో॥ పురత్రయే గిరీశేన – ప్రదగ్ధే తూలరాశివత్।**
**ఏకధైవ హృతోఽలోకో – వ్యానశే భువనేఽభితః॥ 134**

**ప్రతిపదార్థము :–** గిరీశేన = శివునిచేత, తూలరాశివత్ = దూదికుప్పవలె, పురత్రయే = పురత్రయము, ప్రదగ్ధే = కాల్చఁబడగా, ఏకధా + ఏవ = వెంటనే, భువనే = లోకమునందు, అభితః = అంతటినుండి, హృతః = హరింపఁబడిన, అలోకః = చీకటి, వ్యానశే = నశించెను.

**తాత్పర్యము :–** శివుడు త్రిపురాసురులను దూదికుప్పవలె దహించివేయగా లోకమునందంతటి నుండి అంధకారము హరింపఁబడి నశించినది.

**వివరణ :–** పురత్రయ మనగా స్థూలసూక్ష్మకారణ దేహత్రయము. ఈ మూడింటిలో కారణదేహము నిద్రారూపాన్ధకారము. దానినుండి జనించినందున సూక్ష్మస్థూల దేహములు అంధకారరూపములే అనగా అజ్ఞానరూపములే. నిద్ర అనగా అజ్ఞానమే గదా. శివుడు తన జ్ఞాననేత్రమున పురత్రయమును కాల్చినాడనగా ఇక లోకమున అంధకారమే లేకపోయినది. అజ్ఞానమే అంతరించినది. అది ఏమైనట్లు? లోకమునం దంతటినుండి తేబడినట్లున్న పురత్రయాంధకారము (అజ్ఞానము) శివుని జ్ఞాన ప్రకాశముచే నశించిపోయినది. ఇది ఈ శ్లోకమందలి పురత్రయదాహముయొక్క అంతరార్థము. ఒకచోటనున్న పురత్రయము శివునిచే కాల్చఁబడగా లోకమందంతటి నుండి అపహరించఁబడిన అంధకారము నశించినది. భూతకాల విషయక వృత్తాంతము వర్తమానకాలమున జరుగుచున్నదనిపించినట్లు వర్ణించుటచే నీ శ్లోకమున భావి కాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుడొనర్చిన త్రిపురదాహము వర్ణింపఁబడినది. ఈ శ్లోకమున కవికి గల శివధామ ప్రీతి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ స్వర్గే భువి చ పాతాలే – రవౌ యోగిమనస్సు చ।**
**ఏకధావస్థితం ధామ – శైవ మేకం ప్రియం మమ॥ 135**

**ప్రతిపదార్థము :–** స్వర్గే = స్వర్గమునందు, భువి చ = భూమియందును, పాతాలే = పాతాలమునందును, రవౌ = సూర్యునందు, యోగి మనస్సు చ = యోగుల మనస్సునందును, ఏకధా = ఒక విధముగా, అవస్థితమ్ = ఉన్న, శైవమ్ = శివసంబంధమైన, ధామ = తేజము, మమ = నాకు, ప్రియమ్ = ప్రియమైనది.

**తాత్పర్యము :–** స్వర్గమర్త్యపాతాల లోకములందు, సూర్యునందు, యోగి మనస్సులందును ఒకే విధముగా నున్న శివతేజము నాకు ప్రియమైనది.

**వివరణ :–** ఈ శ్లోకమునందు అన్ని భిన్న స్థలములందు ఒకేవిధముగా ఉండుట అను విశేషము శివ తేజమునందు చెప్పఁబడుటచే నీ శ్లోకమున విశేషాలంకార మేర్పడియున్నది. ఇది అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివతేజము అన్నిచోట్ల ఒకేవిధముగా ఉండుట విశేషాలంకార భేదము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని జీవన్ముక్తి ప్రధాన సామర్థ్యము చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ ప్రారబ్ధభోగనిలయే – దేహే సత్యపి సేవితుః।**
**ప్రదాతుం పరమాం ముక్తిం – సమర్థస్సామ్బశఙ్కరః॥ 136**

**ప్రతిపదార్థము :–** ప్రారబ్ధభోగనిలయే = ప్రారబ్ధకర్మ ఫలానుభవమునకు ఆధారమైన, దేహే = శరీరము, సత్యపి = ఉండగానే, సేవితుః = సేవకునకు, పరమామ్ = ఉత్కృష్టమైన, ముక్తిమ్ = ముక్తిని, ప్రదాతుమ్ = ఇచ్చుటకు, సామ్బశఙ్కరః = అమ్మవారితో కూడిన శంకరుడు, సమర్థః = సమర్థుడు.

**వివరణ :–** పూర్వజన్మకృతములైన పుణ్యపాప కర్మల ఫలమంతయు ఒక జీవితకాలమున అనుభవించుట సాధ్యముకాదు. ప్రస్తుత జీవ కాలమందును రాబోవు అనేక జన్మలందు అనుభవింపవలసినంత కర్మము మన మొనర్తుము. పూర్వజన్మలలోని ఒక జన్మ (జీవితకాలము) యందు అనేక జన్మలనెత్తి అనుభవింపవలసినంత ఫలము గల పుణ్యాపాప కర్మల మన మొనర్తుము. కావున పూర్వజన్మలలోని పుణ్యపాపకర్మములలోని కర్మలన్నియు ఒకేసారి పరిపాకము నొందవు. అనగా ఫలదానము నారంభింపవు. ప్రతికర్మకును ఫలదాన సామర్థ్యము భిన్న భిన్న కాలాంతరమునందే కలుగును. లోకమున నాటిన విత్తనములు మొలకెత్తుటకు వేరువేరు కాలములు కావలసియుండుననుట మన మెరిగినదే. అట్లే ఆ మొక్కలు ఫలించుకాలములందు కూడ భేదముండునని మన మెఋుగుదుము. కొన్ని మొక్కలు ఆఋనెలల పిమ్మట మరికొన్ని మూడు నెలల పిమ్మట మరికొన్ని సంవత్సరానంతరము మరికొన్ని బహుసంవత్సరానంతరము ఫలించుట కారంభించును. అట్లు ఫలించుట కారంభించిన కర్మలవలననే మనకీ దేహ మేర్పడినది. అనగా ఇప్పటి దేహమేర్పడినది. ఫలించుట పూర్తియైన పిదప మనకీ దేహము నశించును. అనగా మనకు చావు వచ్చును. అనగా ఇప్పటి ఈ మనదేహము పూర్వజన్మకర్మలలో





నేవి పక్వములై ఫలారంభము నొనర్చుటకు సిద్ధమైనవో వానివలననే ఏర్పడినది. అట్టి ఫలారంభ మొనర్చిన కర్మలకు ప్రారబ్ధ కర్మలని పేరు. అట్లు ఫలము లారంభించని ఎన్నో కర్మలు మనకు మిగిలియున్నవి. వానికి సంచితములనిపేరు. ఈ జన్మము నందొనర్చిన కర్మలలో కొన్ని గడిచిన జన్మలందొనర్చిన కర్మలు కొన్ని రాబోవు జన్మలలో ఫల ప్రధాన సామర్థ్యము నొంది సుఖదుఃఖ ఫలముల నీయగలవు. ఆ రాబోవు జన్మలలో మనము చేయఁబోవు కర్మలు గడిచిన జన్మల, ఇప్పటి జన్మలోని కోరికల తీర్చుకొనుటకు చేయఁబడును. అట్టివి అనగా కర్మలని చెప్పఁబడును. ఈ మూడువిధములైన కర్మలలో సంచితాగామి పాపకర్మలు ఈ జన్మమున చేయఁబడు నిష్కామ సత్కర్మ అనగా ధర్మానుష్ఠానమువలన నశించిన **ధర్మేణ పాపమపనుదతి** అను శ్రుతివాక్యమునకిదే అర్థము. నిష్కామ సత్కర్మ సంచితాగామి కర్మలు ఫలించకుండఁజేయగలవే కాని ఫలారంభ మొనర్చిన పాపకర్మల మిగిలిన ఫలానుభవ మొనరించుటను నివారింపలేవు.

నిష్కామ సత్కర్మా (ధర్మా)నుష్ఠానము ఫలకామనలేని అనుష్ఠాతలకు రాబోవు జన్మల సుఖానుబంధమునకు హేతువు కాదు. కాని గడచిన జన్మలందుగాని, ఈ జన్మము నందుగాని ఫలమీయకయున్న కర్మల మాత్రము నశింపఁజేయును. ఈ విధముగా నిష్కామకర్మా (ధర్మా) నుష్ఠానము వలన సంచితాగామి పాప కర్మలన్నియు నశించును. ప్రారబ్ధకర్మలు ఫలము నారంభించినవి. కావున అవి ఫలము నొసఁగుట పూర్తి కానిదే నిష్కామ కర్మవలనను నశింపవు.

నిష్కామముగా నొనర్పఁబడిన శివసేవ అను ధర్మము కూడ పరమముక్తి నీ జన్మమున ఇచ్చినచో ఆ సేవిత (సేవకుడు) జీవన్ముక్తుడగును. ఆతనికి శివసేవ అను కర్మా (ధర్మా)నుష్ఠానమున సంచితాగామి కర్మలన్ని నశించినను ప్రారబ్ధకర్మల మిగిలిన జీవితకాలమున అనుభవమునకు రాబోవు సుఖదుఃఖముల నొసగు సామర్థ్యమును వారింపదు. ప్రారబ్ధ కర్మానుభవము ముగియకున్నను నిష్కామశివసేనకు ఫలముగా శివుడు జీవన్ముక్తిని ప్రసాదించునని ఈ శ్లోకమున చెప్పఁబడినది.

సాలోక్యము (శివలోకమున ఉండుట) సారూప్యము (శివలోకమున శివరూపము నందుట), సామీప్యము (శివలోకమున శివునకు దగ్గఱనుండుట), సాయుజ్యము (శివలోకమున శివుని శరీరమునందు జేరుట), సార్ష్టి (శివలోకమున శివునితో సమానమైన ఐశ్వర్యమును పొందుట), అను ముక్తులు శరీరముండగా లభించునవి కావు. మరణానంతరము మాత్రమే శివసేవకు ఫలముగా లభించునవి. శివుడొక సేవకునకు మరణమునకు ముందుగానే ఈ శరీరముండగానే ఇచ్చు ముక్తి జీవన్ముక్తి. ఇదియే

పరమముక్తి అని పరమ అను విశేషణము ఇంతకంటె పై ముక్తులు గొప్పవి కావు అని వ్యంజించును. కైవల్యము (మరణానంతరము శివుని తోడ నైక్యము కూడ పరమముక్తి యనుటలో సందేహము లేదు. జీవన్ముక్తి గాక మిగిలిన మరణానంతర లభ్యములైన సాలోక్యాది ముక్తులు శివలోకమున కేగిన శివసేవకుడచట జీవించి యుండగా శివుడు తత్త్వమసి అని ఉపదేశించగా **'శివోఽహమ్'** అను అనుభూతిని ఆ లోకము లోని శివసేవకుడు పొందును. అట్టి శివసేవకుడు శివలోక జీవనానంతరము కైవల్యము అనగా శివునితో నేకీభావము నొందును.

ఈ లోకముననను శివసేవకునకు గురురూపమున శివుడొకవేళ **తత్త్వమసి** అని ఉపదేశించు అనుగ్రహము చూపించినచో ఈ జన్మలోనే ఈ శరీరముండగానే **'శివోఽహమ్'** అను 'జీవశివైక్య' జ్ఞానము నొంది కొంతకాలము అనగా ప్రారబ్ధ కర్మఫలానుభవము ముగిసి మరణము నొందిన పిమ్మట కైవల్యము నొందును. కావున కైవల్యముక్తికి ముందు ఎవరికైనను జీవన్ముక్తి కలుగవలసినదే. కావున ఆ ముక్తియే పరమము. జీవన్ముక్తి కలుగని వానికి కైవల్యముక్తి అను చివఱి ముక్తి లభింపదు. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. ఇతర దేవతలకు లేని జీవన్ముక్తి అను పరమముక్తిని ఈ శరీరముండగానే తన సేవకునకిచ్చు సామర్థ్యము అను విశేషము శివునందే ఉండుటచే ఈ శ్లోకమున విశేషాలంకార భేదమున్నదని చెప్పవచ్చును.

---

**అవతారిక:**–పై శ్లోకమున జీవన్ముక్తి నిచ్చు సామర్థ్యము శివునకు గలదని చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివసేవకుడట్టి ముక్తికై చేయవలసిన అనుష్ఠానము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కైలాసశిఖరస్థస్య – పార్వతీశస్య పాదయోః॥**
**సమీపే సన్తి మే ప్రాణాః – మనసశ్చాలనం సదా॥ 137**

**ప్రతిపదార్థము :–** కైలాసశిఖరస్థస్య = కైలాస పర్వత శిఖరమునందుండు, పార్వతీశస్య = పార్వతీపతియొక్క, పాదయోః = పాదములయొక్క, సమీపే = దగ్గఱకు, మే = నాయొక్క, ప్రాణాః = ప్రాణములు, సన్తి = ఉన్నవి, మనసః = మనసుయొక్క, చాలనమ్ = చలించుట లేక చలింపఁజేయుట, సదా = ఎల్లప్పుడు (ఉన్నది).

**తాత్పర్యము :–** కైలాసపర్వతశిఖరము నందుండు శివుని పాదముల దగ్గఱ నా ప్రాణము లెప్పుడు ఉన్నవి. మనసు చలించుట చలింపఁజేయుట అను నదియు ఉన్నది.

**వివరణ :–** **ప్రాణబన్ధనం హి సౌమ్య మనః** అనునది ఉపనిషత్సూక్తి ప్రాణము లెచట నుండునో వానిని పట్టుకొని మనసచట నుండును. మనస్సున్నచోట ప్రాణముండక



పోవచ్చును. కాని ప్రాణమున్నచోట మనసుండుట తప్పనిసరి. ప్రాణములులేని శరీరమున మనశ్చలనముండదు. ప్రాణములు వాయు రూపములు. కావున వానికి చలనము స్వభావము. చలనమను వాయులక్షణముగల ప్రాణముల సాహచర్యము వలన వాయువేగమునకు మించిన వేగము మనసున కేర్పడినదేమో. మనసు సహచరులతో (ప్రాణములతో) పోటీపడి సహచరుల వేగమును మించిన వేగమును సంపాదించు కొన్నదేమో. ప్రాణములతో పాటు మనసు శివ పాదముల సన్నిధి కేగుట మరణానంతరమున మాత్రమే సంభవించును. శరీరముండగా మనసు ప్రాణములతో పాటు శివపాదముల కడకు చలించి పోగోరుట శివసేవకులలో సహజము. ఆ మనసు కోరికయే ఇట మనసు చలనముగా లేక చాలనముగా చెప్పఁబడినది. ఇంతకు మనసు శివుని అనుగ్రహము లేనిది అట్టి కోరిక నొందఁజాలదు. కనుక ఆ మనసునకు శివునిచే చలింపఁజేయఁబడుటయే యున్నది. కాని చలనము లేదు. ఒక్కొక్కప్పుడు చాలన శబ్దము చలనమను అర్థమున ప్రయోగింపఁబడుట కలదు. మనసులో కోరికలు వేరువేరుగా మారుచుండుటయే మనశ్చలనము. ఆలోచనల పరంపరలు మనశ్చలనములు శివానుగ్రహమున్నచో ఆ శివునిచే దాని చలనమో, చాలనమో శివపాదముల సన్నిధికే అగుచుండును. మనసునకు చలనమో, చాలనమో తప్పనిసరి. అది శివపాదయుగము గమ్యముగానే ఎల్లప్పుడుండుగాక అని కవి ఈ శ్లోకమున అభిప్రాయపడుచున్నాడు. ఎవరిపై మనకు ప్రేమయుండునో, వారికడ తన ప్రాణములున్నట్లు చెప్పుట లోకవ్యవహారము.

శివుని పాదములందు నా ప్రాణములున్నవి అను కవి వాక్కు. ఆయన కా శివపాదములపై గల ప్రేమను వ్యంజించుచున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. ఇతరులలో లేని ప్రాణముల శివపాదస్థితి అను విశేషణము కవి కున్నదని చెప్పఁబడుటచే నీ శ్లోకమున విశేషాలంకారమున్నదని చెప్పవచ్చును.

---

**అవతారిక:**– పై శ్లోకమున శివపాదగతప్రాణత అను శివభక్తానుష్ఠానము చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివేతర దైవత సేవనము మూర్ఖత అని చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కో వివాదస్త్వయా మూర్ఖ! – న పరం దైవతం శివాత్।**
**తథాపి బ్రహ్మ విష్ణ్వాదీన్ – సేవన్తే తాన్సదా న తమ్॥ 138**

**ప్రతిపదార్థము:–** మూర్ఖ = ఓ మూర్ఖుడా!, త్వయా = నీతో, వివాదః = వివాదము, కః = ఏమి? శివాత్ = శివునకన్న, పరమ్ = గొపప్పనైన, దైవతమ్ = దైవతము, న =

లేదు, తథా ఆపి = అయినను, తాన్ = ఆ, బ్రహ్మవిష్ణ్వాదీన్ = బ్రహ్మవిష్ణ్వాదులను, సేవన్తే = సేవించెదరే (కాని), సదా = ఎల్లప్పుడు, తమ్ = ఆతని, (శివుని), న (సేవన్తే) = సేవించరు.

**తాత్పర్యము:–** ఓ మూర్ఖుడా! నీతో వివాదమేల? శివునికన్న గొప్పదైవము లేదు. అయినను కొందఱు విష్ణ్వాదుల సేవించెదరే కాని శివుని సేవింపరు.

**వివరణము:–** మూర్ఖునందు వివాదానర్హత అను విశేషము బ్రహ్మవిష్ణ్వాది దేవతలలో లేని పరత్వము అను విశేషము శివునందు చెప్పఁబడుటచే నీ శ్లోకమునను విశేషాలంకార మున్నదని చెప్పవచ్చును. పరదైవతమైన శివునుపేక్షించి బ్రహ్మ విష్ణ్వాదుల సేవించుట సర్వసాధారణము. ఒకానొక వివేకి యందు మాత్రమే శివసేవనము అను విశేషముండు నని ఈ శ్లోకమునందు వ్యంజింపఁబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున శివుని పరదైవతముగా సేవించువాడు వివేకియని వ్యంజింపఁ బడినది. ఈ శ్లోకమున నిషేధముఖముగా శివపూజనము దారిద్ర్యనివారకమని చెప్పఁ బడుచున్నది.

**శ్లో॥ కార్యా త్వయా శివార్చేతి – వచనం న వదామి తే।**
**దారిద్ర్యకష్టానుభవా – త్తుష్ట చిత్తో భవాన్ ధ్రువమ్॥ 139**

**ప్రతిపదార్థము:–** త్వయా = నీ చేత, శివార్చా = శివపూజ, కార్యా = చేయఁదగినది. ఇతి = అను, వచనమ్ = వాక్కు, తే = నీకు, న వదామి = చెప్పుట లేదు, భవాన్ = నీవు, దారిద్ర్యకష్టానుభవాత్ = దరిద్రత వలన కలిగిన దుఃఖము యొక్క అనుభవము వలన, తుష్టచిత్తః = తృప్తిగల చిత్తముగలవాడవు (అనునది), ధ్రువమ్ = నిశ్చయము.

**తాత్పర్యము:–** ఓయీ! నీవు శివార్చనము చేయవలసినవాడవు అని నీకు నేను చెప్పుటలేదు. ఎందుకనగా నీకు దారిద్ర్యమువలన కలుగు దుఃఖముయొక్క అనుభవము వలన సంతోషము నొందిన చిత్తము కలవాడవై యున్నట్లు నాకు నిశ్చయముగా తోచుచున్నది.

**వివరణము:–** దారిద్ర్య దుఃఖానుభవము తొలగవలె నన్నచో శివార్చన మావశ్యకమని, శివార్చనము చేయని వానికి దారిద్ర్య దుఃఖానుభము అవశ్యము కలుగునని ఈ శ్లోకము వ్యంజించుచున్నది. దారిద్ర్య దుఃఖానుభవమును తొలగించునను విశేషము శివార్చనమునందే కలదని చెప్పఁబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. దారిద్ర్యదుఃఖానుభవమువలన ఎవరికి సంతోషము కలుగదు. నీకు మాత్రము దానివలన సంతోషము నీ యందు కలుగుచున్నదేమో అందుచేతనే నేను శివార్చనము చేయుమని





చెప్పినను ఇంతవఱకు నీవు చేయలేదు. ఇక ఇప్పటి నుండి నీకు శివార్చనము చేయుమని చెప్పను అను నిష్ఠురముగా చేయఁబడు ఎకసక్కెమిందు ధ్వనించుచున్నది. ఒక విధముగా నీకు దారిద్ర్యము తొలగవలెనన్నచో నీవు శివార్చన మాచరింపవలసియే యుండును. అను విధి నీకు శివార్చనము చేయమని నేను చెప్పుట లేదు అను వాచ్యనిషేధము వలన వ్యంగ్యమగుచున్నది.

---

**అవతారిక:–** పై శ్లోకమున శివార్చన విధి వ్యంజింపఁజేయఁబడినది. ఈ శ్లోకమున శివభక్తి లేని వానికి హిత ముపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ కిఞ్చిద్ధితం శివాభక్త! – కథయామి తవ (హి తే) శృణు।**
**మద్విశేషోక్తితః కిం త్వం – వేత్సి దుఃఖం భవోద్భవమ్॥ 140**

**ప్రతిపదార్థము:–** శివభక్త = శివునకు భక్తుడవు కానివాడా!, తవ = నీకు, కించిత్ = కొంచెము, హితమ్ = హితమును, కథయామి = చెప్పెదను, శృణు = వినుము, మద్విశేషోక్తితః = నా విశేషోక్తి వలన, భవోద్భవమ్ = సంసారజన్యమైన, దుఃఖమ్ = దుఃఖమును, త్వమ్ = నీవు, కిం వేత్సి = యెఱుగుచున్నావా!

**తాత్పర్యము:–** ఓ శివ భక్తి లేనివాడా! నీకొక హితమును చెప్పెదను వినుము. సంసార జన్యమైన దుఃఖమును నీవెఱుగుదువా!

**వివరణ:–** సంసారమువలన దుఃఖము ననుభవించువాడు ఆ అనుభవమును దుఃఖమని యెఱుగుచున్నాడా? దుఃఖమని యెఱుగకయే బాలాదుల వలె అనుభవించు చున్నాడా? యను సందేహమొకటి ఈ శ్లోకార్థమును తెలుసుకొను వానికి కలుగును.

మల క్రిమికి మలము యొక్క దుర్గంధము గాని, తజ్జన్యదుఃఖముగాని తెలియకయే మలమున మునిగితేలుచు జీవించుచున్నది. మలక్రిమికి దుర్గంధముగాని, తజ్జన్యమైనది సుఖమో, దుఃఖమో తెలియకయే అనుభవించుచున్నదని కొందఱనుకొనవచ్చును. అది దుఃఖమని దానికి తెలిసినప్పుడు దానినుండి బయటపడుటకు యత్నించును. దుఃఖమని తెలియక పోయినగాని అందులోనే తనకు సుఖమున్నదని తెలిసినగాని దాని నుండి బయట పడవలెనని కోరుకొనదు. ఆ క్రిమి బయటపడు ప్రయత్నము చేయకపోవుట వలన ఆ మలము నందునికి దానికి సుఖముగానే అనిపించుచున్నదని మనము నిశ్చయించుకొనవచ్చును. సుఖమైనచో అందఱికి అన్ని జీవులకు అది సుఖమే కావలెగదా! మనకు దాని అచటి ఉనికి మనకేల శోచనీయమగుచున్నది. దానిని మనము జ్ఞానహీనమని భావించుట చేతనే మనకు దాని అచటి ఉనికి శోచనీయమగు

చున్నది. అట్లే జ్ఞానులు కొందఱు మాత్రము అజ్ఞానులై సంసారము నుండి బయటపడ యత్నించని సాధారణజీవులనుఁజూచి (మనము క్రిమిపట్ల జాలిపడిట్లే) జాలినొందు చున్నారు. మన దుఃఖము శోచనీయముగా వారికి తెలియుచున్నది. అందుకే వారు మనను పిలచి సంసారమునుండి తరింపఁజేయు శివభక్త్యాధికమైన హితమును మన కుపదేశించుచున్నారు. అట్టివారిలో జ్ఞానియైన శివభక్తుడొక్కడు సంసారిని పిలచి ఓయీ! ఈ సంసారమువలన నీవు దుఃఖము నెఱుగు చున్నావా? అని ప్రశ్నించుచున్నాడు. ఒక వేళ దుఃఖముగా నీవు దానిని ఎఱుగు చుందువేని తన్నివారణ హితమును చెప్పెదను. వినుమని ఈ శ్లోకమున చెప్పుచున్నాడు.

తవ శృణు అనుచోటి ఛందోభంగ దోషము హి తే శృణు అని పఠించి నివారించు కొనవచ్చును. వదతః శృణు మే హితమ్ అని పాదమును సవరించియు పకారము యొక్క లఘుత్వము వలన కలిగిన ఛందోభంగదోషమును తొలగించుకొన వచ్చును. ఓ శ్రోతా! పూర్వము చెప్పిన కొన్ని విశేషముల ఉక్తివలనైనను నీకు సంసారము వలన దుఃఖము కలుగునని శివుడు దానిని నివారించునని నీకు తెలిసియే యుండవలసినది కాని తెలిసియున్నచో నీవే నివారణోపాయమును నడిగి యుండెడివాడవు. అడుగనందువలన నీ హితమును కోరి నేనే నిన్ను సంసారజ దుఃఖమును గూర్చి యడుగు చున్నాను. అనుట శ్లోకమునందలి అభిప్రాయము.

హితమైనను సాధారణముగా అడిగిన వానికే చెప్పవలెనను నియమమున్నది. దానినతిక్రమించి నేనే నిన్నడుగుచున్నాను. అనుట ఈ శ్లోకము నందలి వ్యంగ్యము. శ్రోత యందు విశేషమైన దయ జ్ఞానికి కలిగినచో అడిగిన పిదప చెప్పవలెనను నియమము నతిక్రమించి అజ్ఞాని నడిగి అతని దుఃఖమునుఁబోగొట్టు హితమునుపదేశించుట క్వాచిత్కముగ నున్నట్టిదే. ఈ శ్లోకము నందాక్వచిత్క అడుగఁబడకయే ఉపదేశించుట చెప్పఁబడినది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారక:–** పై శ్లోకమున ఆరంభింపఁబడిన హితోపదేశ మీ శ్లోకమున సవికల్పముగా చేయఁబడున్నది.

**శ్లో॥ ఏషోఽగ్నిః స జలాన్నష్టః – సూర్యోఽసౌ స తమోవృతః।**
**చన్ద్రోఽసౌ స క్షయీత్యన్తే – విదన్తి మునయః శివమ్॥ 141**

**ప్రతిపదార్థము:–** ఏషః = ఇది (ఈ ఉపాస్యమైన దేవత), అగ్నిః = అగ్ని (కాని), సః = అది (అగ్ని), జలాత్ = జలమువలన, నష్టః = నశించినదగును, అసౌ = ఇది





(ఉపాస్యదేవత), సూర్యః = సూర్యుడు, సః = అది (లేకవాడు/సూర్యుడు), తమోవృతః = చీకటిచే ఆవరింపఁబడియున్నాడు, అసౌ = ఇది (లేకవీడు), చన్ద్ర = చన్ద్రుడు, సః = వాడు, క్షయీ = క్షయము కలవాడు, ఇతి = అని, అంతే = చివఱ, మునయః = మునులు, శివమ్ = శివుని (ఉపాస్యదేవతగా), విదన్తి = తెలియుచున్నారు.

**తాత్పర్యము:–** ఉపాస్యత అగ్ని సూర్య చంద్రులందు వికల్పించి జలనాశ హేతువున అగ్ని, తమోవృతత్వమువలన సూర్యుడు, క్షయిత్వమువలన చంద్రుడు, ఉపాసనార్హత లేనివారని వదలి, నాశతమోక్షయములు అను మూడు దోషములు లేని శివునుపాస్యునిగా ఎట్టకేలకు మునులు తెలియచున్నారు.

**వివరణము:–** మనదేశమున ఆనాదికాలమునుండి అగ్ని ఉపాసించఁబడుచున్నది. ఈ అగ్నిని ఉపాసించి ఉపాసించి సంసారదుఃఖము తొలగించుటకు శక్తిలేని నాశమునొందు వాడగ్ని అని నిశ్చయించుకొని ఈ అగ్ని ఉపాస్యుడు కాడని తొలుత భావించిరి. కాని అనాదిగా నిష్కారణముగా అగ్ని ఏల ఉపాసింపఁబడుచున్నది? అని వారు వితర్కించి ఈ అగ్నిను పాసించుట వలన అగ్నిలోనున్న శివుడే మన సంసార దుఃఖము నివారించునని నిశ్చయించుకొని అగ్నిని శివప్రతీకముగా నుపాసించి మోక్షఫలమును మునులు పొందినారు. అట్లే సూర్యుని సంధ్యలలో ఉపాసించుట చిరకాలాభ్యస్తమై యున్నది. పితృపితామహపరంపరగా తమోవృతుడగుటచే తమస్సంపర్క శూన్యమైన మోక్షము నీయఁజాలడని యెఱిఁగి పరంపరగా సూర్య బింబమునందలి హిరణ్యగర్భుడే (శివుని యొక్క కార్య బ్రహ్మరూపము) మోక్షము నీయఁగలడని అతని యుపాసనమే పరంపరా ప్రాప్తమైనదని యెఱిగి శివప్రతీకముగా సూర్యును పాసించుచున్నారు. అట్లే క్షయవృద్ధులు గల చంద్రుడు నిత్యనిర్వికారమోక్షము నగ్రహింపఁజాలకున్నను అతనిలోని శాశ్వత సోమరూప శివుని చంద్ర ప్రతీకముగా ఉపాసించుచున్నారు. ఇట్లు అగ్ని సూర్యచంద్రులు కుపాస్యత లేకున్నను శివోపాసనా ప్రతీకత్వము కలదని ఈ శ్లోకము యొక్క అభిప్రాయము.

అగ్ని సూర్య చంద్రులు ప్రత్యక్ష దేవతలు. వారు శివోపాసనాప్రతీక రూపములేగాక శివుని ముఖమున నేత్ర రూపముగా నున్నారని శ్రుత్యాది ప్రమాణములు చెప్పుచున్నవి. ఈ జగమంతయు శివశరీరమని భావించినచో ఊర్ధ్వదేశమునగల సూర్యచంద్రాగ్నులు శరీరోర్ధ్వభాగమునందలి కన్నుల వలె శివుని ముఖమునందు అమరియున్నవని సులభముగా గమనింపవచ్చును. అగ్ని మూడవ ఫాలనేత్రముగా గ్రహింపఁజాలని వారు **అగ్నిర్ముఖమ్** అనుశ్రుతి వాక్యము వలన శివుని నోరుగా అగ్నిని భావింపఁ

వచ్చును. అదియు ఊర్ధ్వశరీరరూపమైన ముఖములోనిదే అనుట నిర్వివాదము. విద్ ధాతువు జ్ఞానముతోపాటు ఉపాసనమును బోధించు విద్యాశబ్దమునకు మూలమని విజ్ఞులెఱిగిన విషయమే. అప్రస్తుతులైన ఈ శ్లోకము నందలి అగ్ని సూర్య చంద్రులందు అనుపాస్యత అను ధర్మము వ్యక్తమైనందున తుల్యయోగితాలంకార శక్తి ఉన్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారక:–** పై శ్లోకమున శివజ్ఞాని అజ్ఞానితో చేసిన సంభాషణము చెప్పఁబడినది. ఈ శ్లోకమున పార్వతీపరమేశ్వరుల సంభాషణము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ శివే! మాం భజ హే స్థాణో – లక్ష్మ్యా కార్యం న మే ప్రియే॥**
**కిం న జనాసి మే వాణీం – బ్రహ్మాణీ తే కుతః శివ॥ 142**

**ప్రతిపదార్థము:–** శివే = ఓ పార్వతీ, మామ్ = నన్ను(లక్ష్మిని), భజ = సేవింపుము, స్థాణో = ఓ శివా!, లక్ష్మ్యాః = లక్ష్మితో, మే = నాకు, న కార్యమ్ = పనిలేదు, ప్రియే = ఓ ప్రియులారా, మే = నా యొక్క వాణీమ్ = వాక్కును (బ్రహ్మభార్యను), న జానాసి = ఎఱుగవు, శివ! = ఓ శివా!, తే = నీకు, బ్రహ్మాణీ = బ్రహ్మ భార్య, కుతః = ఎక్కడది?

**తాత్పర్యము:–** శివుడు ఓ పార్వతీ నన్ను సేవింపుము అనగా పార్వతి మామ్ అను పదము యొక్క మరొక అర్థమైన లక్ష్మిని అను అర్థమును గ్రహించి, ఓ స్థాణూ! లక్ష్మితో నాకేమిపని అని అన్నది. అప్పుడు శివుడు – నా మాట నీకర్థము కాలేదా? అని అనగా వాణీ అను పదమునకు బ్రహ్మ భార్య అను అర్థమును గ్రహించి బ్రహ్మాణి నీకెక్కడిది? అని అన్నది.

**వివరణ:–** మామ్ అను పదమునకు నన్ను (శివుని) అను అర్థము తెలిసినను పార్వతి ఆ పదమునకు గల మరొక అర్థమును కావలెనని స్వీకరించి లక్ష్మితో నాకేమి పని అని వంకర సమాధానము చెప్పినది. అట్లే నా మాట అను అర్థమును మే వాణీమ్ అను పదముల నుండి సరిగా గ్రహించియు పార్వతి ఆ పదమునకు గల బ్రహ్మాణి అను మరొక అర్థమును గ్రహించి బ్రహ్మాణి నీకెక్కడిది అని ఆక్షేపించినది. ఇది **మామ్, వాణీమ్** అను పదములకు గల రెండర్థముల (శ్లేష) వలన పార్వతి మాటలలో వక్రత తెలిపినందున ఈ శ్లోకమున వక్రోక్త్యలంకార మేర్పడి యున్నది.

పార్వతి శివుని 'స్థాణో' అను సంబోధించుట చేత 'ఓయీ మొద్దు! నా వక్రమాటల అర్థము నీవు గ్రహింపలేవు' అని వెక్కిరింత వ్యంగ్యమగుచున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---



**అవతారక:–** పై శ్లోకమున పార్వతి వక్రోక్తి చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని వక్రోక్తి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ మయి నాస్తి తవ ప్రీతి – ర్హర! గఙ్గాధర! ప్రభో!॥**
**త్వయి నాస్తి శివే! ప్రీతిః – కిమ్ మృషా భాషసే వృథా॥ 143**

**ప్రతిపదార్థము:–** హర = హరా!, గంగాధర = గంగను ధరించువాడా, ప్రభో = ప్రభూ, మయి = నా యందు,తవ = నీకువ, ప్రీతిః = ప్రేమ, న ఆస్తి = లేదు, శివే = ఓ పార్వతీ, త్వయి = నీయందు, ప్రీతిః = ప్రేమ, న ఆస్తి = లేదు, వృథా = వ్యర్థముగా, మృషా = అసత్యము, కిమ్ భాషసే = పలికెదవేమి?

**తాత్పర్యము:–** ఓ శివా! గంగాధరా! ప్రభూ! నీకు నాయందు ప్రీతిలేదని పార్వతి అనగా, శివుడు ఓ శివా! (పార్వతీ) నీ యందు ప్రీతి లేదని ఏల వ్యర్థముగా అసత్యము పలికెదవు అని ఆక్షేపించెను.

**వివరణ:–** శివుడు నన్ను గంగాధర! అని సంబోధించుచున్నందున నీ యందు శివ విషయక ప్రీతి లేదని తెలియుచుండగా నాకే నీ యందు ప్రేమ లేదనుట అసత్యము. అనవసరముగా వ్యర్థముగా అట్టి అసత్యము నేల పలికెదవు అని శివుడు పార్వతితో గంగను ధరించి అపరాధియయ్యు శివుడు పార్వతి వాక్క అసత్యమని వక్రముగా చెప్పుటచే నీ శ్లోకమున వక్రోక్త్యలంకార మేర్పడియున్నది. **"శివే ప్రీతిః"** అను పదములకు శివ విషయక ప్రీతి అను అర్థాంతరము కల్పించు కొనునవకాశమున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున గంగాధర! అని సంబోధించి శివునకు తన యందు ప్రీతి లేదని పార్వతిచే గంగను ధరించి ఆపరాధియయ్యు శివుడు పార్వతిమాట అసత్యమని శివునిచే అభిప్రాయ వక్రీకరణ చేయఁబడినది. ఈ శ్లోకమున కవి శివుని సాభిప్రాయ విశేషణములతో విశేషించి స్వరక్షణము నర్థించుట చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ సర్వవిద్యానిధిర్లక్ష్మీ – పూజితః పాపసంహరః॥**
**మృత్యుఞ్జయః కృపాశాలీ – పాతు మా(స్వా)మీశ్వరః సదా॥ 144**

**ప్రతిపదార్థము:–** సర్వవిద్యానిధిః = సర్వవిద్యలకు నిధిగాని, లక్ష్మీపూజితః = లక్ష్మిచే పూజింపఁబడినవాడు, పాపసంహరః = పాపులకు (పాపములను) సంహరించువాడు, మృత్యుంజయః = మృత్యువును జయించినవాడు, కృపాశాలీ = దయతో నొప్పువాడు, స్వామి = ప్రభువైన, ఈశ్వరః = శివుడు, మామ్ = నన్ను, పాతు = రక్షించుగాక!

**తాత్పర్యము:–** సర్వవిద్యలకుగాని, లక్ష్మిచేత పూజింపఁబడువాడు, పాపులను లేక పాపములను సంహరించువాడు, మృత్యువును జయించినవాడు దయతో నొప్పువాఁడు, స్వామియునైన శివుడు సదా = ఎల్లప్పుడు పాతు = కాపాడుగాక!

**వివరణ:–** ఎల్లప్పుడు పాలించుగాక అని ప్రార్థించు కవి ఎల్లప్పుడు జీవించి అనగా మృత్యువును జయించి యుండవలె గదా, అందుచేతనే శివునకు మృత్యుంజయ అను విశేషణమును కూర్చినాడు. పాతు అను క్రియకు రక్షించుగాక అని అర్థము. రక్షణ అనగా మృత్యువు కలుగకుండ, అజ్ఞానము లేకుండ, పేదరికము లేకుండ, పాపము తజ్జన్య దుఃఖము లేకుండ, పాపులు తనపై ఆక్రమించకుండా చేయుట పైనఁబేర్కొన్న ఇబ్బందులన్నింటిని తొలగించుటకు సర్వవిద్యానిధిః (అజ్ఞానము లేకుండ చేయగలవాడు) లక్ష్మిచేత పూజితుడు, పేదరికము లేకుండ చేయగలవాడు, పాపముల బాధను లేకుండఁ జేయువాడు, మృత్యుంజయః (మృత్యువు లేకుండా జేయువాడు) అను విశేషణములు ప్రయోగింపఁబడుటచే నీ శ్లోకమున పరికరాలంకార మేర్పడినది. పైనఁబేర్కొనబడిన ఇబ్బందులు లేకుండజేయు బాధ్యత శివునకెక్కడిది? అను ప్రశ్నకు 'స్వామి' అను విశేషణము సమాధానమైయున్నది. ఇంతకు ఈ ఇబ్బందులు లేకుండ ఆ శివుడు చేయగలడా? అను ప్రశ్నకు ఆయన సమర్థుడు అను అర్థమిచ్చు ఈశ్వరః అను విశేష్యము ప్రయోగింపఁబడినది. ఇట్లు విశేషణములేగాక విశేష్యము గూడ సాభిప్రాయముగా ప్రయోగింపఁబడుటచే సర్వ విద్యానిధిః అను విశేషణము సర్వజ్ఞత్వమును తెలుపుచు ఆదిపద బోధ్యములైన ఇతర లక్షణముల మిగిలిన విశేషణములు తెలుపును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున ఈశ్వరు నుండి తన రక్షణ మర్థింపఁబడినది. ఈ శ్లోకమున ముముక్షువునకు శివభజన మావశ్యకమని ఉపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ ముముక్షో! మద్వచః శ్రుత్వా – కైలాసస్థం భవం భజ।**
**విషయానుభవైకశ్రీ – సదానన్దో భవం భజ॥ 145**

**ప్రతిపదార్థము:–** ముముక్షో = మోక్షేచ్ఛ గలవాడా!, మద్వచః = నా మాటను, శ్రుత్వా = విని, కైలాసస్థమ్ = కైలాసము నందుండు, భవమ్ = శివుని, భజ =సేవింపుము. విషయానుభవైక శ్రీసదానన్దః = విషయముల అనుభవములు ముఖ్యైశ్వర్యమునందే ఎల్లప్పుడు ఆనందించువాడవై, భవమ్ = సంసారమును, భజ = సేవింపుము.



**తాత్పర్యము :–** ఓ మోక్షేచ్ఛ గలవాడా! నా మాట విని కైలాసవాసియైన శివుని సేవింపుము. లేదా విషయానుభవము గొప్ప ఐశ్వర్యమును చేతనే ఎల్లప్పుడు ఆనందము కోరువాడవైనచో సంసారమును సేవింపుము.

**వివరణ :–** పూర్వార్ధమందలి భవ శబ్ద వాచ్యునకు కైలాసస్థమ్ అను విశేషణము ప్రయోగింపఁబడుటచే అచటి భవ శబ్దము శివ వాచకము అని స్పష్టము చేయును. భవ శబ్దమునకు సంసారము అను అర్థాంతరము స్ఫురింపఁజేయుటకే ఆ కైలాసస్థ విశేషణము అని వేరుగా చెప్పనక్కరలేదు. పరిశేషన్యాయమున ఉత్తరార్ధమందలి భవ శబ్దము సంసారమును బోధించునని చెప్పుటకు విషయానుభవేత్యాది విశేషణము ప్రయోగింపఁబడినది. సంసారము నందే గదా విషయానుభవము ఉండునది. సంసారము నందలి ఐశ్వర్యమే గదా! సర్వ భూమండలేశ్వరుడు విత్తపూర్ణుడై, యువకుడై, ఆరోగ్యవంతుడై, బలిష్ఠుడు నైనచో ఆ సంసారమునందలి ఆ సార్వభౌమునకు సర్వ భూవిషయానుభవమే ముఖ్యమైన ఐశ్వర్యము. దానితోడనే మృత్యుపర్యంతమైన ఆనందము ఆతనికి కలుగును. వాస్తవమునకు మృత్యుభయము తోడనే ఆతడా విషయముల ననుభవించుచుండును. గావున ఆతనికి సదా ఆనందమే కాని, ఆనందము కలుగదని సదానంద శబ్దములోని ఈ విభాగావకాశము వ్యంజింపఁజేయును. ఈ విభాగమును పట్టించు కొననప్పుడు శివభజనమే అసాంసారిక విషయ భజనము. ఒకనియందు వికల్పింపఁబడి నందు వికల్పాలంకార మేర్పడును.

సదా ఆనందః అను విభాగము సంసారమునందు కలుగునది ఆనందాభాసమైన ఆనందమే కాని యథార్థమైన ఆనందము కాదని వ్యంజింపఁజేయును. పైగా ముముక్షో అని సంబోధించినప్పుడు కైలాసస్థ శివభజనమే ఉపదేశ్యమగును. గాని సంసారక విషయభజనము ఉపదేశ్యము కాకూడదు గదా! కావున ఉత్తరార్ధమున విషయానుభవానందాభిలాష గలవాడా! అను సంబోధనము కల్పించుకొని సంసారరూపభవ భజనముపదేశ్యముగా నిర్వహించుకొనవలెను. ముముక్షువులైనచో శివుని, విషయాభిలాషివైనచో సంసారమును భజింపుమను విధముగా కవియొక్క అభిప్రాయముగా భావించుకొన్నచో వికల్పాలంకారము. తుల్యబలములైన శివభజన సంసారభజనములకు ఉపదేశ్యుని ఇచ్ఛననుసరించి ఉపదేశకుడు ఉపదేశించినట్లు చెప్పుకొని నిర్వహించుకొనవలెను.

**అవతారిక :–** పై శ్లోకమున ముముక్షువునకు అప్రస్తుతమైన విషయానుభవపూర్ణసంసార భజనము పక్షాంతరముగా ఉపదేశింపఁబడినది. ఈ శ్లోకమున అప్రస్తుత భ్రమరమునకు అల్పకుసుమముల విడచి పద్మసుమముల భజనముపదేశింపఁబడుచున్నది.

**శ్లో॥ కిం చఞ్చలస్వభావాలే! - భ్రమస్యల్పసుమాలిషు।**
**అస్తి తే నిస్తులం పద్మం - త్వన్మనోఽభీష్టదం సదా॥ 146**

**ప్రతిపదార్థము :-** చఞ్చల స్వభావ = చఞ్చల స్వభావముగల, అలే = ఓ భ్రమరమా!, అల్పసుమాలిషు = అల్పములైన కుసుమముల గుంపులందు, కిమ్ భ్రమసి = ఎందుకు తిరిగెదవు. త్వన్మనోభీష్టదమ్ = నీ మనసులోని ముఖ్యమైన ఇష్టము నిచ్చునట్టి (అందుచేతనే), నిస్తులమ్ = సాటిలేని, పద్మమ్ = పద్మము, తే = నీకు, అస్తి = ఉన్నది (గదా!).

**తాత్పర్యము :-** చంచలస్వభావముగల భ్రమరమా! అల్పములైన పూలగుంపులలో నేల తిరిగెదవు? నీ మనస్సులోని ముఖ్యమైన ఇష్టమొసగు పద్మము నీ అందుబాటులో నున్నది గదా!

**వివరణ :-** అప్రస్తుత సంబోధ్యవాచియైన అలే అను పదమిచట నిత్య సంతోషము కొఱకు, అనిత్య విషయముల గుంపులో తిరుగు ప్రస్తుత జీవుని వ్యంగ్యముగా సంబోధించును. అల్పసుమాలి పదము ప్రస్తుతములైన విషయ సమూహముల వ్యంజించును. అప్రస్తుతవాచియైన పద్మ పదము ప్రస్తుత శివపాద పద్మమున అతిశయోక్తి చ్ఛాయతో వ్యంజించును. కావున ఈ శ్లోకమున అప్రస్తుత ప్రశంసాలంకార మేర్పడియున్నది. సుమశబ్దము మంచి కాంతిగలది అను యోగార్థము కలదై రూఢితో పుష్ప బోధకము. ఎంత మంచి కాంతియున్నను అది త్వరగా వాడిపోవు స్వభావముగలదై ఆకారమున చిన్నదియై యున్నందున ఆ సుమము అల్పమని విశేషింపఁబడినది. సమాసమందలి ఆలి శబ్దము అలి అని విభజించుటకు వీలుగల సమాసపదమున చివఱ నుండుటచే అల్ప భ్రమరములు అల్ప సుమములను గాక అనల్ప వస్తువుల దారికెట్లు పోవును అను భ్రమరాల్పతకు అల్పసుమ భ్రమణము యోగ్యమే అని వ్యాజముగా భ్రమరనింద వ్యంగ్యమగుటచే ఈ శ్లోకమున వ్యాజనిందాలంకారము గూడ నున్నది. ఈ వ్యాజనింద వలన ప్రస్తుత విషయాభిలాష నిందయందే పర్యవసించుచు, వాని అల్పతనే వ్యంజించును.

పద్మ శబ్దము పద్ మ అను విభాగము ననుసరించి పాదకాంతిగలది అను యోగార్థముగలదై కమలమును రూఢితో బోధించును. కమలమే పాదకాంతి గలిగియున్నది. అను ప్రశ్నమునకు శివపాదకాంతి గలది అను సమాధానము చెప్పుకొన్నచో శివపాద ముపమానమై కమలముపమేయమై ప్రతీపాలంకార వ్యక్తికి తోడ్పడును.



సుమ పద్మ వంటి కాంతిమంతములైన పదములీ శ్లోకమును మొత్తమును కాంతిమంత మొనరించుచున్నవి. పద్మము నిస్తులమని విశేషింపఁబడుటచేత ద్వితీయ సదృశ వ్యవచ్ఛేద ఫలకమైన అనన్వయాలంకారము వ్యంజింపఁజేయఁబడుచున్నది. మనోఽభీష్టదమను విశేషణము శాశ్వత సుఖమును మనోభీష్టమోక్షదమను శివపాదపద్మముల ప్రసాదింపఁగలదని వ్యంజించును. అల్పసుమముల వంటి ఇతర దేవతలెవ్వరును ఆ మోక్షము నీయఁజాలరని ఇతర దేవతాల్పత (నింద) కూడ ఇందు వ్యంజింపఁబడుచున్నది. అనేక జన్మలలో బహువిధ శరీరములనంది బహు విషయముల అనుభవమువలన తృప్తిలేక తిరుగు జీవుల చంచల స్వభావమును, చంచల స్వభావ అను విశేషణము వ్యంజించును. అల్ప సుమములవంటి విషయముల వలనగాని శివేతర దేవతల వలనగాని మోక్షము లభింపకపోవుట వలన మోక్షార్థివైనచో నీకు శివపాదపద్మమే శరణ్యమను మహోపదేశము శ్లోకమున ప్రధానముగా అందులోని శ్రీ శబ్దము విషయముల విషము వంటివి. కావున తదభిలాష యందనుభవము ఆనందమును అనగా దుః ఖమునే యిచ్చునని సార్వత్రికముగా వ్యంజించును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబద్ధనము.

---

**అవతారిక :-** పై శ్లోకమున అప్రస్తుత భ్రమరోపదేశము చెప్పఁబడుచున్నది. ఈ శ్లోకమున అప్రస్తుత భక్తరక్షక శివ ప్రశంస చేయబడుచున్నది.

**శ్లో॥ అభినన్ద్య తపోఽ - ధిష్ఠం వితీర్యాభీప్సితం వరమ్।**
**శివేన దయయా భక్తా - బహవః పరిరక్షితాః॥ 147**

**ప్రతిపదార్థము :-** తపోధిష్ఠమ్ = తపోనిష్ఠ గలవానిని, అభినన్ద్యః = అభినందించి, అభీప్సితమ్ = కోరఁబడిన,వరమ్ = వరమును, వితీర్య = ఇచ్చి, శివేన = శివునిచేత, దయయా = కృపతో, బహవః = పెక్కురు, భక్తాః = భక్తులు, పరిరక్షితాః = బాగుగా రక్షింపఁబడినారు.

**తాత్పర్యము :-** భక్తులలోని తపోనిష్ఠను అభినందించి కోరిన వరము నొసగి పెక్కురు భక్తులను శివుడు దయతో బాగుగా రక్షించినాఁడు.

**వివరణ :-** భక్తులు కొందఱు లౌకికవాంఛతో సేవించెదరు. వారికి వారి అభీప్సితములను శివుడొసగి రక్షించును. కొందఱు భక్తులే కోరికలఁగోరకయే శివునిగూర్చి తప మొనరించెదరు. వారిని శివుడభినందించి తన లోకమునకు కొనిపోయి మృత్యువునుండి రక్షించును. ఇట్లెందరో భక్తులు శివునిచే దయతో బాగుగా రక్షింపఁబడినారను అప్రస్తుతప్రశంసవలన సాధారణజీవునుద్దేశించి శివునకై తపమొనరింపుమను ఉపదేశము

వ్యంగ్యమగుటచే నీ శ్లోకమునను అప్రస్తుత ప్రశంసాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివుని గూర్చి తపము చేయుమను ఉపదేశము వ్యంజింపఁ బడినది. ఈ శ్లోకమున శివనామమును పలుకు మను ఉపదేశము వ్యంజింపఁ బడుచున్నది.

**శ్లో॥ సకృద్యో వక్తి నామైశం - మహాదేవేతి జిహ్వయా।**
**పురుషస్య క్షణా త్తస్య - బ్రహ్మహత్యాపి నశ్యతి॥ 148**

**ప్రతిపదార్థము :–** యః = ఎవడు, జిహ్వయా = నాలుకతో, సకృత్ = ఒకేసారి, మహాదేవ + ఇతి = మహాదేవ అని, ఐశమ్ = శివునికి చెందిన, నామ = నామమును, వక్తి = చెప్పునో, (తస్య = అ), పురుషస్య = జీవునియొక్క, బ్రహ్మహత్యా + అపి = బ్రహ్మహత్య కూడ, క్షణాత్ = క్షణములో, నశ్యతి = నశించును.

**తాత్పర్యము :–** ఎవడు నాలుకతో నొకసారి మహాదేవ అని శివనామము నుచ్చరించునో వాని బ్రహ్మహత్య కూడ క్షణకాలమున నశించును.

**వివరణ :–** బ్రహ్మహత్య సురాపాన సువర్ణస్తేయాది మహా పాపములలో నొకటి. అట్టి బ్రహ్మహత్య కూడ క్షణకాలమున మహాదేవ అను శివనామమును నాలుకతో నొకసారి నుచ్చరించిన మాత్రమున నశించునను అప్రస్తుత విషయప్రశంసవలన కవి తన ఎదుట నున్న బ్రహ్మహత్యతో తపించుచున్న జీవునిగూర్చి చేసిన ఉపదేశము వ్యంగ్య మగుటచే నీ శ్లోకమును అప్రస్తుత ప్రశంసాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక :–** పై శ్లోకమున శివనామోచ్చారణ మాత్రమున బ్రహ్మహత్య నశించునని చెప్పఁబడినది. ఈ శ్లోకమున కైలాసమున శివుడున్నాడన్న స్మృతి మాత్రమునను శంకతో బ్రహ్మాదుల ముఖములలో వైవర్ణ్యము చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ కైలాసశైలశిఖరే - విద్యమానే మహేశ్వరే।**
**వైవర్ణ్య మధికం జాతం - బ్రహ్మాదీనామ్ ముఖేష్వపి॥ 149**

**ప్రతిపదార్థము :–** కైలాసశైల శిఖరే = కైలాస పర్వత శిఖరమునందు, మహేశ్వరే = పరమేశ్వరుడు, విద్యమానే = ఉండగా, బ్రహ్మాదీనామ్ = బ్రహ్మాదులయొక్క, ముఖేషు అపి = ముఖములందును, అధికమ్ = మిక్కిలి, వైవర్ణ్యమ్ = పాలిపోవుట (అంతకు ముందున్న వర్ణము పోయి క్రొత్తగా వచ్చుట), జాతమ్ = కలిగినది.





**తాత్పర్యము :–** శివుడు కైలాసపర్వతశిఖరమున నుండగా బ్రహ్మాదుల ముఖములు పాలిపోయినవి.

**వివరణ :–** అధికారి ఉన్నాడను జ్ఞానము లేనప్పుడు అల్పోద్యోగులు స్వేచ్ఛగా ప్రవర్తించుచుందురు. ఆతడు ఉన్నాడు సమీపమున ఉన్నాడు అను జ్ఞానము కలిగినప్పుడు వారి భయము కొంతకొంత పెరుగుచుండును. వారి విధి నిర్వహణలోని లోపముల గుర్తించి ఆయన శిక్షించునేమో అనునదే వారి భయమునకు హేతువు. బ్రహ్మాదుల లోకములు క్రిందివి. శివలోకము బ్రహ్మాండోర్ధ్వగతము. ఆ ఎత్తున ఉన్న శివ లోకమున ఎత్తైన కైలాస పర్వతమొకటి ఉన్నది. దాని ఎత్తైన శిఖరమున శివుడున్నాడు. ఉన్నాడను జ్ఞానము బ్రహ్మాదులలో కలిగియున్నది. ఇప్పటివఱకు ఆ జ్ఞానము లేకపోవుటచే వారు స్వేచ్ఛతో విధుల నిర్వర్తించిరి. కాని ఇప్పుడు అంత దూరమున నున్నను ఆయన శీఘ్రముగా విధి నిర్వహణ లోపముల గుర్తించి శిక్షించునేమో అను భయమున వారి ముఖములలోని వివిధ వర్ణములు పోయి క్రొత్తగా తెల్లదనము వచ్చినది. ఎఱ్ఱని వర్ణముగల బ్రహ్మముఖము, నీలవర్ణముగల విష్ణుముఖమును తెల్లఁబడి ఎవరు బ్రహ్మయో, ఎవరు విష్ణువో ముఖము చూచి తెలుసుకొనుట కితరుల కవకాశము కలుగుటలేదు. ఈ అప్రస్తుతప్రశంస (అలంకారము) వలన సాధారణుల విధి నిర్వహణలోపము యొక్క శిక్షార్హత కైముత్యన్యాయసిద్ధము.

శివుడు తెల్లనివాడు. ఆతని ముఖమును తెల్లనిదే. ఇప్పుడు బ్రహ్మాదుల ముఖములును తెల్లనివై పోయినవి. (పాలిపోయి తెల్లనివైనవి) భయము చేతను బ్రహ్మాదులకు శివసారూప్యము కలిగినది. అనగా భక్తితో శివసారూప్యము కలుగుననుట కైముత్య న్యాయసిద్ధము. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవాతరిక:–** పై శ్లోకమున బ్రహ్మాదులకును శివభయము వలన వైవర్ణ్యము కలుగుట చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుని కృపాదృష్టిప్రభావము చెప్పబడుచున్నది.

**శ్లో॥ సదా పశ్యతి సర్వత్ర - శివే సోమే కృపానిధౌ।**
**కిమాశ్చర్యం తవాత్యన్తం - కే దీనా భువనాన్తరే॥ 150**

**ప్రతిపదార్థము:–** కృపానిధౌ = దయకుగనియైన, సోమే = ఉమతోకూడిన, శివే = శివుడు, సదా = ఎల్లప్పుడు, సర్వత్ర = అంతట, పశ్యతి = చూచుచుండగా (చూచుచున్నాడనుటలో), తవ = నీకు, కిమ్ = ఏమి?, ఆశ్చర్యమ్ = వింత, భువనాన్తరే = భువనములలో, కేః = ఎవరు, ధీనాః = దీనులు?

**తాత్పర్యము:-** దయానిధి ఉమాసహితుడునైన శివుడు ఎల్లప్పుడు అంతట చూచుచుండుననుటలో నీకేల ఆశ్చర్యము కలుగుచున్నది. భువనములలో దీనులెవరు?
**వివరణ:-** శివుడు ఎల్లప్పుడు అంతట చూచుచున్నాడని గమనించిన వారికి దైన్యము కలుగదు. ఎవరు దీనులు? వానికి దైన్యమెట్లు కలిగినది. వారే భువనములలో ఉన్నారు? అన్న ప్రశ్నకు శివుడెల్లప్పుడు అన్ని లోకములలోను తన కృపాదృష్టిని ప్రసరించుచున్నాడని తెలియని వారే అని చెప్పుటకు దీనులెవరు? అను అప్రస్తుత ప్రశ్న ఈ శ్లోకమున చేయఁబడినది. కావున ఈ శ్లోకమును అప్రస్తుత ప్రశంసాలంకారమే. శివుని కృపాదృష్టిని గమనించని వారైనచో ఎంత వారికిని దైన్యము దప్పదను ప్రస్తుతాంశమిందు వ్యంగ్యమై యున్నది. శివుడెచ్చటనో ఉన్నాడని అధర్మము చేసినచో వారికి దైన్యము తప్పదను, ప్రస్తుతాంశమును ఇందు వ్యంగ్యము. ప్రధానముగా శివ ప్రశంసయే ఇందు ప్రధాన వ్యంగ్యము. ఈ శ్లోకము **అనుష్టుప్ఛన్దో** నిబన్ధనము.

---

**అవతారిక:-** పై శ్లోకమున శివప్రశంస వ్యంజింపఁజేయుఁబడినది. ఈ శ్లోకమున వాచ్యమైన నిందలో శివుని ప్రశంస వ్యంజింపఁజేయఁబడినది.

**శ్లో॥ కథం శ్లాఘ్యః శివః స్వేషాం - సంసారసుఖనాశకః।**
**భూతిధారీ ప్రలయకృత్ - సాక్షాత్ కామవిఘాతుకః॥ 151**

**ప్రతిపదార్థము:-** స్వేషామ్ = తనవారి యొక్క, సంసార సుఖనాశకః = సంసార సుఖమును నశింపఁజేయు, శివః = శివుడు, కథమ్ = ఎట్లు, శ్లాఘ్యః = మెచ్చుకొనఁదగినవాడు, (పైగా), భూతిధారీ = భూతిని ధరించువాడు, ప్రలయకృత్ = ప్రలయ మొనర్చువాడు, సాక్షాత్ = స్వయముగా, కామవిఘాతుకః = కాముని చంపినవాడు.
**తాత్పర్యము:-** భూతిధారియు, ప్రలయంకరుడును కామసంహారియునై తనవారి సంసార సుఖమునే నశింపఁజేయు శివుడెట్లు మెచ్చుకొనఁదగిన వాఁడగును.
**వివరణ:-** 1) (శ్మశానములోని) భూతిని ధరించుట, నిష్కారణముగా లోకములకు మృత్యువును కలిగించుట. కోరికల నశింపజేయుట. పైగా తనవారి సుఖమునే నశింపఁజేయుట అను నింద్యకృత్యము లొనర్చు శివుడెట్లు ప్రశంసాపాత్రుడు? ప్రశంసాపాత్రుడు కాడు అనుట వలన శివుడు నిందనీయు డనునదే ఆక్షిప్తార్థము. 2) పై వాచ్యమైన నిందవలన సంసారసుఖము ఆద్యన్తసహితము అనిత్యము కావున అది ఉన్న కాలమునను భయముతో కూడియే అనుభవింపఁబడుచుండును. దాని నశింపఁజేయుటకు శివుడు మాత్రమే సమర్థుడు. ఇతర దేవతలకెవలకును ఆ సామర్థ్యము లేదు. తాను భూతిని



ధరించియు ఇతరులకు భూతిని (అనగా ఐశ్వర్యమును) ఇచ్చువాడు. తానే భూతిని ధరించిన వాడెట్లితరులకు భూతి నీయగలడు? 3) స్థూలముగా ప్రలయము అనగా చంపుట నింద్యమైన క్రోధజన్మమైన కృత్యముగా కనఁబడును. కాని మన ఇండ్లలో మనపూర్వులైన వారందఱు వృద్ధులయ్యు మరణించక బ్రతికి యున్నారను కొన్నచో వారి దగ్గఱ దుర్వాసన ఆపరిశుభ్రత మొదలగు వాని వలన మన జీవితమెంత దుఃఖమయముగా రసహీనముగా నుండి యుండెదిదో ఒకసారి కొంచె మూహించుకొన్నచో వారిని జంపి మన జీవనమున కనీసము చావకుండ బ్రతుక వలెనని ఇచ్చుకు కారణమైన తాత్కాలికసుఖమునైనను అనుగ్రహించిన ఆ శివుని ప్రశంసింపక యుండగలమా?

4) దుఃఖహేతువులు కామములే. అవి తీరనంతవరకు ఏడిపించు చుండును. తీరినఁక్షణసుఖమునే కలిగించును. మరుక్షణమున కొత్త కోరిక వలన దుఃఖముకాని కోరిక తీరిన క్షణసుఖము నశించినదను దుఃఖము కాని మనను బాధించుచునే యుండును. కావున కామప్రాప్తి క్షణికము. ఆద్యంతములందు దుఃఖము తీరిన క్షణమందు పోవునేమో అను భయమును కలిగించుచున్నందున అట్టి సంసారములోని అనిత్య కామములను నశింపఁజేసి శివుడు మేలే చేసినాడని సంతసించెదము. కోరికయే చచ్చినచో కోరిక తీరలేదన్న పూర్వదుఃఖముకాని నశించిదన్న అనంతర దుఃఖముకాని ఉండదు. గాన అనుభవభయమును ఉండదు. మన అనిత్యసుఖహేతుకామముల సంహరించి తృష్ణాక్షయసుఖమును కలిగించిన శివుడు ప్రశంసనీయుడే. **తృష్ణాక్షయ సుఖస్యైతే కలాంనార్హంతి షోడశీమ్** (కోరిక నశింపక అప్పటి సుఖముతో బ్రహ్మాదుల సుఖములు పదాఅవ భాగముననైనను పోలవు) అను వివేకము కలవారికి శివుడు ప్రశంసనీయుడే. అను ప్రశంస స్ఫురించుచుండుటచే నీ శ్లోకమున వ్యాజ నిందాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము. ---

**అవతారిక:-** పై శ్లోకమున శివుడు (వ్యాజముగా) నిందింపఁబడినాడు. ఈ శ్లోకమున శివభక్తులు వ్యాజముగా ప్రశంసింపఁబడుచున్నారు.

**శ్లో॥ మహతీ భాగ్యసమ్పత్తి - రభక్తానాముమాపతేః।**
**భజన్తి బహుజన్మాని - పుత్రాదిసుఖదాని యే॥ 152**

**ప్రతిపదార్థము:-** యే = ఎవరు, పుత్రాది సుఖదాని = పుత్రులు మొదలగు సుఖముల నిచ్చునట్టి, బహుజన్మాని = పెక్కు జన్మములను, భజన్తి = పొందుదురో (అట్టి), ఉమాపతేః = శివునికి, అభక్తానామ్ = భక్తులు కాని వారి యొక్క, భాగ్యసమ్పత్తిః = భాగ్య సంపత్తి, మహతీ = గొప్పది.

**తాత్పర్యము:–** పుత్రాది సుఖములిచ్చు బహుజన్మల బొందు శివునికి భక్తులు కానివారి భాగ్యసమ్పత్తి గొప్పది.

**వివరణ:–** పై వాచ్యార్థ నిందవలన శివభక్తులకు పునర్జన్మ ఉండదు. అను ప్రశంస వ్యంగ్యమగుటచే నీ శ్లోకమున వ్యాజనిందాలంకార మేర్పడి యున్నది. జన్మలు కలవారికి పుత్రాది సుఖములుండును. కాని అవి అత్యల్పములు. విషదగ్ధమధురాహారములే దుఃఖ హేతువులు. అజ్ఞానానుస్యూతి హేతువులు. కావున వివేకులు అట్టి అనిత్య పుత్రాది సుఖ కామముల వీడి ఆనగా వైరాగ్యమునుఁబూని శివత్వము (మోక్షము)నే కాక్షించెదరు. అవ్యవహిత పూర్వశ్లోకముల రెండింటను సోమ, ఉమాపతి శబ్దములు శివుని ఓంకార ప్రతిపాద్యతను ఓంకారోపాసనాజన్యాజీవబ్రహ్మైక్యజ్ఞానైకసాధ్యము మోక్షము అను అంశమును ప్రధానముగా వ్యంజించును. కేనోపనిషత్తులో హైమవతీ నామమున ఉమయే ఇంద్రాదుల విజయాహంకారవినాశము చేసిన యక్షుడే పరబ్రహ్మమని చెప్పుట ఆకారోకారమకార (ఉమ్ అ) మాత్రాత్రయము యొక్క ఉపాసనమును అమాత్రయైన వాని అంతమందలి అర్ధమాత్రోపాసనమున లభ్యమైన సగుణ నిర్గుణ బ్రహ్మప్రాప్తి సాధిక కావుననే ఆమె శివునికి భార్యయై శివుని సోముని ఉమాపతిని సాక్షాత్కరింపజేసి సాధకులకు స్వోపాసనవలన స్వాభిన్నశివప్రాప్తి హేతు భూతురాలగుచున్నది.

---

**అవతారిక:–** పై శ్లోకమున ఉమాపతి (ఓంకారోపాసనాలభ్యుడు)యైన శివుని భక్తులు కానివారి మోక్షానర్హతా రూప నింద వ్యంజింపఁజేయుఁబడినది. ఈ శ్లోకమున శివభక్తి పరంపరగా నెట్లు మోక్షహేతువఁగు చున్నదో చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ భక్తిభావాచ్చిత్తశుద్ధి – శ్చిత్తశుద్ధ్యావబోధనమ్।**
**బోధాత్ సాక్షాత్కృతిః శమ్భోః – సాక్షాత్కృత్యా భవో భవేత్॥ 153**

**ప్రతిపదార్థము:–** భక్తిభావాత్ = భక్తి భావము వలన, చిత్తశుద్ధిః = చిత్తము యొక్క శుద్ధి, చిత్తశుద్ధ్యా = చిత్తశుద్ధితో, ఆవబోధనమ్ = జ్ఞానము (పరోక్షజ్ఞానము), బోధాత్ = (పరోక్ష) జ్ఞానము వలన, శమ్భోః = శివుని యొక్క, సాక్షాత్కృతిః = శివజీవైక్యజ్ఞానము (అపరోక్షజ్ఞానము), సాక్షాత్కృత్యా = సాక్షాత్కారముచేత, భవః = శివుడు, భవేత్ = అగును.

**తాత్పర్యము:–** భక్తివలన చిత్తశుద్ధి, చిత్తశుద్ధివలన పరోక్షజ్ఞానము, పరోక్షజ్ఞానము వలన శివజీవైక్య జ్ఞానము అను అవరోక్షజ్ఞానము (సాక్షాత్కారము) దానివలన శివుడగుట (శివత్వ ప్రాప్తి) సిద్ధించును.





**వివరణ:–** భక్తి అనగా ప్రేమ. ఇది మనస్సున పుట్టునది. మనస్సునఁబుట్టుఁ బెక్కు భావములు ఉత్సాహము, క్రోధము, లజ్జ, గర్వము, మొదగలగు వానిలో భక్తి ఒకటి. ఇది ప్రేమకు పర్యాయమైనను భిన్నార్థములలో ఉపయోగింపఁబడినది. అలంకార శాస్త్రములలో 'భగవద్గీతోరతిభక్తి' అని చెప్పఁబడినది. భక్తిశాస్త్రమను పేరొందిన నారదభక్తి సూత్రములలో 'సాత్వస్మిన్' పరమప్రేమరూపా (భగవంతుని యందుగల పరమ ప్రేమయే భక్తి) అని చెప్పఁబడినది. మరొక భక్తి శాస్త్రము శాండిల్యభక్తిసూత్రములలో ఈశ్వరానురక్తియే పరాభక్తి అని చెప్పఁబడినది. గుణములవలన కలుగు ప్రేమ గౌణభక్తి అందే చెప్పబడినది.

మాతృపిత్రాచార్యాది గురువు (పెద్ద) లందు గల రతియే లేక ప్రేమ భక్తి అని చెప్పఁబడును. ఇది పైనఁబేర్కొనఁబడిన భావములన్నిటిలో శ్రేష్ఠమగుటచే మహాభావము అనియు చెప్పఁబడును. ఇది యంతయు భక్తిశబ్దము యొక్క రూఢ్యర్థ విచారము. కాని భజసేవాయామ్ అను ధాతువు నుండి పుట్టిన భక్తి శబ్దమునకు సేవ అని అర్థము. కైంకర్య పర్యాయమైన ఈ సేవ శ్రీవైష్ణవులచే (విశిష్టాద్వైతులచే) పురుషార్థముగా భావింపఁ బడినది. వైకుంఠ (శైలసాప్య) కైలాసము మొదలగు లోకములందును శివవిష్ణ్వాదుల నుద్దేశించి చేయబడు ఈ సేవయే పురుషార్థము. ఇదియే వారి కానందరూపమని భావింపఁబడుటయు గలదు. (నిత్య) ఆనంద రూప పురుషార్థమనుట సర్వశాస్త్ర సమ్మతము. ఈ నిత్యానందము శివస్వరూపము. నిత్యానంద ప్రాప్తియన్నను, శివత్వప్రాప్తి యన్నను, జీవశివైక్యమన్నను, శివసాక్షాత్కార మన్నను అద్వైతుల దృష్టిలో నొక్కటియే. భక్తి భావము పురుషార్థమైన శివసాక్షాత్కారమునకు పరంపరాసాధనమే కాని సాక్షాత్సధనముకాదు. సాక్షాత్సాధనము జీవుడు శివుడు ఒక్కటియే అను శివజీవైక్యజ్ఞానము. శివుడు తప్ప మిగిలిన ప్రపంచ మంతయు మిథ్యయే. ఇదియే అపరోక్షానుభూతి. శివుడు తప్ప మిగిలిన ప్రపంచ మంతయు మిథ్యయే. జీవుడు శివుడే కావున శివునందు జీవభేదముకాని, జీవునందు శివభేదముకాని లేని ప్రపంచమున వ్యవహరింపబడు ఆ భేదము వ్యావహారికమే కాని పరమార్థము కాదు. ఆ శివ జీవులకు పారమార్థిక భేదము లేదని ఎఱుగుట పరోక్షజ్ఞానము. నేనే శివుడను అను ప్రత్యక్శివైక్యానుభవము ఆపరోక్షజ్ఞానము. ఇదియే శివసాక్షాత్కారము.

పరోక్షజ్ఞానమున శుద్ధచిత్తము కావలెను. శుద్ధచిత్తమున అర్థముగాక పోవుట గాని, అర్థమైనది మరిచపోవుటగాని ఉండదు. శివజీవులకు భేదము లేదను పరోక్షజ్ఞానము చిత్తమున పాపమున్నప్పుడు సమంజసముగా తోచదు. (అర్థముకాలేదన్న మాట).

చిత్తమున తదభేద నిశ్చయము కలుగనే కలుగదు. ఒక వేళ జీవశివులకు భేదము లేదని ఎవరేని చెప్పినట్లు అర్థము కాకపోవుట ఉండక పోయినను అది విస్మృత మగుటకు కూడ చిత్తగత పాపము కారణము ఆగును. కావున మొదట చిత్తశుద్ధి సంపాదించుకొనవలెను. (శివ) భక్తి భావముననే ఆ పాపము తొలగగా అవబోధనము కలుగును. అవ అను ఉపసర్గ మిచ్చుట అపరోక్ష జ్ఞానముకన్న కొంచెము తక్కువదైన (పరోక్ష జ్ఞానము) అను అర్థము నొసగును. చిత్తము శివైకాయత్తమగునట్లు శివాపరము నందునట్లు తైలవధారావచ్ఛిన్నమైన పరోక్షజ్ఞాన సంతాన రూప ధ్యానము (ఉపాసనము) వలన ఈ జన్మమున ఏ ప్రారబ్ధదోషముననో శివుని సాక్షాత్కారము కలుగక పోయినను వామదేవాదులకు వలె మరొక జన్మమున మాతృగర్భమున నుండగానో జన్మించిన పిదప గురూపదేశ బలముననో శివసాక్షాత్కారము ఆవశ్యముగా కలుగును. కావున ఈ శ్లోకమున సాక్షాత్కారకారణము ఆవబోధ (పరోక్ష జ్ఞాన) మనియు ఆవబోధనమునకు చిత్తశుద్ధి కారణమనియు కారణముల (రత్నముల) మాల (సూత్రము) చెప్పఁబడుటచే నీ శ్లోకమున కారణ మాలంకార మేర్పడియున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున జీవ (బ్రహ్మ) శివైక్యజ్ఞానము శివత్వప్రాప్తి హేతువుగా చెప్పఁబడినది. ఈ శ్లోకమున శివుడు బ్రహ్మయైన గదా ముక్తి ప్రసక్తి ఉపపన్నమగును. కావున శివునందు బ్రహ్మత్వ మనుమానప్రమాణమున సాధింపఁబడుచున్నది.

**శ్లో॥ శివో భవేత్ పరం బ్రహ్మ – యదేష ప్రలయేఽపి సన్।**
**శివో(వే)ఽమృతం న చేదస్య – పరమానన్దతా కుతః॥ 154**

**ప్రతిపదార్థము:–** శివః = శివుడు, పరమ్ = ఉత్కృష్టమైన, బ్రహ్మ, భవేత్ = కావలసినది(దౌ), యత్ = ఎందువలననగా, ఏషః = వీడు (శివుడు), ప్రలయే + అపి = ప్రలయ(కాల)మునందును, సన్ = ఉండువాడు, శివః = శివుడు, అమృతమ్ = అమృతము, న చేత్ = లేనిచో (శివునందు), పరమానందతా = పరమానందత, కుతః = ఎక్కడిది?

**తాత్పర్యము:–** శివుడు పరబ్రహ్మ. ఎందువలననగా అతడు ప్రలయకాలమునఁ గూడ నుండును గదా. శివునందు చావులేదు. ఒక వేళ శివుడు చచ్చువాడైనచో ఆయనయందున్న పరమానందత సంభవమయ్యెడిది గాదు.

**వివరణ:–** 1) పరబ్రహ్మము అనునది ప్రతిజ్ఞ (శివుడను పక్షమునందు పరబ్రహ్మత సాధ్యము), 2) ప్రలయస్థితి హేతువు. 3) ఏది ప్రలయమున నుండునో అదియే పరబ్రహ్మము. అన్వయప్రాప్తి, ఏది ప్రలయమున నుండదో అది పరబ్రహ్మము కాదు. ప్రపంచము ప్రలయమున నుండక పోవుటచే ఇతర దేవతలును ప్రళయమున నుండక పోవుటచేతనే పరబ్రహ్మమని చెప్పఁబడలేదు. అనునది వ్యతిరేక వ్యాప్తి. 4) ప్రలయస్థితుడగు శివుడు పరబ్రహ్మము అనునది ఉపనయము. 5) నిగమనము శివుడు పరబ్రహ్మము – ఈ ఐదు వాక్యములకు న్యాయము పేరు గలదు. వీనిలో మొదటి మూడుగాని చివటి మూడుగాని ఉన్నచో అనుమితి కలుగునని కొందఱు తార్కికులు అభిప్రాయపడెదరు. మొదటి మూడింటిలో చివఱది వ్యాప్తి. చివటి మూడింటిలో మొదటిది వ్యాప్తి. కావున అదియే అనుమానము అని చెప్పఁబడును. ఈ వ్యాప్తి వలన అనుమతి (సందిగ్ధమైన లేక పరోక్షమైన వస్తువు ఉనికి నిశ్చితము) అగును. అనుమానము నిశ్చితహేతువైనందున వ్యాప్తిని ప్రమాణము అని, దాని పేరు అనుమానమని దాదాపు దార్శనికులందఱు అంగీకరించెదరు.

ఈ శ్లోకమున ద్వితీయపాదము హేతువును కూర్పగా శివుడు అను పక్షమున పరబ్రహ్మత నిశ్చితమగును. ఉత్తరార్థమున చావుగల వారికి పరమానందత ఉండదని పరమానందత ఉన్నందువలన శివునకు చావులేదని మఱొక హేతువు చెప్పఁబడినది. పరమానందమై ప్రలయమునను చావులేని శివునందు పరబ్రహ్మత ఉన్నదనుటలో, ఎట్టి సంశయము లేదని శివునందు పరబ్రహ్మ ఉన్నదనుటలో, ఎట్టి సంశయము లేదని శివునందు పరబ్రహ్మత అనుసాధ్యము యొక్క నిశ్చయమున్నదని ఈ శ్లోకము చప్పుటచే ఈ శ్లోకమున అనుమానాలంకార మేర్పడి యున్నది.

రెండవపాదమందలి ప్రలయమునందును చావులేదను హేతు వలన మూడవ పాదమునందలి శివునందు చావులేదను 'శివేఽమృతమ్' పాఠము నంగీకరించి మరొక అనుమానాలంకారమున్నదని చెప్పవచ్చును. మొదటిపాదమందలి శివుడు పరబ్రహ్మ అను ప్రతిజ్ఞకు హేతువాక్యముగా వ్యతిరేక వ్యాప్తి పరబ్రహ్మ కాని వారికి పరమానందత లేదనునది. ఈ శ్లోకము నందు పేర్కొనఁబడుటచే అనుమానాలంకార మేర్పడియున్నది.

శివేఽమృతమ్ అను పాఠమున శివునందు మృత్యురాహిత్యము అని అర్థమును చెప్పవచ్చును. లేక శివునందు అమృతమున్నదనియు అర్థము చెప్పవచ్చును. మృత్యురాహిత్యము సురలు త్రావు అమృతమున కన్న ఎక్కువ సుఖమును కలిగించును. కావున శివునందు పరమానందత ఉన్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున అమృతము అనగా మృత్యురాహిత్యము శివునందు చెప్పఁ

బడినది. ఈ శ్లోకమున అమృతకిరణుడుగ ప్రసిద్ధినందిన చంద్రుని వ్యవహారము శివునందున్నట్లు చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ ఆశాంశుకః కలాశాలీ - మృగయుక్తస్తమోఽపహః।**
**పరిశుద్ధతనుః శమ్భుః - ర్లోకానాహ్లాదయత్యలమ్॥ 155**

**ప్రతిపదార్థము:-** ఆశాంశుకః = దిక్కులు వస్త్రములుగా గల (దిక్కుల యందు కిరణములుగల), కలాశాలీ = విద్యలతో నొప్పు (కలలతో నొప్పు), మృగయుక్తః = జింకతో కూడిన (మృగము, కళంకముతో గూడిన), తమోఽపహః = అజ్ఞానమునుఁ బోగొట్టు (చీకటిని పోగొట్టు), పరిశుద్ధతనుః = మిక్కిలి నిర్మలమైన శరీరముగల (తెల్లని శరీరముగల), శమ్భుః = శివుడు (సుఖమూలమైన), లోకాన్ = లోకముల, అలమ్ = మిక్కిలి, ఆహ్లాదయతి = సంతోషపరచుచున్నాడు.

**తాత్పర్యము:-** దిక్కులలో వ్యాపించిన కిరణములుగల, దిక్కులే వస్త్రములుగా గల, కలలతో లేక విద్యలతో నొప్పు, జింక ఆకృతి కలంకముగల లేక జింక చేతగల, చీకటిని లేక అజ్ఞానమును బోగొట్టు స్వచ్ఛమైన లేక తెల్లని శరీరముగల శివుడు చంద్రునివలె లోకముల సంతోషపరచుచున్నాడు.

**వివరణ:-** పై శ్లోకమున పూర్వార్ధమునందలి శ్లిష్ట శబ్ద విశేషణము వలన పరిశుద్ధతనుః అను ఆర్థశ్లేషగల విశేషణముయొక్క బలమునను చంద్రుని వ్యవహారము శివునకు వ్యంగ్యమగుటచే సమాసోక్త్యలంకార మేర్పడియున్నది. చదిధాత్వర్థమైన ఆహ్లాదనము అను చంద్ర వ్యవహారము ఆహ్లాదయతి అను క్రియచే వ్యంగ్యమగుచున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:-** పై శ్లోకమున శివునందు చంద్రసాదృశ్యము వ్యంజింపఁజేయఁబడినది. ఈ శ్లోకమున మౌని సాదృశ్యము వ్యంజింపజేయఁబడుచున్నది.

**శ్లో॥ దమేన ప్రశమో భాతి - ప్రశమేన విరక్తతా।**
**వైరాగ్యేణ తపో నిత్యం - తపసా సామ్బశఙ్కరః॥ 156**

**ప్రతిపదార్థము:-** దమేన = బహిరింద్రియ నిగ్రహముతో, ప్రశమః = అంతరింద్రియ నిగ్రహము, ప్రశమేన = అంతరింద్రియనిగ్రహముతో, విరక్తతా = వైరాగ్యము, వైరాగ్యేణ = వైరాగ్యముతో, తపః = తపస్సు, తపసా = తపస్సుతో, నిత్యమ్ = ఎల్లప్పుడు, సామ్బశఙ్కరః = ఉమతో కూడిన శివుడు, భాతి = ప్రకాశించుచున్నాడు.

**తాత్పర్యము:-** బహిరింద్రియనిగ్రహముతో అంతరింద్రియ నిగ్రహము, అంతరింద్రియ





నిగ్రహముతో వైరాగ్యము, వైరాగ్యముతో తపస్సు, తపస్సుతో శివుడు ఎల్లప్పుడు ప్రకాశించుచున్నాడు.

**వివరణ:-** భాతి అను క్రియ ప్రశమము, వైరాగ్యము, తపస్సు అనుకర్తలలో పెక్కుసార్లు అన్వయించినందున ఈ శ్లోకమున దీపకాలంకార మేర్పడి యున్నది. గడప మీద నున్న దీపము ఇంటిలోపల ఇంటి బయట వెలుగు నిచ్చునట్లు భాతి అనునది వరుసగా శ్లోకములోని వాక్యములన్నింటను క్రియగా అన్వయించుటచే మాలాదీపకాలంకార మేర్పడి యున్నది. మనసున నిశ్చలత యున్నను బహిరింద్రియముల విషయములందు ప్రసరింపఁజేసినచో ఆ మౌని అపహాసము నొందును. కావున అంతరింద్రియనిగ్రహము బహిరింద్రియనిగ్రహము తోడనే ఒప్పును. అంతరింద్రియ నిగ్రహము బలవంతముగా గాక విషయగతదోషదర్శనజన్యమైన వైరాగ్యముతో కూడినప్పుడే చిరకాలము ప్రకాశించును. వైరాగ్యము లేనిదే తపము ప్రకాశించదు. తపఃఫలముగా కోర్కెను తీర్చుకొనుట పురాణములలో రాక్షసకృత్యముగా పెక్కు పురాణకథలలో కానవచ్చును. కావున వైరాగ్యము చేతను తపము శోభించును.

సాధారణముగా తపస్వులు భార్యలకు స్త్రీలకు దూరముగా నుందురు. కాని శంకరుడు సామ్బుడై అమ్బాసహితుడై తపము నాచరించుటచే తపస్వులలో నగ్రగణ్యుడుగా నొప్పుచున్నాడు. వికార హేతువులైన వనితాదులున్నను ఎవరి మనస్సు వికృతిని బొందదో వారే ధీరులు. శివుడట్టి ధీరుడని సామ్బపదము వ్యంజించును. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిన్ధనము.

---

**అవతారిక:-** పై శ్లోకమున శివునకు మౌని సాదృశ్యము వ్యంజింపఁబడినది. ఈ శ్లోకమున సూర్యచంద్రాగ్ని వాయు కుబేరాదులతోడి సాదృశ్యము వ్యంజింపఁజేయఁ బడుచున్నది.

**శ్లో॥ ఇనః శుచిః శీతరుచి - స్తాపహారీ లఘుర్గురుః।**
**సద్గతి ర్విక్రమీ శ్రీదః - ప్రాక్సద్రవ్యః శివోఽవతు॥ 157**

**ప్రతిపదార్థము:-** ఇనః = సూర్యుడు (ప్రభువు), శుచిః = అగ్ని (పవిత్రుడు), శీతరుచిః = (చల్లని కాంతిగలవాడు) చంద్రుడు, తాపహారీ = తాపమునుఁబోగొట్టువాడు, లఘుః = చిన్నవాడు, గురుః = గొప్పవాడు, సద్గతిః = (నిరంతర జ్ఞానము గలవాడు) పరమేశ్వరుడు, విక్రమీ = కదలిక లేనివాడు (పరాక్రమము గలవాడు), శ్రీదః = కుబేరుడు, ప్రాక్సద్రవ్యః = పేదఁవాడునైన, శివః = శివుడు, అవతు = రక్షించుగాక!

**తాత్పర్యము:-** గ్రహపతియైన సూర్యుని వలె శివుడు సర్వలోక ప్రభువు. అగ్ని సర్వమలముల భక్షించి తాను శుచియై యుండునట్లు మలమాయామయుడైన సర్వలోక ప్రలయంకరుడైన శివుడు తద్దోషమునంటక పవిత్రుడుగానే ఉండును. చంద్రుడు చల్లని కిరణములు గలవాడై సూర్యాగ్ని తప్తుల తాపములఁబోగొట్టును. అణువు కంటెను చిన్నఁ వాడగుటచే లఘువని మహత్తు కంటెను పెద్దవాడగుటచే గురువనియు చెప్పఁబడును. నిరంతరమైన గతి అనగా జ్ఞానము గలవాడై వాయువువలె సర్వప్రాణుల శరీరముల ప్రవేశించి వెడలి పోవుచు నిరంతర గమనముగలవాడై యుండును. క్రమణము అనగా కదలిక లేని స్థాణువుగా నుండును. పరాక్రమవంతులలో నగ్రగణ్యుడై యుండును. కుబేరుని వలె సంపదనొసగు వాడయ్యు పూర్వము ద్రవ్యము గలవాడు అనగా ఇప్పుడు ద్రవ్యము లేనివాడు పేదవాడుగా నుండును. అట్టి శివుడు ఎల్లప్పుడు రక్షించుగాక!

**వివరణ:-** ఇన శబ్దము సూర్యుని ప్రభువును బోధించును. శివుడు సూర్యుడని చెప్పుట విరోధము గదా. కాని శివుడు శుచి అనగా పవిత్రుడు అను ఈ వాక్యము శివుడగ్ని అను విరోధము కూడ తోచును. అది ఆభాసము మాత్రమే. శివుడు శుచి అనగా పవిత్రుడను అర్థమును చెప్పినప్పుడు విరోధము తొలగి పోవును గదా! సూర్యాగ్నులు తాపము కలిగించినప్పుడు చంద్రుని చల్లని వెన్నెల (శీతరుచి)లో విహరించినప్పుడు ఆ తాపమంతయు నశించును. కాని శివుడు చంద్రుడు కాడు గదా! అయినచో గదా సూర్యాగ్నితప్తుల తాపము హరించుట. తాపహారీ అను శబ్దము ఆధ్యాత్మికాధిదైవి కాధిభౌతిక తాపముల హరించువాడు అను అర్థము చెప్పుకొన్న శివుడు తాపహారి అనుటలో విరోధమే ఉండదు. లఘుగురు శబ్దములు పరస్పర విరోధ బోధకములు. కాని లఘు శబ్దము **అణోరణీయాన్** అను శ్రుతిననుసరించి అణువు కన్న అణువైన, గురు శబ్దము **మహతో మహీయాన్** అను శ్రుతి ననుసరించి అణుత్వ మహత్వరూప లఘుత్వ గురుత్వములు లేనివాడయ్యు అణువైన మనసున ఉండి లఘువనియు, విశ్వోత్తీర్ణుడై మహదాకాశాది ద్రవ్యముల తనలో నింపుకొన్ని మహత్తైన విశ్వమున కంటెను పెద్దవాడైనందున శివుడు గురువనియు చెప్పఁబడుటలో విరోధ మేమియు నుండదు. సర్వవిరోధములఁజీర్ణించుకొను ఈశ్వరుని ఉత్కృష్టత బోధ్య మయినప్పుడు లఘుత్వ గురుత్వముల తనలో జీర్ణించుకొనుట శివుని కొక లెక్కకాదు. వామనుడై విక్రమించి త్రివిక్రముడై ప్రకాశించిన విష్ణువు మొదలగు సమస్త జీవులలో మధ్యే **'వామనమాసీనం విశ్వే దేవా ఉపాసతే'** అను శ్రుతి వాక్యము ననుసరించి సర్వజీవుల హృదయములందు **'అంగుష్ఠమాత్రః పురుషః'** అను శ్రుతి ననుసరించి వామనుడైనను లఘువు ఐనను



సర్వవ్యాపకుడై విష్ణువు మొదలగు మహాజీవుల నతిక్రమించిన విక్రమము అనగా విశిష్టమైన పరాక్రమము కలవాడగుటచే శివుడు లఘువు గురువు విక్రమియు నగుచున్నాడు. విష్ణుబ్రహ్మవాయ్వాదులందు గల విక్రమము పరిమితము. ఆకాశాదులకన్నను అధిక వ్యాప్తి గల శివుడే విక్రమి అగును. విష్ణుబ్రహ్మనాయకులైన కార్యబ్రహ్మలకును కారణమైన శివుని విక్రమమే వారియందు వ్యాపించినది. కావున శివుడే విక్రమశబ్దమున యథార్థరూపుడైయున్నాడు.

శ్రీ అనగా ధనము, ధనమున్న వాడు ధనపతియని పిలువఁబడును. ఇష్టమున్నను లేకున్నను ధనపతియే ఎప్పుడో ఒకప్పుడు ధనఁదుడగును. కావలసివచ్చును. పరాక్రమహీనుడైనచో ధనపతిని కొట్టి తిట్టి ధనము నపహరించుటకు వచ్చిన చోర రాజాధికార్యాదులను చూచి బెదరి ధనము నొసఁగి ధనపతి ధనదుడనిపించు కొనును. లేదా ధర్మబుద్ధితో ధనమును దానము చేసి ధనదుడు కావచ్చును. ఇచట శ్రీద శబ్దము ధనపతియైన కుబేరుని బోధించును. ఆయన శివునను గ్రహముచే శ్రీమంతుడై శ్రీదుడను కీర్తినిఁబొందినాడు. కావున ఆ కుబేరునకు శ్రీనొసగినవాడు శివుడే. కావున శివుని శ్రీదుడనుటలో విరోధము లేదు. "ప్రాక్సద్రవ్యః" అను శబ్దము పూర్వమున్న ద్రవ్యము గలవాడు అను అర్థమున ఇప్పుడు పేద అను అర్థము నిచ్చును. శివుడు ఇతరులకు సమస్త శ్రీలనొసగినను తాను శ్రీమంతునివలె పీతాంబరుడుగాక, దిగంబరుడై పేదవానివలె నుండుటచే శివుని ప్రాసద్రవ్య అనియు అనుటలో విరోధము లేదు. ఇట్లు ఈ శ్లోకమునందన్ని పదముల చేతను విరోధాభాసాలంకారములేర్పడి యున్నవి. శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:-** పై శ్లోకమున శివునియందు సర్వవిరోధముల జీర్ణించుకొను మహిమ వర్ణింపబడినది. ఈ శ్లోకమున జీవుని గమనమందలి వరుస చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ పురా మాతృకుక్షౌ తతో దారుగేహే**
**తతః ప్రేమభూమౌ తతో ధర్మపుర్యామ్।**
**మహాసఙ్కటేఽనేకదుఃఖప్రపూర్ణే**
**జనస్తిష్ఠతి శ్రీమహేశాభిపూర్ణః॥** **158**

**ప్రతిపదార్థము:-** పురా = పూర్వము, మాతృకుక్షౌ = తల్లి గర్భమునయున్న, జనః = జీవుడు, తతః = పిమ్మట దారుగేహే = కట్టెయింటిలో, తతః = పిమ్మట, ప్రేమభూమౌ = శ్మశానమునందు, తతః = పిమ్మట, ధర్మపుర్యామ్ = యమ నగరమున, తతః =

పిమ్మట, అనేక దుఃఖప్రపూర్ణే = అనేక దుఃఖములతో నిండిన, మహాసఙ్కటే = గొప్ప సంకటమున, శ్రీమహేశ = ఓ శ్రీమహేశుడా (అతా = చివరకు), అభిపూర్ణః = పూర్ణత్వమును (బ్రహ్మత్వమును పొందినవాడగును).

**తాత్పర్యము:–** పూర్వము తల్లి గర్భమున కొంతకాలమున్న, జనః = జీవుడు పిమ్మట కట్టె ఇంటిలో, పిమ్మట శ్మశానమందు, తతః = పిమ్మట, ధర్మ పుర్యామ్ = యమ నగరమునందు, తతః = పిమ్మట, అనేక దుఃఖములతో నిండి గొప్ప సంకటమునందుండి (ఓ మహేశుడా) పూర్ణబ్రహ్మ అగును.

**వివరణ:–** వీర్యము శుక్లము మొదలగు పేర్లతో పిలువఁబడునది శివతేజమే. వీర్యము లేక శుక్లము మహేశాభి పూర్ణము. అది తండ్రి ద్వారా తల్లి గర్భమున ప్రవేశించి కొంత కాలముండును. ఆ పిదప ఆ తల్లి ఒక ఇంటిలో తన గర్భములోని శిశువును ప్రసవించును. ఆ యిల్లు కట్టెలతో నిర్మింపఁబడి యున్నది. పూర్వకాలమున అడవి పుష్కలముగా నుండినది. కావున గోడలు పైకప్పు అంతయు కలపతో నిర్మించెడివారు. ఇప్పటికిని కొన్ని ప్రాంతములలోని దేవాలయములు మొదలగు నిర్మాణములు కేవలము మొత్తము కఱ్ఱతో నిర్మింపఁబడినవి కలవు. వానియందు శిల్పుల చెక్కడపు సౌందర్యముండును. అది వేరు విషయము. అట్టి దారుగేహమున కొంతకాలము బ్రతికిన జీవుడు శ్మశానములోనికి తీసుకొని పోబడి కట్టెలరాశిమీద పెట్టబడి కాల్చఁబడును. తల్లి కడుపుగాని, దారుదేహముగాని, యమలోకముగాని మహాసంకట పూర్ణములే. అట్టి సంకట (దుఃఖ) పూర్ణస్థితియందే జీవుడుండును. ఈ అన్ని స్థితులలోను ఓ మహేశా! నీవు నిండియున్న సంగతినే మాత్రము గమనింపక ఈ మనుష్య లోకమునకు యమలోకము నుండి యాతాయాతము లొనరించు చుండును. నీ వేమో ఆనంద పూర్ణుడవు. ఈ జనుడేమో మహాసంకటపూర్ణుడు. వీరిద్దఱు శరీరమున నుండుట ఎట్లు పొసగినది నాకు తెలియుటలేదు. ఈ శ్లోకమున మొదట తల్లి కడుపు, తురువాత దారుదేహము, ఆ తరువాత కొన్ని గడియలకాలము స్మశానభూమి యందును (శరీరము మాత్రమే), ఆ తరువాత యమలోకము అని వరుసగా జీవయుక్తశరీరస్థితి పర్యాయముగా (వరుసగా) పెక్కుచోట్ల చెప్పఁబడుటచే నీ శ్లోకమున పర్యాయాలంకార మేర్పడి యున్నది. ఈ శ్లోకమున ప్రతిపాదమున పరుసగా నాలుగు యగణము లుండుటచే నిది భుజంగ ప్రయాత వృత్త నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున జనుని యొక్క బహ్వాశ్రయస్థితి చెప్పఁబడినది. ఈ శ్లోకమున

217



శివ పూజకుడైన జనుని యింట లక్ష్మ్యాశ్రయస్థితి చెప్పఁబడుచున్నది.

**శ్లో॥ జనస్య సదనే యస్మిన్ – ప్రాగలక్ష్మీః స్థితా తతః।**
**శివపూజావిధానేన – లక్ష్మీస్తత్రైవ సంస్థితా॥ 159**

**ప్రతిపదార్థము:–** జనస్య = జనుని యొక్క, యస్మిన్ = ఏ, సదనే = ఇంటి యందు, ప్రాక్ = పూర్వము, ఆలక్ష్మీః = దరిద్ర దేవత, స్థితా = ఉండెనో, తతః = పిమ్మట, శివపూజావిధానేన = శివపూజానుష్ఠానము చేత, తత్ర ఏవ = అచ్చట, (ఆ యింట)నే లక్ష్మీః = సంపద్దేవత, సంస్థితా = బాగుగా నిలచి యున్నది.

**తాత్పర్యము:–** జనుడు శివపూజనాచరింపక ముందు ఆతని యింట దరిద్ర దేవత యుండెను. ఆ జనుడు శివపూజము నొనరించిన పిమ్మట సంపద్దేవత ఉన్నది.

**వివరణ:–** శివపూజాఫలముగా ఇంతకు ముందు దరిద్రదేవత తాండవించిన చోట సంపద్దేవత బాగుగా నిలచియున్నది. చచ్చినవాడు కదలనట్లు లక్ష్మి ఆ యింట కదలక యున్నది. సమ్ అను ఉపసర్గ వ్యంజించును. ఒక చోట అనేకములు వరుసగా ఆశ్రయించి యుండుటచే పర్యాయాలంకార విశేషమీ శ్లోకమున యున్నది. ఆ యింటిని ఒకప్పుడు అలక్ష్మి ఆశ్రయించి యుండగా ఇప్పుడు లక్ష్మి ఆశ్రయించి యున్నది. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

**అవతారిక:–** పై శ్లోకమున శివపూజాఫలము లక్ష్మీప్రాప్తియు చెప్పఁబడినది. ఈ శ్లోకమున ఆ శివుడే వృషభారూఢుడై తన హృదయమున నుండగోరఁబడు చున్నాడు.

**శ్లో॥ గచ్ఛన్తం మన్దమన్దం మధురతరరణత్కన్దరాకిఙ్కిణీకం**
**లాఙ్గూలం చాలయన్తం ముహూరవనితలం సంలిఖన్తం ఖురాగ్రైః॥**
**ధున్వన్తం భవ్యరుక్మాభరణభరితయోః శృఙ్గయోర్మణ్డలం సత్**
**తుఙ్గం ప్రేమ్ణాధిరూఢం వృషభమధివసత్వీశ్వరో మే హృదబ్జమ్॥ 160**

**ప్రతిపదార్థము:–** మధురతర రణత్కన్ధరా కిఙ్కిణీకమ్ = మిక్కిలి మధురముగా ధ్వనించు గజ్జలుగల, లాఙ్గూలమ్ = తోకను, చాలయన్తమ్ = కదిలించుచున్న, మన్దమన్దమ్ = మెల్ల మెల్లగా, గచ్ఛన్తమ్ = నడచుచున్న, ఖురాగ్రైః = గిట్టల కొనల చేత, అవనితలమ్ = భూతలమును, ముహుః = మాటిమాటికి, సంలిఖన్తమ్ = వ్రాయుచున్న, భవ్య రుక్మాభరణ భరితయోః = మంచి బంగారు తొడుగులచే నిండిన కొమ్ముల మధ్య బాగమును, ధున్వన్తమ్ = కదిలించుచున్న, సత్ = సాధువైన, తుఙ్గమ్ = ఎత్తైన, వృషభమ్ = ఎద్దును, ప్రేమ్ణా = ప్రేమతో, ఆధిరూఢమ్ = ఎక్కిన, ఈశ్వరః = ఈశ్వరుడు,

మే = నా యొక్క, హృదబ్జమ్ = కమలమును, అధివసతు = అధిష్టించుగాక!

**తాత్పర్యము:–** మెల్లమెల్లగా మెడలోని గజ్జెలు గల్లుగల్లు మనుచుండగా, తోకనూపుచు, గిట్టలతో భూమిని వ్రాయుచు, బంగారు తొడుగులు గల కొమ్ములను కదిలించుచు సాధువైన ఎత్తైన వృషభమును ప్రేమతో ఎక్కిన శివుడు నా హృదయము నధివహించు గాక!

**వివరణము:–** వృషభమునెక్కు శివునకు దానితోడి అనుబంధమనాదిగా ఏర్పడియున్నది. ఆ వృషభము ప్రతిష్ఠచే నా శివుడు గమనించుచుండను. దాని నెక్కునప్పుడు పూర్తిగా తన బరువును మోపడేమో అన్నంత ప్రేమతో దానిపై నెక్కు చుండును. ఆ వృషభము తన జాతి స్వభావము ననుసరించి తోకనూపుట, కొమ్ముల కదిలించుట, మెల్లగా ఠీవిగా నడచుట మొదలగు అంశములు విశేషణములతో నీ శ్లోకమున చెప్పఁబడినందున స్వభావోక్త్యలంకార మేర్పడి యున్నది. వీరశైవుల దృష్టిలో శివుని ఆవతారమే వృషభము. వృషభ పదము నుండి బసవ పుట్టినది. బసవ శబ్దము వృషభ శబ్ద భవము. ఆ వృషభము కలియుగమున బసవేశ్వరుడుగా నవతరించి వీరశైవ మతమును విజృంభింపఁ జేసినాడనుట వారి విశ్వాసము. ఈ శ్లోకమున ప్రతిపాదమున మ–ర–భ–న–య–య–య అను గణములుండుటచే స్రగ్ధరా వృత్త నిబన్ధనము.

వృషభము ధర్మమునకు ప్రతీకముగా పురాణములలో పేర్కొనఁబడినది. సత్యదాన దయాశౌచములు ఆ ధర్మరూప వృషభ పాదములుగా పేర్కొనఁబడిన శివునకు వృషభము వాహనముగా, ధర్మానుష్ఠానమున శివునిచే వచ్చుననుటయే అని పెద్దలు చెప్పెదరు. చతుర్వేదములే పాదములుగా తత్ప్రతిపాద్య ధర్మ వృషభము యొక్క శరీరముగా కొందఱు భావించెదరు. పతంజలి మహాభాష్యమున వృషభము శబ్దబ్రహ్మ ప్రతీకముగా నిరూపింపఁ బడినది. **'సోయమాత్మా చతుష్పాత్ మాత్రాశ్చ పాదాం పాదాశ్చ మాత్రాః'** అని మాండూక్యోపనిషత్తు ప్రతిపాదించిన ఓంకారము వృషభ స్వరూపమని ఓంకారము అను శబ్దము శివరూపార్థమునకు వాహనము (వాహిక) అని మఱికొందరు చెప్పెదరు. సింహాది చతుర్గతులలో వృషభగతి యొకటి. అందమైన నడకగలవారిని వృషభ గతియని చెప్పుదరు. వృషధాతు నిష్పన్న వృషభ శబ్దము కామములను వర్షించు ధర్మముగా, శ్రేష్ఠ వాచకముగా బహుధా భావింపఁబడుట కలదు. అట్టి వృషభము శివునకు వాహనమని చెప్పుట శివుని సర్వోత్కృష్టత చెప్పుటయే. మనో బుద్ధి చిత్తాహంకార చతుష్టయము పాదచతుష్టయముగా గల అంతఃకరణమే వృషభము. ప్రేమతో ఆ అంతః కరణము (హృదబ్జము)న శివుడు అధివసించు గాక!



**అవతారక:–** పై శ్లోకమున వృషభారూఢ శివుడు హృదబ్జరూపాంతఃకరణము నధివసించవలెనని ప్రార్థింపఁబడినది. ఈ శ్లోకములలో (3) శివుని దక్షిణామూర్తి రూపము స్తుతింపఁబడుచున్నది.

**శ్లో॥ రజతార్కమణిస్ఫారాం మౌక్తికీం జపమాలికామ్।**
**దివ్యామమృతభాణ్డం చ చిన్ముద్రాం దధతం కరైః॥ 161**

**శ్లో॥ భుజఙ్గ విలసత్కక్షం చన్ద్రమః ఖణ్డమణ్డితమ్।**
**త్రిలోచనముమానాథం నాగాభరణశోభితమ్॥ 162**

**శ్లో॥** ప్రసన్నవదనం శాన్తం సర్వవిద్యానిధిం సురైః।
**సంస్తుతం దక్షిణామూర్తిం సదాశివమహం భజే॥ 163**

**ప్రతిపదార్థము:–** రజతార్కమణి స్ఫారామ్ = వెండి లేక సూర్యకాంతి మణి నిర్మితమా యన్నట్లున్న, మౌక్తికీమ్ = ముత్తెములు గ్రుచ్చబడిన, దివ్యామ్ = దివ్యమైన, జపమాలికామ్ = జపమాలను, అమృతభాణ్డమ్ = అమృత కలశమును, చిన్ముద్రామ్ = చిన్ముద్రను, కరైః = చేతులలో, దధతీమ్ = ధరించుచున్న.

భుజంగవిలసత్కక్షమ్ = సర్పము వేలాడు భుజకుక్షి మధ్య భాగము(చంక) గల, చన్ద్రమః ఖణ్డ మణ్డితమ్ = చన్ద్రశకలముతో అలంకరింపఁబడిన, త్రిలోచనమ్ = మూడు కన్నులుగల, ఉమానాథమ్ = పార్వతీపతియైన, నాగాభరణశోభితమ్ = సర్పభూషణము లతో ప్రకాశించు.

ప్రసన్నవదనమ్ = ప్రసన్నమైన ముఖముగల, శాన్తమ్ = శాన్తుడైన, సర్వవిద్యా నిధిమ్ = సర్వవిద్యలకు గనియైన, సురైః = దేవతలచేత, సంస్తుతమ్ = బాగుగా స్తుతింపఁబడిన, దక్షిణామూర్తిమ్ = దక్షిణాదిశాముఖరూపముగల, సదాశివమ్ = సదాశివుని, అహమ్ = నేను, భజే = సేవించెదను.

**తాత్పర్యము:–** వెండివలె సూర్యకాంతమణివలె తెల్లగా తళతళలాడు, ముత్తెములు గ్రుచ్చబడిన జపమాలను, దివ్యచిన్ముద్రను, అమృత కలశమును, చేతులలో ధరించుచున్న, నాగయజ్ఞోపవీతమును, నాగాభరణములను ధరించిన, మూడు కన్నులుగల, పార్వతీ పతియైన, రాగక్రోధాది చిహ్నరహితమైన, శాన్త ముఖముగల, వాని స్పర్శ మనసునందును లేని శాస్త్రుడైన సర్వవిద్యలకు గనియైన, దేవతలచేత బాగుగా స్తుతింపఁబడిన దక్షిణాభిముఖముగల, సదాశివుని నేను సేవించెదను.

**వివరణ:–** వృషభారూఢమూర్తి నటరాజమూర్తి మొదలగు అనేక మూర్తులలో దక్షిణామూర్తి అనఁబడు మూర్తి జ్ఞానబోధ ప్రధానమైనది. ఆయన ఒకచేత జపమాలను ధరించును.

ఆ జపమాల కూడ ఆయన శరీరకాంతి కనుగుణమైన ధవల రజత కాంతియుతమై ఉన్నదని 161వ శ్లోకములోని పూర్వార్ధమున చెప్పఁబడినది. తదుత్తరార్ధమున అమృతకలశ చిన్ముద్రలు చెప్పబడినవి. అమృతకలశముకు అక్షరమాల అను నామాంతరము కలదు. జప్యములైన అన్ని మంత్రములు అకారాది క్షకారంత వర్ణాస్తవర్గములే. అకారాది క్షకారన్త వర్ణములన్నియు మంత్రములే. ఒక్కొక్క వర్ణమునకు మాతృక అని పేరున్నది. అది మంత్రరూపము నైయున్నది. బయట దక్షిణామూర్తి హస్తమున కనబడు ముత్తెముల మాల శరీరాంతర్గత మూలాధారాది సహస్రారాంత సప్తచక్రములోని (ఏక) పంచాశదక్షరమాలకు ప్రతీకము.

| | | | |
|---|---|---|---|
| మూలాధారమున | - | వ-శ-ష-స (సబిందుకములు) | 4 |
| స్వాధిష్ఠానమున | - | బ-భ-మ-య-ర-ల (సబినిదుకములు) | 6 |
| మణి పూరమున | - | డ-ఢ-ణ-త-థ-ద-ధ-న-ప-ఫ (సబిందుకములు) | 10 |
| అనాహతమున | - | క-ఖ-గ-ఘ-జ-చ-ఛ-జ-ఝ-ఞ-ట-ఠ | 12 |
| విశుద్ధమున | - | అచ్చులన్ని (అ-ఆ-ఇ-ఈ-ఉ-ఊ-ఋ-ౠ- ఌ - ౡ -ఏ-ఐ-ఓ-ఔ-అం-అః) | 16 |
| ఆజ్ఞాచక్రమున | - | హ-ళ | 2 |
| సహస్రారమున | - | క్ష | 1 |
| | | | --- |
| | | | 51 |
| | | | --- |

ఈ ఆకారాది క్షకారాన్త వర్ణముల ఆవృత్తితో 100 లేక 102 సంఖ్య పూర్తి యగును. బొటన వ్రేలిని తర్జని (చూపుడు వ్రేలి)తో కలుపగా నేర్పడిన ముద్ర చిన్ముద్ర అనఁబడును. బొటనవ్రేలు బ్రహ్మకు, తర్జని చూపుడు వ్రేలు జీవునకు ప్రతీకములు. ఆ రెంటి కలయిక జీవబ్రహ్మైక్యమునకు ప్రతీకము. జీవ బ్రహ్మలు తదైక్యము చిద్రూపము కావున ఆ ముద్ర **చిన్ముద్ర** అనఁబడును. ఆ ముద్ర ఒక చేష్టరూపమున తన ఎదుట నున్న శిష్యులకు జీవుడు బ్రహ్మమునొకటే అను మాట యొక్క ఆవశ్యకత లేకయే మౌనముగా జీవుడు బ్రహ్మము నొకటే అను విషయము శిష్యులకర్థమగునట్లు చేయగలదు. ఈ చిన్ముద్రను **మౌనవ్యాఖ్య** అని పెద్దలు అనిరి.



జపమాల ఒకచేత, అమృత కలశము రెండు చేతులలో చిన్ముద్ర మరొక చేత ధరించిన ఈ మూర్తికి నాలుగు చేతులు. అమృతకలశ మొక చేత మరొక చేత అభయముద్ర అని కొందఱు అభిప్రాయపడెదరు.

162వ శ్లోకమున పూర్వార్ధమందలి రెండు విశేషణములు నాగ యజ్ఞోపవీత చంద్రకిరీటధారియైన దక్షిణమూర్తి రూపమును బోధించును. ఉత్తరార్ధమున ఆ మూర్తి ముఖమున మూడు నేత్రములున్నవని చెప్పును. ఆయన బ్రహ్మచారి వలె కనఁబడిన ఆయన ఉమాపతి అనగా ఓంకార ప్రతిపాద్యుడు. అ ఉ మ కలసి ఓంకారము కాగా ఉ మ ఆ కలసి ఉమా యగును. అందుచేత ఉమా శబ్దము ఓంకార రూపమే. శబ్ద బ్రహ్మ రూపమైన ఓంకారమును తత్ప్రతిపాద్యుడు దక్షిణామూర్తి పతి కావున ఆయన ఉమాపతి అని చెప్పఁబడినాడు. ఆ మూర్తి యొక్క హస్తములలో నాగ కంకణములు, పాదములలో నాగనూపురములు, కటియందు నాగ సూత్రము (శిరోజతా బంధనమును నాగమే) మొదలైన వన్నియు నాగాభరణములు. వీని చేత ఆ మూర్తి శోభిల్లు చుండును.

163వ శ్లోకములో 'ప్రసన్నవదనమ్' అను విశేషణము ఆ దక్షిణామూర్తి ముఖమున ఎట్టి కామక్రోధాది వికారములను సూచించు రాగాది వర్ణముల లేమి సూచించును. శాన్తమ్ అను విశేషణము ఆ దక్షిణామూర్తి చిత్తములోని శమమును సూచించును. 'సర్వవిద్యానిధిమ్' అను విశేషణము దక్షిణామూర్తి యొక్క సర్వవిద్యాగురుత్వమును బోధించును. ముఖ్యముగా శ్రీవిద్యలోని సమయాచారమును కాది విద్యాచార్యత్వమును సూచించును. సురైః సంస్తుతం అను విశేషణము ఆయనలోని బ్రహ్మవిష్ణ్వింద్రాది స్తుత్యత్వమును బోధించును.

దక్షిణామూర్తి శబ్దము మూర్తి రహితమైనను శివుడు దక్షిణుడే అనగా దాక్షిణ్యము గలవాడే. అని నిరాకార సగుణశివ స్వభావమును బోధించును. దక్షిణ+అమూర్తి అనియేగాక శబ్దము నిరాకార సగుణ (దాక్షిణ్య) స్వభావమునే గాక ప్రపంచమంతయు అతని మూర్తియే. అది దాక్షిణ్య గుణపూర్ణము అని శివుని సాకార దాక్షిణ్య స్వభావమును బోధించును. దక్షిణ శబ్దము శివుని యొక్క నాయికలైన హిమవత్పుత్రికలైన గంగా, గౌరులందు సమానమైన ప్రేమ గల నాయకుడను అర్థమును బోధించును. ఒక హిమవత్పుత్రికను (గంగను) ఉత్తమాంగమున ధరించి, మరొక హిమవత్పుత్రిక గౌరిని అర్ధశరీరమున నిలుపుకొని ఇరువురి యందు సమమైన ప్రేమనే ప్రకటించుటను దక్షిణ శబ్దము వ్యంజించును. ఆ మూర్తి అను ఉత్తర పదము ప్రపంచమంతయు అతని మూర్తియే అని శివుని యొక్క బ్రహ్మాండ శరీరత్వమును అనగా విరాట్స్వభావమును

బోధించును. విరాట్స్వరూపుడైన శివుని ఉత్తమాంగము ద్యులోకమే గావున ఆ ద్యులోక రూపమైన శివుని శరీరమున స్వర్గంగ యొక్క ఉనికి సముచితమే గదా! దక్షిణా మూర్తి శబ్దమును విశేషణముగా భావించి పై యర్థము చెప్పుట జరిగినది.

శరీరము నందలి చైతన్యమే శివస్వరూపము. అది నిత్యము కావున సదాశివుడు అనగా మృత్యువు లేని మంగల స్వరూపుడు అను అర్థము నొసఁగును. చైతన్య హీనమైన శరీరము శవమనిపించుకొని అది సదా (ఎల్లప్పుడు) అశివమే. ఆ శరీరము సమష్టిగా బ్రహ్మాండమని వ్యష్టిగా ఒక జీవుని పాంచభౌతికశరీరమనియు చెప్పుదురు. జీవులు మరణించగా అనగా శరీరమును విడచి సూక్ష్మ శరీరములతో అనగా ప్రాణేంద్రియ మనసులతో మరొక శరీరమును స్వీకరించునప్పుడు వారు విడచిన శరీరములు శవములనఁబడును. ఆ చైతన్యహీన స్థూలశరీరములే శ్మశానమున దహింపఁబడు చుండును. సర్వవ్యాపక శివచైతన్యము సూక్ష్మదేహములచే బద్ధము కానందున అది శ్మశానమునందును వ్యాపించి యుండుటచే శుద్ధచైతన్యరూపుడును శివుడే అనియు మంగళస్వరూపుడే అని చెప్పఁబడును. సూక్ష్మదేహసమష్టి ఉపాధిగా గలవాడై హిరణ్యగర్భ నామమును ధరించి శ్మశానమునందునికి చేతను ఆయన మంగల స్వరూపమునకు హాని కలుగుట లేదు.

జరాజీర్ణమైన స్థూలశరీరము జీవరహితమై శవమని పిలువబడినను జీవుని జన్మగత దుఃఖాంతమును సూచించు మంగల స్వరూపమే అగుచున్నది. కావున శవములు దహింపఁబడి వాతావరణము శవగంధ నిర్ముక్త మొనరించి శివంకరము చేయు శ్మశానభూమియు శివస్వరూపమే యగుచున్నది. శరీరముగా భాసించునది వాస్తవ చైతన్యమే. శరీరము మిథ్యయే. కావున దాని అమంగలత్వమును మిథ్యయే. అందుచేత శివ (జగత్తు) భ్రమాధిష్ఠాన చైతన్యము సదాశివమేకాక చైతన్యస్వరూపుడైన శివుఁడు సదాశివుడు అని చెప్పఁబడుచున్నాడు.

నేను జీవుడనని పిలువఁబడుచున్న శివ స్వరూపుడనే అయినను తదనుభవము లేనివాడనైనందున తదనుభవమునైన నాకు శివభజనమే ఉచితమని ఆ శ్లోకాంత పదములు **సదాశివమహంభజే** బోధించుచున్నవి. ఈ మూడు శ్లోకములు అనుష్టుప్ఛన్దో నిబన్ధనములే.

---

**అవతారిక:-** పై శ్లోకమున సదాశివుని భజించెదను అని శివకర్ణామృతస్తుతి ఉపసంహారము చేయఁబడినది. ఈ శ్లోకమున ఆ స్తుతి పఠనఫలము చెప్పఁబడుచున్నది.



**శ్లో॥ శ్రీకరీ పఠతామేషా - శివకర్ణామృతస్తుతిః।**
**శివానన్దకరీ నిత్యం - భూయాదాచన్ద్రతారకమ్॥ 164**

**ప్రతిపదార్థము:-** ఏషా = ఈ, శివకార్ణామృతస్తుతిః = శివకర్ణామృతస్తోత్రము, పఠతామ్ = చదువుచుండు వారికి, శ్రీకరీ = సంపద లేక మోక్షమును కలిగించునదై, నిత్యమ్ = ఎల్లప్పుడు, శివానన్దకరీ = శివునకానన్దము కలిగించునది, భూయాత్ = అగుగాక!

**తాత్పర్యము:-** చదువువారికి సంపదను లేక మోక్షమును కలిగించు నీ శివకర్ణామృత నామకస్తుతి ఎల్లప్పుడు శివునకానందము కలిగించునదగుగాక!

**వివరణ:-** రచయిత పాఠకులకు సంపన్మోక్షములు కలుగవలెనను కోరిక మాత్రమే గాక తన ఆరాధ్యుడైన శివున కానందము కలిగించునది కావలెనను కోరికయు ఈ శ్లోకమున వ్యక్తము చేయబడినవి. ఈ శ్లోకము అనుష్టుప్ఛన్దో నిబన్ధనము.

---

శ్రీః



**- రా మో రా**

## ప్రథమో౽ధ్యాయః - శ్లోకానుక్రమణికా



---





## ద్వితీయో౽ధ్యాయః - అకారాది శ్లోకానుక్రమణికా



---

## తృతీయోఽధ్యాయః - శ్లోకానుక్రమణికా









---

శ్రీః